అట్ట లోపలివైపున అచ్చువేసిన శిల్పచిత్రంలో కనబడేది శుద్ధోదన మహారాజుకు గౌతమ బుద్ధుని తల్లియైన మహారాణి మాయాదేవి కన్న స్వప్నం గురించి జ్యోతిష్కులు వ్యాఖ్యచేస్తూ ఉండిన దృశ్యం వారికి దిగువ వారి వ్యాఖ్యను వ్రాసుకొంటున్న లేఖకుడు కనిపిస్తాడు. భారత దేశంలో లేఖన కళ చిత్ర శిల్పంలో నిబద్ధమై లభించే దృష్టాంతాలలో ఇదే ప్రాచీనతమమైనది.

నాగార్జున కొండ క్రీ.శ. 2వ శతాబ్దం.

(జాతీయ పురావస్తు ప్రదర్శనశాల, న్యూఢిల్లీ, వారి సౌజన్యంతో).

సాహిత్య అకాడెమీ బహుమతి పొందిన ఆంగ్ల నవల

# ప్రభాత వదనం

ఆంగ్ల మూలం

ముల్క్‌రాజ్ ఆనంద్

అనువాదం

డా. ఆర్. అనంతపద్మనాభరావు



సాహిత్య అకాడెమీ

# వినతి

ముల్క్‌రాజ్ ఆనంద్‌గారు ఆంగ్లంలో వ్రాసిన 'Morning Face' అన్న గ్రంధానికి కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి వచ్చిన విషయం పాఠకులకు విదితమే. ఈ గ్రంధానువాద బాధ్యతను అకాడమీ నామీద వుంచినందుకు కృతజ్ఞుణ్ణి.

గంగాఝురీ వేగంతో సమానమైన శైలి ఆనంద్‌గారిది. ఆయన ఆంగ్లవాక్యవిన్యాసం, భాషాపటిమ చదువరులను ఆకట్టుకొని ఆసాంతం చదివింపజేస్తాయి. దాని అనువాదం కత్తిమీద సాము వంటిది. మూలంలో భావానికి లోపం రాకుండా, తెలుగు నుడికారం సొంపులకు వొదిగేలా నేను అనువాదం సాగించాను. తెలుగు పాఠకులకు పరిచితమైన పలుకుబళ్లను ఆంగ్లపదాల అనువాద సందర్భంలో ఎంచుకొన్నాను. మిగతా యధానువాదమే.

ఈ అనువాద బాధ్యతను అప్పగించిన కేంద్ర సాహిత్య అకాడమీ కార్యదర్శి ప్రొ. ఇంద్రనాథ్ చౌధరిగారికి, ముద్రణను చక్కగా వెలువరించిన ప్రాంతీయ విభాగ కార్యదర్శి శ్రీ ఏ. కృష్ణమూర్తిగారికి కృతజ్ఞతలు.

అనువాద సందర్భంలో నాకు తోడునీడలా నిలచి తగిన సలహాలందించి, వ్రాతప్రతిని సిద్ధంచేసిన నా ధర్మపత్ని శ్రీమతి శోభాదేవి సహకారం మరువలేను.

అనంతపురం. డా. ఆర్. అనంతపద్మనాభరావు

*1.9.90* స్టేషన్ డైరక్టరు

ఆకాశవాణి.

# అంకితం

ప్రియమైన కృష్ణా!

నేను నీ సృష్టికర్త నయినప్పటికీ, నవలారచనా ప్రణాళికను ఆద్యంతం నీ అధీనం చేసుకొని, నీవే గ్రంథకర్తవయినట్లుగా రచించావు. అందుకని ఈ నవలను నీ కంకితం చేస్తున్నాను. నీ శరీరం దగ్ధమై కరగిన పదజాలాన్ని పోహళించిన వ్యక్తిని మాత్రమే నేను. వాస్తవానికి ఈ రచన నీది!

'ఏడు వేసంగులు' (Seven Summers) గ్రంథంలో మొదటిసారిగా నీవు దర్శన మిచ్చినపుడు విమర్శకులు నీవు యదువంశంలో జన్మించిన కృష్ణావతారమో లేక పంజాబీ 'నిప్పరవ్వ'వో అని పరిపరి విధాలుగా అన్నారు. వాళ్లది అంతగా తప్పులేదు. నా అంతరాంతరాలలో ఆ పురాణ గాధ సుప్తంగా యిమిడివుందనే వాస్తవాన్ని నీ ముందు అంగీకరించాలి. ప్రతి భారతీయునికీ ఈ పురాణగాధలు వారసత్వంగా సంక్రమిస్తాయి. కృష్ణుడు పెరుగు దొంగలిస్తే, నీవు మామిడి పండ్లు దొంగలించావు. అతని అమాయకత్వమే నీకూ అబ్బింది. తుంటరి పిల్లవానిలో మెరుపు నాలోనూవుంది. ఆ గుణం నీ మనసులో నాటుకొనేలా చేశాను.

నీవు నిజానికి పురాణకాలానికి చెందిన కృష్ణుడివి కాదని నీ తర్వాత రూపాలలో గమనించి వుంటావు. అలా కాలేవు కూడా! దేవతల రోజులు చెల్లిపోయాయి. కంటికి కనిపించని విధివలె, అదృశ్యదేవతలవలె, మానవునిలో కనిపించని పాపంవలె 'డబ్బు' యాంత్రికశక్తివలె నిర్దాక్షిణ్యంగా జీవితాలను ఆడించి, స్త్రీ పురుషుల ఆలోచనలకు సంబంధంలేకుండా జీవితాలపై భూతకాలంలో ఆధిపత్యం వహించింది. అట్టి కలియుగానికీ, నిరంకుశ యుగానికీ చెందిన మానవుని నూతన సమకాలికగాధలను నీవు వాంఛించినట్లు తోస్తుంది.

రెండువేల ఏళ్ల నాడు జన్మించిన నీ నామధారియైన శ్రీకృష్ణునికివలె నీకూ ఇద్దరు తల్లులు ఒకరి గర్భంలోంచి నీవు జన్మిస్తే, మరొకరు దత్తపుత్రునికంటె అధికంగా నిన్ను ప్రేమించారు. ఈ ఇద్దరి తల్లుల ప్రేమ ద్వారా, నీవు సమస్త స్త్రీజాతిప్రేమను పొందగలిగావు. వాళ్లు నీకోసం త్యాగాలు చేశారు; తమశక్తిని ప్రసాదించారు, విజ్ఞానాన్ని పంచియిచ్చారు వారి నాశకశక్తి కూడా నీ కబ్బింది వారి విభిన్న శక్తులు, సమైక్యతా భావము, మత్తైక్యంచే మాధుర్యము, సౌందర్యము నీకు లభించాయి. బాల్యం నుండి యౌవనం వరకు నీ వెదుర్కొన్న క్లిష్టపరిస్థితు లన్నిటిలోను నీకు కావలసిన వన్నీ వారు సమకూర్చారు.

సంతానహీనమై ప్రేమకు నోచుకోని నిస్పృహలో మూడోతల్లి నిన్ను బాధిస్తే, మిగతా శక్తి మాతలందరూ తమ పరిపూర్ణమనస్సుతోను, సున్నితత్వంతోను, నిన్ను తమ వొడిలో శాశ్వతంగా దాచుకొన్నారు. కృష్ణపరమాత్మకు తన చన్నిచ్చి విషాన్ని అందించిన పూతన, బృందావన గోపికలు కృష్ణునికి తమ అపారప్రేమను పంచియిచ్చారని గ్రహించింది. ఆ ప్రతిధ్వనులు నీ కథనంలో విన్పిస్తాయి. అసూయాచ్ఛాయలు పాతనుండి కొత్త ప్రపంచంలోకి రావచ్చు. పాత అలవాట్ల నుంచి సంక్రమించిన ఫలితాలు అలానే నిలిచిపోతాయి.

జీవన మార్గాలను అన్వేషించడంలో నరకాన్ని అనుభవించినట్లు న్నావు. పురాతన హిందూ సంప్రదాయ ప్రకారం యమధర్మరాజు పాపులైన స్త్రీ పురుషులను అక్కడ శిక్షిస్తాడు; యమభటులు బాధలు పెడతారు. కాని 20వ శతాబ్దానికి చెందిన మనం దీనినుండి నేర్చు కొన్నది చాలాతక్కువ! మనమింకా పొందని సంపూర్ణజ్ఞానం ద్వారా దుఃఖాని కతీతంగా శరీరం జాగ్రదవస్థశిఖరాల నధిరోహించడానికి బాధ తోడ్పడవచ్చు.

అమృత్‌సర్‌లో 1919వ సంవత్సరంలో నిషేధాజ్ఞలను ధిక్కరించి నందుకు నీకు పెట్టిన ఏడువాతలూ, నిరంకుశుడైన కంసుని క్రూరత్వానికి సరితూగుతాయని పోల్చి చెప్పడం సరిపోదు. ఎందుకనగా ఈవాతలు నీ హృదయాన్ని గాయపరచి 'కంటోన్మెంటు' అనే చిన్న ప్రపంచంనుండి ప్రపంచ బాధల నర్థం చేసుకొనే స్థితికి నిన్ను ఎదిగేలా చేశాయి. బుద్ధ

భగవానుడు చెప్పినట్లుగా అజ్ఞాన తమస్సును విజ్ఞానతృష్ణగా మలచుకో వాలనుకొన్నావు. బూడిదలోంచి పునరుజ్జీవితమయ్యే 'ఫోనెక్స్' పక్షిలా నాశనం నుండి నీవు ఎదిగావు.

బహుశా హెలన్ గాథలు పుణికి పుచ్చుకొనివుంటావు. నార్సిసస్ అద్భుతగాథలు ఆకర్షించి వుంటాయి. హెర్క్యులిస్ వీరోచిత కృత్యాలు నీకు నచ్చివుంటాయి. డివెలరా అనుచరుడూ, ఐర్లండు విప్లవకారుడూ అయిన కెప్టన్ సులీవాన్ స్నేహంతో నీవు కవిత్వారాధనను ఎక్కువ భాగం నేర్చుకొన్నావు.

యదుకుల వీరుడైన నల్లనయ్యవలె నీవు పదారువేల అప్సరసలను పెండ్లాడక పోవచ్చు. క్రీస్తుపూర్వం 327 ప్రాంతాలలో పంజాబులో ఆరాధించబడిన హెర్క్యులస్ వలె నీ శారీరక సామర్థ్యాన్ని నీవు పరీక్షిం చుకోకపోవచ్చు. నార్సిసస్ జీవితాన్ని నీవు ఆదర్శంగా తీసుకొంటావు. సంధ్యాసమయంలో క్లారినెట్ వాద్యగాని కూతురు హెలెన్ నీ చేయి పట్టుకొని తనదైవంగా ఉండమని నిన్ను కోరినపుడు నీవు సంతోషిం చావు నీవామెను నీ ముద్దబంతి పువ్వుగా వుండమన్నావు.

ప్లేటోకాని, యాంత్రిక నాగరికతగాని విధించదలచుకోని విధంగా నీలోని కవి నీకు ఏకాంత శిక్ష విధిస్తాడు. భూలోక రూపాంతరాన్ని కాంక్షిస్తూ, అసంబద్ధ సత్యాలనుపలికి, వికార సౌందర్యాన్ని ఆశ్లేషించి, హృదయస్పందనల ద్వారా నీవు జీవిస్తావు. సత్యాన్నీ, నాణ్యతనూ, ఆంత ర్యాన్నీ పొందడానికి చేసే ప్రయతలో విఫలమైనా మనిషిగా నిలబడాలని ప్రయత్నిస్తావు.

నీ కవితారాధనను నేను విశ్వసిస్తాను నీలోని అనంతమైన జీవన తృష్ణ. ఓటమిని చవిచూసిన బలహీనుల పట్ల సంఘీభావమూ నాకు నచ్చాయి. కానీ, నా నిర్ణయాన్ని నీపై బలవంతంగా రుద్దను. ఈ ప్రపంచంలో నీ ఎదుగుదల సమయంలో నీ స్వంత అనుభూతులు నీకు విశదీకరించనీ! అణు యుద్ధం రాక, మానవుడు బ్రతికే ఈ సమకాలీన నరకం నుండి బయటపడితే, స్వర్గమనేది కనిపిస్తే కనిపించవచ్చు. నీవు నావంటి వాడివికాదు, నాకంటె ఉన్నతుడివి. ఉపనిషత్తులనుండి, పురా

ణాల నుండి గ్రహించిన వ్యక్తివలెగాక, నీవు నవలలో అధీరనాయకుడివి నీవు జీవితంలో ఒక భాగానివి.

ప్రతిచోటా జీవముంది. అంధకారాని కెదురుగా వెలుతురు తన అమేయశక్తితో ప్రయాణం చేయడం వంటిదది. సముద్రం వేసే ప్రయాణిస్తున్న పవిత్ర నదీ ప్రవాహం సకల చారిత్రక కశ్మలాన్నీ, కళేబరాలను తొలగించి క్షాళనం చేస్తుంది వేగవంతము, సమానాంత రము అయిన ఆలోచనల ఉత్తేజం కత్తిపదునుతో సమానం. దానికి తీవ్రతవుంటే నిరంకుశత్వాన్నీ అజ్ఞానాన్నీ, నిరాసక్తతనూ, ఆత్మతృప్తినీ, మోసాన్నీ, నిర్లక్ష్యాన్నీ భేదించుకపోతుంది. విశేషరూపాలలో కనిపించే మృత్యువైరుధ్యమది అది మానవుని వాంఛారూపం.

అది ప్రాచీనగాథ, నూత్నగాథ. పురాతన కాలంలోను, అద్యతన కాలంలోను అది ఒకటే. అంధకారబంధురతలోగూడా జీవితంలోని వివిధ కోణాలు దర్శించి, అగాధం నుండి తమ లక్ష్యాన్ని సాధించడానికి ఎందరో మానవులు తమ వుద్దేశ్యాలను ప్రకటించడానికి సిద్ధపడుతున్నారు.

నీవంటి విప్లవకారుల పోరాటం వృధాకాదు నీవంటివ్యక్తుల ఆత్మ పరిశోధనలు, కృత్యాలు, స్వభావాలు, మరికొందరు వ్యక్తుల అను భూతు లతో మిళితమవుతాయి. కొందరు ఈ విషయాన్ని తీవ్రంగా ఆలోచించి, వాస్తవాలను ఎదుర్కొంటారు.

పోరాటము, తాదాత్మ్యము ముఖ్యం. బహుశా మనుష్యులు తమ వైఫల్యానికి కారణాలు ఇందులో చూడవచ్చు.

ఆలోచనాస్రవంతిని, భావ తీవ్రతను, వాంఛలను, మానవుల రాగ ద్వేషబాంధవ్యాలను వ్యక్త పరచడానికి నవల ఉత్తమ రూపం. దీని ద్వారా బాధిత ప్రపంచాన్నీ, పురాతనగాథల ప్రాపకంలేకుండా చెప్పడా నికి, వీలుపడుతుంది

ఖాండ్లా
1968.

ముల్క్‌రాజ్ ఆనంద్.

## మొదటి భాగం

# భీకరరాత్రుల మహానగరం

'..... పసి వాని భయాలు
పైకి లంఘించడానికి సిద్ధంగా పొంచివున్న
ఆ నిశ్శబ్దప్రదేశం
లోలోపలికి.......'

అజ్ఞాతకవి

# 1

రైలు పొగ బున్‌బున్‌మని వదులుతుంటే, చక్రాలు చుక్-చుక్ మని శబ్దం చేస్తుంటే, మేము వెళ్తున్న దిశకు వ్యతిరేకంగా రోడ్డు పొడుగునా బారులు తీరి నిల్చున్న చెట్లు కదిలి పోతున్నాయి. మేం కూర్చొన్న మూడో తరగతి కంపార్ట్‌మెంటుకు తల ఆనించి కిటికీ లోంచి చూస్తూ కూచున్నాను. రైలు కదలికకు అనుగుణంగా నా చేతులు వడివడిగా ముందుకు, వెనక్కు కదిలిస్తుంటే మా అమ్మ నన్ను వారించింది. ప్రకృతి దృశ్యాలను ఆతురతతో పరిశీలించే నా సాహసాన్ని అడ్డుతూ ఆమె నా చొక్కా అంచు పట్టుకొని కూచుంది. నా నోటిలోంచి ఈలలు, అరుపులు వస్తూనే ఉన్నాయి. 'చుక్ చుక్' మని శబ్దం చేస్తూ పొగ వదులుతున్నట్లు అభినయిస్తున్నపుడు నా శరీరమంతా కదలడం ఆరంభించింది.

కంటికి కనిపించని ఇంజను వెనుక, నా తమ్ముడు శివ, సామాన్ల మీద కలవరపడుతూ గంతులు వేస్తున్నాడు. నా ఇంజనుకు పెట్టెగా వెనుక ఉండడానికి ఒప్పకోకుండా చెక్క పెట్టెల మధ్య తిరుగుతున్నాడు. శివకు వెనక మా అన్నగణేశ్ సోమరిపోతు శరీరం బరువును నేను ఎక్కువ పొగ వదిలి లాగాల్సివస్తున్నది. అయినప్పటికి నా శక్తి నాకు తెలుస్తోంది. పెదవుల మీద 'చుక్ చుక్' శబ్దం, నోట్లోంచి పొగ వదలడం అప్రయత్నంగా జరుగుతున్నాయి. పట్టాల మధ్య ఇంజనును ధైర్యంగా నడపటానికి నాకు 'హాండిల్' వంటిది కావాలి. అన్ని పాత్రలు నేనే పోషించాలనే ఆదుర్దాలో తలపై 'తెల్ల టోపీ, నోట్లో విజిల్, చేతిలో పచ్చ జెండా, ఎర్ర జెండా ఉంటే బాగుండునని పించింది. మేము బయలు దేరిన నౌషిరా నుండి చెట్లు త్వరత్వరగా పరుగెత్తసాగాయి. అమృతసర్ వైపు దూసుకుపోతున్న 'ఫ్రాంటియర్ మెయిల్' వేగాన్ని

నేను రాపిడి గొంతులో ఆలపిస్తున్నాను.

"బాబూ! అద్దానికి మరీ గట్టిగా రుద్దితే నీ ముక్కు నలుగుతుం" దని అమ్మ ఒక పక్క హెచ్చరిస్తోంది.

కాని, నేను రైలు బండి పొగను ఇంకా ఎక్కువగా వదులుతూ ముక్కు బాగా నలిగిపోయేంతవరకు ముఖాన్ని ముందుకు చాపాను.

"కృష్ణను అదిలంచండి... ఇంక లేవండి బాబూ! అప్పుడే" అంటారి' దాటేశాం. ఇంక అమృతసర్ రాబోతోంది' అమ్మ సామాన్లపై నిద్రపోతున్న మా నాన్నను హెచ్చరించింది.

నాన్న నన్ను తిట్టలేదు సరికదా, నిద్రలేవలేదు. నేను ఒక్కక్షణం నా రైలు వెనక్కు తిరిగి చూస్తే నాన్న కళ్లు తెరిచి ఉండటం మాత్రం చూశాను. వేంటనే నా చూపులు మార్చి ముందుకు వంగాను. గణేశ్ నా రైలు బండికి గార్డు అయితే నా బండి యింకా వేగంగా ముందుకు దూసుకు వెళ్లవచ్చు.

'ఒరే కృష్ణా! నీ చొక్కా పట్టుకొని నా చేయి నెప్పి పుడుతోంది. నీ కొత్త గుడ్డలు చింపుకొంటావ్. మనల్ని కలుసుకోవడానికి స్టేషనుకు వచ్చే బంధువు లేమనుకొంటారు చెప్పు—' అంది అమ్మ.

కిటికీ అద్దం మీది నుంచి నా ముక్కు వెనక్కి తీశాను. కానీ, పొగవదలడం మాత్రం మానలేదు. ఇంజన్ శబ్దం మాత్రం తగ్గించాను.

మళ్లీ ఈల వేశాను. ఈసారి నాన్న లేచి నా కేసి చూశారు. అయన కళ్లు బాగా ఎర్రగా ఉన్నాయి.

నేను మరింత ఉత్సాహంతో "ఒరే మొద్దు మొహం! గణేశ్ మనం రైలు ఆట ఆడుకొందాం రారా!" అన్నాను.

'నా కిష్టం లేదంటే లేదు!' అన్నాడు వాడు.

'నే నాడుతాను' అన్నాడు కూచున్న పెద్ద పెట్టె మీద నుంచి లేస్తూ శివ. అమ్మ వాడి చొక్కా వెనక పట్టుకుంది.

నేను మళ్లీ ఆట మొదలెట్టే ముందు అమ్మ నన్ను పట్టుకొని

'బాబూ! మనం ఇంకొంచెం సేపట్లో అమృతసర్ చేరుకొంటాం' అంది.

'సరే గాని, ఈ రైలుకు రెండు ఇంజన్లు ఉన్నాయనుకొందాం. ఒకటి వెనక్కూ మరొకటి ముందుకు లాగుతున్నాయనుకొందాం. అప్పుడు రైలు ఎక్కడికి కెళ్తుంది?'

ఆ మాట విని అమ్మ నవ్వి నా పైజామాపైన, చొక్కాపైన పడ్డ బొగ్గుపొడిని విదిలించింది. నా తలను చేతితో దువ్వి, దగ్గరగా తీసుకొని కనురెప్పలు శుభ్రంగా తుడిచింది.

'నన్ను ఇబ్బంది పెట్టకమ్మా!' అన్నాను చివరిగా.

'బాబూ! ఓపిక పట్టాలి. నేను చెప్పానుగా స్టేషనుకు మన వాళ్లంతా వస్తారని. మీరు వీధి తుడిచే తోటీల బిడ్డలాగా కనిపించడం నా కిష్టం లేదు. అరే, గణేష్. నువ్వు యిలా రారా' నీ వరస ఇప్పుడు....."

'నా కొద్దు' మొద్దు మొహం అన్నాడు.

'మా నాన్నా! శివా!' అంటూ అమ్మ వాణ్ణి లాగింది.

'నా పేరు బుజ్జి...... శివ కాదు' అంటూ మూలిగాడు.

'అవును బుజ్జి బాబు...రా.' అంటూ అమ్మవాణ్ణి ఓదార్చింది. 'అమ్మా! నాకు ఆకలేస్తుంది' అన్నాను అందరి దృష్టి నా వైపు మర లాలని. 'శుభ్రంగా ఉండే గుడ్డల మీద అన్నం వొలికించి పాడు చేసుకొంటావ్. రైలు కదులుతోంది. ఇప్పుడేమీ ఒద్దు. ఇంకొంచెం సేపట్లో ఇంటి కెళ్తాం.'

ఇంటి కెళ్తున్నామనే సంబరంలో నేను ఆకలి ఊసు మరచిపో యాను. మా అన్న హరీష్ పెళ్లి సందర్భంగా అమృతసర్ వెళ్లినపుడు మా యిల్లు— 'కుచాఫకీర్ ఖానా' లో మొదటి అంతస్తుపై కిటికీ రంగుటద్దాల మెరుగు నా కింకా గుర్తుంది. ఆ నాటి ఆనందం నాకు బాగా గుర్తు! డోలకీ వాయిస్తూ అమ్మాయిలు పాడటం, వాద్య తంత్రులను వారిలో ఒకరు మీటడం, ముసలమ్మలు మాట్లాడు

కోవడం, మగాళ్లు వాదించుకోవడం, అమ్మను తినడానికి కావాలని నేను అడిగితే బిస్కత్తు తెప్పించి పెట్టడం, యిలా ఇంకా ఎన్నో జ్ఞాపకాలు. యింటికి సమీపంలోనే ఉన్న స్వర్ణదేవాలయం తటాకంలో స్నానానికి మా నాన్న తీసుకెళ్లడం, మా యింటి పక్కనే ఉన్న మా బాబాయి యింటి కెళ్తే, ప్రతాప్ బాబాయి ఆయన భుజాల మీది కెక్కించుకొని స్వర్ణ దేవాలయం ప్రక్కనే ఎత్తుగా ఉన్న పెద్ద ముళ్లు తిరిగే గడియారం చూపించడం, మా దేవకి పిన్ని సుగంధాలు విరజిమ్ముతూ, తీపి వాసనలు వెదజల్లుతూ నా దగ్గరగా వచ్చి, నా వాగుడువింటూ నాకో మంచి కథ చెప్పడం— నాకు గుర్తున్నాయి.

నేను 'పుఫ్-పుఫ్' — 'చుక్ చుక్' శబ్దాలు చేసుకుంటూ మళ్లీ కిటికీ అద్దానికి అతుక్కుపోయాను. మనసులో రైలు గీతం ఆలపిస్తున్నాను.

తుమ్ముతూ, దగ్గుతూ, ఉమ్ముతూ, ఆవులిస్తూ ప్రార్థిస్తూ తలకో రకంగా ప్రయాణీకులు ఎవరి గొడవలో వారున్నారు.

నౌషిరాలో మా బార్యాసుకు వెనుక ఉన్న స్వాట్-పర్వత సానువులు రాగి రంగులో ఉంటాయి. వాటికి భిన్నంగా సమతలంగా ఉన్న ప్రదేశాన్ని రైలులోంచి చూస్తూ నా కళ్లు ఆనంద తాండవం చేశాయి. సూర్యుడు నెత్తి మీదకి వచ్చి మాడుస్తూ కళ్లు మూసుకొనేలా చేస్తున్నాడు. కాని, నేను స్వతహాగా విశాలమైన కళ్లతో పుట్టాను. రోడ్డు వెంబడి చెట్లు, టెలిగ్రాఫ్ స్తంభాలు, పరుగెడుతున్నాయా? లేక రైలు పరుగెడుతోందా? రెండూనా? అని నాకు ఆశ్చర్యం వేసింది. అమ్మను అడగబోయాను... ఇంతలో ఆ క్షణంలో ఒంటెల బారులు కనిపించాయి. ముక్కు దగ్గర నుండి తోక దాకా, తోక నుండి మూతి దాకా తాడుతో కట్టి వేసి, మూపురం మీద రెండువైపుల మూటలు మోస్తూ నడుస్తున్నాయి. ఈ భౌతికమైన సమస్య నుండి నా దృష్టి మరలి పోయింది

విసుగ్గా వెనక్కి వాలి కూచున్నాను.

"ఇదిగో చెహర్తా గ్రామం వచ్చేశాం. ఇంకెంతో దూరంలో లేం"

అని అమ్మ నాన్నతో అంది

తృప్తి తీరని నిద్రమత్తులో, తన ఆలోచనలలో మునిగి తేలుతూ, పైనుండి నేర్పుగా దిగి మా ముందు నాన్న నించున్నాడు. ఆయన సుందర గంభీర విగ్రహం నా కెంతో ప్రేమ పాత్రం కావడానికి మరో కారణం — ఆయన నన్ను బుజ్జగిస్తూ ఓ పాట నా మీద పాడటం —

"బుల్లి బుల్లి బాబు
మా బుల్లి బాబు
మా బుల్లి కుక్క
మా బుల్లి పంది
మా బుల్లి అబ్బాయి..." అంటూ పాడారు.

నేను ఆయన దగ్గర కెళ్దామనుకొనే లోపల, శివ ముందుగా ఆయన ముందు కొచ్చాడు. నాన్నారు వాడి మీద పాడటం మొదలు పెట్టారు—

"మా బుజ్జి బుజ్జిరా
మా చిన్న బుజ్జిరా
మా బంగారు బుజ్జిరా"
నాన్న కేసి చూస్తూ గణేష్ ఎద్దేవా చేస్తూ నవ్వడం చూశాను.

అమ్మ ఇది గమనించి వాణ్ణి దగ్గరగా తీసుకొని గుడ్డలు విదిలించడం మొదలు పెట్టింది. 'నాన్నా నన్ను యికమీద 'బుల్లి' అని పిలవకు. పెద్దవాణ్ణి అయ్యానుగా' అంటూ నా ముఖం కిటికీ వైపు తిప్పేసుకొన్నాను.

'సరే! ఇక మీదట నువ్వు గారాము బిడ్డవు ఎంత మాత్రం కాదు' అన్నారు నాన్న.

నాలో చిన్నారి చిలిపి చేష్టల శక్తి పైకి ఎగదన్నుతూ, కుర్రకారు కొంటెతనానికి చేరుస్తూ తగ్గుతున్న శైశవ సహజమైన కోర్కెలను కప్పుకోని నాదం చేస్తోంది. నిష్ప్రయోజనమైనా శబ్దం నాదంగా, నాదం శబ్దంగా నాకు వినిపిస్తోంది. విచ్చుకొంటున్న జీవితం నా గుండె గొంతుల్లోంచి కొట్లాడి 'బుల్లి' శబ్దాన్ని గొణుగుతూ నేనొక పాట

పాడాను.

"బుల్లి బుల్లి
బుల్లీ!
బుల్...... బుల్.....
బుల్లీ!"

పాడుపడ్డ యిళ్లను, పాత ఎర్ర యిటుక యిళ్లను, కొత్త యిటుక రాతి యిళ్లను, పచ్చ పచ్చని పూల కుండీలను మేడలపై ఉన్న యిళ్లను దాటుకుంటూ రైలు వెళ్తోంది. రైలు పట్టాలు ఎన్నో కనిపిస్తున్నాయి. వాటి పక్కనే ఖాళీ ప్రదేశాల్లో, పాడుబడ్డ గుంటల్లో జనం రైలు పట్టాల పక్కనే బహిర్భూమికి కూచుంటున్నారు.

రెండు సార్లు గట్టిగా విజిల్ వేసి యింజను పొగ వదలుతూ రైలు పాడుగాటి రేకు కప్పు కింద జనసమ్మర్దమైన ఫ్లాట్‌ఫారం ముందు కొచ్చి విలుచుంది.

నాలో ఉద్వేగం తారస్థాయికి చేరుకొంది. నేనింక కొంచెం సేపట్లో ఒక పెద్ద పట్టణం మధ్యలో ఉంటాను. చేతులు, ముఖం వొణుకుతూ కిటికీ ముందు నుంచి లేచి తలువుకేసి పరుగెట్ట బోయే సమయానికి అమ్మ వారించింది. లేకపోతే రెండు వైపుల జనం నన్ను తొక్కేసి ఉందురు. కంపార్టుమెంటు చివర సన్నదారిలో ఇరువైపులా సంకుల సమరంలా జనం మూగారు. ఒక పక్క రైలు పెట్టెలోంచి దిగాలనే తాపత్రయంలో నెత్తి మీద మూటలతో రైతులు, మరో పక్క అప్పుడే మూడో తరగతి విశ్రాంతి గది తలుపులు తీయగా బయట పడి అర్ధనగ్నంగా సన్నని వస్త్రాలు ధరించిని పట్టణ వాసులు లోపలికి రావాలని కుస్తీపట్లు పడుతున్నారు.

'మైనమీర్' జంతు ప్రదర్శనశాలలో బోనులోంచి బయట పడాలని తాపత్రయ పడే క్రూరమృగంలా నేను బయట కురకాలని ఉబలాట పడ్డాను.

'ఎవరి చోట్లలో వారుండండి' నాన్న ఖరాఖండిగా ఉత్తర్వు చేశారు. గోల మధ్య 'కూలీ' 'కూలీ' అని అరుపులు వినిపిస్తున్నాయి. ఇంతలో

తెల్లటి దుస్తులు ధరించిన స్టేషన్ మాస్టర్ 'పిచ్చి వెధవల్లారా!' అంటూ బయట ఉన్న జనంలో ఇద్దర్ని తన్నాడు. అప్పుడు ఆ కుమ్ములాట అంతమై ఇద్దరు కిందికి దిగ గలిగారు. అమృతసర్ స్టేషను రేకుల ప్రతిధ్వని మధ్య వందలాది గొంతులు వినిపిస్తున్నాయి. మధ్యలో తిను బండారాలు అమ్మే కుర్రాళ్ల 'హిందూ పానీ' 'ముసల్మాన్ ఆలూ' అనే అరుపులు వింటూ, సామాన్ల దొంతరలు కింద పడటం చూస్తున్నాను. ఈ వింత చూస్తూ నా కళ్లు మెరుస్తుంటే నేను అక్కడే అమ్ముతున్న వారితో గొంతు కలుపుతూ 'హిందూ పానీ, 'ముసల్మాన్ ఆలూ' అనడం మొదలెట్టాను.

మరుక్షణంలో ప్రతాప్ బాబాయి బయట ప్లాట్‌ఫారం మీద నుంచి నాన్నకు నమస్కరించి 'పాదాభివందనం చెయ్యనిస్తారా' అని కిటికీలోంచి అన్నారు.

ప్రతాప్ బాబాయి ప్రియ స్పర్శ నాకు సోకి, అమ్మ పట్టు విడి పించుకొని, బాబాయి మెడ కరుచుకొన్నాను. ఆయనను చేతులతో చుట్టివేసి బుగ్గలు ఆయన బుగ్గలకు ఆనించాను.

బాబాయి వెనక మరి కొందరు జనం వచ్చారు. పెద్ద పెద్ద తలపాగాలు, తెల్లని ధోవతులు కట్టుకొని కమ్మరి, కుమ్మరి సోదరులు వచ్చారు. వారిని చూడగానే అమ్మ తలమీద గుడ్డ బాగా సర్దుకొంది.

వారిని నాన్న ఆప్యాయంగా పలకరించాడు.

'లల్లా ఆచర్జామల్' మీ పాదాలు అంటుకోవచ్చా!'
'లల్లా సదానంద్' మీ పాదాలు ముట్టుకొనిస్తారా!'
'సర్దార్ సుందర్ సింగ్' పాదాలు అందుకోనీండి!'
'లాలా అనంతరామ్' పాదాభివందనం చేయనీండి!'

ఇందులో మొదటి వ్యక్తి కుష్టు ముఖంతో ఉన్నట్లు నాకు కనిపించింది. రెండో అతను కుంటుతూ, మూడో వాడు గొర్రె దాటుగా, నాలుగో వ్యక్తి అంబోతులాగా ఉన్నారు.

నా కదేదో కొత్త ప్రపంచంలా, అప్పుడే నేను కళ్లు తెరిచినట్లు

అనిపించింది. అప్రయత్నంగా నా నోటి వెంట నా పారంలోని ఉర్దూ పద్యం— 'నిన్న సుప్రభాతాన , నా కళ్లు తెరిచినపుడు—' అనే మాటలు చదివాను.

ఇంతకు మించి టాంగా వాళ్ల అరుపులు నాకు కలత కల్గించాయి. 'ఘంటాఘర్, లోహాఘర్, లూనా మండీ' అంటూ టాంగా వాళ్లు అరుస్తూంటే టీ కొట్లవద్ద కోపంగా బేరసారాలు చేస్తున్నారు మరికొందరు. గుంపులో పోటీ పడుతున్న ఆడవారి దృష్టిని ఆకర్షించడానికి బ్రిటీషు సైనికులు పికిలీలు ఊదుతూ నడుస్తున్నారు.

టాంగా మీద యింటికి తిరిగి వస్తున్నపుడు రాత్రి శ్రమవల్ల, ఉదయం వేడి వల్ల నా కళ్లు అలసటగా మూసుకుంటూ తెరిపిడి పడ్డాయి.

సూర్యుని కిరణాలు పడి తళతళలాడుతున్న స్వర్ణ దేవాలయానికి యాత్రికులు గుంపులుగా వెళుతున్నారు. గడియారం చౌరస్తా వద్ద టాంగా కుదుపుకు మేలుకొన్నాను. ప్రపంచంలో ఇదే తొలి ఉదయంగా మారినట్లు నా గుండె యాత్రికుల వాతావరణంలో తిరుగాడ సాగింది.

ఆ సందులో మురుగు కాలువ, ఆ సంచుల్లోన్నించి కారుతున్న చెత్త వాసన ముక్కుల్లోకి గాఢంగా దూరుతోంది. చేతి గుడ్డను తీసి ముక్కుల కడ్డంగా పెట్టుకుని నాన్న ఇలా అన్నారు.

"అబ్బాయిలూ! ఈ సామాన్లు మోయడానికి ఊరగాయల ఫ్యాక్టరీ కూలీలను వెళ్లి పిలుద్దాం, రండి. మీ దేవకి పిన్ని మీ కోసం ఎదురు చూస్తుంటుంది."

ఆయన ఆ మాట అంటున్న మరుక్షణంలో దేవకి పిన్ని ఆడనెమలిలా నడుచుకుంటూ మా వైపు వస్తోంది.

నేను మా నాన్న చేతుల్లోంచి ఒడుపుగా తప్పించుకొని ఆవిడ వైపు పరుగు తీశాను.

ఆమె త్వరగా తలపై పైట చెంగు కప్పుకుంది. నాన్నగారిని ఆమె ఆనందాతిశయ మందస్మితంతో అంతకు ముందే పలకరించడం నేను

గమనించాను.

ఆమె నన్ను పైకెత్తి పొదువుకొని, నుదుటిపై ముద్దాడి—
"మా బుల్లి బుల్లి
మా బుల్లి అబ్బాయి" అంటూ పాడింది.

ఆమె ఆలింగనంతో మత్తెక్కిన నేను, నన్ను కిందికి దించి శివను ముట్టుకొనే అవకాశం యివ్వలేదు. ఆమె శరీరంలోని సుగంధాలను నేను ఆకట్టుకొని ఆమె అందమైన మెడను పొదివి పట్టుకున్నాను. ఆమె నా బుగ్గలపైన, నుదుటిపైన, కళ్లపైన ముద్దుల వర్షం కురిపించి నన్ను దించింది.

అమృతసర్ పట్టణానికి తిరిగి రావడం నేను అనుకొన్నట్లుగా ఎంతో ఉద్వేగం కలిగించింది. దేవకి పిన్ని మధురానురాగం, అద్దంలో చూసుకొంటూ మేడ మీద కూచుని వదులుగా ఉన్న కురులు దువ్వుకుంటున్న ఆమె రూపం నా జ్ఞాపకాల దొంతర పై పైన తిరుగుతోంది.

ప్రపంచం మొత్తాన్ని ఆలింగనం చేసుకోవాలన్న నా ఉబలాటం, ఆ సంబరంలో కలిగిన ఆనందం అనిర్వచనీయం. అప్పుడప్పుడే విచ్చుకొంటున్న నా విశ్వాంతరాళంలో జనసమ్మర్దం గల వీధులు, వారి స్వేచ్ఛాజీవనం ఎంత ఆనందానుభూతి!

# 2

కుచ్ ఫకీర్ ఖానా వీధిలో మాయిల్లు, ప్రతాప్ బాబాయియిల్లు, విశాలమైన ఫకీర్ ఖానా బంగళా ఛాయల్లో ఉన్నాయి. ఆ సన్న యిరుకు సందు వచ్చేపోయే జన సమ్మర్దంతో నిండిపోయింది. మహారాజా రంజిత్‌సింగ్ వద్ద వజీర్‌గా వ్యవహరించిన ఫకీర్ షాబుద్దీన్ ఆ పెద్ద బంగళా కట్టించారని అమ్మ యింతకుముందు మేం యిక్కడకు వచ్చినప్పుడు చెప్పింది బ్రిటీషువారు మనదేశంలోకి రాకముందు పంజాబ్‌ను

సిక్కు వీరుడు పాలించాడు. ఆయనకు ఒకే కన్ను. ఆ యిల్లు యిప్పుడు హిందూ సంస్కరణ సంఘమైన ఆర్యసమాజానికి చెందిన దత్తాసోదరుల వశంలో ఉంది. వారు మా అన్న హరీష్‌కు మంచిస్నేహితులు.

ఇతర సోదరబృందంతోపాటు దత్తాసోదరులుకూడా నాన్నకు స్వాగతం పలకడానికి వచ్చి స్టేషన్లో మమ్మల్ని కలుసుకొన్నందున ఆ మేధావులపట్ల నా ఆలోచనలు సాగిపోయాయి. వారిలో పెద్ద సోదరుడు నవదత్త నల్లటినలుపు. కోతి మొహంతో ఉన్నా తెలివైనవాడు. స్ఫురద్రూపి అయినా పాలిపోయిన రంగులో ఉన్న చిన్నవాడు తలబిరుసు మనిషి.

మా పెద్దయింట్లో, హాలు చివర భాగంలో పిల్లలమంతా విసుగ్గా కూచున్నాం. ఆసన్న యిరుకు సందులోగాని, మేడమీద నాలుగో అంత స్తుపైనగాని ఎండగావటంవల్ల ఆడుకోవడానికి అనుకూలంగా లేదు.

పెద్ద వాళ్లంతా సరదాగా మాట్లాడుతున్నారు. కుశలప్రశ్నలు, సంప్రదాయ సిద్ధమైన పలకరింపులు అయిన తర్వాత నిశ్శబ్దం యింట్లో రాజ్యంచేసింది. చంద్రవంక ఆకారంలో ఉన్న చేతివిసనకర్రతో దత్తా సోదరులలో అగ్రజుడు మానాన్నకు గాలివీచేటప్పుడు గంభీరవాతవరణం నెలకొన్నది.

వాళ్లు యధాలాపంగా మాట్లాడటం, వాతావరణమంతా విచారగ్ర స్తంగా ఉండటము నాకు విసుగు పుట్టిస్తోంది ఆ రోజుల్లో మా కుటుంబ సభ్యులకందరికీ నిరంతర సమస్యగా మారిన 'ఆగాఖాన్ నిజమైన దేవుడా? కాదా?' అనే అంశంపై వారు చర్చిస్తున్నారని ఊహించాను.

అప్పుడప్పుడు వారి చర్చల మధ్యలో నేను చొరవజేసుకొని జొర బడటంవల్ల నా కర్థంమైంది ఏమంటే— ఆగాఖాన్ తన అనుచరులు కాదలచుకొన్నవారు ముస్లింలు కావాలని, తనను వదలిపెట్టదలచుకొన్నవారు హిందూమతాన్ని స్వీకరించాలని ఒక ఫర్మానా జారీ చేశాడు. అయితే అసలు సమస్య— మా సోదర బృందమంతా ఇస్మైలి హిందువులుగా ఉండిపోవాలని అనుకోవడం. ఈ ప్రత్యేకజాతివారంతా సాక్షాత్తు ఇస్లాం మతప్రవక్త మహమ్మదు, హిందూదైవం కృష్ణుడు ఈ అవతా

రంలో ఆగాఖాన్‌గా వచ్చారని నమ్ముతారు. నా పేరు ఆయన స్మరణకై పెట్టారు- 'కృష్ణ'అని.

బరువైన తలపాగాలు ధరించి, గంభీర వదనాలతో అక్కడ ఉన్న వారిని చూస్తే నాకు నవ్వుపుట్టు కొస్తోంది. నేను మంచి పెంపకంలో పెరిగిన వాడికింద లెక్కగాబట్టి నా నవ్వును బలవంతంగా ఆపుకొన్నాను. దత్తాసోదరుల పెద్ద బంగళా గోడకేసి చూస్తూకూచున్నాను. ఆ ఇరుకు సందులో మురికి కాలవలోంచివచ్చే దుర్గంధం నాకు వాంతి కలిగిస్తోంది. మా యింటిపక్కన ఉన్న దత్తాసోదరుల బంగళా మొదటి అంతస్తులో ప్రభా ఊరగాయల ఫ్యాక్టరీ ఉంది. అక్కడనుండి ఆపిల్‌పండ్ల తొక్కల మోటువాసనలు మురికి కాలవద్వారా ప్రవహిస్తున్నాయి.

ఎట్టకేలకు నిశ్శబ్దం పటాపంచలైంది.

"మీరు నిజంగా ఆగాఖాన్ విశ్వాసం నుండి బయట పడదల చుకొంటే... ఆర్యసమాజం స్వాగతం పలకడానికి సిద్ధంగా ఉంది" దత్తాసోదరులలో చిన్నవాడైన పండిత భగవాన్‌దత్త అన్నాడు.

'అవును' మాటకలుపుతూ అన్నాడు దేవదత్త. శరీరమంతా ఉద్వేగంవల్ల చెమటలు పట్టి ఉందతనికి.

"మనం కంసాలిజాతి వారం . హిందువులలో అగ్రకులాలవారు తర తరాలుగా ఆగాఖానీ మతానికి చెందిన ఇస్మైలీ హిందువులను అంటరాని వారుగా చూస్తున్నారు" అన్నాడు లల్లా అచర్జమల్ వాదన ధోరణిలో.

"లల్లా అచర్జమల్! మనలో కొందరం బయటి ప్రపంచంలోకి వెళ్లవలసి ఉంటుంది." అన్నాడు మా పెద్ద అన్న హరీష్. 'నేను ప్రభుత్వోద్యోగిని. లాహోరులోని నా స్నేహితులంతా ఆర్యసమాజం హిందూ మతాన్ని సంస్కరిస్తుందనే నమ్మకంలో దానిపైపు ముగ్గుతు న్నారు.' హరీష్ వాదన కొనసాగించాడు.

హరీష్ ఈ మాటలు అన్న తర్వాత చాలసేపు నిశ్శబ్దం ఆవహించింది. మతాన్నిగూర్చి వారు మాటాడుకోవడం నాకు మరీ విసుగు.

మా నాన్న చివరికిలా అన్నారు "ఎవరి యిష్టంవారిది. మన

సోదరబృందమంతా కలిసి ఆగాఖాన్ గారిని వదలుకోవాలా! హిందూ మతాన్ని స్వీకరించాలా? అనే విషయం నిర్ణయించాలి. ఆ తర్వాత నూతన మత ప్రవక్తను ఎవరు అనుసరిస్తారో వారికివారే నిర్ణయించుకోవాలి. ఆగాఖాన్‌కు సమర్పించడం వారి ఆదేశాలకు అనుకూలమే."

మళ్లీ చాలాసేపు నిశ్శబ్దం. ఆగాఖాన్ దేవుడా? అని నాకు ఆశ్చర్యంవేసింది. ఆయన ఫోటోనుబట్టి చూస్తే ఆయన దేవుడిలా కనిపించలేదు. దేవుడంటే గడ్డం ఉండాలని నా ఉబలాటం. అమ్మ ఆయన ఫోటోపెట్టిన స్థలంలో అన్ని దేవతావిగ్రహాలను ఉంచింది. ఆయన ఇంగ్లీషువారిలా దుస్తులు ధరించి ఉన్నాడు. గడ్డం లేదు.

"ఇప్పట్లో ఇది ఉచితం" ప్రతాప్‌బాబాయి అన్నాడు.

"ఖచ్చితంగా" అనంత అన్నాడు.

"సరే. అంగీకరించాం." అన్నాడు లల్లా అచర్జమాల్.

'సరే. అయితే. రేపు నెలాఖరిరోజు. సెలవుదినం. ఉదయం మిషన్‌స్కూలు ఆవరణలో మన సోదరబృందాన్ని సమావేశపరుద్దాం. బాబూ రాంచంద్ర యుద్ధానికి వెళ్లాలిగాబట్టి , అతను యుద్ధానికి వెళ్లడానికి ముందే ఒక నిర్ణయం తీసుకొందాం. '

'అయితే మీరంతా వొప్పుకొన్నట్లేనా!' అన్నాడు నాన్న.

ఈ సంభాషణం ప్రాముఖ్యం నాకు తెలియకపోయినా, ఆగాఖాన్ పై మా నాన్న దృక్పథం పట్ల ఎంతో ఆసక్తి కనబరుస్తున్నారని అర్థమైంది. మా ఊళ్లోకన్నా యిక్కడ మానాన్న పెద్ద నాయకుడుగా నా కళ్లలో ప్రకాశిస్తున్నాడు. పాలిపోయిన వివర్ణమైన వారి ముఖాలను బట్టి మా కంసాలిజాతి సోదరులంతా దుఃఖభాజనమైన జీవితం గడుపుతున్నట్లు అనిపిస్తోంది. వారిని గూర్చి మాట్లాడే సమయంలో మా నాన్న వాడే 'దయనీయమైన బ్రతుకులు' అన్న పదానికి అర్థం నాకు స్ఫురించలేదు. కాని నా ఊహలో దాని అర్థం వారు పనిచేసే పొగచూరిన దుకాణాలు, యిరుకు సందులు, మురికి గొందులు అని మాత్రం తెలుసు అందువల్లనే మా నాన్న కులవృత్తిని మానుకొని మా ప్రతాప్

బాబాయి, తదితర బంధువులు మార్గాన్ని వదలి ఉద్యోగాలలో చేరి ఉంటారు. వారు పనిచేసే తీరువల్ల వారు మురికిగా కనిపిస్తున్నారు. ఆ తీరునాకు దయపుట్టించడానికి అసహ్యంవేస్తోంది. నా దృష్టిలో ఆగాఖాన్ వల్ల వారిపట్ల ద్వేషభావం ప్రబలింది ఫోటోలో చూస్తే ఆగాఖాన్ గర్విష్టిగా కనిపిస్తాడు.

'భోజనం సిద్ధంగా ఉంది స్నానానికి లెండి' అని ప్రతాపబాబాయి నాన్నను తొందర పెట్టాడు.

అమ్మ మాయింట్లో స్వయంగా వంటచేయడానికి సిద్ధమయ్యేంత వరకు, బాబాయి యింట్లో రోజూ భోంచేద్దామని నాన్న అన్నాడు. అమ్మ మౌనంగా ఈ ప్రతిపాదనను అంగీకరించింది మా కుటుంబంలో ఉండే ఆచారం ప్రకారం మొదటిపూట భోజనానికి మేము బాబాయి అతిథులమే!

ఆయన యింటి ముందు అంతస్తులో మధ్యాహ్నం అందరం హాలులో సమావేశమయ్యాం.

అంగడిలో పనిచేసే గులాం, దొలాలకు బాబాయి పని అప్పగించడానికి బయటకి వెళ్లారు దేవకి పిన్ని తాజా కూరలకు పోపు జోడిస్తూ, మాకు ఎంతోకాలంగా నమ్మకంగా ఉన్న పనిమనిషి కర్మాన్ అత్తమ్మతో కలిసి అన్నీ సిద్ధంచేస్తోంది. పక్కనే ఉన్న దత్తా సోదరుల యింటినుంచి హరీష్ ఏ క్షణంలోనైనా తిరిగి రావచ్చునని ఎదురుచూస్తున్నాం.

ప్రతాప్‌బాబాయి యింటి ముందు హాలులో గోడకు వేలాడదీసిన అందమైన బొమ్మలు, తదేకంగా చూస్తూ నిలుచున్నాను. జార్జి ప్రభువు, మేరీ రాణి బొమ్మలు, ఫ్రెంచి వనిత అర్ధనగ్న చిత్రం, సరస్వతీదేవీ పటం, — అన్నీ బంగారు ఫ్రేముకట్టి అందంగా వేలాడదీశారు. అల్మరా తలుపులన్నీ వెతుకుతూ ఏదైనా దొరికితే తీసుకొందామని వెంపర్లాడుతున్నాడు గణేష్.

శివ అప్పటికే మా కౌసల్య చెల్లితో తగువుపెట్టుకొని, దాని మట్టి బొమ్మ పగలగొట్టి, అమ్మ బాగా వాయిస్తే ఏడ్చి అమ్మ వొడిలో

నిద్రకుపక్రమించాడు. కౌసల్య బొమ్మ పగిలిందని ఏడ్చిఏడ్చి నాన్న ఒడారిస్తే వాడిలో నిద్రపోయింది.

నేలమీద పరిచిఉన్న నీలం చారల తివాచీని చూసి 'ఈ తివాసీని హరీష్ జైలుదుకాణం నుంచి ప్రతాప్‌కి పంపించాడా?— లాహోరునుంచి ప్రతాప్‌ను చూడటానికి ప్రతి ఆదివారం హరీష్ వస్తుండాలి. ఈయన దగ్గర తాగుడుకు అలవాటుపడి ఉంటాడు. జైలరుగా మోటుపోలీసులు అతగాడి స్నేహితులు. అతడు మెడికల్‌స్కూలు వదలకుండా ఉంటే బాగుండేది. అతనికి తోడు ఆ చప్పిడి ముక్కు అమ్మాయి'— అంటోంది అమ్మ.

'అమ్మా! హరీష్ మనకు పంపిన తీవాచీ ఏది' అడిగాను నేను.

'అది భద్రంగా ఎలుకలు తినడానికని పెట్టెలో పెట్టింది'అని చమత్కరించాడు నాన్న. 'మీ అమ్మ రైతుబిడ్డ కాదా ఏమీలేకపోవడానికి. అన్ని కట్టకట్టి సామాన్ల గదిలో భద్రంగా వెనక దాచడం ఆవిడ కలవాటు' అన్నారు నాన్న.

"మంచివన్ని వాడి పాడుచేసుకోవడంకన్నా దాచడం మేలు. తివాచీ పరిస్తే హాయిగా అనంతతో తాగి తందనాలాడి అక్కడే పడుకోవచ్చునని ఈయన ఉద్దేశం .. నానమ్మ వదలిపెట్టిన దంతా ప్రతాప్ వారసత్వంగా పొందాడని హరీష్‌కు తెలియదూ! .... యింకా మంచి తివాచీలు దానం చేస్తున్నాడు. ఈ నాటికి ప్రతాప్ కుటుంబంలోని నగలంతా కుదువబెట్టడమో వేశ్యలకోసం అమ్మివేయడమో చేసి ఉంటాడని నా నమ్మకం. లేదా దేవకి తల్లిదండ్రులకన్నా యిచ్చేసి ఉంటాడు. "

ఈ విషయంలో నౌషిరాలో యింటి వద్ద భోజన సమయంలో నాన్న అమ్మమాటలు సమర్థించినా, యిప్పుడు మాత్రం ఆమె మాటలలో కటుత్వానికి నాన్న అంగీకరించనట్లుగా చూడసాగాడు. ప్రతాప్‌బాబాయి మెడ కరుచుకొన్నప్పుడు వేసిన ఘాటువాసన నాకు బాగానచ్చింది. అందుకనే నేను అమ్మ జగడాన్ని హర్షించలేక పోయాను. అద్దె మీదికి పరుగెత్తి పోదామనే కోరిక ప్రబలమైంది.

ఒక క్షణం ఆమె ఆగిపోయి అసహనంగా నాన్నవైపు చూస్తూ,

తీక్షణవదనంతో యిలా అంది-

"మనం వెళ్లేలోపు మీరు ఒకసారి హరీష్‌తో చెప్పండి. "జైలు స్టోరునుంచి సామాన్లన్నీ దొంగతనంగా తెచ్చి, వాటి విలువ తెలియని ఈ కంసాలి వీడికివ్వడం ఆపమ"నండి. మీ అంతటి మీరుగూడా పాక శాలలోనుండి పేకాట ముక్కలు తెచ్చి ప్రతాప్‌కు, అతని స్నేహితులకు యిచ్చి బాగా అలవాటు చేశారు."

చనువుగా నాన్న నవ్వి సరిపెట్టారు.

దానితో అమ్మ రెచ్చిపోయి నన్ను, గణేష్‌ను చూస్తూ కోపంగా ఉపన్యాసం చేసింది

'ఇవాళ సరే. వదిలేస్తున్నాను. మొదటిరోజుగాబట్టి. మీ బాబాయి ప్రభావానికి మీరు గురికాగూడదు. అతను తాగుబోతు, వ్యభిచారి. అతడి అలవాట్లకు మీరు దూరంగా ఉండాలి. మీ దేవకిపిన్ని కూడా అంతే. తాగుడు, పేకాట, తాంబూలచర్వణం ఆవిడ కలవాటు. తీపి పదార్థాలు, డబ్బులు యిచ్చి మిమ్మల్ని లోబరచుకోవాలని ప్రయత్నిస్తుంది. జాగ్రత్త!' ఈ ఆఖరి మాటలువిని నాన్న అమ్మ నిరాదరణపట్ల ఊరుకోలేక — 'సరే. నువ్వు వాళ్లతో మళ్లీ మాట్లాడవచ్చు కనీసం ఈ మొదటిరోజైనా గొడవ చెయ్యకు' అన్నారు.

ఈ ఉదయం స్టేషన్లో దేవకి పిన్ని నాన్నను చూడగానే పైట తలపై సవరించుకొనేముందు నాన్నవైపు మురిపెంగా చూసిన చూపులు నాకింకా గుర్తు. అందుకే నాన్నకు ఆమెపట్ల పక్షపాతం. దేవికిపిన్నిపట్ల నాన్న పక్షపాతం ఎరిగిన అమ్మమాటలు అలా ఉంటాయని తెలుసు. ప్రతాప బాబాయి ఘాటువాసనలు ఎలాఉన్నా, పిన్ని సుగంధవాసనలు నాకు బాగానచ్చాయి. ఈ సంభాషణ అంతా వింటుంటే నాకు ఏడ్వాలనిపిస్తోంది.

'ఆవిడ కిప్పుడు ప్రేమికులతో వసంత సమయం' అంది అమ్మ మరీ కటువుగా.

మెట్లమీద అడుగుల శబ్దంవిని నాన్న — 'ఇంకచాలు' అన్నారు.

ఆయన సరిగా గమనించారు — ప్రతాప్‌బాబాయి మెట్లమీదనుంచి వినయ వినమితగాత్రుడై నాన్న దగ్గరకు వచ్చాడు.

"కౌసల్య నాన్నగారు వచ్చారు" దేవకి పిన్ని సుమధురకంఠం వంట గది మెట్లనుండి వినవచ్చింది. భర్త అడుగుల శబ్దం ఆవిడకు బాగా తెలుసు.

ప్రతాప్ బాబాయి పొడిదగ్గు దగ్గారు.

"భోజనం సిద్ధంగా ఉంది కర్మాన్ అత్త కిందికి తీసు కొస్తుంది. వీళ్ల చేతులు కడుగుతారా?"

అక్కడ హాలులో ఒక నాపరాయి కిందినుంచి అందంగా చేసిన యిత్తడి పళ్లెము, చెంబుతీసి బాబాయి మాముందు పెట్టాడు. మా మురికి చేతులు ముందుగా కడుగుకోవటానికి నాన్న సహాయంచేశాడు.

ఆక్షణంలో హరీష్‌కూడా వచ్చాడు. మాకు పరిచర్యలు తాను చేస్తాననీ, బాబాయిని భోజనానికి మాతోకూచోమనీ బలవంతంచేశాడు. అయితే దానికి బాబాయి అంగీకరించలేదు, హరీష్ చేతులు శుభ్రం చేసుకొని మాతో భోజనానికి కూచోవడంతో ఆ యుద్ధం ముగిసింది.

'అరే వెధవల్లారా! మీ చెల్లి కౌసల్య అంటే యిష్టమేనా? లేకరోజూ తగువులు పెట్టుకొంటారా?' అన్నాడు బాబాయి నన్ను, గణేష్‌ను వారిస్తూ.

"చూడునాన్నా! బుజ్జిగాడు నా చేయి కొరికాడు. బుల్లివాళ్లు నౌషిరా నుంచి తెచ్చిన బొమ్మ యీకుండా 'విజిల్' మాత్రం యిచ్చాడు—" అంది ముద్దుగా కౌసల్య.

అప్పుడే నిద్రలేచిన శివతో— 'అరే బుజ్జీ! కౌసల్యతో తగాదా పడకండి. దాన్నికూడా మీ బొమ్మలతో ఆడుకోనీండి.' అని నాన్న గదమాయించాడు.

'రైలు బొమ్మ సొంతానికి కావాలంటుంది' అన్నాను నేను అమ్మ మాటల ఊపువల్ల వచ్చిన ఉద్వేగంతో.

'ఈ పిల్ల పూర్తిగా పాడైపోయింది' అంది అమ్మ.

'నీకు అచ్చంగా నేనొక రైలు కొనిస్తాను.' అన్నాడు బాబాయి— మా మధ్య తాగాదా వారిద్దామని. అమ్మ మాటలకు ఆయన మొఖం పాలిపోయింది.

'దాంతో యీ పిల్ల మరీ పాడైపోతోంది' అంది అమ్మ.

'పిల్లలు కావాలని గారాముచేస్తే దేనినీ నేను కాదనలేను' అన్నాడు బాబాయి వాదించే ధోరణిలో— "ఇతరుల్లాగా డబ్బుకూడబెట్టాలను కోవడం నాకు నచ్చదు. డబ్బు వస్తూపోతూ ఉంటుంది... కూడబెట్టడంకన్నా ఖర్చు చెయ్యడం మంచిది " అన్నాడు బాబాయి.

ఈ మాటలు అమ్మకు విపరీతంగా తోచాయి.

'అందుకే మీ అమ్మ తన ఆస్తినంతా నీ కప్పగించింది హరీష్ తండ్రికి ఏమీ యివ్వలేదు అందువల్ల నీ యిష్టం వచ్చినట్లు వృధా చెయ్యవచ్చు. సులభంగా వచ్చింది. అలానే ఖర్చవుతుంది'— అంటూ అమ్మ శివను నాన్నదగ్గర వదిలి, తొందరగాలేచి మేడమీదికి నడిచింది.

బాబాయి ముఖం జేవురించింది. విసనకర్రతో గట్టిగా విసరడం మొదలెట్టాడు.

చాలాసేపువరకు ఎవరూ మాట్లాడలేదు. పెద్దవాళ్ల తగాదాకు భయపడిమేం గొడవచేయడం తగ్గించాం. ఎలుకపిల్ల భయంగా నిశ్శబ్దంగా నిలచింది.

సంతోషంగా ఉన్న కాపురంలో సంబరంపంచుకొందామనీ, వాళ్లు పెట్టినవి స్వీకరిద్దామని వచ్చిననాకు ఈతగాదా నిరాశ కలిగించింది. లోలోపల నాకిదంతా ఏదో చిక్కుదారిగాను, గందరగోళంగాను తోచింది.

మేడమీద కంచుపళ్లెములు రణగొణధ్వని చేయడం వినిపిస్తోంది ముసలిఅత్త కర్మాన్ ముద్దుముద్దగా తన సన్న గొంతుతో పిలుస్తోంది...

'అరే పిల్లలూ - భోజనం తెస్తున్నాను. సిద్ధంగా ఉండండి. 'అరే బుల్లి బుల్లీ! మా చిన్నకణ్ణ! బుల్లి బుల్లి.' అంటూ పిన్ని పాడుతూ

'ఒక్క క్షణం యిలా రండి' అని తీయగా పిలిచింది.

నేను ముందుకు పరుకెడుతుంటే హరీష్ వారించాడు. లేకుంటే కర్మన్ అత్త చేతిలో తెస్తున్న కంచాలు దొర్లించి ఉండేవాణ్ణి. ఆవిడ ఉసురుసురు మంటూ గదిలోకి వచ్చిన తర్వాత నేను సుఖంగా కూచున్నాను. ఇంతలో పిన్ని చిన్న ఇత్తడి పళ్లెంలో ఎముక ముక్కతో దిగివచ్చింది.

'ఇది ప్రత్యేకంగా మా బుల్లినాన్నకు' అంటూ నాకందించింది. ఆవిడ నాన్నను చూసి ముసుగు తలపై సవరించుకొంది.

ఇందుకు నేను ఆవిడను ఎంతగానో మెచ్చుకొన్నాను. అమ్మకంటె ఆవిడను ఎక్కువగా ప్రేమించడానికి కారణం, అందగాడైన బాబాయిని అమ్మ ఎద్దవా చేస్తూమాట్లాడి, వాతావరణాన్ని పాడుచేయడం నాకు నచ్చలేదు.

'కాదు. కాదు. ఇది కృష్ణకు యిష్టం వీడు నా బుజ్జి కుక్క. వీడికి మాంసమంటే యిష్టం. మా యింట్లో ఒక్కరే శాఖాహారి. అది హరీష్ అమ్మ.'- అన్నాడు నాన్న.

'అరే బుల్లి రారా! నాతో తిందువు. కృష్ణనాతో కూడా పండుగ రోజు అంగడికి వస్తే, నేను ఈ పవిత్రమైన ఆడవాళ్ల కన్నా ఎంతోబాగా మాంసంవండి పెడతాను. వీళ్లకు కూరగాయలు పోపుపెట్టడం మాత్రం తెలుసు' అన్నాడు బాబాయి. నాన్న అమ్మను వ్యంగ్యంగా తిట్టడం బాబాయికి అర్థమైంది.

'అన్నం గిలుకుతున్న బాబాయి దగ్గర నేను, హరీష్‌దగ్గర గణేష్, కౌసల్య శివ-నాన్న దగ్గర కూచున్నాం' ముందు భోజనాలకు కూచున్న పిల్లలకు, మగవాళ్లకు కర్మాన్, పిన్ని విసనకర్రలతో విసిరారు.

'అయితే అది సంతోషంలేని విందుభోజనం. అమ్మమాటల యీ౨టెలుతూట్లుగా గాయపరచి రగిల్చిన అగ్నియింకా ప్రజ్వరిల్లుతోంది.

ఇంట్లో తగాదాలన్నీ మరచిపోయి, విందు భోజనం కమ్మనివాసనలు గుభాళిస్తూండగా, తగాదా సద్దుమణిగి, రాత్రి బడలిక తీరేలా, నాకు

గాఢ నిద్రపట్టింది.

ఆ మధ్యాహ్నం కటువైన గొంతులు నన్ను నిద్రలేపాయి. తూగు కళ్లతో, ఇంకా నిద్రమత్తులో ఉన్నాను. ఆ నిద్రలోనే నన్ను మెట్లకిందికి తీసుకొచ్చారు. అమ్మ తొడ తలగడగా నేలమీద పడుకొన్నాను. అమ్మ, నాన్న మధ్యవయస్కురాలితో మాట్లాడుతున్నారు. ఆమె ముఖం స్వచ్ఛంగాను, వెంట్రుకలపైన బంగారు కలశం ఆకారంలో ఆభరణం, తలపైన ఎర్రరంగు ముసుగు ఆమె రైతు కుటుంబానికి చెందినదని చెప్తున్నాయి. బెనారస్ శిల్కు చీరముడతలు, జరీ అంచులతోను, నెమలి బొమ్మలతోను అందంగా అల్లికలు కలిగి ఉంది. అప్పుడు నాకు గుర్తుకు వచ్చింది ఆమె 'కోకో-కిల్లీ నానమ్మ'

'అమ్మో' అని సిగ్గుతో గునిశాను.

'ఏంటిరా చిట్టికణ్ణా'

ఈ సమయంలో రోజూ మాకు వేడిపాలు, తీపి పదార్థాలు యివ్వడం అలవాటు.

'ఉండునాన్నా. మీ నానమ్మకు మన కుటుంబసత్యాలు కొన్ని చెప్పనీ'అంటూ తన వాక్ప్రవాహంలో ఎన్నో అవాంతరాలను అడ్డుకొంటూ ఆమె గడగడా మాట్లాడుతోంది.

"పెద్దత్తా! మీ వైపువారు మమ్మల్నిముందు పీల్చి పిప్పిచేశారు. నీ సలహా మేరకు మా అత్త మా వారు నన్ను కొట్టేలా చేసింది. ఆవిడ ప్రతాప్ మొదటి భార్యనుకూడా కొట్టడంలో ఆవిడ ఊపిరాడక చనిపోయింది. నీకు తెలుసు ప్రతాప్‌కు మగువలు, మద్యము అంటే ఇష్టమని. అందుకని మా అత్తగారు తన ఆస్తి అంతా 'వాళ్లు' సైన్యంలో ఉన్నారుగాబట్టి, అతగాడికి అందేలా చేశారు. మళ్లీ ఈ అందమైన, దుబరా ఆవిడ దేవకినిచ్చి ప్రతాప్ పెళ్లి జరిపించారు. ఆవిడకు తన యింటికన్నా, తల్లిదండ్రులంటే ప్రేమ జాస్తి— "

'అవును. నేనదంతా చేశాను.' కోకో కిల్లీ నానమ్మ పరిహాసంగా అంది.

'ఇదిగాదు. నేను వెళ్లేలోగా నిశ్చయంచేసుకోవాలనుకొన్నది—' అన్నాడు నాన్న మధ్యలో అడ్డుపడుతూ. "నేనడిగేది ఈ యింటి యజమాని పెద్దవాడుగాబట్టి తన బలగంతో ఆగాఖాన్‌ను వదలిపెట్టి హిందువుల్లో కలుస్తాడా? లేదా? నేను మళ్లీ రాకపోవచ్చు— "

'అలా అనకండి' అంది అమ్మ అడ్డుపడుతూ.

'అమ్మా! తినడానికి' అంటూ అమ్మ చెవిలో గొణిగాను.

"నాన్నను స్వర్ణదేవాలయానికి తీసుకెళ్లమను"

ఆగాఖాన్ గూర్చి వారి సంభాషణ నాకు విసుగు పుట్టిస్తోంది. దేవుడంటే నాకు అసలే భయం. ఒకవేళ భగవంతుడు ఆగాఖాన్ రూపంలో వుంటే, మా నాన్న ఆగాఖాన్ వర్గాన్ని వదలి వెళ్లినందుకు కోపపడి, యుద్ధంలో నాశనంచేయవచ్చు. ఒకవేళ భగవంతుడు హిందుమతంలో ఉంటే, ఆర్య సమాజంలో చేరిన హరీష్‌ను గాయపరచవచ్చు. అసలు భగవంతుడెలా ఉంటాడు? ఆయన యిన్ని తగాదాలు, కొట్లాటలు ఎందుకు కల్గించాడు? అని నాకు ఆశ్చర్యం వేస్తుంటుంది.

'వెళ్లి పిన్నిని పాలు యివ్వమని అడుగు.' 'చిన్నపిల్లాడిలా ప్రవర్తించకు. నువ్విప్పుడు పెద్దాడివయ్యావ్. పొద్దుట నువ్వే అన్నావుగా ఆమాట... గణేష్ ఏడి? శివ, కౌసల్య యింకా నిద్రపోతున్నట్లున్నారు. నువ్వు యింకాసేపు నిద్రపోక పోయ్యారా?' అన్నారు నాన్న.

'పిన్ని దగ్గరకు మేడపైకి వెళ్లు నాన్నా' అన్నాడు బాబాయి. ఆయన అప్పుడే పాలుతాగి దుకాణానికి వెళ్లడానికి బయటికి వచ్చాడు. ఇంతలో కొకోకిల్లీని చూసి గడపమీద ఆమె దగ్గరగా కూచొన్నాడు.

మేడమీదికి వెళ్దామనుకొంటూ అక్కడ తచ్చాడాను. స్వర్ణదేవాలయానికి తీసుకెళ్లమని నాన్నను బలవంతం చేద్దామని నా ఉద్దేశం. ఆ దేవాలయం ఎంతో పురాణ ప్రసిద్ధమైంది. మా పూర్వీకులు అక్కడ కళాకారులుగా పని చేశారని అమ్మ చెప్పింది. స్నానాలు చేసేందుకు అక్కడ చెరువు ఉంది. ముస్లింలకు మక్కా ఎలానో సిక్కులకు ఈ దేవాలయం అలాంటిది.

అమ్మ నాన్నను గురించి పట్టించుకొంటున్నప్పుడు, ఆయన నా వైపు మొగ్గినప్పుడు, వాళ్లిద్దరూ మాట్లాడాలని తపనపడలేదు. ఇప్పుడు పరిస్థితి అంతా కోకోకిల్లి అదుపులో ఉంది.

గుండె గొంతుకలో నేను అవ్వపై వ్యర్థగీతం పాడుకొంటున్నాను.

'కోకో కిల్లి... కోకో కిల్లో'

నాకేసి ఒకసారి పరికించి చూసి నాన్నపాడడం ఆపించాడు. అవ్వ కేసి తిరిగి యిలా అన్నాడు.

"ఈ భౌతిక ప్రపంచంలో సంపద అంతామాయ. ఆగాఖాన్ ప్రార్థనామందిరం అధిపతిగా తాతగారు సంపాదించిన ఆస్తి అంతా అంతే."

"ఈ ఇళ్లన్నీ ఆగాఖాన్ పేర భక్తులు సమర్పించుకొన్నారు. వాటి నన్నిటినీ తాతగారు తీసేసుకొన్నారు. మనకున్న భూములు, నగానట్రా, యివివదిలేద్దాం.... ఇదంతా నాన్నమ్మ! ఒక విషవలయం."

'అయితే ఆమె మనభూములు మనకు తిరిగి యిచ్చేసి మనల్ని ఆశాకూపంనుండి ఉద్ధరించాలంటారు.' అంది అమ్మ.

'నీ తెలివి తేటలు నా దగ్గర గాదు. ఇదంతా మాయంటావ్! కంటోన్మెంటులో ఉన్నప్పటినుండి ఈ ఉమ్మడి కుటుంబంపై నీకు గౌరవం సన్నగిల్లింది. పందుల్నితినే ఈ కంసాలులు మన సంపదని, మనల్ని ద్వేషిస్తారు' అంది కోకోకిల్లి.

'వాస్తవానికి నీ కుటుంబం ప్రతి ఒక్కళ్లనూ ద్వేషిస్తుంది' అన్నాడు నాన్న చివరగా.

'మనకున్న సంపద అంతా— ఆవిడ మతం. ఇందతా స్వర్గానికి వాళ్లు తీసుకెళతారు' అన్నాడు బాబాయిపైకి లేచినల్చుంటూ.

'ఆశ. పెద్దవాళ్లననకండి. ఆ చౌదరి హరియాతోకలిసి హరీష్‌ని తాగు తుండమను. వాడేగాక ఆమోటు వెధవ అనంత్, ఆ గడియారాలు తయారుచేసే పెషోరియా వాణ్ణి చెడగొడుతున్నారు... రామచంద్రా!

నీకిదంతా మాయ అనిపిస్తే— నీ తాత తిరిగిరావాలని కోరడం దేనికి?' అంది కోకోకిల్లి.

ఈ సుదీర్ఘవాదన అయిపోయిందనుకొన్నాను. నా ధర్మదృష్టిలో కోకోకిల్లి సమర్థంగా వాదనలో గెలిచింది. మా అమ్మనాన్న సంపద అంతా మాయ, ఆశాకూపం— అంటూనే అది తిరిగి తమకు రావాలని కోరుకొంటున్నారు. ఇదంతా భ్రమ అయితే వాళ్లకేవీ అక్కరలేదు.

'నాన్నా! దర్బార్ సాహెబ్‌కి పొద్దువాలితే తీసుకెళ్తానన్నావుగా— రా. వెళ్దాం' అన్నాను గోముగా.

'అరే యింకా పొద్దు నెత్తి మీదుంది.'

'ఎక్కడి కెళ్దామంటున్నాడు' అంది అవ్వ.

'నీ దృష్టిలో పానశాలకు.' బాబాయి ఎద్దేవాచేస్తూ ఇలా అన్నాడు హిందూమతంలోకి తిరిగి వెళ్దామనుకొన్న పేద కంసాలులు తమ మొఖాలను ప్రపంచానికి చూపించలేరనే ఆలోచన నీవు సహించలేవు, చదువురాని వాళ్ల పరిస్థితి అలా ఉంచు చదువుకొన్న ధనవంతులైన వారి సంగతి ఏంటి?

ఆగాఖాను గురించి వాళ్లు యిదమిత్థంగా తేల్చుకోలేకున్నారు. భక్తులు ఆగాఖాన్‌కు సమర్పించిన ఆస్తిపాస్తులు, నీ భర్త సంక్రమింపజేసుకొన్న సంపద — ఇందుకు కారణం.'

ఈ సమయంలో దేవకిపిన్ని, కర్మాన్ ముసలమ్మతో తొందరగా కిందికి దిగివచ్చింది.

'కర్మాన్. వీళ్లు నిన్ను యింట్లోంచి గెంటివేస్తే మా దగ్గరకురా వచ్చు' అంది అవ్వ.

'నాకు కావలసిందతా నా కొడుక్కి తగినపిల్ల. ఇప్పుడప్పుడే వాడు ప్రతాప్ దగ్గరపని నేర్చుకొన్నాడు.' 'నువ్వేమి గాబరాపడకు ఈ పేద కంసాలులమీద ఆధారపడకు. మా యింటికి వచ్చేయ్.' అంది అవ్వ.

ప్రతాప బాబాయిపట్ల నా ప్రేమవల్ల నాకీమాట కోపం తెప్పిం

చింది. పొద్దుట అమ్మ బాబాయిపైన చేసిన వ్యాఖ్యానాలు, ఇప్పుడీ ముసలమ్మ చేసిన దాడి, నాలో వారిపై పెరుగుతున్న అసహనాన్ని మార్చి వేశాయి. దయనీయమైన జీవితాలను గడుపుతున్న ఈ కంసాలులపట్ల జాలి కలిగింది.

'అవ్వా! నువు చాలాసేపు మాట్లాడావు యిప్పటికే' అన్నాను నేను దురుసుగా. నా మాటలకు కళ్లెం, సిగ్గు లేవని నాకు తెలుసు.

'అరే. పాడు వెధవా!' అంది ముత్తవ్వ నన్ను అరుస్తూ.

అయితే నా మాటకు అందరూ నవ్వుకొన్నారు. వాళ్ల మనసుల్లో యిలాంటిమాట అనాలని కోరిక.

అప్రయత్నంగా నా అమాయక ప్రవర్తనవల్ల సుదీర్ఘ వాదనను అడ్డుకోగలిగాను.

"అరే గణేష్; శివ, కౌసల్య ఎక్కడున్నారో చూడు. వాళ్లను తీసుకురా. ఈ గొంతులోంచి బయట పడదాం. గుడికి తీసుకెళ్తాను, పద." అన్నాడు నాన్న.

# 3

మా కుటుంబమంతా గుంపుగా ఆజనసమ్మర్దంగల యిరుకు సందుల్లోంచి కదులుతున్నాం. ఆ సందుల్లో కంసాలులు, ఇత్తడిసామా న్లను యూరోపియన్ యంత్రాలతో వెండిగామార్చే నేర్పరులు, చక్కెర తయారుచేసే వారు ఉన్నారు. యాత్రికులు వదలిన వందలాది చెప్పు లను స్వర్ణ దేవాలయం ప్రహరీవద్ద ఒక సిక్కు కాపలాకాస్తున్నాడు. నేను, గణేష్ దేవాలయం మెట్లకు, గర్భగుడికి చెక్కిన పాలరాతిపై విరాళా లిచ్చిన వారి పేర్లను చదువుతూ మాలోకంలో మేం ఉండిపోయాం.

సమతలంగా ఉన్న ప్రదేశానికి వెళ్లగానే మేము యాత్రికుల కాళ్ల

దాటుకుంటూ వంతులువేస్తూ, ఒకర్ని ఒకరి వెంబడిస్తూ, కేకలువేస్తూ ఆనందతాండవంచేస్తూ అకాల్ తక్త్ చేరాము. అక్కడ ఒక పెద్ద చప్టాపై ఒక పూజారి పవిత్రగ్రంధాన్ని చదువుతున్నారు. ఆయన కెదురుగా జన సమూహం చేరివున్నారు.

నల్లటి దుస్తులు కప్పుకొని, పొడగాటి కుచ్చుతలపాగాలపై ఇనప చక్రాలు ధరించి, చేతిలో కృపాణాలు దాల్చిన ఇద్దరు సిక్కులు మమ్మల్ని గొడవచేయ వద్దని హెచ్చరించారు. అది మొదలు మేము నోరు మెదప లేదు. హిందూమతంలో తప్ప మిగతామతాలన్నిటికీ ఈ నిశ్శబ్ద వాతావరణం అవసరం. హిందువులు గుడిగంటలు మ్రోగించి, గొంతెత్తి పాటలుపాడి భగవంతుణ్ణి మేల్కొలపడం అలవాటు. పూజారి వెనుక భాగంలో సిక్కుల ఆఖరి మతగురువు నిలువెత్తు పటం ఉంది. మా అమ్మ నాకు చెప్పినట్లుగా సిక్కులు, హిందువుల పక్షాన ఔరంగజేబును ఎదిరించిన వ్యక్తిలా ఆయన ఆపటంలో నాకు కనిపించారు. దగద్ధగా యమానంగా ప్రకాశిస్తున్న వస్త్రాలలో కాంతిని వెదజల్లుతూ, గంభీరంగా ఎడమచేతిలో పక్షి, కుడిచేతిలో కత్తి పట్టుకొని ప్రకాశిస్తున్న విగ్రహం కనిపించింది.

'పవిత్ర శబ్దం' నిలిపిన సింహాసనాన్ని అమ్మ చేతులతో భక్తిగా స్పృశించడానికి వెళ్తోంది. మధ్యాహ్నం సంభాషణలో ఆమె తన తిర స్కార ధోరణికి భిన్నంగా ముస్లిం ప్రవక్త ఆగాఖాన్ పట్ల పక్షపాతం వహించడం నాకు గుర్తుకు వచ్చాయి. మాయింట్లో పూజా మందిరంలో అన్ని మతాలదేవుళ్లనూ ఆమె పూజించడం, నాన్న అలా అందరినీ పూజించడాన్ని ఎద్దేవా చేయడం నాకు బాగాగుర్తు. ఆమెను ఎగతాళి చేద్దామని నేనొక అసందర్భపు గీతంపాడాను:

"భగవంతుడు, భగవానుడు
భయంకర ప్రతిరూపుడు
ఆకాశాన తన స్థానం వీడిరాని
సర్వాంతర్యామి భగవంతుడు"

అమ్మ నా నిందను గమనించ నట్లుగా నాకు కనిపించింది. అకా

లితక్తు నుండి స్వర్ణ దేవాలయం ముఖ మండపానికి వెళుతూ ఆమె చేతులు జోడించి ఏవో ప్రార్థనలు వల్లిస్తూ నడుస్తున్నది. గర్భగుడి వాకిట ప్రవేశద్వారం వద్ద సాష్టాంగ నమస్కారం చేసి ముక్కుతో గీతలు గీచింది.

"మీ అమ్మ పిచ్చి పనులు చూడండిరా అబ్బాయిలూ" అన్నాడు నాన్న.

'అమ్మా' నీకు దేముడు కనిపిస్తున్నాడా? అన్నాను ఆమెను ఉడికిద్దామని. ఆమె ఏడవటం నాకు కనిపించింది.

నేను పరుగెత్తుకుంటూ వెళ్ళి హరీషును, గణేశ్‌ను కలిశాను. ఆ పురాణ ప్రసిద్ధమైన పాలరాతి మందిరం కనిపించినపుడు నా ఆనందానికి అవధులు లేవు. చుట్టూ చెరువుపైన బంగారు కలశాలూ, చిన్న చిన్న గోపురాలూ, బంగారుతో తాపడం వేసిన ప్రవేశద్వారానికి పాలరాతి దారి, చూసేందుకు అద్భుతంగా ఉన్నాయి. భక్తులు గుంపుగా లోపలికి బయటకు వస్తున్నారు. బంగారు గోపురం పై పాలనురుగులాంటి తెరల గూళ్ళలో నుంచి, నల్లరాతి స్తంభాలలో నుంచి నల్ల పావురాళ్ళు ఎగురుతున్నాయి. ఇంతకు ముందు ఈ దేవాలయ మంతా బంగారు మయం అనుకుంటున్న నాకు పాలరాతి వైభవం కళ్ళు తెరిపించింది.

ఈ సమ్మోహ పరవశమైన భగవత్ సామ్రాజ్యానికి రావాలని నా కోరిక. నేను కొద్దిరోజుల క్రిందట వదిలి వచ్చిన ఆంగ్ల సంప్రదాయంలో నిర్మించిన కంటోన్‌మెంటు జ్ఞాపకాలను మరపిస్తూ ఇది నా ఆత్మను పరవశం చేసింది. ఈ చెరువులో తరచూ స్నానం చెయ్యడానికి, ఈత నేర్చుకోవడానికి, భక్తులనుండి ప్రసాదాన్ని అడగ టానికి ఇక్కడ అవకాశం వుంటుంది.

అక్కడ స్నానాలు చేస్తున్న వాళ్ళను చూడగానే నీళ్ళలోకి ఎప్పుడెప్పుడు వెళదామా అనే తాపత్రయంలో "ఇక్కడ స్నానం ఇప్పుడే చేద్దాం"అని అరిచాను.

'లేదు' ఈమూాల నురుగు ఎక్కువ అన్నారు నాన్న.

'మీ సిక్కులు పాల సముద్రాన్ని కూడా శుభ్రంగా వుంచరు.

అన్నాడు హరీష్ అమ్మను ఉడికిద్దామని.

'అదుగో ఆముందువైపు శుభ్రంగా వుంది'. అమ్మ దారి చూపుతూ అంది.

'సరే ఇంకొంచెం ముందుకు పోదాం పదండి. అక్కడ మురికి తక్కువగా వున్నట్లుంది' అన్నారు నాన్న.

'అలాంటి అపవిత్రం మాటలు అనకండి భగవంతుడు వింటుంటాడు'. అంటూ అభ్యంతరం చెప్పింది అమ్మ. నాన్న నవ్వి సరిపెట్టాడు.

భగవంతుళ్ళను నమ్మిన అమ్మ! వారిని ఎగతాళి చేస్తున్న నాన్న — వీరిద్దరిలో ఎవరి దారి సరియైనదో నాకర్థం కాలేదు.

గడియారపు స్తంభం నీడలో స్నానం చేద్దామని చివరకు నిర్ణయించారు. అక్కడికి యాభై గజాల దూరంలో స్త్రీలకు ప్రత్యేకంగా కేటాయించిన మరుగు ప్రదేశంలో అమ్మ స్నానం చెయ్యటానికి వెళ్ళింది. ఆమె తిరిగి గడియారపు స్తంభం దగ్గరనుంచి గర్భ గుడిలోకి ప్రవేశించే మెట్ల దగ్గర మమ్మల్ని కలుసుకునేటట్లు అనుకున్నాం. అక్కడ పాత చింత చెట్టుక్రింద కంటికి పూసుకునే నల్లటి పొడి అమ్మే సిక్కు దుకాణం వద్ద అందరం కలవాలి.

ఈవైపు చాలా శుభ్రంగా వుంది. అయితే వలలా అల్లుకొన్న నాచు కదలిపోయేంతవరకు ఆగాము. ఇప్పుడు ఒక ప్రమాదం ముంచుకు వచ్చింది. అక్కడ కూర్చున్న పూజారి బ్రాహ్మణులలో ఒకతను మా నాన్నకు ఆప్యాయంగా నమస్కారం చేసి చొక్కా పట్టుకున్నాడు. మరొక పూజారి దగ్గరగా వచ్చాడు.

ఇంతలో మొదటి పూజారి తన ఆసనంపై నుంచి లేచి నాన్నను తన వైపులాగాలని , రెండో పూజారి తన వైపుకు లాగాలని ప్రయత్నించారు. మాకుటుంబంచేత ప్రవిత్ర స్నానంచేయించే తంతు ఎవరు నిర్వహించాలి అనే విషయంలో వారిద్దరు మధ్య తిట్లు నిందా రోపణలు శాపనార్థాల యుద్ధం జరిగింది. చివరకు మా నాన్న ఆయన చేతిలో నుంచి చొక్కా విడిపించుకొని వాళ్ళిద్దరిని వారించి "మీ జందె

ములు, నుదుటిపై బొట్లు, తువాళ్ళు, మంత్రాలు మా కక్కరలేదు. మా వస్తువులు మీరు భద్రపరచ నక్కరలేదు" అని ఖండితంగా చెప్పారు.

ఆ మాటతో వారిద్దరూ హతాశులై కోపంగా కూచున్నారు. వెంటనే వారి సూచనలు పాటించ నందుకు ఇద్దరూ కలిసి శాపనార్థాలు పెట్టడం మొదలు పెట్టారు.

సిక్కులు హిందువులకు ఆత్మీయులు కాబట్టి ఈ హిందూ బ్రాహ్మణులను ఇక్కడ కూచోడానికి అనుమతించారనీ, కానీ వీరు మంత్ర తంత్రాలను అమ్ముకుంటున్నారని నాన్న మాతో అన్నారు. స్నానానంతరం నుదుటిపై తిలకం సరదాగా పెట్టుకోవాలని వున్నా వాళ్ళిద్దరిని నాన్న తరిమి వేయటం నాకు ఘనంగా అనిపించింది.

'వీళ్ళు భౌతిక వాదులైన ఆర్యసమాజం వాళ్ళు అయివుంటారు' అన్నాడొక పూజారి మాకు వినిపించేలా.

'తప్పకుండా వాళ్ళు లోభులైవుంటారు అన్నాడు' మరో పూజారి జందెం పోగులు వడుకుతూ. ఆ జందాలు పైసా కొకటి చొప్పన అమ్ముతాడతను.

'ఇదిగో గణేశ్ అప్పుడే హరీష్‌తో ఈత కొట్టడానికి వెళ్ళాడు నాతో స్నానం చెయ్యడానికి ఎవరు ముందు వస్తారో చెప్పండి' అన్నాడునాన్న.

నౌషిరా వద్ద లూండానదిలో నాకంటే బాగా ఈత నేర్చుకున్న గణేశ్ పట్ల మాత్సర్యము నీళ్ళలోకి దుముకాలనే ఆదుర్దాతో నేను నా గుడ్డలు విప్పేశాను. నాన్న రైలు బొమ్మను సవరిస్తూ, కౌసల్యా, శివా గుడ్డలు విప్పడానికి సహాయం చేస్తున్నారు. నేను ముందుగా నీళ్ళలోకి దిగుదామనుకున్నాను. ఈలోగా నాన్న వాళ్ళిద్దరికీ ఒక మునకే వేయించారు. వాళ్ళిద్దరూ భయంతో కేకలు వేస్తే గట్టు మీద కూచో పెట్టారు. నన్ను చేతుల్లోకి తీసుకొని నీళ్ళలోకి ఈతకు నెమ్మదిగా వదిలారు 'నౌషిరాలోలూండా' గట్టున ఈత పాఠాలు నాకు నేర్పించినవి గుర్తున్నా, కాళ్ళు చేతులు కొట్టుకుంటూ క్షణకాలం ఈదాను. నాన్న చేతులు నన్ను వదిలెయ్యగానే ఒక మునక వేసి ముక్కుల నిండా నీళ్ళు పీల్చాను. నాన్న వెంటనే బయటికి లాగారు.

'ఆదివారాలు లాహోరు నుండి హరీష్ వచ్చినపుడు నిన్ను ఇక్కడికి తీసుకొనివచ్చి ఈత నేర్పమని చెపుతాను. నీవు మాత్రం కొంటెగాడిలా ఒక్కడివే వచ్చావంటే మునిగి పోతావ్' అని నాన్న హెచ్చరించారు. అప్పటివరకు నాలోవున్న ఆశలు అడుగంటి ఒక్కడినే ఇక్కడికి వద్దా మనుకున్న సాహసం విరమించు కున్నాను. నాలో ఉత్సాహం నశించి మానాన్న పట్ల ఆరాధనా భావం తగ్గింది. నన్ను కౌసల్య, శివ ప్రక్కన కూచోబెట్టి ఆయన ఒక్క ఉదుటున నీళ్ళలోకి దూకారు. మమ్మల్ని ఉత్కంఠతో ముంచెత్తి మేము ఏడ్చేంత వరకు కనిపించ లేదు. క్షణంలో 50గజాల అవతల కనుపించారు. నీళ్ళలో శవాకారంలో తేలియాడుతూ పిల్లి మొగ్గలు వేస్తూ మాకు ఆనందాన్ని కలిగించారు. మమ్మల్ని ఒక్కొక్కరిని కొంచెం సేపు తన వీపుపై కూర్చోబెట్టుకొని ఈదారు.

ఆయన చాల నెలల పాటు నాదృష్టిలో తండ్రిగా అధికారం చెలా యించి ఎరుగను. మాకు వళ్ళుతుడుస్తూ మాతో నవ్వుతూ గిలిగింతలు పెడ్తూ ఆయనా చిన్న పిల్లవాడిలా అయిపోయారు. ఆయన తిరిగి యుద్ధానికిగాని శిబిరానికిగాని వెళ్ళకుండా వుంటే బాగుంటుందనుకు న్నాను.

సూర్యాస్తమయ సమయంలో స్వర్ణ దేవాలయ తటాకం చుట్టూ పరిక్రమోత్సవానికి తయారైనాం అమ్మ స్నానం పూర్తిచేసుకొని మేమ నుకున్న ప్రకారం సిక్కు అంగడి వద్ద నుంచొని వుంది. ఆ లావుపాటి సిక్కు ఏంటిమొని పొడిని పాత్రంతో నూరుతూ కూచున్నాడు. అతని సహాయకుడు యాత్రికులకు ఈమందు శక్తి కంటిపై ఎలా వుంటుందో చూపడానికి దాన్ని నల్లటి పొడిలా ముంచి చూపుతున్నాడు. అమ్మ అది చూసి కంటికి మంచిదనే వుద్దేశంతోను, దాని వలన నష్టమేమీ లేదని మాకు తలా కాస్త కంటికి పట్టించింది. కంటినిండా నీళ్ళు వచ్చి, కళ్ళలో మలినం పోయింది.

విశాలనయనాలతో, భక్తి భావంతో నిశ్చేష్టులై చూస్తున్న యాత్రి కులతో, మేమూ కలిసిపోయాం. పెద్దపెద్ద తలపాగాలతో పొడవాటి గడ్డాలతో ముతకబారుగా వున్నసిక్కులూ, నేత గుడ్డలు కట్టుకున్న వారి

స్త్రీలు గంజిపెట్టిన పలుచటి వస్త్రాలు కట్టుకొని పాలిపోయినట్లున్న హిందూవర్తకులు, వినయాన్ని నటిస్తున్న గడుసరి స్త్రీలు, జరీదుస్తులు ధరించిన యువతులు దేవాలయంచుట్టూ పిట్టగోడల మీద, ప్రహరీ లోపల 'ఐస్‌క్రీములు' గోప్పాగల్‌లు తింటూ, తిరునాళ్ళ జనంలా కనుపిస్తున్నారు.

పట్టణ ప్రజల పిల్లలనుండి ఆకలి అనే అంటువ్యాధి మాకు కూడా సంక్రమించింది. గంటస్తంభం మూలన తింటున్న వారిని చూడగానే మాకూ తినాలనిపించింది. కానీ బయట డబ్బు ఖర్చుపెట్టడం అనే దురభ్యాసాన్ని కప్పిపుచ్చుకోవడానికి నాన్న మమ్మల్ని భయపెడ్తూ చెప్పినమాటలు గుర్తుకు వచ్చాయి. బయట ఏవస్తువులూ తినవద్దు. తక్కువ జాతివాళ్ళు మాత్రమే అలా తింటారు. అలా మిగిలిపోయిన నాలోని ఆశ చిరకాలం ఐస్‌క్రీములు, పకోడీలు రుచి కరమైన పదార్థాలకు గుర్తులుగా నిలిచి పోయి అవి ఎప్పడైనా వంటరిగా తినాలి అనే కోరిక నాలో నిలిచిపోయింది.

సంధ్య చీకట్లు ముసురుకున్నాయి. నా మనసులోలోపల విభూతి దాల్చిన మునులన్నా మతానికి ప్రతీకలైన గుడులన్నా అసహ్యం వేసింది. ఆక్షణం నుండి నా మనసు భగవంతుని వైపుమరలింది.

# 4

స్వర్ణ దేవాలయంలో నా అమాయకత్వంపై జరిగిన క్రూరమైన దాడుల వల్ల నేను నా అహాన్ని నిలుపుకుంటూ పెద్దలతో తగాదాలకు తలపడే కలహ స్వభావం అలవడింది.

సెప్టెంబరు ఆఖరు వరకు అమృత్‌సర్‌లో పాఠశాలలు ఆరంభం కాకపోయినా, ఏవోకొన్ని కారణాలవల్ల పిల్లలను చేర్చుకోవటం ఆరంభిం చారు. మా నాన్న ఇంటి పనులతో తలమునకలై మమ్మల్ని చేర్చడానికి రాలేనన్నారు. పెద్దన్న హరీష్ లాహోర్‌సెంట్రల్ జైలులో సహాయ జైల

రుగా తన విధులకు వెళ్ళిపోయాడు. నాన్న పండిత వైద్యనాధ పాఠశాలలో గుమాస్తాగా పని చేస్తున్న బాబూహరి శంకర్‌కు ఒక చీటీవ్రాసి పంపారు. ఆయన గురించి మాకు అముందు రోజే చెప్పారు. ఆయన సొంత పర్యవేక్షణలో పాఠశాలలోమమ్ము చేర్చవలసిందిగా ఆయనకు చెప్పిపంపారు.

మరునాడు ఉదయం 9 గంటలకు బాబూ హరిశంకర్ వచ్చారు. ముందుగది వాకిట్లోనే నాన్న అతన్ని కౌగలించుకొని తీసుకొని వచ్చారు. అమ్మ ఆయనకు రొట్టె, మజ్జిగ మేడ మీద నుంచి తెచ్చియిచ్చింది. దళసరికళ్ళద్దాలతో నల్లగా పొట్టిగా ఉన్న అతగాడు నాన్నలా గుడ్డలువే సుకొని గుండ్రటి టోపీ, పొడవాటి చొక్కా ఆంగ్లేయులలా జాకెట్టు పొడవాటి పైజామాలు ధరించారు. ఆయన పైజమా బూట్లపై దుమ్ము తుడుస్తోంది. అతన్ని చూసిన క్షణం నుంచీ అతనంటే నాకిష్టపడలేదు. అతని దుస్తులను బట్టి గర్విష్టిలా కనిపించాడు.

అతని బూట్లు నాకు బాగా నచ్చాయి. మేడ మీద తయార వుతున్న గణేశ్‌ను పిలవడానికి వెళ్ళాను. నేను పుట్టడానికి ముందు వాయువ్య సరిహద్దు ప్రాంతాలలో లండీకొటాల్ దగ్గర 38వ డోగ్రా సైన్యానికి చెందిన డాక్టర్ శివశంకర్, ఈ హరిశంకర్ తండ్రి అని మానాన్న చెప్పడం నాకు గుర్తుకొచ్చింది. వాళ్ళనాన్న ద్వారా ఇత గాడు పరిచయ మయ్యాడు. డా. శివశంకర్ ముసలివాడైనా భార్య చనిపోయి నందున మళ్ళీ పెండ్లి చేసుకుందాం అనుకున్నాడు. వాళ్ళ నాన్నకు పిల్లను కుదిరిస్తే మాకు సహకరిస్తానని హరిశంకర్ అన్నాడు. వితంతు పునర్వివాహాలు ఆర్యసమాజ లక్ష్యాలు కాబట్టి వాళ్ళ తండ్రిగారికి ఆర్యసమాజం నుండి ఒక సంబంధం కుదర్చమని అతని కోరిక.

నేను మేడ మీదనుండి క్రిందికి వచ్చేటప్పటికి మానాన్నకు అతిధికి మధ్య నిశ్శబ్దం ఆవరించింది. వాళ్ళిద్దరూ ఆ ముసలాయన సంబంధం గూర్చి మాట్లాడు కుంటున్నారని వూహించాను.

“మీనాన్నగారి ఫోటో ఒకటి వదలి వెళ్ళు, నేను దత్ సోదరులతో సంబంధం గూర్చి మాట్లాడుతాను” అని నాన్న ఉద్దేశ్య పూర్వకంగా అప్రస్తావన మార్చారు.

"బుర్లీ విషయంలో ఏయిబ్బంది ఉండకపోవచ్చు. అక్కడ 3వ తరగతి పాసయ్యాడు. వీడి అన్న గణేశ్ నౌషిరా'లో ఇంగ్లీషు లేకుండా 4వ తరగతి పాసయ్యాడు. ఇక్కడ అమృత్‌సర్‌లో ఇంగ్లీషు తప్పని సరిగా నాల్గవ తరగతిలో ఉండాలని నేను విన్నాను."

'నాన్నారూ! గణేశ్‌కు ఐదవ తరగతిలో సీటురాకపోతే మరీమంచిది ఇద్దరం ఒకే క్లాసులో వుంటాము రెండురకాల పుస్తకాలు కొనకుండా సరిపోతుంది. ఇద్దరం అవేపుస్తకాలు సర్దుకుంటాం.' నేను డా. శివశంకర్ పోటోను, రంగువేసుకొన్న ఆయన మీసాలను ఆశ్చర్యంగా చూస్తూ అన్నాను.

'వెధవ' అని మందలిస్తూ నాలో చిలిపితనానికి నవ్వారు.

'నీవు ఆమాట గణేశ్ ముందు అనవద్దు. వాడేడుస్తాడు.' అంది నాతో అమ్మ

'ఆ చచ్చిన వెధవ ఏడీ.... అరే! గణేశ్ క్రిందికిరా!' అని అరిచింది అమ్మ.

హరిశంకర్ మీద పెట్టుకున్న ఆశలు నశించాయి. అతనన్నాడు. "నౌషిరాలో 4వ తరగతిలో ఇంగ్లీషు చదివి వుండకపోతే యిక్కడ 5వ తరగతిలో చేర్చుకోవడం కష్టం. ఇక్కడ మాస్కూల్లో ప్రమాణాలు ఎక్కువ. మాకెదురుగా వుండే ప్రభుత్వ పాఠశాలతో మేం పోటీ పడతాం." ఆమాట అంటున్నపుడు గణేశ్ క్రిందికి వచ్చాడు. వాడు ఆనగ్న సత్యాన్ని వినగూడదని నాన్న హరిశంకరుకు సైగ చేశారు.

గణేశ్ అంటే నాకు ద్వేషమున్నా, ఈ పాఠశాలగుమస్తా నాకు బాధాకరంగా మారాడు. బాధగా అతణ్ణి అనుసరించాను.

కుచాఫకీర్ ఖానా ఉత్తర భాగం మీదుగా బయటికివచ్చి బాబు హరిశంకర్‌ను అనుసరిస్తూ దంతపు పనివారి వీధి, వేశ్యాబజారు దాటుకొంటూ చాక్లెట్లు అంగళ్ల సందుల్నించి యిరుకుదారిలో నడిచాము. పక్కదారిలో సంతోక్‌సర్ మండపం సమీపంలోని సువాసనల కొలను మీదుగా ముందుకునడవగానే, ఆయనదూరంగా ఉన్న ఎర్రరంగువేసిన

యిళ్లు చూపించాడు అక్కడ 'పండితవైద్యనాధ పాఠశాల, అమృత్‌సర్' అని ఒక బోర్డు వ్రాసివుంది.

పాఠశాల ఆఫీసుకు దగ్గరకు రాగానే 'ఇక్కడ ఉండండి' అని వరండాలో కూచోబెట్టాడు హరిశంకర్.

అక్కడ ప్యూన్ పక్కనే నిలుచొన్నాం. అతడు భుజంపై ఎర్రటి డవాలు తగిలించు కొని బెంచీపైకూచొని ఉన్నాడు. జైలు గదుల్లో ఉన్న క్లాసురూంల్ని మేం పరికించి చూశాం. పండితవైద్యనాధ స్వగృహాన్ని అనుకొని ఖాళీస్థలంలో గదుల్ని క్లాసురూములుగా మార్చి స్కూలుపెట్టారు. మేం ఇంతకుముందు చదువుకొన్న నౌషిరా ప్రాధమిక పాఠశాల శుభ్రమైన గదులతో పోల్చుకొంటే ఇది అధ్వానంగా ఉంది. గణేశ్ కూడా ఇదే అభిప్రాయంతో ఉన్నాడనిపించింది. నన్ను పక్కకు పిలిచి రహస్యంగా సైగలద్వారా యిలాఅన్నాడు

"అదుగో ఎదురుగా ప్రభుత్వ పాఠశాల భవనం చూడు."

ఇటుకరాతివరుసలతో కట్టిన ఆ భవనం గోడ మీద ఉన్న బోర్డు చదివి నా సత్ప్రవర్తనను కాలదోసి అన్నాను:

'నాన్న మనల్ని అందులో ఎందుకు చేర్చలేదు?'

అందుకు సర్వజ్ఞుడైన గణేశ్ అన్నాడు: "నాన్న, పండితరామ్‌నాధ్ కలిసి స్కూలుకు వెళ్లారు. ధనవంతులు బిడ్డలు మాత్రమే ప్రభుత్వ పాఠశాలకు వెళ్లగలరు. ఇక్కడ బాబు హరిశంకర్ మనకు తెలును."

కొంచెం సేపటికి మేనేజర్ గదిలోంచి హరిశంకర్ బయటికి వచ్చాడు. మాకంటె ముందు ఒక ధనికుడైన వ్యాపారిని లోపలికి తీసుకెళ్లాడు. మేం ముందు వచ్చినామనే సంగతి గుర్తుకువచ్చి హరిశంకర్ మా వైపు చూశాడు.

'రండి అబ్బాయిలూ' అన్నాడు స్థిరంగా.

మేనేజరు ఆఫీసు తలుపుకున్న అందమైన తెరనుతొలగించి,

మమ్మల్ని పండిత రామనాథ్ వద్దకు హరిశంకర్ నడిపించుకెళ్లాడు.

పండిట్ అచ్చం మా నాన్నలా ఉన్నాడు. పొడుగాటి మీసాలు అంగ్లేయులసూటు, బాగా గంజిపెట్టిన తలపాగా ఉన్నాయి.

"సైన్యంలో పనిచేసే కుచ్‌ఫకీర్‌ఖానాకు చెందిన లల్లా రాంచంద్ర్ పిల్లలు వీళ్లు. అతను యుద్ధంలోకి వెళ్తున్నాడు..... వీళ్లు నౌషిరా ప్రాథమిక పాఠశాలలో చదువుకొన్నారు."

'చర్చి మిషన్ హైస్కూలు క్రికెట్ జట్టు కెప్టెన్‌గా ఉన్న రాంచంద్ పిల్లలా? అధమజాతి కంసాలి వంశంవాడు, ఆగాఖాని, అతడేగా. అతడు నాకంటె స్కూలులో మూడేళ్లు సీనియర్. అయితే నేను అతడితో ఆడాను.'

'అయితే మీరంతా క్రికెట్ కుటుంబం వాళ్లు' అన్నాడు బాబూ హరిశంకర్, మా అధమ జాతి గురించి మేనేజర్ దృష్టిలో ఉన్న అపోహ పోగొడదామని. వీళ్ల పెద్దన్న హరీష్‌చందర్ మనస్కూలు జట్టులో ఆడాడు. మీ చిన్న తమ్ముడు బన్వారి, అతడు ఒకే తరగతిలో చదివారు. అతను యిప్పుడు లాహోరు సెంట్రల్ జైలులో అసిస్టెంట్ జైలరుగా పనిచేస్తున్నాడు. వాళ్లిప్పుడు ఆగాఖానీమతాన్ని వదలి ఆర్యసమాజంలో చేరారు. మనస్కూలును 'ఈటన్'లా చేయాలని అనుకొంటున్నాం గాబట్టి, ఆటగాడి పిల్లల్ని మనస్కూలులో చేర్చుకొందాం."

నాకప్పుడు స్ఫురణకు వచ్చింది. ఉదయం ఈ రెండు గొంతులు ఆగాఖానీ మతాన్ని గురించి ఎంత అల్పంగా అనుకొన్నారో, ఆ మతం వెనక ఉన్న కళంకము, నాన్న కంసాలి సోదరులందరూ పొందుతున్న ఆందోళన అర్థమైంది. అంతకుముందురోజు హిందూ బ్రాహ్మణసమాజం వారి అపోహలను గూర్చి ఆలోచించడము, బాబు హరిశంకర్‌ని సహాయం చేయమని అడగటమూ గుర్తుకొచ్చాయి.

'రాంచంద్ తమ్ముడు యింకా కంసాలిపనిచేస్తున్నాడుగా' మన స్కూలుకు చందా విషయం ఏంటి? వాళ్లనాన్నను అడిగారా?' అన్నాడు పండిత రామ్‌నాథ్.

బాబూ హరిశంకర్ ఏమి మాట్లాడలేదు.

ఒక్క క్షణం ఆగి పండిత రామ్‌నాథ్ అన్నారు "అబ్బాయిలూ! మంచి క్రికెట్ ఆటగాళ్లయిన మీనాన్న, అన్నమీద గౌరవంతో మిమ్మల్ని చేర్చుకొంటున్నాం.... మీరు మీ కంసాలి వారి బిడ్డలకు దూరంగా ఉండి, కష్టపడి చదివి మన పాఠశాలకు పేరు తీసుకరండి. అమృతసర్ లో దీనికి మించిన స్కూలులేదు."

"వాళ్లు కంటోన్మెంటులో ఉండి వచ్చారు పండిట్‌జీ!" అన్నాడు బాబు హరిశంకర్ వినయంగా. "వాళ్లు ఆ మురికి కంసాలి పిల్లల్తో స్నేహం చెయ్యరు. ఇప్పుడొకటే సమస్య. ఈ పిల్లల్లో పెద్దవాడైన గణేశ్ చంద్ర, నాల్గో తరగతి నౌషిరాలో చదివాడు. అక్కడ ఏడో తర గతి వరకు ఇంగ్లీషులేదు. ఇక్కడ మనం నాల్గోతరగతినుంచి ఇంగ్లీషు మొదలెడతాం..."

'అయితే'

'వాడు ఇంగ్లీషుకు వేరేగా ట్యూషన్ పెట్టించుకొని కష్టపడి నాల్గో తరగతిలో చదవని ఇంగ్లీషు చదువుతాడు. అందువల్ల ఐదులో వీలైతే చేర్చుకోండని వాళ్లనాన్న భరోసాయిచ్చారు.'

"బాబూ హరిశంకర్!" పండితరాంనాథ్ మీసాలు సవరించు కొంటూ మధ్యలో అడ్డుపడుతూ అన్నారు: " మన స్కూలు ప్రమాణా లను మనం అలా తగ్గించబోవడం లేదు. ఒక సంవత్సరంలో చదవని పాఠాలు ఒక్క నెలలో నేర్చుకోలేడు. నీ మొహమాటానికివాళ్ళ నాన్న వద్ద చందానేను అడగటం లేదు."

"ఏదో ప్రత్యేకంగా పండిట్‌జీ మీరీ అబ్బాయిని చేర్చుకోండి." బాబూ హరిశంకర్ ప్రాధేయపూర్వకంగా అన్నాడు.

"నేను ఇంట్లో ఇంగ్లీషు నేర్చుకొంటున్నాను " భయపడుతూ వణుకుతూ ధైర్యంగా అన్నాడు గణేశ్.

'నువు చెప్పింది నమ్ముతున్నాను బాబూ! కాని మన స్కూళ్ల ఇన్‌స్పెక్టర్ మెర్సిడన్ గారిని వొప్పించడం ఎలా? స్వంతంగా చదు

వుకోగలడని ఎలా చెప్పగలం. చట్టానికి వ్యతిరేకంగా వెళితే ప్రభుత్వం మాకిచ్చే నిధులు కోత కోస్తుంది.'

'అయితే నేను ఒక సంవత్సరం నష్టపోతాను.' కళ్ళ నీళ్లు పెట్టు కొని ఏడుపు మొగంతో అన్నారు గణేశ్.

'బాబూ. ఒక్క సంవత్సరం వెనకబడ్డా నువ్వు అన్నిటిలో 'చక్క' గా తయారవుతావు. మీరు వెనకబడిన ప్రాంతంలోని పాఠశాలనుండి యిక్కడ చేర్చు కొన్నందుకు సంతోషపడాలి' అన్నారు సలహాయిస్తున్న ట్లుగా పండిత రామనాథ్.

'కాని ఈ బిడ్డ కది ఎంత కష్టం!' అన్నారు మేం మాట్లాడుకొం టున్నప్పుడు ఆ గదిలోకివచ్చిన దయార్ద్ర హృదయుడైన ఒక పొట్టివ్యక్తి 'అన్ని రాష్ట్రాలలో పాఠ్యభాగాలు ఒకే మూసలో ఉండాలి. మనం అతణ్ణి నాలుగో తరగతిలోనే ఉంచితే, ఈ సంవత్సరానికి ఫీజు మాఫీచెయ్యాలి'

"ఇప్పుడు హెడ్మాష్టర్ కిషన్‌సింగ్ గారు చెప్పిన మాటలు మీ పిసినిగొట్టు నాన్నకు సంతోషం కలిగించాలి." హరిశంకర్ అన్నాడు.

'ఆ విషయం ఆలోచించడానికి సిద్ధంగా ఉన్నాను.' మేనేజర్ అన్నాడు.

ఈ మాఫీ యిచ్చినప్పటికీ గణేష్ మొగం వివర్ణమైంది. వాడి పాలిపోయిన బుగ్గలపై కన్నీళ్లు ధారగా కారాయి.

నా గుండె ఏదో మధురానుభూతిలో పొంగిపోయింది. గణేష్ పట్ల సానుభూతి, నాలోని అహంకారస్వభావానికి సంతోషం కలిగించే విష యాలు, నాలో ఏదో తీరనికోరిక, భౌతికమైన విలాసము, ప్రదర్శనా ధోరణి నన్ను పెనగొన్నాయి.

"ఇంక రా బాబు! గణేశ్" బాబు హరిశంకర్ ఓదార్పు ధోరణిలో అన్నాడు. "నేను మీ నాన్నను మళ్లీ వచ్చి కలుస్తానని చెప్పండి"

ఇవేవీ గణేష్ నిశ్శబ్దంగా రాలుస్తున్న కన్నీటిని ఆపలేదు. బాబు హరిశంకర్ మాటలుగాని, నా వేలు పట్టుకోమన్న నా మాటలుగాని

అతనికి నచ్చలేదు. నా చేతిని విసిరికొడుతూ, పెద్దగా ఏడుస్తూ అరిచాడు: 'నాకు తెలుసు. నీతోబాటు నేనూ ఒకే క్లాసులో కూచొంటానంటే నీ కెంత సంతోషంగా ఉందో! నేను చూపుతాను చూసుకో.... నీకే తెలుస్తుంది.' నాకు దూరంగా గబగబా నడుచుకొంటూ నన్ను వదలి ముందుకు దూసుకెళ్లాడు.

నావేలిని పట్టుకోమని నేను ఆప్యాయంగా అన్నమాటలు వాడు నిర్లక్ష్యంగా త్రోసిపుచ్చిన విధానం నా గుండెకు రంపకోత అయింది. ఈ ఊళ్లో ఇంతకు ముందు హరీష్ పెళ్లికి వచ్చినప్పుడు తప్పిపోయినట్లు మళ్లీ జరుగుతుందేమోనని భయంగానూ ఉంది.

హఠాత్తుగా నేను ఒంటరివాణ్ణిగాను, వ్యర్థుణ్ణిగాను అయిపోయినట్లు అనిపించింది. నేను వృద్ధిలోకి వచ్చినా, మా అమ్మ, నాన్న , ప్రతాప్ బాబాయి, దేవకిపిన్ని గారాబంచేసి నన్ను చెడగొట్టారు. వాడిమీగ ప్రతీకార భావం ఉన్నందుకు మనసులో బాధపడ్డా, గణేష్‌ను అసహ్యించుకొన్నాను.

ఎడం చేతితో కన్నీళ్లు తుడుచుకొంటూ వాడివెంబడి పరుగెత్తాను.

కాని, వాడు నాకంటె చాలా ముందు కెళ్లాడు.

నా చుట్టూవున్న మేడలు తలకిందులయినట్లు కనిపిస్తున్నాయి. ప్రపంచం బ్రద్దలయినట్లు, నేను ఈ విశ్వాంతరాళంలో పాదరేణువును మాత్రమే ననిపించింది. వాసనలుగుబాళించే సంతోక్‌సర్‌చెరువు భ్రమించిన నా చూపులకు భయంకరంగా పెరిగిపోతున్నట్లు కనిపించింది. ఆ చెరువు అడుగు భాగంలో మహావృషభం ఉందనీ, దాని కొమ్ములపై భూమిపట్టు తప్పకుండా నిలబడివుందనీ అమ్మ చెప్పింది... దాని కింద నరకం ఉంది. అక్కడ మానవుల పాపాలను శిక్షించే యమధర్మరాజు కూచొని ఉంటాడు. నేను చెరువులో పడిపోతే, మునిగిపోయి సరాసరి మృత్యుదేవతను చేరుకొంటాను. నేను గణేష్‌ను నీచంగా చూడటానికి, యితర పాపాలకు యముడు నన్ను శిక్షిస్తాడు.

పంజాబ్ విశ్వవిద్యాలయ నిబంధనలకు వ్యతిరేకంగా చేసేందుకు వీలులేదనీ, వాళ్ల నాన్న ఆంగ్లేయుల సేవలో పనిచేస్తున్నందుకు గణేష్ చదువు ఒక సంవత్సరం త్యాగం చేయవలసిందేననీ, నాన్న అమ్మతో

మేం వినేటట్లు చెప్పారు. కుటుంబం ఒకచోట స్థిరపడే అవకాశాన్ని సైన్యం యివ్వలేదు. ఒక కంటోన్మెంటునుండి మరొకచోటికి మార్చి నప్పుడు పాఠశాలలు మారుతూ హరీష్ ఎలానో మెట్రిక్యులేషన్ పరీక్ష అయిందనిపించాడు. కాబట్టి వీళ్లు కూడా ఎలానో ప్రవేశపరీక్ష పూర్తి చెయ్యాలి. ఎక్కడా తప్పకుండా ఉండాలి.

దేవదత్త దగ్గర ఇంగ్లీషు పాఠాలు నేర్చుకొని గణేష్ ఐదో తరగతిలో ఎందుకు చేరకూడదో అమ్మకు అర్థంకాలేదు. ఎలానో నాన్న చెప్పిన మాటలకు అంగీకరించింది. 'హోంవర్కు చేసేటప్పుడు నాషిరాలో గణేష్ ఎన్నిసార్లు తన్నులు తిన్నాడో లెక్కలేదు. బుల్లిగాడు దొంగవెధవ అయినా తెలివితేటలున్నాయి' అంది అమ్మ.

"అమ్మా! నా పేరు ఇక మీదట 'బుల్లీ'కాదు" అంటూ బుంగ మూతి పెట్టి 'ఇంటికి వస్తూ నన్ను ఒక్కణ్ణే వదిలేసివచ్చినందుకు గణేశ్‌ను మందలించండి. నేను దారి తప్పిగాని, 'సంతోక్సర్' చెరువులో పడిగాని వుందును.'

'అరే గణేశ్! తమ్ముణ్ణి ఎందుకు వదిలేసి వచ్చావురా?' అడిగాడు నాన్న.

పాఠాలు చదువు కోక పోతే నాన్న వాణ్ణి కొట్టేటప్పుడు వాడు చెంపకు చేయి పెట్టుకున్నట్టుగా ఇప్పుడుకూడా అలానే చెంపకు చేయి అడ్డంపెట్టు కున్నాడు.

'వాణ్ణి కొట్టకండి. ఇవాళ ముందరనే వాడికి అదృష్టం కలిసి రాలేదు. వాడి శని విరగడై మంచి రోజులు వచ్చేందుకు శనిదేవ తకు చమురు పోస్తాను. వాడు మంగళవారం పుట్టాడు వాడి మొహం చూడండి దురదృష్టానికి సూచనగా ఎలా మంగు పట్టిందో' అంది అమ్మ.

నాన్న గొంతెత్తి అరవటానికి, అమ్మ వాణ్ణి వెనకేసుకొని వచ్చి సానుభుతిగా మాట్లాడి నందుకు గణేశ్ వెక్కి వెక్కి ఏడ్వడం మొదలు పెట్టాడు. వాడు మళ్ళీ ఏడవటానికి నేను కారణమైనందుకు నేను బాధపడ్డాను మా అన్న ఇక మీదట నన్ను ఎప్పటికీ ద్వేషిస్తాడు గదా అని భయపడ్డాను.

పాఠశాల గేటు బయట నేను చెయ్యి ఆసరాగా ఇస్తే వద్దని నన్ను వదిలేసి ఏడిపించిన క్షణం నుంచీ గణేశ్‌పట్ల నా ద్వేషం ప్రతీకార వాంఛగా మారి నాన్నకు చాడీలు ఎక్కువ చెప్పసాగాను. ఇదే అలాంటి వాటికి తగిన సమయం అని మళ్ళీ అన్నాను.

'నాన్నా! నువ్వు వూరికి వెళ్ళేముందు నన్ను వాడు స్కూలు నుంచి వచ్చేటప్పుడు వదిలిపెట్టి రాకూడదని చెప్పు. వీడు 'లల్లా అచర్జ మల్' మనుమడు బిహారీతో అప్పుడే స్నేహం మొదలు పెట్టాడు. ఇక మీదట నన్ను నిర్లక్ష్యం చేస్తాడు.'

'ఒరేయ్! ఈ క్షణంలో నీది పైచేయి. నీవు పాసయ్యావు. వాడు ఎలాగైతేనేం తప్పిన వాడి కింద లెఖ్ఖ. నీ అమాయకపు బుల్లి బుల్లి మాటలు అలావుంచు నువ్వు దొంగవెధవవని నాకు తెలుసు.' అన్నాడు నాన్న మందహాసం చేస్తూ.

'మీరు చెప్పండి. రోజూ బజారులో కొనుక్కునేందుకు పైసలు ఇవ్వమని నన్ను అడగవద్దని చెప్పండి. ఎప్పుడూ దేవకి పిన్ని వళ్ళో కూచుని వూళ్ళోవున్న తాండ్ర తినవద్దని చెప్పండి. ఆవిడ పిల్లలకు ఇవన్నీ పెట్టి మంచి చేసుకుంటుంది.'

నేను అమ్మ తిట్లకు చలించలేదు. గణేశ్ రహస్యంగా నాపట్ల శత్రుత్వం చూపగలడని గ్రహించాను. కానీ అవేవీ పట్టించు కోనట్లుగా ధైర్యంగా తిరిగసాగాడు.

'నాన్నా! మమ్మల్ని దేవదత్త బాబాయి దగ్గరకు తీసుకెళ్ళి మాకు చదువు సంధ్యలపట్ల ఎక్కువ శ్రద్ధవుందని, మా నాన్నకన్నా ఎక్కువ చదువుకోవాలని చెప్పు.'

'సరే అయితే. ఇప్పుడే రండి నాకు తర్వాత తీరదు. గణేశ్! పద! ముఖం కడుక్కొని రా! మీరిద్దరూ కుటుంబ గౌరవం పెంచాలని కోరుకుంటున్నాను. మనం ఈ కంసాలుల కన్నా గొప్ప వాళ్ళం అని గుర్తుచుకోండి. మీరు మెట్రిక్ పాసైన తర్వాత మంచి ప్రభుత్వోద్యోగాలు సంపాదించాలి.'

'వాడికింకా నాలుగేళ్లు. ఐదవ ఏడు వస్తే అప్పుడు చూద్దాం. వాడి కిప్పుడు ఆడు కునేందుకు తోడుగా చిన్నారి కౌసల్య దొరికింది.'

'మీరు మరీ ఆ పిల్లపట్ల మమకారం పెంచుకోవద్దు. ఎంతచేసినా ఆ పిల్ల చదువురాని కంసాలి ప్రతాప్ కూతురు.' నిర్లక్ష్యంగా అంది అమ్మ.

'నీకు ఆడ పిల్ల లేదని ఆ పిల్లంటే నీకు అసూయ.'— నాన్న ఎగతాళిగా అన్నాడు.

'అయ్యో! నాకంత అదృష్టం కూడానా. ఆడు నెమలిలాంటి నాచిట్టి తల్లి బతికి వుంటే పెళ్ళి అయి మనుమలు పుట్టి వుందురు ఇప్పుడు ఈ చప్పిడి ముక్కు కోడలు ద్రౌపది వుంది. నా కడుపు ఎప్పుడూ పండదు.'

అప్పటికే నాన్న లేచి బయలు దేరారు. గణేశ్ వినయంగా సిద్ధ మైతే వాడివేలు నాన్న పట్టుకొని ముందుకు నడిచాడు. నేను నాన్న రెండవ చేయి పట్టుకొన్నా. ప్రభుత్వోద్యోగాలలో చేరాలనే సంకల్పానికి ఆయన మద్దత్తు ఇచ్చినందుకు సంతోషంగా నా శరీరం గర్వంతోను, నా ముఖం స్ఫ్వాతిశయంతోను పొంగి పోతున్నాయి.

* * *

'ఏకాక్షి అయిన మహారాజా రంజిత్ సింగ్ పాలన నాటిది ఈ ఇల్లు.' చారిత్రక విజ్ఞానం గూర్చి నాన్నకు తెలియ జేద్దామనుకున్నాను.

'ఫకీర్‌షాబుద్దీన్ ఈ యిల్లు కట్టించాడు. ఇప్పుడు దేవదత్త బాబాయి అందులో వుంటున్నాడు 'అన్నాను

'ఆఁ' తలవూపాడు నాన్న.

'నాన్నా! దేవదత్త, భగవాన్‌దత్త బాబాయిలు సారాయి అంగడి యింకా నడుపుతున్నారా? అక్కడికేగా హరియా, అనంత, ఉత్తమ సింగు, పెషావరీలతో కలిసి ప్రతాప్ బాబాయి తాగటానికి వెళతాడు.'

ఆ మాటలకు నాన్న నవ్వి తిరుగులేని విధంగా నానోరు మూయిం చారు.

'పెద్ద వాళ్ల మాటలు మీరు విన్నా పట్టించుకోకూడదు. దేవదత్త, భగవాన్ దత్త బాబాయిలు బాగా చదువుకున్న వాళ్ళు. ఆర్యసమాజం సభ్యులు. వాళ్ళు సారాయి అంగడి నడపరు. మన కంసాలి సోదరు లందరికన్నా వాళ్ళు గొప్పవాళ్ళు. వాళ్ళు పుట్టింది 'గౌడ ' కులంలో అయినా ఆర్య సమాజం ద్వారా బాగా చదువుకొని పండితులయ్యారు. వాళ్ళపట్ల గౌరవంగా వుండటం నేర్చుకో, వెధవ చేష్టలు చెయ్యకు.'

మేము సన్న సందులో నుంచి రాజమార్గంలోకి ప్రవేశించి ఫకీర్ ఖానా అనబడే ఆ బంగళా ముందు భాగానికి చేరుకున్నాం. ఆ బంగళా మూలన వున్న వీధి బావిలో నుంచి ఆ సందులోని ఆడవాళ్ళు నీళ్ళు తోడుకుని గుడ్డలుతుకు తున్నారు. దారిన వెళుతూ ఆ విశాల మైన బంగళా చూస్తూపోయిన నాకు అందులో ప్రవేశించటం ఉత్సాహం కలిగించింది.

అక్కడ నేలమీద 'పచ్చీసు' ఆడుతూ నాలుగుమూలలా దేవదత్త బాబాయి, భగవాన్ దత్త బాబాయి, గణేశ్ వయస్సులో వున్న మరొక అమ్మాయి అబ్బాయి, నాలుగు వైపులా కూచుని వున్నారు. అందులో ఒకరు 'తివాచీ'పై పావులు విసిరారు. మేము లోపలకు వెళ్ళగానే ఆట ఆపారు. తన ప్రక్కనే వున్న ఆసనంపై తెల్లగా పరచిన పరుపుపై దేవదత్త బాబాయి నాన్నను కూచోమన్నారు. ఆమాట అంటూ పంకా తిరిగేందుకు తీగలాగారు

'ఇతను దేవరాజు. ఈమె సుశీల. మీ చిన్న చెల్లెలు ధనలక్ష్మి పిల్లలు కదూ' అంటూ తనవూహ నిజమో కాదో అన్నట్లుగా ప్రశ్నిం చారు నాన్న 'హరీష్ పెండ్లికి పోయిన సంవత్సరం నేను వచ్చినపుడు చూశాను. అప్పుడే ఎంత పెరిగి పోయారు! ఇద్దరూ లావెక్కలేదు సన్నగానే వున్నారు.'

'వాళ్ళు కష్టపడి చదువు తున్నారు.' అన్నారు దేవదత్తబాబాయి. నేను దేవరాజ్‌ను, సుశీలను తటుక్కున చూశాను. నిరాదరణ స్వభావం కలిగినా ఆమె కోల మొహం నాకు నచ్చింది. అబ్బాయి గుండ్రటి మొహంపై స్ఫోటకం మచ్చలు చూడగానే నాకు అసహ్యం వేసింది.

'మీ మేనల్లుడు, మేనకోడలు మా యిద్దరి పిల్లలు ఈడువారు. కాబట్టి సరిహద్దుల నుండి వచ్చిన ఈ అనాగరికులు మీ పిల్లలతో ఆడు కుంటారు. ఆ కంసాలి పిల్లలతో తిరిగి చెడకుండా వుంటారు.'

'వాళ్ళతో ఆడు కోవడమే కాకుండా కలిసి చదువుకొని మన పురా తన సంస్కృతిని గూర్చి నేర్చుకుంటారు గూడా' అన్నారు భగవాన్ దత్తబాబాయి మధ్యలో అడ్డుపడుతూ.

వీళ్ళను మీ చేతుల్లో పెడుతున్నాను. మీ యిష్టం. పండిత వైద్య నాథ పాఠశాలలో ఈరోజే చేర్పించాను. గణేశ్ మరో సంవత్సరం నాల్గోతరగతి చదవాల్సి వచ్చింది. అక్కడ నౌషిరా కంటోన్‌మెంటులో ఇంగ్లీషు చదువు కోలేదు

ఈ మాటలు వినగానే గణేశ్ ఏడుపు లంఘించుకున్నాడు.

'ధైర్యంగా వుండాలి బాబూ! నేను నీకు బాగా తర్ఫీదు ఇస్తాను. నీవు క్లాసులో ఫస్టు వస్తావు. నేను ఎంతో కష్టపడి చదివినా M.A లో రెండుసార్లు పల్టీలు కొట్టాను ' అన్నారు దేవదత్త బాబాయి గణేశ్‌ను ఓదారుస్తూ.

'అః! దేవదత్తగారూ ఎలా జరిగింది.'

'లాహోరులో ప్రభుత్వ కళాశాలలో లెక్కల ప్రొఫసర్ ఆంగ్లేయుడు దుష్టుడొకడుండేవాడు. అతనికి మేము ఆర్యసమాజంలో వున్నామని తెలుసు. అప్పటి 'వైస్రాయ్' హోర్డింగు ప్రభువుపై బాంబు విసిరినది మొదలు ఆంగ్లేయులకు మా సమాజం వారిపై అనుమానం. దీనికంత టికీ కారణం విప్లవకారులు ఆర్యసమాజంవాళ్ళు కావటమే. దానికి తోడు స్వదేశీపాలన కావాలని కోరే లాలా లజపతిరాయ్ మాలో ఒకడని నీకు తెలుసు.' భగవాన్ దత్త బాబాయి చెప్పుకుంటూ పోయాడు.

'నన్ను కూడా అనుమానించారు. నౌషిరాలో ఆర్యసమాజం అధ్యక్ష పదవికి రాజీనామా చేయవలసి వచ్చింది. అలా చేయకపోతే సైనిక కోర్టులో నాకు శిక్ష విధిస్తామని మా కల్నల్ చెప్పాడు.' అన్నారు నాన్న.

ఈ సుదీర్ఘ సంభాషణా కాలంలో గణేశ్ ఏడుపు తగ్గింది. అది చూసి దేవదత్త బాబాయి వాడిని, ప్రక్కనే కూర్చున్న మేనల్లుడు దేవ రాజును భుజంమీద తట్టాడు.

నన్ను ఇంతసేపూ పట్టించుకోకుండా గణేశ్‌పట్ల ఎక్కువ శ్రద్ధ చూపుతున్నందుకు నాకు అసూయవేసింది.

'బాబాయ్! పండిత రామనాధ్‌గారి వుద్దేశ్యంలో వీడు ఒక్క ఇంగ్లీషు ముక్క కూడా రాని చవటాయ్. నేను ఇంగ్లీషులో మొదటి పుస్తకం పూర్తి చేశాను. గుడ్ మార్నింగ్, గుడ్‌నైట్ అనగలను.' అన్నాను దేవదత్తతో.

'లెక్కల్లో వాడు నీకంటె మెరుగు. పెద్ద వాడిపట్ల నువ్వు అగౌ రవంగా మాట్లాడకు.' నాన్న నన్ను మందలించాడు.

'నువ్వుగాని, నేనుగాని పెద్దలపట్ల అగౌరవం చూపకూడదు' అన్నాడు దేవరాజ్ అనటంతో నా ముఖం కందగడ్డలా అయింది.

అంతవరకు మౌనంగా కూర్చున్న చిన్నపిల్ల సుశీల నాతల నిము రుతూ 'నువ్వు వచ్చి నాతో కూచో, దేవరాజ్ నీమీద ఎలా చెయి చేసు కుంటాడో నేను చూపిస్తాను' అంటూ నన్ను ఆదుకోవడానికి వచ్చిందా అమ్మాయి.

'పాపా! వాణ్ణి చెడగొట్టకు సుశీలారాణీ! వాడి ముద్దుపేరు 'బుర్లి' వాడు దానికి తగ్గట్టుగా ప్రవర్తిస్తాడు' అన్నారు నాన్న.

'మా యింట్లో ఒకళ్ళతో ఒకళ్ళు తగాదాపడితే ఒకపైసా తగవు పెట్టుకొన్నవాడు జరిమానా కట్టాలి అందువల్ల తగవులే లేవు' అన్నారు దేవదత్త బాబాయి.

'బాబూ! నీవు నాతోకూడారా. మనము మేడమీదికి వెళ్ళి నా బొమ్మలతో ఆడు కుందాం' అని పిలిచింది సుశీలా రాణి.

ఆవిడ అందించిన చేయిపుచ్చుకొని సుశీలారాణితో ముంగిట లోప లికి వెళ్లి, మెట్లెక్కి ప్రాసాదం లోపలికెళ్లాను. నా సమవయస్కులైన

పిల్లల మధ్య నాలో పెరిగిన అహంభావం పెచ్చుపెరిగి ఆరోజు మొదలు ఒంటరితనానికి ఓదార్పు లభించింది. స్త్రీల అనురాగంలో నా ప్రియు రాలిని అన్వేషిస్తూ గడపసాగాను. సుశీల చుట్టూ విరజిమ్మిన గులాబీల సువాసనలకోసం ఎన్నోఏళ్లు తపించాను.

# 5

నాన్న యుద్ధానికి వెళ్ళిన తర్వాత హటాత్తుగా ఒంటరివాడినై పోయినట్లు, ఏదో పోగొట్టుకున్నట్టూ భావించసాగాను. మంగళ వారా లలో అమ్మ పూజ గదిలో అలమరలో ప్రమిదలో నునె పోసి దీపం వెలిగించటం, మా కులదైవానికి పూజలు చేయటం చూసినప్పటి నుండి నాకు రాత్రులు నిద్ర పట్టేది కాదు. పగటి పూట నా ఆలోచనలు చెదిరి పోయేవి. మా పక్కింటి ప్రభా వూరగాయల ఫ్యాక్టరీలో ఆపిల్ పండ్ల తొక్కలు తీసి జీవించే మా ఎదురింటి మధ్య వయస్కురాలైన సింధీ వనిత లచ్చి ఉండేది. ఆవిడతో నా కిష్టమైన దేవకిపిన్ని అనురాగ జీవితం వారి మధ్య వింతలు విపరీతాలు అమ్మ వ్యర్థ ప్రసంగంలో వినిపించేది. దత్తా సోదరుల పెద్ద బంగళాలో ఒక మూల నుంచి వూరగాయల ఫ్యాక్టరీ మేడ మీదికి నడుస్తూ అప్పుడప్పుడూ కనిపించే ఆస్థాన గాయకురాలు నవాబ్జాను అత్తతో అమ్మ అప్పుడప్పుడూ మాట్లాడుతుంటే నేను పొంచి వింటుండే వాడిని.

నౌషిరా కంటోన్ మెంటులో వుండగా సిపాయిలందరి చేత 'చిచ్చర పిడుగు' అనిపించుకున్న నా శక్తి సామర్థ్యాలు ఈ చిన్న సందు లోని ప్రపంచానికి పరిమితమై పోయి నా ఒళ్ళు పెరగటానికి దోహదం చెయ్యలేక పోతున్నాయేమో అనిపించింది. లేదా పెద్దవాళ్ళలాగా అన్ని విషయాలూ తెలుసుకునేందుకు నేను పొడుగు పెరిగి బలంగా తయారై అన్ని విషయాలూ తొందరగా తెలుసుకోవాలంటే ప్రపంచంలో నా చిన్న తనం అడ్డు వచ్చిందేమో అనుకోవటం కారణం కావచ్చు. పిల్లలు పొడై

పోతారని యింట్లో పెద్దవాళ్ళు, ఉపాధ్యాయులు ఏ విషయాలైతే తెలుసుకోకూడదని దాస్తారో వాటిగూర్చి తెలుసుకోవటం మొదలెట్టాను. నాలోని చిన్నతనపు అమాయకత్వం మాయం కాసాగింది.

వీటన్నిటికి మించి అమ్మ కోపతాపాల సమయంలో వ్యర్థప్రసంగాలు చేస్తూ భయపెట్టిన మాటలు నాకు మనోవేదన కలిగించాయి. ఆడవాళ్ళ ప్రసంగంలో ఆమె మా దేవకి పిన్నిలా తాంబూలం సేవిస్తూ సిగరెట్లు తాగుతూ, మద్యంసేవిస్తూ చెడ్డపనులు చేసే ఆడవారికి తగిన ఫలితం కలుగుతుందని చెప్పేది.

దేవకిపిన్ని సువాసనలంటే నాకు యిష్టంగనుక నా నిర్లక్ష్య స్వభావము, అపనమ్మకము, అవిధేయత లోలోపల ఆత్మపరిశీలన చేసుకోసాగాయి. దైవశక్తులు, రాక్షసులు, దయ్యాలు అంటే నాలో ఉన్న భయాందోళనలు పెరగసాగాయి. దేవకిపిన్నిపై నాకుగల మమకారం దెబ్బతినడంవల్ల అమ్మపట్ల నా సహజ మృదుత్వానికి అడ్డుకట్టలు ఏర్పాటైనాయి. ఇంట్లో ప్రతిదానికి కోపపడటం మొదలెట్టాను. నాలో మొండితనం, అహంభావనలు రెచ్చగొట్టబడి, దైవత్వము, ప్రార్థనా స్వభావము, సద్గుణసంపత్తిగల పెద్దలను గౌరవించడానికి మనస్కరించలేదు.

అమృతసర్ 'పాలసముద్రం'లా నాకంటికి కనిపించలేదు. (పచ్చటి నురుగు ఆ పవిత్రమైన చెరువుపై తేలియాడుచుండగా, స్వర్ణదేవాలయం దానిలో ఉండటం నాకు ఏహ్యభావం కలిగించాయి). రాక్షసులు, క్రూర మృగాలు, దివ్యపూజలు మోహనాకారులు నివసించే 'భయంకర కాళరాత్రి నగరం'గా అమృతసర్ నాకు రోతపుట్టించింది. అమృతసర్‌నుగూర్చిన చెడు సంభాషణవల్ల, నాకు తెలిసిన అసహ్యకరమైన చెడు వార్తలు వినడంవల్ల నా బాల్యత్వపు అమాయకత దూరం కాసాగింది.

* * *

'అమ్మా! నా చెవులు పిండకు. కళ్లల్లోకి సబ్బునురగ పోసీకు... నీ చేతులు వికారంగా ఉన్నాయి. నువ్వు నన్ను ముట్టుకోకు... నాకు స్నానం చేయించడం యింకచాలు' అని అరిచాను.

'బాబూ! నీకు బాగా తలకుపోయాలి. పేలుపట్టి ఉన్నాయి.

దుమ్ముమ్మవల్ల కావచ్చు. లేదా అచర్జా మనవడు బిహారీనుండి అయినా వచ్చి ఉంటాయి. వాడితో నువ్వు యికమీదట ఆడుకోడానికి వెళ్లవద్దు.' అంది అమ్మ.

'బిహారీ గణేష్‌కు స్నేహితుడు నాకు కాదు... కొంచెం నెమ్మదిగా. నాకు తలమీద ముందు నీళ్లుపోయ్. అమ్మ! కళ్లు తుడువు. మంటలు పుడుతున్నాయ్.'

ఆమె నా మాటలు పట్టించుకోకుండా పరధ్యానంలో పడిపోయింది. తలకు పోస్తూ మధ్యమధ్యలో 'పీర్ షా, పీర్ షా, ఆగాఖాన్, శనిదేవతా! మా యింట్లో అందరికీ శుభం కలిగించు' అంటోంది.

అమ్మ నా ముందుపెట్టిన మాంసంకూర, చపాతీలు, కూర— నాకు రుచించలేదని చెప్పినపుడు నా నుదురు పట్టుకొని జ్వరంగా ఉందని గ్రహించింది. నేను చేతులు విదిలించి, అవులించినపుడు మొదటి అంతస్తులో పెద్దపరుపుమీద పడుకోబెట్టి నాకు జ్వరం తగ్గేలా మర్దన చేయసాగింది.

'నేను దేవకి పిన్నిని చూచివస్తాను' అన్నాను కొంచెంసేపాగి.

'బాబూ! నీకు జ్వరంగా వుంది. పడుకో' అంటూ దేవకిపిన్ని తన ప్రియులతో సరసాలాడడం గురించి గొణగ సాగింది. మళ్ళీ 'ఓ భగవంతుడా! వీడి ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడు. దుష్టశక్తుల్ని దూరంగా వుంచు. ఎవరో చేసిన తప్పిదాలకు నాబిడ్డలను బాధపెట్టకు' అని ప్రార్థించ సాగింది.

నేను ఆదేవుడనే మాటను ద్వేషిస్తూ అతణ్ణి ప్రార్థించే అమ్మను అసహ్యించుకున్నాను. అంతెందుకు నాన్న నాకు భగవంతుడు. నాపేరు గానంచేస్తూ నాన్న పాడిన పాటకు నేను ఆయనను ఆరాధించడం మొదలు పెట్టాను. ఇప్పుడు ఆయన బహుశా యుద్ధం మధ్యలో వుంటారు. ఆయన యుద్ధరంగంలో చనిపోయినట్లుగా వూహించుకొని ఆయన కోసం ఏడుద్దామను కున్నాను. అమ్మ వెళ్ళిపోవడంకోసం ఆగాను.

ఆమె వంట యింట్లోకి వెళ్ళగానే నాన్న ఫోటోముందు వెళ్ళి

నుంచున్నాను. జార్జి ప్రభువు, మేరీరాణి చిత్రపటాల క్రింద చెక్కపై ఫోటోలో వున్న కొంటెచూపులు చూస్తూ మీసాలు లేకుండా 'టై' కట్టుకొని 'సూటు' వేసుకొని వున్నారు.

'బాబూ! మీ నాన్న త్వరగా తిరిగి వస్తారు. నీవువెళ్ళి పడుకో' అంది అమ్మ నేనలా నిలబడి వుంటే గమనించి. నన్ను పక్కపై పడు కోబెట్టి నాతల నిమురుతూ తనపైట చెంగుతో నా ముఖం కప్పి యిలా అంది 'చనిపోయిన మీ నాయనమ్మ యింకా నీచుట్టూ భ్రమగా తిరుగుతున్నట్టుంది. ఆవిడవచ్చి నిన్ను తీసుకొని వెళ్ళనీయను.'

సానుభూతిగా నాకళ్ళు చెమర్చాయి ముఖ్యంగా దత్తా బాబాయి యింట్లో నాకు ప్రియమైన సుశీలా రాణితో గణేశ్ హాయిగా ఆడుకుంటు న్నాడని, దేవకి పిన్ని యింట్లో చెల్లెలు కౌసల్యతో శివ ఆడుకుంటున్నాడని తెలిసి నాకు బాధవేసింది.

* * *

తల తిరుగుతూ ఏవో కలల మధ్య నేను వూగిసలాడు తున్నాను. మా యింటి పురోహితుడు పండిత భోలానాథ్ ఆయన భార్య మా యింటికి వచ్చిన సంగతి నాకు మగతగా గుర్తుంది. మా నాయనమ్మ, తాత స్మారకార్థం వాళ్ళను భోజనాలకు పిలిచింది అమ్మ. ఒంటినిండా గట్టి దుప్పటి కప్పుకొని కునికిపాటుపడుతూ ముందుకు ఒరుగుతూ చేతులు దెబ్బ తగిలితే మళ్ళీ దుప్పటి కప్పుకుంటున్నాను. చెమట బాగా పట్టింది.

'వాడికి ఆరోగ్యం సరిగా లేదు.' పితృదేవతల రూపంలో కనిపి స్తున్న నానమ్మ, తాతయ్యలతో మాట్లాడుతూ అంది అమ్మ.

'ఇతనికి జ్వరం రావటం మంచిది.' అన్నాడు పురోహితుడు గంభీర స్వరంతో.

వాళ్ళు వంటగదిలో వుండటం మూలాన నేను వాళ్ళను చూడ లేకపోయాను. కానీ ఆ ప్రేతాత్మలతో ఎదురుగా మాట్లాడి, వాళ్ళు వెళ్ళి పోయిన తర్వాత భయపడకుండా వుందామని నాలో విపరీత మైన కోరిక కలిగింది. నేను లేచి తూలుతూ మళ్ళీ నిలదొక్కుకుంటూ కిటికీ ముందుకు వెళ్ళి రహస్యంగా వంటగదిలోకి చూశాను. ముండిత

శిరస్కుడైన పండిత భోలానాధ్ పొడవాటి కుర్తావాడు. ఆయన భార్య లేబ్రాయంలో వుంది. ఆమె అచ్చం దేవకిపిన్ని చెల్లెల్లాగుంది. వీళ్ళు ఏ విధంగా నాయనమ్మ, తాతల రూపం ధరించ గలరో నాకర్థం కాలేదు. వాళ్ళ ముందున్న అన్నపు రాసులను చూసిన తర్వాత నా మనో శక్తితో నేనూహించింది నిజ మనిపించింది. దేవకి పిన్ని చెప్పినట్లు ఇదంతా నటన. ఆమె అంటుంది 'బ్రాహ్మణ శునకాలు శుభ్రంగా భోంచేయడా నికి అవురావురు మంటూ దివ్యంగా వస్తా'రని.

వాళ్ళు వెళ్ళిపోయిన తర్వాత నిజంగా భూతాలు వచ్చి వెళ్ళాయని అనిపించింది. అయితే తర్కానికి అందని ఈ ప్రేతాత్మ ప్రపంచాన్ని గూర్చిన ఆలోచన నాతలకు బాగా ఎక్కింది. నేనున్న గదిలోను, ఆమెట్ల మీద భూతాలు వుంటే మాత్రం ఏం? నాకు పిరికితనం వేసి దుప్పటి ముసుగు పెట్టుకొని నిద్రపోవడానికి ప్రయత్నించాను. భ్రమిం చిన నా నేత్రాలముందు ఆ చీకటి వేళ నాలో భయం అధికమై స్నానం చేసినట్లుగా చెమటలు పోశాయి.

* * *

నా జ్వరం రెండురోజుల వరకు తగ్గకపోతే అమ్మ బాగా భయ పడింది మాంసం అమ్మే బజారుకు వెళ్ళి మహమ్మదాలీ హకీమును తీసుకొచ్చింది. పొట్టిగా వున్నతను పిల్లి గడ్డము పచ్చని సిల్కు తలపాగా, వదులుగా వున్న పైజామా పొడవాటి కోటు ధరించి వున్నాడు. ఏవో ప్రార్థనలు చేస్తూ నానాడి చూశాడు.

కాగితంపై ఏదో మందులు వ్రాసి కాశీరియా బజారులో అమ్మే బాలి అనే సిక్కు దగ్గర కొనమని చెప్పాడు. కొద్దిరోజుల క్రితం ప్రతాప్ బాబాయి నాకిచ్చిన నాణెంతో బాలి అంగట్లో నిమ్మరసం తాగాను. జ్వరం తగ్గిన తర్వాత బాలీ షాపుకు వెళ్ళి షర్బత్ తాగనిస్తారనే ఆలో చన వచ్చి సంబరం కలిగింది. అమ్మకు చెప్పకుండా నిమ్మరసం, లేదా షోడా నేను తాగుతాను . ఈ ఆలోచన నాకెంతో ఉత్సాహం కలి గించింది.

అయితే నేనింకా పూర్తిగా కోలుకోలేదు. పక్కమీదనే ఉన్నాను.

అమ్మ కిటికీలో కూర్చుని లచ్చితో కబుర్లు చెబుతున్నది. వాళ్ళు గుసగుసలాడుతుంటే నాకేమి వినిపించలేదు. చెవులు రిక్కించి వినసాగాను.

'......మీ కులగురువు ఆచర్జా కోడలితో కులుకుతున్నాడు. ఆవిడ బిహారీ తల్లి. తెలుసుగా' అంటోంది లచ్చి.

'అయితే అతని ముసలి భార్య ఏమైంది?' అడిగింది అమ్మ.

'చెల్లెమ్మ! మీ అగాఖానీ మతానికి చెందిన రతన్‌భార్య గౌరి ఈ ముసలమ్మ ముసలాయన్ల మీద ఒకపాట వ్రాసింది.'

"నా చేతులు మర్దించు బావా
పొలాలకెళ్ళి కూరలు కోసుకొచ్చాను"

ఇద్దరూ నవ్వుకున్నారు.

నేను తల పంకించి లచ్చిని చూడగలిగాను. గుండ్రని విశాలమైన ముఖం ఆవిడది. ఆవిడకు అమ్మ వయసు వుంటుంది. ఆవిడ పెదాలపై నిర్లక్ష్యం, క్రీగంటి చూపులు గమనిస్తే తెలివితేటలుగల ఈ ముసలి పీనుగుకు వాగుడు ప్రధాన వృత్తి అనిపిస్తుంది. అందుకు నిదర్శనంగా ఆవిడ వున్న గదిలోకి చూస్తే ఆవిడవెనక ముగ్గురు యువతులు ఆపిల్ పండ్ల తొక్కలు తీస్తున్నారు. ఈవిడ ఆ తొక్కలు తింటూ అమ్మతో కబుర్లు చెప్తోంది.

'అయితే, గడియారాలు తయారుచేసే ఉత్తమసింగ్ పెషావరీ, దేవకీ మధ్య సంబంధం నిజమే నంటావా.' 'అతనొక్కడే కాదు చెల్లమ్మా. అనంత్ కూడా ఆమె ప్రియుడే. ప్రతాప్‌కు ఉత్తమసింగ్ షాపు మేడమీద ఉంటున్న వేశ్య అంటే ఇష్టం. వీళ్ళందరూ అక్కడ కూచుని తాగుతారు.'

ఆ మాటలు వినగానే అలా నిందారోపణలు చేస్తున్నందుకు వారిపై విరుచుకు పడదామనుకున్నాను. కానీ వీరి సంభాషణ నిజమే అయితే ఆ తాగే దగ్గరకు నేనూ వెళ్ళి సుఖాలు అనుభవిద్దామని వుంది. ......నేనింకా మంచం మీదనే వున్నాను. ఇలాంటి సాహసాలు చెయ్యాలని మనసులో ప్రణాళికలు వేస్తూ పడుకున్నాను.

* * *

నన్ను దత్తా బాబాయి యింటికి వెళ్ళి నా భయాలు పోగొట్టు కొని భద్రంగా వుండమని పంపారు. సుశీలా రాణితో పరమపద సోపాన పటం ఆడుతూ సంతోషంగా కాలం గడిపాను. నేను మూడుసార్లు ఆటలో ఓడిపోయి నందుకు ప్రతిసారీ ఆ అమ్మాయితో తగూ పెట్టు కున్నాను. అయినా నాకెంతో సంబరంగానూ మనసు విప్పి మాట్లాడు కున్నట్లుగానూ వుంది మేం తినటానికి వేడి శనగలు ఇచ్చినపుడు ఆ నేలమీద తివాచీపై పిల్లిమొగ్గలు కూడా వేశాను. మళ్ళీ సాయంకాలం భోజనానికి యింటికి వెళ్ళవలసి వచ్చినపుడు చరిత్ర పునరావృతమైంది. మేడమీద గదిలోకి వెళ్ళడానికి భయం వేస్తుందని నాకు తెలుసు.

మెట్లెక్కు తున్నపుడు వెనక నన్ను వంటరిగా వదలివేసి గణేశ్ వెళ్ళినందుకు వాణ్ణి తిట్టుకున్నాను చీకట్లోనే తిరుగుదామని, భూతా లను ప్రేతాలను చూద్దామని నాకుంది. నా మూలుగు విని అమ్మ నన్ను తీసుకెళ్ళటానికి వచ్చింది నా గుండె కొట్టుకోవటం ఆగిపోయే స్థితికి వచ్చి ఆ భయం వల్ల తల తిరిగి నేను మెట్ల మీదనుంచి దొర్లి క్రింద పడ్డాను

* * *

మేడమీద ఖాళీప్రదేశంలో మమ్మల్ని రాత్రి పడుకోబెట్టేముందు అమ్మ మాకు గ్లాసునిండా వేడిపాలు ఇచ్చేది 'అనగా అనగా ఒకరాజు' అని ప్రారంభించి రోజూ చాలాసేపు కథలు చెప్పేది.

మామూలుగా నాకు యిష్టమైన కథ — 'చిలకజంట' కథ. దేవకి పిన్ని నాకోసం ఆ కథ చెప్పేది.

ఈ సాయంకాలం అమ్మను ఆకద చెప్పమని అడిగాను దేవకి పిన్నికంటె తనని అడుగుతున్నానని అమ్మ ఉబ్బిపోయింది.

'రాజా హరిశ్చంద్ర కథ చెప్పమంటారా?' అంది అమ్మ

'కాదు సైన్‌లోక్ కథ చెప్పు'

'రాత్రంతా అవే కలలు వస్తాయి. భయపడతావ్'అని గణేష్ నన్ను వారించాడు.

వాడలా నన్ను వారించడం వల్ల భూతప్రేత ప్రపంచం గురించి యింకా తెలుసుకోవాలన్న కుతూహలం పెరిగింది.

అమ్మ తీరికగా ఉన్నట్లుంది. రాత్రితిన్న భోజనపాత్రలు కడగటం, వంటయింట్లో యింకా మిగిలిపోయిన పని దండిగా వున్నా కథ చెప్పడానికి అంగీకరించింది. దేవకి పిన్నిని కూడా మర్యాదగా పిలిచి వినమని చెప్పింది.

"మా కుటుంబం గురించి తెలుసుకోవాలంటే దేవకీ! నువ్వు తెలుసుకోవాల్సినవి ఎన్నో ఉన్నాయి." అంది అమ్మ.

రెండుయిళ్లకు మధ్యద్వారం దగ్గర దేవకిపిన్ని వచ్చికూచొంది.

'మీకు తెలుసుగా. మీ తాతగారికి చాలాకాలం పిల్లలు కలగలేదు. ఎన్నో ప్రయత్నాలు చేశారు. పూజలు పునస్కారాలు చేశారు వైద్యాలు, తంత్రాలు ప్రయోజనం లేకపోయాయి. యాత్రలు చేశారు. అంతా నిష్ప్రయోజనం. చివరకు ఒకరోజు మీ తాతగారు తన అంగటిలో పని చేసుకొంటున్నారు. అలా పనిచేసుకొంటున్నప్పుడు ఒక దివ్యపురుషుడు వచ్చాడు.'

'మా తాతగారి పేరేంటి అమ్మా?'

'పెద్దవాళ్ల పేర్లు నేను చెప్పగూడదు నాన్నా. ప్రతాప్ బాబాయిని ఒకరోజు అడుగు చెబుతారు.'

'లాలా చేతరామ్.' ధైర్యంగా జవాబిచ్చింది దేవకిపిన్ని.

'కళ్లుమూసుకుపోయాయి. దేవకీ! అంత అగౌరవంగా ఎలా ఉండగలవు? పెద్దవాళ్లపేర్లు చెప్పవచ్చా? నువ్వింకా చిన్నదానివి. మనయింటి పద్ధతులు యింకా తెలుసుకోవాలి....'

'తప్పులేదు అక్కయ్యా. ఈ రోజుల్లో అలాంటి గౌరవాలు అక్కర లేదు.' అంది దేవకిపిన్ని.

అమ్మ కథ కొనసాగించింది.

'వెళ్లిపో! అన్నారు మీ తాతయ్య ఎవరో బిచ్చగాడు వచ్చాడని.'

'మీరు నాకోసం యిన్నాళ్లు ఎదురుచూస్తున్నారు.' అన్నాడా ఫకీరు.

'మీయింటి ముందుకు వచ్చిన నన్ను వెళ్లి పొమ్మంటున్నారు. నేను మిమ్మల్ని శపించను. వెళ్లిపోతాను. నన్ను వెళ్లమన్నందుకు కోపంలేదు. .....మీకు పిల్లలు కావాలని నాకు తెలుసు. నా సలహావినండి. మీకు 'పిల్లలు కలుగుతారు. నేను భగవంతుని సేవకుణ్ణి. నా మాటవినండి. ఈ ఊరికవతల వెళ్లి భూమికొనండి. అందులో బావితవ్వి, చెట్లువేసి తోటపెంచండి. ఆ బావి దగ్గర రోజు పొద్దుట స్నానం చెయ్యండి. సాయంకాలం దీపం వెలిగించండి. మీకోరిక నెరవేరుతుంది.' అని చెప్పి ఆ వ్యక్తి తన దారిన తాను వెళ్లబోయాడు ఫకీర్ నిష్కర్షగా చెప్పిన మాటలకు మీ తాతగారు నివ్వెరపోయి ఆయనను ఒక్కక్షణం ఆగమ న్నారు ఆయన అంగీకరించి నిలుచున్నారు. మీ తాతగారు అంగడినుంచి లేచివచ్చి పాదాభివందనం చేశారు. దానికి సంతోషించి ఆయన అన్నారు 'మీరు తోటవేసి అక్కడ బావి తవ్వితే, నేను అక్కడవచ్చి అందులో వుంటాను.' ఆయన ముందుకు కదలిపోయారు.

'మీ తాతగారు బాగా ధనవంతులు. దర్బారా సాహెబ్‌లో పని చేసి, మహారాజాలకు సింహాసనాలు తయారుచేసి, బాబాలకు బాకాలు తయారుచేసి, ఆయన బాగా డబ్బు సంపాదించారు. ఇప్పుడు మీ ప్రతాప్ బాబాయి కూడా ఆయన వృత్తి కొనసాగిస్తున్నారు. మొగల్ రోడ్డు పక్కన మీ తాతగారు భూమికొని అంధులో బావితవ్వి, తోట వేశారు. ఆ తోటలో బాగా పూలు విరగబూసాయి... మీ నాయనమ్మ, తాతయ్య రోజూ అక్కడికి వెళ్లి అక్కడ నివసిస్తున్న ఫకీర్‌సైన్‌లోక్ గారికి ప్రార్థనలు చేసేవారు. .... ఆ సంవత్సరమే మీ నాన్నగారు పుట్టారు. తర్వాత సంవత్సరానికి మీ ప్రతాప్ బాబాయి కలిగారు అప్పటినుంచి ఆ తోటలో బావిని 'సంకల్ప సిద్ధబావి'గా పిలవసాగారు.'

'కొంతకాలానికి ఆ ఫకీర్ చనిపోయారు. ఆయన ఆత్మ బావి దగ్గర చేరిన ఒక సర్పం రూపంలో కొంత మిగిలిపోయింది. మిగతా మీ నాయనమ్మను ఆవేశించి ఆమె తలతిప్పుతూ ఆడసాగేది. అంతకు ముందే ఆవిడను ఒక భూతం ఆవేశించి ఉంది గాబట్టి, ఆవిడ సైన్‌లోక ఫకీర్ ఆత్మను వెండి కంకణం రూపంలో ధరించింది. ఆవిడ చేసిన

నేరానికి మీ తాతగారు కొద్దిరోజుల్లో గతించారు. కాని, మీ నాయనమ్మ తన పంతంవీడలేదు. మీ నాయనమ్మ చనిపోతూ భూతాన్ని ఒక పిల్ల చెవిలోకి ఊదివెళ్లింది. ఫకీర్ ప్రేతాత్మ మీకు దూరపు బంధువైన ఆఖీ పెద్దమ్మను ఆవేశించింది. ఆవిడ తధియా వంశానికి చెందినది. ఆవిడ ఇప్పుడు భూతంపట్టినట్లు ఆడుతుంది.'

'మీ నాయనమ్మ చనిపోయే సమయానికి మీ నాన్నగారు ఉద్యోగంలో ఉన్నారు. ప్రతాప్ బాబాయి చిన్నవాడు అందువల్ల మీ కోకోకిల్లీ అత్త మనవంశానికి రావలసిన భూమిని, బావిని తన స్వాధీనంలోకి తీసుకొంది. అప్పటినుండి ఆ సర్పం మనయింట్లో వచ్చి ఉండసాగింది. ఆ భూమి బీడు పడిపోయింది. ఆ బావి నీళ్లు నల్లగా మారాయి. కాని అక్కడ స్నానంచేసిన వారి కోర్కెలు నెరవేరుతున్నాయి.'

'నిజమే. నేనుకూడ ఆమాట విన్నాను.' దేవకిపిన్ని మాట కలిపింది.

నేను, గణేశ్ నిద్ర నాపుకొంటూ శ్రద్ధగా కథ వింటున్నాం. శివ నిద్రవొడిలోకి జారుకొన్నాడు.

'ఆ బావి చూడటానికి మమ్మల్ని తీసుకెళ్తావా అమ్మా!' అడిగాను నేను.

'ఏదో ఒకరోజు తీసుకెళ్తాను.' అంది అమ్మ

ఈ కథ నమ్మాలా? లేదా? నిజమేనా? కాదా? అన్న సంశయం నాలో మిగిలిపోగా, భయం నన్ను కలవరపెట్టగా 'రేపే తీసుకెళ్లాలి' అన్నాను.

'సరే చూద్దాం! ఒకప్పుడు అక్కడ పూలు పాటలుపాడేవి' అంది అమ్మ ముభావంగా నాలో ఆతురతను పెంచుతూ. అమ్మ చెప్పిన మాటలు నాకు సరదా పుట్టించాయి. మా వూళ్లో ఆమూల పాటలుపాడేపూలు ఉన్నాయంటే ఆ అద్భుత ప్రపంచం చూడాలనిపించింది.

'బహుశా రేపు మనందరం వెళ్లవచ్చు. నేనూ ఒక్కసారే వెళ్లాను. మళ్లీ వెళ్లాలని ఉంది' అంది దేవకిపిన్ని.

'అమ్మ! మంచిది. మనమూ వెళ్దాం' అన్నాడు గణేశ్.

'అయితే మనం తప్పకుండా వెళ్దాం. శివ కౌసల్య దగ్గర పడుకొని ఉంటే లేపవద్దు. దేవకీ! వాణ్ణి మీ మిద్దమీదనే పడుకోనీ. మనం యివాళ త్వరగా నిద్రపోదాం. పొద్దున్నే లేచి అందరం అక్కడికెళ్దాం' అంది అమ్మ.

అందుకు యిందుకు అంగీకరించాం.

'అరే గణేశ్! నాతో మాట్లాడరా!' అన్నాను నాకు నిద్రపట్టక.

'నిద్రపోరా' అన్నాడు గణేశ్ విసుగుతో.

కాని, చాలా సేపటివరకు నా కంటిపై నిద్రపట్టలేదు. చీకట్లో ఏవో శబ్దాలు వినిపించినట్లు, పాము నా పక్కకింద బుసగొడుతున్నట్లు అనిపించసాగింది.

వేడిపాలు యిచ్చేదానికి వచ్చినప్పుడు, నేను అలసటగా ఉండటం చూసి అమ్మ నా నుదురుతాకి చూసింది.

'మళ్లీ జ్వరం తిరగబెట్టింది' అంది ఆదుర్దాగా.

* * *

తెల్లవారి పొద్దున కళ్లు తెరిచాను. 'సంకల్ప సిద్ధబావికి' తీసు కెళ్లాలని నేను అమ్మను అడిగిన కోరిక నాకు త్వరగా మెళుకువ తెప్పించింది.

కాని నాకు జ్వరంగా ఉండటంవల్ల, నేనక్కడికి వెళ్లే అదృష్టం కలగలేదు.

'అక్కడ బావినీళ్లు అందరి కోరికలు తీర్చేటట్లయితే, నా జ్వరం కూడా తగ్గిపోతుంది' అన్నాను అమ్మ మూఢ నమ్మకాన్ని ఆమాట ద్వారా కదపవచ్చుననే ఆశతో.

'నేనక్కడికి వెళ్లను మీ కోకోకిళ్లీ అత్తమీద కోర్టులో దావావే యడానికి వీలుందేమో చూడాలి. మనభూమి మనకు తిరిగిరావాలి' అంది అమ్మ.

నా ముఖం గడ్డకట్టుకొని పోయింది. నేను ఏడవకూడదని గణేశ్ అన్నాడు గాబట్టి కన్నీళ్లు జలజలారాలసాగాయి.

దేవకిపిన్ని బయటకు వెళ్లడానికి సిద్ధంగా కౌసల్యకు శుభ్రమైన గుడ్డలువేసి తిసుక వచ్చింది. కాని, నా విచారవదనం చూసి నాతో ఉండిపోవాలని నిశ్చయించుకొంది.

'అక్కయ్యా! కర్మాన్ అత్తతోకలిసి గణేశ్‌ను తీసుకొని మీరు వెళ్లండి నేను కృష్ణను చూస్తుంటాను.'

ఈ పరిష్కారానికి అమ్మ తన కారణాలవల్ల తాను అంగీకరించింది.

క్షణకాలం కిందటివరకు పట్టరానంత దుఃఖంలోవున్న నేను ఈ ప్రతిపాదనకు వొప్పుకున్నాను. పిన్ని క్రీగంటిచూపులో దయా కాంతికిర ణాలు నా శరీరాన్ని నింపివేశాయి.

అమ్మతో కూడా గణేశ్, కర్మన్ సాహసయాత్రకు వెళ్తున్నారన్న దుఃఖం నాలో నశించి, కౌసల్యతో ఆడుకొనే అవకాశం కలిగిందనే సంబరం వచ్చింది. నేనూహించినట్లే పిన్ని నాకు షర్బత్ తెచ్చియిచ్చింది.

ఆవిడ మధురకంఠంతో అన్నమాటలు నేను జీవితంలో మరచి పోలేను 'బిడ్డా! నా సొంతబిడ్డ! నీకు నెమ్మది చేస్తాను. ఈ షర్బత్ తాగుచాలు. ఈ రాత్రినుంచి నువు నాదగ్గర పడుకుంటు న్నావ్. కౌసల్య ఒక వైపు, నీవు మరొకపక్క... నాకు తెలుసు నువు బాగా భయపడ్డావు. అందువల్ల రాత్రులు భయంకరంగా మారాయి. ఇకమీదట నీకు చెడుస్వప్నాలు రావు...'

* * *

మధ్యాహ్నం అమ్మ గణేశ్ చేతిలో తువ్వాలుతో తుడుచుకొంటూ ఏడుస్తూ తిరిగి వచ్చింది.

కర్మాన్ అత్త అక్కడ ఏం జరిగిందీ దేవకిపిన్నితో చెప్పింది 'చెల్లీ! మశ్చీంద్ర వెధవ, తల్లి కోకోకిల్లీతో అక్కడ ఉన్నాడు. స్నానానికి వెళ్లిన సుందరిని నెట్టివేసి తోశాడు. కళ్లుమూసుకు పోయాయి వాడికి. కోకోకిల్లీ మమ్మల్ని తిట్టిపోసి, తోటమాలి ఇల్మాదిన్ చేత గెంటి వేయించింది.

ఆవిడ చిన్న కొడుకు — గణేశ్‌ను చెంపమీద కొట్టాడు. బాబూ! నీ చెంపమీద ఐదువేళ్లు ఎలాపడ్డాయో పిన్నికి చూపించు.'

గణేశ్ గర్వంగా చెంప చూపించాడు.

మశ్చీంద్ర చేత మెడపట్టి గెంటించుకోవడానికి, తోటమాలి చేత సంకల్ప సిద్ధబావినుండి దూరంగా నెట్టించుకోవడానికి అవమానంతో కుంగిన అమ్మ గణేశ్‌ను వొడిలో కూచోబెట్టుకొని ఓదార్చసాగింది.

'ఆ భూమి మనది. దాన్ని ఆక్రమించుకొన్నవాళ్లు మనబావిలో స్నానంకూడా చెయ్యనీ లేదంటే ఊహించడానికి శక్యంగాలేదు' అంది అమ్మ.

'నీళ్లు బాగా నాచుపట్టి ఉన్నాయనుకొంటాను' తుంటరిగా అన్నాను.

'నోర్మూయ్‌రా నువ్వు, నీ దృష్టిలో మేం అక్కడికెళ్లాం. తన్నులు తిని వచ్చాం. అంతే' గణేశ్ నన్ను అరిచాడు

'అయితే 'సంకల్పసిద్ధి బావి' నిజంగా...' అని ఏదో అడగబోయాను.

'అరే. నువు మరీ క్రూరంగా మాట్లాడుతున్నావు.' అంది అమ్మ కళ్లనీళ్లు తుడుచుకొంటూ.

'ఏదీ! నీ నుదురు చూపించు. జ్వరం ఎలా ఉందో చూద్దాం' అంటూ నా దగ్గరగా వచ్చింది అమ్మ.

అలా ఆమె ఆవేదన చెందడం నా హృదయం కదిలించింది. మాదని అనుకొనే ఆస్తి, మాదికాదని వాళ్లు ఆవిధంగా తరిమివేయడంపట్ల అమ్మ ఎంత మనోవేదన పొందిందో తలచుకొంటే నా మనస్సులో దుఃఖం అధికమైంది.

* * *

మా కుటుంబాన్ని కోకోకిళ్లి, అతని చిన్నకొడుకు ఏ విధంగా అవమానించారో మా కంసాలి జాతివారికందరికీ వివరంగా తెలిసిపోయింది.

రాంచంద్, ప్రతాప్ కలిసి వాళ్ల పెదనాన్న అమీర్‌చంద్‌మీద దావావెయ్యాలని మగవాళ్లంతా చెప్పారు. వాళ్లనాన్న సంకల్పసిద్ధి బావిని

తప్పించి, ఆ భూమిని కొన్నారని వాళ్లకు తెలుసు.

సైన్‌లోక్ ఫకీర్ ప్రేతాత్మను అఖీ పెద్దమ్మమీద ఆవేశింపజేస్తే, ఆ అశరీరవాణి ద్వారా ఈ సమస్యను పరిష్కరించవచ్చునని ఆడవాళ్లు అనుకొన్నారు.

సైన్‌లోక్ తప్పకుండా అఖీతలమీద కూచొని, మా కుటుంబ పక్షంగా న్యాయం చేకూర్చుతుందని అమ్మవిశ్వాసం. ఇదంతా నిష్ప్రయోజనమని, విజ్ఞానఖనియైన తన అన్న భావిస్తాడని ప్రతాప్ బాబాయి అమ్మ చెవిలో రహస్యంగా చెప్పాడు. అమ్మమాత్రం అఖీపెద్దమ్మను సైన్ లోక్ ప్రేతాత్మ ఉన్న మాయింటి ముందు గదిలోకి వచ్చి మాటాడమని కోరుదామని అమ్మ నిర్ణయించుకొంది.

ఈ సంఘటనను పూర్తిగా మనసులో ఆలోచిస్తూ ఆవేదనతో నేను ఎదురుచూడసాగాను. అఖీ పెద్దమ్మను భూతం ఆవేశిస్తే ఆమె ఎలా మారిపోతుందో, అసలు భూతం ఎలా ఉంటుందో ఆలోచిస్తూ ముందుగానే నేను భయపడసాగాను. జరగబోయే నాటకం గూర్చిన అత్యధిక ఉత్కంఠవల్ల నా ఒంటరి గుండె బరువెక్కి, నా జ్వరం తగ్గలేదు.

ఆ మర్నాడు మధ్యాహ్నం భోజనాలైం తర్వాత, ఈ నాటకానికి సంబంధించిన సన్నాహాల హడావిడి ఆరంభమైనది.

చుట్టుపక్కల ఆడవారంతా మా యింటి పెద్దగదిలో ఆసనాలు అలంకరించి ఆతురతతో ఎదురుచూస్తున్నారు. నేను దుప్పట్లు కప్పుకొని పడుకొనివుంటే, చుట్టుపక్కల పిల్లలంతా రచ్చచేయడం వినిపిస్తోంది. నేను ఏదో ఒక ఎత్తుగడవేసి అమ్మను వొప్పించి కిందికి వెళ్లాలని ఆలోచిస్తున్నాను.

'సైన్‌లోక్ ఆశీస్సులు పొందాలి' అని గణేశ్‌ద్వారా కిందికి అమ్మకు కబురు పంపాను.

'నీకు అదంతా నమ్మకంలేదుగా. అబద్ధాలెందుకు?' అన్నాడువాడు.

'అరే! మోసగాడా! నువ్వెళ్లి అమ్మను పిలువు' అని కేకవేశాను.

వాడు సరియైనమాట అన్నాడని తెలుసు. అందుకే నాకు కోపంవచ్చింది.

అమ్మ మేడమీదికి వచ్చింది. సైన్‌లోక్ భూమి విషయంలో మాకు అనుకూలంగా మట్లాడి, కథ సవ్యంగా జరిగితే, దుప్పటికప్పి నన్ను కిందికి తీసుకెళ్లి, ఆశీర్వాదం యిప్పిస్తానని అమ్మ నాతో చెప్పింది.

అంతవరకు గణేశ్‌ను నాకు రక్షణగా పెట్టింది.

వాడు నాకు సంరక్షణకుడుగా ఉండటం అసహ్యించుకొని, మొగం కప్పుకొని నిద్రపోతున్నట్లు నటించాను.

ఇంతలో డప్పులశబ్దం గొడవమధ్య వినిపించసాగింది. అసలు నాటకం ఆరంభమైందని తెలుసు. అయితే నేను భూతాన్ని చూడగలను! ఒక్కసారి చూస్తే చాలు. దాన్ని బాగా పరిశీలించిచూస్తే యింకెప్పుడూ భయం అంటూ ఉండదు.

ఊపిరి సరిగా ఆడకపోయినా, నేను అలానే ఉండి పోయాను. గణేశ్‌కూడా కిందికి వెళ్లాలని ఉబలాటపడుతున్నాడని ఊహించాను. వాడు వెళ్లిన తర్వాత నేనుకూడా మెట్లమీదనుంచి కిందికి వెళ్లి చూడవచ్చుననుకొన్నాను.

నేననుకొన్నట్లుగా అచ్చంగా జరిగింది. మునిగాళ్లమీద నడుస్తూ గణేశ్ వెళ్లడం వినిపించింది. ఊపిరాడకపోయినా నేను సిద్ధంగా ఉన్నాను. వాడు నా చూపుకు దూరంగా వెళ్లాడని తెలిసిన తర్వాత, దుప్పటి తొలగించి వాడు వెళ్లాడా? లేదా? అని చూశాను.

పెరుగుతున్న ఉద్రేకానికి, మంచి పన్నాగానికి మధ్య నలిగిపోతున్నాను. అమ్మ నన్ను చూస్తే వెంటనే పక్కమీదికి తెచ్చిపడుకోబెడుతుంది. లేదా గణేశ్ చూసినా అమ్మకు చెబుతాడు. అందువల్ల నాటకం రసకందాయంలో పడినదాకా వేచి ఉండటం మంచిదనిపించింది. అంతవరకు ఉత్కంఠ అపుకోలేకపోయాను. ఆఖీ తలమీద ఆవహించే ముందు ఆ భూతం నా మీదికివచ్చి నన్ను భయపెడితే ఎలా? నేను మళ్లీ దుప్పట్లోకి తలదూర్చి పడుకొన్నాను.

చెమటలో తడిసి పోతున్న నేను డప్పుల వాద్యం శబ్దాలు, గుంపుగా

వాళ్ళు కలసి పాడుతున్న పాటలు విని అక్కడికి వెళదామనే ఏకాభిప్రాయానికి బలవంతంగా వచ్చాను. వాళ్ళు పాడుతున్న పాట నాకిలా వినిపిస్తోంది ..

'ఆయన అనుగ్రహించాడు
అప్పుడే అవహించాడు
పవిత్ర భిక్షుకుల అధిపతి
సైన్‌లోక్ అవతరించాడు.'

నేను లేచి వెళదామని నిశ్చయించుకునే టప్పటికి అడుగుల శబ్దం వినిపించి మళ్ళీ దుప్పట్లోకి ముడుచుకున్నాను.

'నేను గమనిస్తూనే వున్నాను లేరా' అన్న గణేశ్ గొంతు వినిపించింది. ఒక్క క్షణం తర్వాత దుప్పటి కంతలోంచి వాణ్ణి చూశాను. వాడు ఒక్క ఉదుటున మెట్ల కిందికి వెళ్ళి పళ్ళెంనిండా స్వీట్లతో వూడి పడ్డాడు.

ఒక ఐదు నిముషాలాగి ఏమైనా కానీ క్రిందికి వెళ్ళాలని నిశ్చయించుకున్నాను. ఇంకెంత మాత్రము ఓర్చుకోలేను.

ఎట్టకేలకు క్రిందికి దిగి వచ్చే ప్రయత్నం సఫలమై తలుపు దగ్గర నిలబడివున్న ఆడవాళ్ళ తలలమీది నుంచి ఆఖీని చూడగలుగు తున్నాను.

వాళ్ళు బృందగానం చేస్తూనే వున్నారు.

'ఆయన అవతరించాడు'

మేలిముసుగు తలపై కప్పుకొని విశాల నయనాలతో సుందర వదనంతో నవాబ్జాన్ అత్త అక్కడ వుంది. ఆమె దర్పంగల చూపులు మా అమ్మ చిన్న చెల్లిలిలా కనిపించాయి. ఆఖీ పెద్దమ్మ నల్లటి రూపాన్ని వివర్ణం చేస్తున్నాయి. ఆమె ముఖంలో ఎన్నో కదలికలు అస్పష్టభావాన్ని వెలిబుచ్చుతున్నాయి.

నవాబ్జాన్ పాటలో వూపుతోపాటు డప్పును డబడబా వాయిస్తున్నాడు. ఆ విశాలమైన గదిలో తలుపుదగ్గర ఆఖీ శరీరంలో బిత్తరపాటు

వణుకు, తిప్పట అధికమై ఆమె చలించి పోవడం నేను ఉద్వేగంతో కూడిన భయంతో చూస్తున్నాను.

విపరీతమైనమ ఆసక్తితో ఈ మంత్రవిద్యాప్రభావాన్ని ముగ్ధుడనై చూస్తూ వుండి పోయాను.

విషసర్పం ఆవహించినట్లు ఆమె మెలికలు తిరిగిపోతూ గంతులు వేస్తూ కూర్చున్న చోటునుండి ఎగిరిపడుతూ ఈలలు వేస్తూ వుంది. వెంట్రుకలు విరబోసుకున్నా లెఖ్ఖపెట్టకుండా తల వేగంగా ఆడిస్తూ తలుపు ముందుకు వెళ్ళింది.

కిక్కిరిసిన ఆ గదిలో పూల సువాసనలు ధూపపరిమళాలు నిండివు న్నాయి. నేను ఒక్క నిమిషం గాలి పీల్చుకున్నాను. నాతల దిమ్మెక్కి నట్లైంది. ఆభూతం నాతలమీది కెక్కిందా? లేక ఆఖీతల మీది కెక్కిందా? నాకు ఆశ్చర్యం వేసింది. ఆ పవిత్రమూర్తి నన్ను ఆవహిస్తే అప్పుడు నాకు తెలుస్తుంది.

మళ్ళీ స్త్రీ జనమంతా బృందగానం అందుకున్నారు.

'చెల్లెళ్ళారా! అక్కల్లారా!<br>
అదిగదిగో! చూడండి<br>
భిక్షుకాధిపతి నృత్యం<br>
మన 'సైన్‌లోక్' అవతరణం'

ఆఖీతల వేగంగా తిప్పుతూ భయంకరంగా కదలాడుతూ తన ముందున్న తెల్లటి తివాచీపై పూలను తనపొడవాటి కురులతో చిమ్ముతూ కదులుతోంది.

నాతల తిరుగుతున్నట్లుగా నా కనిపిస్తోంది. నే నెక్కడున్నానో తెలుసుకునే లోగా కళ్ళుతెరిచి చూస్తే మేడమీద పెద్ద పరుపుపై పదు కోబెట్టి దేవకి పిన్ని చల్లని నీళ్ళు తాపుతూ వుంది.

సుగంధ వాసనలు విరజిమ్ముతూ పిన్ని నాతల నొక్కుతూ ఎక్కు వగా నొప్పి ఎక్కడ వుందో చెప్పమంది. నా శరీరానికి ఆత్మకు మధ్య నిష్కపటమైన వివాదం చెలరేగుతున్నట్లుగా నా కనిపించింది.

'సైన్‌లోక్' నిజంగా వచ్చాడా? 'నా తల మీద ఆవహించాడా? ఇంకా నేనా ప్రభావంలో వున్నానా?' అనే సందేహంలో వున్నాను. 'నేను బతికే వున్నానా? పిన్నీ! ' అని అడిగాను.

'ఏం మాటలు నాన్నా! నువ్వు కలకాలం జీవించాలి.' అంటూ పిన్ని ఆప్యాయంగా వీపు తట్టింది. 'నువ్వు మేడమీది నుంచి పడ్డావు. మీ అమ్మ యిక్కడే వుంది. భూమి తగాదా గురించి ఆభూతం ఏమి తీర్పు చెబుతుందో తెలుసుకునేందుకు క్రిందికి వెళ్ళింది. గణేశ్ ఐస్ ముక్కలు తెచ్చేందుకు వెళ్ళాడు' అంది పిన్ని.

దేవదత్త, భగవాన్‌దత్త బాబాయిలు వారిచెల్లెలు ధన్వంతి నన్ను పరామర్శించడానికి వచ్చారు. మాయింట్లో జరిగిన తతంగమంతా వాళ్ళకు తెలుసు కాబట్టి ఆర్యసమాజ ప్రచారకులుగా నాలాంటి చిన్న పిల్లలలో వున్న వారికి ఇలాంటి మూఢనమ్మకాలను పోగొట్టేందుకు వచ్చి వుంటారు. ఆ భూతం వచ్చినపుడే నేను సొమ్మసిల్లి పడిపోవడం నా సంరక్షకులుగా వున్న వారికి ఆందోళన కలిగించింది.

'మీ అమ్మ యింట్లో నిన్న ఏదో తమాషా ఏర్పాటు చేసిందట. నా ప్రక్కన కూచుంటూ తల నిమురుతూ అడిగింది ధన్వంతి. చదువుకున్న వ్యక్తి భార్య, ఆర్యసమాజంలో పనిచేసే హరీష్ తల్లి ఈతల తిరుగుడు పనులు నమ్ముతోందంటే ఆశ్చర్యంగా వుంది.

'పిన్నీ! నిజంగా ఆభూతం ఆఫీతలమీద ఆవహించి ఆడింది' అన్నాడు గణేశ్ - నమ్రతతో.

'ఇదంతా మోసం నాయనా' కూచోడానికి ఇష్టపడకుండా అటూ యిటూ తిరుగుతూ అన్నాడు దేవదత్త బాబాయి. 'మనం వేదసమ్మతమైన మతాన్ని పాటిస్తాం. ఈ ఫకీరుల నాట్యం మనం నమ్మం' అన్నాడు.

"కృష్ణ మాతో కలసి రావాలి. దయ్యాలు, భూతాలు నమ్మకూడదు. అతనికి ఇంగ్లీషు బాగావచ్చు. నేను విజ్ఞానశాస్త్ర గ్రంథాలు ఇస్తాను చదవడానికి." అన్నాడు దేవదత్తబాబాయి నచ్చజెప్పే ధోరణిలో.

'దేవుళ్లను నమ్మినట్లే, భూతాలను కూడా విశ్వసించాల్సి వస్తుంది' అంది అమ్మ వాదన ధోరణిలో.

'ఆర్యజాతి వారి ప్రకృతి దేవతలను పూజించాలిగాని, ద్రావిడ మాయాజాలాన్ని కాదు.' అరిచాడు దేవదత్త బాబాయి. కందగడ్డలా ముఖం మారింది కోపంతో.

దేవకి చల్లని నిమ్మరసం గ్లాసులు తెచ్చి, ముందు భగవాన్ దత్తకు అందించింది.

దేవకి అందచందాలను లోగడ వినిఉన్న ధన్వంతి కోపంగా— "మన సంఘంలో ఆడవాళ్లకు ముందివ్వాలి" అంది.

'దేవకి మన సంస్కరణ సంఘంలో చేరలేదన్న సంగతి గుర్తుంచుకో!' నవ్వులాటకు అన్నాడు నా పక్కమీద కూచున్న దేవదత్త.

చల్లని పానీయం తాగడంలో వాతావరణం చల్లబడింది.

'వీళ్లు మన ఆర్యసమాజంలో చేరేలా చూడాలి'

'నేను ఉపన్యసించే ప్రార్థనా సమావేశాలకు ఈ ఆడవాళ్లంతా ఒకసారి రావచ్చు. అయితే దేవకి తెల్లటి చీరలు ధరించిరావాలి. ఈ తనకిష్టమైన గులాబిరంగు చీరలు మాత్రం పనికిరావు ' అంది ధనవంతి.

'మీ సమాజం ఆడవాళ్లు తాగడానికీ, మగవాళ్లతో పేకాటకు ప్రోత్సహిస్తుందని విన్నాను' అంది అమ్మ తంత్రంగా.

'ఎవరో మేమంటే గిట్టనివాళ్ళు చెప్పివుంటారు! మేం ఆర్యుల పవిత్ర సంప్రదాయాలకు చెందినవాళ్లం' అని అభ్యంతరం చెప్పాడు భగవాన్ దత్త.

'నేను ఒకప్పటి ఉత్తమస్థితి గతుల్ని గూర్చి చెబుతాను.... పూర్వ కాలంలో వేదయుగంలో, మూడువేల సంవత్సరాలకు పూర్వం ఆర్యావర్తాన్ని ఋషులు పాలించేవారు. మనస్సాక్షిగా నడుచుకొనే రోజులని, ఈ పంజాబ్ భూమిపైన సూర్య, రుద్ర, ఇంద్రాగ్ని వరుణదేవతలను పవిత్రంగా పూజించేవారు...... ఆ మంచి రోజుల్ని గూర్చి చెబుతు

న్నాను. స్త్రీ పురుషులు సమానంగా చూడబడేవారు. స్వయంవరం ద్వారా వివాహాలు జరిగేవి. ఆడవారు పురుషులను స్వేచ్ఛగా ఎన్ను కొనేవారు. మేధాసంపదను బట్టి, వృత్తిగౌరవాన్ని బట్టి హెచ్చుతగ్గులు ఉండేవి పుట్టుకచేత తక్కువ, ఎక్కువ కులాల పాటింపు ఉండేదికాదు. బాల్యవివాహాలు ఉండేవికావు. మనం జర్మనులకు, ఆంగ్లేయులకు సోదరులతో సమానంగా ఉండేవారంగాని, వారి కన్నా తక్కువగా గాదు. నేను వేదకాలంగూర్చి, పూర్వ సంప్రదాలయాలను గూర్చి స్వామీ దయానంద చెప్పినమాటలు చెబుతున్నాను ప్రపంచంలో ఏ మానవుడు విశ్వాంతరాళాన్ని గూర్చి ఉన్నతమైన పవిత్రభాషలో ఘనంగా సృష్టి గీతాన్ని పాడనిరోజుల్లో భారతీయులు వర్ణించిన విషయం చెబుతున్నాను.' అంటూ సంస్కృతంలో ఆ వేదసూక్తం వల్లించారు.

గంభీర మాధుర్యంతో నిండిన సంగీతధ్వనితో ఆయన వేదం వల్లించిన తర్వాత, మళ్లీ ఎదురుమాట్లాడటానికి అవకాశం కుదరలేదు.

నాకు మతిచెడిపోయినట్లయింది. ఆ ఉన్నతస్థితిగతులంటే ఏమిటో నా కర్థంకాలేదు. సైన్‌లోక్ భూతాన్ని గూర్చి మరిచి పోదామనుకొంటు న్నాను గాబట్టి భగవాన్‌దత్త చెప్పిన దేవతల పట్ల అభిమానం పెంచుకొనేవాణ్ణే కాని ఆయన అంతక్రూరంగా మాట్లాడటం నచ్చలేదు. అమ్మకు దూరంగా నేనా పెద్దయింట్లో ఉండటం తటస్థిస్తేనే అది సాధ్యం. కానీ, నానరనరాల్లో నాకు తెలుసు అది అసాధ్యమనే విషయం.

మహమ్మదాలీ హకీం పరీక్షచేసే గదికి నన్ను తీసుకొని వెళ్ళి, గాలి మార్పిడి కోసం దేవకి పిన్ని నన్ను బాబాయి అంగట్లో వదిలి వెళ్ళింది. మాతో కూడా వచ్చిన గణేశ్ నన్ను బజారు నుండి నెమ్మదిగా తీసుకొని వెళ్ళాలి.

పాత్రసామానులు అమ్మే ఆ రద్దీ బజారులో మా ప్రతాప్ బాబాయి అంగడి వాతావరణం ఉల్లాసంగాను సంతోషదాయకంగాను వుంది.

వెండి పాత్రకు నగిషీలు చెక్కుతూ పద్మాసనం వేసుకొని కూర్చుని వున్న బాబాయి 'రండిరా! పిల్లలూ' అంటూ ఆప్యాయంగా పిల్చాడు. 'ఎట్లైయితే నేం? మీరు నా అంగడికి వచ్చారు. ఇంట్లో దయ్యాలగోల

ఎక్కువైందను కుంటాను.. ఈ ఆడవాళ్ళకు పిచ్చి. అదుగో జూదగాడైన హరియా బాబాయి ప్రక్కన కూచోండి. ఇవాళ కొంచెం ఎక్కువ తాగినట్లున్నాడు. అయినా నిమ్మళంగా వున్నాడు.'

ఇంతలో ప్రతాప్ బాబాయి దగ్గర పనిచేసే 'ఖర్మాన్' అత్తకొడుకు 'దౌలత్', ముల్తానుకు చెందిన గులాము, కొలిమి పొగలోనుంచి బయటికి వచ్చి హరియా కూర్చున్న ప్రదేశానికి ఎదురుగా చేతులో మూసను కడిగేందుకు వచ్చారు. పలుచని ధోవతి, గంజిపెట్టిన చొక్కా భుజాలపై శాలువా, సిల్కు టోపీ పెట్టుకొని హరియా కూచుకొని వున్నాడు. వెండి పొగగొట్టంలోంచి హుక్కా పీలుస్తూ కూర్చుని వున్న అతడు బాగా డాబుసరి మనిషిగా కనిపిస్తున్నాడు.

మేము పెద్దమనిషి పిల్లల్లాగా వినమ్రతతో కూర్చున్న తర్వాత బాబాయి దౌలత్ తో— 'వెళ్ళి వేడివేడి పూరీలు తీసుక రారా వీళ్ళకు' అన్నాడు.

'నేను వీళ్ళకు కొద్దిగా మద్యం ఇస్తాను' అన్నాడు హరియా.

ఆ మాటతో గణేశ్ లేచి ఇంటికి పరుగు లంఘించుకున్నాడు.

'అరేయ్! రారా! హరియా తమాషాకన్నాడు.....'

'కొద్దిగా పుచ్చుకోవటానికి నాకభ్యంతరం లేదు.' అన్నాను.

'ఇలాంటి మాటలంటే నా కిష్టం.' నువ్వు మా 'క్లబ్ లో' చేరుదువుగాని మేము అక్కడ విస్కీ, సారాయి, తాగుతాము. వేశ్యలు చేసే దివ్యమైన నాట్యాలు చూస్తాం. పేకాట ఆడుతాం.

'ప్రతిరోజు కాదు నెలాఖరు రోజు ఒక్కరోజు మాత్రమే.' అన్నాడు బాబాయి మాట కలుపుతూ.

'అయితే హరియా బాబాయి ప్రతిరోజూ తాగుతారుగా నిజమా? కాదా?' అన్నాను

'అయితే నీకెలా తెలుసు నాయనా?' అన్నాడు హరియా.

'నువ్వు జూదరి వైతే నీ కష్టాన్ని మర్చిపోయేందుకు తాగక తప్పదు.'

జవాబు ధోరణిలో అన్నాను.

ఈ సమాధానానికి అందరూ పెద్ద పెట్టున నవ్వారు.

'ఖండితంగా'అన్నాడు హరియా నా మాటను బలపరుస్తూ, 'గులామ్ ఏమయ్యాడురా?' బాబాయి ఆదుర్దాగా అడిగాడు.

వెండి పాత్రపై సుతారంగా నగిషీలు చెక్కుతూ వీధి వాకిటి నుండి వచ్చే కను వెలుతురు లో చూసేందుకు తాను ముందుకు వంగుతూ తన పనిలో నిమగ్నమైన బాబాయి అంటే నాకు ప్రేమ కలిగింది. ఆయన ముఖ వర్చస్సు, నిర్భయత్వము, నిర్మొహమాటము నాకు నచ్చాయి. ఆ క్షణంలో ప్రతాప్ బాబాయి స్నేహితుడు, స్థూలకాయుడు అయిన అనంత వచ్చి బొంగురు గొంతుతో అన్నాడు:

'ప్రతాప్! రాగి కడిగేందుకు రసాయన పదార్థాలు తేవాలి ఓ రూపాయి యివ్వు.'

ఈ రోజు శనివారం ఎవ్వరికి అప్పు యిచ్చేది లేదు." అన్నాడు ప్రతాప్ బాబాయి నవ్వుతూ.

'అవును ఆ సైన్‌లోక్ నిన్న మా వదిన గారితో చెప్పినట్లుగా నీకు అదృష్టం కలిసి వస్తుంది. నాకు ఆ రూపాయి ఇవ్వు.' పట్టు పడుతూ అన్నాడు అనంత్.

పొడిదగ్గు దగ్గుతూ మూతి వంకర పెట్టి ఒక రూపాయ నోట్లోంచి బయటికి తీసి శ్రావణంతో నీటి పాత్రలో కడిగి శుభ్రం చేశాడు. ఇంతముందు నేను చూసిన ఆఖీ భూతవేశం కన్నా ఇది ఆశ్చర్యంగా కనిపించింది. ఆయన గొంతులో నుంచి తళతళా మెరిసే రూపాయి నాణెం దగ్గితే ఎలా వచ్చింది?

'మేం తాగేటప్పుడూ జూదమాడేటప్పుడూ వ్యభిచారం చేసేట ప్పుడూ డబ్బు దాచుకోవలసి వస్తుంది'. అన్నాడు ఆశ్చర్యంగా చూస్తున్న నా కళ్ళకేసి చూసి అనంత.

ఖండితంగా అతను చెప్పిన చెప్పిన మాటలను బట్టి అమ్మ ఇంతకు

ముందు చెబుతున్న పేర్లు నాకు గుర్తు గాబట్టి ఈయన చెప్పే మాటలు తననూ, తన స్నేహితుల్ని సమర్థించుకుంటూ చెబుతున్నాడని నాకర్థమైంది.

'వాడా పోకిరి పిల్లవాడు నా కందకుండా పరిగెత్తి పోయాడు.' గణేశ్ ని తీసుకొని రాలేని గులామ్ చెప్పాడు.'అతను నేరుగా వాళ్ళమ్మ దగ్గిరకు వెళ్ళాడు. ఆమె'బుర్లి' ఏడిరా అంటే వాడు మీతో కూడా అంగట్లో తాగుతున్నాడని చెప్పాడు.' గులాం వూసగుచ్చినట్లు చెప్పాడు.

ప్రతాప్ బాబాయి ముఖం క్షణకాలం పాటు వివర్ణమయింది. మళ్ళీ తేరుకొని నవ్వుతూ అన్నాడు'బాబు! మేం తమాషాకు అన్నాం. పనిదినాల్లో నేను గాని హరియా గానీ ఎవ్వరం తాగం. మేము మత సంప్రదాయాలను పాటించే సజ్జనులం కాకపోయినా పనిపట్ల శ్రద్ధ ఉంది. ఈ ఒక్క జూదగాడు మాలో విదూషకుడు. ప్రపంచంలో ధుఃఖాన్ని మరిచి పోవడానికి ఎవరో ఒకరు మనల్ని నవ్విస్తుండాలి. హరియా ఆ పని చేస్తుంటాడు'.

ప్రతాప్ బాబాయి అందమైన విగ్రహం పట్ల విశాల హృదయం పట్ల నాకు ఆకర్షణ ఎక్కువైంది. నాన్న కంటే ఆయన నాకు సన్నిహితుడుగా కనిపించాడు. నా అంతరాంతరాలలో విలాసాల పట్ల నాకున్న పక్షపాతం వల్ల బాబాయి స్వేచ్ఛా జీవనగీతం వైపు నేను మొగ్గు జూపాను. త్రాగుడూ, నాట్య సంగీతాలతో కూడిన జీవితంలో విలాసత పట్ల నేను ఆకర్షితుణ్ణయ్యాను వాటిని గురించి నాకు అణు మాత్రమైనా భావన లేకుండా వుంటే నాకెలా తెలుస్తాయి. వాటి పట్ల నాకున్న విలాస జీవన మమకారాన్ని నా గుండె గొంతుకల్లోనే తియ్యగా పదిల పరచుకున్నాను. అమ్మ పూజించే ఋషుల కంటే, భగవాన్ దత్త బాబాయి విశ్వసించే స్వచ్ఛమైన దేవతల కంటే ఈ కంసాలులు నమ్మే తాగుబోతు ప్రపంచంలోనే సౌఖ్యం వుందని నా నమ్మకం.

పొగలు చిమ్మే వేడివేడి పూరీలు తీసుకొని వచ్చిన దౌలత్ నన్నొక్కడ్నే చూసి బాబాయి ముందు మౌనంగా నిలబడ్డాడు.

'అరేయ్! కృష్ణను ఇంటికి తీసుకెళ్ళు. ఈ పూరీలు ఇంట్లో

పిల్లలందరూ కలిసి తింటారు ఇక్కడ —'అంటూ బాబాయి గొంతులో నుంచి దగ్గుతూ మరో రూపాయి నాణెం బయటికి తీశాడు.

'బాబాయ్ నువ్వు రూపాయి ఎలా బయటికి తీస్తున్నావో చెప్తే గాని నేను వెళ్ళను'.

'కాలే సీసపు కడ్డీతో నేను గొంతులో ఒక సంచి తయారు చేశాను. అందులో రూపాయి నాణేలు పడవేస్తాను అవి ఏ జేబుదొంగకు దొరకవు'. అన్నాడు వివరంగా బాబాయి. 'అందునా నాలాంటి దొంగలున్న తాగుడు స్థలాలకు వెళ్ళేటప్పుడు ముఖ్యంగా జాగ్రత్త అవసరం. ' అన్నాడు హరియా.

ఈ చెడ్డ మనుషుల ప్రేమ అనే వెలుగులో తిరుగుతూ వుందా మని, వాళ్ళు సృష్టించిన ప్రపంచం బాగుందని అనిపించింది కానీ — నేను ఇంటికి వెళ్ళాలి గదా!

'నేను నీతో వస్తాను!' అంటూ దౌలత్ చేతులుపట్టుకొని అతన్ని అనుసరించి నడువ సాగాను.

ఇంటికి వెళ్ళగానే అమ్మ తిట్టిపోసింది. సరియైన ఋజుమార్గం నుండి తాగుబోతులు జూదరులు వ్యభిచారుల స్నేహాన్ని నేను కోరు కుంటున్నానని ఆమె కోప్పడింది. నేను మళ్ళీ జబ్బు తిరగబెట్టినట్లుగా నటిస్తూ పడుకున్నాను.

* * *

ఆ మధ్యాహ్నం దేవదత్త, భగవాన్‌దత్తా బాబాయిల ఇల్లు గౌరవ ప్రదమైంది గాబట్టి మమ్మల్ని వాళ్ళింటికి వెళ్ళనిచ్చారు.

దేవదత్త బాబాయి లవంగాలు, ఏలకులు కొన్ని నాచేతిలో పెట్టి మేడమీద పార్వతికి యిచ్చిరమ్మనే బాధ్యత అప్పగించారు. ఆవిడ ప్రసాదం తీసుకొనేందుకు స్వయంగా రాలేకపోయింది. 'నీతో కూడా సుశీల వస్తుంది' అన్నాడాయన. ఈ కుటుంబంలో నన్నూ ఒక భాగస్వామినిచేసి మాట్లాడుతున్నాడని నాకనిపించింది. దేవదత్త బాబాయికి వివాహమైందని భగవాన్‌దత్తాకు కాలేదని అమ్మ ద్వారా నేను విన్నాను. నేనింతకుముందు మేడ మీది కెళ్ళినప్పుడు దేవరాజ్, సుశీల తల్లి ధన్వంతిని చూశాను

గానీ దేవదత్త బాబాయి భార్య పార్వతిని చూడలేదు. సుశీలతో గూడ మెట్లెక్కి త్వరత్వరగా మొదటి అంతస్తు మీదికి వెళ్ళాను. అక్కడ పార్వతిపిన్ని వుంటుందని సుశీల చెప్పింది. నత్త నడకతో నడుస్తున్న పార్వతిపిన్ని కనిపించింది. అంతకుముందు నే నామెను చూశానుకాని పనిమనిషి అనుకున్నాను

అక్కడ పెద్ద కొయ్యపలకమీద దారంతో అల్లుతూ కూచునివున్న బలహీనమైన స్త్రీని చూసి

'పారూ! మేము ప్రసాదం తెచ్చాము బాబాయి నీభాగం కృష్ణ ద్వారా నీకు పంపారు' అంది సుశీల

పార్వతికి ముద్దు పేరు 'పారు.' సుశీల బాబాయిని చాచాజీ అని పిలిచినట్లే గౌరవంగా పిలవక 'పారూ' అని చనువుగా ఎందుకందో నాకాశ్చర్యంగా వుంది.

'నమస్తే!' మృదువైన సన్నని గొంతుతో చెవిలో మాట్లాడినట్లుగా పార్వతిపిన్ని పలకరించింది అవిడ కూడా తనభర్త మతాన్ని అనుసరి స్తోందని నాకు తెలుసు అందువల్లనే హిందూ వ్యాపారస్తులందరు ప్రస్తుతం పలకరించే 'నీ కాళ్ళకు మొక్కుతాను' అనే మాట కాకుండా ఆర్యసమాజం వాళ్ళు వాడే పదం 'నమస్తే' వాడిందామె.

దేవదత్త బాబాయి చిన్న కవరులో అందించిన ప్రసాదం ఏలకులు సిగ్గుతో ఆమె చేతులో వుంచి చేతిలో చెయ్యికలుపుతూ మురిపెంగా పలకరించాను.

'కూచో బాబూ' అంటూ తను కూచున్న బల్ల నాకందించింది

'నేను వంటగదిలోకి వెళుతున్నాను. తినేందుకేమైనా వున్నా యేమో చూస్తాను. నాకు బాగా ఆకలిగా వుంది ' అంటూ సుశీల ముందుకు దూసుకు పోయింది.

'అమ్మా! సుశీలా నువ్విలారా! నీకు మంచి వస్తువిస్తాను తినేం దుకు ' అని సుశీలను వెనక్కు పిలిచింది.

పార్వతి మా అడుగుల చప్పుడు విని వినమ్రతతో తలపై కప్పుకున్న మేలిముసుగు అంచు తొలగించి చిరునవ్వు నవ్వింది. చామనచాయ ముఖం, సుతారమైన ముక్కు విశాలమైన కళ్ళు కలిగిన ఆమె మొదటి చూపులో దుఃఖంతో కూడుకున్నట్లు కనిపించినా నవ్వినపుడు ప్రకాశంగా వుంది.

నేను నమ్రంగా తలవంచుకుని నిలుచున్నాను. ప్రతి స్త్రీని తల్లిగా, చెల్లిగా చూడాలని అమ్మ నాకు చెప్పిన మాటలు గుర్తుకువచ్చి అలా చేశాను.

'సిగ్గుపడకు' నీ తులిపి చేష్టలు నాకు తెలుసు. బావిలో నీళ్ళు తెచ్చుకునేందుకు వస్తూపోతూ కిటికీలోంచి నిన్ను చూస్తూనే వుంటాను. నీ ముద్దుపేరు 'బుల్లి' కదూ! అంది పార్వతి. ఆమాట వినగానే నా ఆత్మాభిమానాన్ని తట్టినట్లయింది

'ఇక్కడ నువ్వు నటించక్కరలేదు. నీవు తుంటరి పనులకు అల వాటు పడ్డావుగదూ?' అంది ఆమె.

'పిన్నీ! నీ మేనల్లుడు దేవరాజు మీ కిదంతా చెప్పివుంటాడు' అంటూ అభ్యంతరం చెప్పాను. 'నేను తులిపివాణ్ణి కాదు. నా కంటె పెద్దవాళ్ళు కాబట్టి మీ దేవరాజ్, మా అన్న గణేశ్ స్నేహితులయ్యారు. వాళ్ళు నన్ను తుంటరి వాణ్ణే అంటారు..... నేను ఒక్క సుశీలతో మాత్రమే ఆడగలను.'

'మంచిది బాబూ చిన్న పిల్లలు తుంటరిగా వుంటేనే నాకిష్టం. తుంటరి పనులు చెయ్యటానికి తెలివి తేటలుండాలి. మొద్దబ్బాయిలు తులిపిగా వుండలేరు.' అంటూ నాకు భరోసా యిచ్చింది.

ఆవిడ ఆలా వివరంగా మాట్లాడటంతో నాకు హాయిగా అనిపించిది. ఆవిడ రెండు చేతులతో నేలమీద వూనుకొని లేచి నిలదొక్కుకుని అతికష్టంమీద ఒకకాలు ముందుకు చాపి మరి కొంచెం సేపటికి రెండవ కాలు ముందుకులాగి కొయ్యకాళ్ళమీద నడుస్తున్నట్లుగా నడిచింది. ఆమె నడుస్తుంటే ఆమె తెల్లటి నూలుచీర మడతలు జీరాడుతున్నాయి.

ఆమెకు వచ్చిన కష్టమేమిటో ఆమె కాళ్ళు అలా ఎందుకు నిటారుగా వున్నాయో నాకర్థం కాలేదు. ఆవిడ అంత కష్టపడి నడుస్తుంటే వంట పనంతా ఆవిడ కెందుకు అప్పగించారు? వీధి బావిలోనుంచి కాకుండ మొదటి అంతస్తు మీదినుంచి నీళ్ళు తోడేపని ఆవిడకెందుకు అప్పగించారు? నాకు బోధపడలేదు. ఆవిడబాధ నాకర్థమైంది.

ఇంతకాలంగా ఆవిడ పేరు మా కుటుంబంలోవాళ్లు ఎవరూ చెప్పక పోవడానికి కారణం ఏమిటి? చాలా కుటుంబాల్లో కొత్తగా వచ్చిన కోడళ్లు పరదాలో ఉండటం ఆనవాయితీ. ధన్వంతి పరదా పద్ధతి పాటించనప్పుడు, అదేయింట్లో ఉండే పార్వతి మనుషులముందుకు ఎందుకు రాకూడదు? అందునా ఆర్యసమాజం సిద్ధాంతాలు పాటించే ఈ యింట్లో అలా ఎందుకు జరుగుతోంది?.. .. తలపైకెత్తి చూస్తే, గోధుమల బస్తాలు కట్టలుకట్టలుగా అక్కడ ఆమె చుట్టూ పడి ఉన్నాయి. దేవదత్త భార్య అయిన ఈమె వంటమనిషిలా, ఈ సామాన్లగదిలో పడివుండాల్సిన కారణం ఏమి? ప్రసాదం యిచ్చేందుకు దేవదత్త స్వయంగా ఎందుకు రాలేదు? ఈవిడ గురించి ఏదో రహస్యం ఉండి ఉండాలి? ఈ ఉత్కంఠ నన్ను ముంచెత్తింది. ఈ యింట్లో మతాన్నిగురించి గొప్పగా చెప్పే వీళ్ళంతా మాటకారులు ఒక్క పార్వతి మాత్రం క్రియాశీలి — అని నాకు బోధపడింది.

'రా బాబూ! ఈ మేడిపళ్లు తీసుకో' అందామె.

నేను చేతులు ముందుకు చాపాను. ఆవిడ మేడిపళ్ల గుత్తి, మామిడి తాండ్ర నాచేతిలో పెట్టింది.

'నీ తమ్ముళ్లకు కూడా యివ్వాలి.' అంటూ ఆవిడ నాభుజంతట్టి చిరునవ్వు చిందించింది.

'నీకు ఈ మామిడి తాండ్ర యిష్టమైతే, రోజూ మధ్యాహ్నంపూట మేడమీదికి వస్తే యిస్తాను. అప్పుడైతే నూలువడకటం పూర్తి అయి ఉంటుంది. సాయంత్రమైతే వంటచేయడంలో హడావిడి. '

'సరే, దేవదత్త బాబాయి పాఠాలు చెప్పడం అయింతర్వాత రోజూ వస్తాను.' అన్నాను.

'మరచిపోకూడదేం!' అందామె ఖండితంగా. ఆమె దయాస్వభావం వల్ల నేను సంకటంలో పడ్డాను.

'ఇంకచాలు. కిందికి వెళ్లు, రేపురా. నాకు చేతినిండా పనివుంది' అందామె.

'పిన్నీ!' ఏదో మనసులో ఆవేదన వెళ్లగక్కాలని ఉంది. కాని, మాటలు నోటిలోంచి పెగలడంలేదు. పోకిరిమాట ఏదో అందామని అని పించింది. ఇంతలో 'మా అమ్మకు నువ్వు తెలుసా?' అన్నాను

'కబుర్లు యిప్పుడు కాదు.' అంది కళ్లు పెద్దవిచేసి నన్ను భయ పెడుతున్నట్లు మూతిపెట్టి. 'మంచివాడివిలా యివాల్టికి వెళ్లు. నేను తీరికగా ఉన్నప్పుడు రేపురా. మాట్లాడుకొందాం.' అంది.

నేను వెనక్కి తిరిగి ఆమెవైపు చూడలేదు చూస్తే ఏడుపు ముంచుకొచ్చేలా వుంది. పోకిరి పిల్లవాడన్నమాటను తలదన్నేలా, ఎదుటి వాళ్ల భావాలను గ్రహించనివాడిలా, మామిడి తాండ్ర జుర్రుకొంటూ మేడమెట్లమీది నుంచి కిందికి వురికాను. దారిలో దేవదత్త బాబాయి పిన్నిని హత్యచేసినట్లు, ఆవిడ దయ్యంగా మారినట్లు వూహించుకొంటూ సరదాగా నడిచాను.

నాలో పెరుగుతున్న ఉత్కంఠకు కారణం — తెలుసుకుందామన్న కుతూహలంగాని, భయంగాని కాదు. నేను బాగా తాగి, అందరూ తిర స్కరించిన ఈవిడను అంటిపెట్టుకొని ఉందామని అనుకొన్నాను.

జూదరి హరియా మతం నాకు బాగా నచ్చినట్లు, నేను తాగుబో తునైనట్లు ఏదో విపరీతమైన ధోరణి నాలో ఆవహించింది. ఆడవాళ్ల మధ్య నేను హాయిగా ఉన్నట్లు భావించసాగాను.

నాలో పిరికితనము, మాటిమాటికి ఏడ్చే స్వభావమువల్ల నేను ఆడపిల్లగా జన్మించి వుండాల్సిందనిపిస్తోంది. ఆడవాళ్లతో కూచోవాలనే వాంఛ వాళ్లచేత లాలించబడాలనే తాపత్రయం నాలో నిలిచిపోయాయి.

# 6

నా రహస్య జీవితంలోని బాధలు, సుఖాలు, వింతవింత అనుభవాలు, పగటికలలు, ఆకాశ హర్మ్యాలు, నీరెండ తళతళలు, కబుర్లు, కాకరకాయలు, సాహసగాధలు, కుటుంబస్త్రీల మూఢనమ్మకాలు, వాటిని గూర్చిన నా సందేహాలు, వేదసమ్మతమైన మతధర్మం, అన్నీ కలసి కట్టుగా మా పాఠశాల తలుపులు మాకోసం కష్టాలు పంచేందుకు తెరిచి ఉంచడంతో అడుగున పడిపోయాయి.

మరెక్కడా వీలుపడనంతగా, ఇక్కడ నేను పద్యాలు నేర్చుకోవచ్చు ననే నిష్కల్మష హృదయంతో నేను బడికి వెళ్లాను.

"నిన్న సూర్యోదయవేళ
నా కనులు తెరిచినపుడు" — అనే పద్యం ఈ రోజుల్లో నాకు బాగా యిష్టమైన పద్యమని చెప్పవచ్చు. కాని, ముస్లిం వాద్యగాండ్లు గాలిబ్, మీర్, హాలి కవితలు గానం చేస్తుంటే విని, నేనుకూడా నేర్చుకొని, కంఠస్థం చేద్దామని ఉబలాటపడ్డాను. ఇక్కడ అక్బరు చక్రవర్తి ఘన కార్యాలను గూర్చి, నక్షత్రాలకూ, భూమికీమధ్య దూరాన్నిగూర్చి చెబుతారని తెలిసింది. వీటన్నిటి తలదన్నేలా, తెల్లదొరలు మాట్లాడే భాషను నేను త్వరగా నేర్చుకోవాలని అనుకొన్నాను.

మేము పండిత వైద్యనాథ పాఠశాల లోపలికి యిష్టంగాను, అమాయకంగాను అడుగుపెట్టినపుడు కొన్ని భూతాలు మమ్మల్ని మేం చేసిన తప్పులకు, మా తల్లిదండ్రులు ఉన్నత వంశంలో జన్మించక పోవడమనే ఘోరతప్పిదం చేసినందుకు హింసించసాగాయి. మా తల్లిదండ్రులు సంపన్నులై ఉంటే మా గౌరవము, హోదా పెరిగి ప్రమిద దీపాల ముందు చదువుకోవడానికి బదులు కిరసనాయిలు దీపాల వెలుతురులో చదువుకొని ఉండేవాళ్లమని వారి అభిప్రాయం.

బడి తెరిచిన మొదటిరోజు కొత్తగా చేరడానికి వచ్చిన పిల్లలంతా పెద్దపిల్లలు క్రికెట్ ఆట జట్టుగా ఆడుతుంటే ఆశ్చర్యంగా చూస్తూ

నిలబడ్డారు. బడి జవాను కన్నయ్య ప్రహరీ లోపలికి వచ్చి కేకవేశాడు: 'పిల్లల్లారా! బడి పిల్లలందరినీ ఉద్దేశించి మేనేజరుగారు మాట్లాడతారు. అంతా ఒకచోట చేరండి.'

డోగ్రా తలటోపీ, ఎర్రటి డవాలు వేసుకొన్న కన్నయ్య మాటలు పూర్తి అయ్యేలోగా, డ్రిల్లు మేష్టారు హవల్దార్ లేనాసింగ్, గొర్రెల కాపరి తన మందను అదిలించేందుకు కర్రను పైకెత్తినట్లు ఎత్తి —

'వరసల్లో నిలవండి' అని అరిచారు.

పాత విద్యార్థులు, క్రికెట్ ఆడుతున్న కుర్రవాళ్లు అందరూ, వాళ్లవాళ్ల క్లాసుల వరసల్లో నిలబడసాగారు. కొత్తగావచ్చిన కుర్రవాళ్లు ఎటుచేరాలో తెలియక తికమక పడి గుంపుగా నిలుచుండి పోయారు.

'గాడిదల్లారా! దున్నపోతుల్లారా! పంది వెధవల్లారా!' అంటూ డ్రిల్లుమేష్టారు అరవసాగారు. మేము సక్రమంగా ప్రవర్తించడానికి ఆయన తన బెత్తాన్ని మామీద ప్రయోగించబోయేలోగా, దండపాణియై పండిత రామ్‌నాథ్ ప్రవేశించారు. ఆయన వెనక సిక్కు హెడ్మాష్టరు సర్దార్ కిషన్‌సింగ్ వచ్చారు.

కొత్త పిల్లల్ని తన బెత్తంతో అదుపులోకి తీసుకొని వచ్చి వర సల్లో నిలబెట్టి, డ్రిల్లుమేష్టారు వెనక్కితిరిగి పెద్దలకు 'సెల్యూట్' చేసి నిలచున్నారు.

మీసాలు మెలివేసుకొంటూ, సైన్యాధ్యక్షుడు తన సిపాయిలతో మాట్లాడినట్లుగా మేనేజరు మాట్లాడారు:

'ఈ రోజు కొత్తసంవత్సరం ఆరంభమైంది. పాత పిల్లలకు మన బడి నియమావళి తెలుసు. వాళ్లు కొత్త పిల్లలకు ఆ నియమాలన్నీ చెబుతారు. వ్యాపారుల పిల్లలు, గుమాస్తాల పిల్లలు, చేతి పనివారి పిల్లలు నేర్చుకోవల్సింది ఎంతో ఉంది. 'వాటర్‌లూ నగరంలో జరిగిన ఫ్రెంచి యుద్ధం, ఈటెన్ క్రీడాస్థలంలో జయం సాధించింది' అన్న ఆంగ్ల సామెత వారు గుర్తుంచుకోవాలి. మీరు క్రమశిక్షణ అతిక్రమిస్తే మీ నడుములు విరగగొట్టి మీ డ్రిల్లు మేష్టారు మిమ్మల్ని దారిలోకి తీసుకొ

స్తారు. మనం అందరం కలుసుకొన్న ఈ శుభ సందర్భంలో ఈ రోజు సెలవు ప్రకటిస్తున్నాం. రేపటినుండి క్లాసులు యధావిధిగా జరుగుతాయి.'

'భలే భలే!' అంటూ గెంతులు వేస్తూ పిల్లలు తలోదారిగా పరుగులు తీశారు.

'గాడిదల్లారా!' అంటూ డ్రిల్లుమేష్టారు బెత్తం ఝళిపించారు. ఎక్కడ వాళ్లక్కడే పిల్లలు నిలబడి పోయారు.

'మీరంతా పండిట్ రామ్‌నాధ్‌గారికి జేజేలు పలకండి. జై జై'

'జై! జై' అని గొంతు కలిపారు అందరూ.

'ఇంక వెళ్లవచ్చు' అంటూ 'డిస్మిస్' అన్నారు డ్రిల్లుమేష్టారు.

బావికి దగ్గరగా ఉన్న తినుబండారాల వాడి దగ్గరకు, బడి ప్రహరీ దగ్గరకు అంతా పరుగులు తీశారు. బయట తినేందుకు మాకేమీ పైసలు యివ్వలేదు గాబట్టి. నేనుగాని, గణేష్‌గాని వెళ్లలేక పోయాం.

నేను వెనక్కి తిరిగేటప్పటికి డ్రిల్లుమేష్టారు బెత్తం నా వీపుమీద నాట్యం చేసింది. యింతలో నా వెనకనుంచి పరుగెత్తివచ్చిన గుంపు నన్ను పడదోశారు. చిన్నపిల్లాడిలా నేను ఏడుస్తూ కింద పడిపోయాను. నామీద నాకే జాలివేసి కళ్లనీళ్లు జలజలా రాలాయి.

మర్నాడు విక్టోరియారాణి పాలరాతి విగ్రహాన్ని అనుకొని నడుస్తూ, కృష్ణావస్త్రాలయం మేడమీదికి యిరుకు దారిలో, చీకట్లో మెట్లెక్కుతూ వెళ్లి, మురికి బట్టిన గదిలోకి నాల్గోతరగతి విద్యార్థులమంతా వెళ్లాం. మంచి సీట్లకోసం అందరం పాకులాడటం మొదలెట్టారు.

ఇంతలో ఒక బొంగురుగొంతు మమ్మల్ని అదిలించడం వినిపించింది.

'ఎక్కడి వాళ్లక్కడే నిలవండి!'

ఈ స్పష్టమైన గొంతువెనక ఒక నల్లటి భూతాకారంలో వ్యక్తి మాకు తారసపడ్డాడు. చేతిలో బెత్తం, స్ఫోటకం మచ్చల మొగం, బవిరి గడ్డం, అందంగా తీర్చిదిద్దిన తెల్లటి తలపాగా, తెల్ల చొక్కా, తెల్ల పైజమాలో ఆయన ప్రత్యక్షమయ్యాడు.

అక్కడవున్న కుర్రవాళ్లందరిలోకి చిన్నవాణ్ణి కావడంవల్ల, పెద్దపిల్లల్తో కుస్తీపట్లు పట్టలేక, మేష్టారు దగ్గరగా నిలుచుండి పోయాను. న్యాయం చేకూర్చే మేష్టారు నన్ను తప్పకుండా ముందువరుసలో కూచోనిస్తాడని ఆశ. మళ్లీ పక్కకు జరిగి నిలుచున్నాను.

'అరె. చుంచువెధవా! అక్కడినుండి ఒక్క అడుగు కదలకు. నీ చుంచుమొహం నువ్వూను.' అంటూ మేష్టారు గదమాయించారు.

నన్ను 'చుంచు' అని మేష్టారు పిలవడంవల్ల అవమాన పరిచినట్లు బాధపడ్డాను. ఇది ఆసరాగా తీసుకొని పిల్లలు రేపటినుంచి నాకు మారు పేరు 'చుంచు'గా పెట్టగలరని నాభయం. మేష్టారు గొంతు వినబడగానే నేను స్థాణువులా నిలుచుండిపోయాను.

'చెయ్యి చాపరా! నేను బిషన్‌సింగ్ మేష్టార్ని, నా క్లాసులో గోలచేస్తే చంపేస్తాను.' అని ఆ భూతాకారం అరిచింది.

అప్రయత్నంగా నేను నాచేతులు వెనక్కి దాచుకొన్నాను.

'నేనేమీ చెయ్యలేదు మాష్టరుగారు! నేను చిన్న పిల్లవాణ్ణి అయి నందున నాకు బల్ల దొరకలేదు... అందువల్ల...'.

'గాడిద వెధవా! చేతులు చాపు. ముందు కుడిచెయ్యి. తర్వాత ఎడంచెయ్యి'

బెత్తం చూడగానే బెదిరి పోవడంవల్ల నేను చేతులు చాపలేదు. ఆయన బాగా ముందుకు వంగి, నా కుడి చేయిలాగి, తను ముందుకు చాపి, బెత్తంతో ఒకటి వాయించాడు.

అమ్మా అన్న అరుపు సన్నగా గొంతులోంచి వెలువడింది. ఏడుస్తున్నాను.

బిషన్‌సింగ్ మేష్టారు నా ఎడంచేయి అలానే లాగి మరో దెబ్బ కొట్టారు. ఆయన కనుగొలకుల్లో రక్తపు చారలు దాగి ఉండటం గమనించాను.

'నన్నెందుకు కొడుతున్నారు. బల్లకోసం పోట్లాడింది నేనొక్కణ్ణే

మాత్రం గాదు. నేనేమీ తప్పు చేయలేదు.' ఎదురు జవాబుగా అరిచాను. పోకిరితనం, ఆటకాయితనం నాలో మిగిల్చిన అహంకారానికి చిహ్నంగా ఆ మాటలు వచ్చాయి.

'నోర్ముయ్' అని అరుస్తూ, చెంప మీద ఒక లెంపకాయ వేశారు. నోట్లోంచి రక్తం రాసాగింది.

గణేశ్ ఎలానో ఆరో వరుసలో బల్ల సంపాయించ గలిగాడు. అక్కడ నుంచి సానుభూతిగా గొణిగాడు.

బిషన్‌సింగ్ మాష్టరు వాడి దగ్గరకు వెళ్ళి నిశబ్దంగా వాణ్ణి ఒక దెబ్బ వేశరు. బెత్తం వాడి మెడ మీద చురుగ్గా తగిలింది.

'వాడు..' గణేశ్ చేతులు జోడిస్తూ అన్నాడు.

'నేను అడిగితే తప్ప ఎవడూ నోరు విప్పడానికి వీలులేదు.... శబ్దం అనే మాట బయటికి రాకూడదు. పిల్లలందరూ బల్లలు ఖాళీ చేసి బయటకు రండి. నేను హాజరు పిలుస్తాను. మీ వరుస నెంబర్ల ప్రకారం ముందు నుంచి బల్లలు ఆక్రమించండి. అడవి జంతువుల్లాగా కాకుండా మర్యాదస్తులైన బడి పిల్లల్లాగా ప్రవర్తించండి. మీరు ఆంగ్ల భాష బాగా నేర్చుకోవాలంటే, సైనికుల్లాగా ఆజ్ఞలు పాటించాలి.' అని ఆదేశించారు మేష్టారు.

ఆయన మళ్లీ నిశబ్ద వాతావరణంలో తన బరువుకు చెప్పుల శబ్దం మాత్రమే వినిపిస్తుండగా వెళ్ళి నిలుచున్నారు. హాజరుపట్టీని విప్పుతూ, కూచున్న వెంటనే పేర్లు పిలవడం మొదలెట్టారు.

మొదటి ఒకరిద్దరు పిల్లలు హాజరు పలికారు, కాని, ఆయన చెప్పిన పద్ధతి వారికి అర్థంగాక ముందుకు రాలేదు.

రక్తవర్ణమైన తన కళ్ళను హాజరుపట్టీలోంచి పైకి తిప్పుతూ మేష్టారు పెద్దగా అరిచారు.

'లాభారాం, రామ్ లాభ! ముందుకు రండి.'

స్ఫోటకం మచ్చల మొహం, ఇంగ్లీషు సూటు వేసుకొన్న అందమైన

ఒక కుఱ్రవాడు, ముతక గుడ్డలు కట్టుకున్న పొడవాటి మరో కుఱ్రవాడు ముందుకు వచ్చారు.

'చేతులు చాపండి' అన్నాడు మేష్టారు తన కుర్చీ దగ్గరకు వాళ్ళు రాగానే. మేష్టారు వాళ్ళిద్దరికి చెరి రెండు దెబ్బలు వేసి, యిలా అన్నారు.

'కొంటె వెధవల్ని, అడ్డ గాడిదల్ని, పోకిరి వాళ్ళనీ నేను కొడ తాను. నాకు దగ్గరలో ఉన్న బల్లలనుండీ వరుసగా మీ హాజరు నెంబర్ల ప్రకారం కూచోమని చెప్పానా?'

'మేం వినలేదు మేష్టారు' అన్నారు వెనుక వరసలో పిల్లలు.

అంబోతులాగా నడుచుకొంటూ వెనక బెంచీల దగ్గరకు మేష్టారు వెళ్ళి, ముందు వెనకలు చూడకుండా, ఎవరు మాట్లాడిందీ పట్టించు కోకుండా తలావొకటి వాయించారు.

ఇది అన్యాయమనిపించింది నాకు. అప్పుడే ఆపుకొన్న ఏడుపు, నేను వాళ్ళకు సానుభూతిగా మళ్ళీ మొదలెట్టాను. నా వెనుక బెంచీలో కుఱ్రాళ్లు ఏడుస్తూనే వున్నారు. బుసలు కొడుతున్న అంబోతులాగా మేష్టారు అన్ని వరుసల్లోనూ తిరిగి, అక్కడొకణ్ణి, ఇక్కడొకణ్ణి నిర్దాక్షి ణ్యంగా కొట్టసాగారు. ఆయన తన ఉనికిని మా కందరికీ తెలిసేలా అమ్మ కథలో చెప్పిన, మృత్యుదేవత యమ ధర్మరాజులా, మాకు కని పించాడు, అప్పటి వరకు ఏడుస్తున్న కుఱ్రవాళ్ళ నోర్లు నొక్కుకొని, చూపులద్వారా కదలికలద్వారా దుఃఖం వ్యక్తం చేశారు.

'అమృతసర్ వ్యాపారుల బిడ్డలైన మీకు మర్యాదనేర్పిస్తాను ముందు. నా క్లాసులో నిశ్శబ్దంగా ఉండాలి. తెలిసిందా!' అంటూ తనకుర్చీ దగ్గరగా వెళ్లి 'నేను పాఠాలు మొదలెట్టినప్పుడు మీరు ఏకాగ్రత నేర్చుకొంటారు. ఇంగ్లీషు ఎవడికంటె వాడికి గాడిద కొడుకులకు సాధారణంగా అబ్బే భాషకాదు. శ్రద్ధగా చదువుకొనే వాళ్లు ఫర్వాలేదు... మిగతావాళ్లు' 'ప్రైవేట్ ట్యూషను' చెప్పించుకోవాలి. పిల్లలకి ఇంగ్లీషు భాష బాగా నేర్పించడానికి, బడి వదిలింతర్వాత, నా విరామ సమయం త్యాగంచేసి యింటి దగ్గర 'ట్యూషన్' చెబుతాను. అక్కడికి ఎవరైతే రాదలచు కొన్నారో వాళ్లు రేపు, ఎల్లుండిలో నాకు చెప్పాలి. ఎవరెవరు వస్తారో

నాకు తెలిసినట్లుంటుంది. ఒక గంట ప్రైవేటు పాఠాలు చెప్పినందుకు గంటకు నెలకు వొక్కొక్క కుర్రవాడి దగ్గర ఇరవై రూపాయలు తీసుకొంటాను' అన్నాడు మేష్టారు.

చాలా మంది పిల్లలు ఈ మాటవిని ఊపిరి పీల్చుకొన్నారు. ట్యూషన్ చేరితే బిషన్‌సింగ్ మేష్టారు నిర్దయగా కొట్టరనే ధీమావాళ్లకు కలిగింది. ఈ మేష్టారు దగ్గర ట్యూషన్ చెప్పించుకోవడానికి అమ్మను ఇరవైరూపాయలు ఇవ్వమని అడగాలని మనసులో నిశ్చయించుకొన్నాను. నౌషిరాలో మా మేష్టారు షేర్‌గుల్, అందమైన వస్త్రాలు ధరించిన ఈ దున్నపోతుకంటె మెరుగుగా కనిపించాడు. ఆయన బెత్తం ఝళిపిస్తూ పిల్లల వీపులమీద కాకుండా నేలమీద తడుతూ బెదిరించే వారు.

బిషన్‌సింగ్ మేష్టారు మొహంపై మచ్చలు భయంకరంగా ఉన్నా, ఆయన చిన్నగడ్డం నాకు సరదాగా కలిపించింది. మాకులంవారిపై ఆయన విసిరిన తిట్లు నేను చిన్న కుర్రవాడినైనా, నా హోదాపై దెబ్బతీసినట్లయింది. మిగతావాటి అన్నింటికన్నా, ఒక విధమైన ఆందోళన నాలో ప్రవేశించింది. ఇంతకు ముందు జరిగిన వాటికంటె ఎక్కువగా ఘోరవిపత్తు జరగబోతోందని ఊహించాను.

'ముత్యాల్లాంటి నా బిడ్డల్ని కొట్టడానికి ఎంత ధైర్యం? నా బిడ్డల్ని కొట్టడానకి ఎన్ని గుండెలు' అని బిషన్‌సింగ్ మేష్టార్ని ఎద్దేవా చేసింది అమ్మ, మేం వెళ్లి చెప్పగానే.

'అమ్మా! ఆయన దగ్గర ట్యూషన్ చెప్పించుకొందాం. ఒక యింట్లో ఇద్దరు అన్నదమ్ములుంటే ఆయన ఒక్కొక్కళ్ల దగ్గర పదిరూపాయలు తీసుకొని రాయితీ యిస్తారని విన్నాను' అన్నాడు గణేశ్ ప్రాధేయపూర్వకంగా.

'నా మొహం. నాదగ్గర ఆయన కివ్వడానికి 20 రూపాయలేవి? మీ నాన్న లక్షలిచ్చిపోలేదు.' అంది అమ్మ గణేశ్ మీద తుఫానులా విరుచుక పడుతూ.

'రెండిళ్లు, అంగడిమీద వచ్చే బాడుగ మాత్రం వాడుకోమన్నారు. ప్రతిపైసాకు నేనాయనకు జమాఖర్చు చెప్పాలి. ఆయన ఎంత జాగ్ర

త్తగా మీ చదువులకోసం, పెళ్లిళ్లకోసం, ఆదాచేస్తారో మీకు తెలియదూ! ఆ వచ్చేనెలసరి డబ్బుతో గోధుమపిండి, కాచిన వెన్న కొనుక్కోవాలి. నాషిరాలో అయితే రెజిమెంటల్ బజారులో నిత్యవసరవస్తువులు ఉచితంగా యిచ్చేవారు. యుద్ధంవల్ల ధరలు మండిపోతున్నాయి! క్లాసులో మేష్టారు వేసే ప్రశ్నలకు సరిగా సమాధానం చెప్పడానికి యింట్లో ఎందుకు శ్రద్ధగా చదువుకోకూడదు? దేవదత్త బాబాయి దగ్గర తెలియని పాఠాలు చెప్పించుకోండి. మీ బాబాయి అంగట్లో కూచొని వాజెమ్మల్లా తిరగడం కాకుండా; మీతోడి కంసాలి పిల్లల్తో కలిసి ఆటలాడుకోని కాలం వృథా చెయ్యవద్దు.'

'అమ్మా! నీకర్థం కావడంలేదు. మేం ఆ భూతందగ్గర ట్యూషన్ కెళ్లకపోతే, రోజు మాకు దెబ్బలు తప్పవు. ఎలాగైనా ఆయన చెప్పేదాని కంటె ఎక్కువ మేం నేర్చుకోవాలి' అన్నాను నేను వాదవాధోరణిలో.

'అమ్మాయిలూ! చీకటిపడింది.' అని కేకవేసింది, మా యింటి మొదటి అంతస్తులో కూచొని కబుర్లు చెప్పుకొంటున్న ఆడంగుల్ని ఉద్దేశించి అమ్మ.

'ఏం జరిగింది?' ఆదుర్దాగా అడిగింది లచ్చి.

'ఏమైంది నాయనా?' అంది కోకోకిల్లి యిళ్లలో బాడుగకుండే ఫ్యాక్టరీ యజమాని బాబూమురళీధర్ భార్య బాహూ.

'నాదగ్గరకు రా బాబూ!' అంది బుంగమూతి పెట్టి, నా ముఖం కేసిచూసి దేవకి.

"పిల్లవాళ్లందరి దగ్గరా లంచం కావాలని వాళ్ల మేష్టారు కొట్టారు." అమ్మ విశదంగా చెప్పింది.

'మీ బాబాయి దగ్గరకెళ్లి చెప్పండి. ఆయన హెడ్మాష్టరులో మాట్లాడుతారు' అంది దేవకి.

'దేవదత్త వెళ్తారు. ఆయన చదువుకున్నవారు గాబట్టి' అంది అమ్మ.

'నిన్నరాత్రి ఆయన తన చదువుకోసం లాహోరు వెళ్లారు. ఆయన

లాహోరులోని ప్రభుత్వ కళాశాలకు తన చదువుకోసం వారానికి రెండు సార్లు వెళ్లాలి. కాబట్టి ప్రతిరోజు మాకు పాఠాలు చెప్పడం కుదరదు' అన్నాను నేను.

'అయితే, పండిత రామనాథ్‌ను కలవడానికి నేనే వస్తాను. వాళ్ల ముసలి నాన్నకు పిల్లకావాలన్న హరిశంకర్‌ను కూడా కలుస్తాను. ఇంకమీరు నా జుట్టుపీక్కు తినవద్దు. మీరు తినేందుకు మిఠాయిలు తీసు కెళ్లి మీ దేవదత్త బాబాయి చదువుకొనే గదిలో కూచొని పాఠాలు మొదలెట్టండి.' అంది ఖండితంగా అమ్మ.

దేవదత్త బాబాయి లాహోరు వెళ్లారు గాబట్టి, ఆయన భార్య పారును కలవడానికి వెళ్దామనుకొన్నాను. ఆవిడ నాపట్ల సానుభూతి చూపగలదు. ఈ వాడలో అందరి ఆడవాళ్లలో ఆమె తక్కువగా, చూడబడుతోంది. పిల్లల్లో నేను ఎలా తక్కువగా, ఒంటరిగా ఉన్నానో, ఆవిడకూడ అదే స్థితిలే ఉంది. ఆవిడ నాకష్టాలు అర్థం చేసుకోగలదు.

నేననుకొన్నంతా జరిగింది. పప్పుల్లోంచి రాళ్లు ఏరుతూ కూచున్న ఆవిడ నాకేసి ఆదరంగా చూడలేదు.

నన్ను మేష్టారు కొట్టిన విషయం, దయనీయంగా నేను వర్ణించి చెప్పినప్పుడు ఆవిడ నన్ను కౌగిట్లోకి లాక్కొని యిలా అంది.

"బాబూ! ఈ దుష్ట ప్రపంచంలో పెరగడమనే బాధను నీవు సహించాలి. మిగతా ఆడపిల్లలందరికన్నా నేను పాఠాలు త్వరత్వరగా నేర్చుకొన్నప్పటికీ, నన్ను బడిలో కొట్టేవారు బెత్తంద్వారా భయపెట్టి పిల్లలకు చదువు చెప్పడమనే పద్ధతి అన్ని పాఠశాలల్లోను పాటిస్తున్నారు. మేం చదువుకొన్న డి.ఏ.వి. బాలికల మిడిల్ స్కూలులో సత్యవతి అనే ఆవిడ హెడ్‌మిస్ట్రెస్‌గా ఉండేవారు మీ భగవంతిపిన్ని అసిస్టెంట్ హెడ్‌మిసెస్. అందరి ఆడపిల్లల విషయంలో ఏదో ఒక తప్పుపట్టి, మమ్మల్ని అందర్నీ కొట్టేవారు. ఇప్పటికీ భగవంతి అప్పుడప్పుడు నన్ను కొడుతూ ఉంటుంది. నాకాళ్ల కేదో వ్యాధి వచ్చింది. అందువల్ల నేను సరిగా నడవలేను. అది నా తప్పుగా భావించి ఆవిడ నన్ను కొడుతుంది. ఆవిడకు పెళ్లికాలేదనే దుఃఖంతో, ఆవిడ చుట్టూవున్న వారినీ, బడిలో

పిల్లల్ని హింసించి సంతోషిస్తుంది. ఏదో ఒకరకంగా ఈ ప్రపంచంలో ప్రతివొక్కరూ యితరుల్ని బాధ పెడతారు..."

'అయితే పారూపెన్నీ, యితరులు కొట్టడాన్ని దేవదత్త బాబాయి ఎలా సహిస్తారు?'

'నువ్వు అమాయకుడివి బాబూ. నీకెలా చెప్పను. జీవితం బాధా మయం' అంది కళ్ళనీళ్లు పెట్టుకొంటూ పారూ.

'ఆయన అసలు నీతో మాట్లాడరా?' అని అడిగాను నేను — భార్యా భర్తలమధ్య ఘర్షణ ఉందని పసిగట్టాను గాబట్టి.

'అనాధతో ఎవరు మాట్లాడతారు బాబూ!' అంటూ ఆవిడ పక్కకు తొలగిచూసి ఎవరూ చుట్టుపక్కల లేరని స్థిరపరచుకొని యిలా చెప్పసాగింది

"నేను మంచి మార్కులతో నెగ్గాను కాబట్టి భగవంతి స్వయంగా నన్ను మీ బాబాయికిచ్చి పెళ్లిచేసే ఏర్పాటు చేసింది. అప్పటికే బాబాయి వాళ్ళంతా ఆర్యసమాజంలో చేరి పేదవారికి సహాయం చేసి ఆదర్శంగా వుండాలని అనుకుంటున్నారు. నేను బాలవితంతువుని. నాకు అయిదు సంవత్సారాలప్పుడు నా తల్లిదండ్రులు నన్ను ఒక గుమస్తా కిచ్చి పెండ్లి చేశారు. నేను మా అత్తవారింటికి వెళ్లటానికి ముందే ప్లేగు వ్యాధివచ్చి ఆయన, మా అమ్మ, నాన్న చనిపోయారు. పేదవారి కోసం పాటుపడే భగవంతి బాలవితంతువునైన నన్ను అనాధగా చేరదీసి ఆర్యసమాజ పాఠశాల వసతి గృహంలో వుంచింది. ఆవిడ నాపట్ల ఒక్కొక్కసారి దయతోను ఒక్కొక్కసారి క్రూరంగానూ ప్రవర్తించేది. ఆవిడ ఎప్పుడూ అలానేవున్నా మీ బాబాయి మా పెళ్ళయిన కొత్తల్లో నాతో బాగానే వుండేవారు. ప్రియంగా మాట్లాడేవారు. భగవంతి, ధన్వంతి నిజంగా ఆర్యసమాజం వాళ్ళు కాదు. సంఘసంస్కర్తల లాగా దొంగాటకం ఆడేవారు. జబ్బుపడ్డంవల్ల నాకాళ్ళకు వచ్చిన అవిటి తనం చెడుఫలితాల నిస్తుందని నేను దురదృష్టవంతురాలనని మీ బాబా యికి చెప్పసాగారు. వాళ్ళ భయంవల్ల మీ బాబాయి నాతో ధైర్యంచేసి మాట్లాడేవారు కాదు. అడపా దడపా ఒకటి రెండు మాటలు పలికే

వారు." ఈమాట లంటూ ఆవిడ కళ్ళు మూసుకొని తన పైట చెంగుతో కన్నీళ్ళు తుడుచుకుంటూ ఏడుపు ఆపుకుంది.

నేను ఆవిడ దగ్గరగా వెళ్ళి "ఏడవకు! నీపట్ల ప్రేమగా వుండమని బాబాయితో చెప్తానులే" అన్నాను.

'నేను నీతో చెప్పిన మాటలు ఎవ్వరితో చెప్పకేం! చెప్పావంటే నామీద ఒట్టు. నాకు మిగిలింది ఒక్క చావు మాత్రమే నేను హాయిగా వుండాలంటే అదొక్కటే మార్గం. .. ఎవరితో చెప్పవు కదూ' అంది.

'నామీద ఒట్టు. ఎవరితో చెప్పను. నీకు బావిలో నుండి నీళ్ళు తెచ్చిపెడతాను.' అన్నాను.

ఆవిడ ఏడుపు ఆపుకుంటూ నేనన్న మాటలకు నవ్వింది. కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ యధాప్రకారం ముఖంపెట్టి అంది, 'నీకు మామిడి తాండ్ర పెట్టెలో దాచింది తీసిస్తాను. బహూశా ఇవాళ సాయంత్రానికి లాహోరు నుండి మీ బాబాయి తిరిగి వస్తారు. నీవు మీ బిషన్ సింగ్ మాష్టారును గురించి తప్పకుండా చెప్పు. ఆయన మీ బాబాయికి తెలిసేవుంటారు. తప్పకుండా వెళ్ళి మాట్లాడుతారు.'

* * *

ఆ సాయంత్రం దేవదత్త బాబాయి లాహోరు నుండి తిరిగి రాకపోవటం వల్ల ఆ మర్నాడు ఉదయం పండిత రామనాధాన్ని చూడటానికి వస్తానన్న అమ్మను ఆపలేక పోయాను. మా బడికి వెళ్ళే దారిలో అమ్మ కాళీమాత గుడి దగ్గిర ఆగింది. ఆ గుడి మా పాఠశాల భవనాలకు కుడివైపున వుంది. కాళీమాత నల్లని రూపంతో ఎఱ్ఱటి నాలుక బయటికి చాపి నాలుగు చేతులతో భయంకరంగా ఉంది. అమ్మ ఆ విగ్రహం ముందు ప్రణమిల్లి కొబ్బరికాయ నైవేద్యం పెట్టి ఇలా ప్రార్థించింది. 'తల్లీ! నా బిడ్డలు పరిక్ష నెగ్గేటట్లు, ఉపాధ్యాయులు వాళ్ళను కొట్టకుండా చూడు. నీవు బడికి దగ్గరగా వున్నావు కాబట్టి వాళ్ళ భాధ్యత నీకు అప్పగిస్తున్నాను.'

గర్భగుళ్ళో విగ్రహానికి వెనుక నించీ ధూపహారతి వెలిగించి చేతులో పట్టుకొని పూజారి ముందుకు వచ్చాడు. 'భక్తులారా! కాళీమాతకు

కొంచం సేపట్లో మేకపోతును బలి యివ్వబోతున్నాము అందరూ ఆ బలి చూడండి' అన్నాడు పూజారి.

అమ్మ హారతి పళ్ళెంలో పూజారికి ఒక రూపాయవేసి ఇలా ప్రార్థించింది· 'స్వామీ! నా బిడ్డలను మాష్టారులు చంపకుండా కాళీమాతను ప్రార్థించండి. నేను ఒక మేకపోతును స్వయంగా సమర్పిస్తాను.'

'అమ్మా! వెళదాం రా' అన్నాను విసుగ్గా. నా కోసం ఒక మేకపోతును చంపడమనే భయంకర దృశ్యం నాకు నచ్చలేదు. కాళీమాత విగ్రహం ముందు ఇంతకు ముందు బలి యిచ్చిన రక్తపు చారలు ఎండి కనిపిస్తున్నాయి.

* * *

నేను అమ్మ కంటె గణేశ్ కంటె ముందు గుళ్ళోనుంచి పరుగెత్తాను. గణేశ్ అమ్మ వెనుక శాంతంగా వస్తున్నాడు. ఆఫీసులో కెళ్ళి బాబూ హరిశంకరును తీసుకొని వచ్చి అతని ద్వారా అమ్మను మేనేజరు గదిలోకి తీసుకెళదామనుకున్నాను. నేను తిరిగి వచ్చేలోగా అమ్మ ఎలాంటి పట్టింపులు లేకుండా పండిత రామనాధ్ గారి ఆఫీసు గదిలోకి ప్రవేశించడం చూశాను.

'వీరు లల్లా రామచంద్ తాలూకు మనుషులు'. అన్నాడు గుమస్తా మేనేజరుకు పరిచయం చేస్తూ.

'హరిశంకర్ ఆవిడకు ఒక కుర్చీ వెయ్యి. మా వదినగారు ఇంత శ్రమ తీసుకొని రావలసిన అవసరం ఏమొచ్చింది?'

'ఈమెగారు ఈ తుంటరి పిల్లలు చెప్పిన మాటలు విని వచ్చారు. బిషన్ సింగ్ నా గదిలో వున్నారు. ఆయనను పిలుచుకొని వస్తాను' అంటూ గంభీరంగా వెళ్ళాడు.

'అమ్మా! లేచి కుర్చీ మీద కూర్చో' అంటూ మర్యాదగా మేనేజరు మాట్లాడారు. కానీ ఆయన కోపంతో వున్నట్లు కనిపించారు. 'ఈ చాడీ చెప్పే వెధవల వల్ల మీకు శ్రమ కలిగింది ' అన్నారు. 'శ్రమ ఏమీ లేదు. మీ సిక్కు మాష్టారుగారు మా పిల్లలకు ట్యూషను

చెప్పినందుకు నేను ఫీజు యిచ్చుకోలేను' అంది అమ్మ.

'ఈ పిల్లలను మేము ప్రత్యేకంగా శ్రద్ధ చూపి చేర్చుకున్నాము. మీ వద్ద మేము చందా కూడా తీసుకోలేదు. మా అన్నయ్యతో సమానమైన మీభర్తతో మాకున్న పాత స్నేహం వల్ల అలా చేశాము. లేకపోతే బయటి పాఠశాలల నుండి వచ్చే పిల్లలకు ఇక్కడ ఖాళీలు లేవు. వీళ్ళు చదువులో వెనుకబడి వున్నారు కాబట్టి బిషన్ సింగ్ మాష్టారు వీళ్ళకు ప్రత్యేకంగా తర్ఫీదు అవసరమని భావించి వుంటారు.' అన్నాడు మేనేజరు.

ఈ సంభాషణ సమయంలో బాబూ హరిశంకర్ తలుపు తెరవగా పర్వతాకారంలో వున్న ఏనుగు గున్న రూపంలో బిషన్ సింగ్ మాష్టారు అసహనంగా ప్రవేశించారు.

పండిత్ రామనాధ్ ఆయన్ను ప్రశ్నించే లోపలే అమ్మ కాళీమాత ఆవేశించినట్లు బిషన్‌సింగ్‌తో నేరుగా మాట్లాడసాగింది.'మాష్టారు గారూ! వీళ్లని క్షమించండి. వీళ్ళు మీ యింటి దగ్గిర ప్రత్యేక తర్ఫీదు తీసుకోలేరు. వీళ్ళ నాన్న యుద్ధంలో మిమల్ని అందర్నీ జర్మను దేశస్థుల నుండి కాపాడటానికి వెళ్ళారు. నేను వీళ్ళ బడి జీతాలే కట్టలేకండా వున్నాను. జీతం కట్టే దానికన్నా రెండింతలు మీకిచ్చు కోలేము. లాహోరు విశ్వవిద్యాలయం నుంచి బి.ఏ. పట్టాపుచ్చుకున్న లల్లా దేవదత్తు వీళ్ళకు యింటివద్ద పాఠాలు చెప్తారు.' అంది అమ్మ ఎగతాళిగా చేతులు జోడించి నమస్కరిస్తూ.

'పండిట్ జీ! దేవదత్త ఈ సంవత్సరం ఎమ్.ఏ లో తప్పాడు తెలుసా?' అన్నాడు బిషన్‌సింగ్.

'ఆయన మంచి మనిషి. వీళ్ళకు చెప్పగలిగినంత తెలివితేటలు వున్నాయి! ఇంగ్లీషు వాళ్ళకు ఆయనంటే పడదు గాబట్టి ఎమ్.ఏ లో తప్పించారు.' పల్లెటూరి బైతు అనే విషయం కొట్టవచ్చేటట్లుగా కనిపిస్తుండగా అమ్మ అంది.

'ఏరా! పిల్లలూ! నా దగ్గిర ప్రైవేటు చెప్పించుకోమని నేను మీకు ఎప్పుడు చెప్పానురా?' అన్నాడు బిషన్ సింగు మాకేసి చూస్తూ.

'సరే మాష్టారూ! వీళ్ళనేమి అనకండి. వీళ్ళ నాన్న కూడా ఇక్కడ లేరు. వాళ్ళమ్మ చెప్పినట్లుగా వాళ్ళ చదువు ఎలానో చదువు కుంటారు. వాళ్ళు పాఠాలలో వెనుకబడి వున్నారని నాకూ తెలుసు' అన్నాడు మేనేజరు బిషన్ సింగుతో.

'అమ్మా! పొరపాటు క్షమించండి. మీకు శ్రమ కలిగించాము. ఈ వెధవలు నేరుగా నాతో వచ్చి చెప్పాల్సింది. మాటా పలుకూ లేదు. ఒకసారి వీళ్ళ బాధ్యత మేము తీసుకున్న తర్వాత వీళ్ళకు మేము చేయగలిగిందంతా మేము చేసి ప్రతిసంవత్సరం పరీక్ష నెగ్గేలా చూస్తాము. మాష్టార్ల మీద వీళ్ళు చాడీలు చేప్తే మీరు పట్టించుకోవద్దు. ఒక్కోసారి అల్లరి పిల్లలను దండించక తప్పదు.' అన్నాడు అమ్మతో మేనేజరు.

'ఒరేయ్! మీరిద్దరూ మీ తప్పు కప్పిపుచ్చుకొని మాష్టార్ల మీద చాడీలు చెప్పడం మానుకోండి. మీ వీధిలోని తిరుగుబోతు కంసాలి పిల్ల లతో కాలక్షేపం చేయ్యక బడి ఆటస్థలంలో క్రికెట్టు ఆడండి' అన్నాడు మాకేసి చూస్తూ.

'పండిట్ జీ! ఆ పిల్లలతో తిరగొద్దని మీరు బుద్ధి చెప్పినందుకు నాకు సంతోషంగా వుంది' అంది అమ్మ. 'వీళ్ళ విషయం నేను చూసుకుంటానులే అమ్మా! హరి శంకర్! వీళ్ళను నీకొడుకు గౌరీ శంకరుకు పరిచయంచెయ్యి. అతను బాగా క్రికెట్టు ఆడతాడు. వీళ్ళకు తర్ఫీదు ఇస్తాడు.... మాష్టారూ! మీకు శ్రమకలిగించాను.' అన్నాడు మేనేజరు.

అమ్మ మమ్మల్నిద్దరినీ పొదివి పట్టుకొని బయటికి వస్తూ బిషను సింగు మాష్టారు మీద కచ్చతో ఇలా అంది: 'మాష్టారూ! వీళ్ళిద్దరూ ఇవాళ క్లాసుకాలస్యంగా వచ్చారని కొట్టకండి' అంది.

బిషన్ సింగు మాష్టారు గంభీరంగా ఏమీ మాట్లాడలేదు. ఈలోగా మేనేజరు చూపుల్ని గమనించి బిషను సింగు మాష్టారు మళ్ళీ లోపలి కెళ్ళారు.

మేనేజరు గదిలో నుంచి బయటికి రాగానే నాకు పట్టరాని కోపం వచ్చింది. 'నీతో చెప్పానా! నీవు వచ్చి ప్రయోజనం లేదని నీవు నామాట

వినలేదు. జీవితాంతం మాపట్ల ఆయన కక్షగా వుంటాడు. నిన్ను తీసుకొచ్చామని పిల్లలందరూ మమ్మల్ని ఎగతాళి చేస్తారు.' అన్నాను అమ్మతో.

'మా యిద్దరికీ సగం ఫీజు తీసుకునేందుకు ఒప్పుకుని వుండేవాడు.' అన్నాడు గణేశ్.

'బాబూ! నన్ను హింసించకండి. మీ ట్యూషను కోసం ఒక్క పైసాకూడా యిచ్చే స్తోమత నాకు లేదు' అంది అమ్మ.

'అమ్మా! ఈ బళ్ళో మాష్టార్లకు జీతాలు ఎక్కువగా రావు. వాళ్ళు ఎలానో బతకాలి' అన్నాడు హరిశంకర్.

'నిజమే పేద తల్లిదండ్రులను పీడించిమాత్రం కాదు' అంది అమ్మ నిరసనగా.

'సరే. ఈ విషయం ఇంకా మాట్లాడి ప్రయోజనం లేదు. నేను వీళ్ళను చూసుకుంటాను. వీళ్ళు నాతో వచ్చి చెప్పివుంటే సరిపోయేది. ఇంక జీవితాంతం ఆ మాష్టారు వీళ్ళ పంతం పడతాడు' అన్నాడు హరి శంకర్. లోలోపల గొణుక్కుంటూ వణుకుతూ వున్నప్పటికీ హరిశంకర్ మీద విరుచుక పడ్డాను 'ఆయన ముందు భయపడి ఒక్కమాటకూడా నోరు మెదపలేదు. మీరేమీ మా గురించి పట్టించుకోవడం లేదు' అన్నాను.

'బాబూ హరిశంకర్! నీ హక్కుల కోసం నీవు పోరాడేందుకు నీకాళ్ళ మీద నీవు నిలబడలేక పోతే ఈ ప్రపంచంలో న్యాయం దొర కదు' అని అమ్మకూడా చీవాట్లు పెట్టింది.

నాకు తెలుసు అతను మెట్రిక్ కూడా పూర్తి చెయ్యలేదని. కానీ పండిత రామనాథ్‌తో బంధుత్వరీత్యా ఈ ఉద్యోగం దొరికింది. ఆనగ్న సత్యాన్ని అందామనుకున్నాను గానీ మళ్ళీ నిబాయించుకున్నాను.

* * *

పాఠశాల నుంచి తిరిగి వచ్చిన తర్వాత అమ్మ దేవదత్త బాబాయి లాహోరు నుండి తిరిగి వచ్చాడని చెప్పింది ఆయనతో తాను మాట్లా డానని బిషన్ సింగు మాష్టారు కొట్టిన విషయం చెప్పానని మా

చదువు విషయంలో కొంచెం శ్రద్ధ వహించమని చెప్పానంది. అందుకా యన మా నాన్నతో యుద్ధానికి వెళ్ళేముందు సరేనన్నట్లే అమ్మతో కూడా సరేనన్నారు. అయితే బిషన్ సింగు మాష్టారు తనవద్ద మేము ట్యూషనుకు చేరి 20 రూపాయలు చొప్పున ముదుపు చెల్లించుకుంటేే తప్ప ఆయన క్రూరత్వానికి అంతం వుండదని పరిమిత జ్ఞానం కల అమ్మకు అర్థంకాలేదు.

మాకు జరిగిన అన్యాయాన్ని గురించి దేవదత్త బాబాయి మమ్మల్ని ఏడిపించే ధోరణిలో అడిగారు:

'రండిరా. మీరు బిషను సింగు మాష్టారు బుల్లిగడ్డంలోంచి తెల్ల వెంట్రుకలు పీకారటగా. అందులో ఆయన కృష్ణ అంటే ఎక్కువ ప్రేమ చూపించాడని నేను విన్నాను '

'బాబాయ్! ఆయన వట్టి పుణ్యానికి నన్ను కొట్టారు. నేను క్లాసులో వూరక నిలుచొని వున్నాను. నేను ఏమీ తప్పుచేయక పోయినా ఆయన బెత్తంతో నన్ను కొట్టారు. నేను చిన్న వాణ్ణి కాబట్టి ముందు వరుసలో కూచుందామని అనుకున్నాను.' అన్నాను.

కనుబొమల మీద చెమటను ధోవతితో తుడుస్తూ, వేళాడే ఫంకా తిరిగేందుకు తాడులాగి బాబాయి అన్నాడు·

'మీ బిషను సింగు మాష్టారు వట్టి గాడిదరా! వాడు ప్రభుత్వ పాఠశాలలో నాతో చదువుకున్నాడు. ప్రతిక్లాసులోను తప్పేవాడు. 8వ తరగతి కూడా పూర్తి చెయ్యలేక పోయాడు. అతని కన్నా నేను మీకు ఇంగ్లీషు పాఠాలు బాగా చెప్పగలను. మీకు తెలుసా? నేను ఎమ్.ఏ. లో తప్పాను రెండుసార్లు. బిషను సింగు నేనుకూడా గాడిదనో, కోతి అనో, అనుకుంటూ వుండవచ్చు. నేను చూడటానికి కొండముచ్చులా వుంటాను. పరీక్షలలో తప్పట మనేది దేనికీ నిదర్శనం కాదని గుర్తు పెట్టుకోండి. అసలు ఈ పరీక్షల పద్ధతే మంచిది కాదు. అతడు మరీ కుర్రాడు.'

తనను తాను కొండముచ్చు అని విమర్శించుకునే బాబాయిని చూస్తే నాకెంతో ఆప్యాయత కలిగింది. నన్ను సరిదిద్దే దానికి అవసర

మనిపిస్తే ఆయన కొట్టినాకూడా శిక్ష పడేందుకు మనసులో సిద్ధపడ్డాను. విద్యావిధానం పట్ల ఒక క్రొత్త సిద్ధాంతాన్ని గూర్చి ఆయన నమ్మిన విషయాలను ఆ మధ్యాహ్నం మాకు ఉపదేశించాడు.

'మన దేశంలో పాఠశాలలు ఆంగ్లేయ విద్యావిధానంలో కొనసాగు తున్నాయి. వాళ్ళకు చదువంటే కొట్టటం. అయితే ఆంగ్ల తాత్వికుడు బెర్ట్రాన్డ్ రస్సెల్' లాంటి మహానుభావులు — పిల్లలను పాఠశాలలో వాళ్ళ యిష్టం వచ్చినట్లు చేయనిస్తే బాగా చదువుకుంటారనే వాళ్ళు లేకపోలేదు.

రస్సెలు పండితుని అభిప్రాయంలో ఉపాధ్యాయుడు లెక్కలు చెప్తుంటే పిల్లవాడికి క్రికెట్టు, హాకీ ఆడాలని అనిపిస్తే వాళ్ళను ఆడుకోనివ్వాలి. ఆ తర్వాత అతనికి బుద్ధి పుట్టినపుడు అతను తరగతి గదిలో నేర్చుకోలేనిది చదువుకుని వృద్ధిలోకి రాగలడు. పురాతన కాలంలో మన ఆర్యావర్త దేశంలో ఇలాంటి పద్ధతి అమలులో వుండేది. ఇప్పటికీ మన పల్లెల్లో పాఠశాలల్లో ఇంచు మించు ఇలాంటి పద్ధతి మన రైతులు చదువుకునే పాఠశాలల్లో వుంది. పట్టణాలల్లో వుండే ఉపాధ్యాయులకు జీతం మీద శ్రద్ధ. వాళ్ళకు కావలసింది డబ్బు. వాళ్ళకు వచ్చే జీతాలు తక్కువ కాబట్టి మీ బిషను సింగు లాగా మిమ్మల్ని బాధపెట్టి ప్రైవేట్లు చెప్పించుకోమని కొడుతూ వుంటారు. ప్రతి పిల్లవాడూ అన్ని పాఠ్యాం శాలలోనూ శ్రద్ధకలిగి వుండాలని నియమమేమీ లేదు. ఒకరికి పద్యాలు చదవటం ఇష్టం. మరొక సమయంలో అతనికి శాస్త్ర విషయాలమీద శ్రద్ధ. ఇంకొకసారి నీకు చరిత్ర పాఠం వినాలని వుండవచ్చు. భూగోళం పాఠం అంటే ఇష్టంలేక పోవచ్చు. నీకు కావలసిన విజ్ఞానాన్ని నీకు యిష్టమొచ్చిన రీతిలో ఎందుకు సంపాదించుకోకూడదో నాకర్థం కావడం లేదు. రోజంతా నీకు బొమ్మలు గీయటం అంటే ఇష్టం వుండవచ్చు. సుశీలను చూడండి! ఆవిడ మూడు సంవత్సరాలు ఇంట్లో చదువుకొని తర్వాత మెట్రిక్కు కట్టింది. ఆవిడ శారీరకంగా దృఢంగా లేదు కాబట్టి అలా చేశాము. వాళ్ళ అన్న దేవ్ బడికి శ్రద్ధగా వెళుతున్నప్పటికీ ఇంకా ఎనిమిదవ తరగతిలోనే వున్నాడు. పరీక్షలు విజ్ఞానానికి కొలబద్దలు కావని నా వుద్దేశ్యం. కాబట్టి బిషన్ సింగు వంటి మూర్ఖులను గూర్చి మీరు

భయపడ నక్కర లేదు.

అయితే మీరు నేను చెప్పాను గదా అని బడి ఎగ్గొట్టకండి. మీ అమ్మ నాన్న, నేను మిమ్మల్ని చెడ గొట్టానని నామీద కోప్పడతారు. అలా అని బడి అంటే భయపడ కూడదు. ఇంటి దగ్గర శ్రద్ధగా చదువుకొని క్లాసులో అందరి కన్నా తెలివిగా వుండండి ఆడుకోవాలను కున్నపుడు ఆడుకోండి. చదువు కోవాలనుకున్నప్పుడు చదువుకోండి. మీ అంతట మీకే అన్నీ తెలుసు కోవాలని అనిపిస్తుంది' —

'బాబాయ్! నువు చెప్పేది పరీక్షల గురించా? ఎమ్.ఏ. లో రెండుసార్లు మీరు తప్పారు కాబట్టా' అన్నాను నేను హేళనగా. బాబాయి నా చెవి పిండి నవ్వుతూ అన్నారు.

'నేను నా జీవితంలో లెక్కల ఎమ్.ఏ. పూర్తి చెయ్యలేను. మా పరీక్షాధికారి తెల్లదొర. అతనికి నేను ఆర్యసమాజవాదినని తెలుసు. పంజాబులోని ఆర్యసమాజం వాళ్ళు బ్రిటీషు పరిపాలనకు వ్యతిరేకులని ఆయన వుద్దేశ్యం.' ఈ ప్రసంగం విని నేను వులికి పడ్డాను. చదువుకో దలుచుకోని సమయంలో విద్యార్థులు ఆడుకోవచ్చుననే ఆలోచన నాకు నచ్చింది. ఉపాధ్యాయుడే లేకుంటే తప్పిపోయిన పాఠాలు ఎలా సర్దు బాటు చేసుకోవచ్చో నాకు తెలియ లేదు. ఒకవేళ తరగతిలో వుండే పిల్లలందరూ పాఠంమీద శ్రద్ధ కన్నా క్రికెట్టుమీద ఆసక్తి చూపితే గందర గోళ పరిస్థితి ఏర్పడుతుంది. ఇంక పరీక్షల విషయం —. పరీక్షలేకుంటె మెట్రిక్, బి.ఏ. పాసయారని ఎలా అనగలం. దేవదత్త బాబాయి వంటి సంపన్న కుటుంబీకులు ఎమ్.ఏ. లో నెగ్గక పోయినా బాధలేదు. వారికి జరిగి పోతుంది. పేదవారికి ఉద్యోగాలు కావాలి. పరీక్షలు నెగ్గితే కానీ అది సాధ్యపడదు.

అందుకే నాన్నగారిలాగా, మా అన్న హరీష్‌లాగా మేము ఆదర్శంగా ఏక్లాసులోనూ తప్పకూడదని నాన్న పట్టుదల. అయితే నామనసు లోలోపల తనంతట తాను విజ్ఞానాన్ని పెంపొందించుకొనే పాఠశాల ఆలోచన మెచ్చుకున్నాను.

బాబాయి పెద్ద పెద్ద మాటలు మాట్లాడు తున్నప్పుడు నేను పర

ధ్యానంగా ఉండటం, బావి దగ్గర మేడమీద పిల్లలు కందిరీగలు పట్టటం ఆశ్చర్యంగా చూస్తున్నాను. బురద నీళ్ళపైన ఎగురుతున్న కందిరీగలను వాళ్ళు పట్టుకొని వాటి తోకల్లోంచి విషం పిండి, తోకలకు దారాలు కట్టి ఎగర వేస్తున్నారని బాబాయి చెప్పాడు. 'మీరు కూడా వెళ్ళి ఒక కందిరీగను పట్టుక రండి. తర్వాత ఇంగ్లీషు పుస్తకంలోని మొదటి మూడు పాఠాలు ఒక అరగంట నేపు కూచోపెట్టి చెప్తాను.'

ఆ క్షణంలో నామనసులో ఏముందో పసిగట్టినందుకు సంబర పడ్డాను. ఆయన నన్ను బయటికి వెళ్ళి ఆడుకునేందుకు అవకాశం ఇచ్చారు కాబట్టి నేనందుకు విరుద్ధంగా కూచుని పాఠం చదువుకుందా మన్నాను

'నాకు తెలుసు. నేనక్కడికి వెళ్ళి కందిరీగ కుడితే వాచిన మొహంతో మీ దగ్గరకు వస్తానని. నేనిప్పుడు వెళ్ళను. కందిరీగలను ఎలా పట్టుకోవాలో, ఎవళ్ళో ఒకళ్ళ దగ్గర నేర్చుకుంటాను. కాబట్టి ఇప్పుడు పాఠాలు చదువుకుందాం ' అన్నాను నేను

'అయితే , పాఠాలు చదువుకున్న తర్వాత కందిరీగలు పట్టటం ఎలానో మీకు నేర్పుతాను' అన్నాడు బాబాయి.

అమ్మ మేనేజరు పండిత రామనాథ్‌తో బిషన్ సింగు మాష్టారు మీద చాడీలు చెప్పటం నేననుకున్నట్లుగానే గణేశ్‌మీద, నామీద ఆ మేష్టారుకు కోపం తెప్పించడానికి తోడ్పడింది. నేను విసుగ్గాను, మూర్ఖంగానూ, అధిక ప్రసంగంగాను వుండటంవల్ల గణేశ్ మీద కంటే నా మీద ఆయన విరుచుకపడ్డం మొదలెట్టాడు.

ఆ మర్నాడు ఉదయం మొదటి క్లాసులో హాజరైపోగానే 'అరేయ్ చుంచెలుక! ఇలారా? నా దగ్గరగా రా?' అన్నాడాయన. నేను చిన్న వాణ్ణి కావటంవల్ల అప్పుడే మొదటి వరుసల్లో కూర్చునేందుకు అవకాశం ఇచ్చారు. నేను భయపడుతూ మొదటి వరుసల్లోంచి వణుకుతూ లేచాను. ఆయన చెప్పిందేదో నాకర్థం కాలేదు. ఆయన నా చెవి పిండుతూ 'అరేయ్! పిల్లలూ ఇది చుంచెలుక కాదు. చిరుకప్ప. చిరుక ప్పను గురించి మీ కొక కథ చెప్తాను.'

"అనగనగా ఒక కాలంలో చిరుకప్ప వుండేది. వాళ్ళమ్మ కనింది కాబట్టి ఏం చెయ్యాలో తెలియక ఆ కప్పను బడికి పంపింది. ఆ చిరు కప్ప బడికి వెళ్ళి తరగతి గదిలోకి మాష్టారు వచ్చేలోగా పోకిరిగా 'బెక' 'బెక' శబ్దాలు చేస్తూ గోల చేసింది. అమాయకంగానూ, చిన్న ఆడపిల్లలాగానూ నటించటంచూసి దండించాడు. ఆయన ఈ చిరు కప్ప శ్రద్ధగా చదువుకోవాలనీ, అవసరమైతే ప్రత్యేక తరగతులు తీసుకోవాలని, తరగతిలో అందరితో సమానంగా వుండాలనీ చెప్పాడు. ఆ తర్వాత ఈ చిరు కప్ప ఏంచేసిందో తెలుసా? వాళ్ళ అన్నను, అమ్మను హెడ్‌మా ష్టారు వద్దకు తీసుకువెళ్ళి చాడీలు చెప్పింది. అరేయ్ గణేశ్ చంద్రా! నీవుకూడా ఇలా రారా!" నేను భయపడుతూ, సిగ్గుతో వణకి పోతూ ఒంటరిగా తరగతిలో అందరి ముందు ప్రదర్శన జంతువులా ఉండగా, బిషన్ సింగు మేష్టారు ఉత్సాహంతో కథనం చేస్తుంటే పిల్లలంతా కథలో లీనమైపోయారు.

గణేశ్ నెమ్మదిగా యివతలకి వస్తున్నాడు.

బిషన్ సింగ్ మేష్టారు వెంటనే కుర్చీలోంచి లేచి గణేశ్ చెవి నులిమి నాపక్కన నిలబెట్టాడు.

మేష్టారు పెదవులు బిగపట్టి, కళ్లజోడు సరిజేసుకొంటూ పళ్లు పటపట కొరుకుతూ, కథను తిరిగి ఆరంభించాడు.

"ఈ చిరుకప్ప నెల్లి వాళ్ల అమ్మకు కథలు చెబుతుంది. హెడ్‌మే ష్టారుతో ఈ మేష్టారుపై చాడీలు చెప్పడానికి తెలివితక్కువదైన వాళ్ల ముసలి అమ్మను తీసుకొస్తాడు." ఈ మాటలంటున్నప్పుడు మేష్టారు తెల్లని పళ్ల సందుల్లో నాలుక పాములా కదులుతోంది.

"నువ్వు అలా చెయ్యలేదట్రా చిరుకప్పా" అని నన్ను గదమాయించాడు. బాధతో మెలికలు తిరిగిపోతూ ఉన్న నాచెవి అలానే మెలిబెడుతూ మేష్టారు నన్ను హింసించసాగాడు.

"నేను ఏ తులిపిపనీ చెయ్యలేదు మేష్టారూ!" అని జవాబు చెప్పాను.

'పంది వెధవా! చాడీలు చెప్పినందుకు బహుమతి ఇదీ!' అని నా

చెవి నులుముతూ గణేశ్‌కు, నాకు మధ్య నిలుచున్నారు

ఆ క్షణంలో, క్రితంరోజు మేష్టారు చేతిలో దెబ్బలుతిన్న లాభా రామ్ తన స్థానంలో లేచి నుంచోడం చూశాను.

"అమృత్‌సర్‌లో సహాయ స్టేషన్ మేష్టారుగా పనిచేస్తున్న మా నాన్నకూడా నన్ను మీరు శిక్షించడానికి నిరసనగా ఫిర్యాదు చేశారు. ఆ ఉత్తరం మేనేజరుకు చేరేలోగా మీరు నన్ను దండించవచ్చు." అన్నాడు లాభారామ్.

'పండిత రామానాథ్‌గారికి మా నాన్నకూడా వ్రాశారు.' అన్నాడు టికెట్ కలెక్టర్ కుమారుడు రామ్‌లాభయ్య.

"మీ నాన్నగారి హోదాకూడా చెప్పు. లాభారామ్ వాళ్ళ నాన్న సహాయ స్టేషన్ మేష్టారు. మరి మీ నాన్న... ."

మేష్టారు వాడిన ఈ ఎత్తి పొడుపుమాటలు బాధించగా రామ్ లాభయ్య సమాధానం చెప్పలేదు.

"వాళ్ల నాన్నగారు టికెట్ కలెక్టరు" లాభారామ్ సగర్వంగా చెప్పాడు.

'భలే! భలే!' అంటూ మేష్టారు నవ్వారు. "ఈదఫా నేను లాహోరు వెళ్లేటప్పుడు టికెట్ లేకుండా ప్రయాణం చేస్తున్న నన్ను పట్టుకొంటారు. ఒరే! అల్లరి వెధవల్లారా!..... గాడిద కొడుకుల్లారా! ఇలారండి! నామీద చెప్పినందుకు మీరు జీవితాంతం గుర్తు పెట్టుకొనేలా బుద్ధి చెబుతాను. రండి!"

ఎవ్వరూ కదల్లేదు.

దాంతో కోపం తారస్థాయికి చేరుకోగా మేష్టారు బెత్తం పుచ్చుకొని వేదికమీది నుంచి దూకి ముందు కురికాడు.

'చేతులు చాపండి'

లాభారామ్ ముందుకు నడచి గంభీరంగా చేతులు చాపి దెబ్బమీద దెబ్బ తిన్నాడు. ఆతడి వెనక రామ్‌లాభయ్య నుంచున్నాడు.

తరగతిగదిలో నిశ్శబ్దం తాండవం చేసింది.

'మిమ్మల్ని ఎవ్వరూ రక్షింపలేరు' అంటూ మేష్టారు వెనుదిరిగారు

"తన తోటి ఉద్యోగస్తులమీద వచ్చిన ఫిర్యాదులను పండిత రామానాధ్ పట్టించుకోడు ఈ బడిలో మాకు యిచ్చే జీతాలు కొద్ది, మాకు బదులు ఆయన కెవ్వరూ దొరకరు కాబట్టి ఈ రోజునుంచీ మీలో ఎవ్వరూ వార్తాహరులుగా మారకుండా చూసుకోండి ఒకవేళ ఖర్మకాలి అలా చేశారంటే మీరు కలలోకూడా ఊహించని శిక్ష అనుభవిస్తారు. ఒరే! చిరుకప్పా. చాడీలు చెప్పే వెధవా! చేతులు చాపరా!" అని నిలదీశారు.

నేను చేతులు రెండూ కాళ్లమధ్య యిరికించాను.

'చేతులు చాపు' అంటూ ఆ నల్ల తాచు బుసకొట్టింది.

నేను కప్పలా ముఖం ముందుకు చాపాను

మేష్టారు నా తలమీద రెండు దెబ్బలు వేశారు

ఆక్షణంలో పండిత రామానాధ్ గదిలోకి అడుగుపెట్టారు

'మేష్టారు! పిల్లలని కొట్టడం ఆపండి మీ మీద రెండు ఫిర్యాదులు వచ్చాయి నా గదిలోకి వచ్చి మాట్లాడండి' అన్నారు

ముఖం కందగడ్డలా అయిపోగా ఒక్కక్షణం ఆగి, పండిత రామానాధ్ వెంబడి ఆ పిశాచం మెల్లగా నడిచాడు.

మేష్టారు భయంకర శిక్షల నుండి మాకింక మోక్షం దొరికినట్లే అనిపించింది. అతను మాపట్ల పెంచుకొన్న ద్వేషంవల్ల మా కేమీ బోధించలేదనిపించింది. ఆయన చేతిలో తిన్న చివాట్లు బాగా గుర్తుకొస్తాయనుకొన్నాను. ప్రేమతో మిళితం చేసి చెప్పిన పాఠాలు బాగా అవగాహన చేసుకోవచ్చుగాని, బెత్తంతో పెత్తనం చెలాయిస్తూ చెప్పిన కథలు బోధపడవని నేనూహించాను.

ఇంగ్లీషు పిరియడుకాగానే లెక్కలు, సైన్సుచెప్పే ఖుషీరామ్ మేష్టారు వచ్చారు. కోలముఖం, దయార్ద్ర వదనము కలిగిన ఆయనంటే మాకు

లెక్క_లేదు. ఇంతవరకు జరిగిన తతంగమంతా ఆయన చెవిదాకా పాకి వుంటుందని తెలుసు. మేము ఆయనను లక్ష్యపెట్ట కుండా బెంచీలమీద కప్పగంతులు వేస్తూ ఆడుకోసాగాము.

* * *

నల్లపిశాచం వంటి మేష్టారు మమ్మల్ని బాధపెట్టినందు వల్ల లాభారామ్, రామ్‌లాభయ్యలతో మా అన్నదమ్ము లిద్దరికీ స్నేహం అను కోకుండా కుదిరింది. మధ్యాహ్న సమయంలో కోటమైదానంలో వంతుల వారీగా క్రికెట్ ఆడుకోడానికి కలిసి వెళ్లసాగాము. మా యింట్లో మొదటి అంతస్తు వెనక భాగంలో ఉన్న కర్రల్లో నాన్న క్రికెట్ బ్యాట్ చూశాము. దాన్ని ఎలాగైనా అమ్మను బ్రతిమాలి తీసుకొస్తామని తోడి పిల్లలతో చెప్పడంతో మామధ్య సఖ్యం పెరిగింది. అయితే మా జట్టులో పిల్లలతో సరిసమానమైన ఈడు గలవాడు గావడం వల్ల గణేశ్ మాత్రమే ఈ సఖ్యం వల్ల లాభపడ్డాడు

మేము మధ్యాహ్నం ఎప్పుడెప్పుడు వస్తుందా? అని ఎదురు చూసే వాళ్లం. మాలో ఒకడైన మన్‌మోహన్ అనే చిన్న కుర్రవాడు చిన్న క్రికెట్‌సెట్టు కొన్నాడు. వాళ్లనాన్న మంచి ధనవంతుడైన వ్యాపార స్తుడు. మేము వెంటనే క్రికెట్ నేర్చుకోవాలని నిర్ణయంతీసుకొన్నాము. నదులు ఊడ్చే గుగ్గీని మాతోకూడా ఆటసమయంలో ఆడుకోవడానికి కోటమైదానానికి రమ్మని పిలిచాం.

లోహగర్‌కోట నీడలోవున్న క్రికెట్ మైదానానికి, మధ్యాహ్న భోజనం కూడా చెయ్యకుండా చేరుకొనే వాళ్లం. కొత్త క్రికెట్‌సెట్టు చూసే సరికి ఆనందం ఉరకలువేసేది. మన్‌మోహన్, గుగ్గీ తప్ప మిగతా పిల్లలు ఎవరూ రాలేదు. పెద్దపిల్ల లందరూ ఆడుకోవడం నేను, మన్‌మోహన్ చూస్తూ నిలబడి ఉంటే, గుగ్గీ ఆరువికెట్లను సరియైనదూ రంలో పుంచి, మేం ఎన్నుకొన్న స్థలాన్ని చదునుచేయసాగాడు. అప్పటికీ ఎవ్వరూ రాకపోవడంతో మేమే ఆట మొదలెట్టాము. మన్‌మోహన్ వెంటనే 'ఔట్' అయ్యాడు. నేను బంతిని ఆపడంలో సామర్థ్యం చూపాను. మన్‌మోహన్‌క్రికెట్‌సెట్టు కొత్తది తెచ్చాడు గాబట్టి అతడికి మరో మూడు దఫాలు ఆట యివ్వాలనీ, తాను తర్వాత ఆడుతాననీ

గుగ్గీ చెప్పాడు. మూడో బంతిలో 'బవుల్' అయిపోయిన మన్‌మోహన్ యింకా ఆడుతున్నాడు అందుకుకారణం గుగ్గీ తప్పలుతడకలుగా ఆడటమే. నేను, మనమోహన్ క్రికెట్ దుస్తులుధరించి భవిష్యత్తులో నూరుపరుగులు తీయగల సమర్థుల మనిపించు కొన్నాం. గుగ్గీ ఎన్నో రకాలుగా ఆడాడుగాని మమ్మల్ని 'ఔట్' చెయ్యలేక పోయాడు.

మమ్మల్ని 'ఔట్' చెయ్యలేక పోవడంతో, గుగ్గీ బాగా ఉడుకుమోతుదనంతో నన్ను ఎలాగైనా ఓడించాలని బంతిని నా తలమీదికి విసిరి నుదుటి మీద కణితి కట్టేలాచేశాడు. దానితో మా ఉత్సాహానికి అడ్డు కట్టపడింది.

నేను చుట్టకట్టుకొని పడిపోయాను. పక్కనే ఆడుకొంటున్న పెద్దపిల్లలంతా ఆడుకోవడం ఆపి పరుగెత్తుకొంటూ వచ్చి మన్‌మోహన్ టాంగా మీదికి చేర్చారు.

వాచిపోయిన నా నుదురుచూసి గణేశ్ నా మీద అంతకు ముందు కన్న సానుభూతి చూపడం మొదలెట్టాడు. చిన్న తమ్ముణ్ణి జాగ్రత్తగా చూసుకోనందుకు అమ్మ చివాట్లు పెడుతుందని తెలుసు. బాధవల్ల నేను దారిపొడుగునా ఏడుపు లంఘించుకొన్నాను. చేతిగుడ్డలు నోట్లో పెట్టుకొని గాలి బాగా ఊది, ఆ వెచ్చదనాన్ని నా నుదుటిపై కాపడం పెట్టి గణేశ్, మన్‌మోహన్ నొప్పి తగ్గించడానికి ప్రయత్నించారు. కాని వాపు మాత్రం తగ్గలేదు.

నుదుటిమీద వాపు బాగా ఉండటంవల్ల, చీకట్లో కూడా నేను అమ్మకు కనబడకుండా దాచలేకపోయాను. రెండో అంతస్తుపై భాగంలో భోజనాలు చేస్తున్నప్పుడు అమ్మ నా నుదుటి వాపు పసిగట్టింది.

'అమ్మా! ఊడ్చే కుర్రవాడు గుగ్గీ క్రికెట్ బంతితో నుదుటి మీద వీణ్ణి కొట్టాడు.' అని గణేశ్ ఫిర్యాదు చేశాడు.

'నాయనో!' అంటూ అమ్మ ఏడుపు మొదలెట్టింది: 'చూడండి. ఈ పిల్లలు వాళ్ల నాన్న ఊళ్లో లేనప్పుడు చస్తారు. వీళ్ల పద్ధతి చూస్తే అలానే అనిపిస్తుంది. అడ్డగాడిదల్లా తిరిగే ఈ వెధవలు. ఇంక నాకేం దిక్కు. కోకోకిల్లీతోగొడవలు, సామాన్లు తెచ్చుకోవడం, ఇంటి

పనులు చూసుకోవడం, బడికివెళ్లి ఫిర్యాదు చేయడం, యివన్నీ చాలనట్లు ఇప్పుడు డాక్టరు దగ్గర కెళ్లాలి వీడేమో మనస్థాయి ఏంటో తెలుసు కోకుండా వెధవ లందరితోనూ ఆడుతాడు. వాళ్లు మొరటుపిల్లలని చెప్పినావినడు.'

ఈ గోలవిని ప్రతాప్ బాబాయి, దేవకిపిన్ని నాకేం జరిగిందో చూడటానికి కిందికి దిగి వచ్చారు.

అది చూసి అమ్మ ఉడికిపోయి నా చెంపమీద వాయించింది

'పిల్లలందరిలోకి నువ్వు అల్లరి వెధవవు' అంటూ అరిచింది అమ్మ. 'ఎప్పుడూ నీకు ఏదోఒకటి జరుగుతుంది. లేదా నీవే ఏదోగొడవను తెస్తావు. చాకలి కుర్రాడు కొడితే తలబొప్పి కట్టడమో, జ్వరంరావ డమో, బళ్లో మేష్టారు కొట్టడమో... లేదా ఇప్పటిలా ఊడ్చే కుర్ర వాడిచేతిలో దెబ్బతినడమో... చచ్చినోడా. వాళ్లందరితో ఆడుకోవద్దురా అంటే ఎందుకువినవు? నీ గ్రహబలం బాగులేదు. నీ జన్మ నక్షత్రం శని. నీకు దిష్టితీసిన చమురు ఆ శని దేవతకోసం పూజారులకు దానం చెయ్యాలి.'

'నువు అరిచి గోలపెట్టి పూజారులకు చమురుదానం చెయ్యవచ్చు. వాడు ముందరనే దెబ్బ తగిలి ఏడుస్తుంటే మళ్లీ కొట్టడం దేనికి, వాడూ నాలాగే సంతోషంగా ఉండాలని అనుకొంటాడు. కాని ఆ దరిద్రం ఏమిటో యిలా జరుగుతుంది వాడు ఆడుకొంటూ, యధాలాపంగా దెబ్బ తగిలింది. అంతగా' అన్నాడు బాబాయి వ్యంగ్యంగా.

నేను నిస్సహాయంగా చివాట్లు భరించాను. బాబాయి సానుభూతి వాక్యాలు వినపడగానే నాకు ఏడుపు ముంచుకొచ్చింది. నాకు దగ్గ రలో ఉన్న సంతోషాన్నంతా బావుకుందామనే ఆదుర్దాలో దుఃఖాన్ని కొని తెచ్చుకొంటాననే విషయం నిజమైంది. దేవకిపిన్ని నన్ను ఆప్యాయంగా దగ్గరకు తీసుకొన్నప్పుడు నాకు ఏడుపు మరింత ఎక్కువైంది. దేవకి పిన్ని మీద ద్వేషంతో అమ్మ నాకు మరోగుద్దు యిచ్చింది. పిన్ని ఆప్యా యతకు నోచుకోలేకపోయాననే దుఃఖం నన్ను మరింత బాధపెట్టింది.

పిన్ని నన్ను ఎత్తుకొని తనతోపాటు పడుకోబెట్టుకొంది. సుందరి

యిలానే నన్ను బాధిస్తే నన్ను దత్తత తీసుకొంటానని పిన్ని ఖండితంగా చెప్పింది. ఆ ఓదార్పు నాకు బాసటగా కనిపించింది. అమ్మ నాపట్ల ఎందుకు అంతనిర్దాక్షిణ్యంగా ఉంటుందో, ఒక్కొకసారి ఎంత ఆప్యాయంగా చూస్తుందో అర్థం గాలేదు. ఈ ఆలోచనలలో నిద్ర పట్టేసింది.

అది మొదలు నేను క్రికెట్ ఆటవైపు వెళ్లకూడదని అమ్మ ఆంక్షలు పెట్టింది. క్రికెట్ ఆట మీదమోజును వ్యాయామంపట్ల మరలించాను. ప్రతి ఉదయమూ, సాయంకాలము, మా పాఠశాల ఆవరణలో ప్రార్థనాగీతానికి అనుగుణంగా హవిల్దార్ లేహనసింగ్ డ్రిల్లు చేయించడం నాకు బాగానచ్చింది.

ఈ విధంగా 9,10 తరగతుల పిల్లలచేత డ్రిల్ చేయించడం మా బడిలోను, చర్చి మిషన్ పాఠశాలలోను మాత్రమే అమృత్‌సర్‌లో జరుగుతుంది. పాఠశాలలో చేర్చుకోవడం ద్వారా క్రైస్తవ మతంలోకి మార్చబడే వారి సంఖ్య తగ్గిపోవడంతో మిషన్‌స్కూలు ఆకర్షణ బాగా తగ్గిపోసాగింది. మా పాఠశాలలో అక్కడ బ్యాండు విద్యార్థులకు ఉపకారవేతనా లిచ్చి పండిత రమానాథ్ ఆశ జూపి చురుకైన విద్యార్థుల్ని ఆకర్షించాడు. ఇతర పాఠశాలల్లో ఉండే క్రికెట్ ఆటగాళ్లను ఆయన అదేవిధంగా యిక్కడ చేర్చుకోవడం అందరికీ తెలుసు.

ఈ డ్రిల్లు చేయించడం ద్వారా చుట్టుపక్కల గ్రామాల వాళ్లంతా ప్రహరీ మీది నుంచి లేహన్‌సింగు మేష్టారు డ్రిల్లు ఎలా చేయిస్తాడో చూస్తుంటారు. తొమ్మిది, పది తరగతుల విద్యార్థులు బడిగంట వినగానే క్రమశిక్షణగా ఈ సంగీతానికి చెవి వొగ్గుతారు. లయబద్ధంగా మైదానంలో అడుగులు వేస్తూ ముందుకు నడుస్తారు. అది చూసి మా బడిలో ఫ్లూటువాయించే అజీజ్‌లాగా నేనూ సంగీతం నేర్చుకోవాలని నిర్ణయించుకొన్నాను. నౌషిరాలో మేం ఉంటునప్పుడు 38వ డోగ్రారెజిమెంటల్ బ్యాండు దళంలో ఫ్లూటువాయించే ఛోటా అంటే నాకు భలేయిష్టం.

అలాంటి ఫ్లూటు సంపాయించాలంటే చాలా ఖరీదు. ధనవంతులైన పిల్లల సహవాసం, దేవకిపిన్ని బాబాయి సాహచర్యమూ నన్ను

యిలాంటి విలాసవస్తులపట్ల మోజుచూడడానికి దారి తీస్తున్నాయని అమ్మ నా కోరికను తోసిపుచ్చింది.

నా చుట్టూవున్న మురికి వీధుల వాతావరణాన్ని కాలదన్ని, శుభ్రమైన గాలీ వెలుతురు పీల్చుకోవాలని నా ఉబలాటం. ఆనందమయ జగత్తులో నాట్యమాడి సుఖంగా గడపాలని నా ఆకాంక్ష. నాలోని ఈ ఉత్సాహాన్ని అమ్మ పసిగట్టలేదు.

"చోటాలాగా, క్లైయిటన్‌లాగా ఈ యింట్లో పుట్టిన కుర్రవాడు బ్యాండు దళంలో చేరడం నేనూహించలేను. ఆ అంటరాని వారితో సమానంగా నిన్ను పోల్చుకోలేను నీకు సిగ్గులేదూ? నీ సరదాలు తీర్చడానికి నా వల్ల గాదు. హరీష్‌కు చెప్పి నిన్ను లాహోరు బడిలో చేర్పిస్తాను." అంది అమ్మ.

అమ్మ బెదిరింపులు లెక్కపెట్టకుండా నేను ఆదా చేసిన కొద్దిపాటి మొత్తంలోంచి చిన్న హార్మోనియం కొన్నాను. బాబాయి అంగడి వద్దకు అప్పుడప్పుడు నేను వెళుతుంటే అక్కడ కొలిమి తిత్తి ఊదినందుకు ఆయన ఇచ్చిన పైసలు నేను కూడబెట్టాను. ఆ మొత్తం ఇందుకు వుపయోగ పడింది రాత్రింబగళ్ళు ఆ హార్మోనియం వాయిస్తూ ఇంట్లో వాతావరణమంతా కలుషితం చేశాను.

అమ్మకు విసుగు పుట్టి 'ఏదైనా చదువుకో రాదటరా' అనేది. 'బాబాయి దగ్గరకు వెళ్ళి లెక్కలు చెప్పించుకోరాదూ! వాళ్ళ కుటుంబంతో కలిసి ప్రార్ధన చేయరాదూ? మంచి కుర్రాడి లాగా మసలుకొని తెల్లవారేసరికి బడికి సిద్ధమైతే ఎంత బాగుంటుంది.' అన్నది అమ్మ.

అమ్మ చెప్పినట్లుగా ఈ క్రమ శిక్షణకు నేను చాలా వరకు అలవాటు పడ్డాను. ఆమె ఆదమరచినపుడు మా వీధిలోని కుర్రవాళ్ళతో కలిసి రకరకాల ఆటలు ఆడుకునేందుకు ఆదుర్దాపడే వాడిని. ఆకర్షణీయమైన వీధులు సాహసానికీ మాయా జాలానికీ పేరు మోసిన అమృతసర్ నగర్ జీవితాన్ని ప్రేమించటం మొదలెట్టాను. బురదలో దొర్లాడటం, పోకిరీ కుర్రవాళ్ళతో సమానంగా బూతులు మాట్లాడటం, పోట్లాడటం, అడుక్కుతినటం, చేశాను. వీటన్నిటికీ తర్వాత నేను మనసులో నొచ్చు

కున్నాను. స్వప్నలోకాల్లో విహరించాను. దేవకిపిన్నితో పేకాట ఆడాను. హెసియాతో పాటు దొంగతనం చేశాను. ఉత్తమ సింగ్ బాబాయితో బాటు వేశ్యల యిండ్లకు వెళ్ళి ఆయన అంగడి మిద్దెమీద వారు పాడుతుంటే విన్నాను వాళ్ళ కుమార్తెలు కథక్ నృత్యం చేస్తుండగా చూశాను. ప్రతాప్ బాబాయి దేవకిపిన్నితో ముద్దుముద్దుగా మాట్లాడే మాటలు ఎవరికీ తెలియకుండా నేనూహించుకున్న వనితతో మాట్లాడ సాగాను. నేను నిషేధించ బడ్డ అన్ని పన్లనూ దొంగతనంగా నైనా చవి చూడాలనే స్వాతంత్ర్యం కోసం పోరాడాను. నాలో అణచి వేయబడ్డ ఈ కోరికలు నిషేధాలకు వ్యతిరేకంగా నన్ను రెచ్చగొట్టేవి.

* * *

# 7

నన్ను బాగా ఆకర్షించిన మాయా జాలంలో దేవకి పిన్ని మొద టిది. ఆవిడ నాకు రెండవ తల్లితో సమానం. నా చెల్లాయి కౌసల్య స్థానాన్ని నేను ఆక్రమించాలని ఎదురు చూసే వాడిని. అందమైన ఆకర్షణీయమైన ఈ చిన్న పిల్ల ముద్దుగొలిపే బొమ్మలా కనిపించేది. పిన్ని వంట చేస్తున్నప్పుడు నేనీ పిల్లతో ఆడుకునే వాడిని. దేవకి పిన్ని ఒళ్ళోనుంచి ఈ పిల్లను వేరు చేయటం కుదరదు కాబట్టి నేను ఆ పిల్ల లతో ఆడుకునేది తక్కువ సమయం మాత్రమే. ఆ అమ్మాయి బంగారు రంగు తల వెంట్రుకలు పీకి ఏడ్పించటమో, ఆమె మట్టినాణాలు విరగ్గొ ట్టడమో చేసేవాడిని. ఆ అమ్మాయి శివతో కలిసి ఆడుకునేది. కుక్క తన వొళ్ళోవున్న పిల్లను తోసేసి మరో పిల్లను దగ్గర చేర్చుకున్నట్లుగా నాకీ తతంగం అనిపించేది. ఆ అమ్మాయి తన చిన్న మంచంలోనూ, తల్లివొళ్ళోనో నిద్రపోతున్నపుడు, ఆమె వెంట్రుకలు తళతళా మెరిసి పోతుంటే నాకెంతో ముద్దుగా వుండేది. నా చేతితో ఆమె తల వెంట్రుకలు నిమురుతూ జీవితంలో నాకింతకంటె ఎక్కువ ఆనందాన్ని మరేదీ ఇవ్వలేదని భ్రమించేవాడిని. భారతీయుల పిల్లలకు ఇలా బంగారు

రంగు వెంట్రుకలు వుండటం అరుదు కాబట్టి ఆమె జుత్తు అంటే నాకు ఎంతో ఆసక్తి కలిగేది. ఆమె లేచి ఏడుపు మొదలెట్టినపుడు ఓదార్చేందుకు ప్రయత్నించేవాడిని. పిన్ని దగ్గర నేను పొందిన అనురాగంతో నా నోటికొచ్చిందల్లా వాగుతూ ఆవిడ శ్రావ్యంగా చెప్పే చిలకమ్మ కథలు వింటూ వుండేవాణ్ణి ఎక్కువగా చిలకా గోరింకల కథలు ఆవిడ తన జ్ఞాపకాల దొంతరల్లోంచి బయటికి వచ్చాయి నా అనురాగపూరిత రహస్య జగత్తులో నేను సంచరిస్తూ అమ్మ చెప్పే వాస్తవ జగత్తులో బందీగా నిలిచిపోయాను ప్రకృతి వాసనలు గుబాళించే జనసమ్మర్దానికి దూరంగా నా బాల్య జగత్తులో మాయా జాలనికి లోబడి, ఇదే శాశ్వతమని అనుకోసాగాను. అప్పుడే విచ్చుకున్న మొగ్గ చెడు గాలుల్ని వాతావరణాన్ని తట్టుకొని తన సువాసనను నిలుపుకొన్నట్లు, జీవన వాయువుల్ని నిలుపుకొన్న గులాబీ అస్తవ్యస్తమైన వాస్తవాలను పారద్రోలి అన్నిటినీ సంతోష భరితం చేసినట్లు, తమ తమ అనుభూతులకు లోబడి అమాయకత్వం అనే సుడిగాలిలో పడిపోయి నట్లు నాకారోజులు అనిపించేవి. దురదృష్ట వశాత్తు నా ప్రణయానికి చిహ్నంగా నిలిచిపోయి నేను తిరుగాడే ఈ లోకం నాకోసం నాశనం కావల్సి వచ్చింది. అయితే నాలోని దోషాలవల్ల కాసీ, నావల్లకానీ ఇతరుల లోపాలవల్లకానీ అలా జరుగలేదు. అదేదో ఒక అనూహ్యామైన శక్తివల్ల అలా జరిగిపోయింది. అలా ఎందుకు జరిగిందో నేను సమీక్షించలేను.

ఇంచు మించు ప్రతినెలా మా కంసాలి జాతి సోదరులలో ఎవరో ఒకరు మంణించేవారు ఇంతకు ముందులా నేను కంటోన్‌మెంటు ప్రపంచంలో దూరంగా వుండకపోవటం వల్ల అమ్మ వాళ్ళ దుఃఖంలో పాలుపంచుకునేది.

చనిపోయిన నాటినుండి ప్రారంభమైన ఈ విషాదం పదమూడవ రోజు అస్థి సంచయనం వరకు కొనసాగేది. మళ్ళీ తిరిగి ఎవరో ఒకరు పుట్టడమో, వివాహం చేసుకోవడమో జరిగేంత వరకు ఈ దుఃఖం అంతమయేది కాదు.

రావణాసురుణ్ణి సంహరించి శ్రీరామ చంద్ర ప్రభువు లంకారాజ్యాన్ని జయించిన మహోత్సవాలను ఏటా జరుపు కుంటున్నపుడు రామదూత

హనుమంతుని వేషాన్ని మా దూరపు బంధువు సూచా ధరించాడు. ఈ మహా సంగ్రామంలో వివిధ ఘట్టాలు అమృతసర్ నగర వీధుల్లో ఉత్సవంగా వెళుతున్నపుడు హనుమంతుని తోకకు నిప్పంటుకుంది. మిగిలిన కోతులకు తోక చిన్నది కావటంవల్ల ఎలానో ప్రమాదం నుంచి బయట పడ్డాయి. సూచా వొంటినిండా 'ఆయిల్ పెయింటు ' పూసుకున్నందు వల్ల తోక పొడవుగా వున్నందు వల్ల అతనా మంటలకు ఆహుతి అయ్యాడు.

మృత్యు కళంకానికి దూరంగా పసిపిల్లలైన మమ్మల్ని ఎలానో రక్షించే వారు. దయ్యాలంటే నాకున్న భయం వల్ల కొలిచే 'సైపా' కార్యక్రమాన్ని, మా వీధులకు దూరంగా నిర్వహించేవారు.

ఆ కుర్రవాడు బంధువర్గంలో మాకు వరుసకు తమ్ముడు కావటం వల్ల పదమూడవ రోజు నన్ను, కౌసల్యను, శివాను స్మశానానికి దగ్గరలో వుండే చెరువు వద్దకు స్నానానికి తీసుకు వెళ్ళారు. 'లోహ గర్' కోట ద్వారం వెలుపల ఉన్న ఆ చెరువులో మేము స్నానం చేసి బట్టలుతుక్కోవటానికి సంబరంగా వెళ్ళాము

అమ్మా, పిన్ని గుడిలోపల ఏదో తతంగం నిర్వహిస్తుంటే నేను కౌసల్యను, శివను దగ్గర వుంచుకున్నాను. వీళ్ళిద్దరూ నాతో దాగుడు మూత లాడినట్లుగా ఆటలాడి పక్కనేవున్న స్మశానంలోకి జారుకున్నారు. అక్కడ శవాలు కాలుతూ వున్న పొగ ఇంకావస్తూనే వుంది.

గేటు లోపల నుండి వెళ్ళి వాళ్ళను వెతకడానికి నాకు భయం వేసింది ఎంత సేపటికి వాళ్ళు కనిపించకపోయే టప్పటికి వెతుక్కుంటూ వెళ్ళాను వాళ్ళిద్దరూ బాగా కాలిపోయిన కొయ్య దుంగ దగ్గర తారట్లాడుతూ స్మారక శిలకు వెనక దాక్కొని కనిపించారు. నేను వాళ్ళను వెంబడించాను. వాళ్ళు యింకా వేగంగా పరుగెడుతూ దారిలో ఒక పుర్రెనూ వీళ్ళ ఎముకలనూ అందుకొని నామీదకు విసిరారు. వాళ్ళ యీ తుంటరి పనులను అక్కడి కాటి కాపరి అడ్డుకోబట్టి సరిపోయింది. వాళ్ళిద్దరినీ గొర్రెల కాపరిలా నేను చెరువుకు అనుకునివున్న గులాబీ తోట వద్దకు తరుముకు వచ్చాను

వాళ్ళిద్దరూ నా పట్టు విడిపించుకుని మళ్ళీ దాగుడుమూత లాడుతూ గులాబీ పొదల మధ్య పరుగెత్త సాగారు. మేము ముగ్గురమూ ఆనందంగా గంతులు వేస్తూ కేరింతలు కొడుతూ చెమటతో తడిసిపోయాము.

గుళ్ళోనుంచీ బయటకు వచ్చిన అమ్మ, పిన్ని, మమ్మల్ని చూసి మేము ముచ్చటైన పిల్లల్లా ఆడుకుంటున్నందుకు తృప్తి చెందారు. మమ్మల్ని స్నానాల గదుల వద్దకు తీసుకువెళ్ళి దూరంగా వెళ్ళకుండా ఆడుకోమని చెప్పారు మరుగు ప్రదేశంలోకి వెళ్ళి బట్టలువిప్పి వాళ్ళు అక్కడ బండరాళ్ళపై ఉతక సాగారు.

పోకిరి వాళ్ళైన కౌసల్య, శివా ఆడవాళ్ళ స్నానాలగది గోడ విరిగి సన్న రంధ్రం వుండటం గమనించారు. దాని దగ్గరగా వెళ్ళి తారట్లా డుతూ ఎవరూ గమనించకుండా నన్ను కాపలా పెట్టారు. ఆ రంధ్రంలోంచి చూస్తే ఆ నురగలు కక్కుతున్న నీరు ఆడవాళ్ళ స్నానాల గదులను తాకు తున్నాయి. హరిద్వార్ లోని గంగానదిలో మృతకళేబరాలను విమజ్జనం చెయ్యలేని బంధువులు ఇక్కడ వదిలిన శవాలు తేలియాడు తున్నాయి.

ఆ ఎముకలను ముట్టుకోవాలంటే నాకు భయం వేసింది కౌసల్య, శివ నిర్భయంగా మెట్లు మూడు వరసలు దిగి కాలిపోయిన పుర్రెలు, ఎముకలు ముట్టుకొని చేతులు పాడుచేసుకున్నారు.

వాళ్ళ ధైర్యంచూసి నాలో ఉత్సాహం పెరిగి నేనూ వాళ్ళతో కలు సుకున్నాను. చనిపోయిన వ్యక్తి పుర్రెను ముట్టుకుంటే ఎవరూ చనిపోరని మృతకళేబరాలను అంటుకుంటే వాళ్ళు దయ్యాలుగా వచ్చి పట్టుకుం టారని, నాలో ఉన్న భ్రమలు తొలగిపోయాయి. అక్కడ మునిగిపోయిన ఎముకల నన్నింటినీ పోగు చేసి ఒక శరీరం ఆకారంలోకి కూర్చాము. అయితే అందులో కొంత భాగం కాలి నుసి అయిపోయింది. ఇలా మేము చాలాసేపు సంతోషంగా ఆడుకున్నాము. అమ్మ స్నానంచేసి బయటకు వచ్చేటప్పటికి మేము కనిపించక పోయేసరికి మమ్ములను వెతు క్కుంటు వచ్చి చెరువులో బురదతోను, ఎముకలతోను ఆడుకుంటున్న మమ్ములను చూసి, భయభ్రాంత అయిపోయింది. మమ్ములను ఈడ్చు కుంటూ లాక్కెళ్ళింది. మమ్మల్నందరినీ నదిలో ముంచి స్నానాలు

చేయించింది. నీళ్ళలో దూరంగా పోకుండా మామీద నీళ్ళు చల్లి కాసేపు ఆడించింది.

శరత్‌కాల మేఘాలు ఆ ప్రభాతవేళ సూర్యుని కప్పురాగా మాకు కొద్దిగా చలివేసింది. కౌసల్య ఎందుకో విసుగ్గా ప్రవర్తించింది. దక్షిణ దేశం నుంచి తెచ్చిన తీర్చిదిద్దిన ఇత్తడి బొమ్మలా దేవకిపిన్ని నీళ్ళలో నుంచి స్నానంచేసి ఇవతలకి వచ్చింది. ఆమె వంటిమీద నుంచి నీటి బొట్లు రాలుతూ వుండగా కొద్దిగా చలికి వణుకుతూ తువాలుతో మా ముగ్గురి తలలూ తుడిచింది. తర్వాత ఆమె తల ఆర్పుకుని మాకు బట్టలు వేసి గేటు అవతల వేడివేడి పూరీలు తీపి బిస్కెట్లు తీసియిస్తానని చెప్పింది. మాకు బాగా ఆకలి వేస్తున్నందువల్ల ఆవిడ ఈ మాటలు చెప్పగానే మేము అసహనంతో గంతులువేస్తూ తొందరగా వెళ్ళి తినాలని మూలిగాము. మమ్మల్ని బుజ్జగిస్తూ ప్రశాంతంగా కూచోమంటూ పిన్ని త్వరగా బట్టలు వేసుకోమని అమ్మను తొందర పెట్టింది.

బట్టలుతకడం పూర్తి కాకపోవడంవల్ల మమ్మల్ని తినుబండారం అంగడికి తీసుకువెళ్ళి ఏవో ఒకటి తినిపించి యింటికి తీసుకు వెళ్ళమని పిన్నితో అమ్మ చెప్పింది. తాను మెహెంగా వాళ్ళ అమ్మతో తర్వాత వస్తానని చెప్పింది. ఈ మాటలు విని మేము సంబరపడి పోతూ పిన్నికన్నా ముందు పరుగులు తీశాము. కౌసల్య మాత్రం సగం దూరం నడిచే సరికి అలసిపోయి వాళ్ళ అమ్మ నెత్తుకోమంది. పిన్ని చెప్పగానే అంగడి వాడు మాకు వేడి వేడి పూరీలు, ఆలూకూర, ఊరగాయ వడ్డించాడు. కౌసల్య మాత్రం తినటానికి సుముఖత చూపక ఆవులిస్తూ ఎత్తుకోమని మురిపెం చేసింది. పిన్ని తన కూతురి తల నిమిరి ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ జ్వరం వచ్చినందుకు బాధపడింది. వెంటనే దగ్గరలోవున్న టాంగాను పిలిచి మమ్మల్నందరినీ యిల్లు చేర్చింది. కౌసల్య ఆమెవొడిలో ఏడవ సాగింది. దారిలో బాబాయి అంగడివద్ద టాంగాను ఆపి హకీం మొహమదాలీని పిలిపించి, కౌసల్య నాడి చూపించవలసిందిగా చెప్పింది. బాబాయి చేతిలోని సుత్తి పక్కనబెట్టి హకీము గది వద్దకు వెళ్ళాడు. మేము యింటిముఖం పట్టాము.

మేమందరం దేవకి పిన్ని వాళ్ళ యింటి గడప మీదకూచుని ఒక్క

క్షణం ఆగి మేడమీదికి వెళదామనుకునే లోగా పోతుగడ్డంగల మొహమ్మద్ అలీ హకీమ్ వచ్చి కౌసల్య నాడి పరీక్షించారు. నిర్విణ్ణమైన వదనంతో అతను నిల్చోడానికి యిష్టపడని వాడిలా బాబాయిని ప్రక్కకు తీసుకువెళ్ళి వ్యాధిగురించి మాట్లాడాడు. తాను ఒక భస్మం పంపుతానని అది పండ్లరసంతో కలిపి కౌసల్య కీయవలసిందిగా చెప్పాడు.

అప్పటికే బాధతో మూల్గుతూ మేడమీదకు వెళ్ళటానికి యిష్టపడకుండా ఇక్కడేవుండి శివతోను నాతోను ఆడుకుంటానని కౌసల్య మారాం చేసింది. పిన్ని లచ్చి దగ్గర నులకమంచం అడిగి తీసుకొని పాపను పడుకో బెట్టింది. ఈలోగా బాబాయి మందు తీసుకొనివచ్చి పిల్లకు యివ్వమని పిన్ని చేతి కిచ్చాడు.

రెండు గుటకలు మందు మ్రింగగానే జ్వరంతో మూల్గుతూ పిల్ల మెలికలు తిరిగి పోసాగింది. మంచం మీద యిటు అటూ పొర్లాడుతూ తన విశాలమైన కళ్ళు చీకటిదారిలో ఇంద్రనీల మణుల్లా ప్రకాశిస్తూవుండగా బాధపడుతోంది. తమ గారాల పట్టి అనుకోకుండా జబ్బుపడటం వల్ల కలిగిన నిర్వేదం నుండి ఆ తల్లీ తండ్రీ కొంచెం గాలిపీల్చుకునేలా ఆ పిల్ల నిద్ర కుపక్రమించింది.

గడప ముందు మంచం మీద పడుకున్న కౌసల్య కంటికి పాలిపోయిన విగ్రహంలా వుండటం నా మనస్సులో హత్తుకుపోయింది. దుర్గ చెరువు వద్ద శవాల ఎముకలతో వీళ్ళిద్దరినీ ఆడుకోనిచ్చిన తప్పుకు నాలో నేనే బాధపడ్డాను. ఎముకలను పోగు చేసి నందువల్ల ఆ దయ్యం ఈ పిల్లను పట్టుకున్నదని అమ్మ నా చెవిలో వూదింది. అయితే ఎవరికీ నేనీమాట చెప్పలేదు.

క్రమక్రమంగా జ్వరంతో క్షీణించి పోయి మంచం మీద నుంచి లేవలేని స్థితిలో పడివున్న కౌసల్యను చూస్తుంటే నాలో మృత్యువును గురించి అపోహలు, అనర్థాలు, భయంకరంగా మెదల సాగాయి. దుర్గంధ భూయిష్టమైన ఈ పవిత్ర అమృతసర్ నగరంలో భాగమైన మా వీధి చీకటి వాతావరణంలో మా అమ్మ నాకు కట్టుకథలుగా చెప్పిన దయ్యాలు భూతాల ఊహల సూచనలు కళ్ళముందు కనిపించాయి.

నాన్నగారు ఫ్రాన్సు దేశంనుండి తిరిగివచ్చి చిత్రాల్ పట్టణానికి సమీపంలోని మాలాఖండ్ కోటలో 38వ డోగ్రా దళంలో చేరారు. బాబాయి నాన్నకు కొద్దిరోజుల తర్వాత కౌసల్య విపరీత జ్వరం గురించి వ్రాశాడు. దీపావళి పండుగ సందర్భంగా శలవులను పురస్కరించుకొని 15 రోజుల శలవుమీద వచ్చేవారం వస్తున్నానని నాన్న వ్రాశారు అనుకున్న ప్రకారం ఆయన దిగారు. వస్తూ మాకు బొమ్మలు కర్పూరం, మిఠాయిలు, రెండు సంచుల్లో విడి విడిగా తెచ్చారు. ఒకటి కౌసల్యకు మిగతాది మాకు.

స్ఫురద్రూపి అయిన మానాన్నగారు తన అనురాగాన్ని ఇంటిల్లపాది అనుభవించేలా చేశారు. అప్పటి వరకు హకీమ్ మహమ్మదాలీ మా కుటుంబ సభ్యులందరినీ తన మౌనం ద్వారా భయభ్రాంతుల్ని చేశాడు. ఆయన నోరు మెదపక పోయేసరికి ఆ జబ్బు గురించి ఏమీ పాలుబోలేదు. మానాన్న రాగానే ఈ బూటకపు వైద్యుని మాటలు పట్టించుకోవద్దని, సుప్రసిద్ధుడైన పార్సీ వైద్యుడు, తన స్నేహితుడు అయిన డాక్టరు మేనెక్షాను పిలుద్దామని సలహా యిచ్చాడు. అందుకు అందరూ అంగీకరించారు. డాక్టరు మేనెక్షా కౌసల్యను 'స్టైతస్కోప్'తో క్షుణ్ణంగా పరీక్షించి మా అందరికీ ధైర్యాన్ని చేకూర్చారు. ఆయన వెంటనే ఒక నిర్ణయానికి రాకుండా కొంత కాలంపాటు వ్యాధి తీవ్రతను గమనించారు.

కానీ ఆయన మాలో కలిగించిన ధైర్యం ఆశగా రూపొందలేదు. చాలా రోజులుగా క్రిములు కౌసల్య ఊపిరి తిత్తులను క్రమక్రమంగా తినివేస్తున్నాయని కౌసల్యా నెలల తరబడి నయంకాని వ్యాధితో బాధపడటంవల్లనే జ్వరం వస్తోందని నాన్నతో డాక్టరు నిర్ధారించి చెప్పారు. నాన్న ఆవార్తను పిన్నికి, బాబాయికి చెప్పక తప్పలేదు. సిమ్లా కొండలమీద కౌశాలీ పట్టణంలో యిలాంటి వ్యాధులకు ప్రత్యేకంగా వున్న ఆసుపత్రికి బిడ్డను తరలిద్దామని నాన్న డాక్టరుతో సంప్రదించారు కానీ ఎందువల్లనో ఈ సలహాకు డాక్టరు అంగీకరించలేదు. వ్యాధి ఆవిడ శరీరంలో బాగా ముదిరిందని ఆయన అభిప్రాయం. (అమృతసర్‌లోనే రోగివుంటే తాను బాగా డబ్బుగుంజవచ్చని డాక్టరు అలా అన్నాడని అమ్మ అంది)

మాయింట్లో అలుముకున్న విషాద వాతావరణాన్ని తొలగించేలా

అన్నయ్య హరీష్ తనతో జైళ్ళ ఇనెస్పెక్టర్ జనరల్ అయిన 'కర్నల్ బేరీ'ని వెంట బెట్టుకొచ్చారు. ఆయన మంచి డాక్టరు. ఒక తెల్లజాతి వాడు - మా వీధిలోకి రావటం అందునా అతను డాక్టరు కావటం మా కుటుంబానికి గర్వకారణం అయింది. ఆయన మా నాన్నతోను అన్న తోనూ ఇంగ్లీషులో మాట్లాడుతూ వుంటే మా ఇరుగు పొరుగు వాళ్ళకు ఉత్సాహాన్ని కలిగించి కౌసల్య క్షయవ్యాధి తప్పని సరిగా నయమౌతుం దనే విశ్వాసం కలిగింది. ఆ డాక్టరుగారు చెప్పిన ఖరీదైన మందులు వాడి నప్పటికీ బిడ్డలో ఏ విధమైన విశేషమూ కనిపించలేదు. ఈ సందర్భంలో ఆఖీ పెద్దమ్మ ద్వారా సైన్‌లోక్ భూతాన్ని ఆవహింపజేసి పురోహితులకు దానాలు చేస్తే కౌసల్యను ఆవహించిన దయ్యం వదిలి పోవచ్చునని అమ్మ చెప్పసాగింది

ఆమాట వినగానే నాన్న ఎగిరిపడి 'వెధవ వాగుడు కట్టి' పట్ట మనీ, భూతాలను కొలవటం అనే ప్రశ్నలేదని ఖండితంగా చెప్పారు. కౌసల్య వద్ద ఆవిడ వ్యాధి గురించి గాని దాని మందుల గురించి గాని ఎవరూ ప్రస్తావించ వద్దని ఆ బిడ్డను మురిపంగా కళ్ళలోవత్తులు వేసు కుని కాపాడమని సలహాయిచ్చాడు. ఈ అవకాశాన్ని పురస్కరించుకొని మా పిల్లలందరి ముందు అమ్మకు అర్ధమయ్యేలా తాను ఆర్యసమాజం వాడిననీ, తన కంసాలి జాతి మూఢ నమ్మకాల పట్ల విశ్వాసం లేదని నిశ్చితంగా చెప్పాడు. ఆ మరునాటి ఆదివారం వుదయం వారం వారం ఆర్యసమాజం గదిలో జరిగే ప్రార్ధనలకు బాబాయి, నాన్న, నేను, గణేష్ వెళ్ళి కౌసల్య వ్యాధి నయం కావడానికి పవిత్ర భగవంతుని ప్రార్థించాము.

కౌసల్యకు వచ్చిన వ్యాధివల్ల అమ్మకూ పిన్నికీ కుదిరిన చెడు నమ్మకం ఇంకా వదల్లేదు. దీపావళి నాటి రాత్రి విష్ణుమూర్తి ప్రియపత్ని అయిన లక్ష్మీదేవిని ప్రార్థించడం ద్వారా మాయిండ్లలో అప్రమత్తంగా ఉండవలసిందిగా మమ్మల్ని వాళ్లిద్దరూ కోరారు. తద్వారా కుటుంబ సౌభాగ్యం వృద్ధి పొందడమే కాకుండా కౌసల్య ఆరోగ్యం కూడా మెరుగై ఆ బిడ్డ కళకళలాడుతుందని వారి నమ్మకం.

మాయింటి విషాద చ్ఛాయలు దూరంగా పోవడానికి పిల్లలు ప్రమి దలతో కూడిన గుమ్మటాలు వరండాలో త్రిప్పుకోవడానికి, మిరాయిలు

తినడానికి ప్రత్యేకంగా పెద్దలు అనుమతించారు. టపాకాయలు మాత్రం పేల్చవద్దని, యిష్టమైతే పొరుగింటి వాళ్ళు పేల్చుతుంటే చూడమని చెప్పారు.

దీపావళి పర్వదిన సందర్భంగా ఇనప్పెట్టె గదులలో ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన దేవీ మందిరాలలో లక్ష్మీదేవిని అమ్మ, పిన్ని శ్రద్ధగా పూజించారు. వాళ్ళిద్దరికీ దేవి ప్రత్యక్షమై విష్ణుదేవునితో కౌసల్య ప్రాణాలు కాపాడవలసిందిగా కోరుతానని వాగ్దానం చేసిందట. వాళ్ళిద్దరూ హుండీలో వేసిన డబ్బులు వృద్ధిచెంది ఆరాత్రి ఒక్కొక్క రూపాయ అధికంగా కనిపించిదని అందువల్ల మా కుటుంబ సౌభాగ్యం ఇనుమ డించే అవకాశాలున్నాయని అన్నారు. ఆ మర్నాడు ఉదయం ప్రతాప్ బాబాయి జూదరి హరియాతో ఆడి ఐదువందలు పోగొట్టుకున్నాడని, మాకు మిఠాయిలు కొనడానికి బజారుకు వెళ్ళి మానాన్న జేబు ఎవడో కత్తిరించాడని అదృష్టవశాత్తు పర్సు దొంగిలించ బడలేదని మా వీధిలో గుసగుసలు వినిపించాయి. దేవతలు అందరి ప్రార్థనలు విని ప్రత్య క్షంకారని దేవదత్తా బాబాయితో నేను, గణేష్ అంగీకరించటానికి ఈ సంఘటనలు దోహదం చేశాయి

దీపావళి అయిన మరికొన్ని రోజులకు కౌసల్యను ఆవరించిన భయం కరమైన వ్యాధి వదలిపోతుందనే నమ్మకాలను వమ్ముచేస్తూ ఒక కాళరాత్రి కౌసల్య అసువులు బాసింది. మా పిన్నికి, బాబాయికి నాన్నకు ప్రపంచ మంతా తలక్రిందులైనట్లు విపరీతంగా విలపించారు. మా కళ్ళనీళ్ళు ఆపడానికి ప్రయత్నించారు. ఆ రాత్రి విషాదగీతం ఆలపించే సిద్ధి సంప్ర దాయ ప్రకారం సైపాను ఆరాధించటం అనే తతంగంతో సరిపోయింది.

మేము మా పడకలు మీద కూచుని వున్నప్పటికీ కౌసల్య శవా నికి స్నానం చేయించి దహన వాటికకు తీసుకవెళుతున్నారని తెలియగానే చందన సుగంధాలు వ్యాపించాయి. ఆనాడు దుర్గాలయం ముందు కౌస ల్యతో నేనూ శివా చెరువుగట్టు మీద, తోటలో ఆడుకున్న సంఘటన గుర్తుకు వచ్చింది. . ఒకవేళ కాలయముడు అప్పుడే కౌసల్య పై తన చేయి వేశాడా? అన్న అనుమానం నాకు వేసింది. అయితే నన్ను శివను కూడా అలానే చేస్తాడా?... అమాయకపు పిల్ల అయిన కౌస

ల్యను నేను గారాబంగా చూడటం వల్ల ఆవిడ దయ్యంగా వచ్చి నన్ను ఆవహిస్తుందనే భయం నాకు కలుగలేదు. ఆవిడ ఆత్మ ఈ వీధుల్లోనే తిరగాడుతుందని నా ఊహ.

నా సుఖమయ ప్రపంచం ఎందుకిలా అకస్మాత్తుగా భగ్నమైపోయింది - అని నా కాశ్చర్యం వేస్తుంది. ఈ చావువల్ల అంతా అస్తవ్యస్త మైనట్లు ఎందుకనిపిస్తోంది. నా కౌసల్యను భయంకరమైన ఈ భూతం ఎందుకు తీసుకెళ్ళి పోయింది? చావంటే ఏమిటి? జీవితానికి అర్థం ఏమిటి? ఈ ప్రశ్నలు నాలో చిగకాలంగా అస్పష్టంగా వున్నాయి.

ప్రతిఏటా మాయింటిపురోహితుడు నిర్వహించే తిథులద్వారా పితృ దేవతలకు, సంతృప్తి కలుగుతుందా? ఆ బ్రాహ్మణ దంపతులకు తృప్తిగా భోజనం పెడితే నానమ్మ, తాతయ్య ఆత్మకు శాంతి లభిస్తుందా? ఈ ప్రశ్నలకు నాకు జవాబు దొరకలేదు. ఇటీవల హనుమంతుడి వేషంలో తోక అంటుకొన్న 'సుచ' చని పోయినప్పుడు, ఇప్పుడు కౌసల్య మరణించిన ప్పుడు నా అనుమానాలు మరీ బలపడ్డాయి. కౌసల్య వియోగంతో నాలో చిన్నపిల్లవాని సంతోషం అంతర్ధానమై ఎదుగుతున్న కుర్రవాని లక్షణాలు కనిపించి జీవితాన్ని అవగాహన చేసుకోవడానికి ప్రయత్నం మొదలెట్టాను.

ఈ విషాద సంఘటనల మధ్య నాలోని భయం క్రమక్రమంగా దూరం అయింది. నేను పెద్దవాణ్ణయినట్లు భావనకలిగింది. ఈ ప్రశ్నల న్నిటికీ జవాబు వెదకాలి. శవాల ఎముకలతో ఆడుకోవడంవల్ల శవదహనం చూడటంవల్ల ఎటువంటి అపకారము జరగదనీ, తెలిసింది. కౌసల్య రోజురోజుకీ తన ఊపిరితిత్తుల వ్యాధివల్ల జీర్ణించుకోవడం చూడటంవల్ల, మానాన్నగారు, దేవదత్త బాబాయి దీర్ఘకాలవ్యాధులు నయంజేయడానికి యూరోపు దేశంలో జరుగుతున్న కృషిని గూర్చి మాటాడుకోవడం వినడంవల్ల, దయ్యాలంటే నేను ఎదిరించే స్థితికి వచ్చాను. తన చేతు లలో యిచ్చిన ప్రాణాలను భగవంతుడు స్వయంగా ఎందుకు తీసుకెళ్తాడో అర్థం కాదని పెద్దలు యింట్లో అనుకోవడం మరోవైపు నా కాశ్చర్యం కలిగించింది.

15 రోజుల సెలవు పూర్తికాగానే నాన్న అమృతసర్ వదలి వెళ్లారు.

ఆయన చెప్పినట్లుగా మేము బాబాయి దగ్గర శ్రద్ధగా చదువుకొంటూ, బడికెళ్లి వస్తున్నాము. హృదయాలలో ఈ విషాదం పెనవేసుకొని ఉంది.

నేను ఒంటరిగా ఉన్నప్పుడు, గుండె గొంతుకలోపల ఈ మృత్యువును గురించిన ఊహలతో ఎవరితోనూ చెప్పుకోలేని స్థితిలో సందిగ్ధ వాతావరణంలో నిలిచిపోయాను. బహుశా యిందువల్ల నేను అంతర్ముఖుడ నయ్యానేమో! బయటికేమీ చెప్పలేకుండా ఉన్నాను. నాలోని కట్టుకథల సరళి తగ్గిపోయి, విషయాలను క్షుణ్ణంగా తెలుసుకోవాలనే తపన ఆరంభమైంది. ప్రశ్నలన్నిటికీ సమాధానం లభించేంత వరకు విశ్రాంతి తీసుకోరాదనీ, తెలియని విషయాలనుగూర్చి తెలుసుకోవాలనీ జిజ్ఞాస బయలుదేరింది.

కౌసల్య మరణం నా జీవితంలో మొట్టమొదటి మలుపుగా భావిస్తాను. జీవితమంతా అది పనిచేసి అజ్ఞానం నుండి జాగ్రదవస్థకు నన్ను మరలించింది.

# 8

కొంతకాలానికి బాల్యావస్థలోని మగటిమి నుండి నిలదొక్కుకొని బయటపడ్డాను. నిత్యజీవితంలో మృత్యురూప స్థానంలో ఆటలపై నాకున్న పగటి కలలు పైపైన ఆక్రమించాయి.

మాపాఠశాల క్రికెటు జట్టులో చేరలేకపోయాను సరిగదా, కనీసం మా నాలుగో తరగతి జట్టులో చేరడానికికూడా సరిపడేంత వయసుగాని, అర్హతగాని రాలేదు. నా మెప్పును మా బడి జట్టుకు కేప్టన్‌గా వ్యవహరించే లల్లా మోతీలాల్‌పై కురిపించాను. అతడు మా పాఠశాల జట్టు మేనేజరు అయిన పండిత రమానాథ్ గారికి యిష్టుడు. నాలోని కళాత్మక అభిరుచికి తృప్తి కలిగేలా నాతోడి ఆటగాళ్లయిన మన్‌మోహన్, గుగ్గిలతో అతణ్ణి గురించి, అతని ఆటగురించి గొప్పగా చెప్పేవాణ్ణి. మా బడి ఆవరణలో మా పాఠశాల జట్టులో పదకొండుమంది ఆడటం

రోజూ అనక్తిగా చూసేవాళ్లం. ఎడమచేతితో బంతినివిసిరే షేర్ మహమ్మదు, 'వికెట్ కీపర్' అయిన అబ్బాస్ అలీ, మోతీలాల్‌తో కలిసి నూరుపరుగులు పంచుకొన్న వాసుదేవ్ మాకంటికి తారల్లాగా కనిపించే వారు. ఆఖరిపందెంలో వీరు గెలుపొంది మా పాఠశాల కీర్తి ప్రతిష్ఠలు పెంచగలరని నమ్మకం. మేనేజరుగారు ఈ'లెవెన్ ఆటస్థలాలను గూర్చి ప్రస్తావించడాన్ని గుర్తుచేసుకొంటూ మా తరగతిలో చదువుకొనే కుర్ర వాళ్లు జట్టులో చేరడం మా కెంతో గర్వకారణమైంది. వారిలో గౌరీశంకరు, జుగల్ కిశోరు, కాంతి చంద్ర, గణేశ్ చంద్ర 10, 11, 12,13 స్థానాలను అందుకో బోతున్నారని తెలిసి సంబరమైంది. గణేష్ పట్ల నాకున్న ద్వేషం తగ్గి అతడు పొందిన విజయంపట్ల అనురాగం పెరిగింది.

మా జట్టు గెలవడానికిగల అవకాశాలను గూర్చి గుగ్గీతో చర్చించే వాణ్ణి. మానాన్నగారి దగ్గర పాత స్కోర్ పుస్తకం ఒకటి ఉంది అందులో ప్రముఖ క్రికెట్ ఆటగాళ్లయిన గ్రేస్, రంజీల గురించి విశేషాలు వ్రాసి ఉన్నాయి. అది ఆధారంగా చేసుకొని నేను గుగ్గీతో మాట్లాడేవాణ్ణి. ఈ రాచరికపు ఆటగూర్చి నాకు క్షుణ్ణంగా తెలుసునని గుగ్గీ నన్ను మెచ్చు కొనేవాడు. నా లోలోపల నాకు తెలుసు - నాకు తెలిసింది పదోవంతు మాత్రమేనని. కాని క్రికెట్ ఆటగూర్చిన ప్రతి అంశం మీద నాకు తెలిసినట్లుగా హుందాగా ప్రవర్తించేవాణ్ణి క్రికెట్ గురించి నిర్మాణా త్మకమైన విమర్శ చేసేందుకు నావద్ద ఉన్న సరంజామా అయిపోగానే, తాపీగా కూర్చొని, అస్పృశ్యత అడ్డువచ్చినా, మరేది అడ్డువచ్చినా గుగ్గీని ఆఖరి ఆట చూడటానికి నాతో తీసుకెళ్తానని హామీయిచ్చాను.

చాలా రోజులు శ్రద్ధగా నేర్చుకోవడం వల్ల, మా ఆటస్థలంలో అనుభవము, గోల్‌బాగ్‌లో ఆడిన సామర్థ్యము కలిసివచ్చి మాపాఠశాల జట్టువాళ్లు ప్రభుత్వ పాఠశాలను, హిందూ సభ పాఠశాలను, ఖాల్సా పాఠశాలను ఆటలపోటీలో సంవత్సరాంతంలో జరిగిన పందెంలో సుల భంగా ఓడించారు. ఆఖరి పోటీలో ఇస్లామ్ ఉన్నత పాఠశాల జట్టుతో ఎదుర్కోవాలి.

ఆఖరిపోటీకి రోజులు దగ్గిరపడే కొద్దీ రెండుజట్ల మధ్య ఉత్సాహం

రెట్టింపయింది. అందుకు మొదటికారణం ఆట జరిగేకాలంలో మాకు సెలవు అవడం, రెండు జట్ల మధ్య విపరీతమైన స్పర్థ పెరగసాగింది

గోల్ బాగ్‌లో జరిగే ఆట చూడటానికి పాఠశాల విద్యార్థులమంతా వెళ్ళే రోజు వచ్చింది. బళ్లోనుంచి నెమ్మదిగా జారుకొని టౌన్‌హాలువద్ద గుగ్గీ కోసం ఎదురు చూస్తుంటానని చెప్పాను. కాని, నా ఉద్దేశాన్ని గ్రహించి నాపై నిఘావేసి ఉంచడంవల్ల గుగ్గీని తీసుకెళ్తానని యిచ్చిన మాటను నిలుపుకోలేకపోయాను.

తరగతివారీగా విద్యార్థుల్ని డ్రిల్లుమేష్టారు హవల్దారు లేనా సింగు నుంచోబెట్టి ఉదయం డ్రిల్లు జరిపిస్తూ మేనేజరుగారి కోసం ఎదురు చూడ సాగారు. ప్రతిఏటా ఆయన ఈ సందర్భంలో ఉపన్యాసం యిస్తారు.

మీసాలు మెలివేస్తూ పండితరామానాథ్ వచ్చారు. తానే స్వయంగా ఆడబోతున్నట్లు తెల్లని ప్యాంటు, క్రికెటు ఆటగాళ్లు వేసుకొనే నీలం రంగు కోటు వేసుకొని వచ్చాడాయన. మా చెవుల్లో ఆయన ప్రతిదఫా చెప్పే ఉపన్యాసం మాటలు మారుమ్రోగుతున్నాయి. అయినా ఆయన ధోరణిలో ఆయన చెప్పిన మాటలే మళ్లీ చెబుతున్నారు. మేమంతా లోలోపల నవ్వుకొంటున్నామని ఆయనకు తెలియదు.

“పిల్లల్లారా! వాటర్‌లూ యుద్ధం ఈటెన్ ఆటస్థలంలో జరిగిం దనే ఆంగ్ల భాషలో బాగా ప్రసిద్ధం. మీకు రాబోయే రోజుల్లో ఈ చరిత్రపారం చెబుతారు. వాటర్‌లూ యుద్ధంలో ఆంగ్ల సేనాధ్యక్షుడు వెల్లింగ్‌టన్ ఫ్రాన్సు దేశాధినేత నెపోలియన్‌ను ఓడించాడు. లండన్‌కు సమీపంలోని ఈటెన్‌లో వెల్లింగ్‌టన్‌కు చెందిన అధికారులంతా చదు వుకొన్నారు. అక్కడ ఆటస్థలంలో వాళ్లు నేర్చుకొన్న క్రమశిక్షణవల్ల వాటర్‌లూ యుద్ధంలో గెలిచారని నానుడి. మనబడిలో కూడా ఈటన్ ఆటస్థలంలో పాటించిన క్రమశిక్షణ అమలు పరచాలని మా ఉద్దేశం. మీలో చాలామంది ప్రభుత్వోద్యోగాలలో చేరబోతారు. మీలో ఆటగాళ్ల దీక్షాదక్షతలు, క్రమశిక్షణ రావాలని నా కోరిక. ఇప్పుడు మీరంతా ఒకే వరసలో నిశ్శబ్దంగా, మీ డ్రిల్ మేష్టారు ననుసరించి సైనికుల్లా వెళ్ళండి”

అన్నారు పండిత రామానాథ్.

మునిసిపల్ భవనాల గుండా మా విద్యార్థిదళాలు వరసగా బజారు వీధుల్లో నడిచాయి. మధ్యమధ్యలో ఒకరితో ఒకరు మట్లాడుకోవడానికి, వీధిలో బోర్డులు చదవడానికి, అంగళ్లు, పుస్తకాల శాలలు, గడియారాలు తయారుచేసే స్థలాలు చూడటానికి, ఖర్జూరం, చెరుకుగడలు కొనడానికి వరసలోంచి చీలిపోయి మళ్లీ చేరేవాళ్లం

మేమందరం గోల్‌బాగ్ చేరేసరికి ఉదయసూర్యకిరణాలు మాపై ప్రసరించసాగాయి. చల్లగాలుల సౌరభం విరజిమ్మింది. గుండ్రని ఆకారంలో ఉండే పార్కు దాటగానే ఆటస్థలం కనిపించింది. వెంటనే వరసల్లోంచి చీలిపోయి గుంపులు గుంపులుగా విద్యార్థులు చెదిరిపోయి, ఆటగాళ్లకు దగ్గరగా కూచోసాగారు. ఎత్తయిన ప్రదేశంలో ఏర్పాటు చేసిన కుర్చీల్లో పురప్రముఖులు కూర్చోడానికి ఏర్పాట్లు చేశారు. అక్కడే నల్లని బోర్డు 'స్కోర్' వేయడానికి అనువుగా ఉంచారు. డ్రిల్లుమేష్టారు బెత్తం ఝళి పిస్తూ మమ్మల్ని క్రమబద్ధంగా కూచోబెట్టడానికి ప్రయత్నించారు. అర్ధ చంద్రాకారంలో విద్యార్థులంతా కూచొన్నారు. మాకెదురుగా ఇస్లామియా పాఠశాల విద్యార్థులు కూచొని ఉన్నారు. ఆటస్థలానికి దగ్గరగా కూచో డానికి ప్రయత్నించి, అందరిలోకి చిన్నవాణ్ణి కావడంవల్ల మా తర గతి వాళ్లయిన మన్‌మోహన్, లాభారామ్, రామ్‌లాభయ్యు, జ్ఞాన్‌చంద్, బిషన్‌దాస్‌ల మధ్య నేను యిరుక్కుని కూచొన్నాను. మాకు జట్టు కేప్టైను మోతీరామ్, వికెట్‌కీపరు అబ్బాస్ అలీ, ఎడమచేతి ఆటగాడు షేర్‌మహమ్మదు, వాసుదేవు, అమోలక్‌రామ్ బాగా కనిపిస్తున్నారు. ఆటగాళ్లలో చిన్నవాళ్లయిన గౌరీశంకర్, కాంతిచంద్ర, జుగల్ కిశోర్ వాళ్ల పక్కనే ఉన్నారు. గణేశ్ పదమూడోవాడు కావడంవల్ల వాళ్లతో కూచున్నాడు. మొట్టమొదటి సారిగా వాణ్ణి ఓరగంటితో ద్వేషభావంతో చూశాను. పాలిపోయిన వాడి మొహాన్ని చూస్తూ నాకంటె అధికంగా వాడుండటం ఓర్చుకో లేకపోయాను.

ఆట యింకా ఆరంభం కాలేదని మేమంతా అసహనంతోను ఆదు ర్దాతోను మాట్లాడుకొంటున్నాము. ధోవతులు, చొక్కాలు ధరించివచ్చిన నగరవాసులకంటె మేమెంతో అధికంగా ఉన్నట్లు అనుకోసాగాము. గుగ్గిని

వీళ్ల అందరి మధ్యలోకి తీసుకవద్దా మనుకొన్న ఆలోచన ఎంత తెలివితక్కువదో తెలిసివచ్చింది. అంతకుముందు నేను తీసుకొన్న నిర్ణయం మంచిదికాదు. గుగ్గీని తీసుకరాలేకపోయాననే చింతకూడా తొలగి పోయింది.

ఇస్లామియా పాఠశాల విద్యార్థులు కోలాహలంగా అరుస్తున్నారు. మాకంటె ముందు వాళ్లు ఆ అవకాశాన్ని తీసుకోవడం మాకాశ్చర్యం వేసింది. ఇంతలో ఆ పాఠశాల హెడ్మాష్టరు మెర్కాడో నోట్లో చుట్టకాలుస్తూ బండిదిగి వచ్చారు. వస్తూ పండిత రమానాధ్‌గారిని చేతిసైగలతో పలకరించారు.

'భళా! భళి! మెర్కాడోగారికి జేజేలు చెప్పండి'

'జైజై' అని నినాదాలు చేశాము.

అలా మమ్మల్ని జేజేలు పలకమనడం పదో తరగతి కుర్రవాడొకడు అభ్యంతరకరంగా భావించాడు. మోతీదాస్ మాజట్టు తరపున, ఇస్లామ్ పాఠశాల జట్టులో నజీర్ అలీని బొమ్మ బొరుసు గెలుపుకు పిలిచాడు. మా కుర్రవాళ్లంతా 'మోతీలాల్ జై' అని అరిచారు.

సిల్కు చొక్కా, తెల్లటి ప్యాంటు వేసుకున్న దృఢకాయుడైన మోతీకి మేమందరం జయజయధ్వానాలు పలికి వీడ్కోలు చెప్పాము. మా అరుపులు సద్దుమణిగిన తర్వాత మా గుంపును అదుపులో పెట్ట వలసిందిగా మా మేష్టార్లకు పండిత రమానాధ్ ఆజ్ఞలు జారీచేశారు.

మోతీరామ్‌కు వ్యతిరేకంగా ఎవరైనా తిడితే, మా జట్టు వాళ్లలో పెద్దకుర్రవాళ్లు గొడవ చేయడానికి ఉపక్రమించారు. 'పండిత రామానాధ్ గారి పెంపుడు చిలక' అని మోతీరామ్‌ను పిలవడానికి కారణమేమిటో చిన్నవాడైన నాకు పూర్తిగా అర్థంకాకపోయినా, మా మేనేజరు కెప్టెన్ ఎంపికలో పక్షపాతం చూపాడని మాత్రం అర్థం చేసుకోగలిగాను.

'మొరటుగా జవాబు చెప్పకండి' తన సీటులోంచి లేచి తీక్షణంగా మావైపు చూస్తూ అన్నారు పండిత రామానాధ్.

ఇంతలో మోతీరామ్ ఆటస్థలం మధ్యలోకి చేరి, ఎదుటి జట్టు నాయకుడైన నజీర్ అలీతో కరచాలనం చేశాడు. వాళ్లిద్దరూ శుభా

కాంక్షలు చెప్పకోవడం చూసి రెండు జట్ల విద్యార్థులు ఆదుర్దాగా చూశారు. మా నాయకుణ్ణి మేము వేయికళ్లతో గమనిస్తున్నాం.

ఇంతలో మోతీ తన చేతిలో వెండి నాణెం గాలిలోకి విసిరాడు అది భూమిపై పడింది. బొమ్మ బొరుసా చూడటానికి ఇద్దరు నాయకులు ముందు కురికారు. మా జట్టు పందెం గెలిచినందుకు సంతోషంగా మోతీచేయి విసిరాడు.

'భళా! భళి!' అన్నాడొక విద్యార్థి, పండిత రామానాథ్ మాపై పెట్టిన ఆంక్షలు లెక్క చేయకుండా.

'భళా! భళి' అంటూ విద్యార్థులు సంబరంగా టోపీలు, తలపాగాలు విసురుకొంటూ తమస్థానాల్లోంచి లేచి నిలుచున్నారు.

మా మేష్టార్లు ఏమి చేయడానికి పాలుపోక చూస్తుంటే, పండిత రామానాథ్ స్వయంగాలేచి తన చేతిబెత్తం ఝుళిపిస్తూ విద్యార్థుల్ని కూచోబెట్టారు. అయినా రెండు జట్లమధ్య తగాదా క్రమంగా వృద్ధిపొంది కోడి పందెంలా కనిపించింది.

'మేము బ్యాటింగ్ చేయబోతున్నాం' అన్నాడు తన ముక్కీడి గొంతుతో జ్ఞాన్ చంద్.

'లేదు. 'ఫీల్డింగ్' చెయ్యబోతున్నాం' అన్నాడు మన్ మోహన్.

'నోర్మూయ్' అన్నాను నేను. రాచరికపు ఆటనుగూర్చి పెద్దలు చెబుతుంటే విన్న జ్ఞానంవల్ల, హాకీ ఆటలో క్రమశిక్షణను నేను స్వయంగా పాటించినందువల్ల అలా అనగలిగాను.

పండిత రామానాథ్‌తోను, తనజట్టు ఆటగాళ్లతోను సంప్రదించిన తర్వాత, మేమందరం పందెం కాస్తున్నా దాన్ని ఆపుతూ 'మేం ఫీల్డింగ్ 'చేస్తాం' అన్నాడు మోతీరామ్ చేతులు ఊపుతూ.

ఆటస్థలం పక్కనే బేరాలు చేస్తున్న అంగళ్లవాళ్ల అరుపుల్ని మింగివేసేలా గుంపులో జనం ఈలలు, కేకలు, కేరింతలు కొట్టసాగారు.

చివరకు మా పాఠశాల జట్టులో 11మంది సిల్కు చొక్కాలు,

తెల్లని ప్యాంట్లు, తలటోపీలు పెట్టుకొని ఆటస్థలంలోకి రాగానే మా మేష్టార్లు ఆజ్ఞానుసారం గుంపులో అందరూ కేరింతలు కొట్టారు.

జట్టులోని ప్రతి ఒక్కరూ నాకు బాగా పరిచయం. వాళ్లు ఆడి పక్కన పెట్టినప్పుడు బ్యాటు నేను పట్టుకొని అప్పుడప్పుడూ ఆడేవాణ్ణి. ఆ సంబరంతో నేను తల ఆడించాను. వాళ్లను గురించి ఊళ్లో ప్రచారంలో ఉన్న నానుళ్లు నాకు బాగా గుర్తు. 'మోతీరామ్ మంచి నైపుణ్యం గలవాడు. వాసుదేవ డోగ్రావంశానికి మేనల్లుడు. అమృత సర్ ఆటగాళ్లలో ఠాకూర్ మోహన్ చంద్ మేటి. అతని తర్వాత అతని సోదరుడు కాంతి చంద్ర చెప్పుకో దగినవాడు. షేర్ మహమ్మదు భారతదేశంలోనే ఎడమచేతి బంతి విసురుకు పేరు పొందినవాడు. తన తోడి మతస్థులతో కలిసి ఆడేందుకు వస్తే ఉపకార వేతనం యిస్తామని ఇస్లామియా పాఠశాలవారు ఆశ జూపారు అతనికి.

పంజాబ్ లో ఆటగాళ్ళలో అబ్బాస్అలీ ప్రముఖుడు. అతనికి ఇస్లామియా స్కూలువాళ్ళు ఉపకార వేతనం యిచ్చారు. అమోలక్ రాం బంతిని పట్టుకోవడంలో మంచి నైపుణ్యం చూపిస్తాడు. ఈ ఆలోచలన్నీ నాలో గంతులు వేస్తుండగా నాలో ఆశ పెరిగిపోయి నా చిన్న శరీరాన్ని కుప్పిగంతులు వేయించాను. ఇంతలో నాకు శత్రువైన బిషన్ సింగు మాష్టారు 'ఒరే చుంచెలుకా!' అంటూ నన్ను మందలించారు.

'ఇంక ఆట ప్రారంభమౌతుంది. అందరూ సరిగా నడుచుకోవాలి. బంతిని విసిరినప్పుడు పరుగులు పూర్తయినప్పుడు చప్పట్లు చరవండి. రౌడీల లాగ గొడవ చేస్తే మీ భరతం పడతాను' అని అరిచాడు పండిత రమానాథ్.

మా జట్టులోని పదకొండుమంది ఎవరెవరి స్థానాల్లో వాళ్ళు నుల్చొని 'అంపైర్లు' తెల్లటి దుస్తులో 'పిచ్' ముందు నుంచునేంత వరకు మేము నిశ్శబ్దంగా వున్నాము.

ఖాల్సాకాలేజీకి చెందిన ప్రొఫెసర్ భాటియా మరో షేక్ సాదిక్ హసన్ అంపైర్లుగా వుంటారని జ్ఞాన్ చంద్ చెప్పాడు.

ఈప్తికా రుద్దీన్, కాజా, భాషా కాళ్ళకు 'పేడ్లు' కట్టుకొని 'గ్లౌజు'లు

తొడుక్కుని కుడిచేతిలో బ్యాట్ పట్టుకొని ఇస్లామియా స్కూలు పక్షాన మొదటి విడత 'బ్యాట్స్మన్'గా ప్రవేశించగానే ఆపక్షం వాళ్ళు కేరింతలు కొట్టారు. వాళ్ళకు తక్కువ లేదన్నట్లుగా మా పక్షం వాళ్ళుకూడా ఎదురు జవాబు చెప్పారు.

'వాళ్ళ గోతులు తవ్వుదాం' అన్నమాట మా గుంపులో బాగా ప్రచారమైంది. మేమందరం మా ముందున్న పచ్చిగడ్డి నేలను గెలకటం మొదలెట్టాము.

ఇలా గోతులు తవ్వి ఎదుటి ఆటగాళ్ళ బొమ్మలు పాతిపెడితే మా ప్రయోగంవల్ల మా జట్టు వాళ్ళకు అది వుపకరించి బంతి సులభంగా పట్టుకోగలరనే మూఢ విశ్వాసం మాలో వుండి అలా చేశాము.

ప్రారంభంలో బంతి విసిరే షేర్ మొహమ్మదు పక్కగా ప్రొపెసర్ భాటియా నిల్చున్నాడు. ఆయన మీసాలు పండిత రామానాధ్ మీసాల వలె గుబురుగా వున్నాయి. ఎదురుగావున్న 'బాట్స్మాన్' ఇఫ్తికార్ చూసేటట్లుగా ఆయన కొన్ని సైగలు చేశారు. ప్రథమ 'బాట్స్మాన్' బ్యాటును నేల కానించి నుంచోగానే ప్రాతఃకాలపు చలితో పాటు ఆందోళనా భరితమైన వాతావరణం నెలకొంది. బంతిని విసిరే అతను పదిగజాలు వెనక్కు వెళ్ళి వేగంగా విసిరాడు. పరుగెత్తుకుంటూ వచ్చి విసిరిన షేర్ మొహమ్మదు చేతిలో బంతి ఎడం చేతిలోంచి దూసుకుంటూ వచ్చి ఇఫ్తికార్ బ్యాటుకు తగలకుండా వెళ్ళిపోయింది. అలా వచ్చి అలా వెళ్ళిపోయినట్లుగా అనిపించింది.

'బౌలింగ్' అంటూ మా బడికి చెందిన పెద్ద కుర్రళ్ళు అరిచారు. వికెట్లకు కుడిచేతివైపున నుంచున్న అబ్బాస్అలీ, ఆ బంతిని చేత్తో పట్టుకొని బౌలర్కు విసిరి వేశాడు. నాకు పట్టరాని ఆనందం వేసింది. షేర్ మొహమ్మద్ బౌలింగ్ అంటే ప్రశంసించే గుగ్గీని నాతో తీసుకు రాలేనందుకు ఒక క్షణం బాధపడ్డాను.

షేరు మొహమ్మదు వేగంగా పరుగెత్తుకుంటూ వచ్చి ఇఫ్తికారును గురిపెట్టి బంతి విసిరాడు. ఆ బంతి బాటుకు సరిగ్గా తగిలింది.

'బాటింగ్!' అంటూ ఎదుటి పక్షంవాళ్ళు ఇఫ్తికారుకు ఉత్సాహం

కలిగించారు. మేము ఇష్తికారు గోతిని లోతుగా తవ్వి మాలోలోపల మంత్రాలు చదివాము. అతడు విసిరిన ఆరు బంతులూ పరుగులు గానీ, అవుట్ గానీ కాకుండా ముగిశాయి.

షేక్ సాదిక్ హసన్ 'అంపైరు'గా వున్నవైపు వాసుదేవ్ బౌల రుగా నుంచున్నాడు. మిగతావాళ్ళు వాళ్ళవాళ్ళ స్థానాల్లో నుంచున్నారు. వాసుదేవ్ నెమ్మదిగా ఆడుతూ బంతిని విసరడంలో మెరుపులా మెరిసి మూడవ బంతిలో ఇష్తికారును 'అవుట్' చేశాడు. మావైపు కుర్రాళ్ళు ఆటస్థలంలో పరుగెత్తి సంతోషంతో గంతులు వేస్తూ ముందుకురికారు. అలా చేయడం సమంజసమే. కాబట్టి రామానాధ్ అడ్డుచెప్పలేదు.

ఖాజా బాషా యిష్తికార్ కూడా నడుచుకుంటూ వెళ్ళి, పొడ వాటి లతీఫ్‌తో ఆనందంగా వచ్చారు. వాసుదేవ్ 'వోవర్' అయేంతవరకు వీళ్ళిద్దరూ తట్టుకొని నిలబడ్డారు. అయితే 'లెఫ్టీ' వేగానికి వాళ్ళిద్దరూ ఒకరి తర్వాత ఒకరు 'బౌల్' అయారు. ఈ సంతోషాన్ని పట్టలేక మేమందరం గంతులు వేస్తుంటే మమ్మల్ని అదుపులో పెట్టమని మా మాష్టార్లను పురమాయించారు పండిత రామానాధ్. వాళ్ళు బెత్తాలు విసిరి మమ్మల్ని అదుపులో పెట్టారు. ఇస్లామియా పాఠశాల విద్యార్థులు ఎంతో నిశ్శబ్దంగా కూచుని వున్నారంటే తగిన సమయంలో ఎదురు దెబ్బతీస్తారని ఆయన గమనించారు

ఎదుటి పక్షంలో ముబారక్ ఆలీ, సయ్యదుల్లా ఆడుతున్నారు. వాసుదేవ్ షేర్ మొహమ్మద్ చెరి రెండు 'ఓవర్లు' చేశారు. ముబారక్ ఆరు పరుగులు చేశాడు. ఇప్పుడు మేము వాళ్ళ గోతులు మరీ లోతుగా తవ్వాము. మాయా జాలంలా సయ్యదుల్లా అమూలక్ రాం చేతులో 'ఔట్' అయ్యాడు. ఆ తర్వాత వచ్చిన వజీద్ ఆలీ, అతని తర్వాత వచ్చిన జాఫరు వాసుదేవ్ చేతిలో 'ఔట్' అయ్యారు. మా ప్రత్యర్థులు అయిదు 'వికెట్ల' కు 25 పరుగులు మాత్రం తీయగలిగారు.

వాళ్ళ పాఠశాల వాళ్ళు ఓడిపోవటం సహించలేని ముబారక్ ఆలీ మరో ఆరు పరుగులు చేశాడు. అందుకు ఆ పక్షం వాళ్ళు సింహనాదం చేశారు. మరో ఆరుపరుగులు తీయాలని ప్రయత్నించి గౌరీశంకర్ చేతుల్లో

ఔట్'య్యాడు. దానితో వాళ్ళు నద్దుమణిగారు. జాఫరు తమ జట్టు 'కెప్టెన్' అయిన నజీర్ అలీతో రంగంలోకి దిగారు. అతడు మంచిపే రున్న ఆటగాడు. వాళ్ళిద్దరి సాహచర్యంలో యాభైపరుగులు సాధించారు. వీళ్ళిద్దరి ఆటను సహించలేని మేము 'లెఫ్టీ'ని ఎద్దేవా చేయటం మొద లెట్టాము. ఇంతలో షేర్ మొహమ్మద్ చేతిలో బంతి 'వికెట్ కీపరు' చేతుల్లో పడింది. ఇది గమనిస్తున్న 'అంపైర్లు' ఇలా గొడవ చేయవద్దని చెప్పమని పండిత రామానాథ్‌కు సైగచేశారు.

మేము మళ్ళీ గోతులు త్రవ్వటం మొదలెట్టాము. అంతలో మొహమ్మద్ చేతులో బంతి నజీరు అలీ కుడికాలి మీదుగా దూసుకెళ్ళి అబ్బాస్ అలీ చేతులో పడింది. 'అలా జరగటానికి వీలు లేదు' అంటూ 'వికెట్ కీపర్' 'అంపైర్'తో పెద్దగా అరిచాడు. ప్రొఫెసర్ భాటియా ఒక్కక్షణం ఆగి తన కుడిచేతి చూపుడు వేలు పైకెత్తి నజీర్ అలీ 'అవుట్' అయినట్లుగా నిర్ధరించారు.

'భళీ! భళీ!' అంటూ మావైపు కుర్రవాళ్ళు గంతులు వేస్తూ ఆట స్థలంలోకి దూకి మా జట్టు నజీర్ అలీని ఓడించటంపట్ల సంతోషం వ్యక్తం చేశారు. ఇలా జరగటం వల్ల మా జట్టు సులభంగా మిగతావారిని ఓడించి వాళ్ళు తీసిన పరుగుల కంటె ఎక్కువ పరుగులు తీయగలమనే నమ్మకం కలిగింది.

మరు క్షణంలో ఇస్లామియా పాఠశాల విద్యార్థులు గుంపుగా వచ్చి 'ఔట్ కాలేదు. ఇదంతా మోసం. దగా......... హిందూ 'అంపైరు' కావటంవల్ల పక్షపాతం చూపించాడు.' అంటూ అరిచారు. వారిలో కొందరు ఆ కర్రలను పీకి పారవేసి — 'నమ్మక ద్రోహులైన ఈ హిందువులతో మేము ఆడేదిలేదు' అని అరిచారు.

వాళ్ళ పక్షంలో ఒక మొరటువాడు అబ్బాస్ అలీని 'వికెట్టు'తో కొట్టి 'హిందూ పాఠశాలల్లో చేరిన ముస్లిములు నశించాలి! భగవం తుడా! నీవేరక్ష!' అని అరిచారు. ఆ మొరటువాణ్ణి వాసుదేవ్ పట్టుకొని చెంప వాయించాడు. ఇంతలో మా మాష్టార్లు — పండిత రామానాథ్, వాళ్ళ ఉపాధ్యాయులు ఈ గొడవ మధ్యలోకి దూకి ఇరు

షక్షాలను శాంతపరిచి గొడవలు జరక్కుండా చూస్తున్నారు. ఇంతలోనే ముష్టి యుద్ధం, చెప్పులు విసురుకోవటం, తిట్లు, శాపనార్థాలు చోటు చేసుకున్నాయి.

చిన్న పిల్లలమైన మేము బయటికి పరుగెడుతుంటే డ్రిల్లుమాష్టారు మమ్మల్ని ఒకచోట గుంపుగా చేర్చి బెత్తం పట్టుకొని నిల్చున్నారు. నేను కూర్చున్న చోటు నుంచి గణేశ్ కనపడక పోవటంవల్ల — 'గణేశ్! గణేశ్!' అంటూ ఏడవ సాగాను. 'అల్లాహో అక్బర్! హరహరమహా దేవ్' అనే శబ్దాలు మాత్రం అక్కడ ప్రతిధ్వనిస్తున్నాయి. ఏడుపులు పెడ బొబ్బలు వినపడుతున్నాయి. పక్కనేవున్న దుర్గగుడి సమీపంలోని స్మశానం నుంచి మృత్యుదేవత ఇక్కడికి వచ్చి అందర్నీ పట్టుకొని వాళ్ళ వాళ్ళ తప్పులకు శిక్షించి నరకానికి పంపుతున్నట్లుగా నా కనిపించింది. ఇంతలో చౌకీదారు సైకిలు మీద పరుగెత్తుకుంటూ వెళ్ళి పోలీసుల్ని పిలుచుకొచ్చాడు. వాళ్ళు మాముందు నడుచుకుంటూ వెళ్ళారు.

డ్రిల్లు మాష్టారు వాళ్ళల్లో ఒకపోలీసు సహాయంతో మమ్మల్ని వరు సల్లో నిలబెట్టి గోల్‌బాగ్‌కు అటువైపున్న మా పాఠశాల హాస్టలువైపుకు మమ్మల్ని తరలించాడు.

ఒక గంట తర్వాత మధ్యాహ్న సమయంలో మా గణేశ్ గాయాలతో అక్కడికి వచ్చాడని నన్ను చూడాలంటున్నాడని మా డ్రిల్లుమాష్టారు చెప్పాడు. నేను అక్కడికి వెళ్ళి చూసేసరికి గణేశ్ గుడ్డలు చిరిగిపోయి కత్తిగాయంతో తలకట్టు కట్టుకొని మరో యాభైమంది మధ్యలో కూచుని వున్నాడు. వాళ్ళందరికీ ప్రథమ చికిత్స చేస్తున్నారు.

అమ్మ ఏమంటుందో నన్న భయంతో గణేశ్ చెయ్యి పట్టుకొని 'అమ్మా!' అంటూ నేను వెక్కిళ్ళుపెట్టి ఏడ్చాను. కొంతసేపైన తర్వాత పోలీసు సహాయంతో గౌరీశంకర్ తోడురాగా టాంగాలో మమ్మల్ని యిల్లు చేర్చారు.

గణేశ్‌ను చూడగానే అమ్మ గుండెలు బాదుకుని వాడు చచ్చిపో తాడనో, చచ్చిపోయాడనో అన్నట్లుగా ఏడవసాగింది.

నేను ఈ విషాద నాటకాన్ని తప్పించుకోవటానికి దేవకిపిన్ని దగ్గరకు జారుకున్నాను

# 9

మా కుటుంబం పట్ల దేవతలకు ఆగ్రహం కలిగిందని, అందుకు కారణం బాబాయి తాగుడు, పిన్ని చెడు అలవాట్లు, హరీష్ లంచ గొండి బుద్ధి — అని అమ్మ మాటిమాటికీ మమ్మల్ని మందలించ సాగింది. క్రికెట్టు ఆట సందర్భంగా గొడవలు జరిగింది మొదలు క్రమ శిక్షణ మరీ కఠినం చేసింది. ప్రభా ఊరగాయల ఫ్యాక్టరీ కుర్రవాడు గణపతి ప్రతిరోజూ మమ్మల్ని స్కూల్లో దిగబెట్టి మళ్ళీ తీసుకొస్తున్నాడు. దారిలో మమ్మల్ని ఎవరైనా కొడతారేమోనని ఆమె భయం. దేవదత్త యింట్లో ఆమె స్వయంగా వచ్చి దిగబెట్టేది. బాబాయి యింట్లో లేనప్పుడు ఆవిడ మేము చదువుకోకుండా క్రికెట్టు ఆటకు జారుకోకుండా స్వయంగా మేడమెట్లు క్రింద నుంచుని గమనించేది. పెద్ద దీపం క్రింద మేము సాయంత్రం నుంచి రాత్రి పదివరకు ముందు గదిలో పాఠాలు చదువుతుంటే ఆమె పర్యవేక్షించేది. ఈ సంవత్సరం పరీక్షల్లో క్లాసులో మొదటి మార్కులు తెచ్చుకోవాలని ఆమె నొక్కి చెప్పేది. బాగా చదువు కుంటుంటే తినుబండారాలు పెట్టేది. మేము బయటి కెళ్ళి ఆడుకుంటాం అని గొడవ పెడుతుంటే రెండుమూడు రోజుల కొకసారి ప్రతాప్ బాబాయి అంగడి వద్దకు వెళ్ళి కూచో నిచ్చేది. అలా నైనా ఆయన దుఃఖం వుపశమిస్తుందని, వనిమనిషి తులసి ద్వారానో వూరగాయల కుర్రవాడి ద్వారానో పంపేది. మిగతా సాయంకాలాల్లో పార్వతి పిన్ని ఇంటికో, దేవకి పిన్ని ఇంటికో వెళ్ళ నిచ్చేది. ఆదివారం వుదయం పూట ఆర్యసమాజ మందిరానికి వెళ్ళే వాళ్ళం.

డయ్యర్ బజారులోని పాండా పాఠశాలలో ఐదేండ్ల శివను శ్రద్ధగా చదువుకోవడానికి పంపారు. ఒకవేళ ప్రతాప్ బాబాయి వాణ్ణి దత్తత

తీసుకుంటే ఆయనవద్ద అంగడిలో కంసాలి పనులు నేర్చుకునేటపుడు లెక్కలతో అవసరం వస్తుందని అందులో చేర్చారు.

టేబులు దీపం క్రింద నా యింగ్లీషు పుస్తకాన్ని పరిచి టేబులు ముందు నుంచుని నేను పెద్దగా చదవసాగాను. 'This is a rat That is a cat.' అని చిలక పలుకులు వల్లించసాగాను. నా ఆంగ్ల ఉచ్చారణలో దేవదత్త బాబాయి తర్ఫీదులో అందమైన లాహోరీ నుడికారం చోటుచేసుకుంది. మా యింట్లో ముందుగది కిటికీల సొరుగుల్లోంచి బ్రిటీష్ సైనిక దళానికి చెందిన ఆఫీసర్లు వాడే ఆంగ్ల హిందూస్థానీ పదజాలం పుస్తకాన్ని పుస్తకాల కట్టల్లోంచి సంపాయించాను. అందులో మాటలు చాల వరకు నేర్చుకొని కనపడ్డ వాళ్ళందరి ముందు ప్రదర్శనగా మాట్లాడే వాణ్ణి. గణేశ్ ఇంగ్లీషు నేర్చుకోవడంలో బాగా నిదానం. వాడి వుచ్చారణలో పంజాబీ నుడికారం కనిపించేది. అందువల్ల నేను ఇంగ్లీషు పదాలు అమ్మ మెచ్చుకునేలా బిగ్గరగా చదువుతూ అన్నయ్యను ఏడిపించే వాణ్ణి. నేను లెక్కల్లో మందకొడిగా వుంటానని తెలిసి వాడు లెక్కలు బాగా నేర్చుకునేవాడు.

'అమ్మా! గణేశ్ చదువుకోకుండా ఎప్పుడూ లెక్కలే చేసుకుంటున్నాడు.' అని వంటగదిలో అంట్లు తోముతున్న అమ్మకు ఫిర్యాదు జేసే వాణ్ణి.

'నన్ను కాల్చుకు తినకండిరా బాబూ! ఇద్దరూ శ్రద్ధగా అన్నదమ్ముల్లా చదువుకోండి. మీ యిద్దరికీ ఆఫీ వద్ద 'ఆమ్లెట్లు' తెచ్చిపెడతాను. లక్షణంగా పరీక్ష పాసవుదురు.' అంది అమ్మ.

'అమ్మా! నాకు నిద్రవస్తున్నది. పాలు తెచ్చివ్వు.'

'ఇంకా తొమ్మిది గంటలైనా కాలేదు. అప్పుడే నిద్రపోతావా? మీ నాన్న వుంటే మిమ్మల్ని తిట్టి కూచోబెట్టేవారు.'

ఆమె నేను పొడుగు పెరిగి లావు కావటం లేదని బాధపడుతోంది కాబట్టి "అయితే పాలుతాక్కుండా నేను నిద్రపోతాను." అన్నాను.

'సరే నీవువెళ్ళి పడుకో నేను పాలు తెచ్చి ఇస్తాను' అంది. ఇది

ఒకరకంగా చదువు అనే జైలునుండి పారిపోవటానికి లెక్కలు చేయకుండా వుండటానికి ఒక ఎత్తు. మరుక్షణంలో నేను ఒక్క గంతు వేసి విశాలమైన పడక మీద దూకాను. అప్పటికే నిద్ర కువక్ర మించిన శివాకు మెలకువ వచ్చింది. నాగుండె గొంతుకల్లో యింకా ఏదో చెయ్యాలనే తపన వుంది.

నా క్రూరత్వం నుంచి తప్పించుకున్నాడు కాబట్టి గణేష్ ఇప్పుడు యింగ్లీషు పాఠాలు చదవడం మొదలు పెట్టాడు.

నేను పడక మీద పడుకుని పైకప్పుకు వ్రేలాడగట్టిన సీసాలో వేలాడుతున్న చెట్టు బొమ్మకేసి చూశాను. అందులో చెట్టు ఎలా వచ్చిందా? అని నాలో నేను కొన్నివందల సార్లు ప్రశ్నించుకున్నాను. ముందు చెట్టు బొమ్మవేసి, తర్వాత సీసా దిగించారా? — ఈమాయా జాలం అర్థంగాక విసుగొచ్చేది.

కౌసల్య మరణము, సీసాలో చెట్టు, పగటి పూట నక్షత్రాలు ఎక్కడికి వెళతాయి — ఇలాంటి సమాధానం రాని ప్రశ్నలు నాలోని నిర్వేదాన్ని ఇనుమడింప జేశాయి. నేను ఎప్పుడూ చిలుక పలుకుల్లా మాట్లాడుతూ వుంటానని గుగ్గి నన్ను ప్రశంసించడం వల్ల నాలో అహంకారం బాగా పెరిగి పోయింది. మర్నాటి ఉదయం ఈ ప్రశ్నలన్నింటికి సమాధానం లభించేంత వరకు ప్రయత్నించాలని నిశ్చయించుకున్నాను. ఇంతలో కొన్ని కష్టమైన లెక్కలు నేను చేయకపోతే ఈ సంవత్సరం పరీక్షలో తప్పుతాననే భయం ఆవహించింది. గణేశ్ నాకు చెప్పడని తెలుసు. అందువల్ల దేవదత్త బాబాయిని నాకు ఈ పాఠాలు చెప్పమని అడుగుదామనుకున్నాను. దానికి, నాందీగా ఎక్కాలు వల్లించ సాగాను. చిన్న బళ్ళలో పద్యాల రూపంలో చెప్పించే లెక్కలు నాకుబాగా నచ్చాయి.

'అరేయ్! నీ వాగుడు కట్టిపెట్టు' అన్నాడు గణేశ్.

'అమ్మా! వీడు నన్ను తిడుతున్నాడు.' ఫిర్యాదు చేశాను. అమ్మ సమాధానం చెప్పలేదు.

అమ్మ ఆఫీ దగ్గరనుంచి మాకు తెచ్చిస్తానన్న ఆమ్లెట్ల గురించి వూహించ సాగాను. ఆమె కోల ముఖం; గణాచారి పట్టినప్పుడు ఆమె

తలవూపుడు నా కళ్ళ ముందు ఒక్కసారి కనిపించాయి. ఆమెను ఆవహించిన దయ్యం ఎప్పుడూ ఆమెను అంటి పెట్టుకునే ఉంటుందా? బహుశ ఆ దయ్యం వాళ్ళ యింట్లోనే తారట్లాడుతూ వుండి వుంటుంది. అమ్మ చెబుతుంటుంది తన దయ్యం మేడకింద ఎపుడూ వుంటుందని. నిజంగా ఆ దయ్యం వంటి మీదకు వస్తుందా? అమ్మ మేడ కింద గదిలో పాలుపోసే పాము రోజువచ్చి తాగిపోతుందా? ఈ ప్రశ్నలతో నాకు నిద్ర రాలేదు. అమ్మ పాలు తెచ్చిస్తే నిద్ర పోదామని కోరిక. రేపు ఉదయం కుర్రవాళ్ళతో కలిసి వెళ్ళగలిగితే దేవదత్త బాబాయి వాళ్ళ సందులో కందిరీగలు పట్టవచ్చు. లేకపోతే దేవకి పిన్ని దగ్గరకు వెళ్ళి వాళ్ళ మేడ మీద వచ్చివాలిన గాలిపటాలలో ఒకటి నాకు పట్టి ఇవ్వమని అడుగుదామనుకున్నాను. ఆ దొరికిన గాలిపటం తీసుకొని మాయింటి ప్రక్కన ఎప్పుడూ ఉబ్బసంతో బాధపడే సూరజ్ మల్ జైనీ కొడుకు కహాన్ చంద్రతో కలిసి గాలిపటాలు ఎగురవెయ్యటం నేర్చుకోవచ్చు. అయితే అతను నాతో కలిసి రాడు. జైనీలు మాకంసాలి వారిని తక్కువ జాతి వారిగా భావిస్తారు. ఎండాకాలం మేడమీద ఈ కుర్రవాడు భోజనం చేసేటప్పుడు చుట్టూ దడి కట్టుకొని మా చూపులు సోక కుండా జాగ్రత్త పడే వాడు. అతను బాగా ఎదిగిన పిల్లవాడు. దేవకి పిన్నివైపు కనుసైగలు చేస్తూ తాను ఎగుర వేసిన గాలిపటాన్ని జాగ్రత్తగా చూస్తుండమని అడిగేవాడు. బహుశ ఈసారి కూడా దేవకిపిన్నిని అలానే అడిగితే ఆవిడ తన చేతిలో గాలి పటాన్ని నాకిస్తే బాగుండును...... నా గాలిపటం అందరి పటాలను కాలదన్ని పై కెగిరితే ఎంత బాగుండును. అప్పుడు ఖాన్‌చందు నా గాలి పటాన్ని తీసుకుని అందరినీ జయిస్తే ఎంత ఆనందం. గాలిపటాల ద్వారా ఆకాశపు టంచులను ముట్టుకున్న ఆనందం వర్ణనాతీతం!

గాలి పటాలను గూర్చిన వూహలు తొలగిపోయి ఆకాశంలో ముసలి తాత ముఖం ఆకారంలో మబ్బు కనిపించింది. ఆ తాతకు ఓ పొడువాటి గడ్డం వుంది. బహుశ అతనే అందరూ ఆరాధించే దేవుడై వుంటాడు. అయితే ఆయనెందుకు అంత భయంకరంగా వున్నాడు. దేవుడంటే ప్రేమకు ప్రతిరూపం గదా!

ఈ ప్రశ్నలకు సమాధానం త్వరలో తేల్చుకోవాలి. నేను కళ్ళు మూసుకోగానే నిద్రపట్టేసింది. మరి కొంచెం సేపట్లో ఇత్తడి గ్లాసులో పాలు తీసుకొచ్చి అమ్మ నన్ను లేపి కూర్చో బెట్టి నోటికందించింది. నిద్ర లేపినందుకు ఏడుస్తూ పాలుసగం త్రాగి బద్ధకంగా మళ్ళీ పక్క మీద వాలిపోయాను.

ఆ మర్నాడు సాయంత్రం ఐదుగంటలకు దేవదత్త బాబాయికి ఎక్కాలన్నీ వల్లించాను. పది లెక్కలు సునాయాసంగా చేశాను. దాంతో పరీక్ష పాసవు తాననే ధైర్యం నాలో కలిగింది. బయటికి వెళ్ళి ఒక గాలిపటం సంపాయించేందుకు బాబాయి అనుమతి కోరాను. తాను శ్రద్ధగా చదువు కొంటునట్లుగా అనిపించుకోవాలని గణేశ్ నాతో కలిసి ఆడలేదు. దాంతో నాకు సిగ్గువేసి అనుమతి దొరికినప్పటికీ బయటికి వెళ్ళడం మానుకున్నాను. ఎలాగైనా నాకు గాలిపటం లేదు. కపోన్ చంద్ర కూడా మేడ మీద వుండక పోయి వుండవచ్చు. ఒకవేళ వున్నా తన గాలిపటం పిన్నిని ముట్టుకోనీయవచ్చు. నన్ను ముట్టుకోనీడు. నేను అందరిలాగా పొడగర్ని కాదు. మిగతా పిల్లలంతా తమ మేడల మీద నుంచుని వాళ్లయిళ్ల మీదుగా ఎగిరే గాలిపటాల్ని కర్రలతో అడ్డుపెట్టి ఒకటో, రెండో తెంపుతారు. అమ్మను దానికోసం పైసలు అడగను. ఆమె ఉద్దేశంలో జేబుఖర్చులకు డబ్బులిస్తే మేము గాలి పటాలపైనా, యితర ఆటవస్తువుల మీద ఖర్చుజేసి వృధాపరుస్తాము. ఇరుగు పొరుగు పిల్లలతో జేరి యీపాడు అలవాట్లు చేసుకొన్నామని ఆమె కోపం. దేవ దత్త బాబాయిని డబ్బులడగవద్దని మమ్మల్ని వారించింది కూడా.

ప్రతాప్ బాబాయి అంగడి దగ్గరికి వెళ్లి ఒకగంటసేపు కూచొని, కొలిమితిత్తులు ఊదితే బాబాయి పదిపైసలు చేతిలో పెట్టవచ్చు..... ఇలా ఊహలు చేస్తూ దేవదత్త బాబాయి వాళ్ల తివాచీ మీద పిల్లిమొగ్గలు వేస్తున్నాను.

'అరే కృష్ణా! గాలిపటం సంపాయించడానికి వెళ్లావనుకొన్నాను.' అన్నాడు ఆశ్చర్యంగా బాబాయి.

'ధన్వంతి మేడ మీద గాలిపటాలు ఏవైనా ఎగురుతున్నాయా?'

అన్నాను ఆదుర్దాగా.

'అవి చాలా పెద్ద గాలిపటాలు. నువు వాటిని తీసుకొని పాడుచేస్తే దేవరాజ్ ఏడుస్తాడు. పార్వతిని వెళ్లి అడుగు. తానేమైనా మేడమీద నుంచుని సంపాయించిందేమో!'

మేడ మీదికి పరుగులు తీశాను.

పార్వతి పిన్ని పళ్లెంలో బియ్యం ఏరుతోంది.

'పిన్నీ! నీవు గాలిపటం ఏదైనా తెంపావా?' అనాను తొందరగా.

"ఒకవేళ ఉంటే ఏం? చిన్న పిల్లాడివిగా నాకు నమస్కరించాలన్న జ్ఞాపకం లేదా?"

'నమస్తే పిన్నీ! నిజంగా నీ దగ్గర గాలిపటం ఉందా చెప్పు' అన్నాను చేతులెత్తి నమస్కరిస్తూ.

'మేడమీద ఒకటి పడివుంటే, నీ కోసం పడకగదిలో దాచి ఉంచాను. భగవంతి చూస్తే, లాహోరునుంచి దేవరాజ్ వచ్చిన తర్వాత యిచ్చేందుకు దాచి పెడుతుందని నాకు తెలుసు.' అని రహస్యంగా చెప్పింది ఆమె అమాయకమైన నవ్వుతో కళ్లు పైకెత్తి "గాలిపటం యిస్తే నాకేమిస్తావ్?" అంది.

'ఎక్కడ ఉంది?' అన్నాను పడకగది అంతా చీకట్లో వెదికి ఆదుర్దాగా.

'ఇదుగో ముందు నా ప్రశ్నకు ఓపికగా సమాధానం చెప్పు'

'ఒక ముద్దు.'

నేను శ్రద్ధగా ఆవిడ దగ్గరికెళ్లాను. ఆవిడ నన్ను భుజాలకు హత్తుకొని నా బుగల్ని ముద్దెట్టుకొంది. నేను త్వరగా బయటపడాలని గాబరాగా ఉన్నాను. కాని ఆవిడ వదలడం లేదు. ఆవిడ చాలాసేపు నా నుదుటిపై ముద్దు పెట్టి — 'అదుగో గాలిపటం. దాని పక్కనే దారపు ఉండ అంది.'

ఆవిడకు కృతజ్ఞతలుకూడా చెప్పకుండా, మేడమెట్లు మీదనుంచి గంతులువేస్తూ గాలిపటం దొరికిందనే సంబరంలో ఉరకలువేశాను.

'నాకు దొరికింది' అంటూ బాబాయికి వినిపించేలా కేకేలువేశాను గాని, ఆయనకు చూపిద్దామనే ఉద్దేశం కలగలేదు.

'అది ఎలా ఎగరెయ్యాలో తెలియదు నీకు, నేను చెబుతానుండు' అని గణేశ్ ముందు గొంచ్చాడు.

'అరే! అదినాది కాదు' అంటూ అరుస్తూ పరుగు తీశాను. ఆకాశమంత ఎత్తుకు నా ఆలోచనలు ఎగిరిపోయాయి ఆక్షణంలో.

మేడమీదికి పైపైకి వెళ్లేసరికి నాలో దయ్యాలను గూర్చిన భయాలన్నీ తొలగిపోయాయి.

'ఎవరక్కడ?' అంది అమ్మ.

'నేను..... కృష్ణను....' అంటూ నేను ముందుకు నడిచాను. మేడమీద నుంచి దేవకి పిన్నిని కేకవేశాను — 'పిన్నీ' అంటూ. సమాధానం రాలేదు.

కహోన్ చంద్ర గడియారం స్తంభంవైపు పైపైకి గాలిపటం ఎగరవేస్తూ కనిపించాడు. వాళ్ల తమ్ముడు దునీచంద్ర దారం పట్టుకొని వదులుతున్నాడు.

'నాకూ గాలిపటం ఉందిగా!' అన్నాను.

'అరే! చిన్న కుంకా! వెళ్లిపో.' అని నన్ను విసురుకొని, గాలిపటం పైపైకి విసురుతూ నన్ను లక్ష్య పెట్టలేదు.

అతని గాలిపటం ఆకాశంలోకి దూసుకుపోతూ బ్రహ్మాండంగా కనిపించింది. గాలిపటాన్ని అలా పైపైకి వదలాలంటే ఎంత తెలివితేటలు, చాకచక్యము కావాలో ఊహించసాగాను.

అతినిలా నేనూ గాలిపటాన్ని పైకెత్తి గాలిలోకి వదల సాగాను. గాలి తక్కువై గాలిపటం పడిపోయింది.

నేను మళ్లీ మళ్లీ ప్రయత్నించానుగాని, గాలిపటం పెద్దది కావడం వల్ల నేను ఎగరవేయ లేకపోయాను. కహోన్ చంద్రవంటి వాడిచేతిలో యిది బాగా ఎగురుతుందని తెలుసు.

నిరాశతో గాలిపటాన్ని గాలిలోకి విసిరి మామ్ముందు మేడమీదికి వంచి దారం వదలసాగాను. అది యిటుకరాళ్లకు తగులుకొని చినిగింది.

నా ముఖం వివర్ణమై ఏడుపువచ్చింది. ఎదురుగా ఎవరూలేరు గాబట్టి కళ్లనీళ్లు రాలేదుగాని, కహోన్ చంద్ర గాలిపటం ఎలా ఎగురు తోందో చూస్తూ కూచొన్నాను.

అతని గాలిపటం గడియారం మీదికెళ్లి, ఆకాశంలో నక్షత్రంలా మిలమిలా మెరుస్తోంది. అతని గాలిపటానికి సరితూగేలా మరో గాలిపటం ఎగురుతోంది. మిగతా వన్నీ కింద తలలు దించుకొన్నట్లున్నాయి. మేడ అంచున కూచొని, ఇరవై అడుగుల పైన ఉన్ననేను భయపడలేదు సరి గదా! అతని గాలిపటంతో సమానంగా నా గాలిపటం కూడా ఎగిరితే బాగుండునని అనుకోసాగాను. కాని, నా గాలిపటం చినిగిపోయిందే అని మనసులో దిగులు.

'అరే, నాతో పోటీకి రారా! జైనీ వెధవా!' అని జూదరి హరియా నవాబ్ జైన్ మేడమీది నుంచి గాలిపటం ఎగరవేస్తూ ఎద్దేవాచేశాడు.

'నీతోడి పిల్లలతో జూదమాడుకో వెళ్లి' అన్నాడు కహోన్ చంద్ర.

'అయితే. నాతో పోటీకి రారా!' అంటూ తన గాలిపటం దారాన్ని కహోన్ చంద్ర దారంతో పెనవేసి నైపుణ్యంగా మరుక్షణంలో తెంపాడు.

'ఒరే పంది! కుక్కా!' కహోన్ చంద్ర తిట్టాడు.

'నోర్మూయ్‌రా! నువ్వే పందివి.' అంటూ హరియా నోరు చేసు కొన్నాడు.

వీళ్లద్దరిలో నేను ఎవరి పక్షమో తెలియదు. దేవకి పిన్నివైపు కనుసైగలు చేస్తూ, నా గాలిపటం తెంపిన కహోన్ చంద్ర అంటే

నాకు మంట! కాని అతడు గాలిపటం ఎగరవేసే చాకచక్యానికి మాత్రం సంతోషం. హరియా పేరుమోసిన జూదరి. తాగుబోతులతో కలసి బజార్లో తిరుగుతాడు. ప్రతాప్ బాబాయి అంగడికెళ్లినప్పుడు నాతో బాగా ఉంటాడుగాని, దేవకిపిన్నివైపు కొంటెచూపులు చూస్తుంటాడు. ఇప్పుడు గాలిపటం ఎగరేయడంలో గొప్ప అనిపించుకొన్నాడు.

ఈ అరుపులు అమ్మకు వినిపించాయి. 'కృష్ణా! నువు మేడదిగి రాకపోతే, నీ ఎముకలు విరగ్గొడతాను.' అంది.

చీకటి పడసాగింది. సూర్యుడు అరుణకాంతులు చిమ్ముతూ, బాబాయి కొలిమిలా సంధ్యాసమయం కనిపించింది నేను యిష్టంలేక పోయినా మేడమీద నుంచి కిందికి వచ్చాను కాని, నా మనస్సులో ఆకాశంలో సాహసాలు చూపించాలనీ, బూతులు మాట్లాడుకొన్న వాళ్లను ఓడించాలనీ నిశ్చయించుకొన్నాను. అమ్మ దృష్టిలో వాళ్లు గూండాలు. నేనుగూడా మంచి పిల్లవాడనిపించుకోడం కన్నా 'గూండా' కావాలనుకొన్నాను. ఆకాశంకేసి చూస్తూనుంచుని నక్షత్రాలగురించి తెలుసుకోవాలనుకొన్నాను. కాని, విధిలేక కిందికి దిగివచ్చి అమ్మ సామ్రాజ్యంలోకి వచ్చాను. ఇక్కడ రాజ్యాన్ని అమ్మ, ఆమెకొలిచే గురునానక్, జీసను, ఆగాఖాన్, సైన్‌లోక్ వంటివారు పాలిస్తారు. టేబులు ముందు దీపం కాంతివంతంగా వెలుగుతోంది. దానిముందు నా సంచి పడివుంది. గణేశ్ పలక పట్టుకొని తదేకంగా వ్రాసుకొంటున్నాడు. నేను కూలబడి ఎవరో కొట్టినట్లుగా ఏడవసాగాను....... నేను మేడమీదికి వెళ్లి శుక్రగ్రహాన్ని, సప్తర్షి మండలాన్ని, చూడాలని మనసులో కోరిక.

* * *

ఒకరోజు పండిత రామానాథ్ మా క్లాసులోకివచ్చి, మర్నాడు స్కూళ్ల ఇనస్పెక్టరు వస్తున్నాడని చెప్పారు. మేమందరం మంచి గుడ్డలు వేసుకొని, ఎర్రతలపాగాలు ధరించి రావాలనీ, ఆయన మమ్మల్ని పరీక్షించి ఐదోతరగతిలోకి వేస్తారని చెప్పారు.

యింటికి పరుగెత్తు కొంటూ వచ్చి ఎర్రతలపాగాలు కావాలని అమ్మకు చెప్పాము. ఆమె రామానాథ్ మాటలు లెక్కపెట్టలేదు.

తలపాగాలు పెట్టు కోకుండావెళ్తే, మేము ప్యాసు కాబోమని చెప్పేం తవరకు ఆమెకు శ్రద్ధపుట్టలేదు. చివరకు పెట్టెలన్నీ గాలించి, నాన్న తలపాగాల్లోంచి తెల్లటి తలపాగా తీసి నాలుగు ముక్కలుగా చించి డయ్యర్ బజారులో రంగు అద్దకం వేయించటానికి తీసుకెళ్లింది.

మర్నాడు ఉదయం శుభ్రంగా స్వయంగా స్నానం చేయించి, కళ్లకు కాటుక దిద్దింది. కళ్లకు కాటుక పెట్టుకొంటే దృష్టి తగలదని నమ్మకం. రెండు ఆమ్లెట్లుతెచ్చి మెడకుబిగించింది. పెరుగన్నం తినమంది. అలా తింటే శుభ సూచకమని ఆమె అభిప్రాయం. ఎర్రతలపాగాలు తలకు చుట్టి వీధి చివరిదాకా మమ్మల్ని సాగనంపింది. మేమిద్దరం జంటపెళ్లి కొడుకుల్లా నడుచుకొంటూ వెళ్లాము.

ఇతరపిల్లలు కూడా కాటుక కళ్లతో రావడం చూశాను. దిష్టి తగలకుండా అలా చేసుకొన్నారు. వాళ్ల మెడల చుట్టూ వాళ్ల తల్లులు ఆమ్లెట్లు బిగించి పంపారు.

ఆమ్లెట్లు మెడచుట్టూ బిగించుకోడంకన్నా, చేతికి తగిలించుకొంటే, కనీసం వ్రాసే శక్తి ఎక్కువవుతుందేమోనని గణేశ్ ఆశ్చర్యపడ్డాడు. బడిగంట కొట్టగానే నాకు నీరసం వచ్చింది. గణేశ్ గుగ్గీ చేతిలో తన సంచియిచ్చి, కక్కసులోకి ఆమ్లెటు మార్చుకొందామని వెళ్లాడు. వాడి ఉద్దేశంలో గుగ్గీ ఊడ్చే కుర్రవాడు గాబట్టి, వాడు సంచిపట్టుకొంటే మంచిశకునం. — జాడీ చేతిలో పట్టుకొన్న స్త్రీగాని, ఊడ్చేవాడుగాని దారిలో ఎదురుపడితే మంచి శకునమని అమ్మ చెప్పింది — అందుకని వాడు సంతోష పడ్డాడు.

దురదృష్ట వశాత్తు ఒంటి బ్రాహ్మణుడు పండిత రామానాథ్ ఎదురు పడ్డారు. ఒంటి బ్రాహ్మణుని శకునం మంచిది కాదని పెద్దలు చెబుతారు అందువల్ల పరీక్షల్లో మా విజయం పట్ల అనుమానం మాకు కలిగింది.

మాక్లాసు సరిగా ప్రారంభం కాకపోవడానికి కారణం ఈ దుశ్శకునమేనని అనుకొంటూ పరీక్షకు సిద్ధపడ్డాము. మేము బడిలోకి అడుగు పెట్టేసరికి, స్కూళ్ల యినస్పెక్టరు, నీలంరంగు సూటువేసుకొని ఎర్ర

మొహం జేవురిస్తుండగా మెర్సిడన్‌గారు ప్రత్యక్షమయ్యారు.

పండిత రామానాధ్ ఆయనకు స్వాగతంపలికాడు. ఆయన తరగ తులవారీగా పరీక్షిస్తూ వస్తారని తెలిసింది.

నాలుగో తరగతి కుర్రవాళ్లందరమూ బారులుతీరి నడుచుకొంటూ బిషన్‌సింగు మేష్టారు, ఖుషీరామ్ మమ్మల్ని మూడు వరసల్లో నించు బెట్టగా క్లాసుగదిలోకి వెళ్లుతున్నాము. బలిష్ఠంగా ఉండే మోహన్‌చంద్ర అనే కుర్రవాడు వేగంగా మాతో నడవలేక, కొంచెం ఆలస్యంగా నడు స్తున్నాడు. వాడు తెల్లతలపాగా పెట్టుకోడం ప్రత్యేకంగా కొట్టవచ్చినట్లు కనిపించింది.

ఇంతలో మెర్సిడిన్ ముందికురికి వాణ్ణి ఒక్కతోపుతోసి నేలమీద పడేలా చేశాడు. వాడితలపాగా దూరంగా దుమ్ములోపడింది. ముఖం కందగడ్డలా అయి ఏడవడం మొదలెట్టాడు.

వాడు ఏడవడంతో ఇనస్పెక్టరుకు మరీకోపం పెరిగి — 'నోర్ముయ్! పంజాబీకోడెలా ప్రవర్తించకు. ఆంగ్ల పాఠశాలల్లో విద్యార్థుల్లాగా నడుచుకో!' అని అరిచాడు.

మోహన్ చంద్ర స్థాణువులా నిలుచుని మూగబోయాడు. మేమం దరం కదలకుండా నించొన్నాం. మా బిషన్ సింగ్ మేష్టారు కంటె ఈ ఎర్రముఖం దొరగారి ముసుగులో ఎలాంటి భయంకర కృత్యాలు ఉన్నా యోనని ఊహింపసాగాము.

ఎండవేళ ఎడారిలో గొంతు తడి ఆరిపోయినట్లు లోలోపల వొణికి పోతున్నాము. అభయం వల్ల మేము వరసల్లో సరిగా నుంచోలేదు. మెర్సి డన్ ఎద్దులాగా పర్రుగెత్తు కొంటూవచ్చి కొందర్ని చెంపమీద కొడుతూ, మరి కొందరిని బూటుకాళ్లతో తన్నసాగాడు, ఇంకా ఏడుస్తున్న మోహన్ చంద్రను మరొకటి తన్నాడు.

ఇంకా ఆయన తన్నులు తినకుండా మేనేజరు స్వయంగా వచ్చి మమ్మల్ని వరసల్లో నుంచో బెట్టాడు. అప్పుడే సైన్యంలో చేరినవాళ్ల లాగా మేము భయపడుతూ నుంచొన్నాము.

ఇనస్పెక్టరుగారి ప్యూను ఆయన హోదా వ్రాసిన బోర్డును వరం డాలో బల్ల మీద పెట్టాడు. ఆయన కొన్ని కాగితాలు బయటికి తీసి, ఒక లెక్కను బోర్డు మీద వ్రాసి మమ్మల్ని పలకల మీద వ్రాసుకొని లెక్కచెయ్యమన్నాడు.

భయపడుతూ మేము అలానే చేశాము. మా తలపాగాలు, బడి ఆవరణలో వేలాడే పూల మొక్కలు, మా ఏడుపు ముఖాలుచూసి నవ్వుకొంటున్నాయి.

ఆయన ఐదోతరగతి వాళ్ల దగ్గరి కెళుతూ మమ్మల్ని గమనించ మని బిషన్ సింగు మేష్టారుకు, ఖుషీరామ్‌కు చెప్పివెళ్లారు.

ఆలెక్క చాలాతేలిక అయినది. అయినా జవాబు అందరూ మెల్లగా గొణిగారు. దానికి వత్తాసుగా మేష్టార్లిద్దరూ సహాయపడ్డారు. మేం పరీక్షల్లో నెగ్గితే వాళ్లకు జీతంలో 'యింక్రిమెంటు' వస్తుందని ఆశ.

కొంతసేపటికి ఇన్‌స్పెక్టరు దొరగారువచ్చి మమ్మల్ని అందర్నీ నుంచో మన్నారు. చేతిలో నున్నపు ముద్ద తీసుకొని లెక్క సరిజేస్తూ వెళ్లారు.

తన టేబుల్ వద్దకు వెళ్లి -- ఇంగ్లీషులో అన్నాడు. "కూచోండి. మీ ఇంగ్లీషు పుస్తకం తియ్యండి"

మేము అలానే చేశాము. సంచుల్లోంచి వణికే చేతుల్తో పుస్తకాలు బయట పెట్టాము.

"రెండో వరుసలో ఆఖరి కుర్రాడు! 14వ పుట చదువు!"

అప్పటికే భయంతో వణికిపోతున్నాడు గాబట్టి ఆవరసలో మోహన్ చంద్ర సరిగా చదవలేకపోయాడు.

ఇనస్పెక్టరుగారు రామానాథ్ చెవిలో ఏదో గొణిగారు.

'అరె! చుంచెలుకా!' అని బిషన్‌సింగ్ మేష్టారు నాకేసి పురమా యించారు.

నేను చిలకపలుకుల ధోరణిలో పద్యంవల్లించాను. ఇనస్పెక్టరుగారి

మనసుకది హత్తుకొన్నట్లున్నది.

ఆయన ముసిముసి నవ్వులు చిలకరిస్తూ నా యింగ్లీషు నుడికారాన్ని మెచ్చుకొన్నారు. కోపంగా వున్న యినస్పెక్టరుగారిని మెత్తబరచగలిగి నందుకు గర్వపడ్డాను.

'యింకెవరైనా 18వ పుట చదవండి.' అన్నారు.

'అరె. జ్ఞానచంద్!' అన్నారు బిషన్ సింగు.

ఈ కుర్రవాడు తన బొంగురు గొంతుతో బాగా చదివాడు.

'చాలు!' అన్నాడు ఇనస్పెక్టరు రామానాథ్‌తో.

'క్లాసు మొత్తం పరీక్షలో నెగ్గారు. ఆ కుర్రవాడు తప్ప! ఇంక మీరు యిళ్లకు వెళ్లవచ్చు.' అన్నాడు యినస్పెక్టరు.

ఆయన మాటల్ని మాకు హిందుస్తానీలో అనువాదంచేసి చెప్పి పండిత రామానాథ్ అన్నారు —

'ప్యాసయినామనే సంతోషంలో మీరు తోసుకొంటూ వెళ్లకండి! వరుసల్లో నడవండి. ముందు ఇనస్పెక్టరుగారికి జేజేలు చెప్పండి!'

'ఇనస్పెక్టరుగారికి జై' అని అందరం గొంతు కలిపాము.

ఆయన చూపులకు దూరంగా వెళ్లినంతవరకు భయంగా నడుస్తూ క్రమంగా బయటపడ్డాము.

బయట కొందరు మిఠాయిలు కొని సంబరం చాటుకోడానికి వెళ్లారు. మరికొందరు తల్లిదండ్రులకు యీ వార్త చెప్పడానికి వెళ్లారు. మోహన్ చంద్ర ఒక్కడుమాత్రం ఏడుస్తున్నాడు. ఎవరూ అతన్ని గమనించలేదు. గుగ్గీ మాత్రం ఓదారుస్తూ, క్రికెట్ ఆట నేర్పిస్తానని సముదాయిస్తున్నాడు.

నేనుకూడా సంతోషంతో పరవళ్లు తొక్కాను. లెక్కల్లో తప్పి పోతానేమోనని ఉదయం నుంచీ వణికిపోయాను. ఇనస్పెక్టరుగారు ఉన్నంతసేపు బలవంతంగా నాభయాన్ని అపుకొన్నాను. ఇప్పుడు ఎలానో

నెగ్గినందుకు సంతోషంగా ఉంది.

ఇనస్పెక్టరుగారి జేవురించిన ఎర్రని మొగం చూసి భయం నన్ను వెంబడిస్తోంది. నేను యింటికి పరుగెత్తేటప్పుడు గుర్రంలా దూసుకెళ్తున్నా నాలోలోపల ఆయనగూర్చి భయం తొందర పెట్టసాగింది.

'ఇంటికి త్వరగా వెళ్దాంపద. నాకింకా భయంగా ఉంది' అన్నాను గణేశ్‌తో.

'నువ్వెళ్లు. నేను కుర్రాళ్లతో కాలక్షేపంచేసి వస్తాను.'

'అమ్మతో చెబుతాను.' అని బెదిరించాను కాని, నేరుగా యింటికి వెళ్లకుండా, గుగ్గీదగ్గరి కెళ్లాను. అతను తను ఊడ్చే స్థలందగ్గరకు తీసుకెళ్తాడని తెలుసు.

గుగ్గీ నేను పరీక్షలో నెగ్గినందుకు శుభాకాంక్షలు చెప్పి, రామానాథ్ గారి సందువైపుకు తీసుకెళ్లాడు.

'అయితే నువ్వు పరీక్షలో నెగ్గావు. నాకు పాఠాలు చెబుతావా? నేను ఎప్పటికీ బళ్లో చేరలేను.' అన్నాడు గుగ్గీ బాధగా.

కంటోన్మెంటులో ఉండగా బాకా నన్ను అడిగినట్లే ఇక్కడ గుగ్గీ అడిగాడు. ఇతనితో జీవితాంతం స్నేహం చేయాలని మనసు లోపల అను కున్నాను. వారానికొక గంట చొప్పున పాఠం చెబుదామనుకొన్నాను. నాలోలోపల ఉన్నత వంశంలో జన్మించిన రాచరికపు లక్షణాలు, అన్నీ తెలుసునన్న అహంభావము నడవిడిక ఉన్నప్పటికీ, యిన్ని సార్లు నే నతన్ని మోసగించినందుకు క్షమాపణగా అలా చేద్దామనుకొన్నాను.

'అతణ్ణి బళ్లో ఎందుకు చేర్చుకోరు?'

నా సలహాప్రకారం హిందూత్వం వదలిపెట్టి బాకా క్రైస్తవమతంలో చేరాడు. తద్వారా బడిలో చేర్చుకోవడమేగాక, అతనికి ఇంగ్లీషు దొరల ఫక్కీలో గుడ్డలు, చెప్పులు మతంవారు యిచ్చారు.

అలా చెయ్యమని చెబుదామనుకొన్నాను.

అయితే ఆ మతాధిపతి ఇనస్పెక్టరుగారితో ఆమాట చెప్పకుండా

ఉంటే చాలు. గుగ్గీ గిరజాదేవి మందిరానికి వచ్చిన విషయం వాళ్ల నాన్నకు తెలియకుండా దాచాలి. ఆయన యింకా హిందూపేరు పెట్టు కొని అస్పృశ్యులతో సమానంగా నడుచుకొంటున్నాడు.

# 10

నాలో పెల్లుబికే దయాస్వభావము, అహంభావముతో ఇనస్పెక్ట రును చూసిన తర్వాత అహంభావమే ప్రజ్వర్లింది. మోహన్ చంద్‌ని ఆయన తన్ని అవమానించడం పగటికలలతో నిండిన ప్రపంచాన్ని తల క్రిందులు చేసింది. పారాలు చదవడంలో మాయాజాలం తొలగిపోయింది.

ఆ ఆంగ్లేయుడు నాలో కలిగించిన భయాన్ని జీవితంలో మరచిపో లేను. ఎవరినో తన్నినప్పటకీ, ఇనస్పెక్టరు నన్నుకూడా అలానే చేసి ఉండేవాడని నాకు తెలుసు. ముఖ్యంగా అస్పృశ్యుడైన గుగ్గీతో స్నేహం చేస్తున్నానని తెలిస్తే చాలు. కాని మేమందరం ఆంగ్లేయుల్లాగా సక్రమ నడవడిక కలిగి ఉండాలన్న ఉద్బోధ నాలో ప్రతిధ్వనించింది. కేవలం ఊహాలోకాల్లో విహరించి, కావ్యగానం చేస్తూ ఉండాలనే కోరికను అణచివేసుకొని, ఆంగ్లేయుడిలా మాటాడటం నేర్చుకోవాలనీ, వాళ్లలా దుస్తులు ధరించాలనీ, క్రికెట్ ఆట ఆడాలనీ — అలాచేస్తే ఆంగ్లేయుల సరళిని అలవాటుచేసుకొన్నట్లవుతుందని తెలుసు. అప్పుడే నాటురకం జనాభాకు చెందిన మోహన్ చంద్రవంటి వాళ్లని తన్నగలం. భారత దేశాన్ని పరిపాలించగలం. నాలో భావాలు నవ్వుపుట్టిస్తాయని తెలుసు. నా మనసు చెప్పినదానికి సరిగా భిన్నంగా చెయ్యాలని అనుకొన్నాను. పద్యం, నాటకం, కార్యకలాపాలు, స్వప్నజగత్తు క్రమక్రమంగా దూరమై, పెద్దలంతా గౌరవంగా భావించే పంథాలో [illegible]చుకోవాలని నిశ్చయించు కొన్నాను.

మా కుటుంబంలో వారంతా మేము ఐదో తరగతిలో ప్రవేశిం చడం చరిత్రాత్మకంగా చెప్పకోసాగారు

మమ్మల్ని నెగ్గేలా తయారుచేసినందుకు దేవదత్త బాబాయికి స్వయంగా ధన్యవాదాలు అమ్మ వెళ్లి చెప్పింది. చుట్టుపక్కల యిళ్లవాళ్లకు మిఠాయిలు పంచిపెట్టింది కాళీదేవతకు అపరావతారమైన దుర్గాదేవికి పూజలు చేసింది. బాబూ హరిశంకర్ వద్దకు వెళ్ళి బడిలో ఉపాధ్యాయులు మాపట్ల ప్రత్యేక శ్రద్ధ చూపేలా చూడమని కోరింది.

దుర్గాదేవి జోక్యంగాని, బాబూహరిశంకర్ సిఫారసుగాని ఈ దఫా అక్కరలేదు. కారణం దయ్యంవంటి బిషన్‌సింగ్ మాకు పాఠాలు చెప్పడంలేదు. ఆయన కాకుండా చాలా ఉత్తముడు, బి.ఏ. పరీక్ష అయిన శివరామ్‌దాస్ అనే కొత్త ఉపాధ్యాయుడు వచ్చారు. ఆంగ్లేయుడిలా వస్త్రధారణ, తలపై టోపీ, మా నాన్నగారి కంటె రామనాథ్‌కంటె పొడుగాటి మీసాలు ఆయన ప్రత్యేకతలు.

బి.ఏ. చదివిన శివరామ్ ఆంగ్లంలో ప్రావీణ్యం సంపాదించాడని విని చాలా సందర్భోచితంగా ఉందనుకొన్నాను. మేము ఐదో తరగతిలో అన్ని పాఠాలు యింగ్లీషులో నేర్చుకోవాలి. అందుకు ఆయన తగిన సమర్థుడు. బిషన్ సింగు మేష్టారుకూడా నాలో ఆంగ్లభాష పట్ల మోజు ఎక్కువ చేశాడు. ఇనస్పెక్టరు తనిఖీకి వచ్చినపుడు క్లాసు పక్షాన నన్ను యింగ్లీషు చదవమనడం అందుకు తార్కాణం. నేను కొత్త మాష్టారుకుకూడా అభిమానపాత్రుడి నయ్యాను. మేనేజరుగాని, హెడ్మాష్టరుగాని తనిఖీకి వచ్చినప్పుడు నన్ను పాఠాలు వల్లించమని కోరేవాడు. నేను "Twinkle, Twinkle little star .." అని పద్యం చదివేవాణ్ణి. చర్చి మిషన్ పాఠశాలలో మానాన్నతో బాటు శివరామ్‌దాస్ చదువుకున్నారు. దేవదత్త బాబాయికి కూడా బాగా తెలుసు. ఈ స్నేహంవల్ల నన్ను ఆయన అంతమంది క్లాసులో అభిమానించేవాడు.

నాలో అహంభావం బాగా పెరిగి పోయింది. భయంకర జ్ఞాపకాలు వచ్చినప్పుడు తప్ప అహంభావం పెల్లుబికేది. ప్రతిరోజూ క్లాసులో రామ్‌దాస్ నన్ను చదవమనేవాడు. ఆయన దానికి అర్థాలు చెప్పే విరామసమయంలో ఇంగ్లీషు పాఠాన్ని నాలోనేను గొణుగుతూ అందరి దృష్టి నావైపు మరలడానికి మరో కారణం, జ్ఞానచంద్ర, లాభారామ్, రామ్‌లాభయ్యా, కాంతిచంద్ర,

జుగళకిశోర్ నన్ను గౌరవంగా చూడటమే. జ్ఞాపకశక్తిలో తనకంటె నేను మెరుగని గణేశ్‌కూడా వొప్పుకున్నాడు. ఆంగ్ల నుడికారం తనకుకూడా నేర్పమని అడిగాడు.

ఈ దర్పంలో అమ్మను నేను వొత్తిడి పెట్టి ఇంగ్లీషు శైలిలో షర్టు, ప్యాంటు, రబ్బరు చెప్పులు కొనిపించాను. నాన్న వస్తే ఆయనను అడిగి ఒకటోపీ కొంటే ఇంగ్లీషు దొరలా నేనూ ఉండవచ్చుననే కోరిక మిగిలి పోయింది. ఇనస్పెక్టరు ఆ కుర్రవాణ్ణి తన్నడమనే దృశ్యం నా కంట్లో యింకా మెదలుతోంది. మోహన్ అంటే దయకలిగింది. ఈ వస్త్ర వ్యాపారుల బిడ్డలందరికీ క్రమశిక్షణగా నడచుకోవడం నేర్పాలి. సైన్యంలో చేరిన వారిని చెంపదెబ్బలు కొట్టి ఇంగ్లీషు దొరలు క్రమశిక్ష ణలో పెట్టినట్లు వీళ్లను కూడా బాగుపరచాలి. వాళ్ల నాలుకలు వంచి ఆంగ్ల పదజాలం బాగా పలికేలా చేయాలి. మానాన్న దొరలదగ్గర యింగ్లీషు బాగా మాట్లాడి వాళ్ల ప్రశంసలు పొందారు.

ఇంగ్లీషు దొరల గూర్చిన ఊహాలోకంలో తిరుగాడుతూ — వారి సుకుమారం, హుందాతనం, అలవడేలా నడచుకోవాలనుకొన్నాను. వెంటనే మా యింటి ముందుగదిలో పెద్ద పెద్ద కుర్చీలు, టేబుళ్లు అమర్చాను. ఇందులో ఊరగాయల ఫ్యాక్టరీ కూలివాళ్లు సహాయం చేశారు. అమ్మను దాసీతో సమానంగా చూడసాగాను. కంటోన్మెంటులో కర్నల్ లాంగ్‌డన్ కుమారుడు ఆయనతో మాట్లాడినట్లు అమ్మతో మాట్లాడసాగాను. నా నల్లవదనం, కురుచరూపం నాలో కోరికలకు అడ్డుకట్ట వేశాయి. లేకుంటే ఇనస్పెక్టరులా నేనూ నడుచుకొనేవాణ్ణి.

నాన్న పుస్తకాలదొంతరలోంచి ఒక 'పియర్స్ విజ్ఞాన సర్వస్వం' సంపాదించాను. అది నాకు ఈ సంవత్సరం ఉపయోగపడుతుంది. అందులో చదివాను- 'పియర్స్ సబ్బు రోజూ వాడితే శరీరం తెల్లగా వస్తుందని. ఎలానైనా సరే డబ్బులు కూడబెట్టి, ప్రతాప్ బాబాయి యిచ్చిన పైసలు దాచిపెట్టి ఒక 'పియర్స్' సబ్బు కొందామనే ఆలో చన వచ్చింది. ఇనస్పెక్టరుగారు ఎంతో అధికారం చెలాయించారన్న భావన నాలో జ్ఞాపకాలను తరమసాగింది మోహన్ చంద్రను ఆయన తన్నడమనే విషయాన్ని మరిచిపోవడానికి ప్రయత్నిస్తూ ఆంగ్లేయుడిలా

ప్రవర్తించాలని ఉబలాటపడ్డాను 'అమృతసముద్రమనే ' నరకంనుండి బయటపడి, ఆంగ్లేయ విధానం పుణికి పుచ్చుకోవడానికి ఇదొక్కటే మార్గం!

ఎలాగైనా పియర్స్ సబ్బు కొనాలనే ఆలోచనతో ప్రతాప్ బాబాయి అంగడి కెళ్దామని గణేశ్‌ని పిలిచాను పరీక్షల్లో నెగ్గినందుకు బాబాయి ఏదోఒక బహుమతి యిస్తాడని నమ్మకం.

'బిడ్డల్లారా! రండి! చాలారోజులైంది అంగడికి వచ్చి మీరు' అన్నాడు బాబాయి తాను చేస్తున్న పని ఆపి ఆయన ముఖంలో విషాదచ్ఛాయలు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. ఇంగ్లీషు వాడి ధోరణిలో నేను వేసుకొన్న గుడ్డలు, చెప్పులు ఆయనకు నవ్వు తెప్పించాయి.

'అరే! భలే! భలే! తెల్లదొరల హుందాతనం నీలో కనిపిస్తోంది. ఈ కంసాలి బాబాయిని చూడడం నీ హోదాకు సరిపడదు.'

'మాకు పరీక్షలు' అన్నాను సమాధాన పూర్వకంగా

బాబాయి చేతులు పట్టుకొని 'పాదాభివందనం' అన్నాడు గణేశ్.

'బుల్లిగాడు నీ పాదాలు ముట్టుకొంటానని అనడుగదా.. గుడ్ మార్నింగ్!' తెల్లదొరల హుందాతనం పుణికి పుచ్చుకొన్నాడు

'మీ అమ్మనాతో చెప్పింది నువ్వు యిల్లంతా దొరల బంగళాలలా అలంకరించావట!' అన్నాడు బాబాయి

అమ్మ మీద నాకు కోపం వచ్చింది. బాబాయితో యిలా ఎందుకు చెప్పాలి. నా గుడ్డల మీద నాకే సిగ్గువేసింది.

'ఓహో! కృష్ణ చేతిలో రివాల్వరు, సిగరెట్టు పెట్టె, సైకిలు, ఉంటే చాలు వచ్చిరాని యింగ్లీషుతో తెల్లదొరల్లా ఉంటాడు' అన్నాడు బాబాయి దగ్గర పనినేర్చుకొనే దౌలత్.

కనుగొలకుల్లోకి నీళ్లు వచ్చాయి దిగులుగా కూచొన్నాను కంసాలులు, కమ్మరి పనిచేసే వీరి విషాద జీవితాలపట్ల నాకు దిగులువేసింది

'కోపం వద్దు బిడ్డా! మేం సరదా కన్నాం. కాకి హంసలా తిర

గాలని తాపత్రయపడితే కళ్లల్లో నీళ్లు మాత్రం మిగిలాయనే విషయం నీకు గుర్తు చేస్తున్నాను.' అన్నాడు బాబాయి.

'మన పంజాబీ భాషతో సమానమైనది ఏదీకాదు. నిజానికి మన పంజాబీ భాష ఉచ్ఛరించడం కష్టం ఇంగ్లీషు నేర్చుకోడం చాలా సులభం. పంజాబీ నేర్చుకోవాలనుకొన్న దొర కథ చెప్పు ప్రతాప్!' అన్నాడు హరియా.

'నువు చెప్పు హరియా! ... కృష్ణా! ఆ కథవిను,' అని బాబాయి తాను చేస్తున్న పనిలో నిమగ్నమయ్యాడు.

తాను కూర్చొన్న చోటునుంచి కొంచెం కదిలి, మా వైపు తిరిగి హరియా చెప్పసాగాడు!

"పూర్వం ఒక తెల్లదొర పంజాబీ నేర్చుకొన్నాడు. అతనికి ఆ భాష సమస్తం వచ్చినట్లు అహంకారం. తన పాండిత్యాన్ని గురించి చాలా మందితో చర్చించాడు. నానక్ తదితర కవుల కవిత్వాల గూర్చి వారితో ముచ్చటించాడు. ఒకరోజు పంజాబ్‌లోని గ్రామీణ ప్రాంతాల్లో తిరుగుతూ ఒకరైతును చూసి తనతో చర్చించడానికి రమ్మని ఆహ్వానించాడు. పంజాబీ గురించి తనకు సర్వం తెలుసునన్నాడు.

ఆ పంజాబీరైతు సరేనని— 'అధర్వంజా' అంటే ఏమిటో చెప్పమన్నాడు.

'ఆ తర్వాత ఏమైందో తెలుసా! ఆదొర ఆలోచించి, ఆలోచించి తనకు తెలిసినంత వరకు ఆ పదం ఎక్కడా నిఘంటువుల్లోగాని, పుస్తకాల్లోగాని కనబడలేదని అన్నాడు.

'అయితే బాగుంది. పంజాబీ గ్రామీణ ప్రాంతాల్లోకి వెళ్లి భాష మళ్లీ నేర్చుకోమనీ,.... ఇంగ్లీషు భాషకంటె పంజాబీ ప్రాచీనమైనదనీ, మా సంప్రదాయాలు మీ కంటె గొప్పవనీ, మేము మీలాగా తలకు గాక, హృదయానికి ప్రాముఖ్యం యిస్తామనీ' అన్నాడు ఆరైతు.

'అయితే ఔధ్ నుండి వచ్చిన కుర్రవాడు అమీర్ అలీ, బియాస్ స్టేషన్ మాష్టరు కొడుకు పంజాబీని 'ఎద్దు భాష అని ఎందుకంటా'రని

అడిగాను. వాళ్లిద్దరూ మా క్లాసులో చదువుతున్నారు.

'భలే వాడివోయ్. లక్నో దక్షిణ భాగం నుండి వచ్చిన వీళ్లంతా వర్ది వాగుడుకాయలు ఏపనీ చేయలేరు వీళ్లు తెల్లదొరలు మనదేశంలో ప్రవేశించే అవకాశం యిచ్చి పంజాబ్‌ను కొల్లగొట్టేలా చేశారు. వాళ్ల హోదా ఏమిటి? గడ్డికోసే వాళ్లు, దేశ ద్రోహులు! మరి యిప్పుడో! తెల్లదొరలు యుద్ధంలో ఎందుకు ఓడిపోతున్నారు? జర్మన్లు గెలుస్తు న్నారనీ, కైజర్ బహదూర్ వాళ్లను తరిమి కొడుతున్నాడనీ విన్నాను. ఈ కోతులు వెళ్లిపోతే వాళ్లతో కూడా వాళ్ల కోతి భాష పోతుంది.' అన్నాడు బాబాయి.

'పిల్లలంతా ఈ ఆంగ్లభాషను వదలి కులవృత్తి అయిన కంసాలి పని నేర్చుకోండి. తల్లి మిల్లులో పనిచేస్తే కొడుకు విలాసంగా ఉంటా డనిపించుకోవద్దు ' అన్నాడు హరియూ.

ఆంగ్ల సంప్రదాయాలను వుణికి పుచ్చుకోవాలన్న నా ఊదుర్దాకు ఈ సంఘటన గొడ్డలిపెట్టు అయింది. సరదాగా అన్న మాటలయినా నా హృదయానికి రంపపుకోత అయినాయి. అయినా ఆంగ్ల దొరల శైలి, వాళ్ల అలవాట్లు నేను నౌషిరా కంటోన్మెంటులో ఉన్నప్పటినుంచీ పుట్టిపెరిగాయి. ఈ కంసాలి వారి ఇరుకుసందుల్లో, మురికి కాలు వల్లో వాతావరణం నాకు గిట్టలేదు మా బడిలో నేను ఇంగ్లీషు నేర్చుకోవడం వల్ల కలిగిన వాసన యింకానన్ను వదల లేదు.

'బాబు! రండి ఈ తిత్తి ఊదండి. మీకు పైసలు దొరుకుతాయి!' అన్నాడు దౌలత్ పెద్దవాళ్ల ఎద్దేవా చేసిన మాటలు కంటకంగా అని పించాయి.

'చాలు, చాలు నేను ఈ తిత్తి ఊదే అసహ్యపు పని చేయను. మా అమ్మ నాకు పైసలు యిస్తుంది. మా యింట్లో కావలసినంత డబ్బుఉంది నేను వెళ్తున్నాను ' అని అరిచాను

నేను లేచి వెళ్ళబోతుంటే బాబాయి నా చేయిపట్టుకొని తన వొడిలోకి తీసుకున్నాడు.

ఆప్యాయంగా నన్ను ముట్టుకుంటూ నా చెవిలో అన్నాడు:

'అంత కోపం వద్దు బాబూ! మేము నిన్ను సరదాగా ఏడిపిస్తున్నాం. కౌసల్య కూడా లేదుగా, మీరే నాకు బిడ్డలు. అందరికన్నా నేను, మీ పిన్ని నీ వాగుడు కిష్ట పడ్డాం కాబట్టి.. నీవు రోజూ నన్ను వచ్చి చూసిపోవాలి. అంతే గాని ఈ ముసలి బాబాయి దగ్గరకు రావడానికి విసుగుపడకూడదు.'

బాబాయి మాటలు చాలా విషాదంగా వినిపించాయి. ఆయన కళ్లు దుఃఖంతో తప్తమైనాయి. ఆయన తల పైకెత్తి "ఇదుగో చూడండి!" 'అంటూ గొంతులోంచి రెండు బంగారు నాణెములు తీశాడు. 'ఇదిగో ఒక నాణెం నీకు, మరొకటి గణేశ్‌కు! జాగ్రత్తగా ఉంచుకోండి. పరీక్షలో నెగ్గినందుకు ఈ బహుమానం. ఈ చిల్లర మీరు పూరీలు లేదా మీ కిష్టమైన మిఠాయిలు కొనడానికి' అన్నాడు.

'హాల్ బజారులో పిప్పర మెంట్లుకొంటాం' అన్నాను.

'వాడు ఇంగ్లీషు పిప్పరమెంట్లు కొంటానంటున్నాడు' అన్నాడు గణేశ్ ప్రతాప్ బాబాయి ముందు నన్ను ఎద్దేవా చేద్దామని.

'నీ కిష్టమైంది కొనుక్కో నాయనా!' అన్నాడు ముద్దుగా బాబాయి.

తెల్లదొరల జీవితమంటే మహత్తరమైనదని పొంగిపోతున్న నేను, పియర్స్ సబ్బు కొందామని ఉబలాట పడ్డనేను, బాబాయి నాచేతిలో పెట్టిన భారతీయ బంగారు నాణెం గట్టిగా చేతిలో ఉంటే చూసి ఇది బాబాయి ప్రేమ చిహ్నమని భావించాను. దేశవాళీ బాబాయి గుండె పొరల్లో నామీద ఉన్న ప్రేమకు ఇది నిదర్శనమని తెలుసుకొన్నాను. అధికారం చేజిక్కించుకోవాలనే కాంక్షను అదిమిపెట్టి, ఎలానైనా పంజాబీ భాషను, దాని నుడికారాన్ని నేర్చుకోవాలనుకొన్నాను. దానిని గురించిన సుందర స్వప్నాలు నా కళ్లముందు కదిలాయి. నా జీవితంలో ఆభాషలో కవిత్వం చోటుచేసుకొంటుందని తెలుసు. అయితే ఈ విషయం నేను ఎవరితోను అనలేదు. అంటే నవ్విపోగలరు. ధనవంతులు, ఉత్తమ వంశానికి చెందిన వారితో సమానంగా తిరగాలంటే ఇంగ్లీషు శైలినేర్చుకోవాలనే తాపత్రయం తగ్గింది. వాళ్లలా బూట్లు, షర్టులు వేసుకోనక్కరలేదు దొరతనం మీద నాకున్న భ్రమ క్రమంగా

తొలగిపోయింది. నా స్వదేశీతనం నేను ఉంచుకోవాలని కోరుకొన్నాను. ఇది ఏతరగతికి చెందిందో నాకు తెలియదు.

మేము ఐదో తరగతిలోకి వచ్చినరోజు, మర్నాడు దేవదత్తబాబాయి లాహోరు వెళ్లారు. మేము మర్నాడు బడినుండి యింటికి వచ్చేసరికి బాబాయి తిరిగి వచ్చాడని తెలిసి, ఆ శుభవార్త తెలపడానికి పరుగు తీశాము. ఆయన మమ్మల్ని చూడగానే బీరువా తెరిచి అందులోనుంచి రెండు రంగుపెన్సిళ్ల పెట్టెలు తెచ్చియిచ్చి బొమ్మలువేయడం నేర్చుకో మన్నారు. ఆయన మేం వెళ్లేటప్పటికి చిత్రపటం చిత్రిస్తూ తదేకంగా చూస్తున్నారు. ప్రక్కనే ఆర్యసమాజ స్థాపకుడు దయానంద సరస్వతి ఫోటో వుంది. దాన్ని చూస్తూ ఆయన చిత్రపటానికి రంగులు వేస్తున్నారు.

'జీవితంలో చిత్రపటాలు గీయటమనేది ఉత్తమం'— అన్నాడు.

నేను ఇన్స్పెక్టరు బళ్ళో ఏవిధంగా పరీక్ష పెట్టింది, మోహన్ చంద్‌ను తన్నింది, నాపద్యపఠనం మెచ్చుకొని విదేశాలలో పాఠశాలల గొప్పతనాన్ని గురించి చెప్పిందీ వివరించాను. ఇనస్పెక్టరు పేరు చెప్ప గానే బాబాయి నామాటలు మధ్యలో తుంచివేస్తూ మాట్లాడటం నాకు మనస్తాపం కలిగించింది.

'ఒరేయ్! వెధవా! నీకు తెలియదు. ఈ మెర్సిడన్ ఒక దున్న పోతు. భారతజాతి ద్వేషి. ఆయన ఇనస్పెక్టరుగా ఉన్నాడు కాబట్టి మీ బడికి లాహోరులోని కళాశాలకు అమృతసర్‌లోని బాలికల పాఠశాలకు నిధులు కోత కోశాడు. దీని కంతటికి కారణం ఈ సంస్థల సభ్యులైన లాలా లజపతి రాయ్ చెరసాలలో వుండటం, పోలీసులకు దొరక్కుండా లాలా హరదయాళ్ తిరగటం— వీళ్ళిద్దరూ ఆర్యసమాజ సభ్యులు కావ టమే. ఈ మెర్సిడన్ నన్ను ఎమ్.ఏ లో వరుసగా రెండుసార్లు పరీక్ష తప్పించిన ఆచార్యహెమింగ్ స్నేహితుడు. నేను ఆర్య సమాజవాదిని కావడమే— ఇందుకు కారణం.

తెల్ల దొరలనుండి స్వాతంత్ర్యం కోసం భారతీయులను పోరాటానికి సిద్ధంచేసిన లాలా లజపతిరాయ్ మనకు తెలుసు. జర్మనీకి విరు ద్ధంగా మనసైన్యాలు పోరాటానికి వెళ్ళటం ఆయన కిష్టంలేదు. ఆయన

సహచరుడు అజిత్‌సింగ్ చాల ప్రసిద్దుడు

'ఓ రైతుసోదరా! సీతంపాగా జాగ్రత్త!' అన్న ఆయన నినాదం ఇంకా చెవుల్లో మారు మ్రోగుతోంది. 'హరదయాళ్ తెలుసా?' 'లాలా హరదయాళ్' అన్నాడు గణేశ్ నా ఆదుర్దా పసిగట్టి 'లాలా హరదయాళ్‌ను గురించి తెలియకపోతే మీకింకేంతెలుసు?' అంటూ భగవాన్‌దత్తు బాబాయి లోపలికి వచ్చాడు. ఆయన తనకు సంస్కృతం పాఠాలు చెప్పటానికి వచ్చిన మాష్టారుకు వీడ్కోలు చెప్పి చిత్రపటం ఎంతవరకు వచ్చిందో చూడటానికి వచ్చాడు

'లాలా హరదయాళ్ ఏకసంధాగ్రాహి ఋగ్వేదంలో ఇరువది పనసలు వరుసగా విని వెంటనే వాటెని క్రమం తప్పకుండా వల్లించిన మేధావి. ఆయన మన ఆర్యసమాజ నాయకుడు. మీనాన్నలాగా ఆంగ్లేయుల కొలువు చేయకుండా భారతజాతి విముక్తి కోసం పోరాడుతున్న మహనీయుడు' ఈ మాటలు గంభీర స్వరంతో పురోహితునిలా అని ముంగిటలోంచి తన గదిలోకి వెళ్ళి పోయాడు

'చెప్పు బాబాయ్! ఆయన లాహోరులో వున్నారా? ఆయన నీకు తెలుసా?' అన్నాను. నా అహంభావం చీలిపోయింది. నేను భారతీయుణ్ణి కావాలని 'స్వరాజ్య 'మనే నాయకుణ్ణి తక్షణం ఆరాధించాలని నిశ్చయించు కున్నాను.

బాబాయి చిత్రపటానికి కొంచెం వెనక్కు వచ్చి బొమ్మ బాగా వచ్చిందా? లేదా? అని చూసి కథ చెప్పటం మొదలెట్టాడు. 'లాలా హరదయాళ్ మనకు బాగా కావలసినవాడు. ఇక్కడకు చాలా సార్లు వచ్చాడు కూడా.'

'ఎప్పుడూ?' అన్నాను

'అప్పటికి మీరింకా అమృతసర్ రాలేదు .... ఆయన మన డి.ఎ.వి కళాశాల నుండి బి.ఏ. చేశారు ప్రభుత్వ కళాశాలలో తత్వశాస్త్రంలో ఎమ్.ఏ చేశారు. విశ్వవిద్యాలయంలో సర్వ ప్రధముడుగా నెగ్గాడు. ఆయన అందరి కంటె చాల తెలివైన వాడు. ఆర్యసమాజ నాయకులైన లాలా లజపతిరాయ్, స్వామీ రామతీర్థలకు ఆయన స్నేహితుడు.'

బొమ్మలు గీచే కుంచెలను సీసాలోనుంచి తీసి నేను ఆడుకోవటం బాబాయి చూచి నా చేతులు పట్టుకొని 'నావస్తువులు మీరు ముట్టుకుని పాడుచేస్తే నేను మీకేమీ చెప్పను' అన్నాడు.

'పొరపాటైంది బాబాయ్' అంటూ చేతుల్లో తల దూర్చుకుని బాబాయివైపు చూస్తూ పడుకున్నాను.

'ఆయన మన ప్రాచీన వేదాలు, ఉపనిషత్తులు చదువుకున్నారు. భగవాన్‌దత్త బాబాయి వాటెని ఇప్పుడు చదవటానికి ప్రయత్నిస్తున్నారు... వేదకాలం నాటి మన ఋషులు, ద్రష్టలు, చెప్పిన బోధలతో పోల్చుకుంటే ఈనాటి ఆంగ్లేయ విద్యావిధానం ఎందుకూ పనికి రాదని ఆయన వుద్దేశ్యం. అందుకే ప్రభుత్వం వారు లాహోరు ప్రభుత్వ కాళాశాలలో తత్వశాస్త్రాచార్యుడుగా ఇచ్చిన ఉద్యోగాన్ని తిరస్కరించారు. లాలా లజపతిరాయ్‌తో కలిసి పని చేస్తున్నారు. ఆయన లాహోరులో ఉపన్యసిస్తుండగా విన్నాను అద్భుతమైన వక్త, వందలాది విద్యార్థులు ఆయన శిష్యులయ్యారు .... 1911వ సంవత్సరంలో ఢిల్లీ దర్బారులో జరిగిన పట్టాభిషేక మహోత్సవాలకు జార్జి ప్రభువు మేరీ రాణి మన దేశానికి వచ్చినపుడు—'

'నేను ఢిల్లీలో ఉత్సావాల్లో తప్పిపోయాను' అన్నాను ఆయన మాట కడ్డుపడుతూ.

'అవును మీనాన్న మిమ్మల్ని ఢిల్లీ తీసుకెళ్ళాడు అందుకే మీరిద్దరూ ఆ మెర్సిడన్ దొర వేసిన గడ్డితినాలని తాపత్రయ పడుతున్నారు.'

'కాదు బాబాయ్' అన్నాడు గణేశ్ తిరుగుబాటు ధోరణిలో.

'మీ నాన్నంటే నాకిష్టమే. కానీ అతను పిరికివాడిలా తెల్లదొరల కొలువులో చేరాడు. నిజం చెప్పాలంటే అతని పై అధికారి కల్నల్ దొర చెప్పాడని నౌషిరాలో ఆర్యసమాజ ప్రభుత్వం వదులుకున్నాడు.'

నాన్నను గురించి అలా నిర్దయగా మాట్లాడుతుంటే నామనసు చివుక్కుమంది. కానీ బాబాయి బాగా చదువుకున్న వాడని సత్యం మాట్లాడుతున్నాడని గ్రహించాను.

'నేనీ విషయాలన్నీ మీతో మాట్లాడ దల్చుకోలేదు మీ నాన్న తెల్లదొరలను ఆరాధించి వాళ్ళ కొలువు కొలిస్తే రేపు పింఛను వస్తుంది. రావ్బాసాహెబ్ వంటి బిరుదూ లభిస్తుంది. అప్పుడు ఈ చదువురాని కంసాలి సోదరులలో అతడు మంచి పేరు తెచ్చుకుంటాడు.' అంటూ ఆయన మసక చీకట్లో వెలుతురు సరిగా లేనందున బొమ్మ గీయటం మానేశాడు.

'ఫరవాలేదు చెప్పుబాబాయి' అన్నాను మానాన్నను అగౌరవపరుస్తూ మాట్లాడినందుకు దెబ్బతిన్న నా అహంకారాన్ని మ్రింగివేస్తూ.

'ఢిల్లీ దర్బారు జరిగిన తర్వాత వైస్రాయ్ హార్డింగు ప్రభువుపై ఎవరో బాంబు విసిరారు ఈ దురంతాన్ని ప్రభుత్వం మా సమాజానికి అంట గట్టింది. ఈ ద్రోహంతో లాలా హరదయాళ్‌కు సంబంధం వున్నట్లుగా ఆరోపించారు. కానీ నేరం రుజువు చేయలేక పోయారు. అలానే రస బిహారీఘోష్...... లాలా హరదయాళ్ అమెరికాకు పారిపోయాడు. వేగంగా వెళుతున్న రైల్లోనుంచి దూకి పోలీసుల చేతులో చీటీపెట్టి రస బిహారీ ఘోష్ జపానుకు తప్పించుకు పోయాడు.'

'నిజంగా రస బిహారీ ఘోష్ రైల్లోంచి దూకాడంటావా?' అన్నాను ఉద్రేకంగా. అంతవరకు నేను లక్ష్యంగా పెట్టుకున్న తెల్లదొరల సాహసం ఇలాంటి వారిముందు వణక సాగింది.

'నిజంగా' అన్నాడు బాబాయి.

'అయితే— అమెరికాకు ఎలా వెళ్ళాడు? పడవలోనా? సముద్రం భూమి అంత విశాలమైందా?' అన్నాను అప్రయత్నంగా.

'ఈ ప్రశ్నలన్నీ మీ భూగోళం మేష్టారు నడుగు. నేను చెప్పదలచుకున్న దల్లా దేశప్రజల యిష్టానికి వ్యతిరేకంగా తెల్లదొరలు మన దేశాన్ని ఆక్రమించారు అందుకు కొందరు దేశద్రోహులు సహాయ పడ్డారు. ఆ తెల్ల దొరలు అంత అద్భుత వ్యక్తులు కాదు. వారిలో కొందరు మన వైపున్నారు కుడా. అనిబిసెంట్ వంటి మహా వక్తలు తమ దేశం వదిలి పెట్టి మదరాసులో వచ్చి స్థిరపడ్డారు. ఆమెరికన్లు చాలమంది మన పక్షాన వున్నారు. వాళ్ళుకూడా తెల్ల దొరలకు వ్యతిరేకంగా విప్లవం

తెచ్చి బ్రిటీష్ రాజు సైన్యాలను తరిమి కొట్టారు.... అమెరికాలో ప్రతివక్కరూ చదువుకోవచ్చు. ఉద్యోగం చేయవచ్చు. అందుకే మన విప్లవకారులు చాల మంది అమెరికా వెళ్ళారు. ఆ దేశానికి అధిపతియైన అబ్రహాం లింకన్ కొయ్య దుంగల గుడిసెలో నుంచి రాష్ట్రపతి అయ్యేంత స్థాయికి ఎదిగాడు.'

'దేవకి పిన్ని బాబాయి నానక్ చంద్ కూడా అమెరికాలో హోటలు నడుపుతున్నాడుగా. నేను కూడా అక్కడకు వెళ్తాను.' అన్నాడు గణేశ్, బాబాయి మాటలకు అడ్డు తగులుతూ.

'నేను అబ్రహాం లింకన్ అంత పెద్దవాణ్ణవుతాను' అన్నాను నా ఉత్సాహం వురకలు వేస్తుండగా.

'చాలమంది పంజాబీలు అక్కడ ఉద్యోగాలు చేస్తున్నారు. ప్రపంచంలో అన్ని దేశాలకంటె అక్కడ జీతాలు జాస్తి. జర్మనులకు బ్రిటీషు వారికి మధ్య జరుగుతున్న యుద్ధంలో అమెరికన్లు తటస్థంగా వున్నారు. అక్కడకు వెళ్ళిన సిక్కులు తల క్షవరం చేయించు కుంటారు. వాళ్ళందరూ హరదయాళ్ అనుయాయులు' అన్నాడు బాబాయి.

'అయితే బాబాయ్ మనము బొంబాయి మీదుగా వెళ్ళాలా? కలకత్తా మీదుగా వెళ్ళాలా?' అన్నాను ప్రయాణానికి సిద్ధమౌతున్నట్లుగా.

'మన దేశంనుండి ప్రపంచాన్ని చుట్టి వెళుతుంటే అమెరికా దాదాపు సగం దూరంలో వుంటుంది. పడవమీద వెళితే బొంబాయి నుండి యూరప్ మీదుగా వెళ్ళవచ్చు. లేదా కలకత్తా నుండి చైనా, జపానుల మీదుగా వెళ్ళవచ్చు.'

'అయితే అమెరికనులు కూడా తెల్లదొరలేనా?' అని ప్రశ్నించాను.

'వాళ్ళు బ్రిటీష్ వారి తెల్ల తోబుట్టువులు. వారు బ్రిటీషు వారిని తరిమి వేసిన స్వతంత్ర ప్రజలు. హరదయాళ్‌ను గూర్చి విన దల్చుకుంటే మీరు నన్ను ప్రశ్నలు వేసి విసిగించవద్దు.' అన్నాడు బాబాయి అసహనంగా.

'అయితే నేను అడ్డుతగలను '

'అయితే సాయంకాలమైంది. చీకటిపడుతుంది. మీరు యింటికి వెళ్ళి భోంచేసి రండి. పార్వతిపిన్ని దగ్గర పడుకుందురు. అప్పుడు నేను మీకు మిగతా కథ చెప్తాను.'

ఆయన ముఖంలో ప్రశాంతతను గమనిస్తే ముందుగదిలో ఆయన మాకింకేమీ చెప్పదలచుకున్నట్లు లేదు. కాబట్టి మేమింటికి వెళ్ళి భోంచేసి రావటానికి యిష్టపడ్డాము. ఆ ఆదుర్దాలో ఆయన యిచ్చిన రంగుపెన్సిళ్ళ విషయం మర్చిపోయాము

'ఇవిగో మీ బహుమతులు' అని వెనక్కు పిలిచాడు బాబాయి.

మేం బహుమతులు తీసుకెళ్లడానికి తిరిగి వచ్చినప్పుడు ఆయన పెదాలపై వేలు ఉంచి — 'నేను చెప్పిన విషయాలు ఎవ్వరితో చెప్పగూడదేం?' అన్నారు.

నేను యింటికి వెళ్తునప్పుడు చీకట్లో నామనసులో ఏవేవో ఆలోచనలు వచ్చాయి. దేవదత్త బాబాయి చెప్పిన మాటల్లో కానరాని ప్రపంచాలు దాగి ఉన్నాయి. తెల్ల దొరల అధికారంమీద నిర్మితమైన మానాన్నగారి నౌషిరా కంటోన్మెంటు ప్రపంచమంతా బూటకం. ఈ ప్రపంచం దేవదత్త బాబాయి, లాలా లజపతిరాయ్, హరదయాళ్ వంటి మేధావులను ఎదిరించే స్వభావంగలది నిజమైన ప్రపంచం అజిత్‌సింగ్ గానం చేసిన— 'ఓ రైతుసోదరా! నీతలపాగా జాగ్రత్త!' అన్న పాటలో ఉంది..... ప్రతాప్ బాబాయి, హరియా ఊహల్లో ఉంది.

నేనిలా ఊహిస్తున్నందువల్ల సైన్‌లోక్ దయ్యాన్ని గురించి భయమే కలగలేదు. త్వరత్వరగా మేడమెట్లెక్కి భోంచేసి దేవదత్త బాబాయి దగ్గర యింకా ఎక్కువ విశేషాలు తెలుసుకోవాలనే ఆదుర్దాలో ఉన్నాను.

దేవదత్త బాబాయి, పార్వతి పిన్ని చలికాలం నిద్రించే గది, ఎండాకాలం వారు పడుకొనే గదికి కొంచెం వెనకవైపు మేడమీద ఉంది. ఆ గది చాలా పరిశుభ్రంగా స్వర్ణదేవాలయంలా అలంకరించబడి ఉంది. అందమైన బొమ్మలు, చిత్రపటాలు గోడలకున్నాయి.

ఆ గదిలో మరో రెండు చిన్నమంచాలు పట్టవుగాబట్టి, బాబాయి

పెద్ద మంచం కాళ్లవైపు గణేశ్, పిన్ని పెద్ద మంచం కాళ్లవైపు నేను పడుకో వచ్చునని బాబాయి అన్నాడు. ఆయన అలమరాకు అమర్చిన దీపం వెలుతుర్లో పడుకొని చదువు కొంటున్నారు. కింద వంటగదిలో పిన్ని ఏవో వంటపనులు చేసుకొంటూ ఉంది.

'పిన్ని పైకి వచ్చిన తర్వాత నిద్రపోవచ్చు. పడుకొంటే మీరు నిద్రపోతారు గాబట్టి, కూచొని నేను చెప్పే మిగతా కథ వినండి.'

ఆయన పరుపుపై కాళ్లు మడత బెట్టుకొని, దుప్పటి కప్పుకొని ఆదుర్దాగా, వినయంగా కూచొన్నాం. నౌషిరాలో సాయంవేళల్లో నాన్న గారు లెక్కలు చెప్పేటప్పుడు కూడా నేలమీద కూచొని కాళ్లు దుప్పటిలో కప్పుకొనే వాళ్లం.

'ఇదీ కథ.' అంటూ బాబాయి తన సహజ ధోరణిలో కథనం మొదలెట్టారు. ఆ మసక చీకట్లో ఆయన ముఖంపై స్వయంప్రతిభ ద్యోతకమవుతోంది. 'లాలా హరదయాళ్, కాలిఫోర్నియా రాష్ట్రానికి ముఖ్యపట్టణమైన శాన్‌ఫ్రాన్సిస్కోకో చేరుకొన్నారు...'

'అది ఎక్కడ ఉంది బాబాయ్' అన్నాను సాయంత్రం నేనింక ప్రశ్నలు వెయ్యబోనని యిచ్చిన వాగ్దానం విషయం మరిచిపోయి.

'మళ్లీ ఏమిట్రా వెధవ'.. అన్నాడు బాబాయి నా ఆసక్తిని గమ నిస్తూ చిరునవ్వులు చిందిస్తూ. 'అది అమెరికా పశ్చిమ తీరంలో ఉంది. పసిఫిక్ సముద్రానికి అంచున 'పసిఫిక్ సముద్రం ఎక్కడ?' అని నీవు అడగకు. రేపు ప్రపంచ పటంలో యివన్నీ చూపుతాను. అంతవరకు జాగ్రత్తగా విను: భారతీయులు అక్కడ లాలా హరదయాళ్‌కు బాగా స్వాగతం పలికారు. గౌరవించారు. లాస్‌ఏంజల్ నగరంలో ఆర్యసమాజ శాఖను ఏర్పాటుచేశారు ఆయన ప్రసంగాలు విని అమెరికన్లు తమ దేశం నుండి ఆంగ్లేయులను తరిమికొట్టినట్లు, భారతీయులుకూడా తెల్లవారిని తరిమి కొట్టాలని చెప్పారు. ఆయనకు ఆర్థిక సహాయం చేశారు. లాలా హరదయాళ్ అక్కడ యుగాంత ఆశ్రమాన్ని స్థాపించారు. స్వయంగా ముద్రణా యంత్రం కొని వివిధ భారతీయ భాషల్లో 'గధార్' అనే పత్రి కను నడిపారు ఆ పత్రికను ప్రచురించి -అమెరికాలో భారతీయులకు

పంచడమేగాక, మన దేశంలో కొందరికి పంపారు. ఇదిగో ఆ పత్రిక....' అటూ యిటూ జాగ్రత్తగా చూస్తూ కాగితాల గుట్టలోంచి గధార్ పత్రిక ప్రతిని బయటకుతీసి చూపారు. దానిపై 'గధార్' అనే ముఖపత్రం మేము చదవగలిగాము.

'ఈ పత్రిక ఆంగ్ల ప్రభుత్వంవారి కుటిల దమన నీతిని తేట తెల్లంచేసింది. మన దేశాన్ని ఎలాంటి కుతంత్రాలతో చేజిక్కించుకొన్నారో తెలుపుతుంది. లాహోరులో ఈ పత్రికను ప్రతి విద్యార్థి చదివి మరొకరికి అందజేస్తాడు.'

'వారివైపు సిపాయిలు, తుపాకులు, పిస్తోళ్లు ఉంటే వారిని ఎలా తరిమి కొట్టగలం' అన్నాడు గణేశ్.

'తమాషాగా మాట్లాడకు సిపాయిలకు నెలకు 11రూ. జీతం. వాళ్లు తెల్లవారిని ద్వేషిస్తారు' అన్నాను గణేశ్ పిరికితనాన్ని బయట పెట్టాలని

'అందుకే నేను మీ నాన్నను తిట్టేది ! మనం సైన్యాన్ని మన వైపు తిప్పు కోవాలి. 1857 స్వాతంత్ర సంగ్రామంలో అదే జరిగింది. అప్పుడు యించుమించు మనం ఆంగ్లేయుల్ని తరిమికొట్టాం' అన్నాడు బాబాయి. నాకు వత్తాసు పలుకుతూ.

'సిపాయి తిరుగు బాటు... మేం చరిత్ర పాఠాల్లో చదివాం ' అన్నాడు గణేశ్

'అది భారత స్వాతంత్ర సంగ్రామం. ప్రముఖ దేశ భక్తుడు వీర సవర్కార్ అన్నట్లు అది ప్రధమ భారత స్వాతంత్ర పోరాటం.' అన్నాడు బాబాయి కోపంగా.

'అప్పుడు మనం అలా చేయగలిగాం. ఇప్పుడైనా మన ప్రజ ఏక మైతే చేయగలం. ఇప్పుడు మనం ఒక్కళ్ళమే గాదు. జర్మన్ దేశాధిపతి లాలహరదయాళ్‌కు సహాయం చేస్తానన్నాడు. బహుశా మీకు తెలియదు. జర్మన్లు, మనము ఒకే ఆర్య సంతతికి చెందిన వారం. మన భాషలు రెండు ఒకటే యుద్ధం మొదలవడానికి చాలా రోజుల ముందే చాలా

మంది జర్మనులు సంస్కృతం నేర్చుకొని వేదాలు అనువాదం చేశారు. దేవదత్త బాబాయికి వారు బెర్లిన్ విశ్వ విద్యాలయంలో సంస్కృతా చార్య పదవి యిచ్చి బోధించడానికి ఆహ్వానించారు.'

హరదయాళ్ సాహస కృత్యాలు నాలో కొత్త శక్తి నిచ్చాయి. ఈ ప్రదేశాలన్నింటికీ వెంటనే వెళ్ళాలను కొన్నాను. ఈ కథలన్నీ చెప్ప డానికి బాబాయి మమ్మల్ని వాళ్ళ యింటికి రమ్మనందుకు నా కెంతో ముచ్చటగా వుంది. నా కళ్ళు విశాలం చేసుకొని ఆయన మాటలు వింటున్నాను. పని పూర్తి చేసుకొని పార్వతి పిన్ని అప్పుడే అనుమా నంగా వచ్చింది. మాకు తినేందుకు పళ్ళు తెచ్చి యిచ్చి ఆమె పడక మీద కాళ్ల వైపు ముంచెలుకలా కూచొంది. బాబాయి ఆవిడతో పల్లెత్తు మాట అయినా మాటాడక కథ మొదలెట్టారు. ఆవిడను ఆయన ఎప్పు డైనా ముట్టుకొన్నాడా అని నాకనుమానం. ఆవిడ కాళ్లు మరకాళ్లవలె కదులు తుండటంవల్ల ఆమె అంటె ఆయనకు విసుగు కాబోలు. మాకు బహుమతులివ్వడంలో ఆమెచూపిన ఔదర్యం, మాధుర్యం తెలిసేంతవ రకు ఆమెను ముట్టుకోవాలని నాకూ అనిపించలేదు.

'ఇప్పుడు ఆంగ్ల ప్రభుత్వంవారి రహస్యపోలీసులకు హరదయాళ్ కార్యక్రమాలు, జర్మన్ దేశాధిపతితో స్నేహము తెలుసు. తెల్లదొరలకు వ్యతిరేకంగా మాట్లాడినందుకు, వాళ్ల దేశంనుంచి బహిష్కరించవలసిం దిగా అమెరికా రహస్యపోలీసులను కోరారు. అయితే ఆంగ్ల ప్రభుత్వాన్ని ద్వేషించే అమెరికన్లు, లాలా హరదయాళ్‌ను బెయిల్‌పై వదలిపెట్టి, వాళ్లపడవలో పర్వతాలతోకూడిన స్విట్జర్‌లాండు దేశానికి తప్పించుకొ నేందుకు సహాయపడ్డారు. స్విట్జరులాండు నుండి ఆయన జర్మనీలోకి ప్రవేశించి, ఆ దేశాధిపతి అతిథిగా ఉన్నాడు. మీరీ విషయం ఎవరితో చెప్పవద్దు.' ఆయన మన సమాజంలో తరచు సంబంధాలు పెట్టుకొ న్నారు. ఆయన సహాయంవల్ల యుద్ధంలో బందీలు చాలామంది జర్మన్ సైనికులుగా చేరిపోయారు.

'మాకు వచ్చే పత్రికల్లో ఆంగ్లసైన్యం జర్మన్ సేనలను కొడుతు న్నట్లు ఫోటోలు ఉన్నాయి.' అన్నాను సాహసించి.

'ముస్లిం కవి అక్బర్ అలహాబాదీ చెప్పినట్లు—

ఇంగ్లీషువారికి జయం—

జర్మన్లు ముందుకు సాగిపోవడం —' అన్నాడు బాబాయి వ్యంగ్యంగా.

'అయితే మహమ్మదీయులు కూడా ఆంగ్లప్రభుత్వానికి వ్యతిరేకులా?' అడిగాడు గణేశ్.

'మీ ఆగాఖాన్ వంటివాళ్లు తప్ప— టర్కీ బాదుషా, ఇస్లాం ఖలీఫా, అంతా ఆంగ్లప్రభుత్వాన్ని వ్యతిరేకిస్తూ జర్మన్ కైజర్ పక్షాన వున్నారు. ముస్లిం సోదరులైన మౌలానా మహమ్మదలీ, మౌలానా షౌకతలీ మనపక్షం. లాహోరునుండి వెలువడే ఉర్దూ పత్రిక 'జమీందార్' సంపాదకుడు మౌలానా జాఫరలీ కూడా మన పక్షమే! మహమ్మదీయ సిపాయులుకూడా ఆంగ్లసైన్యం వదిలేసి వస్తున్నారు. బడ్జ్‌బడ్జ్ అల్లర్లు జరిగినప్పటినుండీ సిక్కులుకూడా వదిలేసి వస్తున్నారు.'

'బడ్జ్‌బడ్జ్' అంటే ఏమిటి సరదాగా ఉందే?' అన్నాను

దేవదత్త బాబాయి నా చిలిపితనానికి నవ్వలేదు సరిగదా, చిరునవ్వునవ్వి మళ్లీ మొదలెట్టాడు— 'హాఁ బడ్జ్‌బడ్జ్' చాలా తమాషా పేరు.' ఆమాట వినగానే నాకు ఆనందంవేసింది. బడిలోకూడా మా ఉపాధ్యాయులు యిలాంటి సరదా మాటలు చెబుతూ పాఠాలు చెబితే ఎంత బాగుండును. పండిత రామానాథ్ 'అనవసర విజ్ఞానం' అని నిషేధించిన విషయాలనుగూర్చి తెలుసుకోవాలని నాలో ఆరాటం పెరిగింది.

చాలా కాలంతర్వాత బడ్జ్‌బడ్జ్ అల్లర్లు జరిగాయి. మీకు తెలియదు— మన సిక్కు సోదరులు సాహసవంతులు గుంపులుగుంపులుగా యితర దేశాలకు వెళ్లి ధనార్జన చేస్తారు. వాళ్లలో చాలామంది కెనడా దేశానికి చెందిన వాంకోవరు పట్టణంలో స్థిరపడ్డారు. అది అమెరికా ఖండంలో ఒక భాగం ఇప్పటికీ బ్రిటీషు సామ్రాజ్యం చేతిలో అది ఉంది. మన భారతీయులవల్ల పోటీకి భయపడి అక్కడ తెల్లవారు మనవారిని అడ్డుపెట్టారు. తెల్లవారి పడవల్లో భారతీయుల నెక్కించు

కోవద్దని నిషేధించారు. వెళ్లదలచుకొన్న ప్రయాణీకులకు ప్యాస్‌పోర్టులు యిక్కడ ఆంగ్లప్రభుత్వం యివ్వడానికి నిరాకరించింది..... అప్పుడు మలయాలోని సింగపూరులో 15 సంవత్సరాలుగా కాంట్రాక్టరుగా పనిచేస్తున్న మన అమృతసర్ జిల్లాకు చెందిన ఒక గ్రామీణుడు — గురదీత్ సింగు జపాన్ సర్కార్‌వారి ద్వారా స్వయంగా ఒక పడవను తీసుకొచ్చాడు. ఆ పడవ పేరు కోమా-గాతా-మారు!' ఆ పడవ హాంకాంగు నుండి భారతీయ ప్రయాణీకుల్ని చైనారేవు పట్టణమైన షాంగైనుండి, జపాన్‌లోని యొకోమానుండి కెనడాలోని వాంకోవర్‌కు తీసుకెళ్లాలి. 400 మంది ప్రయాణీకులు పడవ ఎక్కారు. వాళ్ళు కెనడా చేరినప్పుడు కొద్దిమందిని మాత్రం దిగటానికి అనుమతించి మిగతా వారికి ప్రవేశం నిరాకరించారు. ఆంగ్ల ప్రభుత్వాన్ని కెనడా ప్రభుత్వంతో మాట్లాడ వలసిందిగా గురుదీత్ సింగ్ కోరితే ఆంగ్ల ప్రభుత్వం లక్ష్యపెట్టలేదు. ఆపడవ ప్రయాణీకులతో హాంగ్‌కాంగ్ ముఖం పట్టవలసి వచ్చింది. అప్పుడు సరిగ్గా యుద్ధం ప్రారంభం అయింది. పడవ యోకోమా చేరే సరికి వారు హాంగ్‌కాంగ్‌లో గాని సింగపూరులో గాని ప్రవేశించిడానికి లేదని చెప్పారు. అప్పుడు ఆ దురదృష్టపు పడవ పోయిన సంవత్సరం సెప్టెంబరు 29వ తేదీ కలకత్తా సమీపంలోని బడ్జి బడ్జి వద్ద లంగరు వేసింది. అక్కడ ఆంగ్ల ప్రభుత్వంవారు వీరి కోసం ఒకరైలు సిద్ధంగా వుంచి వీరందరినీ ఖైదీలుగా పంజాబ్ తీసుక రావాలనుకున్నారు. ఈ అవమానం చాలా మందికి సహింపరానిదైంది. నెలల తరబడి పడవలో ఒంటరి జీవితం గడపటం డబ్బంతా ఖర్చు చేసుకోవటం వారి దుఃఖానికి కారణం. ప్రయాణీకులు రైల్లో ఎక్కడానికి నిరాకరించి కలకత్తావైపు నడిచారు. అప్పుడు పోలీసులు వారిని బలవంతంగా రైలెక్కించటానికి ప్రయత్నించినపుడూ ఇరువురి మధ్యా ముష్టి యుద్ధం జరిగింది. అందులో పదునెనిమిది మంది సిక్కులు చనిపోయారు... 18 మంది తెలిసా..... ఎనభై మందిని బలవంతంగా రైలెక్కించారు.

గురుదీత్ సింగ్ మిగతా కొందరు తప్పించు కున్నారు. వారిని అరెస్టు చెయ్య లేకపోయారు. ఆ విధంగా ఆపడవలోని ప్రయాణీకుల్ని ఆంగ్ల ప్రభుత్వం హింసించింది. అది మొదలు మన ప్రజలు ఆ

ప్రభుత్వాన్ని ద్వేషిస్తూ అసంతృప్తితో బాధపడుతున్నారు. ఆంగ్లేయుల్ని జర్మన్లు చావబాదు తున్నందుకు మనకు చాల సంతోషముగా వుంది. కానీ ఈ యుద్ధంవల్ల, మన యుద్ధం కాకపోయినప్పటికీ ధరలు పెరిగాయి. పల్లెల్లో ఆకలివల్ల దోపిడీలు పెరిగాయి. ఇప్పుడు భారతదేశం స్వాతంత్ర్యానికి సిద్ధంగా వుంది!

దేవదత్త బాబాయి చెప్పిన ఈ సాహస గాథల వల్ల నా నరాలు వుద్రేక పూరితమయాయి. ఈ కథల్లో నాకు చాల విషయాలు తెలియ లేదు. నేను సముద్రాల్లో ప్రయాణం చేయక పోవడం వల్ల ఆ పడవ నడిచిన ప్రాంతాల పేర్లు నాకు బాగా తెలియ లేదు. కానీ ఆయన చెప్పిన కథనం బాగుంది గాబట్టి నాటకీయమైన ఈ సంఘటనలు నా అంతరాత్మలో ఏదో ఆవేదనను కలిగించాయి. బాబాయి తన పదాలలో వూదిన ఆంగ్ల ప్రభుత్వ వ్యతిరేకత నాలో వారిపట్ల ద్వేషాన్ని పెంచింది. నేను బ్రిటిష్ దొరలలా కాక అమెరికన్లలా వుండాలని అనుకున్నాను. నేను పెద్ద వాణ్ణయితే అమెరికాకు వెళతాను గానీ ఇంగ్లాండుకు కాదు.

'వీళ్లని మేడకింద తలుపులు గొళ్ళెంపెట్టి రమ్మని చెప్పండి. నాకంత ఎత్తు అందదు' అన్నది పార్వతి పిన్ని.

'మరీ చాదస్తంగా మాట్లాడకు. ఇక్కడకు బందిపోట్లెవరూరారు.' నీవు నిద్రపో 'అన్నాడు బాబాయి పిన్ని మాటలను ఖండిస్తూ, ఆవిడ సలహాను తిరస్కరిస్తూ.'

పార్వతి పిన్నిని బాబాయి నిర్దయగా మాట్లాడినందుకు నాకు ఆరాత్రి చాల సేపు నిద్రపట్టలేదు. ఆయన చెప్పిన విప్లవ గాథల్లోని వేడి దానివల్ల తగ్గిపోయింది. నా చిన్న బుర్రలో దూర ప్రాంతాల నదులు పరిసరాలు అద్భుతమైన స్వప్నాలను తెప్పించాయి నేను నల్లని రొట్టె వూరగాయ నంచుకుంటూ తింటునట్లు కలవచ్చింది. సముద్రపు అలలలో చిన్న పడవలో నన్ను ఖైదీగా బంధించి తీసుకెళుతున్నట్లూ నా చుట్టూ పొడవాటి ముళ్ళతో పెద్దపెద్ద చేపలు మిలమిలా మెరిసే కళ్ళతో చూస్తున్నాయి. అందులో ఒక చేప అమ్మ వూజా మంది

రంలో దేవతల పటంలో వున్న ఆగాఖాన్ రూపాన్ని ధరించింది. కొన్ని చీమలు నాముఖం పై చిందరవందరగా తిరుగాడు తున్నాయి. చని పోయిన కౌసల్య బతికివచ్చి నాతో చెట్టపట్టాలు వేసుకుని తోటవైపు నడుస్తోంది. దగ్గరలో దుర్గ గుడి చెరువువద్ద స్త్రీలు వివస్త్రలుగా దోబూ చులాట ఆడుకుంటూ నాకేసి చూసి నవ్వుతున్నారు. ఆ మరునాటి ఉదయం తల నొప్పితో కళ్ళుమంటతో నిద్రలేచ్చాను. నేనింకా పసిఫిక్ సముద్రంలో చిన్న పడవలో వూగాడు తునట్లు అనిపిస్తోంది.

# 11

దేవదత్త బాబాయి విప్లవ ధోరణిలో మాట్లాడిన మాటలు నాలో నెలల తరబడి స్వాతంత్ర్యపు షరాబు తాగినట్లుగా మత్తెక్కించాయి. మేము ఆయనకు పరిచయమైన ఒకటిన్నర సంవత్సరం నుండి మాకు ఈ కధలు చెప్పలేదు. ఈ రాత్రిపూట ఉద్రేకపూరితంగా, సాహసోపేతంగా ఆయన మాటలు వినిపించాయి. దేశంకోసం పోరాడి కష్టాలననుభవిం చిన మనుషుల స్వభావాలు నాలో శక్తిని యినుమడింపజేశాయి. కొత్త సత్యాన్ని సహజధోరణిలో నేను పుణికి పుచ్చుకొన్నాను. నా అంత రాత్మలో అహంభావాన్ని ప్రోదిచేశాను. భారతీయుడిగా జన్మించామనే ఆలోచన నాలో జాగృతి కలిగించింది. విజ్ఞానమంతా సాధ్యమైనంతమే రకు నేర్చుకోవాలనే స్వప్నలోకాల్లో విహరిస్తున్నాను. అందుకు ఎన్ని కష్టా లనైనా ఎదుర్కోవాలి. ఈ సంకల్పం నెరవేరడానికి దేవదత్త బాబాయి ఒక్కడే నాకు సహకరిస్తాడు. ఈ విషయం నేనెవరితో చెప్పకపోయినా, నా అంతరాత్మకు తెలుసు. అందుకే ఆయనతో స్నేహం పెంచుకొందా మనుకొన్నాను. నా దృష్టిలో నాయకుని లక్షణాలు మా నాన్నలోకంటె, బాబాయిలో ఎక్కువగా కనిపించాయి. కాని, పిన్నిని ఆయన నిర్లక్ష్యంగా చూడటం ఓర్చుకోలేకపోయాను. భవిష్యత్తులో నేను మానాన్న వలెగా కుండా బాబాయిలా తయారుకాగలనే నిశ్చయానికి వచ్చాను. కధలు

'కధ, రెండు + రెండు =5 కాదని సూత్రీకరించడం, చదరం

గంలో అందరినీ ఓడించడం, వేదాలలో తత్వాన్ని చెప్పడం, చిత్రాలు గీయడం, అలా ప్రతిపనీ చేయగలగడం నేర్చుకోగలను. నా ఆత్మలో ఈ ఆలోచనల దొంతరలు చిన్నవయసులోనే రహస్యంగా రాజ్యం చేయ సాగాయి. మేం రోజూ యింట్లోమాట్లాడుకొనే సంభాషణల్లో ఒక ఆలోచన మరో ఆలోచనకు దారితీసి, ఏదో క్లిష్టమైన విషయాల్లోకి మాటల్లోకి జారిపోయినట్లుగా తోచేది. అందువల్ల అస్పష్టమైన భావన కలిగేది. భవిష్యత్తులో నా అజ్ఞానాన్ని పారద్రోలి, వేదాలలో దేవుడిలా భావనా ప్రపంచాన్ని జయించి స్పష్టమైన ఊహలల్లుకోవాలి. జీవితంలో శక్తిని నిబిడీకృతం చేసి నిరంతర కృషిని కొనసాగిస్తూ అందరినీ ప్రేమిం చడం నేర్చుకోవాలి.

ఆ మరుసటి నెలల్లో నగరంలోని మారు మూలప్రాంతాలన్నీ నిర్భ యంగా తిరిగి అంతా అవగాహన చేసుకొన్నాను. బజార్లలోని అన్ని అంగళ్లపేర్లు, అన్ని వీధులు, గొందులు, సందులు తెలుసుకొన్న చిన్న కుర్రవాణ్ణి నేనని సగర్వంగా అనుకొన్నాను. బడికి వస్తూ వెళ్తున్నప్పుడు, స్వర్ణమందిరానికి వెళ్లి వచ్చినప్పుడు, గోల్ బాగ్, రామ్‌బాగ్‌లో పౌరుల్ని చూసినప్పుడు నా విశాలనయనాలకు వారు అందంగా కనిపించారు. నాకు తెలియని ఏవో నూత్నవిషయాలు తెలుసుకొన్నాను. అమ్మ కట్నంతో తెచ్చిన మంచంపై పడుకొన్నప్పుడు నాలోని జ్ఞాన నేత్రం విచ్చుకొనేది. మా బడికి సమీపంలోని కృష్ణ వస్త్రాలయం నుండి తెచ్చిన శివుని పటంలోలా నాకు మూడోకన్ను విచ్చుకొనేది. ఈ 'అమృత భాండం'లోంచి ఈ ప్రాంతంలోని కొన్ని వందల ముఖాలు కనిపించేవి. ఈ విధంగా నేను చదువుకొంటున్న బడి నా కీర్తి ప్రతి ష్ఠలు యినుమడించడానికి కొద్ది అవకాశాన్ని కలిగించింది. అమృతసర్, పంజాబు, భారతదేశం, నల్ల సముద్రము, ప్రపంచమూ నాలో రేగే కోరికలను సగంసగం వ్యక్తీకరించగలవనిపించింది.

నా అంతరాత్మలోని చిక్కుదారిలో ఎందరో వ్యక్తులు చోటుచేసు కొన్నారు. కష్టపడి జీవించడానికి పనిచేసేవారు, ఒకరికంటె మరొకరు ధనవంతులు కావడానికి పోటీపడేవారు, భగవంతుడికి లంచాలిచ్చి అర్చించి తమకోరికలు తీర్చుకోవాలని చూసేవారు, తమకులంలో సాటివారితో

హోదాలో ఎక్కువ కావాలని చూసేవారు కనిపించారు. మా అమ్మ నాన్న యీ పని చేస్తూనే ఉన్నారు. మా కులంలోని తోటిసోదరు లంతా యిదే వ్యవస్థ. మా దత్త బాబాయి సోదరులు మాత్రం వీరి అందరికన్నా కొంచెం భిన్నం. ఇలాంటి వాటికి దూరం. వారుకూడా మేడలు, ధనమూ వారసత్వంగా పొందినా యిలాంటి హోదాలకుపోక, రాజకీయ నాయకులు కావాలని కోరిక. మాష్టరు శివరామ్‌దాసు, హెడ్మాష్టరు సర్దార్ కిషన్ సింగు, మేనేజరు పండిత రామానాధ్, ఆంగ్లేయుల సూట్లు ధరించి, టై బిగించి, భారతీయుల్లా తలపాగాలు చుట్టుకొని, ఆంగ్లేయులకు, భారతీయులకు మధ్య రాజీ మార్గంలో నడు చుకొంటున్నారు. ప్రభుత్వ కార్యాలయాల్లో పెద్దపెద్ద ఆఫీసర్ల ఉద్యోగాలు చేయడమే వారి లక్ష్యం.

ధనార్జున చేసి లాలా లాగా, వ్యాపారస్థుడిలాగా, లేదా పెద్ద ఉద్యో గిలా దొరలకు టైపు చేసిపెట్టడమనేది నాకు నచ్చలేదు. ఈ అసంద్ధ ర్భమైన వాదన నాలో నిరర్ధకంగా తోచింది. ప్రాచీన సంప్రదాయాలన్నీ చెడువిగాను, పెద్దల ఆలోచనలన్నీ మృత ప్రాయంగాను, నావి మాత్రం నిత్యనూతనమైన భావనలుగా తోచి, నాలోనేను క్లిష్టమైన ఆలోచనా సర ళితో సతమతమయ్యాను. కౌసల్య నిర్హేతుకంగా చనిపోయింది. పార్వతిని భగవంతుడు శిక్షించాడని అమ్మ చెప్పింది.

భగవంతుడు మనుషులను శిక్షిస్తే ఆయన చెడ్డవాడు. అసలు దేవు డనే వాడున్నాడా? నేను తెలుసుకోవాలి. నేను చెప్పదలచుకొన్న మాటలన్నిటికీ పదజాలం ఎక్కడలభిస్తుంది? ఈ ఆధిభౌతిక వాదాలపై ఆధారపడి నేను ఆలోచిస్తుంటే తగిన పుస్తకాలు చదవడానికి దొరుకు తాయా? నేను చనిపోయేలోగా ఇవన్నీ ఎలా సాధించడం? ఒకవేళ మృత్యువు కౌసల్యనులా నన్నూ ఆవరిస్తే ఏం చేయాలి?

ఈ కంసాలి ఖారిలోను,. మా సందులో పనిచేసే పర్వతాలకు చెందిన కూలీలలోను వారి కనుగొలకుల్లో దారిద్ర్యం, దుఃఖం తాండవిం చడం గమనించాను. వారికంటె నేను దౌర్భాగ్యుణ్ణిగా కనిపించసాగాను. ఎవరు సరియైన దారిలో నడుస్తున్నారు? ఎవరిది దోషం? అమ్మ చెప్పింది - ఈ పర్వత ప్రాంతం వారు సోమరిపోతులు. కంసాలులు,

కమ్మరివారు మన కంట్లో మట్టిగొట్టి త్రాసు తూచేటప్పుడు సులభంగా మోసం చేయగలరు. నాదృష్టిలో శారీరకంగా సామర్థ్యం లేనందువల్ల ఈ కూలీలు పనిచేయలేకున్నారు. బంగారము, వెండి అమ్మే మధ్యవర్తులు, ఈ కంసాలి వారి కన్నా ధనవంతులు. వీరు వారికి తక్కువ జీతాలిస్తు న్నారు. ఈ పంజాబ్‌లోను, భారతదేశంలోను ఒకప్పుడు మహారాజులు, సుల్తానులు ఉండేవారు. ఇప్పుడు తెల్లదొరలు వారిస్థానం ఆక్రమించారు. దేవదత్త బాబాయి చెప్పినట్లు వారిది 'రవి అస్తమించని సామ్రాజ్యం'. ఇంగ్లీషు వారి సర్వస్వం జర్మను కైజరు కబళించాలని చూస్తున్నాడు. మహా భారతయుద్ధంలో సమస్తం మన ప్రాచీన రాజులు కోల్పోయినట్లు, ఈనాడు నల్ల సముద్రంలో ప్రపంచ యుద్ధంచేస్తున్నప్పుడు, మనం అమె రికా సహాయంతో స్వాతంత్ర పోరాటం సాగించవచ్చు. అయితే అదిఎలా సాధ్యం? లజపతిరామ్ పేరు చెప్పడానికి భయపడుచున్నారు. దేవదత్త బాబాయి చెప్పినట్లు భారతీయుడు మరో భారతీయుణ్ణి నమ్మలేకుండా ఉన్నాడు.

నా మెదడులోని పగుళ్ళన్నీ ఒక్కసారి చిక్కుముడి పోయాయి. ఈ విషయాలన్నిటిలో నేనేం చేయగలనో నాకు తోచడం లేదు. అప్పుడు నాకు తెలిసింది నేనెంత చిన్నవాడినో. నేనెంత చిన్నవా డినో ఇతరులతో చెప్పడానికి సిగ్గువేసేది. నాలో దోషాలు ఎవరికి చెప్పకోను! దీపావళికి అమ్మ చేసిన మిఠాయిలు ఎలుకలు తిన్నట్లుగా, అన్ని రకాలైన అనుమానాలు, భయాలు, ప్రశ్నలు నా ఆత్మలో దొంత రులుగా పేరుకొన్నాయి. నిస్సహాయంగా, ఓడిపోయిన వాడిలా నేను పెద్ద మంచంపై దొర్లుతున్నాను. నా రక్తం వేడెక్కి మెదడు దాకా చేరిన భావాలు జీర్ణంచుకోలేక, నాలోని ఉద్రేకాన్ని అణచుకోలేక, అసంతృ ప్తితో సతమతమవుతున్నాను. నాలో భయాన్ని చిలుకుతూ ప్రతాప్ బాబాయి షాపులో విష్ణుమూర్తిలా నూత్నవిశ్వాన్ని సృష్టించడానికి ప్రయ త్నిస్తున్నాను. దేవకి పిన్ని వాడే సుగంధాలన్ని ఆ విశ్వానికి సంక్రమింప జేయాలని ఉబలాటపడ్డాను.

ఒకరోజు నా సిగ్గును అణచుకొని దేవదత్త బాబాయి దగ్గరకు వెళ్ళాను. కాసేపు మౌనంగా కూచొని, పంకా దారం లాగుతూ

ఉన్నాను. ఆయన లెక్కలు పూర్తి చేసి, ఖాళీగా ఉన్నప్పుడు నెమ్మదిగా ప్రస్తావించాను.

'బాబాయ్! యుద్ధం ఎప్పుడు పూర్తి అవుతుంది? మనం నాన్న దగ్గరకు ఎప్పుడు వెళ్తాం? '

'బాబూ! ఈ ప్రపంచమంతా గందరగోళంగా ఉంది. అధికారాన్ని, మద్యాన్ని తాగి మత్తెక్కిన ఆంగ్ల దొరలు సగం ప్రపంచం జయించారు.

బ్రిటీష్ సామ్రాజ్యమంటే జర్మను కైజరుకు అసూయ. ఇప్పుడు యూరప్ లో ఈ తుఫాను చెలరేగుతుంది. భారతీయ సిపాయిల రక్తంపై ఈగల రూపంలో మృత్యువు ఆవరిస్తోంది. యుద్ధభూమిలో శవాలు పేరుక పోతున్నాయి. రక్తం పీల్చే జలగల్లా మానవుల రక్తాన్ని తాగటానికి తెల్లదొరలు అలవాటు బడ్డారు. ప్రపంచంలోని ఖాళీ స్థలాలనూ, మనుష్యులను ఆక్రమించు కోవాలనే అధికార దాహంతో వారున్నారు. మన రాజ్యం నుంచి వీలైనంత ధనాన్ని దోచుకోవాలని వాళ్ళ కోరిక. ధనవంతులైన మన భారతీయులు నిజానికి గులాబీలు తినే విలాసవంతులు. వారు తెల్ల దొరల అభిమానానికి గురియైనా, పేదవారు కష్టపడి పనిచేయక తప్పదు. అధికారము, ధనము, ధర్మానికి కట్టుబడి ఉండాలి. స్వీయ ప్రయోజనాలే గాక ఇతరుల అధికారాలను గూర్చి కూడా ఆలోచించాలి. తెల్లదొరలు విజ్ఞానశాస్త్రం ద్వారా వినూత్న ప్రపంచాన్ని సృష్టించ గలిగినప్పటికీ, కార్ఖానాలు తెరచి నప్పటికీ వారి నాగరికత పరిశుద్ధమైంది కాదు. వారి ఆశామాత్సర్యాల కారణంగా ప్రపంచం యుద్ధ రంగంలోకి దూకింది. పేద ప్రజలు నమ్మకస్తుల్లా సిపాయిల్లా యుద్ధంలో చనిపోతున్నారు. ఆఫ్రికన్లను తెల్లవారు కొండ ముచ్చులని పిలచి వారిపై వుమ్మివేశారు. భారతీయులు కూడా తమను తాము పరిపాలించుకోలేరని, విశిష్టమైన జాతికి చెందిన తాము మాత్రమే అందుకు అర్హులమని వారి భావన. వారు ప్రోదు చేసిన నాగరికతను ఈ అగాధాల వల్ల షారే నాశనం చేస్తారు. వారు తయారు చేసిన యంత్రాలు, విలాస జీవితాలు వారి చేయి జారిపోయి వారి ఆత్మనే సర్వనాశనం చేయగలవు. ఈ యుద్ధంలో మృత్యుదేవత కరాళ దంష్ట్రలు మానవ కంకాళాలను కబళించి వేస్తాయి. ఆ యుద్ధం పూర్తి ఐతే తప్ప మనదేశ

భవిష్యత్తేమిటో తెలియదు.' బాబాయి ఉద్వేగంగా చెప్పాడు.

దేవదత్త బాబాయి ఉద్బోధల వల్ల నాలో రేగిన కోరికలు ఆలోచనలు నన్ను చుట్టుముట్టి నా మనస్సు చీకటి కోణాల్లో ఎక్కడో సత్యం అనే వెలుతురు ప్రసరించ సాగింది. మా నాన్న విశ్వాసపాత్రుడైన సిపాయి అని నాకు తెలుసు. అలానే సుబేదార్, మేజర్, గూర్ఖా సింగ్; హవిల్ దార్, లక్ష్మణ్ సింగ్ వీరంతా బ్రిటీష్ సామ్రాజ్యం కోసం పోరాటం చేస్తూ చనిపోతున్నారు. అయితే తెల్లదొరలు భారత దేశం అఖండ నిధి నిక్షేపాలకు స్థానమని ఎలా కనుగొన్నారు? దేవదత్త బాబాయి చెప్పినట్లు భారత దేశాన్ని కనుగొనాలని వచ్చిన కొలంబసు అమెరికాను కనుగొంటే బ్రిటీషు వ్యాపారస్తులు మన దేశానికెలా వచ్చారు? పోర్చుగీసు దేశీయుడైన వాస్కోడిగామా 'గుడ్ హోప్ అగ్రం' ద్వారా దారి కనుగొన్నాడు. పోర్చుగీసు వారి నుండి ఇంగ్లీషు వారు మన దేశాన్ని ఎలా తీసుకున్నారు? ఎలాంటి పడవలు వారిని మన తీరానికి చేర్చాయి? అప్పుడు మన పడవలు వారి మీద కాల్పులు ఎందుకు చేయలేదు? కష్టంచి పనిచేయటం ద్వారా, మోసకారి తనం ద్వారా భారతీయ రాజులకు లంచాలివ్వటం ద్వారా వారు నెమ్మదిగా మన దేశాన్ని ఆక్రమించారు ఇప్పుడు వారు ఇతరుల అసూయ ద్వేషాల వల్ల బాధ పడుతున్నారు. ఒక్క జర్మనులు మాత్రమే గాక భారతీయులు కూడా వారితో పోరాడుతున్నారు. పట్టాభిషేక మహోత్సవానంతరం హార్డింగు ప్రభువు మీద బాంబు విసరడం, కోమాగాటా మారు పడవలో సిక్కుల తిరుగుబాటు జరిగాయి.'

బాధపడేవారు అక్కడక్కడా వంటరిగా వున్నారు. అమృత్ సర్ జిల్లాలోని రైతు కుటుంబాల్లో దుఃఖం జీర్ణంచుకు పోయి వుండాలి. వారి సుఖ దుఃఖాల పట్ల నా హృదయం పరిభ్రమించింది. సిక్కులు ఎంత సాహసవంతులు! ఆ పడవలోనుంచి తప్పించుకొని పోయిన వారు బహుశ అడవుల్లోనూ పర్వతాల్లోనూ దాగి ఉంటారు. వారిపట్ల నా హృదయంలో జాలి కలిగింది, తెల్ల దొరల పట్ల కోపం ప్రజ్వరిల్లింది. నేను తనవైపు తీక్షణంగా చూశానని కన్నింగ్ హామ్ దొర నేను రామచంద్ర బాబు కొడుకునైనప్పటికీ వాతబెట్టాడు మరి ఆంగ్ల ప్రభుత్వాన్ని ధిక్కరించిన

వారిని పోలీసులు ఏ విధంగా చిత్రహింస పెడతారో వూహించవచ్చు. సిక్కులతో చేయి కలిపిన వాళ్ళ నాన్న భూమిని తమ పక్షంలో చేరిన వాళ్ళ బాబాయికి తెల్ల దొరలు సంక్రమింప జేసిన విషయం అమ్మ ఒకసారి చెప్పింది. వాళ్ళ బాబాయి తెల్ల దొరలకు స్తోత్ర పారాలు చేసేవాడు. మా అమ్మ తెల్లదొరల పట్ల వినయాన్ని చూపి వారంటే భయపడే మా నాన్నను తిడుతుండేది. ఆమె మాటలను బట్టి దేవదత్త ఋషితుల్యుడు. ఆమె మాటలు నాలో సాహసోపేతమైన ఆలోచన లను రేకెత్తించి, నా శరీరంలో దృఢత్వాన్ని కలిగించి ఆలోచనా శక్తిని పెంచాయి. నేను బాగా వయసులో ఎదిగాను. నా అంతరాంతాల్లో రహస్యంగా సంపూర్ణ జ్ఞాని నైనట్లు అనుకోసాగాను. అప్రయత్నంగా నాలో నేను ఒక్కొక్కసారి 'నేను విప్లవకారుణ్ణి' అనే పదాలు ఉచ్చరించే వాణ్ణి.

ఈ నగరంలో ఈ విధంగా క్రమశిక్షణ అనే చెరసాలలో బంధించ బడ్డ నేను, నా భావ పరంపర గురించి అనుమానించసాగాను. అమ్మ మాకు వివరంగా చెప్పిన విషయాలను బట్టి నేను పూర్వ జన్మలో చేసిన దుష్కృత్యాలకు ఫలితంగా యముడు నన్ను నరకంలో హింసిస్తా డని వూహించసాగాను. నా ఆత్మలో నేను పొందుతున్న ఆవేదన నేను పొందబోయే కష్టాలను తెలిపే దూతలా అనిపించింది. నాకు ఆకలిగా లేదని అమ్మతో అబద్దాలు చెప్పి అన్నం మానివేసేవాణ్ణి.

ఆకలి నెదుర్కొనేందుకు సిద్ధంగా వుపవాసాలు తోడ్పడేవి. ఒకవేళ విప్లవానికి సిద్ధంగా ఉపవాసాలు చేయవలసివస్తే ఇది వుపయోగపడు తుంది. నా చేతుల్లో నేనే గుండు సూదులు గ్రుచ్చుకున్నాను. అలా చేస్తే యముడు పెట్టబోయే బాధలు తగ్గిపోతాయని అనుకోసాగాను.

ఒకరోజు అలా ఉపవాసాలు ఉన్న తర్వాత విపరీతమైన ఆకలి వేస్తున్నప్పుడు, నేను చేసిన పాపాలన్నిటికీ నిష్కృత్తిగా యిలా చేస్తు న్నానని అందుకే అన్నం మానివేశానని అమ్మతో చెప్పాను.

'నేను చెప్పినదంతా నువ్వు తు.చ. తప్పకుండా పాటించనక్కర లేదు. పిచ్చి వెధవ! నీవు ఇలా వుపవాసాలు చేయనక్కర లేదు.

స్వయంగా ఆరోపించుకున్న బాధలు పెద్దవారికి సరేగాని నీలాంటి అమాయకులకు కాదు' అని అమ్మ మందలించింది.

'అయితే ఉపవాసాలు పెద్దవాళ్ళకు ఎలా మంచివి?' అన్నాను.

'బాధలు మనలను కుంగ జేస్తాయి' అంది.

దేవదత్త బాబాయి లాగా నడుచుకుందామని అనుకుంటున్న నేను అమ్మ యింట్లో లేనప్పుడు ఉపవాసానికి పుపక్రమించాను. ఆమె మా బంధువర్గంలో ఎవరో చనిపోతే వారికి సంతాపం చెప్పడానికి వెళ్ళింది. మరెవరికో పెళ్ళిచూపుల సందర్భంగా సహాయం చెయ్యటానికి వెళ్ళింది. ఆమె చెప్పినదంతా నాకు బాగా గుర్తు. ప్రతి ఒక్కరూ మరణానం తరం రక్త సముద్రంపై ఒక సన్నని తీగ మీద నడవాల్సి వస్తుందనీ, ఆ సముద్రంలో తేళ్ళు, పాములు ఉంటాయని చెప్పింది. జీవితంలో మానవుడు చేసిన దోషాలకు ఫలితంగా గొడ్డలి దెబ్బలు తినాలనీ, ఎన్నో జన్మలు ఎత్తి పాపాలన్నీ నిష్కృతి పొందాలనీ ఆమె చెప్పింది. ఈ జీవితంలో ఇలా బాధలనుభవిస్తే నరకంలో అన్ని బాధలను ఓర్చుకోవ చ్చునను కొన్నాను. అయితే స్వర్గానికి ఎవ్వరూ వెళ్ళలేరనే నమ్మకం వున్నందువల్ల నేను దాన్ని గురించి ఆశించలేదు. జీవితంలో సుఖాలకు ఆశపడి ప్రతి ఒక్కరూ దోషాలు చేస్తారు. సుఖాల కోసం పేకాట ఆడటం, తాగటం, నాట్యమాడటం తప్ప. ఋషులలాగా నేను క్రమంగా నడుచుకోలేను గాబట్టి మనకి ఇష్టం వచ్చినట్లు నడుచుకొని ఆ తర్వాత నరకంలో బాధపడవచ్చు నేను స్వాతంత్ర్యం కోసం త్యాగాలు చేసి అబ్రహం లింకన్ అడుగు జాడల్లో నడుచు కుంటాను.

నే ననుకుంటున్న అన్ని దోషాలు అతిక్రమించటానికి ఇతరుల్ని అర్థం చేసుకోవటానికి దోహదం చేశాయి. బజారులో ప్రతాప్ బాబాయి అంగడి వద్దకు వచ్చే సాధువులు, సన్యాసులు వట్టి మోసకారులని నీచంగా చూసే స్వభావాన్ని మార్చుకొని వారిని ఆసక్తిగా చూడసాగాను. ధన వంతులకే సంపద అంతా వుంటే పేదవారంతా సాధువుల్లా మారిపోయి భిక్ష స్వీకరించరెందుకని?

'అలక్ అలక్ భం భం బోలేనాధ్' అనే శబ్దం వినిపించి—నపుడు

క్రిందికి పరుగెత్తుకుంటూ వచ్చి జడముడి కలిగిన శైవ సాధువు తీక్ష్ణమైన కళ్ళను చూసేవాణ్ణి. అతను ఎంత మోసగాడు! ఎంత సత్యసంధుడు! అని ఆశ్చర్యపోయే వాణ్ణి. నెమలి పింఛాలను తలపై ధరించి భగవన్నామస్మరణ చేస్తూ వీధిలో తిరిగే బిచ్చగాళ్ళ గానాలను శ్రద్ధగా వినేవాణ్ణి. వారు కేవలం చిలక పలుకులు పలుకుతున్నారు కానీ నిజమైన భక్తిలేదు. వారు సౌమ్యులైన బిచ్చగాళ్ళు. దారి వెంబడి ముస్లిం ఫకీర్ల ఆటలు నేను గమనించ సాగాను. పగలంతా వారు భక్తి గీతాలు పాడుతూ, రాత్రులు దొంగలుగా మారుతారని అమ్మ చెప్పేది. వారి చిరిగిన గుడ్డలూ, సంచులూ, చూసి వీరికన్నా వందరెట్లు మేము మెరుగు కావటం వల్ల అమ్మ అలా అనగలిగిందనిపించింది.

అయితే ఆ ఫకీర్లకు దగ్గరగా వెళితే చిన్నపిల్లల్ని సంచుల్లో వేసుకొని తీసుకెళతారని విన్నందువల్ల వాళ్ళ దగ్గరకెళ్ళే వాణ్ణి కాదు. ఆ దొంగల ముఖాలు ఆకారాలు చూడాలని ఆసక్తిగా వుండేది. దొంగతనం చేసినప్పటికీ వారి ధైర్యాన్ని మెచ్చుకునే వాణ్ణి.

మతానికి చెందిన ఈ మనుషుల ప్రవర్తనను గూర్చి నేను నా స్నేహితుడు గుగ్గితో నిస్సంకోచంగా మాట్లాడే వాణ్ణి. తద్దినాలప్పుడు పుష్టిగా భోంచేయడానికి బ్రాహ్మణులు చాలామంది ఆశపడతారని అతను చెప్పాడు. అలానే దొంగ సన్యాసులు చిరిగిన వస్త్రాలు కట్టుకొని, విభూతి ధరించి కష్టపడకుండా బిచ్చమడగటానికి సిద్ధపడతారని అతడు చెప్పాడు. హిమాలయల్లో నిజమైన యోగులు కొందరున్నారట. వీరు ప్రపంచం లోంచి నిష్క్రమించి అక్కడకు వెళ్ళి వుపవాసాలు చేశారు. కొన్ని యోగ శక్తుల ద్వారా ఇంద్రియ నిగ్రహం సంపాదించారు. రోజుల తరబడి శ్వాసను ఆపగలరు. మాబడి బయట ఇంద్రజాలం చేసే చాలామంది కన్నా వీరు చాలా శక్తులు చూపించగలరు. తమ శక్తి ద్వారా పూల సువాసనలను నిర్ణయించగలరు. యోగ శక్తి ద్వారా ధ్యానమగ్నులై కష్టసుఖాలకు అతీతంగా వ్యవహరించ గలరు. అయితే యిలాంటి వూహాగానాలు చేస్తూ తాను ఎక్కువ సేపు కాలం గడుపలేనని తాను వెళ్ళి కడగాలనీ గుగ్గి చెప్పాడు. ఏది ఏమైనా హిందూ మతాన్ని బోధించే పురోహితులు విధించిన నియమాల ప్రకారం అస్పృ

శ్యుడు ఋషి అయ్యే అవకాశం లేదు. నేత పనివాడైన ఒక్క కబీరు మాత్రం పవిత్రుడై హిందువుల కంటే సిక్కుల చేత పూజింప బడ్డాడు. 'మా పూర్వీకుల పాపాలు నన్ను హీనజాతివాడినిగా కొన్ని జీవితాల పాటు మార్చి వేసింది నేను దాన్ని అంగీకరించటం తప్ప చేయగలిగిం దేమీ లేదు. నేను జన్మతః హిందూ క్షత్రియుణ్ణి గాబట్టి యోగాభ్యాసం చేయవచ్చునేమో తెలుసుకోవాలి. అలా చేయాలంటే ఈ ప్రపంచాన్ని త్యజించా'లని గుగ్గీ చెప్పాడు. నేను ఎన్నడూ మా తల్లి దండ్రులను వదిలి పెట్టాలని అనుకోలేదు. నా ఆశలు మాత్రం అనంతం.

గుగ్గీ తన్ను గురించి చెప్పిన మాటలు ఆలోచించినపుడు నాకు కోపం వచ్చింది. తోడి హిందూ విద్యార్థులతో పాటు నేను అతనితో ఆడుకోవటం గాని అతను నా స్నేహితుడని చెప్పుకోవటం గాని కుదరదు. అతడు వీధులు వూడ్చే కుర్రవాడు. అతడు చెప్పినట్లు మరి కొన్ని జీవితాల పాటు అతడు పూర్వజన్మ ఫలితం వల్ల హీనజాతివాడుగా వుండే షక్షంలో మేమిద్దరూ సమానమయ్యే అవకాశమే రాదు. మా స్నేహం ఫలించదు.

మళ్ళీ నా మనసులో ఆలోచనా దొంతరులు చిక్కుపడ్డాయి. జీవితమంతా ఒక అడ్డు గోడలాను, సత్యాన్వేషణలో నేను దాన్ని పడగొట్ట లేనట్లు తెలుసుకున్నాను. హీన జాతివారు అస్పృశ్యులుగా ఎందుకు జీవించాలి? విధి అనేది ఉందా? ఉన్నత జాతి వారు చేసిన చెడు పనులు మంచివై, హీనజాతివారు చెడుపనులు చేస్తే క్రూరమెందుకు అవుతుంది?

ఈ ప్రశ్నలు నేను బహిరంగంగా అడగలేకపోయాను. ఇంతకు ముందుకంటే ఇప్పుడు భగవంతుని ఉనికిని గూర్చి సందేహాలు అధికమై నాయి ఇదంతా గందరగోళం ఉన్నతజాతి, హీనజాతి, మా కంసాలి సోదర బృందం, వారిని భగవంతుడు నిర్మించాడా? భగవంతుడు వారిని శిక్షిస్తే, ఆయన దయామయుడు కాదు. అందువల్ల భగవంతుడు లేడు. యముని చేతిలో ఒక క్రీడా జగత్తు ఈ ప్రపంచం.

ఈ విధంగా నేను భావించడం వల్ల భగవంతుడు నన్ను వెంటనే

మృత్యువుతో బాధిస్తాడనుకొన్నాను. అది జరగనందువల్ల భగవంతుడు లేడనిపించింది. ప్రపంచమంతా గందరగోళం. దానికి అర్థం లేదు. పెద్దలు అబద్ధమాడినట్లు బ్రాహ్మణులు ఇతరుల ఆహారాన్ని హరించారనడం వాస్తవం కాదు. ఒకరికంటె మరొకరు అధికంగా వ్యవహరించడానికి మరొకర్ని నొప్పిస్తారు అంతే!

నా ఆలోచనలకు రూపకల్పన చేయగల్గితే ఎంత బాగుణ్ణు! తెల్ల దొరలకు యుద్ధంలో సహాయం చెయ్యడానికి వెళ్ళిన తండ్రికి యెదగని కొడుకుగా నేను ఈ వలయంలోంచి బయటపడలేకున్నాను. గుగ్గిని నాతో సమానంగా భావించి సహాయపడలేకుండా వున్నాను. నాన్న నాకు దూరంగా ఉండటం నాకు కోపాన్ని తెప్పించింది. ఆయన నా దగ్గర వుండి పాఠాలు చెప్పి నన్నెందుకు తీర్చి దిద్ద కూడదు. నాకు సహాయం చెయ్యటానికి బదులు బహుశా త్వరలో ఆయన వచ్చి అమ్మను తీసుకెళ్ళవచ్చు. డోగ్రా వంటవాళ్ళు చేసె పెట్టే భోజనం తినలేక అవస్త పడుతున్నాని ఈ మధ్యే ఉత్తరం వ్రాశారు. అమ్మను నాన్న తన సొంత ఆస్తిగా భావించటం ఆశ్చర్యంగా వుంది. నేను ప్రేమించి ఆరాధించిన వ్యక్తి, అన్ని సందేహాలకు సమాధానాల కోసం ఎదురు చూసిన వ్యక్తి, నా జీవితానికి వెలుగు బాట, దైవ తుల్యుడు అయిన మా నాన్న నా ఊహల్లో దైవత్వంనుంచి తొలగించి నట్లయింది.

మా నాన్న పై తిరుగుబాటు ధోరణికి కారణం నా చిక్కు ప్రశ్నలకు సమాధానాలు చెప్పటానికి దగ్గర లేక పోవటమే. ఆయన్ను ద్వేషించటానికి నేను సిగ్గు పడుతున్నాను కూడా. అమృతసర్‌లో ఆయన వుంటే సరిపడా సంపాదించి మమ్మల్ని చదివించడానికి అవకాశం వుండదు. నిజానికి గణేశ్ శివాలకంటె నన్ను ఎంతో ప్రేమగా చూస్తారు. ఇటీవల శివాపట్ల ఎక్కువ అభిమానం చూపిస్తున్నారు. ఏది ఏమైనా ఆయన మా నాన్న కాబట్టి ఆయన్ను ద్వేషించగూడదు.

నిదానంగా ఆలోచించిన క్షణాల్లో నాలో రెండు భిన్నమైన ఉద్రేకాలు ఏక సమయంలో కలిగేవి. ఆయన పై ద్వేషం, ప్రేమ - ఈ భావనల సంఘర్షణ వల్ల కల్గిన దుఃఖం నన్ను ఆవరించి గణేష్ నన్ను 'ఏడవుగొట్టుమొహం' అని పేరు పెట్టడానికి దారి తీసింది.

ఇంటా బయటా నేను తగాదాల కోరుగా మారాను. రైల్వేపని వారి పిల్లలతో ఆడిన క్రికెట్టు ఆటలో మా స్కూలు తరఫున గణేష్‌ను చేర్చుకొని నన్ను చేర్చుకోనందుకు నా సహ విద్యార్థులైన లాభారామ్, రామ్‌లాభయ్యలతో తెగని పేచీ పెట్టుకున్నాను. మా నాన్న పట్ల పెద్దలపట్ల వ్యతిరేకోద్యమం, భగవంతుని పట్ల ప్రతిఘటన, ఇప్పుడు విపరీతమైన కోపంగా పరిణమించాయి. అందువల్ల నేను ఎవరితోనూ చెప్పుకోలేక పోయి నప్పటికీ నాలో నేనే కుమిలి పోయి, శారీరకంగా నలతగా వుందని నటిస్తూ వచ్చాను. నా నలత గురించి ఎవరితోనూ చెప్పుకోలేనంత పిచ్చిగా వుంది.

ప్రతి ఒక్కరినీ, ప్రతిపనినీ బద్ధశత్రువుగా భావిస్తూ దినచర్యలు యాంత్రికంగా చేయసాగాను.

సంతోక్‌సర్ చెరువులోనుంచి కంపుగొట్టే నురుగు మా బడికి వస్తూపోతూ వున్నపుడు నా ముక్కుపుటాలకు సోకి ఈ పట్టణమంటే రోత కలిగించాయి.

రోడ్లమీద గుంటలు, ఇరుకు సందుల్లో గోతులు, నేను కాలుజారిపడి నాగుడ్డలు పాడైపోవటానికే నని, ఆలోచించేకొద్దీ నాకనిపించింది. అప్పుడు అమ్మ నన్ను తిడితే ఈ నిర్లక్ష్యానికి కారణం తెల్ల దొరలేనని చెప్పగలగాలి.

నేనప్పుడప్పుడూ కలకండకొనే వేశ్యల వీధిలోని వ్యాపారులు ఎప్పుడూ తప్పులెన్నేవారు, క్షవరం కూడా చేసుకోని వారు. వాళ్ళు తమకు వచ్చే దినసరి లాభాలను ఎక్కువ మిఠాయిలు కొనే ధనవంతుల పిల్లల కిస్తారు కాని పేదపిల్లల కివ్వరు.

హరియావంటి జూదరులు, పోకిరిపిల్లలు జూదమాడి డబ్బు సంపాదించి తాము పోకిరి వాళ్ళమని సగర్వంగా చెప్పుకుంటూ గాలి పటాలు ఎగురవేసేందుకు ఖరీదైన దారపువుండలు కొనగలరు. మంచి గాలిపటాలన్నీ వాళ్ళవే.

మా వీధి అంచున ఉండే పండ్లవ్యాపారి దీనా, పత్రికాధిపతి సుందరసింగు, మద్యపాననిషేధకార్యకర్త గణపతిరాయి - వీళ్లంతా చిన్న పిల్లల్ని మచ్చిక చేసుకొని, వాళ్లకు తినుబండారాలు కొని పెట్టి వాళ్లను

చెడగొట్టారు అమ్మ ఈ విషయం నాకు చెప్పింది. వాళ్లు కనుసైగలు చేస్తారు తప్ప మాటాడరు. వాళ్ల వొళ్లో కూచోమని నాకు అప్పుడప్పుడు పదిపైసలు చేతిలోపెట్టేవారు. సందుల్లోకి జారుకొని, మెట్లకింద దాగుడు మూతలాడి ఈ రాక్షసులనుండి తప్పించుకొనేవాణ్ణి. అయినావాళ్ల చూపులు నన్ను వెంటాడుతూనే ఉండేవి. వీళ్లు దగ్గరకు చేర్చే చిన్నపిల్లలు వాళ్ల బారినపడే పులిపిల్లల్లా నా కనిపిస్తారు. నగరమంతా వెనుమంటల్లో చిక్కుకొని వీరినందరినీ దహించివేస్తే బాగుండుననుకొన్నాను. వాళ్లలో ఒకళ్లు ఎప్పుడో ఒకప్పుడు హఠాత్తుగా ఏ గుర్రపుబండిలోనో వచ్చి ఎవరో ఒకర్ని రామ్ బాగ్ కాలువవైపుకో, కోటబురుజుల వద్దకో ఎత్తుకెళ్తారేమో తెలియదు వాళ్ల మొద్దమొహాలను నేను మరువలేకున్నాను. వాళ్లిచ్చే డబ్బంటే ఆశమాత్రం ఉంది. వాళ్లు చేసే దోషాలేమిటో తెలుసుకొందామనుకొన్నాను.

మా హరీష్‌వలె, వేశ్యలనుగురించి, సంగీత వినోదాలలో కాలక్షేపం చేసేవారిని గూర్చి తెలుసుకోవాలనీ. నేను వెళ్లని ప్రదేశాలకు వెళ్లాలనీ, ఏదో సాహసం చేయాలనీ లోలోపల కుతూహలంగా ఉంది. అందరూ చెప్పేది నిజమైతే, అనంత, ఉత్తమ్‌సింగ్, ప్రతాప్ బాబాయిలతో కలిసి మద్యం సేవించే దేవకి పిన్నిని నేనెంతో మనసులో అధికంగా భావిస్తాను. నిత్యమూ దేవుళ్లను పూజించే అమ్మకంటె ఆమె ఎక్కువ.

లాహోరుకు తీసుకెళ్లి షేక్‌స్పియర్ పుస్తకాన్ని కొని పెట్టేందుకు అమ్మవద్ద డబ్బు లేదుకాబట్టి కిటికీలమీద అలమరాలలో నాన్న దాచి పెట్టిన పుస్తకాలుతీసి చదవసాగాను. ఉన్నవాటిల్లో బరువైనదీ, పెద్దవీ అయిన 'ఫసానా, అజార్' పుస్తకాన్ని ఎంచుకొన్నాను. ఇంతకుముందు ఆ పుస్తకం తెరిచానుగానీ చదవలేదు.

ఈ పుస్తకంలో పాత్రలు మహాకాయులు, మూర్ఖులు, జానపదుల్లా కనిపించారు. రచయిత వాడిన చాలామాటలు పెర్షియన్ భాషలో ఉండటంవల్ల నాకు బోధపడలేదు. నాకేమి అర్థంగాకపోయినప్పటికీ పెద్దపెద్ద పదాలను చదివేందుకు ఆనందపడుతూ పెద్దగా చదవసాగాను. కథాకథనం నాకు అందుబాటులో లేకపోయినప్పటికీ ఫర్వాలేదు. పాత్రలను రచయిత గేలిచేస్తున్నట్లు నాకు బోధపడింది. ప్రపంచంలోని

చాలామంది పెద్దలు వ్యర్థమైన పనులు చేసే మూర్ఖులని నాలో అనుకో వడానికి దోహదం చేసింది ఈ నవలలోని ఒక నవాబు తాను నిరుపేద అయినప్పటికీ, చాలా గొప్పవాడైనట్లు నటించసాగాడు. దుర్గంధ భూయిష్ఠమైన అమృతసర్ నగరంలోని ప్రజలందరినీ నేను గేలిచేయగలననే భావన వృద్ధి పొందింది. అది నిజానికి వాస్తవంకూడా. ఈ ఊహలతో కైపెక్కిన నాకళ్లకు వాళ్లు హుందాతనము, ధనము, హోదా కలిగిన వాళ్లులాగాక, మోటుగా ఉండి, వెధవ పనులు చేస్తూ, అంగళ్లలో తమ దిండ్లమీద, పరుపులమీద దొర్లాడుతూ ఉన్నట్లు అనిపించేది. తమవద్ద సబ్బు, పాత్రలు, గుడ్డలు కొనడానికి వచ్చిన మూర్ఖులను మోసంచేసే వాళ్లలాగా కనిపించారు. స్వార్థప్రయోజనాలను గోముఖవ్యాఘ్రాలలా దాచిపెట్టే వ్యక్తులు, క్షుద్బాధ తీరక విపరీతంగా భుజించే పూజారులు, నీచంగా, స్వల్పబుద్ధితో ఆలోచించే ప్రజలు తిరుగాడే ఈ అమృతసర్ నగరం నాలో విసుగుదలకు నిధి అయింది

నా చుట్టూవున్న అనాకారిత్వము, అసభ్యతలకు కారణాలను చూడ గలిగిన ఉన్మీలత నాలో ఉందని తెలిసి సంతోషించాను.

నేను ఆ నవల చదువుతుంటే చూసి, పాఠ్యపుస్తకాలుకాకుండా, అనవసరమైన పుస్తకాలు చదవ వద్దనీ, వృధాగా కాలక్షేపం చేస్తున్నట్లు నాన్నకు చెబుతాననీ అమ్మ మందలించింది.

నాకు కోపం వచ్చింది. నా మనసు లోలోపల అనుకొన్న మాటలు ఆమెతో అందా మనుకొన్నాను యువకులకు ఏది మంచిదో మీ పెద్దలకు తెలిసినట్లు అభినయిస్తారు మీరు చదువురాని వాళ్లయినప్పటికీ, మీరు చేసిన పనులు మేము చేయలేమని అనుకొంటారు. నేను చదచవదలచు కొన్న పుస్తకాలు నీముందు చదవకపోవచ్చు, నీవుచూడనప్పుడు మోసంగా చదువుతాను. 'నేను ఏం చేయాలో, చేయకూడదో' నీ యిష్టాయిష్టాలతో నాకు పనిలేదు!"

జీవితంపట్ల యువకుల్లో కలిగే అనురాగం, నాలో ఉరకలు వేయ సాగింది. దేవదత్త బాబాయితో కలిసి ఆడుకొంటున్నప్పుడు నాలోని రచయిత తన పాత్రలద్వారా సంఘంలోని కుళ్లును హేళనచేసినట్లు, నేను

నా చుట్టూవున్న అమృతసర్ నగరంలోని మానవుల వ్యక్తిత్వాలను అభి నయించేవాణ్ణి తన వద్దకు అతిధిలు వచ్చినప్పుడు దేవదత్త బాబాయి ఈ పాత్రల అభినయాన్ని మళ్లీ మళ్లీ చేయమని కోరేవాడు. ఆయన నాకు అధ్యాపకుడు, స్నేహితుడు, సంరక్షకుడు. నిత్యజీవితంలో వ్యర్థ జీవితాలను గడిపే వ్యక్తులు, నాచేత యిలాంటి అభినయాలు అడిగి చేయించుకొని చూడటం హాస్యాస్పదంగా కనిపించేది.

నేను చిన్నవాణ్ణి కావడము, నాకు ప్రాముఖ్యత యివ్వకపోవడము అనే విషయాలవల్ల నాలో కలిగిన కలవరము కారణంగా యిలా ప్రవ ర్తించే వాణ్ణి. ఇతర ఆరోగ్యవంతులు, బుద్ధిమంతులు అయిన పిల్లలవలె నేను అందరికంటె అధికమైనట్లు ప్రవర్తించసాగాను. వారిని గ్రుడ్డిగా అనుసరించడంగాని, వారికంటె భిన్నంగా ప్రవర్తించడంగాని నా కలవాటై పోయింది నామనసు వక్రించిన ప్రతిబింబాలను చూపే అద్దాలమహ లులా తయారైంది.

నా ఒంటరితనము, అసంతృప్తివల్ల నేను నిజానికి ఏడుస్తున్నాను పెద్దల ప్రపంచంలో ఎవరూ అంగీకరించని సత్యాన్ని నేను గుర్తు చేసు కొనేవాణ్ణి.

మా నాన్నగారు తన ఆఫీసు కుర్చీలో కూర్చుని సుబేదార్ గర్కా సింగ్‌తో మాట్లాడుతూ, యుద్ధం ప్రకటించిన తర్వాత టెలిఫోనులో కల్నల్‌తో సంభాషిస్తున్నట్లు నేను మొదట అభినయించే వాణ్ణి. ఆ సంభాషణలో భాగంగా మమ్మల్ని అమృతసర్ వెళ్ళమన్నట్లు పాత్రలను వక్రీకరించి చిత్రిస్తూ నటించే వాణ్ణి. దేవదత్త బాబాయి టేబులుకు దగ్గరగా నాకుర్చీ లాక్కుని టెలిఫోను వున్నట్లుగా భావిస్తూ ఇలా పలికేవాణ్ణి

శబ్దాలు : టింగ్..... టింగ్.... టింగ్.. .. టింగ్... .

నాన్న . యస్.సార్...... . యస్ సార్.... ... సైనికదళాల ప్రధాన కార్యాలయం నుంచి మాట్లాడుతున్నాను సార్...... యస్ సార్.....

శబ్దాలు : టింగ్....... టింగ్........ టింగ్. ...... (టెలిఫోను శబ్దము).

నాన్న : (పంజాబీలో) హలో సుబేదార్ మేజర్ సాహెబ్. ఇది మామూలు కథే....... మా హరీష్ చేసినట్లే నీకొడుకూ చేస్తాడు. నేను వాడికి పెండ్లి చెయ్యగానే కాలేజీకి వెళ్ళనని భార్యతో వేరే కాపురం పెట్టాడు. వాళ్ళు ఎంత డబ్బు సంపాదించినా ఇంకా కావాలి. వాళ్ళను పెంచి పోషించి ఆస్తి ఇచ్చిన వాళ్ళకు కనీసం కృతజ్ఞత కూడా చూపరు...... నేను పెద్ద పొరపాటు చేశాను. నా పిల్లలతో చాల చనువుగా వున్నాను. నేను ప్రభుత్వానికి విధేయంగా నడుచుకుని ప్రతిపైసా వాళ్ళకోసం కూడబెట్టాను.

సుబేదార్: నాసంగతి ఎప్పుడు ఆలోచిస్తారు. నాకు గౌరవ కేప్టెన్ హోదా వచ్చేటట్లుగా వాళ్ళతో ఇంగ్లీషులో దడబుడలుగా మాట్లాడి నాకు లల్లాపూర్‌లో భూమి ఉచితంగా ఇచ్చేటట్లు చూడకూడదూ!

నాన్న : నిజమే సుబేదార్..... మేజర్‌సాబ్....... నేను మీతో చెప్పినట్లుగా ఈ ముండమోపి ప్రభుత్వం కృతజ్ఞత లేనిది. నీవు, నేను ఏ బహుమతి లేకుండా జీవితమంతా కష్టించి పనిచేశాం. నేను యుద్ధంలో పనిచేసే జాతికి చెందని వాణ్ణి కావటంచేత ఏదో పది రూపాయలు సంపాదించాను. నేను పదవీ విరమణ చేస్తే హవిల్‌దార్ పింఛను వస్తుంది. నీకు భూమి వస్తుంది.

శబ్దాలు: టింగ్...... టింగ్....... టింగ్........ టింగ్.......

నాన్న : యస్ సార్..... యస్ సార్....... సుబేదార్ మేజర్ సాహెబ్...... సార్...... యస్ సార్...... ఒక్కక్షణం సార్.....

టింగ్....... టింగ్.......... టింగ్........

ఈ చివరి వ్యంగ్య సంభాషణ దేవదత్త బాబాయికి హర్షాన్ని కల్గించి, 'శహబాష్! ఎంతధైర్యం' అని ప్రశంసలు కురిపించే వాడు. మానాన్న తెల్లదొరలకు నల్లదొర్లకు విధేయంగా ప్రవర్తించి నడుచుకోవటం సరిగ్గా ఇదే విధంగా వుండటంవల్ల ఆయనకు బాగా నచ్చేది.

నా రెండో అభినయం మా అమ్మ తన దేవతా మందిరంలో అందరి దేవతలను ప్రార్థించటం. ముఖ్యంగా ఆగాఖాన్ దీవెనల కోసం ఆయన పటంముందు నమస్కరించటం నేను బాగా అభినయించేవాణ్ణి. అమ్మ భావాలపట్ల నాలో దాగిన ప్రత్యేక అభిమానంవల్ల ఈ చిన్న సన్నివేశం అతిస్వల్పంగా వుండేది

దైవ పీఠం ముందు నిల్చున్నట్లుగా ముకిళిత హస్తాలతో నుంచుని 'ఓ పరమేశ్వరా!' అనాదిరూపా! నేను నీకు సాష్టాంగ ప్రణామం చేస్తు న్నాను' అంటూ నా ధోవతి తీసుకుని సవినయంగా మెడకు చుట్టుకొని 'భగవదవతారమైన ఓ ఆగాఖాన్ ప్రభూ! నా బిడ్డలు పరీక్షలో ఉత్తీర్ణులయేటట్లుగా దీవించు, ఓ దేవా! నేను ప్రతిరోజూ రాత్రి నిన్ను ఆరాధిస్తూ తులసిమాలతో నన్ను చూస్తారేమోనని నిన్ను రహస్యంగా కొలుస్తాను. నీవు మొసలి అవతారంలో విదేశాల నుండి బొంబాయికి అవతరించిన దినం వరకు నేను ప్రార్థనలు చేస్తా. సముద్రంలోకి ఐదు బంగారు నాణాలు విసరుతాను. అవి నీ నోట్లోకి, గర్భంలోకి చేరుతాయి. ఓ ఆగాఖాన్ దేవా! నమస్తే! నమస్తే! నమస్తే!'

ఆ తర్వాత నేను ప్రదర్శించే సన్నివేశాలలో బజారు వీధిలోని బాబాయి అంగడి. పాత్రలన్నీ కవిత్వాలు అన్ని పాత్రలనూ నేనే నటించే వాణ్ణి.

ప్రతాప్ బాబాయ్ : రావయ్యా లల్లియా! రా.... లల్లా హరియామల్! రావయ్యా మహానుభావా!

జూదరి హరియా : (తన చేతిలోని విసనకర్రతో తాను కూర్చునే బల్ల శుభ్రంచేసి మహారాజాలాగా కూర్చుని) లల్లా ప్రతాప్ చంద్‌గారూ! సాష్టాంగ నమస్కారం ఎంత అందం.

[illegible] 'పాత సామాను అంగడి కుశల్ చంద్·
వహ్వా వహ్వా! ఏమి చెప్పగలను హరియా
నిన్ను ఆదర్శంగా తీసుకోవాలి.

[illegible] చందా అంగడికి ప్రక్క బజారులోని చౌధర్ గంగారామ్:
ఏమి అద్భుతం.

కంసాలి అనంత : ఓ లల్లిమో! హాయ్! చూడండి.

ప్రతాప్ బాబాయ్ : ఏమి అందం.

జూదరి హరియా : (అందమైన వనితను వెంబడిస్తూ) సోదరులారా! ఇప్పుడే వస్తాను......

స్వర్ణ దేవాలయానికి వెళుతున్న నూత్న వధూవరులను మరో సన్నివేశంలో అభినయించే వాణ్ణి.

చేతులతో నాతలపై పెద్ద తలపాగా ఉన్నట్లుగానూ, కంఠానికి 'టై' వున్నట్లుగానూ చేతికర్ర వున్నట్లుగానూ అభినయించేవాణ్ణి చుట్టూ కలయచూస్తూ దర్పంగా అడుగులు వేస్తూ నడిచే వాణ్ణి.

భర్త : ప్రియా! త్వరగా తెములు దేవాలయం మూసేస్తారు నువ్వు ఆలస్యం చేస్తే.

తలపై కొంగుముసుగు వేసుకుని కొద్దిగా సందుచేసుకుని అటూ యిటూ చూస్తూ ఇతరులకు తన ముఖాన్ని చూపుతూ భర్త గమనించి నపుడు ముసుగు పూర్తిగా కప్పకొని వినయంగా భర్త వెంబడి నడుస్తున్నట్లు భార్యపాత్రను చూపేవాణ్ణి.

ఆ తర్వాత పూజారి పాత్ర. పద్మాసనం వేసుకొని కళ్ళుమూసుకొని మంత్రాలు జపిస్తూ ధ్యానంగా కూర్చునేవాణ్ణి. అప్పుడప్పుడూ భక్త్యుల వైపు ఆశగా కళ్ళు తెరిచి చూసేవాణ్ణి. పులిహోర, చప్పరించి తింటున్నట్లు, పెద్దగా త్రేన్చుతూ తినేవాణ్ణి. వెంటనే వెల్లికిలా పడుకొని నిద్ర కుపక్రమించి గురకలు పెట్టేవాణ్ణి.

భక్తుడు : స్వామీ! నాకు పూజ చేసి పెట్టండి. మా అబ్బాయి జ్వరంతో వున్నాడు.

పూజారి: ఏంటీ! నీకొడుక్కు పెండ్లి చేస్తున్నావా! ముహూర్తం పెట్టిస్తానుండు.

భక్తుడు : లేదు స్వామీ. మా వాడికి బాగలేదు.

పూజారి: లేచి (వ్రేలాడుతున్న గంటను మ్రోగించి నెమ్మదిగా వెళ్ళి

భగవంతునికి పూజ చేసి, నమస్కరించి) కుర్రవాడికి ఆరోగ్యం ప్రసాదించు స్వామీ! త్వరగా ఆరోగ్యవంతుణ్ణి చేయి. వాళ్ళ అమ్మ దేవాలయానికి గోదానం చేస్తుంది.

ఆతర్వాత సన్నివేశంలో రైతు వేషం.

మొదటి ఘట్టం

చేతులో పొడవాటి కర్ర నాగలిలా భుజాన వేసుకుని వంగి నడుస్తూ బజారులో ప్రతి వస్తువునూ చూడటానికి నిలుస్తూ ముఖ్యంగా గ్రామఫోను వద్ద నుంచొనేవాణ్ణి. ఆ యంత్రం గురించి తెలుసుకొనేందుకు ప్రయత్నిస్తూ నా కర్రతో దాన్ని పొడిచి పాడుచేశాను

రెండో ఘట్టం

రైతుగా దేవాలయంలోకి అంగలు వేసుకొంటూ ప్రవేశించి, చేతులెత్తి నమస్కరించి - ప్రార్థిస్తూ

రైతు : ఓ గూరూ! నేను నీ మొక్కుబడి చెల్లించడానికి వచ్చాను. ఈ సంవత్సరం పంట అంతా అమ్మి, కుదువబెట్టిన భూమి విడిపించుకో గలిగితే నీ గుడికివచ్చి మొక్కు చెల్లిస్తాను. ప్రతి ఏటా యింతే!

మూడో ఘట్టం. రైతుగా మట్టిపాత్రలో అధికంగా మద్యంసేవిస్తూ, తాగుబోతులా మాట్లాడుతూ, ఒక క్షణం ఆగి, మురికి కాలువలో మూతిపెట్టి మురికినీరు తాగేవాణ్ణి.

రైతు : ఆహా! ఏమి అమృతం! ఎంత మధురం!

ఆ తర్వాత ఉపాధ్యాయుని పాత్ర. అధికభాగం బిషన్ సింగు మేష్టారు పాత్రను అభినయించేవాణ్ణి. ఆయనను గురించిన వాస్తవాలు నాకు,నా ప్రేక్షకులకు బాగా తెలుసుగాబట్టి, అది సులభం.

ఊహాకల్పితమైన వస్త్రాలు ధరించి, చేతి కర్రతో అంతా చదును చేస్తూ, అందరినీ కొడుతూ, బూతులు తిడుతూ మాట్లాడేవాణ్ణి.

రెండు నిముషాల తర్వాత తలపైలేని తలపాగాను పెట్టుకోబోతు

స్టాట్లు నటించేవాణ్ణి. అది అందరికీ సంతోషం కలిగించేది.

తెల్లదొరల వేషం నేను వేయడానికి నాకు స్ఫూర్తి నిచ్చింది ముగ్గురు — రైల్వేస్టేషనులో పనిచేసే టోమీన్, స్కూళ్ళ యినస్పెక్టరు మెర్సిడన్, ఇస్లామియా పాఠశాల ప్రధానోపాధ్యాయుడు మెర్కాడో. ఈ సన్నివేశంలో నాచేతిలో పెన్సిలును చుట్టలా పెట్టుకునేవాణ్ణి. తలపై టోపీ, కిర్రుమనే బూట్లు, రైల్వే స్టేషన్లో కూలీ యీ సన్నివేశానికి అవసరం.

తెల్లదొర : నల్లవాడా! నేలమీద పడకుండా పట్టుకో!

కూలీ : చిత్తం దొరా!

తెల్లదొర :ఒరే! వెధవా! పెట్టెలో గాజుసామాను ఉంది. జాగ్రత్త!

కూలీ : (బరువు మోయలేక తలపై ట్రంకుపెట్టి మోయలేక పడవేయును)

దొర : (కర్రతో కొడుతూ) దొంగ వెధవా! నల్లవాడా! ఎందుకూ పనికిరాని వాళ్ళు.

అన్నిటిలోకి ఆహ్లాదాన్ని కలిగించే సన్నివేశం మాయాజాలం ప్రదర్శించే ఘట్టం. మా బడికి పక్కన 'మదారి' తన కర్ర ఆడిస్తూ ఎలుగుబంటిని నాట్యం చేయించడం. అతను యిలా పాడేవాడు

ఓహో! బాలూ! ఓహో నృత్యం! ఓహో నృత్యం!
ఈ మాయాజాల నృత్యం, నృత్యం.

మాయాజాలం ఎక్కువయ్యే కొద్దీ నాట్యం ఎక్కువయ్యేది.

జీవిత సత్యం! ఓహో బాలూ! ఇదే ఇదే
నృత్యంచేసి చూపించు! ఓహో బాలూ!
జీవన్మరణాల ప్రదర్శన ఓహో బాలూ!
నృత్యప్రదర్శనలో మిళితం చెయి! బాలూ!

నా ఊహల బలంవల్ల, ఉత్సాహవంతమైన ప్రదర్శనవల్ల ఒక్కొక్కసారి నేను అభినయించే వ్యక్తుల లక్షణాలు అచ్చుగుద్దినట్లుండేవి. అలాకాని పక్షంలో కేవలం కొన్ని కదలికలు మాత్రం, ఏవిధమైన శైలి

లేకుండా ప్రదర్శించి తప్పించుకొనేవాణ్ణి. సన్నివేశాలకు నేను మంచి భాషను, మొరటుతనాన్ని ఆపాదించడంవల్ల, ముందుగా తగిన ప్రయత్నము, పరిపక్వత లేకపోయినా కధ దొర్లిపొయేది.

చిన్నపిల్లవాడిలా అప్రయత్నంగా నవ్వుతూ దేవదత్త బాబాయి నాకు ప్రోత్సాహం యిచ్చేవాడు. ఇరుగు పొరుగులవాళ్లు నా కళానైపుణ్యాన్ని మెచ్చుకొనే వాళ్లు. లేకుంటే వాళ్లస్వభావాలను నేను నటిస్తానేమోనని భయపడి అలా చేసేవారు. ఆ విధంగా వారిమధ్య, నామధ్య దూరం పెరిగింది ఆ నటన అయిపోయిన తర్వాత నేనుమళ్లీ నా ఒంటరితనపు ఖైదీ నయ్యేవాణ్ణి. అలా నా ఊహాలోకంలో తిరుగాడుతూ ఉండేవాణ్ణి. ఈ విధమైన సంతోషం నేను పాఠ్యపుస్తకాలు చదవడానికి బాగా దోహదం చేసేది. త్వరలో జరగబోయే ఐదో తరగతి పరీక్షలకు తయారుగావడానికి అది బాగా తోడ్పడింది. నేను కల్పించుకొన్న స్వాప్నిక జగత్తు నిత్యజీవితంలోని వాస్తవాలకు దారి చూపేది.

ఒకరోజు పరీక్ష అయిన తర్వాత శివరామ్‌దాస్ మేష్టారు నన్ను శ్రీమతి హేమ రచించిన 'అంధ బాలుడు' పద్యాన్ని మా ఐదో తరగతి విద్యార్థులకు వినిపించమన్నారు.

నేను ఆ పద్యాన్ని నాకు దేవదత్త బాబాయి నేర్పించిన మంద్రస్వరంలో గంభీరంగా చదివాను. పాత రాగాలు తీస్తూ పాడకుండా నేనలా చదవడం మేష్టారుకు బాగా నచ్చింది. దేవదత్త బాబాయి నేను ప్రజల్ని అనుకరించడాన్ని ప్రోత్సహించినప్పటికీ, నేను అవలంబించే పద్ధతి ప్రజలు నవ్వుకోడానికి వీలుగా వుందిగాని, కళ్లనీళ్లు తెప్పించడం లేదు. `పద్యపరనానికి అయన నాకు మనసు పొరల్లోంచి ఆవేదనతో కూడిన పరనాన్ని చెప్పారు. నేను మా బడిలో ఆరోజు 'అంధ బాలుడు' పద్యపరన సందర్భంగా ఆ పద్ధతి అవలంబించాను. నా కంఠం మంద్రమై, గద్గదికమైనది. ఆఖరి వరసల్లో కూచొన్న విద్యార్థులకది వినిపించక 'బిగ్గరగా' అని అరవసాగారు. మధ్యలో వాళ్లలా అరవడంతో నేను భయపడకుండా అసహనంగా చూసి మళ్లీ మొదలెట్టాను.

నా కంఠం మరీ సన్నబడింది. విద్యార్థులు బల్లలు చరచడం మొద

లెట్టారు. శివరామ్ దాస్ మేష్టారు నన్ను ప్రత్యేకంగా అభిమానించడం, పద్యాలు వల్లించమనడం వారి అసూయకు గురి అయింది. నేను సిగ్గరగా పదాలను ఉచ్చరించి, కథన శైలిని వదలిపెట్టాను

శివరామ్‌దాస్ మేష్టారు నన్ను బుజ్జగించి కూచోమని, నా ప్రత్యర్థి యిన జ్ఞానచంద్రను ఆపద్యం చదవమని అడిగారు.

ఆ విధంగా నన్ను కించపరచడంవల్ల నాకంట్లో నీళ్లు తిరిగాయి శ్రీమతి హేమ పద్యంలో నాయకుడిలా దుఃఖంతో ఒంటరివాడినై పోయి నట్లు నిస్సహాయంగా తపుడుకో సాగాను. నేను ఇంతకు ముందువలె సంబాళించుకోలేకపోయాను. తుంటరి పిల్లవాడిలా, హుషారుగా నన్ను నేను పోల్చుకోలేకపోయాను. అందుకు బదులు పిల్లలందరికీ హాస్యాస్పద మైనట్లు భావించాను.

ఆక్షణంలో నేను కూచొన్న చోటునుంచి సమయస్ఫూర్తిగా లేచి, నా కుడిచేతి వేలు మేష్టారుకు చూపించి—

'వొంటికి పోయిరావాలి మేష్టారు!' అన్నాను.

'సరే వెళ్లు' ముసిముసినవ్వు నవ్వుతూ, తలవూపి మేష్టారు నాకు అనుమతి యిచ్చారు.

మేము యింటికి వెళ్లగానే, అమ్మ మాదగ్గరకు నెమ్మదిగా వచ్చి—

"అబ్బాయిలూ! మీనాన్నగారు రైల్వేటిక్కెట్లు యిచ్చి సిపాయిని పంపారు. నన్ను, శివను చిత్రాల్‌లోని మాలాఖండ కోటకు తీసుక రమ్మని చెప్పారు.... నేను వెళ్లి పండిత రామానాధ్‌ను కలవాలి. మీరు లూధియానాలో హరీష్ వద్దకు వెళ్తే, నేను, శివ మాలాఖండ్ వెళ్ల వచ్చు . . "

ఈ వార్త వినేసరికి గణేశ్ తెల్లబారిన మొహం వివర్ణమైంది. నేను ఈ వొత్తిడి తప్పుకొని నిలుచొన్నాను

ఈ సంఘటన పట్ల నేను నిర్లిప్తంగా ఉండి, ఏమి చేయలేక పోయాను. నేను అమ్మకు దూరం కావడం యిష్టం లేదు

కాని, ఈ అమృతసర్ యిరుకు సందుల్లోను, గొందుల్లోను ఉండడానికి యిష్టం లేదు.

మమ్మల్నిద్దర్నీ పొదువుకొని అమ్మ ముద్దాడింది. ఆమె ఆప్యాయతకు నేను ద్రోహదం చేసినా, నా మనసులో మాత్రం కొత్త జీవితంలో సాహసానికి, లూథియానాలో హరీష్‌తో సాంగత్యాన్ని కోరుకున్నాను.

నాన్నగారు పండిత రామానాథ్‌గారికి ప్రత్యేకంగా ఉత్తరం వ్రాసి మేము ఈమధ్య వ్రాసిన ఐదవ తరగతి సంవత్సర పరీక్షల ఫలితాలు చెప్పడానికి వీలుకల్పించారు. ఫలితాలు ప్రకటించడానికి ముందే మాకు ఫలితాలు తెలిశాయి. హరీష్ దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది. లూథియానా లోని ప్రభుత్వ పాఠశాల హెడ్మాష్టరు ఖ్వాజా అబ్దుల్ హమీద్, ఎం.ఏ గారితో చూచాయగా ప్రస్తావించాననీ, ఆయన మేము లూథియానా వెళ్ళగానే, మాకు ఆరో తరగతిలో ప్రవేశం యిప్పిస్తానని చెప్పాడనీ వ్రాశాడు.

దేవుళ్ళందరికీ నేను కృతజ్ఞతలు చెప్పాను. ఈ విధమైన మార్పు రావడానికి నాలోని విపరీత స్వభావము, స్వాస్థ్యస్థితి కృతజ్ఞత పలికాయి.

లూథియానాలోని కొత్త మొఖాలు, కొత్త స్థలాల గూర్చిన ఆలోచనలు నాలో పూర్తి ఉత్సాహాన్ని కలిగించాయి. నాలో ఉత్సాహభరితమైన శక్తి తిరిగి ప్రవేశించింది.

అమ్మకు దూరంగా వెళ్ళడానికి కొద్దిరోజులముందు నుండి నేను అనారోగ్యంగాను, ఆమెకు దూరమౌతున్నాననే విపరీత భయంతోనూ, వుండిపోయాను. అందువల్ల నన్ను పాతకాలపు భయంకర జ్ఞాపకాలు, పీడకలలూ వెంటాడసాగాయి. పెద్ద పరుపుపై, పడుకొని ఇతరులకు తెలియకుండా ఏడవసాగాను. ప్రతాప్ బాబాయినిగాని, దేవకినిగాని దేవదత్త బాబాయినిగాని, పారునిగాని చూడదలచుకోలేదు. వారివద్ద వీడ్కోలు తీసుకోవడం చాల కష్టం.

మా ప్రయాణం రోజు రానే వచ్చింది. అమ్మ మాకిచ్చిన కొత్త బట్టలు వేసుకుని సంతోషంగా కనిపించడానికి ప్రయత్నించాను. చిన్నా, పెద్దా అందరి దగ్గరకు వినయంగా వెళ్ళి 'మీకు సాష్టాంగ నమస్కా

రాలు' అని చెప్పివచ్చాను. నాలో నేను పళ్ళు పటపట కొరుకుతూ కథా నాయకుడిలా నటిస్తూ శివకు నాపాత పెన్సిళ్ళు, రంగు కుంచెలూ ఇచ్చాను. అమ్మ చెప్పినదంతా విధేయంగా విన్నాము. ఆమె వీడ్కోలు సందేశంలో లూధియానాలో ద్రౌపదివద్ద నేనెలా నడుచుకొనవలసింది చెప్పిన విషయాలు శ్రద్ధగా విన్నాను. నా నుదుటిపై ముద్దు పెట్టుకొని ఆమె వీడ్కోలు చెప్పినపుడు ముఖంపై చిరునవ్వు చిందించాను.

నేను దేవకిని చూడటానికి వెళ్ళినపుడు ఆవిడ నన్ను పొదువుకొని ఏడవసాగినపుడు నాకళ్ళల్లో నీళ్ళు తిరిగి బుగ్గలపై రాలి నేను పక్కవాళ్ళు నన్ను లాగేంతవరకు వెక్కిళ్ళు పెట్టి ఏడ్చాను... .

* * *

# రెండో భాగం

# చెరసాల

‘ఏకాంతం.....విశాలాంతర్గత ఏకాంతం...’

‘రిల్కే’

‘నా దుఃఖాశ్వాసిత రేఖాచిత్రిత
హస్త లిఖిత ప్రతిజ్ఞ
కాలగమనాన్ని అధిగమిస్తుంది
నమ్మకమనే కాలం.’

‘అమృతా ప్రీతం’

# 1

రెండేళ్ళ క్రితం నౌషెరా కంటోన్మెంటు నుంచి అమృతసర్ నగరానికి ప్రయాణం చేసినపుడు నేనింకా పిల్లవాణ్ణి కాదని 'బుల్లీ' అని పిలవనవసరం లేదని గుర్తించి నట్లే ఇప్పుడు అమృతసర్ నగరంనుంచి లూధియానాకు ప్రయాణం చేసినపుడు నేను బాల్యత్వాన్ని వదలినట్లు తెలుసుకున్నాను. రైలు మధ్యపంజాబ్ ప్రాంతాల్లో బియాస్, సట్లెజ్ నదులమధ్య నయనానందకరమూ, విశాలమూ, అయిన పొలాల మధ్య నడుస్తున్నపుడు రైలురాకపోకలను గురించిన గొడవలో మునిగి పోయాను. 'జీవన గమనం అగమ్య గోచరం' అనే అమ్మ మాటలు నాకు అర్థం తెలియకుండానే తరచూ వల్లించసాగాను. నాకు కుడివైపు సారవంత మైన మైదానాలు, రైలు పెట్టెకు మరోవైపు పంజాబ్ హిమాలయాలు, శివాలిక్ కొండలు రేఖామాత్రంగా కనిపించాయి. నేను కూచుని వివిధ మార్గాలవైపు పారిపోయే పిచ్చుకల్లా వచ్చే ఆలోచనలను సమీకరించే వాణ్ణి.

గత సంవత్సరమంతా జరిగిన సంఘటనల ప్రభావం రకరకాల క్లిష్ట మైన సమస్యలకు దారి తీసేవి. బహిరంగమైన నావ్యక్తిత్వానికి వెనుక నాలోలోపలి అనుమానాలు, భయాలు, వూహలు, ప్రశ్నలూ, అణచి వేసుకునే వాణ్ణి. మా కుటుంబ జీవితంలో కలిగే ఉద్రేకాలను జాగ్ర త్తగా అవగాహన చేసుకునే వాణ్ణి. పెద్దవాళ్ళ కబుర్లవల్ల, యాదృచ్ఛికంగా వినపడ్డ మాటల వల్ల నేను విన్న సమాచారాన్ని యధాతధంగా అంగీక రించేవాణ్ణి కాదు.

ఉదాహరణకు అమ్మ ఆరాధించే భగవంతుడు, ఆయన అనేక అవ తారాలు నాకర్థంకాని ప్రశ్న. ఆగాఖాన్, గురునానక్, సైన్‌లోక్, కృష్ణ భగవానుడు, ఇంద్రుడు, శివుడు, బ్రహ్మ - వీరందరిలో ఎవరు మహో

న్నతులు. పెద్దల వాదనలు నాప్రశ్నలకు సమాధానం ఇచ్చేవి కావు.

నాలో అంతర్మథనం వల్ల పెద్ద దేవుడు అనేమాట లేదని, ప్రజలు మాట్లాడేది వట్టిదని అనుమానించాను.

మా పరిసరాల్లో జరిగిన మరణాలు, ముఖ్యంగా నా కిష్టమైన సోదరి కౌసల్యమరణం — నాకు కూడా మృత్యువు దాపురిస్తుందేమో అన్న భయాన్ని కలిగించింది. జీవిత మంటే ఏమిటి? మరణించిన తర్వాత ఏమవుతుంది? అన్న సమస్యలు తల ఎత్తాయి. మరణమనే భయంకర వాస్తవానికి ఎన్నో చిక్కు సమస్యలున్నాయి. నిజానికి ఎవ రైనా గాల్లో తిరుగుతూ దయ్యంగా వుంటారా? మరొకర్ని దయ్యం ఆవహిస్తుందా? అమ్మ మాటల ప్రకారం శుభాశుభ కార్యాల ఫలితంగా జన్మ, పునర్జన్మ సంభవించటం నిజమేనా? నాచిన్ని మనస్సులో దయ్యా లను గూర్చిన భయం పాతుకుపోయి దయ్యాలున్నాయనే నమ్మకానికి వచ్చాను. నా మనస్సులో శరీరంలో స్తబ్దత ఏర్పడి భవిష్యత్ జీవి తాన్ని గురించిన మాయ అర్థంకాలేదు. మనకు కనిపించ కుండా గాలిలో ప్రాణులు తిరుగాడుతారన్న మాట నచ్చలేదు. నాకేం జరుగుతోంది, నా అనారోగ్యమేమిటి?

చాలామంది జీవితంలో ఈ సమస్యలను యథాతథంగా స్వీకరించి నట్లే వాళ్ళు ఈ ప్రశ్నలను ఇంతకుముందే వేసుకుని వుండాలి లేదా వారికీ ప్రశ్నలే ఉత్పన్నమై వుండవు. నేను రహస్యంగా ఈ ప్రశ్నలను ఉత్పన్నం చేసి నాలో నే నొక్కడినే స్వతస్సిద్ధమైన జిజ్ఞాసువుగా భావిం చసాగాను. ఎమ్.ఏ పరీక్షలో ఇంగ్లీషు ప్రొఫెసర్లు తన ఆలోచనలకు అనూయపడి ప్రతి సంవత్సరం పరీక్షల్లో తప్పించి నప్పటికీ దేవదత్త బాబాయి నిజమైన మేధావి. ఆయనకు ఇలాంటి సందేహాలే వస్తూవుం టాయి.

విప్లవం అనేది మరొకపెద్ద సమస్య. మా నాన్నగారు తప్పని సరిగా దేశానికి విధేయులు కారు. ప్రతాప్ బాబాయి దేవదత్త, భగవాన్ దత్త బాబాయిలు భావించినట్లుగా భారతదేశానికి స్వాతంత్ర్యం యివ్వని బ్రిటీష్ వారివి ఆయన కొలుస్తున్నాడు. "అవిశ్వాసత" అనే మాటను

నేను కథా నాయకుడుగా భావించిన మాతండ్రిగారి గురించి ఉచ్చరించ టానికి సాహసించక పోయినప్పటికీ నా నుంచి అమ్మను దూరం చేసిన ఆయనకు బ్రిటీష్ వారితో వున్న సంబంధాలు దేశద్రోహకరమైనవని చెప్పగలను.

అదేవిధంగా నాపట్ల పక్షపాతం చూపించే అమ్మను నేను ప్రేమిం చినప్పటికీ మూఢాచారాలతో సతమతమయ్యే ఆమెను త్రోసిపుచ్చాను. ఆమెకు నచ్చని వారిని గురించి ఆమె కక్ష బూనటం నాకు సరిపడదు. కోకోకిళ్ళీ మీద ఆమె కోడిపుంజులా కలహానికి వెళ్ళటం నేను క్షమించ గల్గినా, దేవకి పిన్ని పట్ల అనుమానాలను నేను అంగీకరించ లేను. హరీష్‌కు పెండ్లి చేయటానికి ఆమె స్వయంగా చొరవ తీసుకున్నట్లు నేను విన్నాను. అతను వైద్యశాస్త్రం చదవటానికి వెళతానన్నపుడు ఆమె సణుగుడు, అతని భార్య ద్రౌపది పట్ల ఆమె కక్ష నాకు సహేతుకంగా కనిపించలేదు. మా వదినకు పిల్లలు లేకపోతే ఆవిడను తన పుట్టింటికి పంపి హరీష్‌కు మరొక పెండ్లి చేసి వుండాల్సింది. పిల్లలుకనడం అంటే ఏమిటో నాకు తెలీదు. పెషావర్ లోని మాయింటి దేవుడి వరంమీద నన్ను చూశారనీ చెప్పగా విన్నాను. అమ్మకు భగవంతుడు వరమిచ్చి నన్ను అక్కడ పెట్టాడని చెప్తారు. కాబట్టి ద్రౌపది ఆ పరమాత్మను ప్రార్థించి కొడుకో కూతురో కావాలని కోరుకుంటే వాళ్ళింట్లో ఎక్కడో ఆమెకు కనిపిస్తారు. ఇది జరగలేదు, ఆమె కుటుంబం ఆరాధించే ఆగా ఖాన్ భగవంతునికి కోపం తెప్పించాడు కాబట్టి పిల్లలు కలగలేదు. అమ్మ తరచూ ద్రౌపదిని తిట్టడం అర్థరహితం.

హరీష్ లూధియానాలో వేశ్యలయిళ్లకు తరచు వెళ్లడం, హార్మో నియం నేర్చుకోవడం, తక్కువజాతి పాటగాళ్లలా దేశదిమ్మరిగా తిరగడం, నాట్యకత్తెలతో తైతక్కలాడటం చేస్తున్నాడని ద్రౌపది ఫిర్యాదు చేసింది. ఆమెకు సరిపోయినప్పుడు అమ్మ ఈ ఆరోపణలను ఖండితంగా అడిగేది. ప్రేమ, అభిమానం అనేవి ఉంటాయనే విషయం ఆమెకు తెలియవు. కౌసల్యపట్ల నాకుండే అభిమానము, దేవకిపిన్ని పట్ల ప్రేమ, తాము ప్రేమించే వ్యక్తుల సాన్నిధ్యంలో ఉన్నప్పుడు కలిగే అనురాగం ఆమెకు తెలియవు. ఈ సౌఖ్యం నిషిద్ధమైనప్పటికీ కోరదగినదే! వేశ్యలపట్ల హరీ

ష్‌కు యిష్టముంటే ఏమి? నేను చదివిన ఉర్దూ కవిత్వంలో అంతా ప్రేమికుల గాఢాలింగన సౌఖ్యాని పొందగలిగే భాగ్యం గురించే! దేవకి నుండి దూరం అయ్యాననే బాధ చెప్పరానంత దుఃఖాన్ని కలిగిస్తోంది. నాలో ఏదో వెలితి కనిపిస్తోంది. వెనకనుండి దొంగచాటుగా వెళ్లి నేనింక ఎవర్ని ఆలింగనం చేసుకోగలను. నేను ముద్దుపెట్టినా, నాముద్దులుకో రేవారెవరున్నారు? 'అనగనగా ఒకరాజు....' అని మొదలెట్టి కథ లెవరు చెబుతారు? కొన్ని క్షణాలపాటు, ఏకాంతంగా, ఆధార రహితంగా ఈ ప్రపంచంలో ఉంటున్నట్లు భావించసాగాను.....

హరీష్ మాకోసం లూధియానా రైల్వే ప్లాట్‌ఫారంపై ఎదురుచూ స్తున్నప్పుడు, నాకతనిపట్ల సంపూర్ణానురాగం, ఆరాధనాభావం కలిగాయి. అతను వేశ్యాసంపర్కంకోరడం నిజమైనా ఆ కథలు నాకు రుచిం చాయి. ఖాకీ దుస్తులు ధరించి, జోధ్‌పూర్‌శైలిలో జాకెట్ వేసుకొని, తలపాగా, దానిపై పరాన్‌శైలిలో తుర్రా, బూట్లు ధరించివచ్చిన అతను నాకంటికి యోధుడులా కనిపించి, అతనిపై షక్షపాత బుద్ధి కలిగింది.

సంప్రదాయ పద్ధతిలో అన్నయ్య తమ్ముళ్లను నుదుటిపై తట్టి ఆశీ ర్వదించినట్లు కాకుండా, హరీష్ నాకు, గణేశ్‌కు కరచాలనం చేశాడు. నన్ను బడికివెళ్లే యువకుడిలా యితరులు భావిస్తున్నందుకు నాకెంతో ఆనందం వేసింది. హిందూస్తానీ వాడుక భాషలో అతను వాడే పదాలు, నేను చదివిన ఉర్దూ కవిత్వంలో విన్నవి గావడం వల్ల హరీష్ నా హృదయంలో ఆరాధ్యుడయ్యాడు.

మా అన్నయ్యను నా ఆత్మీయుడైన సహచరుడుగా భావించాలని అనుకొంటున్న మరుక్షణంలో, అతను మాతో అన్నమాటలు నాలో నిరాశ కలిగించాయి.

'మీ వదిన నా మీద కోపంగా ఉంది. మీ రావిడపట్ల గౌరవంగా ఉండండి'

చేతులకు బేడీలు తగిలించుకొని, కాళ్లు నెమ్మదిగా లాగుకొంటూ గేటువైపుగా నడచి 'లూధియానా సెంట్రల్‌జైలు'కు తీసుకెళ్లబడుతున్న ఖైదీలను చూసినప్పుడు నాకు మరింత విచారం కలిగింది. ఖైదీల

దుస్తులు వేసుకొని తోటపనిచేస్తున్న కొందరు ఖైదీలు కొత్తవారిని ఒక క్షణం చూసి మళ్లీ తలలు వంచుకొని తమపనిలో నిమగ్నమయ్యారు. వాళ్ల మీద వార్డెను అజమాయిషీ చేస్తున్నాడు. ఆఫీసర్ల యిళ్లకు పైన, ముస్లింల శ్మశానవాటిక పక్క విరిగిన మట్టిగోడలతో జైలు అధ్వాన్నంగా ఉంది. నేను కూడా చెరసాలలోకి వెళ్తున్నట్లు భావనకలిగింది. బాధాతప్తజనాలకు నా దయార్ద్ర భావాలను వెంటనే వంచిపెట్టాను.

మేము రైలుపెట్టెలోంచి కిందికి దిగగానే, చలికాలపు మంచు దట్టంగా వ్యాపించింది. జైలుగేట్ల ముందు రక్షకభటుడు కాపలా గాస్తున్నాడు.

జైలు తోటకు, క్వార్టర్లకు మధ్య నడుస్తున్నప్పుడు— " 'సాష్టాంగ నమస్కారం' అని మీవదినెకు చెప్పండి" అన్నాడు హరీష్.

మేము సన్న సందులోగుండా యింటిలోకి వెళ్లే సమయానికి ద్రౌపది వంటగదిముందు కుండలో పాలను కవ్వంతో చిలుకుతోంది.

మేము వందనాలు ముకుళితహస్తాలతో చెప్పాము. గణేశ్ మరింత గట్టిగా చెప్పాడు.

'చిరంజీవి' అని గొణుక్కుంటూ, ఆమె తన ప్రపంచంలో తాను మునిగిపోయింది. ఆమె తల్లి చనిపోయిందేమో నన్నంత దుఃఖంలో ఉన్నట్లు దిగులు మొగంతో ఉంది.

మేము సందులో నాపరాతిపై మొహాలు కడుక్కొన్న తర్వాత, ఆమె తన ప్రత్యేకమైన అనునాసిక స్వరంతో —

'కృష్ణా! నువు మాంసం తింటావు గదూ.... నువు మీ అన్నతో బాటు ఆ వంటగది బయట చాపపై కూర్చో! గణేశ్ నువు శాఖాహారివి గదా! నువు వంట గదిలో నాతోకూచో.....'

'రా.రా. నాతోకూచో!' అని హరీష్ ఉత్సాహంగా పిలిచాడు. నేనేదో అస్పృశ్యుడినైనట్లు వదినె భావించడమనే అవమానాన్ని కప్పిపుస్తూ..... 'లూధియానా మాంసం ఎంత అద్భుతంగా ఉందో చూశావా!' అన్నాడు

ద్రౌపది మాంసం ఎందుకు తినదో నా కాశ్చర్యంగా ఉంది. ఆమె ఆగాఖాన్ శిష్యురాలైతే, ఆయన మాంస భక్షకుడు కాబట్టి, ఈమె కూడా తినాలి. హిందూమతాన్ని అనుసరిస్తే, ఆమె మగవాళ్లకు మాంసం వండిపెట్టి, తాను తినదు.. కాని మమ్మల్ని కడజాతివారుగా చూడరాదు.

ఈ ఆలోచనలతో నా కనుగొలకుల్లో నీళ్లు నిలిచిపోయాయి. నా అహం దెబ్బతిన్నది. మాంసం బాగా రుచికరంగా ఉన్నా, నాన్న అమృతసర్‌లో మమ్మల్ని వదలివెళ్లిన ఏకాంతంకన్నా, యిక్కడ ఒంటరితనం ఎక్కువగా అనిపించిది.

మాకు ప్రత్యేకంగా పరుపులు వచ్చేవరకు, నేను హరీష్ వద్ద, ద్రౌపది వద్ద గణేశ్ పడుకోవాలని చెప్పారు.

ప్రయాణ బడలికవల్ల అలసిపోయి, మాకు జరిగిన స్వాగతానికి బయటకు శబ్దం వినిపించకుండా ఏడ్చాను.

తెల్లవారగానే, నేను అమ్మదగ్గరకు అమృతసర్ వెళ్లిపోతాననీ, మాలాఖండ్‌లో అమ్మ, నాన్నల దగ్గరకైనా వెళ్తాననీ చెప్పదలచుకొన్నాను. 'టీ తీసుకో' అంటూ ద్రౌపది తెల్లవారి లేపింది. ఆంగ్ల సంప్రదాయంగా టీ, బిస్కత్తులు టేబుల్‌మీద ఉన్నాయి. హరీష్, గణేశ్ అప్పటికే వాటి ముందు కూచొని ఉన్నారు. ఆంగ్లేయ సంప్రదాయంలో మాకు 'టీ' యివ్వడం చూసి, మేము రోజూతినే రొట్టెలకంటె ఘనమైన పద్ధతులు సహాయ జైలర్‌గా పనిచేస్తున్న హరీష్ యింట్లో ఉంటాయని భావించాను. నాలో కుర్రతనపు ఊహాలోకాల పరిధి ప్రభావమది. నేను ఎన్నో ప్రశ్నలు వేశాను. మాలాఖండ్ నుండి నాన్న ఆఫీసర్ల మెస్ నుండి ఏమేమి తెచ్చాడో అడిగాను. రోజువారీ దినచర్య నాకు మరింత ఉత్సాహాన్నిచ్చింది. ఆ ముందురోజు సాయంకాలం జరిగిన సంఘటన తాలూకు ఏకాంతంనుండి దూరం కాసాగాను. ద్రౌపది కూడా మొట్టమొదటి సారిగా మాపట్ల కలిగిన భావాలకు దూరమై, గణేశ్‌ను, ప్రత్యేకించి నన్ను తన జీవితంలో భాగంగా చేసుకొంది. నావైపు చిరునవ్వు చిందిస్తూ అంది:

'నేను నూత్న వధువుగా మీ యింట్లో అడుగుపెట్టినపుడు నీవు మురిపెపు ముద్దు బిడ్డవు. నా వొడిలో ఎత్తుకొన్నాను. గుర్తుందా? ఆ

తర్వాత నువు అల్లరి పిల్లవాడివైనావని విన్నాను.' ఆవిడ ఆఖరి మాటల్లో కరకుదనం లెక్కపెట్టకుండా ఆమెవైపు ఆప్యాయంగా చూశాను. ఆవిడ చామనఛాయరంగుకు సూర్యోదయకాంతి మరింత అందాన్ని సమకూర్చింది. గుండ్రటి ముఖం, చిన్న గుండ్రటి కళ్లు ఆమె ప్రత్యేకత!

మేము యింట్లో ఉండే వస్తువులు పరిశీలనగా చూస్తున్నంతలో, బయట తలుపుతట్టి ఒక ఖైదీ లోపలికి వచ్చాడు. ముతకగుడ్డలతో చేసిన దుస్తులు వేసుకొని, తలపై టోపీపెట్టుకొని ఎడమకాలికి యినపగొలుసు తగిలించుకొని వచ్చాడు. అతను తన కాళ్లు గుడ్డతో కట్టుకొని ఉన్నాడు. హరీష్‌కు వంగి నమస్కరించి, భూమి తగిలేలా అభివందనం చేసి, ద్రౌపది వైపు కన్నెత్తి కూడా చూడకుండా, వంటగదిలోకి వెళ్లి కుండలు, బిందెలు తీసుకొని నీళ్లు నింపడానికి వెళ్లాడు. ఖైదీని మొదటిసారిగా చూడటం నాకు వింతగా ఉంది. ప్రతి ఖైదీ దొంగతనం చేయడంవల్ల జైలులో ఉంటాడని నా అభిప్రాయం. అందువల్ల వారితో జాగ్రత్తగా ఉండాలి. కాని యితడు ఎంతో వినయవిధేయతలు కలిగి ఉన్నాడు. చూడటానికి ఖైదీ దుస్తులవల్ల మోటుగా కనిపిస్తున్నాడు. నాకు ఆశ్చర్యం వేసింది.

'ఇతనేం దొంగిలించాడని జైలులో వేశారు' అన్నాను అతడు బయటికి వెళ్లగానే హరీష్‌తో.

'ప్రతి ఖైదీ దొంగకాదు. చిలిపిగా మాట్లాడకు' అన్నాడు సమాధానంగా గణేశ్.

'పసితనంలే— అతని పేరు హరిదేవ్. అతనేమీ దొంగిలించ లేదు. వడ్డీ వ్యాపారివద్ద అతను అప్పుతీసుకొని వడ్డీ తీర్చలేదు. ఆడబ్బు కట్టనందుకు 6 నెలలు జైలు శిక్ష అనుభవిస్తున్నాడు. ఇక్కడ చాలామంది ఖైదీలు రైతులు. ఇలాంటి తప్పులకు శిక్ష అనుభవిస్తున్నారు. దొంగతనం చేసిన వాళ్లు చాలా తక్కువ.'

'వడ్డీ వ్యాపారస్తులు బందిపోట్లు. ప్రజలను మోసగించే దగాకోర్లు. మరి వడ్డీ కట్టలేదని ఇతనికి ఎందుకు జైలుశిక్ష వెయ్యాలి?'

'ఇది లోకంపోకకడ' అన్నాడు హరీష్ నవ్వుతూ.

నాకున్న నమ్మకాలకు సమాధానం దొరికినట్లై, నేను మా అన్నకు మరో ప్రశ్న వేశాను:

'జైలు బయట వదిలితే వాళ్లు పారిపోరా?'

'నీ కంత ఆదుర్దా ఎందుకు?' గణేశ్ హెచ్చరించాడు.

హరీష్ ప్రశాంతంగా నాకు జవాబిచ్చాడు:

'ఖైదీలలోంచి, మంచి నడవడిక గలవాళ్లను వార్డెన్‌గా ఎన్నుకొంటాము. ఆరుగురు ఖైదీల సంరక్షణ అతను చూస్తాడు. ప్రతి 24మంది ఖైదీలకు ఒక జైలు వార్డను ఉంటాడు.... ఎప్పుడైనా ఎవరైనా పారిపోవచ్చు. అది అరుదు. నాతో రండి. జైలు, జైలుతోట చూపిస్తాను.'

చలికాలపు సుర్యరశ్మి సోకి ఆ మట్టి యిళ్లు బంగారు పూతపూసినట్లు మెరుస్తున్నాయి. ఆఫీసర్ల యిళ్లకు, తోటకు మధ్య ప్రహరీపై దుమ్ముతోకూడిన బంగారువంటి కణికలు నక్షత్రాలలా ప్రకాశిస్తున్నాయి.

బావిమీద గిలక తిరుగుతూ కిర్రుకిర్రుమనే శబ్దం నాకు బాగా నచ్చింది. మేము మొట్టమొదట కలుసుకొన్న వ్యక్తి తోటమాలి ఈలందిన్. అతని బవిరిగడ్డము, దానికి వేసిన రంగు తళతళలతో మెరుస్తోంది. బావినీళ్లు పడుతూ ఉంటే వాటికింద ఇద్దరు ఖైదీలు కూరగాయలు కడిగి శుభ్రంచేసి యిస్తుంటే, బుట్టల్లో కూరగాయలు అమరుస్తున్నాడు.

'హరీష్ చంద్రమున్షీగారూ! మీ బుట్ట సిద్ధంగా ఉంది— వాళ్ల వదినెకు యీ యిద్దరు కుర్రపిల్లలు తీసుకెళ్లి యిస్తారులే'

ఏదో లేనిపోని గౌరవం చూపకుండా పిల్లలు అని మమ్మల్ని పిలవడంతో అతనితో ఎంతో చనువుగా ప్రవర్తించాను.

'మీ వదినెకు బిడ్డ పుట్టేవరకు, మీరే ఆవిడ కుమారులు— తెలిసిందా?' అన్నాడు బాగా పరిచితమైన పెద్దలాగా.

ఈ మాట నాకింకా ప్రియంగా వినిపించింది.

'నాకొక కేరెట్ యివ్వండి. మాలీగారూ!' అన్నాను ఆశగా.

'రెండు తీసుకో! నువ్వు పిల్లవాడి వనుకొన్నాను. నీకు కేరెటు యిష్టంగాబట్టి గాడిద పిల్లవు'— అంటూ పిడికిలి నిండా కేరెట్లు తీసుకొని శుభ్రంగా కడిగి నాకు, గణేశ్‌కు యిచ్చాడు.

'పిల్లలు యిక్కడ స్నానంచేస్తారు.' హరీష్ సూచనగా అన్నాడు.

'తప్పకుండా మున్షీగారూ! వీళ్లు మనస్నేహితుడిలా బావిలో దూకరు గదా! — మీరు ప్రతిరోజూ శుభ్రంగా యిక్కడ నీళ్లలో స్నానంచేస్తే హాయిగా, హుందాగా ఉంటుంది. ఖైదీలుకూడా మిమ్మల్ని మెచ్చుకొంటారు. మీపట్ల గౌరవం మాత్రం తగ్గదు. మిమ్మల్ని అర్ధ నగ్నంగా చూస్తేవారికి యింకా యిష్టం. నేను యిక్కడ స్నానంచేసి నా ఎర్ర బుగ్గలు చూసుకొంటాను...... నేను గ్రామీణుణ్ణి, మీ అమ్మలాగా. పల్లెటూరువాళ్లమైన మాకు పరిశుభ్రమైన నీటి విలువ తెలును. చలికాలం, ఎండాకాలం ఉదయమే స్నానంచేస్తాం.'

'రండి పిల్లలూ!' అంటూ హరీష్ మమ్మల్ని బావిదగ్గర నుండి తోటకేసి తీసుకెళ్లాడు.

'పిల్లలూ! ఏదీ కొయ్యవద్దు మీకు కావలసింది అడగండి పుష్కలంగా యిస్తాము.' అన్నాడు తోటమాలి హెచ్చరికగా.

'ఊలందీన్ చాలా గొప్పమనిషి..... బావిలోకి మనస్నేహితుడివలె దూకరుగదా! అన్నాడు — దాని అర్థమేంటి?' అన్నాను హరీష్‌తో.

'అబ్బా! ప్రశ్నలతో విసిగించకు' తన పెద్దతనాన్ని గుర్తుచేసుకొంటూ అన్నాడు గణేశ్.

'నువ్వు నోర్ముయ్' వాడిమీద విరుచుకపడ్డాను.

'నిజమేరా! బుల్లీ, కుక్కపిల్లా! అరిచేకుక్కా!' అనివాడు ప్రతి సమాధాన మిచ్చాడు.

మేము నడుస్తున్న సన్న కాలవగట్టుమీద వెనకకు తిరిగి గణేశ్‌ను రెండు వాయిద్దామనుకొన్నాను. హరీష్ నా చేయిపట్టుకొని·

'మీరిద్దరు తన్నుకోమని నాకు వాగ్దానం చెయ్యండి. లేకపోతే రేపే నాన్నగార్ని మిమ్మల్ని తీసుకెళ్లమని వ్రాస్తాను.'

'వాడు పూర్తిగా చెడిపోయాడు. నీకు తెలియదు. వదినెమీద కూడా వీడికి మంచి అభిప్రాయంలేదు' అన్నాడు ఫిర్యాదుగా గణేశ్.

'నాకు వంటగది బయట భోజనం పెట్టింది కాబట్టి' అన్నాను.

'నిజమే గణేశ్. ఆవిడ నాపట్ల, కృష్ణపట్ల ఆప్యాయంగా లేదు.'

ఈమాట గణేశ్ నోరు కట్టేసింది. ఒక్క క్షణంపాటు, వాడిపట్ల నేను విచారం వ్యక్తపరచాను. బహుశా, నేను అనవసరమైన ప్రశ్నలు వేయకుండా ఉంటే మంచిది. నాలోని ఉత్సాహంవల్ల నేనలా ప్రశ్నిస్తున్నానని సమాధాన పెట్టుకొన్నాను. నాప్రశ్నకు సమాధానంగా ఆ స్నేహితుని గూర్చి హరీష్ చెప్పినపుడు నా అహం తృప్తిపడింది.

'నూర్ మహమ్మద్ అనే వ్యక్తిని గూర్చి తోటమాలి ప్రస్తావించాడు. జైలులో ఆడఖైదీల సంరక్షణకు ఒక ఆడవార్డెన్ ఉంది. ఆవిడ కొడుకు మహమ్మదు. ఆ కుర్రవాడు లూధియానా ప్రభుత్వ పాఠశాలలో 10వ తరగతి చదువుతున్నాడు. మీరు అక్కడే చేరబోతున్నారు. అక్కడ అతణ్ణి కలుస్తారు. జైలు డాక్టరు అయిన డా. దోస్త్ మహమ్మదు కుమార్తెను అతడు ప్రేమించి పెళ్లి చేసుకొంటానన్నాడు. డాక్టరు అందుకు అంగీకరించలేదు. నూర్ కేవలం వార్డెన్ కొడుకు కావడమే కారణం. అందువల్ల అతడు ఆ బావిలోదూకి ఆత్మహత్య చేసుకోబోయాడు. ఈ విషయం అందరికీ తెలుసు, కాని ఎవ్వరూ నోరు మెదపరు. మీరు కూడా అలానే ఉండాలి. డాక్టరుగారి అబ్బాయి జాన్ మహమ్మదు మీ స్కూలులో చదువుతున్నాడు. అతను మీ స్నేహితుడవుతాడు. అతనితో మీరీ విషయం ప్రస్తావించగూడదు. డాక్టరుగారి అబ్బాయి మిమ్మల్ని కలవాలని ఆదుర్దాగా ఉన్నాడు. మీరెప్పుడు వస్తారని నిన్న అడిగాడు.... ఈ ఎర్రరంగు యిల్లు బందిపోట్లు హంతకులు ఉరితీయబడ్డ తర్వాత వారి శవాలను పరీక్షకోసం ఉంచే గది..'

డాక్టరుగారి అమ్మాయిపై ప్రేమతో ఆత్మహత్య చేసుకోబోయిన కుఱ్రవాడి గురించి సరదాగా చెప్పిన హరీష్ ధోరణి నాకు నచ్చింది.

కాని ఈ శవపరీక్షల గది చూడటంతో నాలో మృత్యువుని గూర్చిన ప్రశ్నలకు మళ్లీ దారి ఏర్పడింది.

'మనం వెనక్కి వెళ్లి స్నానం చేద్దాం' అన్నాడు హరీష్ ప్రకృతిని తిలకిస్తూ. నేను ఆఫీసుకు కొంచెంసేపు వెళ్ళి, సూపరింటెంట్‌గారి రాకవరకు ఉంటాను. ఆతర్వాత మీ బడికి వెళ్తాను.. మీ ప్రవేశం గురించి హెడ్మాష్టరుతో మాట్లాడాను..'

'జైలు లోపల హంతకులను, దోపిడీ దారులను ఉరి తీసేది చూడా లని ఉంది' అన్నాను ఉత్సాహంగా.

'నాకు కూడా' అన్నాడు గణేశ్.

'నిదానంగా మీరు అన్నీ చూస్తారు. ధన్‌సింగ్, బుధ్‌సింగ్ అనే యిద్దరు కుర్రాళ్లున్నారు. వాళ్లతో కలిసి మీరు ఫుట్‌బాల్ జట్టు తయారు చెయ్యాలి. ఈ ఊళ్లో పిల్లలతో కలసి ఒక జట్టు తయారు చెయ్యాలి.'

'ఈ రోజే చేద్దామా? ఫుట్‌బాల్ కొందామా?' అన్నాను ఆదు కొంటూ.

'ఫుట్‌బాల్‌తోపాటు గాలికొట్టే పంపు కొందాం' అన్నాడు గణేశ్ హరీష్ మెప్పుపొందాలని.

# 2

మర్నాడు ఉదయం నేను, గణేశ్, జాన్ మహమ్మదు కలిసి స్కూలుకు బయలుదేరాము.

క్రితంరోజు బడికి సెలవు గాబట్టి హరీష్, హెడ్మాష్టరు గారింటికి వెళ్లి మా ప్రవేశానికి సంబంధించిన కాగితాలపై సంతకాలు పెట్టించు కొచ్చాడు. అలా లూధియాన్ ప్రభుత్వ పాఠశాలలో 6వ తరగతిలో ప్రవేశం జరిగింది. హరీష్ తెచ్చిన ఫుట్‌బాల్‌తో గూర్ఖా హవిల్దారు

కుమారులైన ధనసింగు, బుద్ధులతో స్నేహం కట్టాను. జాన్ మహమ్మదు మాత్రం నేను మరీ చిన్నవాడినని నాతో ఆడటానికి కలిసి రాలేదు. నన్ను లక్ష్యపెట్టకపోవడంవల్ల, తెల్లగా కుష్ఠురోగిలా ఉండే అతడికి నేను 'తెల్ల ఎలుక' అని పేరు పెట్టాను.

'తెల్ల ఎలుక,' గణేశ్ ముందు నడవగా, నేను వారికి కొంచెం వెనుక అనుసరించాను.

రహస్యాలను బహిర్గతం చేయవద్దని హరీష్ నన్ను హెచ్చరించడం వల్ల నాకు కొంత ఉపశమనం కలిగింది. అతను నన్ను విశ్వసించాడన్న విషయం గ్రహించాను. హెడ్మాష్టరు షేక్ అబ్దుల్ హమీదు జాతీయో ద్యమ సహకారి. 'ఆంగ్ల సర్కారువారి తొత్తు అయిన ఆగాఖాన్ అంటే అతనికి పడదు.' అన్నాడు హరీష్ 'ఎవరితోను అనకు.... బుధ్‌సింగ్ మేష్టార్ని ఆయన అనుమానిస్తాడు అతనొక్కడే ఈ బడిలో విప్లవ యోజకుడు, చక్వాల్ గ్రామానికి చెందిన బాబూ చతార్ సింగుకు యితను స్నేహితుడు చతార్ సింగ్ నాన్న సైనిక దళంలో పనిచేస్తు న్నాడు అందువల్ల మీ యిద్దరిపట్ల అభిమానం చూపవచ్చు ...'

మా అన్న, హెడ్మాష్టరు తెల్లదొరలను ద్వేషిస్తారని ఊహించాను. అందువల్ల విప్లవం గురించి ఎక్కువ విషయాలు తెలుసుకోవచ్చు.

షేక్ అబ్దుల్ హమీద్ మాపట్ల దయగా ఉండటం ఖాయమని తెలుసు. బుధ్‌సింగ్ మేష్టారు ఎలా ఉంటాడా? అని ఆలోచించ సాగాను. ఆయన ఆకారం గురించి నేను ఊహించసాగాను. వీధిలో భయంకరంగా కనిపించే ఆకృతివలె ఆయన దేహాన్ని ఊహించాను. అది రాక్షసాకారంలో వున్నట్లు తోస్తుంది.

నా ఊహ పూర్తికాగానే, అది ఖాయపరచుకోడానికి జాన్ మహ మ్మదు వద్దకు పరుగుతీశాను.

'బుధ్‌సింగు మేష్టారు ఎలాంటి వాడు?' నేనేదో పెద్దవాడినైనట్లు ఆ ప్రశ్నవేశాను.

నా నడవడికపట్ల జానీకి ఆశ్చర్యంవేసి మౌనంగా ఉన్నాడు. తన

హోదాకు మించినట్లుగా ఊహించుకొని యిలా అన్నాడు:

'సాలెవీధి చివరిలో ఆయన యిల్లు. ఆయన యింటిముందు పడ కపై దున్నపోతులా పడుకొని ఉంటాడు. నువ్వు చూడవచ్చు.'

బడికి వెళ్లే దారిలో, రెండంతస్తుల చిన్నయింటి ముందు మంచంపై పెద్ద శవాకారాన్ని చూశాను. ఆయన నిద్రలో ఉన్నాడా? మేల్కొన్నాడా? గమనించలేదు. ఆయన పొడుగాటి చేతులు, కాళ్లు దయ్యానికివలె కనిపించి నాలో వొణుకు పుట్టించాయి. నేను మునిగాళ్లమీద పరుగెత్తుకొంటూ వెళ్లి గణేశ్‌ను, జానీని కలిశాను.

అప్పుడే బడిగంట మోగింది. ఎర్రరాతి భవనంలో మా ఆరో తరగతి గది వద్దకు జానీ మమ్మల్ని తీసుకెళ్లి అన్నాడు

'షానవాజు మేష్టారు ఏదీ పట్టించుకోడుగాని, ఆలస్యంగా వస్తే వొప్పుకోడు.'

మేము కొద్దిగా ఆలస్యంగా వెళ్లినా షానవాజు మేష్టారు మాకు హృదయపూర్వక శుభాకాంక్షలు చెప్పడంవల్ల నాలో భయం అంతర్ధానమైంది.

'ఆహాహా! ముగ్గురు ఖైదీలు మనవద్ద కొచ్చారు' — లూధియానా పంజాబీ యాసలో ఆయన అన్నారు. బల్లలమీద పిల్లలంతా వరుసగా కూచోని ఉన్నారు. మేష్టారు తనముందున్న బల్లముందు తాపీగా కూచొని కాళ్లు చాపుకొని ఉన్నారు.

'రండి పిల్లలూ! కరచాలనం చేయండి' అంటూ చేయి ముందుకు చాపారు.

జాన్ మొహమ్మదు ముందుకు నడిచాడు.

'నువ్వు కాదు. నువ్వు పాతవాడివే. ఈ కొత్త ఖైదీలతో చేతులు కలపాలి' అన్నాడాయన.

ముందుకు వెళ్ళి గణేశ్ సందేహిస్తూ నిలబడ్డాడు.

'నీపేరు గణేష్ చంద్ర కదూ. నువ్వు మీ తమ్ముణ్ణే అందరి

అన్నల్లా ఏడిపిస్తావు కదూ!' అన్నాడు మాష్టారు.

'లే'దన్నట్లుగా గణేష్ తల వూపాడు.

'సరే! చిన్నవాడు కృష్ణ చంద్ర! అందరి చిన్న పిల్లల్లానే తల్లిదండ్రులు నిన్ను గారాబుగా పెంచారు. నీది ఎప్పుడూ పైచేయి' అని నిందుగా అన్నారు. ఆయన నల్లని ముఖం నావైపు తదేకంగా తేరిపార చూస్తూంది. నానడుం మీద చేయివేసి నన్ను ఈ తరగతిలో చిన్న వాడివి కాబట్టి సిరి, చుక్క (అదృష్టవంతుడుగా) దత్తత తీసుకుంటాము.'

'మాష్టారూ! వీణ్ణి అమృతసర్ స్కూల్లో బిషన్‌సింగు మాష్టారు చూచియా (చిట్టెలుకా) అని పిలిచేవారు' అన్నాడు గణేష్ మాష్టారి మెప్పు పొందుదామని.

ఈమాట అన్నందుకు వాడిని ఒక గుద్దు గుద్దివుందును. నన్ను అలా ఎద్దేవా చేసినందుకు నాముఖం ఎఱ్ఱబడింది. తరగతిలో పిల్లలందరూ పెద్దగా నవ్వి — 'వహ్వా' వీడికి సరైన పేరు చుంచెలుక ' అని అరిచారు.

మాష్టారు బెత్తంతో బల్లమీద చరుస్తూ — 'ఈ ముద్దుల కుర్రాణ్ణి ఎవరైనా ఏడిపిస్తే మీ తాట ఒలుస్తాను. ఇదిగో భాట్లియా! నీవు ఈ తరగతి నాయకుడివి. ఈ కుర్రవాణ్ణి ఎవరూ గేలి చేయకుండా చూస్కోవాలి. గణేష్! నీవు జానీతో మూడో వరుసలో కూర్చో. చిన్నవాడు కాబట్టి కృష్ణ నయీమ్‌తో మొదటి వరుసలో కూర్చుంటాడు.'

మాష్టారు ఎంతో దయతో మాట్లాడినప్పటికీ ఈ బళ్ళోకూడా నేను చిన్నవాణ్ణి కావటంవల్ల గేలి చేస్తారేమోనని అనుకున్నాను. నా కురచ శరీరం, విపరీతమైన అహంకారం అందుకు కారణం. అయితే నయీమ్‌ను చూడగానే నాకు కొంత వూరట కలిగింది. అందమైన కుర్రవాడు. చిరునవ్వు చిందించే ముఖం తలపై టోపీ బాగా ఆకర్షించాయి వెనుక వరుసల్లోంచి భాట్లియా లేచి ధైర్యంగా:

'మేష్టారూ! వాళ్లు వచ్చిన శుభసందర్భంలో ఆడుకోడానికి వెళ్ల వచ్చా' అన్నాడు.

'ఇద్దరు కుర్రవాళ్లు తరగతిలో చేరిన ఈరోజు శుభప్రదం — మిమ్మల్ని ఆడుకోడానికి వదులుతాను. కానీ....'

పిల్లలు బెంచీల్లోంచి లేచి కదలడం మొదలెట్టారు. మేష్టారు 'కానీ,' అని అర్థంతరంగా ఆగడం వారిని ఆపివేసింది. మేష్టారు బెత్తంతో బల్లమీద కొట్టారు—

'భలే!' అని అన్ని మూలలనుండి పిల్లలు గోల చేశారు.

'వినండి!' అని మేష్టారు అన్నారు

'ఒకానొక కాలంలో ఒక మౌల్వీ ఉండేవారు. ఒకరోజు ఆయన మసీదులో కూచొని, అందరు మౌల్వీలవలె ఆయన బోధలు.....'

'మన మేష్టార్లవలె చేసేవారు. ..' అన్నాడు నయీమ్ మధ్యలో అనవసరంగా అడ్డుతగులుతూ.

ఈ మాటలకు మేష్టారు నవ్వు ఆపుకోలేకపోయారు. నయీమ్ హాస్యానికి తరగతిలో పిల్లలంతా బల్లలు చరిచారు.

మేష్టారు తన మాటలు కొనసాగించారు

"జీవితంలో కష్టాలను గూర్చి బోధించేవారు. ఆయన అఖండంగా ఉపన్యసిస్తూ, ఖురాన్‌నుంచి ఒక గీతం చదివినప్పుడు, ఒక పేదరైతు విపరీతంగా దుఃఖించడం చూశాడు."

'ఓ పాపీ! నీవు దుఃఖంలో ఉన్నావు గదూ!' అంటూ మౌల్వీ అరబిక్ యాసతో గద్దించాడు 'నా మాటల్లో నిజం నీకు బాగా తెలిసింది గదూ. నీ పాపాలను గురించి ఆలోచిస్తున్నావు ' అన్నాడు.

"లేదు లేదు. నా పాపాలను గూర్చి ఆలోచించడమే లేదు. పోయిన సంవత్సరం జబ్బునపడి చనిపోయిన నా మేకపోతును గూర్చి ఆలోచిస్తున్నాను. నాకు చాలా నష్టం వచ్చింది. దానికున్నంత గడ్డం నేనెక్కడా చూడలేదు. మీగడ్డమంత వుంది." అన్నాడు రైతు.

ఆ మాటలువిని గ్రామస్తులు నవ్వసాగారు. ఆయన ఖురాన్‌లో నుంచి మరిన్ని అరబిక్ గీతాలు చదివి గండం గట్టెక్కాడు.

షానవాజ్ మేష్టారి కథ విని తరగతి మొత్తం సంతోషంగా బల్లలు చరిచింది.

'మేష్టారూ! మీరు చెప్పిన కథలో మౌల్వీలాగా మీరున్నారంటాను' అని వెనక బెంచీల్లోంచి ఒక స్వరం వినవచ్చింది. నవ్వులు వినిపించాయి. మిగతా విద్యార్థులు దీని ఫలితం ఎలా ఉంటుందోనని చిరునవ్వు చిందించి సరిపెట్టారు. వాతావరణం మారిపోయింది.

'ఒరే దుబ్బా, అస్లమ్ మొహమ్మద్ ఇలారా! నీ జీవితంలో మరిచిపోలేనట్లు నీవాగుడుకు సరిపడే గుణపాఠం చెప్తాను.' అన్నాడు మాష్టారు.

'మా తమ్ముడు'అన్నాడు నయీమ్ నాచెవిలో గొణుగుతూ.

బొద్దుగా వుండే అస్లమ్ నడుచుకుంటూ వెళ్ళి ఉపాధ్యాయుని పట్ల అగౌరవం కనపరచినందుకు శిక్ష ఎప్పుడు అనుభవిస్తాడా? అని ఎదురుచూస్తున్నాము. మాష్టారు చెప్పిన కథలో అధికారాన్ని ఎగతాళి చేయటం అనే విషయం వుందని మేము గ్రహించాము.

'పిల్లలందరూ వెళ్ళి ఆడుకోవచ్చు. గంటకొట్టిం తర్వాత బుద్ద సింగ్ మాష్టారు పాఠానికి తరగతిలో వచ్చి కూర్చోండి. నా హుక్కా దట్టిస్తూ అస్లమ్ కొంత కొవ్వు తగ్గిచ్చుకుంటాడు.' అన్నాడు మాష్టారు.

'ఈ బళ్ళోవున్న మాష్టర్లందరూ మేకపోతు గడ్డంవున్న షానవాజ్ మాష్టారువలె వుంటే జీవితం ఎంత అద్భుతంగా వుండేది ' అన్నాను నయీమ్‌తో.

'బుద్దసింగ్ మాష్టారును చూసేంతవరకు ఆగు! ఈయన క్లాసుకు ఆయన క్లాసుకు స్వర్గానికి నరకానికి మధ్య వున్నంత తేడా' అన్నాడు నా స్నేహితుడు.

ఆసమయంలో ఎఱ్ఱకోటు వేసుకుని దానిపై డవాల్ తగిలించుకుని బడి బంట్రోతు లిసు బాన్ అలీ వచ్చాడు. 'బుద్దసింగు మాష్టారుకు ఆరోగ్యం సరిలేదు, కాబట్టి హెడ్‌మాష్టారుగారు మీరు ఆడుకోవచ్చని చెప్పారు. అయితే మీరు గోలచేస్తూ బడి అంతా గొడవ చేయవద్దని

ఆదేశించారు' అని హుకుంజారీ చేశాడు. మా సంతోషానికి అవధులు లేవు. ఇంక ఏమీ వినిపించుకోలేని స్థితిలో అందరూ గంతులు వేశారు.

బుద్దసింగ్ మాష్టారు తరగతి ఎంత నరకప్రాయంగా వుంటుందో ఆలోచిస్తూ నా అన్వేషణలో బడి వెనుక వైపుకు నడిచాను. అమృత సర్ నుంచి లూధియానాకు వస్తున్నపుడు వున్న సంతోషం మావదిన వంటగది బయట కూచోబెట్టి అస్పృశ్యుడిలా వడ్డించటంతో చప్పబడింది. ఇప్పుడు అమృతసర్ పాఠశాలలో జరిగిన సంగతులే ఇక్కడ కూడా పునరావృతం కావచ్చు. జీవితం గురించి కొత్త విషయాలు తెలుసు కుందామని, ఎంతో అద్భుతాలు జరుగుతాయని నేనూహించినది వమ్మై ఈ సాధారణ జీవితంతో నాకు విసుగు పుట్టేట్లుంది. ఇంక ఏమి జరిగినా, మేకపోతు గడ్డం షానవాజు మాష్టారు దొరకటం వీటన్నిటి లోటు తీర్చగలదు.

నా విద్యార్థిదశ అంతా నిత్యనూతనంగా ప్రకాశించేందుకు తోడ్పడే స్నేహితులు నయీామ్ మొహమ్మదు, అతని తమ్ముడు అస్లమ్ మొహ మ్మదు, 'మానిటర్' భాట్లియా రామ్‌లతో ఆరోజు విరామ సమయంలో స్నేహం ఏర్పడింది. నాలో ఏకాంత స్వభావం అలానే నిలిచిపోయి నప్పటికీ వారిని నాసహచరులుగా స్వీకరించాను. వాళ్ళందరూ బడి ఫుట్‌బాల్ జట్టు కెప్టెన్ నూర్ మొహమ్మదును అభిమానించి ఆరాధి స్తారు. అందువల్ల జైలు అధికారుల పిల్లలతో ఒక చిన్న జట్టు ఏర్పడింది. నేను నూరాను దానికి గౌరవ కెప్టెనుగా నియమించాను. బడి వదిలిన తర్వాత జైలు మైదానంలో ఫుట్‌బాల్ నేర్చుకునేందుకు పట్టణంలోంచి ముగ్గురు విద్యార్థులు మైలు దూరం నాప్రేరణపై నడిచి వస్తారని తెలిసి నేనెంతో గర్వపడ్డాను. నా లోలోపలి సెగలతోపాటు నాలో ఏదో మహత్తర ఆశా భావం ఉందని, నేను క్రూరంగా వున్నట్లు కనిపించి నప్పటికీ నావ్యక్తిత్వంలో ఒక శక్తి వుందని నాకు తెలుసు.

నయీామ్, అస్లమ్, భాట్లియాలతో కలిసి ధన్‌సింగ్, జానీ, గణేష్, బుద్ధా, నేనూ మేము ఎంచుకున్న స్థలంలో ముళ్ళు, రాళ్ళు తొలగిం చటంతో మా స్నేహం ప్రారంభమైంది మా కాళ్ళు, బంతి, ముళ్ళతో నొచ్చుకోకుండా ఆపని మొదలెట్టాము

మేమెంచుకున్న మైదానం మిషను ఆసుపత్రికి, జైలు మట్టి గోడకూ మధ్య వుంది. ఆగోడ కుడివైపు జైలు మొదటి గేటు వుంది. ఆ ప్రహరీ పక్కన వురిశిక్షలు అమలు జరుపుతారని విన్నాను. నయీామ్ అస్లామ్ భాట్లియా లను కలవడానికి వచ్చిన మా అన్న హరీష్‌తో జానీ ఈ మైదానాన్ని బాగు చేయటానికి కొందరు ఖైదీలను పంపమని చెప్పాడు. హరీష్ మాత్రం హెడ్‌జైలర్ ఇందుకు అంగీకరిస్తాడా? అని సందేహంగా వున్నాడు. మరో అసిస్టెంటు జైలరు పీర్ బక్షుతో కలిసి హెడ్‌జైలరు కుట్రవన్నీ ఇందుకు అంగీకరించడేమోనని ఆయన అనుమానం.

ఖైదీల చేత వెట్టిచాకిరీ చేయిస్తునట్లు జైలు సూపరిండెంటుకు ఫిర్యాదు వెళ్ళకుండా చూడమని మా అన్నయ్య కోరాడు. మాలీవద్ద నుంచి కొన్ని పారలు అరువు తీసుకొని హరీష్ ముళ్ళ కంపలు, మట్టి దుబ్బలు ఎలా త్రవ్వి పొయ్యాలో చూపించాడు. ఆయన చూపిన దారిలో మేమందరం ఆనేలను త్రవ్వసాగాము.

గణేశ్, ధనసింగ్ బాగాపని చేశారు. జానీ, భాట్లియా చాలా సున్నితం కాబట్టి పనిచేస్తున్నట్లు అభినయించారు. నేను, నయీామ్, బుద్దు శ్రద్ధగా పనిచేస్తున్నాము. అస్లమ్ దుబ్బగా వుండటంవల్ల అలసి పోయి ఎక్కువసేపు పనిచేయ లేకపోయాడు. త్వరలో బయట జట్లతో వరుసగా ఆడి వారిని ఎలా ఓడిస్తామో ఆశగా వూహించుకున్నాము. హరీష్ పట్టణంలోకి వెళ్ళవలసి రావటంతో మేము ఓపిక నశించి త్వరగా బంతితో ఆడుకోవాలనే తాపత్రయంతో ఆపని నిలిపి వేశాము.

దేశవాళీ పంథాలో మేము బాగుచేసిన కొద్దిపాటి ఆటస్థలంలో పట్టికాళ్ళతో ఆట మొదలెట్టాము. ఉత్సాహంగా ఆడుతూ మధ్యమధ్యలో కాళ్ళకు గ్రుచ్చుకున్న ముళ్ళను తీయడానికి వంగేవాళ్ళం. ముళ్ళు మరీ ఇబ్బందిగాకరంగా వుండటంతో, క్వార్టర్లకు బయట చదునైన ప్రదేశంలో ఆడటానికి సాహసించాము. అక్కడ తన ఎద్దులు మే మాడుతుంటే భయపడుతున్నాయని మాలి మా ఆట సాగనియ్యలేదు. ఖైదీల చేత భూమి చదును చేయించడానికి హెడ్ జైలరును అడుగుదామని నిశ్చ యించాము. జయిలర్ దగ్గరకు వెళ్ళి జానీ మరుసటిరోజు వారి సహాయం అందిస్తానని జయిలరువద్ద ఆశ్చర్యకరంగా వాగ్దానం తీసుకొచ్చాడు. భూమి

చదువైన తర్వాత ఆటస్థలంలో సరిహద్దు రేఖలు గీచేందుకు తెల్ల సున్నం కొనటానికి మేము దాచిన డబ్బులు తలా పదిపైసలు పోగు చేసేటట్లు నిర్ణయించాము.

ఈ కార్యక్రమంవల్ల మాటలవల్ల అలిసిపోయాము. మేము అలిసి పోయే సమయానికి సంధ్యా సూర్యుని అరుణకిరణాలు మాపై ప్రసరించ సాగాయి. మా స్నేహితులను ఆసుపత్రి ప్రక్కసందు ద్వారా యిళ్ళకు పంపి వెనక్కు వచ్చాను.

మేము వెనక్కు వెళుతుంటే నక్షత్రాలు ఆకాశంపై మిలమిలా మెరుస్తూ కనిపించాయి. మా జట్టు తయారు కావటంతో మా ఆటకు వూపిరి పోసినట్లైంది. నా ఆశలకు ఆకాంక్షలకు వెనుక దోపిడీ దారులను, హత్యదారులను వురితీయటమనే క్రూరత్వాన్ని గురించి దిగులు వుంది. ఈ జయిలులో వురితీయబడ్డవారు దయ్యాలుగా ఈ చుట్టుపక్కల వుంటారని, వారి ఆత్మలెలా ఘోషించాయో చూడాలని అనుకున్నాను.

మేం చీకట్లో నడుస్తున్నపుడు గణేశ్ చేయి ఆసరాగా పట్టుకు న్నాను. ఇంతకుముందు కన్నా వాడు నాకు దగ్గరైనట్లుగా అనిపించింది. బహుశా ద్రౌపదిపట్ల వాడి పక్షపాత బుద్ధివల్ల అలా అనిపించి వుండవచ్చు.

ఇతర పిల్లలు నాపట్ల ప్రేమగావున్నప్పుడు గణేశ్ స్నేహంగా వున్నట్లు అనిపిస్తుందిగానీ, మేమిద్దరం ఒంటరిగా వున్నప్పుడు మళ్ళీ విడిపోయే వాళ్ళం. బహుశా వాడు నన్ను పూర్తిగా అర్థంచేసుకున్నప్పటికీ పురా తన భారతీయ సంప్రదాయాల ప్రకారం తమ్ముడు అన్నపట్ల గౌరవం చూపించాలనే వుద్దేశ్యంతో బహుశా వాడలా ప్రవర్తిస్తున్నాడేమో.

ఇప్పుడు అకస్మాత్తుగా ఈప్రవర్తన ద్వారా వాడి స్వభావం నాకు బాగా అర్థమైంది. నావలె ఆశలు, ఆకాంక్షలూ, భయాలూ వాడికీ సహజంగా వున్నట్లు నాకనిపించింది. బహుశా దైవ ప్రార్థనలు చేస్తుం డటంవల్ల వాడు నాకంటె భిన్నంగా వున్నాడేమో! ఇలా నా చేయి పట్టుకోవటంవల్ల ఏదో అగమ్యగోచరమైన అన్నాదమ్ముల అనుబంధం మా యిద్దరి మధ్యా వున్నట్లు నాకు అవగతమైంది. ఇంటి దగ్గరగా

వెళుతుంటే 'ద్రౌపదిపట్ల విధేయంగా వుండు' అన్నాడు వాడు. మే మిద్దరం మళ్ళీ విడిపోయామని నాకు తెలుసు.

ఫుట్‌బాల్ జట్టు కట్టడంలో ఏర్పడ్డ ఉత్సాహం, యింటికి రాగానే దిగాలు పడ్డ ముఖంతో వున్న వదినను చూడగానే నీరుకారిపోయింది. ద్రౌపది ఎన్నడూ ఎక్కువగా నవ్వినట్లుగా ఆ గుండ్రటి చదునైన ముఖం చిన్న కళ్ళూ చెప్పవు. యౌవనంలోని సంతోషం ఆమెలో ఎక్కడా కనుపించవు. ఆ సాయంకాలం వరండామూల మూగమొద్దులా చీర కొంగుతో ఆమె ముఖాన్ని కప్పుకొని వుంది.

మేం కూచోగానే మాముందుకు ఇత్తడి కంచాలను ఆవిడ తోసింది. గణేశ్‌కు వంటగది లోపల, నాకు అస్పృశ్యుడిలా బయట వడ్డించింది.

'అన్నంతినే ముందు చేతులు కడుక్కోండి, పందిమాంసం తినే ముస్లిమ్ కుర్రవాళ్ళనూ, తోలు బంతిని ముట్టుకున్నారుగా' అంది ఆమె.

'పద చేతులు కడుక్కో' అని గదమాయించాడు గణేశ్. నేను వాడు చెప్పినట్లే చేశాను. ద్రౌపది మాటలు నన్ను ఉద్దేశించి అన్నట్లు నాకు తెలుసు. అన్నం తినకుండా పడుకుందామని అనుకున్నాను. నిద్రముంచుకొచ్చేస్తుంది. ఒకటి రెండుముద్దలు నోట్లోపెట్టుకుని అక్కడే నిద్రపోయాను.

'వీణ్ణి పక్కమీద పడుకోబెట్టేందుకు ఆయన అర్థరాత్రివరకు రాడు. వేశ్యలతో తందనాలాడి అప్పుడు వూడిపడతాడు. గణేశ్! వీణ్ణి వాళ్ళ అన్న మంచంమీద పడుకోబెట్టు.' అంది ద్రౌపది.

హరీష్‌ను ఆమె అన్న మాటలకు నామత్తంతా దిగిపోయింది. అప విత్రులు అయిన వాళ్ళ యిళ్ళకు సంగీతం వినటానికి అతను వెళ్ళాడని ఆమె అంటోందని నాకర్థమైంది. తన భర్తమీద సాధింపును నాపై కక్షగా తీర్చుకుంటున్నందుకు నాకు కోపం వచ్చింది. నేను కుతకుత లాడిపోయాను. ఆకోపంలో నేనే సంభాళించుకుని లేచి నిల్చుని వెళ్ళబో యాను. ఇంతలో గణేశ్ లేచి నాకు చేయి ఆసరాగా అందించాడు. నాకు బాగా మెలకువ వచ్చి వాణ్ణి పక్కకు తోసి విపరీతమైన కోపంతో దూరంగా వెళ్ళాను.

'నన్ను ముట్టుకోకు. రహస్యాలు పలికే వారికి వత్తాసు నువ్వు. నేను పడుకుంటాను. నీవు ఎప్పుడూ మంచిగా వున్నట్టు నటిస్తావు.' అని అరిచాను.

నిర్భయంగా నేనలా అనటంతో ద్రౌపది నిరుత్తరురాలైంది. కొలిమి మంటలా ఆమె ముఖం ఎఱ్ఱబడి కోపంతో బుసలు కొట్టసాగింది. మబ్బుతో కప్పిన చంద్రునిలా ఆమె ముఖం వెలవెల పోయింది. ఇలా మాట్లాడటం వల్ల ద్రౌపదితో ఇక సఖ్యత అనే మాటకు అవకాశం లేకుండా పోయింది. ఏదో విపరీతమైన భయం నన్ను చుట్టుముట్టింది. నాకు పట్టరాని కోపం వుందని తెలుసుగానీ దాన్ని అదుపులో పెట్టలేను.

పక్కమీద విసురుగా వెళ్ళి పడుకున్నాను. ఏడుపు ముంచుకొచ్చింది. గొంతు ఆపుకోలేక పోయాను.

'అమ్మా! ఎక్కడున్నావు? నన్ను తీసుకు పోవటానికి ఎందుకు రావు? నన్ను ఈ జైల్లో ఎందుకు పడవేశావు' అని ఏడ్చాను.

నా ఏడుపు పెద్దగా వినపడటంతో ద్రౌపది పరుగెత్తుకుంటూవచ్చి నా నోటికి చేయి అడ్డుపెట్టి 'పెద్దగా అరవకు, పక్కవాళ్ళు వింటారు' అంది. 'మా అన్నను తిడితే నేను వూరందరికీ చెప్తాను' అని కోపంతో అన్నాను.

'సరే ఇంకేమీ అనను. నువ్వు పడుకో.' అని బ్రతిమాలింది.

ఆమె పడుకోమంది కాబట్టి నేను దానికి ప్రతిఘటనగా మేల్కొన్నాను. నన్ను ఏవీ వోదార్చలేక పోయాయి. వదినపట్ల కోపం, హరీష్ నాకు ఆసరాగా వుంటాడో లేదో అనే భయం నా ఏడుపును అధికం చేశాయి. గణేశ్‌పట్ల ఆవిడపట్ల ద్వేషంతో కోపం కట్టలు తెంచుకొని వచ్చింది.

నేను ప్రతిఘటించటంతో బెదిరిపోయి అక్కడే కూచుంది. 'నా దగ్గర కూచోకు! వెళ్ళు' ఆ మాట విని ఆవిడ వెళ్ళిపోయింది.

ఆవిడ వెళ్ళిపోవటంతో నా దుఃఖం ఎక్కువైంది. ఆవిడ తన వొడిలో పడుకోబెట్టుకొని, ఓదారుస్తుందనుకొన్నాను. ఒకసారి ద్వేషం

నన్ను ఆవరించగానే, ఆ వేగంలో నన్ను అదుపులో పెట్టుకోలేకపో యాను. ద్వేషాన్ని ప్రేమగా మార్చి సాధారణంగా ప్రవర్తించలేకపోయాను. గొంతుపెంచి ఇంకా పెద్దగా అరిచాను.

చుట్టు పక్కల ఆడవాళ్ళు కొందరు వచ్చి తలుపు తట్టారు. ద్రౌపది వాళ్ళతో గొణగటం వినిపించింది. 'వాడికి కడుపు నొప్పిగా వుంది' అని ఆవిడ వాళ్ళతో చెప్పినట్లు నాకనిపించింది.

'అబద్ధాలకోరు! భర్తమీద, నామీద అబద్ధాలు చెప్పే కుళ్ళు బోతు. మమ్మల్ని అంటరాని వాళ్ళుగా చూస్తుంది' అని అరిచాను. కన్నీళ్ళతో నిండిన ఆచీకటి వేళ బడలికవల్ల అన్నీ మర్చిపోయి నిద్రకుపక్రమించాను.

ఆ మర్నాటి వుదయం ఉద్దేశ్య పూర్వకంగానే గణేశ్‌కు జానీకి వెనక నడిచాను. నావుబ్బిన కళ్ళు వాళ్ళకు చూపటం ఇష్టంలేదు. ఒకటి రెండు సార్లు గణేశ్ వెనక్కు వచ్చి నాచొక్కా పట్టుకుని ఈడుస్తూ 'తొందరగా రా! మనకు ఆలస్యమౌతుంది మొదటి క్లాసు బుద్ధసింగ్ మాష్టారుది.' అన్నాడు.

'మొద్దు మొహమా! నాచొక్కా లాగకు. అన్నను కాదని ద్రౌపది పక్షం వహించావు. నీవు వెళ్ళు.'

నా సంరక్షకుడిగా తన బాధ్యత, నేను వాణ్ణి తిట్టినందుకు వాడికి కలిగిన కోపంతో వాడు వూగిసలాడాడు. జానీని నాకు సహాయంగా రమ్మ న్నాడు.

'రా,రా!' జానీ పిలిచాడు.

'వెళ్ళండి, వెళ్ళండి. మీరంతా నాకు వ్యతిరేకం. నేను మీతో నడవను.'

'సరే నీవే బాధపడతావు. బుద్ధసింగు మాష్టారు నీవు ఆలస్యంగా వచ్చినందుకు నీ భరతం పట్టటానికి సిద్ధంగా వున్నాడు.'

'నన్ను భయపెట్టక్కరలేదు' అన్నాను మొండిగా, కానీ భయంతో వణికిపోతున్నాను. వింతగా నన్ను ఆవహించిన ద్వేషం నుంచి దూరం

కాలేకుండా వున్నాను. తనను ప్రేమించే వారిని ప్రేమిస్తూ, ద్వేషించే వారిని ద్వేషించటం సహజం. శరీరంలో ఈ అస్తవ్యస్త స్థితి వుంటుందని నేను గమనించాను. ఒకవేళ లోలోపల మృదుత్వం వుంటే తలకు కోపం ఎక్కి గర్వంతో ముందుకెళతాడు. నా పూర్వ సహచరులు జోశ్యం చెప్పినట్లుగా అలానే జరిగింది.

బడి గంట కొట్టారు. పిల్లలందరూ గదుల్లో కెళ్ళారు. మేము ముగ్గురం ఆ నిశ్శబ్ద వాతావరణంలో బడి ప్రహరీలోకి అడుగు బెట్టాము. ఆ నిశ్శబ్దం పిల్లలందరికీ భయంకర వాతావరణం. ఆలశ్యంగా వచ్చిన ముగ్గురు విద్యార్థుల మీద అప్పటికే బుద్ధసింగు మాష్టారు విరుచుకు పడుతున్నాడు.

'ఒరేయ్! చెవులు పట్టుకోండి. ఈ పందులతోపాటు నా ముందుకు రండి' అని మేష్టారు గర్జించాడు.

బుద్ధసింగు మాష్టారు గరగరమనే గొంతు వినగానే నేను వణికిపోయాను. ఇలాంటి శిక్ష అమృతసర్‌లోని ప్రాథమిక పాఠశాలను గుర్తుకు తెచ్చింది. అక్కడ పిల్లలను హింస పెట్టడం కొంత సుతారంగా వుండేది. బిషన్‌సింగు మాష్టారు బెత్తంతో కొట్టటం, వేళ్ళమధ్య పెన్సిళ్ళు పెట్టి గట్టిగా నొక్కటం అక్కడ అలవాటు.

మేము ముగ్గురం చెవులు పట్టుకొని నిలుచున్నాం. కాళ్ళ సందు నుంచి చేతులు దూర్చి చెవులు పెట్టుకునే ప్రయత్నంలో గణేశ్ ఒక పక్కకు ఒరిగాడు. తన బూటు కాలుతో గణేశ్ పడిపోయేంతవరకు మేష్టారు తన్నాడు. 'చెవులు పట్టుకుంటాను మాష్టారూ' అని వాడు బిగ్గరగా అన్నాడు.

గణేశ్ పడిపోవటంతో సానుభూతిగా నాకళ్ళలో నీళ్ళు నిండాయి. అప్రయత్నంగా 'అమ్మో!' అని అరిచాను.

'నీవు వీడి తమ్ముడివి గదూ!' అంటూ పళ్ళుపటపటా కొరికాడు మాష్టారు. నామీదికి ఆయన వంగినపుడు ఆయన ముఖం ఎఱ్ఱగా పరానువలె వుంది. కోటేరు వేసిన ముక్కు, లావుపాటి అద్దాల వెనుక చిన్న రాళ్ళలా మెరిసే కళ్ళు నేను చూశాను.

'ఘూష్టారూ! వీణ్ణి చుంచెలుక అంటారు' అన్నాడు జానీ, ఈ నియంతతో చేతులు కలుపుతూ.

'ఎలుకపిల్లా! చిట్టెలుకా — ఈ ఎలుకపిల్ల అన్నీ నమిలి తింటుంది. ప్రమాదకరమైంది. మా యింట్లో ఎలుక మా మెత్తపరుపు తినేసింది' అన్నారు మాష్టారు.

'మాష్టారూ! ఈ శిక్షకు నేను పశ్చాత్తాప పడుతున్నాను. ఇంకెప్పుడూ ఆలస్యంగా రాను ఈ చుంచెలుక ఆలస్యం చేశాడు. రాత్రి వాళ్ళ వదిన వీణ్ణి తిట్టిందని గునుస్తున్నాడు. గణేశ్, నేను తొందరగా రారా అని చెప్పాంకూడా. వీడు దిక్కులు చూస్తూ ఆలస్యం చేశాడు.'

జానీ నమ్మక ద్రోహాన్ని ప్రతిఘటిద్దామని నుంచోబోయాను. ఆ క్షణంలో మాష్టారు 'చేతులు చాచు' అని వాణ్ణి గదమాయించారు. జానీ కుడిచేతి వేళ్ళు ముడిచి చాపాడు. ఒక క్షణం ఆగి రెండవ చేయి చాపాడు. మరోదెబ్బ పడింది. నాచెవుల్లో ఆశబ్దం గింగురు మంటోంది. నా స్థితినిగూర్చి వూహించాను.

'అరేయ్ గణేశ్! లేచి నీవూ చేతులు చాపు.'

గణేశ్ విధేయంగా చేతులు చాపాడు. జానీకి పడ్డట్లే వీడికీ దెబ్బలు పడ్డాయి.

'మీరిద్దరూ మీస్థలాలకు వెళ్ళి బెంచీమీద నిలబడండి. మీరు ముగ్గురు చేతులు చాపండి.'

ఆ ముగ్గురిలో నేనూ వున్నానని అనుకొని లేచి నుంచో బోయాను. వెంటనే మాష్టారు బూటుకాలు నామోకాలికి బలంగా తగిలింది. నేను కుప్పకూలిపడ్డాను. గది దద్దరిల్లేలా ఏడ్చాను. బూటుదెబ్బకంటె భయంవల్ల ఎక్కువ అరిచాను. అదృష్టవశాత్తు బూటు నాకాళ్లకంటె బల్లకు బలంగా తగిలింది.

మిగిలిన ముగ్గురి విషయం పట్టించుకోకుండా మేష్టారు నన్ను బెత్తంతో ఎడాపెడా వాయించాడు. 'నోర్ముయ్. చుంచెలుకా! శబ్దం వినపడిందంటే చంపేస్తాను'

'వాడు చిన్నవాడు మేష్టారు' — 'మానిటరు' భాట్లియా అనడం వినిపించింది. పరిగెత్తుకొంటూ మేష్టారు భాట్లియా వద్దకు వెళ్ళి బెత్తం ఝళిపిస్తూ, అప్పుడప్పుడూ బల్లమీద తడుతూ, భాట్లియా వొంటిమీద కూడా చరుస్తూ విరుచుకపడ్డారు.

నాకు ద్రోహం చేసినందుకు జానీని, వాడి స్నేహితుడైనందున గణేశ్‌ను ద్వేషించాను. భాట్లియా నాకు సహాయంగా నిలబడ్డం దుకు వాడంటే ఆరాధనా భావం కలిగింది. కళ్ళనీళ్ళు తుడుచుకొంటూ, ఆపుకోలేనంత బాధతో —

'ఇలా మమ్మల్ని కొట్టడానికి మేం ఏంచేశాం' అన్నాను ఏడుస్తూ.

'మాష్టారూ! మిమ్మల్ని తిడుతున్నాడు' అన్నాడు జానీ.

'అబద్దాలకోరూ' అని అరిచాను.

జానీ చెప్పటానికి ముందు మాష్టారు నేను గొణగటం విన్నాడు. నేనిప్పుడు ఆయన్నే తిట్టా ననుకున్నాడు.

కోపం వచ్చిన ఎద్దులా నామీద పడి చెంపలు వాయిస్తూ బెత్తంతో కొట్టాడు. ఆయన దెబ్బలు బలమైనవి కావటంవల్ల ఒకదెబ్బ నాచెంప మీద పడి రెండోదెబ్బ బల్లకాలుకు తగిలింది. బెత్తం దెబ్బ నాకాళ్ళమీద పడింది. బల్లకు తగలడంతో ఆయన కోపం మరీ పెరిగి బెత్తం గట్టిగా పట్టుకున్నాడు. నేను నేల కరచుకొని పోవటంతో చేత్తో కొట్టటానికి వీలులేక తన్నటం మొదలెట్టాడు.

'అలా వాణ్ణి మీరు కొడితే చస్తాడు.' మానిటరు అరిచాడు.

'మాష్టారూ!' వెనకనుంచి ఎవరిదో గొంతు వినిపించింది. వాడు నాపక్కన కూర్చునే నయీమ్ అనుకొన్నాను.

'మాష్టారూ! మాష్టారూ!' చాలా గొంతులు కలిశాయి.

'మీరందరూ బెంచీలెక్కండి' మాష్టారు గర్జించాడు.

నావంటి దురదృష్టవంతుడు ఈయన పాలపడటం ఎంత బాధాక రమో. ఒకవైపు జాలి, మరోవైపు కోపమూ, క్షణకాలంలో చుట్టుము

ట్టాయి. నా ఏడుపు మరింత నాటకీయంగా చేస్తూ 'నన్ను చంపేశారు అమ్మా! రక్షించు' అని అరిచాను.

'ఏడుపు ఆపుతావా? లేకపోతే నిజంగానే చంపుతాను! ఎలుకపిల్లా! ఈ ఎలుకలన్నీ నీపక్షాన వున్నాయి. క్లాసుకంతా నాయకుడి ననుకునే భాట్లియా సంగతి ముఖ్యంగా చూస్తాను. మీరు జైలు అధికారుల పిల్లలని నేను భయపడను. మీ తల్లిదండ్రుల పై అధికారులు నాకు తెలుసు. మీ వెధవ పనివల్ల నాచేతికి రక్తం కారుతోంది చూడండి. నేను చేతులు కడుక్కుని వచ్చేంతవరకు బెంచీల మీద నిలబడండి' అన్నాడు మాష్టారు.

ఆయన అటూ యిటూ కదులుతూ మాట్లాడుతుంటే అందరూ వూపిరి బిగపట్టి నుంచున్నారు. మాష్టారు ప్రహరీవైపుకు వెళ్ళి అధ్యాపకుల గదివైపు నడిచేవరకు అందరూ బల్లలపై నిల్చున్నారు. వెంటనే భాట్లియా నా దగ్గరకు వచ్చాడు. మిగతా పిల్లలందరూ బల్లలు దూకి వచ్చారు.

'తర్వాత ఈ విషయం నేను షానవాజు మాష్టారుతో చెబుతాను. ఒరేయ్ జానీ కుక్కా! చిన్న పిల్లవాడి మీద చాడీలు చెప్పటానికి సిగ్గులేదట్రా' అన్నాడు భాట్లియా.

'పోరా! నీ పెద్దరికం నావద్ద చూపకు' అన్నాడు జానీ.

'ఒరేయ్ జానీ!' అన్నాడు నయీామ్. నాపట్ల క్రూరంగా ప్రవర్తించినందుకు.

'అయితే వాడు పరుగెత్తుకుంటూ సమయానికి బడికెందుకు రాలేదు' అన్నాడు జానీని సమర్థిస్తూ నయీామ్ అన్న అస్లమ్.

'చిన్నవాడు కాబట్టి, మాష్టారు ఈసారి తప్పించుకోలేరు. మనల్ని ఇంతవరకూ బాగా తన్నారు. 6వ తరగతిలోకి వచ్చినా తన్నటం మాన లేదు. ఈ చిన్నవాడి మీద ఆయన క్రూరంగా ప్రవర్తిస్తే ఫలితం అనుభవించక తప్పదు. నేను మున్షిహరీష్‌చంద్ర ద్వారా హెడ్‌మాస్టరుకు ఫిర్యాదు చేయిస్తాను. ఆ మొద్దు చేతులు కృష్ణ మొహంమీద ఎలా వాచాయో చూడు' అన్నాడు భాట్లియా.

ఆజంతువు వేళ్ళు నామొహంపై వాచాయి అన్న విషయం గుర్తుకు వచ్చి నాపై నేనే జాలితో ఏడ్చాను.

'అదుగో వస్తున్నారు! ఆయన యింటికి వెళ్ళలేదు. ఇంట్లో భార్యకూడా లేదుగా చెయ్యి కట్టుకట్టడానికి, అదుగో వచ్చేశారు' అని తలుపుపక్క కుర్రవాడు గొణిగాడు.

అందరూ గబగబా బెంచీ లెక్కారు. నేనూ అలా చేశాను. మాష్టారు గదిలో కొచ్చేసరికి నాకళ్ళలోంచి నీళ్ళు జారుతున్నాయి. ఆయన కళ్ళు నామీద పడ్డాయి. కళ్ళనీళ్ళ మధ్యలోంచి ఆయన భయం కరాకారం మసక మసకగా కనిపిస్తోంది.

'నా చేతికి దెబ్బలు తగిలాయి కాబట్టి నేనింక మిమ్మల్ని కొట్టలేనని అనుకోవద్దు. నాకుడి చేయ్యిలా ఎడమచెయ్యి గట్టిది. మీరు చిన్నవాళ్ళయి నంత మాత్రాన నా శిక్ష తప్పించుకోలేరు. బడికి వచ్చే దారిలో అడ్డాలు తిరిగి ఆలస్యంగావచ్చి మీపక్క వాళ్లకు కూడా ఆలస్యంచేస్తే వూరుకోను.' (గాలిపీల్చుకోటానికి క్షణం ఆగి)— 'గుర్తుపెట్టుకోండి ఒక్క నిముషం ఆలస్యంగా రాకూడదు. సమయానికి రావాలి. కేవలం ఆంగ్లభాష నేర్చుకుంటే సరిపోదు. వాళ్ళ అలవాట్లు కూడా నేర్చుకోవాలి. మన దేశాన్ని పరిపాలించే అదృష్టం వారికి కలగటానికి వాళ్ళకున్న మంచి లక్షణాల్లో కాలనియమం పాటించటం ముఖ్యమైనది. నేను డాక్టరు దగ్గరకు వెళ్ళి కట్టుకట్టించుకుంటాను.' ఈ మాటలు పూర్తికాగానే బల్ల దగ్గరకు వెళ్ళి పుస్తకం మూసి సొరుగులో పెట్టి బెత్తం ఎడంచేతిలో పట్టుకొని బయటకు నడిచారు మేష్టారు.

'నేను వెళ్ళి షానవాజు మాష్టారుతో చెప్తాను. దెబ్బలు తిన్న వాళ్ళంతా నాతో రావాలి' అన్నాడు భాట్లియా దూరంగా మాష్టారు వెళ్ళాడని గ్రహించి.

మరుక్షణంలో షానవాజు మాష్టారు గదిలో ప్రవేశించారు. పిల్ల లంతా నిశ్శబ్దంగా కూర్చున్నారు.

'మీరు చాల క్రమశిక్షణగల పిల్లలు' గడ్డాన్ని తడుముకుంటూ లోపలికి వస్తూ అన్నారు. ఎవరూ నోరు మెదపలేదు.

'మిమ్మల్నందర్నీ చంపాడా! లేక మీరందరూ అద్భుతమైన మను షుల్లా మారిపోయారా? చదువంతా చెప్పేశాడా?' మాష్టారు అరిచారు.

'మాష్టారూ! ప్రతి ఉదయం ఇలా నిర్దాక్షిణ్యంగా కొట్టించుకోడం మావల్ల కాదు. కృష్ణను ఎలా కొట్టారో చూడండి. ఐదు వేళ్ళూ ముఖం మీద ఎలా వాచిపోయాయో' అంటూ భాట్లియా నన్ను చెయ్యిపట్టిలాగి మాష్టారు ముందుకు తోశాడు.

'మాష్టారూ! నన్ను పంది అని అసభ్యకరంగా తిట్టారు. మాలోనే కొందరు ద్రోహులు చాడీలు చెప్పేవారున్నారు.' ఫిర్యాదులు చేస్తూ అన్నాడు నయీమ్.

'ఇంక ఏమి చెప్పవద్దు. నాతో ఇప్పుడు మీరందరూ మాట్లాడుతు న్నట్టే అప్పుడెందుకు కలిసి మాట్లడలేదూ?' అన్నాడు మాష్టారు.

'మాష్టారూ! నేను మాట్లాడాను. కానీ ఫలితం ఆయన దెబ్బలు'. అన్నాడు భాట్లియా.

మీరందరూ కలిసి హెడ్మాష్టరు గారికి చెప్పి వుండవలసింది

'మాష్టరూ! మాలో కొందరు పిల్లలు...'

'నాకు తెలుసు మీలో కొందరు ఇతరులు మీద చాడీలు చెప్పారు. మీరందరూ కలిసి కట్టుగా ఏక కంఠంతో మాట్లడితే తప్ప ఈ రాక్ష సుడి బారి నుంచి తప్పించుకోలేరు. ఇంక ఫిర్యాదులు చాలు. మీ పుస్తకాలు తెరవండి.'

ఆరోజు నా గుండె లోతుల్లోంచి వెదికితే పెద్దలు వారి హృద యాల్లో నా పట్ల జాలి చూపుతారేమోనని అనుకున్నాను. అది జరగదని తెలిసిన తర్వాత గుర్తు తెలియని చోటికి వెళ్ళి పోవాలను కున్నాను. ఈ పరిస్థితుల్లోంచి నేను తప్పించుకుపోలేని స్థితిలో వున్నానని గ్రహించాను. ఏం చేయాలి? అన్న ప్రశ్న నా మనసులో తుకతుక లాడుతోంది.

బళ్ళో కొందరు పిల్లలు భయస్తులు కావటం వల్ల, అందరూ కలిసి

కట్టుగా వెళ్ళి హెడ్మాష్టరు గారితో బుద్ద సింగు మాష్టారు మీద ఫిర్యాదు చేయలేదు. ఫలితం ఆయన క్రూరత్వానికి బలికావటం.

ఇంట్లో, హరీష్కు నా పట్ల సదభిప్రాయం వుంది కానీ ద్రౌపది నామీద ఎందుకు కోపంగా వుందో కారణాలు తెలుసుకునే ఓపిక లేదు. మేము మాంసం తింటున్నాము కాబట్టి బయట వడ్డిస్తోంది.

అమ్మనాన్నల మీద, హరీష్ మీద, నామీద ఆవిడకు తిరస్కార భావం వుందని గ్రహించాను. నేను అమ్మానాన్నల కోసం మూర్ఖంగా ఏడవటం అన్నమీద ఆధారపడటం ఆవిడ కోపానికి కారణం ఈ విధంగా నాదయనీయ పరిస్థితిని సమీక్షించినపుడు మరింత దుఃఖం ఆవహించింది. యింట్లో హరీష్, బళ్ళో అద్భుతమైన షానవాజు మాష్టారు నాకు మిగిలిన ఆశ.

ఇంటికి రాగానే, సాయంకాలం ఆఫీసుకు వెళుతున్న హరీష్ను అనుసరించటానికి ధైర్యం కూడదెచ్చుకున్నాను. ఆయన నాదగ్గరకు వచ్చి నేను పాలు తాగుతుంటే అసహనంగా ముఖకవళికలు చూపి—

'కృష్ణా! నిన్న రాత్రి మీవదినెతో తగవు పెట్టుకొని ఏడ్చావని విన్నాను. అలా ఎప్పుడూ అసభ్యంగా ప్రవర్తించకు. అమ్మా నాన్నా దూరంగా వున్నారు. వాళ్ళు వచ్చి నిన్ను తీసుకు వెళ్ళటానికి కుదరదు. అక్కడ నీకు బడిలేదు కూడా' అన్నాడు.

'కానీ,' ఈ విధమైన మోసాన్ని నేను సహించలేకపోయాను. నేను వేరే మాట మాట్లాడే లోపల ఆయన తన తీర్పు ఇచ్చి నన్ను ఓడించాడు. నేను ఆయనను సమర్థించటం వల్లనే వదినకు నామీద కోపమని చెప్పలేక పోయాను.

'గణేశ్ చూడు! ద్రౌపదికి అన్నిపనులూ చేసిపెడతాడు. ఎంత మంచివాడు' అన్నాడు హరీష్.

గణేషు అక్కడే కూర్చుని పాలిపోయిన ముఖంతో వుండటం నాకు మరింత ద్వేషాన్ని కలిగించింది.

హరీష్ వెళ్ళగానే నేను వాణ్ణి తిడతానని భయంగా వున్నాడు. వాడు

ధర్మానికి ప్రతిరూపంగా హరీష్ చెప్పటం నాకు నచ్చలేదు. ముంగిట్లో మంచంమీద కూచుని ఆ సాయంత్రం వంటకు కూరలు తరుగుతున్న ద్రౌపది తృప్తిగా వున్నట్లనిపించింది.

'అన్నయ్యా! వీడు నీకు పెద్దమనిషిలా కనిపించవచ్చు. కానీ వీడూ, జానీ బుద్ధసింగు మాష్టారుతో బడికి ఆలస్యం చేశానని చెప్పారు. ఆయన నన్ను నిర్దాక్షిణ్యంగా కొట్టారు. నాముఖం మీద కందిపోయిన ఆయన వేళ్ళు చూడ' డంటూ పిచ్చిగా ఏడుపు లంఘించుకున్నాను.

'సరే! ఎప్పుడూ ఏడవకు' అని హరీష్ అరిచాడు. నాముఖం లోకి చూస్తూ చెంపమీద దెబ్బని గమనిస్తున్నాడు. ఆ విధంగా నాపట్ల మృదువుగా వుండటం నాకు మరింత దుఃఖాన్ని తెప్పించింది.

'నన్ను రైలెక్కించి అమ్మానాన్న దగ్గరకు పంపించు. ఈ జైల్లో నేనింక వుండలేను.'

'పసిపిల్లవాడిలా ప్రవర్తించకు. నీ పిచ్చి కాకపోతే మాలాఖండ్ వందల మైళ్ళ దూరంలో వుంది. బుద్ధసింగు మాష్టారు నిన్నుకొట్టకుండా చూస్తాను' అన్నాడు హరీష్ మృదువుగా, దాంతో నాకు కొంత ఓదార్పు కలిగింది. అదే సమయంలో బయట తలుపుతట్టి, నయీమ్, భాట్లియా, అస్లమ్ ఇంట్లోకి వస్తూ—

'కృష్ణా, గణేశ్ ఫుట్‌బాల్ తీసుకురండి ఆడుకుందాం.' అన్నారు

'రండి పిల్లలూ! మీరందరూ కృష్ణలా ఎక్కువ దెబ్బలు తిన్నట్లు లేదు.' అన్నాడు హరీష్.

'వాడిలా మమ్మల్ని నిర్దాక్షిణ్యంగా కొట్టలేదు.'భాట్లియా ఫిర్యాదు చేశాడు.

'నిజంగానా!' హరీష్ గొంతులో ఆదుర్దా కనిపించింది.

'వాడు చావలేదు ఆశ్చర్యంగా వుంది.' అన్నాడు నయీం.

'అవును' అని గొంతు కలిపాడు అస్లమ్.

'నువు నాతో చెప్పలేదేమిరా గణేశ్' హరీష్ అడిగాడు.

'ఎందుకు చెప్తాడు. వీడూ జానీ కలిసి ఆలస్యం చేశానని ఫిర్యాదు చేశారు. వాళ్ళిద్దరూ నన్ను మోసం చేశారు!' అని స్నేహితులుండటం చూసి నాటకీయంగా చెప్పాను. 'నేను కాదు జానీ. వాడు కూడా కావాలని చెప్పలేదు.' గణేశ్ అడ్డుపడుతూ అన్నాడు.

'రండి. రండి. మీరందరూ కలిసికట్టుగా ఆడుకోండి. కృష్ణా నీబంతి ఎక్కడ? జానీని పిల్చుకొచ్చి ఆట మొదలెట్టండి. ఆఫీసులో కొంచెం పనివుంది, అది చూచుకొని వచ్చి నేనూ మీతో కలిసి ఆడుతాను. ఆటస్థలం బాగు చేయించాను. ఇంక వెళ్ళండి' అన్నాడు హరీష్.

'ఈ సాయంత్రం మీరు పట్టణానికి వాహ్యాలికి వెళ్ళటం లేదా?' అమాయకంగా అడిగాడు బాట్లియా. 'లే'దన్నట్లు హరీష్ తల ఆడించాడు.

'లేదు.' ద్రౌపది అనునాసిక స్వరంతో ఇంచుమించు ఏడుస్తున్న ట్లుగా ఇలా అంది. 'రాత్రి నానాగడ్డితిని వచ్చాడు. ఈ నెల జీతం అంతా తాగుడుకు, జూదానికి, వేశ్యలకు సరిపోయింది. ఇంక ఊరో జుకు ఏమీ మిగల్లేదు.' కోపంతో జేవురించిన ఆవిడ ముఖం ఇంట్లో వురుములతో కూడిన మేఘంలా వ్యాపించింది.

'ఈ పిల్లల ముందు మొరగకు, రండి పిల్లలూ ఈ పవిత్ర దేవా లయంలోంచి మనం బయటికి వెళదాం.' పిల్లల ముందు తన పరువు పూర్తిగా తీసివేస్తుందని భయపడి అరిచాడు హరీష్.

పిల్లలంతా విధేయంగా నడుచుకుంటూ వెళ్ళారు. వదిన ప్రవర్తన వాళ్ళకు భయాన్ని కలిగించింది.

మంచం కింద బంతి తీసుకొని ద్రౌపదివైపు చూస్తూ పిల్లలవెంట నడిచాను. బుద్ధిసింగు మాష్టారు ప్రవర్తన పిల్లలద్వారా విని ఆవిడ ఇకనైనా నామీద సానుభూతి చూపిస్తుందని వూహించాను. ఆవిడ అధి క్షేపంగా మాటాపలుకూ లేకుండా కూచుంది. అవ్యక్తమైన అధిక్షేపణవల్ల ఆవిడ ముఖం మరీ నల్లబడింది.

మేము బయటికి రాగానే హరీష్ అరవడం వినిపించింది. 'ఏమే! పిల్లలముందు నన్ను అవమాన పరచటానికి నీకు సిగ్గులేదూ? నీకెంత

ధైర్యం ఆ చిన్నవాడిపట్ల ఎంత క్రూరంగా ప్రవర్తించావు?'

కాలితో తన్నటం, పెనుగు లాడటం ద్రౌపది అడ్డుచెప్తూ ఏడవటం దూరానికి వినిపించాయి.

నేను పరుగెత్తుకుంటూ ముందుకెళ్ళాను. అన్నావదినల మధ్య తగువుకు నేను కారణమయ్యానని బాధగా వుంది. అయితే హరీష్ నాపట్ల ఇప్పుడు సానుభూతిగా వున్నాడన్న విషయం సంతోషాన్ని కలిగించింది.

ద్రౌపదితో తగాదాపడిన తర్వాత మాతో కలిసి ఆడే విషయంలో హరీష్ మనసు మార్చుకున్నట్లున్నాడు. ఆఫీసుకు వెళ్ళి తిరిగివచ్చి మంచి సిల్కులుంగీ తలపాగా ధరించి చేతులో తోలు తుపాకీ పట్టుకొని పట్టణంవైపు నడిచి వెళుతుండటం గమనించాం.

మేము ఆడుకొని ఇంటికి రాగానే సందు వెనుక నిశ్శబ్దం తాండవం చేయటం పొయ్యిలో పొగరాకపోవటం గమనించాం. రెండు పళ్ళెములలో వడ్డించి మూతపెట్టి వుంది. గదిలోకి తొంగి చూస్తే చీకట్లో మంచంమీద వదిన పడుకొని వుంది. ఆ నిశ్శబ్ద వాతావరణానికి ఆవిడ కోపానికి భయపడి ఏంచేయాలో మాకు తోచలేదు.

నిశ్శబ్దంగా ముఖాలు చేతులూ కడుక్కొని చిన్నగా నడుచుకుంటూ వెళ్ళి భోజనానికి వుపక్రమించాం. ఎండిపోయిన చపాతీలు ఉదయం పులుసూ, కూరా వున్నాయి. ఆకలితో వున్నందువల్ల నేను గబగబా భోంచేశాను. గణేశ్ తల భాగంమీద మూతపెట్టి ప్రార్థనలు చేయటానికి ప్రశాంతంగా పక్కమీద కూచున్నాడు.

నేను వదిన వెనుకగా వెళ్ళి భుజంమీద చేతులు వేద్దామనుకున్నాను. కానీ ఆవిడ మరీ బిగుసుకుంటుందేమోనని మానేశాను. హరీష్‌కు ఆవిడకు మధ్య తగువు ప్రారంభం కావటానికి నేనే కారణం. చిన్నారి, సుకుమారపు బిడ్డనైన నాకు ఆవిడ మౌనం బాధాకరంగా వుంది. ఆవిడ తిట్టినా కొట్టినా బాగుండేది. ఎప్పుడైనా నామీద కోపం వచ్చినపుడు అమ్మ నన్ను కొట్టేది. అలా కొట్టిన తర్వాత ఆవిడ నామీద మరీ వాత్సల్యం చూపేది.

ఈ విధంగా మౌనంగా కూర్చోటం నాకేమీ నచ్చలేదు. ఇందువల్ల మాయింట్లో ఏర్పడిన ఉద్రిక్తత ఏవిధంగానూ తగ్గదని నాకు తోచింది.

ఫుట్ బాల్ ఆడి అలిసిపోయిన పాదాలు నొక్కుకుంటూ ఈ నిశ్శబ్ద వాతావరణాన్ని ఎలా ఛేదించాలా?, సామరస్యం ఎలా కుదర్చాలా? అని తోచక విసుగ్గా కూచున్నాను. కళ్ళు మూతలు పడిపోతున్నాయి. ఆవులింతలు వచ్చాయి. ఇంక ఏమాత్రమూ సహించలేక వదినపట్ల మమకారం చూపటానికి నిశ్చయించుకున్నాను. కదల్లోల్లా నిశ్శబ్దంగా ద్రౌపది పక్కకు వెళ్ళి ఆవిడతొడ మీద తలపెట్టి పడుకున్నాను. క్షణకాలం పాటు ఆమె కదలలేదు. తర్వాత గొంతులో ఏదో గొణిగింది. నేను కదల్లేదు. ఆవిడ జాలికోసం ఎదురు చూశాను. ఆవిడ నాతల నిమురుతూ జుత్తు సవరిస్తూ ఇలా గొణిగింది

'వెళ్ళి పడుకో నాయనా కృష్ణా! నిద్రపో' అంది తన మొరటుతనాన్ని వీడి స్త్రీస్వభావమైన మృదుత్వంతో. ఆవిడ సన్నగా మాట్లాడిన మాటలు నాకు పాటలా వినిపించాయి. నా చెవుల్లో నిశ్శబ్ద నిశీధి వాతావరణంవల్ల కలిగిన భయానికి వుపశమన వాక్యాల కోసం ఎదురు చూస్తున్నాను. ద్రౌపది తొడమీద తల భద్రంగా వుండటంతో క్షణకాలం పాటు నా మనసులో ప్రశాంతత ఏర్పడింది. ఆవిడ నన్ను నిరాకరించలేదనే విషయం నాగుండె గొంతుకల్లో సుఖమయ ప్రపంచాన్ని చవి చూపి, ప్రపంచమంతా సున్నితమైందని అనిపించింది. బయట వాతావరణం నాకు స్పష్టంగా వినిపిస్తూనే వుంది. వదిన బాధపడుతూ ఇలా గొణుగుతూంది:

'నీకు తెలీదు బిడ్డా! ఆయన నన్నెంత నిర్దాక్షిణ్యంగా చూస్తారో! మీ అన్న సంగతి నీకేం తెలుసులే. నాకు పిల్లలు లేరు కాబట్టి నాతో ఆయనకు ఏమీ ప్రమేయం లేదు....... వేశ్యావాటికలకు వెళ్ళి నానాగడ్డీ తింటారు. అయ్యో! నేనెంత బాధపడుతున్నానో నీకేం తెలుసు. నీకూ మీ అమ్మకూ ఏమని చెప్పను! ఆవిడ తప్పంతా నాదే ననుకుంటుంది. మీ నాన్నగారు అగాఖాన్ మతాన్ని వదిలి, ఆర్యసమాజంలో చేరారు. మా కుటుంబం ఇంకా అగాఖాన్ మతంలోనే వుంది. అందువల్ల నేను వెనక్కుతిరిగి మా తల్లిదండ్రుల వద్దకు వెళ్ళే అవకాశం కూడా లేదు.'

ఆవిడమాటల జోలపాటకు నాకు నిద్ర పట్టేసింది. ఆవిడ ఏడుస్తూ మాటిమాటికీ అన్నమాటలు మాత్రం వినపడుతున్నాయి...... 'ఇంక నాకేది దారి?'అంటోంది ఆమె.

# 3

ఛిద్రమైన గృహ వాతావరణం కఠినమైన పాఠశాల వాతావరణం మధ్య నేనేం చేయాలో నాకే తోచటం లేదు. అమృతసర్‌లో నాకు తగిలిన ఎదురు దెబ్బలు తట్టుకొని నేను నా జీవనపంథాను ఎలానో నిలుపుకున్నాను. దేవదత్త బాబాయి నాకిచ్చిన విప్లవ పంథా, విజ్ఞానంపట్ల ఆసక్తి, మోసకారులపట్ల, అభినయం చేసేవారిపట్ల వ్యతిరేకత నాకు అలవడ్డాయి. ఇప్పుడు నేను కావాలని అమాయకత్వాన్ని, నిరాడం బరతను అలవరచుకున్నా అవి ఎన్నో ఒడుదుడుకులకు లోనయ్యాయి. ప్రతిదీ ఎదిరించటానికి అలవాటు పడ్డాను. జైల్లో నివసించటానికి వచ్చా నన్నది, ప్రతీకగా నాకు కనబడుతోంది. నేను ఖైదీలా వున్నట్లు భావించ సాగాను. దిండులో తలదూర్చుకొని ఏడుస్తూ జైలులో తోసివేయబడ్డ ఖైదీలా నాలుగు గోడల మధ్య వున్నట్లనిపించింది. ఇక్కడ నేను ఏదీ స్వతంత్రంగా నిర్ణయించుకోలేను. విరక్తి భావంతో వున్న వదిన, మమ్మల్ని ఆంగ్లేయుల్లా తీర్చిదిద్దాలని ఆశపడే భార్యలేని మాష్టారు— వీళ్ళిద్దరి మధ్యా నాపరిస్థితి ఏమిటి?

ఈ సమయంలో నాలో సంఘర్షణ తీవ్రమై మరణిద్దామనే ఆలో చన వచ్చింది. నూరావలె బావిలో దూకుదామా? అతను జానీ అక్కను ప్రేమించి త్యాగ బుద్ధితో అలా చేశాడు. లైలా మజ్నూ కథలో వలె అది గొప్పవిషయం. జీవితానికి భయపడి పిరికివాడిలా నేను చనిపోవటం సహేతుకం కాదు. అయితే, నేను జీవితాన్ని ప్రేమిస్తున్నాను. ఆ జీవి తంలో స్వాతంత్ర్యమనేది లేనప్పుడు నేను దాన్ని వదులు కోవటం గొప్ప విషయం కాదా! అని వాదించుకున్నాను. జైలుతోట బావిలో

పడిం తర్వాత నాశవాన్ని బయటికి తీసి శవాగారంలో పెట్టినపుడు నా ముఖాన్ని వూహించుకుని భయపడ్డాను.

ఎంత కష్టమైన పరిస్థితులు వచ్చినా మనిషి దుఃఖ పడకూడదు. నిర్జీవమైన ముఖంకన్నా వూపిరి పీలుస్తున్న వ్యక్తి మేలు. కౌసల్య చనిపో యినపుడు ఆవిడ నీలిరంగు కళ్ళల్లో మృత్యుచ్ఛాయలు నేను మరచిపోలేను.

నేను తలపెట్టి పడుకోవటానికి ఎక్కడా చోటు కనిపించటం లేదు. పగటిపూట గదిలో మేం పడుకోవడానికి లేదు. నేతగుడ్డలతో గలీబువేసిన పక్కలూ, దిండ్లూ పగటిపూట వాడరాదు. నాదుఃఖం వుపశమించటానికి జైలు తోటలోకి వెళ్ళి ద్రాక్షగుత్తి తస్కరించటానికి ప్రయత్నించాను. దొంగ తనంగా పండ్లు తినటం నామనసు నొప్పించింది. ద్రాక్ష చేదుగా అనిపించి నాకళ్ళు మంటలు పుట్టాయి. నేను స్మశానంవైపు వెళ్ళి అక్కడ కాపలాదారు ఫకీరుతో మాట్లాడాను. జీవితమంతా వృధా అనీ దాన్ని ఎలానో గడపాలనీ అతను చెప్పాడు.

కష్టాలను భరించి బాధలను సహించి వుండటానికి అంగీకరిస్తే ఆ బాధలు ఏమీ చేయవు. అందువల్ల నేను రహస్యంగా నా అన్నాన్ని కుక్క లకు వేసి ఆదివారాలు ఉపవాసం వుండటానికి ప్రయత్నించాను. కానీ ఆకలికి తట్టుకోలేక పోయాను. ఆదివారం మధ్యాహ్నం హరీష్‌తో ఆర్య సమాజ సమావేశానికి పట్టణానికి వెళ్ళి రావటానికి మూడు మైళ్ళు నడవాలి.

ముళ్ళ మీద ఒట్టి కాళ్ళతో నడవటం కూడా, అది ప్రారంభిం చిన కొద్ది సేపటికే మాని వేశాను. సన్యాసం నావల్ల కాదు. ఐతే నేనెక్కడికి వెళ్ళాలి. నా లోలోపల వణుకు పుట్టింది. నాలో కోరికలు భావాలు ఎలా అణచుకోవటం.

నేను ఒక సుకుమారమైన చెట్టుతో సమానం. విసురుగాలి ఛాయ కూడా నాకు విపరీతం. ఈ వాస్తవాన్ని నేను అంగీకరించాలి. నేను బ్రతకటమనేది ఎలానో కొనసాగితే, దానికి కారణాలు అనేకం.

హరీష్ కాగితాల్లోంచి బర్మా జైలులో వున్నపుడు ఢిల్లీని పరిపా లించిన మొగలు పాదుషా బహదూర్‌షా జఫ్ఫారు రాసిన ఒక పద్యాన్ని

నేను సంపాదించాను. దొంగతనంగా జైలు తోటలో శవాగారానికి పక్కన వున్న సందులో పెద్దగా చదువ సాగాను.

ఆంగ్లేయుల ఖైదీగావున్న ఈతని విషాద గీతాలలో, మరణించిన స్నేహితులను, బంధువులను ప్రస్తావించాడు. శరత్కాలంలో బీడుపడ్డ తోటలో జీవితాన్ని ఆయన పోల్చాడు.

ఈ మహోన్నత ఖైదీతో నేను స్నేహాన్ని పోల్చుకొని, అప్రయత్నంగా నా మాతృభాషలో ఒక గీతాన్ని వ్రాశాను.

'పంజరంలో పక్షిని నేను'

నా మొదటి గీతానికి ఉపమాలు, ఉత్ప్రేక్షలు జోడించటానికి వెతక సాగాను. గణేశ్, మిగతా పిల్లలు — 'బంతి ఎక్కడ దాచినా తీసుకరా' అని అరుస్తుంటే, నేను మళ్లీ నడక సాగించాను.

ఒంటరిగా నేను నడుస్తున్నప్పుడు మళ్లీ మాయాప్రపంచంలో సౌధాలను నిర్మించుకొని, సుదూరతీరాలకు వెళ్ళ గలిగాను. అయితే మా క్వార్టర్లకు సమీపంలోని మహమ్మదీయుల శ్మశానం దాటి వెళ్లేవాణ్ణి కాదు. నా ఊహాసౌధాలు ఆకాశమంత ఎత్తు, వాటి చుట్టూ లోతైన అగడ్తలు, ఏదో తెలియని వస్తువుల్ని వెతకటానికి ఎక్కడెక్కడికో వెళ్లడానికి బలాన్నిచ్చేవి. నా ఊహాలోకాల్లో ఎలాంటి అవరోధాలు ఉండేవికావు. జీవితానంతరం ఏమి జరుగుతుందనే భయం, దయ్యాలను గూర్చిన ఆందోళన నన్ను వెంటాడేవి. ప్రతి ఒక్కరు పచ్చిక బయళ్లలో వణుకుతూ దారిద్ర్యంలో కాటికపు సంవత్సరంలో బిచ్చగాళ్లవలె తిరుగుతున్నారు.

నా చుట్టూవున్న ప్రజలు నా మాయాజాలానికి అవరోధంగా నిలవలేకపోయారు. అమ్మ నాకు చెప్పిన కథలు, నా పూర్వ్యకాలపు స్వప్నాలు, చిన్నతనపు అస్పష్టపు జ్ఞాపకాల గీతాలు నన్ను ఆవరించేవి.

అమ్మ నౌషిరాలోను, వాళ్ల పుట్టిల్లు డాస్కాలోను తరచు చెప్పిన కథ యిన్నిరోజులనుంచి నాకు జ్ఞాపకం. సియాల్‌కోట రాజైన శల్వాణ రాజు కుమారుడు రాసలరాజు సాహసగాథ బాగా గుర్తు.

హరీష్ వద్దకు మమ్మల్ని పంపేటప్పుడు అమ్మ ఆ కథలో లూనా

రాణివలె కనిపించలేదు. మా అదృష్టంకోసం జలాన్ని కుండలో తీసుక వచ్చింది. లూధియానాలో రైలు ఎక్కడానికి ప్రతాప్ బాబాయితో మేము బయలుదేరినపుడు అమ్మ జలతారు కిటికీల్లోంచి మహారాణిలా మాకు వీడ్కోలు చెబుతూ విలపించి ఉంటుందని ఊహించాను. ఆమె మహారాణివలె తన కుమారునికి కొన్ని గీతాలు వినిపించి వుంటుంది. ఆమె ఏడుస్తూ, నాకోసం చేతులు చూపుకొని నిలుచోడం నా కళ్ళలో చిత్రపటంలా మెదలుతోంది. ఆమె సంతప్త హృదయంలోంచి వెలువడ్డ వాక్యాలు నాగుండె గొంతుకల్లోంచి వెలువడ్డాయి.

మేము బయలుదేరినపుడు అమ్మ జలతారు కిటకీల్లోంచి మహారాణిలా మాకు వీడ్కోలు చెబూతూ విలపించి ఉంటుందని ఊహించాను. ఆమె మహారాణివలె తన కుమారునికి కొన్ని గీతాలు వినిపించివుంటుంది. ఆమె ఏడుస్తూ నాకోసం చేతులు చూపుకొని నిలుచోడం నాకళ్లలో చిత్రపటంలా మెదలుతోంది. ఆమె సంతప్త హృదయంలోంచి వెలవడ్డ వాక్యాలు నా గుండె గొంతుకల్లోంచి వెలువడ్డాయి.

"ఓ నా చిట్టి రాసలు, నిన్ను చూడగలనా?
ఓ చిన్ని రాసలు, నీ శకటధూళికి చూపు అడ్డుకొంటోంది—
ఖడ్గవాదరలు నాగుండెను కోతలా నిలిచి
నా గుండెల్లో మంటలు రేపుతున్నాయి.
ఓ రాసలూ, నీకు వినిపిస్తోందా?
జైలులో ఆకలిదప్పులకు తట్టుకొన్న కుమారా!
నీ మాతృమూర్తి దుఃఖభారం నీకు తెలుసా!
ఓ రాసలూ! నీకు వినిపిస్తోందా?"

రాణీ లూనా పాటను మాటిమాటికి వల్లిస్తుంటే నాలో ఏకాంత భావం, చిన్నతనం, నాచుట్టూ వున్న ప్రపంచంలో జాలిలేని నిరాదరణ జీవిగా బ్రతకడంలా కనిపించింది. నా మనసులో చాలాకాలంగా ఎదురు చూస్తున్న ప్రార్థన గుర్తుకొచ్చింది.

'ఓ దేవా! నేనుకూడా ధనసింగు, బాట్లియాలా పాడువుకావడానికి వరమివ్వు. మాలకండ్ కోటవరకు నడిచి, ఈ జైలునుండి బయట

పడటానికి శక్తి నివ్వు.'

ఇంతలో కొందరు పోలీసులు కొత్త ఖైదీలను తీసుకొని వెళ్లడం కనిపించింది. చేతులకు బేడీలు వేసిన ఇద్దరు ముగ్గురు వ్యక్తులు కాళ్లకు సంకెలలు వేలాడగా బాధగా నడుస్తూ ఉన్నారు. బహుశా వాళ్లు జిల్లా కోర్టులో శిక్ష విధించబడి యిక్కడకు వచ్చివుంటారు. వాళ్లతోకూడా నేనూ జైలు ద్వారంవరకు వెళ్లాను. కాళ్ల సంకెలలు రాచుకొని, గుడ్డలు చుట్టినప్పటికీ పుండుపడి మంటపుడుతుండవచ్చు. వాళ్లకోసం వాదిద్దామని, మా అన్న హరీష్ చంద్రను చూడాలని అడిగాను. అక్కడవున్న వార్డను నన్ను తరుముతున్నాడు. ఖైదీలు కూడా నన్ను తిట్టి తేరిపార చూశారు.

నాతో ఆడుకొనే కుర్రవాళ్లు వచ్చేంతవరకు ఏకాంతపు పొరలు నన్ను చుట్టుముట్టాయి. ఆ గోడల మధ్య ఉరితీసే స్థలానికి, శబ్దంచేస్తూ తిరిగే నీళ్లబావి గిలకను, చూస్తూ తిరిగాను. ఈలమ్ దీన్ బాగా హుషారుగా ఉన్నాడు. ఎద్దులతో నీళ్లుతోడే పీటపై నన్ను కూచోనిచ్చాడు. దానికి కట్టిన రెండు ఎద్దులు విరామం లేకుండా ముందుకు, వెనక్కి ఒకే పద్ధతిలో తిరుగుతున్నాయి. వాటికి హుషారు పుట్టించటానికి వాటి వెనక ముల్లుకర్రతో పొడిచాను.

మాలీ ఇలామ్‌దీన్ కంటె బలంగా ఎద్దులను కొట్టాను. కారణం నాకే తెలియదు.

గిలక శబ్దానికి, నీళ్లు తోడేటప్పుడు బానలోనుంచి నిరంతరం స్రవించే నీళ్లు కలిగించే శబ్దాన్ని నేను ఆనందంగా వింటున్నాను. తన గుర్రం మీదనుంచి సాహసంగా దూకే రాసలురాజావలె, నేను కూచొన్నచోటులోంచి ఎగిరి కూచొంటున్నాను.

నా క్రూరత్వంపట్ల నాకే ఆశ్చర్యంవేసి, నన్ను నేను బోసిగా భావించి, పరుగెత్తుకొంటూ వెళ్లి బావిగోడ మీద కూచొన్నాను. నా ప్రతిబింబం నేను బావినీళ్లలో చూసుకొంటూ, బావిలోకి దూకాలనే ఆదుర్దాను ఆపుకొని, నాలోని ఆసక్తిని చంపుకొని నిలుచున్నాను.

హరీష్ నన్ను పట్టుకొని, యిక్కడ కాకుండా, మరెక్కడైనా ఆడు

కోమని మందలించాడు.

నా చిన్నతనపు పిచ్చిచేష్టలకు, రంగులు మార్చే ఊసరవెల్లి గుణానికీ, నాలో నేను సిగ్గుపడి, మల్బరీ చెట్ల నీడకు పరుగెత్తాను.

సాధారణంగా మర్రిచెట్టు నీడకు పరుగెత్తే వాణ్ణి. అక్కడ ఖైదీలను చూడటానికి వచ్చిన సందర్శకులు, బంధువులు వుంటారు. నేను వాళ్లతో ముచ్చటించేవాణ్ణి. మాటల సందర్భంలో నేను మున్షీ హరీష్ చంద్ర తమ్ముడినని చెప్పేవాణ్ణి. వాళ్లు నాకు లంచమిచ్చినట్లు 10పైసలు, 20పైసలు చేతిలో పెట్టేవారు.

మధ్యాహ్న సమయాలలో అక్కడ ఎవరూ ఉండరు.

విశాలంగా పరచుకొన్న మర్రిచెట్టు దట్టంగా పొదలాఉంది. దాని చుట్టూ వేలాడే నల్ల గుబురుపొదలు చుట్టూ ఏకాంతాన్ని గుర్తు చేస్తున్నాయి.

అమ్మ చెప్పినట్లు కూడా దయ్యాలు పడతాయా? ఈ మర్రిచెట్టు ఊడలు చూస్తుంటే, వీటి వేళ్ల మొదట్లో ఎవరో ముసలి వ్యక్తి కూచొనివున్నట్లు తోస్తుంది. నేను మర్రిచెట్టు మొదట్లో ఖాళీగా ఉన్నచోట కూచొని, తాపీగా ఉన్నాను. కళ్లుమూసుకొని మగత నిద్రలోకి వెళ్లాను. కలలో నా జుట్టుపట్టుకొని ఒక రాబందు ముక్కుతో లాక్కెళ్లింది. నా కళ్లలోంచి నక్షత్రకూటం వెలువడి భూమ్యాకాశాలకు, నక్షత్రాలకు మధ్య తిరుగాడుతోంది....ఇంతలో నేను ఒంటరిగావున్నానని గుర్తుకు వచ్చి మేలుకొన్నాను.

అమ్మ చెప్పింది — భూమిని తన కొమ్ములపై మోస్తూ ఒక వృషభం ఉందనీ, ఒక రాక్షసుడు దానిపై ఉన్నాడనీ చెప్పింది. వృషభం కొమ్ములు కదిలించినప్పుడు భూకంపం వస్తుంది ప్రపంచంలో దుష్టత్వం ఎక్కువగా లేనప్పుడు అలా జరిగేది.

బహూశా యిప్పుడు ప్రపంచంలో దుష్టత్వము, అహింస పెచ్చుపెరిగాయి గాబట్టి, ఒక భూకంపం రావచ్చు. ఏవిధమైన కంపన రాలేదు. అంతా అలానే ఉంది. ఎక్కడో పిట్టలు కూశాయి.

కళ్లు మంటలుగా ఉండి, మగతనిద్ర ముంచుకొచ్చింది. ఉన్నచో టనే నిద్రకుపక్రమించాను.

మరొకరోజు, ఆసుపత్రి సమీపంలో బంకులో బరాణీలు పదిపైస లకు కొందామనుకొన్నాను.

ఆ సమయంలో నిద్ర మగతలో వాళ్ల యింట్లోంచి బుద్ధు రావడం చూశాను. గోచీతప్ప శరీరంపై మరో గుడ్డలేదు. తెల్ల దంతపుబొమ్మ వలె తన శరీరం మెరిసిపోతోంది.

'నాతోరా. నేను బరాణీలు కొనడానికి వెళుతున్నా' అని పిలిచాను.

బాణంలా నా ముందుకు దూసుకొచ్చాడు నేను ముందుకు నడుస్తూ ఉంటే వాడు అరిచాడు: 'ఆగు. వస్తాను!'

నాదగ్గరగావచ్చి నా నడుముచుట్టూ చేయివేసి, 'నాకు శెనగపప్పు కొనిపెడితే, నన్ను ముద్దెట్టుకోనిస్తా' నన్నాడు.

నాకు వాణ్ణి ముద్దెట్టుకోవాలని లేదు. ఎవరూ మరొకర్ని ముద్దు పెట్టుకోవడం నేను చూడలేదు. అప్పుడప్పుడూ అమ్మ నాతలపై తన పెదవులతో ముద్దెట్టేది. లేదా దేవకి ఒక్కొక్కసారి నన్ను ముద్దె ట్టుకొనేది. ఒకసారి అమృతసర్‌లో మా యింట్లో మేము దాగుడు మూతలాడుకొంటున్నప్పుడు హరీష్, ద్రౌపది మెడమీద కొరకడం చూశాను. మానాన్న దళంలో పనిచేసే రహంతుల్లా నౌషిరా నదివద్ద పొదల్లోకి తీసు కెళ్తూ నా బుగ్గకొరికాడు. హవిల్దార్ లక్ష్మణసింగు వద్ద మేము కుస్తీపట్లు నేర్చుకొంటున్నప్పుడు, బ్యాండు మేళం వాయించే అతని కొడుకు అలీ, నామొహం నాకి, వొళ్లంతా రుద్దాడు. గణేశ్‌ని కూడా అలానే చేయమని కుస్తీపట్లు నేర్చుకొనే ఆటస్థలంలో అన్నాడు. కాని నాకా మాంసలమైన లాలన లేకపోవడంతో శారీరకంగా పవిత్రంగా ఉన్నాను. నౌషిరాలో అలీతో ఉన్నప్పుడు గణేశ్ నా మీద ప్రేమ చూపిస్తుంటే నాకు పడేదికాదు. ఈ విధమైన ప్రవర్తన నా బాల్య చేష్టలలో నాకు ఏమీ తెలియదు.

'నీకు చిరుతిండ్లకు డబ్బు యివ్వరా?' అడిగాను బుద్ధూని.

'మా నాన్న హవిల్దారు. ఆయన నెలజీతం 21రూ.లు'

'అమ్మగాని, నాన్నగాని మాకు జేబుఖర్చులకు డబ్బుయిచ్చేవారు గాదు. అన్న హరీష్ మాత్రం మాకు రోజూ 10పైసలు యిస్తాడు.... నాదగ్గర 20పైసలున్నాయి. నీకో పదిపైసలిస్తాను. నీయిష్టమొచ్చినట్లు చేయి.'

'ఊఁ' అంటూ వాడు నన్ను పొదివిపట్టుకొని ఊపిరిపీల్చాడు గట్టిగా, బుద్దు జైలుసిపాయిల వద్ద డబ్బు సంపాయిస్తాడని నా అనుమానం. అక్కడే తిరుగాడుతూ, వాళ్లయిళ్లకు వెళ్లి వస్తుంటాడు. వాడి ఆలింగనం నాకు నచ్చింది.

బ్రౌను హాస్పిటల్‌కు వెళ్ళేదారిలో చెట్ల నీడలో అతని గూర్ఖా శరీరపు పసిమిచ్ఛాయ మృదువుగా కన్పించింది అతని బుల్లి కళ్ళు పెల్లిపిల్ల తలపై కళ్ళలా మిలమిలా మెరుస్తున్నాయి. అతణ్ణి దగ్గరగా చేరదీసి చేతిలో చేయి కలుపు కుంటూ ఆదుర్దాతో ఇద్దరం ముందుకు నడిచాం

బ్రౌను హాస్పిటల్ ద్వారం దగ్గరకు వెళ్ళగానే నాజేబులోంచి పది పైసలు తీసి బుద్ధూకిచ్చాను. ఆ కుర్రవాడు గుర్రపుపిల్లలా సంతోషంతో పురకలు వేస్తూ ఆసుపత్రి ప్రహరీ ప్రక్కన కాపలాదారు నుంచునే ప్రక్కన దారి చూపించాడు. అతని శరీరం తాకిడికి నాలో ఉత్సాహం పురకలువేసి కాపలాదారు నుంచునే గుడిసె లోపలికి అతనితో ప్రవేశించాను.

'నీవు నన్ను, ఎక్కడైనా కొరకవచ్చు. బుగ్గలమీద మాత్రం వద్దు. అందరికీ కనపడుతుంది.' అన్నాడు.

నేను మూగపోయాను. ఎవరైనా గమనిస్తారేమో! బుద్ధూ నాతో తగవుపెట్టుకుని వాళ్ళనాన్నతో అన్నతో లేదా మా అన్నలతోనూ చెప్ప వచ్చు. కానీ ఆ చీకట్లో షెడ్డుమూల లోంచి వెనక్కు రావటం కూడా కష్టం దానికి తోడు నాలో ఏకాంతం వల్ల కల్గిన ఉద్రేకం బుద్ధూను కొరకాలనే సాహసానికి పురికొల్పింది

ఆమూల చెమటలో తడుస్తూ మారెండు శరీరాల నుంచివచ్చే

ఘాటు వాసనను భరిస్తూ ఒకళ్ళ శరీరాన్ని మరొకళ్ళతో గాఢంగా రుద్దుకున్నాం. వూపిరి గాఢంగా పీలుస్తూ విపరీతమైన అసహనంతో వాడి బుగ్గలు ముద్దెట్టుకుని మెడపై హరీష్ ద్రౌపదిని కొరికినట్లు కొరికాను. నామూతి, ముక్కు పుల్లనైనాయి.

బుద్ధా శరీరం ఇత్తడి కూజాలా ఆ చీకట్లో మిలమిలా మెరుస్తోంది. నా వూపిరిపై వాడి వూపిరి ఒత్తిడి కల్గిస్తూ నాలో విపరీతమైన వేడి పుట్టించాయి. కొద్ది సేపట్లో అడుగుల చప్పుడు వినిపించింది. నేన క్కడి నుంచి జారుకొని బుద్ధాతో దాగుడుమూతలు ఆడుతున్నట్లుగా పరుగెత్తసాగాను.

'నీవు ఎక్కడున్నావో తెలిసిపోయింది. బయటికిరా' అన్నాను.

బుద్ధా చెమటలో తడిసిపోతూ చిరునవ్వులు చిందిస్తూ బయటికి వచ్చాడు.

ఆ సంతోషభరిత వాతావరణంలో ఇద్దరం శనగపప్పులు కొనటానికి వెళ్ళాము.

మాయింటి భయంకర వాతావరణంలో ద్వేషమనే సర్పాలు, అస హనం అనే తేళ్ళమధ్య సంగీత సాధన ద్వారా మా అన్న హరీష్ సౌహార్ద్ర పుష్పాలు పూయించాలని హార్మోనియం వాయిస్తాడు. లయబద్ధంగా సరి గమపదనిసలు పాడుతుంటే నేను ఆశ్చర్యంగా చూసేవాణ్ణి, ఎడమచేత్తో గాలి తిత్తిని వూపుతూ గొంతెత్తి పాడుతూ కుడుచేతివేళ్ళతో హార్మో నియం మెట్లను పలికిస్తుంటే ఆసక్తిగా చూచేవాణ్ణి. నేను కూడా అలానే హార్మోనియం వాయించాలనిపించేది. నాలో ఆసక్తి పెల్లుబకగా హార్మోనియం పెట్టెను తడుముతూ గాలితిత్తిని వూపుతూ దాని తళత ళలలో నా ముఖం ప్రతిబింబిస్తుంటే చూస్తూకూచునే వాణ్ణి. హరీషు కోపాన్ని ప్రకటిస్తూ వాత్సల్యంగా మందలించే వాడు. అతని గొంతుతో నాగొంతు కలుపుతూ పాడటానికి ప్రయత్నించాను. కొత్త వూరగాయ తిన్నందువల్ల, గొంతులో 'టాన్సిల్సు' వున్నాయనే అనుమానం వల్ల నాగొంతు కప్పగొంతులా కీచుమని మ్రోగింది. సంగీతం వేశ్యల బజా రుది కాబట్టి ద్రౌపది తనభర్త సంగీతానికి దూరంగా వున్నప్పటికీ ఆవిడ

ముఖంపై సంతోషచ్ఛాయలు కనిపించాయి. హరీష్ తీసుకొని వచ్చిన ఆర్యసమాజ ప్రార్థనా గీతాల పుస్తకాన్ని చదువుతూ, సరస్వతీ దేవిని ధ్యానిస్తూ గణేశ్ ధ్యానముద్రకు నవ్వుకూ మధ్య సతమత మయ్యాడు. వాడి వద్ద ఆ పుస్తకాన్ని నేను లాక్కుంటానని వాడికి తెలుసు.

వదిన ముఖంపై ఆనందాన్ని గమనించిన హరీష్ చాలా రోజుల సహాయ నిరాకరణ తర్వాత ఆవిడను సాంత్వన పరిచి తనతో మాట్లాడేలా చేయవచ్చునని అనుకున్నాడు.

'ద్రౌపదీ! ఇలారా! నీకు హార్మోనియం నేర్పిస్తాను' అని ముద్దుగా పిలిచాడు.

'మీరు ప్రతిరోజూ సాయంకాలం వెళ్ళే వేశ్య ముండకు చెప్పండి' అని అంటూ టీగ్లాసు అతనిముందు పెట్టి విసవిసా నడిచి పోయింది.

'మరీ చిలిపిగా మాట్లాడకు' బాధ పడ్డప్పటికీ సర్దుబాటు ధోరణిలో అన్నాడు హరీష్.

హార్మోనియాన్ని పక్కకు నెట్టి టీగ్లాసు తోసివేశాడు. టీ నేల పాలైంది. తెచ్చిపెట్టుకున్న ఆనందభరిత వాతావరణం, ఇంట్లోవున్న వుద్రేకం, ఏదో పొరపాటు జరిగి పోయిందన్న అపోహ, వేశ్య అనేమాట వినపడే సరికి కోపాగ్ని జ్వాలలు భగ్గున రగిలాయి.

ఈ విధమైన నిశ్శబ్ద వాతావరణంలో ఎవరిగురించి ఈ తుఫాను చెలరేగిందో ఆ వేశ్యను నాకంటితో చూడాలని ఆలోచన నాకళ్ళకు కాంతిని ప్రసాదించింది. ఆవిడ ఎలా వుంటుందో వూహించ లేకపోయాను. ఎప్పుడైనా హరీష్ వెంబడి వెళ్ళి అతను తరచూ పలకరించే యింటికి వెళ్ళాలని పథకం వేశాను. అతని ముండను ఎలాగైనా చూడాలనే దుష్టబుద్ధి నన్ను ఆవహించింది. అందరూ నిషేధించిన విషయాలపట్ల నా ఆసక్తి అలా పెరిగేది.

ఆముండను చూడటం అనే సంకల్పం చాలా రోజుల వరకు కుదరలేదు. బజారులో అతన్ని అనుసరించి వెళ్ళటానికి వీలుపడలేదు. మూర్ఖత్వానికి పేరు పడ్డ నేను ధైర్యంగా మా అన్నను అడగటానికి

గానీ, అర్థాంతరంగా ఆవిషయం చెప్పటానికి గానీ అవకాశం రాలేదు. అసలు అలాంటి వ్యక్తి వుందా? వుంటే ఆవిడను చూడాలనీ, నా కనుచూపు మేరకు ప్రయత్నించాను. ఒకరోజు నాలోని ఆసక్తి నెరవేరింది.

ఒక మధ్యాహ్నం చర్చిమిషన్ పాఠశాల జట్టుతో మా పాఠశాల జట్టు నూర్ మొహమ్మద్ నాయకత్వంలో ఫుట్ బాల్ ఆట ఆడుతుంటే చూడటానికి హరీష్ వచ్చాడు. ఆ ఆటలో నూరా ఐదు 'గోల్'లు వేయడం వల్ల కలిగిన సంబరంలో ఆటస్థలమంతా గందరగోళం ఏర్పడి పిల్లలు పరుగెత్తసాగారు నాకు దెబ్బలు తగలకుండా వుండాలని హరీష్ నన్ను తనచేత్తో పట్టుకున్నాడు. గణేశ్, జానీ, బాట్లియా, అస్లమ్, నయీమ్, ఆటస్థలంలోకి పరుగెత్తారు. విద్యార్థికాని ధనసింగ్, మాఅన్న జవాను మాతో నుంచున్నారు. గణేశ్ వచ్చి నన్ను తీసుకు వెళతా డని కాసేపు చూసి, రాకపోయే సరికి ధనసింగును నన్ను యింటి వద్ద దిగ బెట్టమని హరీష్ చెప్పాడు ఆరాత్రికి, నూరా యింట్లో తాను భోంచేయాలని వెళ్ళాడు.

ధనసింగు నా చొక్కా పట్టుకొని తనతో రావలసిందిగా ఆజ్ఞలు జారీ చేశాడు అది జైల్లో సిపాయీలను, ఖైదీలను క్రమశిక్షణగా వుంచ టానికి వాళ్ళ నాన్న హుకుం జారీ చేసినట్లుగా వుంది నేను ఎలానైనా నూరాను చూడాలని వీలైతే అతన్ని ముట్టుకోవాలనీ అనుకుంటున్నాను.

నూరా చుట్టూ గుంపు ఎక్కువగా వున్నారు. అతణ్ణి అభినం దిస్తూ నాలాగా, అతన్ని నాయకుడుగా ఆరాధిస్తూ వున్నారు. ఆ సమయంలో హరీష్ నన్ను గమనించి ధనసింగును చూసి అసహనంగా ఇలా అన్నాడు:

'మీరింకా యిక్కడే వూరేగుతున్నారా? చీకటి పడుతుంది ఇంటికి వెళ్ళండి!' అతని గొంతులో మమ్మల్ని తప్పించుకుని వెళ్ళాలనే తహతహ గమనించాను. బహుశా అతను నూరాతో కలిసి ఈ సంతోషాన్ని పాలు పంచుకునేందుకు ముండ యింటికి వెళుతుండవచ్చు. గణేశ్‌ను, జానీని దూరంగా గమనిస్తున్న గూర్ఖాపిల్ల వాణ్ణి తప్పించుకొని గుంపులో కాళ్ళ సందున దూరకుంటూ పక్కకు వెళ్ళాను. నాకోసం అరుస్తూ జైలు

జట్టు పిల్లలూ ధనసింగూ కేకలు వేస్తున్నప్పటికీ నేను వినిపించుకోలేదు

ఆటస్థలానికి రెండు పర్లాంగుల దూరంలో లూధియానా వీధికి సమాంతరంగా వెళ్ళే వేశ్యల వీధిలో హరీష్, నూరాను అనుసరించి వాళ్ళకు తెలియకుండా నడిచాను.

హరీష్, నూరా కిళ్ళీ కొట్టువద్ద తమలపాకులు కొంటుంటే వాళ్ళ ముందుకు పరుగెత్తి 'అన్నయ్యా! నేను తప్పిపోయి ఈ చీకట్లో ఇంటికి వెళ్ళలేను' అన్నాను.

'ఒరే వెధవా! ఎక్కడ నుంచి వూడిపడ్డావు. వాడు ధన సింగు ఏడీ! ఇప్పుడు నిన్ను ఇంటికి పంపటం ఎలా?' అని హరీష్ కసురుకున్నాడు.

'నేనింటికి వెళ్ళను. నీతో కూడా వస్తాను.' అని గోముగా ఏడ్చాను.

'లేదు. నీవు రావటానికి లేదు.' అని హరీష్ అరిచాడు.

దీంతో హరీష్ కాళ్ళకు చుట్టుకుని నేను ఏడుస్తూ నించున్నాను మా అన్న నాపై మండిపడుతూ ఎవరిచేత నైనా నన్ను ఇంటికి పంపటానికి అటూ, ఇటూ చూశాడు.

'సరే వాణ్ణి రానీ! వాడు నిద్రపోతాడు. మనం వెళ్ళేటప్పుడు ఇంటికి టాంగాలో తీసుకెళ్ళవచ్చు' అన్నాడు నూరా.

ద్రౌపది విదిలింపులకు అసహనంగా ముఖం పెట్టినట్లు పెట్టి పడాలు కొరుకుతూ కాళ్ళకు చుట్టుకున్న నన్ను విదిలించాడు. నేను కప్పకూల పోయి రోడ్డు మీదే హరాయించి కూచున్నాను నూరా ముందుకు వంగి నన్ను పట్టుకుని మెత్తని మాటలతో ఓదార్చుతూ భుజంమీద వేసుకుని చీకట్లో మెట్ల మీదుగా తీసుకెళ్ళాడు

ఆరాత్రి అమసక చీకట్లో నా కంటికి కనిపించిన దృశ్యాలను నా జీవితంలో మరువలేదు నన్ను మెత్తటి పరుపుపై పడుకో బెట్టారు. ద్రౌపది కంటే వయసులో చిన్నదీ, అందమైనదీ దేవకిపిన్ని వలె అచ్చం దంతపు బొమ్మలాంటి ముఖం కలది, దేవకి పిన్నికి చెల్లెలు వంటిది నా

దగ్గరకు వచ్చి వంగింది. ఆవిడ ముఖం విశాలంగా కళ్ళు పెద్దవిగా వున్నాయి.

'బాబూ! కూచుని భోంచేయి. ఆతర్వాత సంగీతం. నీకు సంగీత మంటే యిష్టమటగా' అని లూధియానా పంజాబీ యాసలో సూతారంగా అంది. ఈ విధంగా కొత్త వాళ్ళు నామీద చూపించిన వాత్సల్యానికి పొంగిపోతూ హరీష్ ముందు అలా జరిగినందుకు మరీ సంబరపడిపోతూ నాతలను ఆవిడ వొడిలో దూర్చాను.

'ముంతాజ్! నీవు ఆ వెధవను అలా వదిలెయ్యి. వాడు త్వరగా నిద్రపోతాడు! హరీష్ అసహనంగా అన్నాడు. ముంతాజ్ నాతల నిమిరి నామెడపై వంగి సుతారంగా 'బాబూ నీ పేరేమిటి?' అని అడిగింది.

'కృష్ణ!' అన్నాను సాహసించి.

'అయితే కృష్ణుడికి అమ్మాయిలంటే సిగ్గు లేదుగా. అతను గోపిక లందరితో ఆడిపాడి, నాట్యం చేశాడు. నీవు కూడా కృష్ణుడివే. నీరంగు కూడా దాదాపు — లేదు. కృష్ణుడు నలుపు, నీవు పసిమి.'

ఆవిడ గుడ్డలపై పన్నీటి సుగంధపు కృత్రిమ వాసనలో నేను తడి సిపోయాను. ఆవిడ శరీరంలో వెచ్చదనాన్ని, సౌరభాన్ని దేవకీ పిన్ని చూపే వాత్సల్యాన్నీ, పసిగట్టాను. మిఠాయిలు తయారుచేసేటప్పుడు సగం కాగిన పాలవాసన వచ్చింది.

'రండి మీ భోజనం సిద్దంగా వుంది' అని పెద్ద వాళ్ళతో సమవయ స్కులు మాట్లాడినట్లుగా గొంతుపెట్టే అంది. పక్కనేవున్న ఎవరితోనో — 'అమ్మా! ఇతన్ని తీసుకెళ్ళి మాంసము, బిరియానీ ఇంకా రుచికర మైన పదార్థాలు పెట్టు. ఆ తర్వాత యిక్కడకు తీసుకురా!' అంది. మాంసం వంటకాల పేరు చెప్పగానే నేను లేచి కూర్చున్నాను. షాన వాజ మాష్టారివలె గడ్డముకలిగిన మధ్య వయస్కుడైన బుడేఖాన్, నన్ను లేవనెత్తి గది మూలకు తీసుకెళ్ళాడు. అక్కడ వేడి వంటకాలతో మా అమ్మ కూచుని వున్నట్లే ముంతాజ్ అమ్మకూచుని వుంది.

హరీష్, నూర్ మహమ్మదులతో మాట్లాడుతూ నెరిసిన వెంట్రు

కలు గల గోధుమరంగుతో వున్న సన్నటి వ్యక్తి ఆవిడ అమ్మ. ఆమె నాప్రక్కన వచ్చి కూచుంది.

'ముంతాజ్! నీ చెల్లి మోతీ వస్తోంది. ఆవిడ ఈపాటికి స్నానం చేసి వస్తుంటుంది.'

'ఆవిడకు నేను ఈరోజు అన్ని 'గోల్'లు చేస్తానని తెలిసి వుంటుంది. అందుకే బహుశా నాకోసం ప్రత్యేకంగా అలంకరించుకొని వస్తుండవచ్చు.'

"ఈ అక్కచెల్లెళ్ళిద్దరూ తమ దయవల్ల బతుకుతున్నారు. మీరెప్పుడెప్పుడు వస్తారా అని ఎదురు చూస్తుంటారు పగలంతా మీయిద్దరి గురించే మాట్లాడుతుంటారు. అంతెందుకు మీరాడుతుంటే చూడటానికి వెళతామన్నారు. నేనే వారించాను. ఈ చదువుకున్న బాబుల ముందు మీహోదా ఏమిటి? అని నిలదీసి అడిగాను."

నేను రొట్టె తింటూ నోట్లో అన్నంముద్దలు వేసుకుంటూ వంటకాలు రుచి చూస్తున్నాను. బుడేఖాను తన తబలావద్దకు వెళ్ళి వాయించటం మొదలుపెట్టాడు.

'ముంతాజ్! ఈ రోజు ఒక టుమ్రీ పాడాలి' అన్నాడు హరీష్.

'మోతీ కథక్ నృత్యం చేస్తుంది' అన్నాడు నూరా.

'అలానే బాబూ! లక్నోలోని పెద్ద గురువులవద్ద వీళ్ళకు పాఠాలు చెప్పించాను. నవాబ్ వజీదాలీషా మనుమడైన బచన్ మహరాజ్ వద్ద వీళ్ళు సంగీతం నేర్చుకున్నారు. ఆయన తాతగారు సంగీతంలోనూ నృత్యంలోనూ పేరొందినవాడు. మీరు చూచి ఆనందించవచ్చు ముందు వంట చల్లారిపోకముందే భోజనాలు పూర్తి చేయండి. మోతీ ఆ సమయానికి సిద్ధమై వస్తుంది. నేను భోజనం సిద్ధం చేస్తాను — 'బాబూ! నీవు ఇంకొంచెం తిను.'

నా నోటి నిండా అన్నమూ, బ్రెడ్డూ, మాంసమూ వున్నాయి. నాకు నిద్ర ముంచుకొస్తోంది. ఈ లోకంలో నాకేమీ తెలియటం లేదు. నేను తూగుతున్నాను. అయినా నాచేతివేళ్ళు అన్నంమీద ఒకటి రెండు సార్లు పెట్టాను. నా వేళ్ళు మసక మసకగా వుండి పదార్థా

లన్నీ కిందికీ, పైకీ  కదులుతున్నట్లుగా వుంది. ముంతాజ్ నా అవస్త గమనించి 'నా దగ్గరకు రా బాబూ!' అని సున్నితంగా అంది.

నేను ఆవిడ దగ్గరకు వెళ్ళాను. ఆవిడ కొంచెం సేపు భోజనం పెట్టింది. కడుపు నిండుగా భోంచేయటంవల్ల మత్తెక్కిన కళ్ళతో ఆవిడ మెడకు నాతల ఆన్చి నిద్రపోయాను.

నేను ఆవిడను అనుకుని నిద్రపోతుంటే నన్ను నిద్రపుచ్చుతూ ఆ పరుపుపై ముంతాజ్ ఆ చీకటి గదిలో జో కొట్టటం మాత్రమే నాకు గుర్తు. ఆ తర్వాత పాటలు తబలా వాద్యమూ వినిపించాయి. ఆవిడ మాటల్లోని మృదుత్వమూ, సంగీతంలోని మాధుర్యమూ వెంట్రుకలు గగుర్పొడిచేలా పులకింపజేశాయి. కృతజ్ఞతతో తొట్రుపడుతూ మాటలు వచ్చాయి. ఆవిడ అందమైన ముఖం  నుంచి వెలువడిన మాటలు నేను మరచి పోలేను.

ముంతాజ్ యింటి నుంచి మర్నాడు వుదయం తిరిగి వస్తునపుడు హరీష్ నన్ను జైలు తోటలోకి వాహ్యాళికనే మిషమీద తీసుకెళ్ళి నా చేత ఒట్టు వేయించాడు. నిన్నరాత్రి ఎక్కడికి వెళ్ళిందీ  ఎవరికీ చెప్పకూడదనీ హోటలుకు వెళ్ళామని మాత్రమే చెప్పాలనీ, అన్నాడు. నేను అమ్మమీద ఒట్టుపెట్టి ఎవరికీ చెప్పనని చెప్పాను. ద్రౌపదికి వినిపించేలా గణేశ్‌తో హరీష్ ఒక కట్టుకథ  చెప్పాడు. ఆ గొడవలో తప్పించుకున్న నేను టౌనులో తిరుగుతుంటే నూరా, తనూ నన్ను వెదికి ఒకమంచి హోటలుకు తీసుకెళ్ళినట్లు చెప్పాడు. ఆ తర్వాత తన తప్పు కప్పి పుచ్చుకునేందుకు, ముంతాజ్ ఇంటికి తాను దొంగ చాటుగా వెళ్ళేందుకు వారంలో ఒకటి రెండుసార్లు తనతో తీసుకెళ్ళేవాడు. అస్పృశ్యులమైన మేమిద్దరం ముస్లిము వంటవాడివద్ద మాంసం తినడానికనే మిషమీద తీసుకెళ్ళేవాడు. ద్రౌపది అనుమానం కొంతకాలం ఈ పథకంతో కట్టి వేసినట్లైంది. నా గుండె లోతుల్లో ముంతాజ్ ప్రతిబింబాన్ని గాఢంగా హత్తుకొని హరీష్‌కంటె అధికంగా ఆరాధించ సాగాను.

ఒకరోజు బళ్ళో విరామ సమయంలో జారుకొని నేను ఆవిడ యింటికి వెళ్ళి ఆవిడ దగ్గరకు  వెళ్ళాను. ఆవిడ యింకా పూర్తిగా

నిద్రలేవ లేదు. పడకమీద పడుకుని వుంది. ఆవిడ స్నానం చేయక ముందు ఆవిణ్ణి చూడటానికి ఎవరినైనా పంపవచ్చా? అని వాళ్ళమ్మ సందేహిస్తోంది. నా అడుగుల శబ్దాన్ని ముంతాజ్ గమనించి 'అతను చిన్న కుర్రవాడు లోపలికి రానివ్వు ఫర్వాలేదు' అంది. నేను లోపలికి వెళ్ళి ఆవిడ పంటరిగా వుంటుంది. ఆవిడ చెల్లెలు మోతీ వుస్తాదు గులామ్ ఆలీ తబలాకు అనుగుణంగా నాట్యం అభ్యాసం చేస్తుంది. ఆవిడ నాతల నిమురుతూ నాముఖాన్ని తన చేతుల్లోకి తీసుకొని 'కృష్ణా! భోంచేశావా?' అంది. 'బడికి వెళ్ళకముందు ఏదో తిన్నాను. విరామ సమయం అర్థగంట కాబట్టి భోంచేయటానికి కుదరదు.' ఆవిడ తన కుచ్చెళ్ళు సవరించుకుంటూ సుగంధాలు విరజిమ్మే కురులు ముడివేసుకొని గదిలో మూలన వున్న పెట్టె దగ్గరకు వెళ్ళి కర్జూరపు కాయలు, జీడిపప్పు పిడికిటి నిండా తెచ్చి నా జేబుల్లో తురిమింది. అమ్మ తన దాపుడు పెట్టె తెరిచి అందులోంచి నాకు ప్రత్యేకంగా మిఠాయిలు పెట్టడం గుర్తొచ్చింది. తర్వాత ఆవిడ నేలమీదకు వంగి, గోరింట పండిన చేతులతో నాముఖాన్ని నిమిరి దువ్వెన తెచ్చి తల దువ్వి విలాసంగా నవ్వుతూ 'ఇదిగో పేను కృష్ణా!' అంది.

ఆవిడ నన్ను ఏడిపిస్తోందని తెలుసుకుని నేను వారించాను— 'లేదు. మా వదిన ద్రౌపది నిన్న ఆదివారం వేణ్ణీళ్ళతో 'పియర్సు' సబ్బుతో నాకు తలకు పోసింది.'

'అలానా! అయితే ఆవిడ సరిగా తలకుపోసి వుండదు. లేదా నీవు పాడు పిల్లలతో ఆడుకుని వుంటావు' అంది కృతకంగా నవ్వుతూ.

'అంతకు ముందు ఆదివారం తలకుపోసింది' నేను తప్పు సరిదిద్దుకొన్నాను.

'ద్రౌపది తల దువ్వేటప్పుడు నొప్పి పుడుతుంది' అన్నాను. ఆవిడ అడిగిన మొదటి ప్రశ్నకు సమాధానం దాటివేస్తూ. కానీ యిద్దరిలో ఎవరిమీద అభిమానం ఎక్కువో వెల్లడి చేశాను.

"అయితే మీ అన్నయ్య నన్ను మీ వదినెనుగా స్వీకరించి, ఆవిడను తన పుట్టింటికి పంపించి వెయ్యాలి.... అంతేనా?" నావైపు

కన్నుగొడుతూ అంది సున్నితంగా.

ముంతాజ్ మా వదినె కావడమనే ఆలోచన ఆనందాన్ని కలిగించింది. ముంతాజ్ చేతిమీదుగా స్నానం చేయించి, ఆవిడను ముట్టుకొంటూ, ఆవిడతో యిలానే వాగుతూ, ఆవిడ ఏడిపిస్తూంటే ఎంత బాగుండును. ఆవిడ ప్రకాశమానమైన కళ్లు, చూపులు ఎంత అందమైనవి!

'ఇప్పుడు.. యింక వెళ్లవచ్చు. లేకపోతే బడిగంట కొడతారు. బుద్ధసింగు మేష్టారు నీవీపు వాయిస్తారు.' అంది ఆవిడ తలను బాగా అందంగా దువ్వుతూ.

నేను అక్కడ తారాడి మోతీ నృత్యం చూడాలనుకొన్నాను. కాని, ఈవిడ ఆజ్ఞ పాటించక తప్పదు. చేతుల్లోంచి వదలబడ్డ పావురం ఎంత వేగంగా దూసుకెళ్తుందో, అంత వేగంగా ముందు కురికాను.

'ఇదిగో. నీతల దువ్వినందుకు నాకు బహుమానం?' అని పిలిచింది. నేను ఆ గదిలో మళ్లీ వచ్చి నాతలను ఆవిడ ముద్దుపెట్టుకొనేలా ముందుకు వంగాను. నా కళ్లు సిగ్గుతో, కృతజ్ఞతతో వాలిపోయాయి.

నేను పరుగుతీశాను.

'మళ్లీరా!' నేను మెట్లమీద పరుగెడుతుంటే అంది.

నేను బడికి వెళుతూ ముంతాజ్ పట్ల విపరీతమైన ప్రేమను పెంచుకొన్నాను. వెనక్కి తిరిగి వెళ్లి, ఆవిడవంక తేరిపారచూడాలనీ, తదేకంగా కనుగొనల్లోంచి చూస్తూ వుండిపోవాలనీ, ఆవిడ నన్ను చూడకపోయినా, ఆవిడను నా చూపుల్తో తాగివేయాలనీ అనుకొన్నాను. ఆవిడ ఎంత అందమైనది! దంతపు బొమ్మలా సుతారమైన మెడ, సన్నగా, మృదువుగా ఉండే ఆమె ప్రవృత్తి, అమాయకపు నవ్వు, ఆమె ప్రత్యేకత. ద్రౌపది విచారవదనము, ప్రతిఘటించే స్వభావము పోల్చుకొంటే ఎంత తేడా? హరీష్ ద్రౌపదిని వదిలివేసి, యీావిడను పెళ్లి చేసుకొంటే ఎంత అద్భుతం! ద్రౌపదికి పిల్లలు లేరు గాబట్టి, హరీష్ మరో పెళ్లి చేసుకోవచ్చునని అమ్మ నాన్నతో అంది.... బహుశా, ఆ విషయం ద్రౌపదికి

తెలిసి వుంటుంది. హరీష్ ఆ ప్రయత్నంలో ఉన్నాడని తెలిసి బహుశా మా యింట్లో రణరంగం తయారై ఉంటుంది. ముంతాజ్ మా యింట్లో వుండటానికి వస్తే ఎంత ఆనందం వస్తుంది. సంగీతము, నృత్యము, మృదువైన మాటలు — అసలు జీవితమే మారిపోతుంది.

బడి ప్రహరీ ఖాళీగా ఉంది. విరామ సమయం అయిపోయింది. అదృష్టవశాత్తు, ఆ రోజు షానవాజు మేష్టారి క్లాసు. అయినా నేను గదిలోకి వెళుతుంటే నాగుండె కొట్టుకోసాగింది

'బజారులో జీడిపప్పు కొంటానికి వెళ్ళాను మాష్టారు!' అంటూ ఆయన బల్లమీద కొన్ని పప్పులు పెట్టాను.

'అయితే అందులో కొన్ని నాకు లంచంగాయిచ్చి తప్పించుకో వచ్చుననుకున్నావు' అంటూ ఆ పప్పులు తీసుకొని నమల సాగాడు.

* * *

నా లోలోపలి భావాలను అణచు కోవటం ఎలా అనేది సమస్య! హరీష్ జీవితంలో మరో స్త్రీ ప్రవేశించిన విషయం దాచటమెలా? ఆవి డను స్పృశించాలనే కాంక్షను తరుచూ అదుపులో పెట్టుకోవటమెలా? నాలోని ఏకాంతత, విసుగూ, ఆవిడపట్ల ఆరాధనా భావము, ఆవిడ స్నేహ సౌహార్దాలను దగ్గరగా పంచుకోవాలనే తృష్ణ అధికమయ్యాయి. నా ఆత్మలో ముంతాజ్ సౌందర్యంపట్ల ఆరాధనా భావము ప్రసరించింది. ఆవిడ సౌందర్య దృష్టిపట్ల ఆకర్షితుణ్ణయ్యాను. నేను ఆవిడతో వాగుతూ ఆవిడ నన్ను మురిపం చేస్తునట్లు భావించసాగాను. రాత్రులు నిద్రపోయే దానికి ముందు నా వూహల్లో ఆవిడతో మాటలు లేకుండా మాట్లాడసా గాను. విరామ సమయంలో నేను ఆవిడను కలిసినపుడు మా యిద్దరికీ మధ్య జరిగిన సంభాషణను పునశ్చరణ చేసుకుంటూ వూహాలోకాల్లో తేలియాడుతూ నన్ను నేను సమర్థించుకో జూశాను గణేశ్, జానీ బడికి నన్ను రోడ్డుమీద వదిలేసి వెళ్ళేటప్పుడూ, వచ్చేటప్పుడూ నేను వంటరి వాణ్ణి అయేవాణ్ణి. అప్పుడు ఆవిడ నా ప్రక్కనే వున్నట్లుగా భావించుకుని సంభాషించే వాణ్ణి. పెద్దపిల్లలు నన్ను వదిలేసి ఎలా వెళ్ళారో నేను ఆవిడకు ఫిర్యాదు చేసేవాణ్ణి ఆవిడ తన సహజ సుందరమైన స్వరంతో

నాకిలా సమాధానం చెప్పినట్లు అనిపించేది.

'బాబూ! వాళ్ళు నిన్ను ఏం చేసినా, ఏమన్నా, పట్టించుకోకు. నీతల నా వొళ్ళో పెట్టుకో, మనం వాళ్ళకంటె భిన్నం. మనం అనాధలం' ఈ మాటలు నాలో వూహాకల్పితమైన ఉద్రేకతను రేకెత్తించి నా ఏకాంతాన్ని వదలిపెట్టి ముందుకు వేగంగా అడుగులు వేస్తూ నడిచేవాణ్ణి.

ఒక్కొక్కసారి ఆవిడ స్పర్శ సుఖమనే జ్ఞాపకాలు నాలో తీయని అనుభూతి కలిగించేవి. ఆవిడ ఆలింగనంలోని వెచ్చదనాన్ని స్మరిస్తూ కళ్ళు మూతలుపడేవి. నాలోని ఈ రహస్య సౌఖ్యాన్ని ఎవరితోనైనా పాలుపంచుకోవాలని వుంది. కాని హరీష్‌కు నేనిచ్చిన వాగ్దానంవల్ల నా లోలోపల ఈ జ్ఞాపకాలు నిలిచిపోయాయి. ఆవిడ సున్నితమైన సౌందర్యం గుండ్రని ముఖం, ఆవిడ నావైపు చూసినపుడు ఆమె మెడ నావైపు వంగటం నా మనఃఫలకంపై చెరగని ముద్రవేశాయి. ఆవిడ అందమైన కళ్ళు ఎఱ్ఱని చేతులూ, ఎఱ్ఱని మునివేళ్ళు — ఆవిడ జ్ఞాపకాల సరస్సులో తేలియాడ సాగాను. నాకళ్ళల్లో ప్రకాశం ఆవిడపట్ల నా హృదయంలో మృదుత్వం, నాకు వూపిరి పోసి యీ భూమి నాదనే భావన కలిగించాయి.

ఒకరోజు నాపక్కన కూర్చునే నయీమ్ మొహమ్మదుతో ఆవిడ గురించి సూచనగా అన్నాను. 'మీ హరీష్‌కు 'ముండ' వుందా?' అని నిక్కచ్చిగా అడిగాడు. అప్పుడు చెప్పక తప్పలేదు.

బుద్ధాతో కూరగాయల తోటలో నడుస్తూ 'క్యారట్లు' దొంగిలించి తింటూ అతన్ని అడిగాను. ఆవిడ నన్ను తీయని ముద్దు అడిగినట్లు. నేను 'ముద్దు అంటే నీకు తెలుసా?' అని అడిగాను.

నేను ఆవిడ దగ్గరకు వెళ్ళినట్లు బహుశా హరీష్‌కు తెలిసి అతను నన్ను అడిగాడు. నేను సంతోషంగా ఆ వివరాలు చెప్పి ఆవిడ నాకు మిఠాయిలు యిచ్చిందనీ వచ్చేవారం మళ్లీ రమ్మందనీ చెప్పాను.

'సరే! పగటిపూట వెళ్ళకు. నేను ఎప్పుడయినా సాయంత్రం తీసుకెళతాను. ముంతాజ్ సంగీతమూ, మోతీ నాట్యమూ చూడవచ్చు' అన్నాడు. ఆ వాగ్దానాన్ని నేను చాల రోజులు గుర్తుపెట్టుకొని

ఆవిడ సంగీతాన్ని ఆవిడ చెల్లెలి నాట్యాన్ని ఎప్పుడు చూద్దామా? అని ఎదురు చూడసాగాను.

బహుశా ముంతాజ్‌కూ, నాకూ మధ్య అనిర్వచనీయమైన, అస్పష్టమైన, మధుర భావనలూ నిండి పోయాయేమో! నేను మొదటిసారి ఆవిణ్ణి కలిసినపుడు నా నిద్రమత్తు కళ్ళకు ఆవిడ జాగృతిని కలిగించింది. నా జీవితాంతం ఆవిడ ప్రేమ బందీనయ్యాను ఆ తర్వాత నాయౌవన కాలంలో ఆవిడను గురించి నా మనస్సులో దాచుకున్న మూగప్రేమ ప్రతిధ్వనించి సాగింది.

# 4

హారీష్‌తో ముంతాజ్ యింటికి ఎప్పుడు వెళదామా? అని నేను కంటున్న కలలు ద్రౌపది తండ్రి లల్లా భగవత్‌రావ్ రాకతో చెదిరిపోయాయి.

ఒకరోజు మధ్యాహ్నం మేము బడినుంచి తిరిగి వచ్చేసరికి ఒక సన్నటి వ్యక్తి గౌరవప్రదమైన తెల్లని తలపాగా ధరించి, ఇంగ్లీషు పద్ధతి సూటు వేసుకుని వరండాలో కుర్చీలో కూచుని వున్నాడు. పక్కమీద ఒకమూల హారీష్ కూచుని ఉన్నాడు. ద్రౌపది మరో మూల ఒదుక్కొని కూచుని వుంది. మేము చేతులు జోడించి శాస్త్రోక్తంగా 'సాష్టాంగ నమస్కారం' అన్నాము. ఆయన కంటి చూపులను బట్టి ద్రౌపది తండ్రి అని వూహించాము. ఆయన వెటకారంగా నవ్వి 'చిరంజీవ' అని గొణిగాడు. మమ్మల్ని చూసి వాళ్ళు ముగ్గురూ సంభాషణ ఆపివేశారు. వాళ్ళు హారీష్‌ల విబేధాలను గురించిన గడ్డు సమస్య చర్చిస్తున్నారనుకున్నాము... ఆగాఖాన్ మతాన్ని అనుసరించే వాళ్ళతో హిందూ కుటుంబం ఏవిధంగా సర్దుకు పోవాలనే నైతిక సమస్య గూర్చి వాళ్ళు ఆలోచిస్తున్నారు.

'వంటగదిలో మీ భోజనం సిద్ధంగా వుంది. ఇద్దరూ తిని కలిసి

ఆడుకోండి' అని ద్రౌపది గణేశ్‌తో గొణిగింది.

గణేశ్ శ్రద్ధగా చేతులు కడుక్కొని తన కంచం తీసుకొని, నాకంచం నాకిచ్చి ముందు గదిలోకి దారి చూపాడు వాడిచ్చిన సూచనను గమనించి భోజనం తీసుకొని త్వరత్వరగా వెళ్ళి, వాళ్ల మాటలు విని పించకుండా వుండేంత దూరంలో కూచున్నాము. నా కనుగొనలలోంచి హరీష్ మామగారి శరీరాన్ని చూస్తున్నాను. ఆయన సొట్ట ముఖం, బుంగమూతి నాకు నచ్చలేదు. మాయింటి కెవరైనా అతిథులు వస్తే ప్రేమగా చూడలనే వుత్సాహం రాలేదు ఆయన కుమార్తెలోని ద్వేష పూరిత స్వభావాలన్నీ ఆయనలో చూడటం మానివేశాను. సాధారణంగా మాయింటికొచ్చినవారు గణేశ్ వీపుతట్టి, నా తల నిమిరి అభినందించే వారు. ఈయన తన ఆశీస్సులు గొణిగాడు

మా వున్నత కుటుంబాన్ని గురించీ గర్వం, ద్రౌపది చెడుకుటుం బాన్ని గురించి ద్వేషం నేను చల్లటి చపాతీలు, కాలీఫ్లవర్ కూర తింటూ నెమరువేసుకో సాగాను. ఈయన కూతురు నాపట్ల, హరీష్‌పట్ల చూపిన నిరాదరణ భావం నాచూపుల్లోంచి నిప్పు రవ్వలు కురిపిస్తూ ఈయనపట్ల ప్రతీకారాగ్నిని ప్రజ్వలింప జేసింది. వరండాలోని నిశ్శబ్ద వాతావరణం వల్ల, నేను నోట్లో కుక్కు కుంటునప్పటికీ త్వరగా భోజనం పూర్తి చేయలేక పోయాను. హరీషు అన్న మాటలు నాకు వినిపించాయి 'నేను ఆఫీసుకు వెళ్ళాలి. రేపు మీతో మీరు వచ్చిన విషయం గురించి అన్ని వివరాలూ మాట్లాడతాను.'

'ఈ సాయంత్రం రైలుకు నేను తిరిగి గుజరన్ వాలా వెళ్ళాలి. ద్రౌపది కూడా సామాన్లు సర్దుకుని నాతోవస్తుంది.' లల్లా భగవత్‌రామ్ అన్నాడు.

కొంచెంసేపు వాతావరణంలో నిశ్శబ్దత ఏర్పడింది. హరీష్ ఒకసారి దగ్గి గొంతు సవరించుకొని తన బాధలన్నింటినీ గుర్తుచేసుకుంటూ ఖండితంగా ఇలా అన్నాడు:

'నేను ఇంతకుముందు మీతో చెప్పినట్లు ఆగాఖాన్‌మతాన్ని వదిలి పెట్టిన మా సోదరులంతా, ఆగాఖాన్ మతస్థులైన మీ యింటికి ద్రౌపది

వచ్చినట్లుగా తెలిస్తే నీరు ముట్టుకోరు.'

'వాళ్ళకు సిగ్గులేదు. వాళ్ళు ముస్లిమ్ వేశ్యల దగ్గరకు వెళ్ళి తాగితందనాలాడి రావచ్చు. నేను మాత్రం మా పుట్టింటికి వెళ్ళి ఆగాఖాన్ మతం వారిని కలియ కూడదు.' అని ద్రౌపది తన అనునాసిక స్వరంతో అడ్డు చెప్తూ అంది.

'నాయనా హరీష్. మంచికోసం చెప్తున్నాను. నీవు దాన్ని మాయింటికి పంపు. మీ అమ్మ నీకు మళ్ళీ పెండ్లి చేయాలని ప్రయత్నిస్తున్నట్లు విన్నాను. మా అమ్మాయి విధవరాలు అయిందను కుంటాము' అన్నాడు మామగారు. ముస్లిమ్ వేశ్యలు అనే ఆరోపణ ఆయునలో అణగారిన కోపాన్ని బహిర్గతం చేసింది ఉన్నట్లుండి ద్రౌపది ఏడవటం వినిపించింది ఆవిడ తల నిమురుతూ తండ్రి ఓదార్చాడు ఆవిడ దుఃఖం మరింత ఎక్కువైంది.

ఆవిడ మనసులో తెలియరాని వియోగ దుఃఖం అధికమై ఏడుపు ఎక్కువ చేసింది.

హరీష్ తల వంచుకొని తన చేయి నుదిటిపై వుంచుకొని కోపంగా వుండటం నా కళ్ళకు కన్పించింది. భోజనాలు పూర్తి చేసి వాళ్ళు ముందుగా నడుచుకుంటూ వెళ్ళి అక్కడే వాతావరణాన్ని భంగపరచ టమా? లేక ఇక్కడే వుండి పోవటమా? అనే సందిగ్ధంలో పడిపోయాము.

లోలోపల వణికిపోతూ తల పంకించాను. కోపం అటో ఇటో తేల్చి వేస్తుందని అనుకున్నాను.

హరీష్ లేచి నుంచొని 'ఆవిణ్ణి మీరు తీసుకెళితే ఆ బాధ్యత మీది. మానాన్న గారి అనుమతి లేకుండా ఆవిడను నేను పంపను'అంటూ వరండాలోంచి ముందుకు నడిచాడు.

ఈ అవకాశాన్ని తీసుకొని నేను అతని వెంబడి వెళ్ళాను. గణేశ్ ద్రౌపది వైపు వెళ్ళాడు.

నేను ఫుట్ బాల్ ఆడుతుండగా లల్లా భగత్ రామ్ గణేశ్ ను వెంట బెట్టుకొని జైలు రోడ్డు మీదగా బ్రౌను ఆస్పత్రి వైపు వెళ్ళటం చూశాను

ఏం జరిగింది నాకు తెలియదు. వాళ్ళ దగ్గరకు వెళ్ళటానికి సిగ్గుపడ్డాను. ఇంటికి వెళ్ళి ద్రౌపది ఏం చేస్తుందో చూడటానికి భయపడ్డాను.

కొంచెం సేపట్లో గణేశ్ వచ్చి మాతో కలిశాడు. మామగారికి టాంగా స్టాండు చూపటానికి హరీష్ వెళ్ళి వుంటాడని వూహించాను. ద్రౌపదిని తనతో తీసుక వెళ్ళడమనే ఆలోచనను వదలి పెట్టి ఆయన స్టేషనుకు త్వరగా వెళ్ళివుంటాడని గ్రహించాను గణేశ్ నా వూహలు సమర్థించాడు.

చీకట్లో బంతి కనిపించకుండా పోయేంతవరకూ ఆడుకొని యిండ్లకు బలవంతంగా వెళ్ళాము. ద్రౌపది ఏడుస్తూ మంచం మీద పడుకొని వుంది. మా అడుగుల శబ్దం విని ఆవిడ నిట్టూర్పులు వదులుతూ పొడుగాటి రైలు తన బరువును మోయలేక మూలుగుతున్నట్లుగా శబ్దం చేయసాగింది.

ఆవిడ దుఃఖాన్ని నేను భరించలేక, ఆకలి బాధవల్ల - సిగ్గుతో ఆవిడ వద్దకు వెళ్ళి, మంచం మీద కూచొని, చేతులు ఆమెపై వేసి 'ఏడవకు' అన్నాను.

తన పట్ల సానుభూతి చూపుతున్నది గణేశ్ అనుకొని, ఆవిడ కడుపు లోంచి దుఃఖం పెల్లుబికిరాగా -

'మీ అన్న నా పాలి పిశాచం! .. నా జీవితం నాశనం చేస్తు న్నాడు మా నాన్నను అవమానించి పంపివేశాడు' అంది.

'నేను, కృష్ణను' — సానుభూతిని చూపుతున్నానని గమనించి మాట్లాడటం మానివేసి, రాగాలు తీసి ఏడుస్తూ పడుకొంది.

నే నొక్కక్షణం ఊరకున్నాను.

'నేను వెళ్ళి పొయ్యి వెలిగిస్తాను! నువ్వు సహాయంగా రా!' అన్నాడు గణేశ్. లేచి వెళ్ళి గణేశ్‌కి సహాయం చేయడానికి ముందు మరోమారు వదినెను ఓదార్చడానికి ప్రయత్నించాను.

'నాకు ఆకలిగా ఉంది. లేచి '

'అరవకు దయ్యపు పిల్లా!' అని కీచుగొంతుతో అని - 'మీరు యింటి పని, వంటపని గూర్చి మాట్లాడితే, మీ కళ్ళ ముందే బావిలో దూకి చస్తాను' అంది.

నా మీద కోపాన్ని ప్రకటించడానికి ఆవిడ బావిలో దూకుతుందే మోనని నాకు భయమేసింది. నేను వంట గదిలోకి మెమ్మదిగా పాకి వెళ్ళాను.

గణేశ్ పొయ్యి వెలిగించడంలో కృతకృత్యుడై ఉన్నాడు నేను పొయ్యి పక్క కూచోని మంట సెగకు చేతులు అడ్డంగా పెట్టి వేడి చేసు కొంటున్నాను. శూన్యం వేపు తదేకంగా చూస్తూ, ఈ ఖైదులోంచి బయటపడే కిరణం ఎక్కడైనా ప్రసరిస్తుందేమోనని చూస్తున్నాను.

కొంచెం సేపట్లో హరీష్ కారి సవ్వడి వినిపించింది. తన భార్య లేదని గమనించి, బూట్లు కాళ్ళతో వంట గదిలోకి వచ్చి మమ్మల్ని చూశాడు

హరీష్ కాలకృత్యాలు ముగించుకొని బయటకు వచ్చి, నాపె విని పించేలా గణేశ్‌తో అన్నాడు.

"పిల్లల్లారా! ద్రౌపది వాళ్ల అమ్మ నాన్నలను చూసేందుకు గుజ రన్‌వాలా తీసుకెళ్లమనుకొన్నాను. వరసగా 4 రోజులు సెలవులు. మరి మూడు, నాలుగు రోజులు నేను సెలవు పెడతాను. యింతకుముందు దసకాలో ఉంటున్న మన మేనమామలు శరమ్‌సింగు, దయాళ్‌సింగు యిప్పుడు గుజరన్‌వాలాలో కర్మాగారం నడుపుతున్నారు. నేను వాళ్లతో ఉంటాను. ద్రౌపది రోజూ వాళ్ల అమ్మా, నాన్నాలను చూసిరావచ్చు అలాచేసినందువల్ల ఆగాఖాన్ మతం వారితో సంబంధాలు పెట్టుకొన్నా మని తోటివారు మనల్ని వెలి వెయ్యరు. మీ యిద్దరికీ భోజనాలు చేసి పెట్టడానికి ఒక ఖైదీతో చెప్పాను. గణేశ్! నువ్వు కృష్ణను జాగ్రత్తగా చూసుకొవాలి రోజంతా బయట తిరగకండి! ఉదయంపూట లెక్కలు చేసుకోండి . సెలవుల్లో మిగతా పాఠాలు చదవండి. సాయంకాలాలు ఆడుకోండి పద్మసాలీ జట్టుతో మీ జట్టు పందెం ఆట ఆడుతుందని విన్నాను. మీకు సెలవు లెప్పటి నుంచి?

'రేపు' అన్నాడు గణేశ్.

'లేదు. ఇంకా రెండు రోజుల తర్వాత' అని గణేశ్ మాటను సవరించాను. నాగుండె వేగంగా కొట్టుకోసాగింది.

'సరే రేపటికి మీ వదిన వండి పెడుతుంది. నీళ్ళు మోసే ఖైదీ సంతు మీకు రోజూ వండి పెడతాడు మన పక్కింట్లో వార్డరు జైసింగు భార్య మీకు తోడుగా వుంటుంది'.

నాకు దిగులుతో గొంతు పూడుకు పోయింది హరీష్ క్రమశిక్ష ణలో చదువు కోకుండా, శలవుల్లో సరదాగా గడపవచ్చుననే సంబరం నాలో ఎక్కువైంది. బుద్ధా వాళ్ళ నాన్న 'తప్పా' నన్ను వేటకు తీసుకు వెళతానన్నాడు. అది ఇప్పుడు కుదరవచ్చు. ఇంట్లోకి వచ్చినప్పు డల్లా ద్రౌపది సణుగుడు వుండదు. బహుశా వాళ్ళు తల్లి దండ్రులను చూచి వచ్చిన సంబరంలో ద్రౌపది సంతోషంగా వచ్చి మామీద ఎక్కువ అభిమానం చూపవచ్చు. లేదా ఆవిడ అక్కడే వుండి పోతానని అనే

అద్భుతం కూడా జరుగవచ్చు. దానికి ప్రత్యామ్నాయాన్ని గురించి అను కోకూడదు. దిష్టి దోషం వల్ల మంచి పనులు నాశన మౌతుంటాయని అమ్మ చెప్తుంది. రేపు బడి వదలగానే పద్మసాలీ సందులోని కుర్రవా ళ్ళతో బంతి ఆట ఆడాలి.

హరీష్, ద్రౌపది వూరి ప్రయాణంవల్ల మాకు బడికి ఆలస్యమై నందున మమ్మల్ని టాంగాలో బడి దగ్గర దించారు. టాంగాలో వెళుతున్నంత సేపూ ఆయన మమ్మల్ని జాగ్రత్తగా వుండమని చెప్తూనే వున్నాడు. ద్రౌపది మాత్రం దిగులుగా, గంభీరంగా వుంది. అందువల్లనే నేమో గుర్రం నెమ్మదిగా వెళుతున్నది.

'కృష్ణను జాగ్రత్తగా చూసుకో మేము త్వరలో వచ్చేస్తాం.' అంటూ మేము బడిగేటు దగ్గర దిగినప్పుడు గణేశ్‌కు హరీష్ చెప్పాడు. నన్ను పక్కకు తీసికెళ్ళి బుగ్గమీద చిటికవేసి – 'నేను లేనప్పుడు ముంతాజ్ వద్దకు వెళ్ళకు' అని రహస్యంగా చెప్పాడు. ఆ క్షణంలో ఆశ్చర్యంగా నాలో దిగులువేసి పెద్దగా ఏడ్చాను

'ఏడవకు రా! రా! ఇప్పటికే ఆలస్యమైంది. ఈరోజు మొదటి పీరం బుద్ధసింగు మాష్టారుది ' అని గణేశ్ కేకలు వేశాడు. హరీషు మా మాటలు వినిపించనంత దూరం వెళ్ళాడు.

ఆ రాక్షసుణ్ణి గురించిన భయంతో వణికిపోతూ పరుగుతీశాను. ద్రౌపది, హరీష్ వెళ్ళకుండా వుంటే బాగుండు ననుకున్నాను.

ఒకవేళ ఆయన నన్ను కొడితే నన్ను ఓదార్చడానికి ఎవరూ వుండరు. హరీష్ ముంతాజ్ వద్దకు వెళ్ళవద్దని మరీమరీ చెప్పాడు. నేను సందిగ్ధంలో పడిపోయాను.

'త్యాగం ద్వారానే జీవించాలి' అని ఒకరోజు ముంతాజ్ అన్న మాటలు నమ్మాను. అందువల్ల నా శరీరాన్ని కష్టపెట్టాలి అనే సిద్ధాం తానికి లోబడ్డాను. ఏదో ప్రమాదం రాబోతోందని నేను పసిగట్టాను. నేను గదిలోకి అడుగుపెడుతుండగానే కాళ్ళు బలహీన పడ్డాయి

బుద్ధసింగు మాష్టారు నేను విపరీతంగా భయపడటం చూసి కాబోలు

మావైపు తీక్షణంగా చూసి మమ్మల్ని గమనించనట్లు పాఠంలో లీనమైనట్లు ఒక విసురు విసిరారు 'నేను మీకు ఏం చెప్పాను? ఆంగ్లేయులవద్ద మనం నేర్చుకోవలసిన మొదటి పాఠం — క్రమశిక్షణ! ఔనా!'

మొత్తం గదిలో పిల్లలందరూ 'క్రమశిక్షణ' అని వంత పలికారు. ఈ విధంగా అందరూ తిట్టడమనేది కర్రతో కొట్టిన దానికన్నా బాధ గాను మరణశిక్షతో సమానంగా వుంది.

ఆయన మమ్మల్ని కొట్టకపోయినా భయంతో వణికిపోతూ నా సీటులో కూచుంటూ సంచి కింద పడవేసి సిరా నేలమీద దొర్లించాను.

బుద్ధసింగు మాష్టారు పళ్ళు పటపట కొరుకుతూ నన్ను కొట్టడానికి లేచి, ముఖం ఎఱ్ఱపడగా మళ్ళీ చేతిలో పుస్తకంవైపు చూశారు. నేను పుస్తకం వైపు తదేకంగా చూశాను కానీ అందులో అక్షరాలు ఏమీ కనపడటం లేదు. అంతా మసక మసకగా వుంది.

# 5

బుద్ధసింగు మాష్టారు అధికంగా క్రూరంగా వుండటానికి కారణ మేమిటి? అని ఆలోచించ సాగాను అమృతసర్‌లో బిషన్ సింగు మాష్టారు హింసాత్మక చర్యలకు కారణం లేకపోలేదు. ట్యూషన్ల ద్వారా ఎక్కువ డబ్బు సంపాదించాలని ఆయన తాపత్రయం ప్రభుత్వ పాఠశాలల్లో మాష్టార్ల జీతాలు ఎక్కువని అంటారు — మరి ఈ రాక్షసుడు ఇలా ప్రవర్తించటానికి కారణం ఏమిటి?

బహూశా ఆంగ్లేయుల సద్గుణాలను పుణికి పుచ్చుకోవాలనే కోరిక ఆయనలో న్యూనభావాన్ని కలిగించి వుంటుంది. ఆయన ఇంగ్లీషు పదాలను ఉచ్చరించే ధోరణి నాటురకంగా వుండి ఆయన తెల్లదొరల వలె వుండాలనుకునే ఆశయాన్ని చెడగొడుతోంది ఆయనలోని

ఈలోటు కప్పిపుచ్చు కోవటానికి ఆయన తెల్ల దొరలవలె హింసకు పాలు పడటానికి దారి తీసి వుంటుంది. అమృతసర్‌లో మెర్సిడన్, మోహన్ చంద్రను బూటుకాలుతో తన్నడం చూసింది మొదలు తెల్ల దొరలు దురుసు తనంమీద ఏహ్యభావం కలిగింది. ఆయన ప్రవర్తనపట్ల నేను చాలా కాలం దురుసుగా వుండే వాణ్ణి. కానీ దేవదత్త బాబాయి విప్లవాత్మక సందేశం నాకు కొంత వుపశమనం కలిగించింది. నేను చిన్నవాణ్ణి అయినప్పటికీ నా శరీరంలో వుడుకు రక్తం వేడెక్క సాగింది. ఈ రాక్షసుడు మామీద తీర్చుకున్న పగ మాలీ ఇలామ్ దీన్ ఎద్దులపై నేను తీర్చుకున్నాను.

మాష్టారి 'దుఃఖానికి' కారణం నేను ఆలోచించిన పద్ధతే సరియైన దని నా నమ్మకం కానీ అది నిజమో కాదో తెలియదు. నా మనస్సు ప్రశాంతంగా, అమాయకంగా, ఉదాత్తంగా ఉండటంవల్ల నాకు వచ్చిన ప్రతి ఆలోచననూ పవిత్ర సత్యంగా భావించ సాగాను. ఆ సమయంలో నావూహాలు హేతు బద్ధంగానూ నలుపూ, తెలుపూలకు మధ్య తేడా తెలియకుండా వుంది. ఇంతకంటె లోతైన రహస్యాలు వుండవచ్చు కానీ అవి దుర్భేద్యం.

ఆ మర్నాడు నేను వూహించిన విషయం నిజమని నిర్ధరించబడింది.

మేము సనూవేశం కాగానే ఆయన ఉపన్యాసం మొదలెట్టారు. 'ప్రతి సంవత్సరం ఈకాలంలో తెల్లదొరలు పండుగ చేసుకుంటారు. తెల్లదొరలకూ, పై అధికారులకూ, కానుకలందించటం సంప్రదాయం. మీలో కొంతమందికి ఈ విషయం తెలిసే వుంటుంది. ముఖ్యంగా బాట్లీయారామ్ వాళ్ళ నాన్న విలాయితీరామ్ కాంట్రాక్టరు' — నేను నిశ్శబ్దంగా చుంచెలుక లాగా నయీామ్ మొహమ్మద్ పక్కన కూచు న్నాను. గణేశ్ మునికాళ్ళమీద నడుచుకుంటూ వెళ్ళి వెనుక వరుసలో జానీపక్కన కూచున్నాడు. మాష్టారు నావైపు తదేకంగా చూసి ఉప న్యాసం కొనసాగించారు

'ఈ చుంచెలుక వాళ్ళన్న జైలరు, జైల్లో మంచి దుప్పట్లు, బైండు పుస్తకాలు చేస్తారు. కూరలు బాగా పండిస్తారు ఇంగ్లీషు మాటలంటే

ఆసక్తి చూపే ఈ చుంచెలుకకు ఎప్పుడైనా గుర్తు వచ్చిందా! ఇంగ్లీషువారి సంప్రదాయాలు పాటిద్దాం. మేష్టారికి బుట్టనిండా కూరగాయలు తెచ్చిద్దాం అనే ఆలోచన వచ్చిందా?'

బుద్ధసింగు మాష్టారు నాకు ఇంగ్లీషుపై ఆసక్తి వుందని అనటం, బెత్తం చూపక పోవటం బల్లపై నుంచోమనక పోవటం గమనించి వూపిరి పీల్చుకున్నాను. ఆరోజు వుదయం నేను మళ్ళీ బడికి ఆలస్యంగా వెళ్ళినందుకు ఆయన మమ్మల్ని క్షమించే ధోరణిలో వున్నారని గ్రహించాను.

'జాన్ మహమ్మదు వాళ్ళనాన్న జైలు డాక్టరు... కానీ, ఆయన ప్రతి నెలా తాజా కూరగాయల బుట్ట మాయింటికి పంపుతారు నా కనుమానం నేను వాళ్లు పంపిన కూరగాయలు నెలలో రెండు, మూడు రోజులు తిని, మిగతా రోజులు పస్తుపడుకొంటానని వాళ్ల ఉద్దేశం కాబోలు. ఈ ఆలోచన ఈ చుంచెలుకకు గానీ, వాళ్ల అన్న గణేశ్‌కు గాని రాదు. ఈ మొద్దు వెధవల బుర్రల్లోకి తెలివి ప్రవేశపెట్టడానికి ప్రయత్నించే ఈ పేద మేష్టారుగూర్చి ఆలోచించరు! ఆయనకు వచ్చే కొద్దిపాటి జీతంలో కాలక్షేపం చేయాలనీ వీళ్ళకు తెలియదు. మీ నాన్న వాళ్ళు నిత్యం గులాములుగా ప్రవర్తించే తెల్లదొరలకు మీకు యింగ్లీషు నేర్పించే మాష్టారుకు తేడా ఏమిటి?'

అప్రయత్నంగా మేమందరం గొల్లున నవ్వాము. మొట్టమొదటి దఫా ఆయన మేము నవ్వే సదవకాశాన్ని కలిగించారు.

'పంది వెధవల్లారా! ఇందులో నవ్వే విషయం ఏమీ లేదు!' ఆయన తన దాడి మళ్లీ మొదలెట్టారు. ఆయన సహజ సిద్ధమైన కరుకుదనంతో గొంతెత్తి అరిచారు — 'నేను ఆంగ్ల ప్రభుత్వానికి విధేయుడనైన సేవకుణ్ణి. ప్రభుత్వాన్ని ఎదిరించే — లజపతిరాయ్, అజిత్‌సింగు, రసబిహారీ ఘోష్ అనే దొంగముచ్చులతో నేను చేయి కలపను. మీరు మీ యిళ్లలో పెద్దవాళ్లు ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఏమి మాట్లాడుకొంటారో నాకు చెప్పాలి. ఢిల్లీ దర్బారులో వైస్రాయి హార్డింగు ప్రభువుమీద బాంబులు విసిరిన వారిని యింకా పట్టుకోలేదు. వాళ్ళు ఆర్యసమాజానికి చెందినవారు. వాళ్ళు జార్జి ప్రభువును, మేరీ రాణిని చంపినంత పని

చేశారు. వైస్‌రాయ్ ప్రభువు చనిపోయివుంటే మనదేశానికి ఎంత అప్రతిష్ట కలిగివుండేదో వూహించండి. బాంబు విసిరిన ఈ కృతఘ్నులకు తెల్ల దొరలు మనకు చేసిన మంచి తెలియదు. వారు మనకు తెల్లటి దుస్తులు ధరించేది నేర్పారు. పట్టిమాటలు కట్టిపెట్టి కష్టించి పనిచేసేది నేర్పారు. కాలవలు, రహదారులు, రైలుమార్గలు, ఆసుపత్రులు, బడులు ఏర్పరచారు— ఇప్పుడు మీరు చదువుకునేది ప్రభుత్వ పాఠశాలలోనే కాబట్టి కృతజ్ఞతతో వుండటం నేర్చుకోండి. ఎవడో గొణుగుతున్నట్టున్నాడు. నేను మాట్లాడుతుండగా నోరు మెదిపారంటే చంపేస్తాను. నేను మీకు నడవడికను గూర్చి నేర్పుతున్నాను.'

'ఎవరూ మాట్లాడలేదు మాష్టారూ!' బల్లకదిలిన శబ్దం అన్నాడు బాట్లియా క్లాసు మొత్తానికీ నాయకుని హోదాలో.

'నోర్మయ్! మీనాన్న విలాయతీరామ్ ముతక ధోవతీ కట్టుకుంటాడు. నిన్ను క్లాసుకు నాయకుణ్ణి చేయటం పొరపాటు. వీళ్ళనాన్న సంపాదించిన డబ్బంతా కూడబెడతాడు, లెక్క ప్రకారం జాన్ మొహమ్మద్ 'మానిటరు' కావాలి. నువ్వు నాకు ఏం తెచ్చిచ్చావు చెప్పు. ఇంగ్లీషు బళ్ళలో తెలివితేటలు శరీర ధారుఢ్యం కలిగిన అందమైన వాళ్ళని ఎన్నుకుంటారు. '

'నేను అతనికంటె చిన్నవాణ్ణి' అన్నాడు జానీ. బాట్లియా చేతిలో తన్నులు తినవలసి వస్తుందేమోనని భయపడుతూ.

'అయితే అదే పద్ధతిలో వైస్‌రాయ్ కంటె నేను బలంగా వున్నాను. కాబట్టి భారతదేశానికి నేను వైస్‌రాయ్‌ని కావాలి చిన్నాపెద్దా అనే తేడాలేదు. గురువులను ఎక్కువగా ఎవరు గౌరవిస్తారు అనేది ముఖ్యం. ప్రాచీన కాలంలో ప్రతిపండుగకూ గురువులను భోజనానికి ఆహ్వానించి వస్త్రదానం చేసేవాళ్ళు. ఇప్పుడు ఈ పాడు కాలంలో బాట్లియా నాన్న వంటి షాపు యజమానులు డబ్బంతా కూడ బెట్టటం నేర్చుకున్నారు కానీ పాత సంప్రదాయాలు ఎవరికీ అలవాటు కాలేదు. అందునా షాపు యజమానులు కాంట్రాక్టరులు వారి అధికారులకు బహుమానాలిస్తున్నారు కానీ, పెద్ద మనుష్యులైన బడి పంతుళ్ళకు ఏమీ ఇవ్వరు.

ఇదిగో మీకందరికీ చెప్పన్నాను. నీ వద్దనుంచి గానీ, పెసినారి నీ తండ్రి నుంచి గానీ నేనేమీ ఆశించటం లేదు. కానీ ఈ చుంచెలుక, గణేశ్ వాళ్ళన్న జైలరు కాబట్టి నాకవసరమైన రెండు దుప్పట్లు తెస్తారు. నయీమ్, వాళ్ళ సోదరుడు అస్లమ్ డాక్టరు కొడుకులు కాబట్టి మందుల పెట్టె తీసుకు రాలేక పోయినా కనీసం 'క్వినైను' మాత్రలు, 'టించరు' తెచ్చి పెట్టండి. జానీ! నీవు మీ చెల్లెలు పెట్టెలోంచి రోజా అత్తరు తెచ్చిపెట్టు.'

ఆ సమయంలో బడిగంట మోగింది. ఆయన ఉపన్యాసం హోరు నుంచి తప్పించుకొని బయటపడ్డాము.

బడిగంటను మించిపోయేలా గొంతు పెంచి, మమ్మల్ని మంత్ర ముగ్ధ చేసేలా ఆయన మాట్లాడసాగారు

'గుర్తుంచుకోండి! రేపు మీరు తెచ్చియివ్వదలచుకొన్నవన్నీ రావాలి. బడి ప్రారంభం కాకముందే మాయింటి దగ్గర తెచ్చియివ్వండి '

బడిగంట ఆగిపోయింది. మా తరగతివైపు షానవాజు మేష్టారు నడచి రావడం గమనించాం. బుద్ధసింగు మేష్టారు తలపాగా, చొక్కా సవరించుకొని, చేతిలో బెత్తం పట్టుకొని బయటికి నడిచారు.

తెల్లదొరల పండుగ మిషమీద స్పష్టంగా కానుకలు తెచ్చి యివ్వ మని మేష్టారు అడిగిన విషయాలను యింటిదగ్గర చెప్పి కానుకలు ఎలా తీసుక రావాలా? అని మధ్యమధ్యలో పిల్లలు గుసగుసలాడసాగారు.

ఆయన మేము ఆలస్యంగా బడికి వచ్చినందుకు, బెత్తంతో రెండు దెబ్బలు వేయకపోవడానికి కారణం మాకు తెలుసు. మేము యింట్లో ఆయన అడిగిన కానుకలు ఎలానో బ్రతిమాలి తెచ్చి యివ్వాలని ఆయన ఉద్దేశం. మా అన్న ఊళ్లో లేడనే సాకుతో నేను తప్పించుకొందామని చూశాను.

మరునాడు ఉదయం కుర్రవాళ్లు ఎవరూ ఆయన యింటికి కాను కలు తీసుకెళ్లలేదు. సాకులుగాని, కల్పిత కారణాలుగాని మరునాడు బుద్ధ సింగు మేష్టార్ని సంతృప్తి పరచలేదు. ఆయన భారీ శరీరం కంపిస్తూ

ఉండగా, ఎర్రనైన ముఖంతో చేతిలో బెత్తం పట్టుకొని ఆయన తరగతి గదిలో ప్రవేశించాడు.

బల్లమీద బెత్తంతో చరుస్తూ, ముక్కుపుటాలు ఎగురవేస్తూ, ఆ రాక్షసుడు కుర్చీలో కూచొన్నారు. ఎవరెవరు బడికి రాలేదా? అని తలపంకించి పరికించి చూశాడు. హాజరు పట్టీవిప్పి, వరుసగా పేర్లు చదువుతూ, బాట్లియా పేరువద్ద ఆగాడు. ఉద్దేశపూర్వకంగా అక్కడ ఆగి, పుస్తకం మూసివేసి తల ఆడించాడు ఆయన ముఖం కోపంతో జేవురించింది. ప్రమాదాన్ని శంకించాం.

'అయితే మీరందరూ బాట్లియా చెప్పిన మాటలు విని నామీద కుట్ర పన్నారు. బెంచీ ఎక్కండి. క్లాసు మొత్తం ఒక్కసారిగా.. .' ఏదో గొణుగుతూ కుర్చీలోంచి నుంచొని, మావైపుకు నడచి, ఊగిపోతూ వచ్చాడు.

దుస్తులు దులుపుకొంటూ, ఒక్క క్షణంలో అందరూ బల్లలపై నుంచొన్నారు.

బాట్లియా వద్దకు వెళుతూ మేష్టారు అరిచాడు 'చేతులు చాపు....'

'మేష్టారు! జానీ....'

'నోర్మూయ్.. చేతులు చాపు'

'నేనేమీ తప్పు చేయలేదు. మేష్టారూ.' అన్నాడు జానీ.

'నీ దగ్గరకు వస్తున్నాను. మీ సంగతి చూస్తాను. చేతులు చాపండి. ఒరే బాట్లియా పందీ! దొంగ ముండా కొడుకా! సిగ్గు లేనివాడా!'

బుద్ధసింగు మేష్టారి గొంతు కోపంతో బొంగురు పోయింది. ఆయన ఒకటి, రెండు, మూడు వరుసగా దెబ్బలు కొట్టి, తన చేతిలో శక్తినంతా వినియోగించి, మేమందరం బల్లలమీద నుంచుని వుండగా, నా వైపు తీక్షణంగా చూస్తూ కొట్టసాగాడు.

ఆయన కొట్టడమనే నాటకంలో భయం తగ్గిపోయి, వణుకు ప్రారంభమైంది. నేను నాముందు జరిగేది చూడటంలేదు. ముంతాజ్ నాకు

సాయంగా వస్తుందేమోనని ఆత్మశోధన చేయసాగాను.

'నన్ను మరోమాట మాట్లాడావంటే, నిన్ను చంపి ఎముకలు ఏరుకొని తినేస్తాను' బుద్ధసింగు మేష్టారు ఎదురు చెబుతూ అరిచాడు.

చలికాలం ఉదయవేళ చలిగాలులు వొంటిపై తీక్షణంగా ప్రసరించి నట్లు, బాట్లియా శరీరంమీద బెత్తం పడింది. బాట్లియా గొంతెత్తి నవ్వు తున్నట్లు ఏడవసాగాడు. ఏడుపులు, పెడబొబ్బలు, తిరుగుబాటు ధోరణి మధ్య మాష్టారిని ఎదిరించాలనే ధోరణిలో, చనిపోయినా ఫర్వాలేదన్నట్లు ప్రవర్తించాడు భాట్లియా.

'కొట్టు! కొట్టు! మీయిష్టం వచ్చినట్లు కొట్టండి. నేను లొంగను.... పిశాచమా!'

'పిశాచమా' అనేమాట భాట్లియా నోటివెంట రావడంతో తర గతిలో పిల్లలంతా భయకంపితులయ్యారు. బాట్లియా సంగతి తేలిపో యిందనుకొన్నాము.

'నేను ఎలాంటి పిశాచినో చూపుతాను.' అంటూ బుద్ధసింగు మేష్టారు యముని మహిషపు లోహగంటలు శబ్దం చేసినట్లు అరిచాడు.

బెత్తం దెబ్బల శబ్దం క్రమంగా బావిలోంచి నీళ్లుతోడుతూ కడవ లలోంచి నీరు పోసినట్లు వినిపిస్తోంది.

'మీరు కొట్టడం ఆపకపోతే, పోలీసులకు ఫిర్యాదు చేస్తాను.' బాట్లియా గద్దించాడు.

'పోలీసు మీ అబ్బ సొత్తుగదూ' అంటూ మేష్టారు బాద సాగాడు.

'చూడండి. ఈ రాక్షసు డేంచేస్తున్నాడో! ఓ దేవా! చూడు. అదృశ్యదేవతరాలా మీరెందుకు రక్షింవరు!' అంటూ బాట్లియా ఏడ్చాడు.

చివరలో అతడు పెట్టిన మొర నాకు బాధ కలిగించి, నా కంఠం లోంచి అస్పష్టమైన మాటలు వచ్చాయి.

'ఒరే! మంచు గాడిద కొడకా! నీ సంగతి చూస్తాను. నీ సంగతి మరిచి పోయావనుకోకు. బాట్లియా చాటున తలదాచుకొందా

మనుకోకు. అతడు నిన్ను రక్షిస్తా డనుకొన్నావా?.... నీవు చిన్నవాడివి గాబట్టి నిన్ను వొదులుతా ననుకోకు.'

నేను నోరుమూసుకొని వుండే వాణ్ణి! కాని, వాళ్లోని అమాయకత త్వము, జాలితనము, నిష్కాపట్యము పెల్లుబికివచ్చాయి.

'మీరు గొప్పలు చెప్పకొంటారు. చిన్నమాట చెబుతాను. ఎంచా లడుగుతూ మమ్మల్ని కొడుతూ, తిడుతూ వుంటే మీవంటి పెద్దలు దేవతలు కాదు.' అనాలనుకొన్నాను.

'నేనేమీ తప్ప చేయలేదు మాష్టారూ' ఆయన నావద్దకు రావడా నికి ముందే నేను కీచు గొంతుతో అన్నాను.

'జెలగవెధవా! చేతులు చాపు' బుద్ధసింగు అరిచాడు.

'మాష్టారూ!'

ఆ రాక్షసుడు నామాటలు వినిపించుకోడం లేదు. బాట్లీయా తిరుగుబాటు ధోరణివల్ల కలిగిన క్రోధంతో శరీరమంతా వొణికిపోతుంటే, తన రాక్షసత్వాన్ని మరింత ఉధృతం చేసి, నా చేతులు వెనక్కి లాగినా లేదనక నా చేతులపై కొట్టాడు.

'అయ్యో! అమ్మా!' అంటూ గోలపెట్టాను.

'ఇప్పుడు మీ అమ్మ గుర్తుకు వస్తోంది? బాట్లీయాను మరిచిపో యావా?'

'మాష్టారూ! వాడు....' జానీ గొంతు వినిపించింది.

'కుక్కా!' అంటూ వెనక బెంచీల దగ్గరకు మేష్టారు పరుగెత్తారు. బహుశా సోదర ప్రేమతో గణేశ్ అలా అన్నాడని అనుకొన్నారు. గొంతు వినిపించిన వైపు బెత్తం ఝళిపించి, గణేశ్‌కు, జానీకి దెబ్బలు తగిలించాడు.

'కాని మేష్టారూ!' జానీ ఫిర్యాదుగా అన్నాడు.

తన భుజ బలప్రదర్శనవల్ల ఆయనకు ఎవరి మాటలు వినిపించలేదు.

'నేను హెడ్మాష్టరుగారికి చెబుతాను' తన సంరక్షకుడి పక్షంగా

మాట్లాడాలని సన్నగా జానీ అన్నాడు.

'నీ వాగుడు వినేదెవరు?' తన విజయగర్వంతో ఆ రాక్షసుడు అన్నాడు: 'మీ నాన్నకు, వాళ్ల జేజినాన్నకు చెప్పు. హెడ్మాష్టరికి చెప్పు'

'నేను గదిలోంచి బయటికెళ్తున్నాను. హెడ్మాష్టరుగారికి చెబుతాను. నాతో పిల్లలంతా బయటికి రండి!' బాట్లియా అరిచాడు.

'గంట కొట్టేలోగా బయటికి వెళ్లడానికి నీకెంత ధైర్యం!' అన్నాడు బుద్ధసింగు. ఎవరైనా బయటకు జారుకొంటారేమోనని తలుపు దగ్గర అడ్డం నిలబడ్డాడు.

బాట్లియా బల్లమీద నుంచి కిందికి దూకి, మాష్టారి బల్లదాకా ముందు కెళ్లాడు.

మ్యాష్టారు అతని మెడపట్టుకొని వెనక్కి తోసేశాడు.

గదిలో గుసగుసలు, నిస్స్పృహ వాతావరణం ఏర్పడింది.

ఎవరు గుసగుసలాడుతున్నారో తెలియక, ఆ రాక్షసుడు చావ బాదుతూ కుడి ఎడమలవైపు బెత్తం ఝుళిపిస్తూ వెళ్లాడు. పిల్లలు భయంతో దెబ్బ తగులుతుందేమోనని ముందుగా ఏడవసాగారు.

నా పక్కన కూచొన్న నయీామ్ ఈ రణగొణ ధ్వని గమనించి, బయటకు వెళ్లడానికి ప్రయత్నిస్తూ: 'నిరంకుశుడు! హెడ్మాష్టరుగారు మాత్రమే యితని క్రూరత్వాన్ని అదుపులో పెట్టగలరు' అన్నాడు.

ఆ రాక్షసుడు వెనక్కి తిరిగి, పరుగెత్తి, వెనకవైపుగా అతని చొక్కాపట్టుకొని లాక్కొవి వచ్చాడు.

'హెడ్మాష్టరు' దగ్గిరి కెలా వెళ్లాలో నేను నేర్పుతాను!— అంటూ అతణ్ణి బలవంతంగా నేలమీదికి తోశాడు. బల్లకాలికి నుదురు తగిలిన నయీామ్‌కి రక్తం కారసాగింది.

గంటకొట్టేలాగా పక్కగదిలో పాఠం చెబుతున్న షానవాజు మాష్టారు వచ్చి — 'ఇంక క్షమించండి మాష్టారు! వాళ్లని' అన్నారు.

'మీ గదికి మీరు వెళ్లండి. వీళ్లు తల లెత్తితిరిగి నన్ను ఎదిరించడానికి మీరు వీళ్లని బాగా పురికొల్పారు' అని సమాధానమిచ్చాడు బుద్ధసింగు.

'సరే పిల్లల్లారా! మీరు నిశ్శబ్దంగా ఒకే వరసలో నాతో నడవండి. హెడ్మాష్టరుగారి వద్ద కెళ్దాము. దేనికైనా ఒకహద్దు ఉంది. ఈ విధంగా కొట్టడం ఆపాలి!'

'షానవాజు మేష్టారుతో వెళ్దాంరండి' బాట్లియా అరిచాడు.

'వెళ్దాంపదండి' అన్నాను నేను సన్నగా.

'ఎంత ధ్యైరంరా నీకు!' అంటూ బుద్ధ సింగు మేష్టారు బెత్తంతో చివరి వాత పెట్టారు.

'ఎంత ధైర్యమో చూపుతాను. లేకపోతే ఛస్తాను.' అన్నాను-ఎదిరించే స్వరంతో.

షానవాజు మాష్టారు బయటికివచ్చి మాకోసం ఎదురుచూస్తునారు.

గంటకొట్టారు. పిల్లలు బయటికివచ్చి వరసలో నించున్నారు. షానవాజు మాష్టారు మమ్మల్ని హెడ్మాష్టరు గదికి నడిపించారు.

బాట్లియా మా నాయకుడు గాబట్టి, జరిగిన విషయం హెడ్మాష్టరుగారి గదిలోకి వెళ్లి చెప్పవలసిందిగా షేక్ అబ్దుల్ హమీద్ కోరారు. మేము బయట వరసల్లో నించున్నాము.

వ్యాయామంకోసం అన్నట్లు మేము వరసల్లో నిలబడటం, చుట్టూ పిల్లలకు ఆసక్తిగా ఉంది. పక్క తరగతి పిల్లల్ని షానవాజు మాష్టారు వాళ్లవాళ్ల గదుల్లోకి పంపించి వేస్తున్నారు. విషయం తెలుసుకోవాలని అనుకొన్న వాళ్లతో మేమందరం బుద్ధసింగు మేష్టారు మీద ఫిర్యాదు చేయడానికి వచ్చామని చెప్పారు.

కొంచెంసేపట్లో హెడ్మాష్టరు గదిలోంచి బాట్లియా తలుపుతీసుకొని బయటికి వచ్చాడు. షానవాజు మాష్టార్ని హెడ్మాష్టరు పిలుస్తున్నారనే వార్త మోసుకొచ్చాడు. ఈ విధేయుడైన ఉపాధ్యాయుడు జాన్ మహ

మ్మదును వెంటపెట్టుకొని లోపలికెళ్లారు. లోపలి హెడ్మాష్టరు ఏమన్నారో బాట్లియాను అడిగి తెలుసుకొందామని మేమందరం ఆసక్తిగా ఎదురుచూ స్తున్నాముగాని, షానవాజు మేష్టారు నిశ్శబ్దంగా ఉండమని కోరడంవల్ల, మా ఆసక్తిని అణచుకొన్నాము.

కొన్ని క్షణాల తర్వాత నయీా మహమ్మదును లోపలికిపిలిచారు. బహుశా బుద్ధసింగు మాష్టారి అమానుషత్వానికి అతడు ఎలా బలి అయ్యాడో ప్రత్యక్ష నిదర్శనం చూపడానికి పిలిచి ఉంటారు.

బయట ఎదురుచూస్తూ నిలబడటమనే ఉత్కంఠ అధికమైంది. కాని, షానవాజు మాష్టారు మాపక్షాన ఉన్నాడు గాబట్టి, మేము ఏ విధంగా బుద్ధసింగు చేతిలో చిత్రహింసలకు గురి అవుతున్నామో, ఆయన హెడ్మాష్టరుకు అర్థమయ్యేలా చెప్పగలరనే నమ్మకముంది. ఆయన ఏ విధంగా నిర్ణయిస్తారో మాకు తెలియదు. ఆయన బుద్ధసింగును మందలించి వదిలివేస్తే, కొద్ది రోజులతర్వాత మేము పెద్దవాళ్లతో చెప్పినందుకు ఆయన మాపై ప్రతీకారం తీర్చుకొంటాడు.

మేము ఈ విధంగా ఊహాగానాలు చేస్తుండగా, బుద్ధసింగు మాష్టా రుని వెంటపెట్టుకొని బడి జవాను సుభాన్ అలీరావడం చూశాము—

ఆయన చెప్పుల కిర్రు శబ్దం నాలో వణకుపుట్టించింది. ఆయన గదిలో చేసిన విలయతాండవం గుర్తుకొచ్చింది. వేటగాణ్ణి చూస్తే జంతువు ఏవిధంగా రాతియుగంలో భయపడేదో అలా భయపడ్డాను.

సుభాన్ అలీ వెంటనడుస్తూ ఆయన మాకేసి చూడలేదు. ఆయన ముఖం పాలిపోయి ఉంది.

ఆ చలిగాలిలో వేపచెట్టు నీడలో నుంచుని, ఏ విధమైన నిర్ణయం వస్తుందోనని ఎదురుచూస్తున్నాం. మా శరీరానికి తగిలే చలిగాలికి, గాయాలు నొప్పి పుడుతున్నాయి. ఎవరంత వాళ్లు తమ గాయాలను తవుడుకొంటున్నారు. ఏ కొద్దిపాటి సానుభూతి వచ్చినా కన్నీళ్లు కారేలా ఉన్నాం. బాట్లియా మాత్రం ధైర్యంగా-

"హెడ్మాష్టరుగారిని అతడు ధైర్యంగా ఎదుర్కొనేండి! పిచ్చివాడు.

చావు తెచ్చేవాడు."

'పిచ్చివాడు!' బాట్లీయా అన్నమాట నాకు ఆశ్చర్యం కలిగించింది. ఆంగ్లేయుల కంటె తక్కువ వాడిననే న్యూనభావంకంటె మరేదో ఆయనలో లోపం ఉంది.

హెడ్మాష్టరుగారి గదిలోంచి బయటికి వస్తూ షానవాజు మేష్టారు పెదాలపై వేళ్లు దించుకొనివచ్చారు.

మే మందరం ఏం జరిగిందోనని ఆసక్తిగా ఎదురు చూస్తున్నామని ఆయనకు తెలును. ఆయన సహజ ధోరణిలో మమ్మల్ని నమ్మినట్లుగా భావిస్తూ:

"తలలు పైకి ఎత్తండి. మీ తల్లులు చనిపోయినట్లుగా ముఖాలు పెట్టకండి..... హెడ్మాష్టరు మిమ్మల్ని చూడటానికి బయట కొచ్చేంత వరకు మీ ముఖాలపై కన్నీళ్లను తుడుచుకోవద్దని సలహాయిస్తున్నాను."

ఈ మాటలకు అందరూ ప్రయత్నపూర్వకంగా నవ్వారు. ఈ నల్లటివ్యక్తి, ప్రియమైన గడ్డంచూసి నాకు ఆయనపై అభిమానం పెరిగింది. నా మనసులో ఆలోచన తళుక్కునమెరిసింది:

కొందరు ఎంత మంచి వారు, మరికొందరు ఎంత క్రూరులు! నా అంతరాత్మలో మా అన్నగారి వేశ్య ముంతాజ్ ప్రతిబింబం కనిపించింది. ఆమె కేవలం తన వునికి ద్వారా మా వదినె ద్రౌపదిని ఎద్దేవా చేస్తున్నట్లుగాతోచింది. ఆవిడ నాలోలోపల ఎక్కడోవుండి నాకు మానసిక ధైర్యాన్ని కలిగించినట్లుగా ఆసక్తికరంగాతోచింది. నేను చివరగా బుద్ధ సింగు మాష్టార్ని ప్రతిఘటిస్తూ మాట్లాడటం ద్వారా ఆయనలో ద్వేషాన్ని పెంచానని తెలుసు. ముంతాజ్‌పై ప్రేమ మీద ఆధారపడ్డాను. నా అంతరాత్మకంటె ముందు నా ఊహోజ్వరం ముందు నడుస్తోంది.

నా అంతరాత్మగానం హెడ్మాష్టరు అబ్దుల్‌హమీద్ తన గది తలుపుతోసుకొని రావడంతో నిలిచిపోయింది.

మునివేళ్ళతో తన మీసాలు దువ్వుకుంటూ ఆయన మాట్లాడ సాగాడు: 'పిల్లల్లారా! ఆరో తరగతిలో నిన్న, ఈ రోజు బుద్ద సింగు

మాష్టారు క్లాసులో ఏం జరిగిందో మీ నాయకుడి ద్వారా విన్నాను... మా గ్రామంలోని మసీదులో మౌల్వీ సాహెబ్ నన్ను కొట్టినప్పుడు జారిన కన్నీళ్లవేడి నాకు తెలుసు. ఇది ప్రభుత్వ పారశాల; గ్రామంలో మసీదు కాదు. బెత్తం ద్వారా మీరు పాఠాలు నేర్చుకోవడం నాకిష్టం లేదు. ఆంగ్ల పారశాలల్లో ఇదొక్కటే మార్గమని బుద్ధసింగు మాష్టారు అనుకొంటున్నారు. మీ గాయాలు చూస్తే తెలుస్తున్నది — ఆయన బలంగా కొట్టారని...... మనం లండన్ నగరంలో నివసించడం లేదు. క్రిస్మస్ కానుకల కోసం ఏ ఉపాధ్యాయుడు అడుగరాదు. అలానే మీరు ఉపాధ్యాయుల్ని గౌరవించాలి స్కూళ్ల ఇనస్పెక్టర్‌గారికి బుద్ధసింగు మాష్టారు చేసిన పనిని గూర్చి నివేదిక పంపుతాను. ఇనస్పెక్టరుగారు ఒక నిర్ణయం తీసుకొనేంత వరకు, ఆయనను తప్పించి, ఆయన క్లాసులు మరి నేనే తీసుకొంటాను... రేపటి నుండి మీకు సెలవులు. సెలవు లనగానే మీ అందరిలో ఎంత ఉత్సాహం కలుగుతుందో నాకు తెలుసు. మరోగంట కొట్టగానే, మీరు, మిగతా తరగతుల వాళ్లు యిళ్లకు వెళ్లండి. సంవత్సర పరీక్షలు దగ్గర పడుతున్నాయనే విషయం మరిచి పోవద్దు...'.

ఆ తర్వాత ఆయన జవాను సుభాన్ అలీకి సైగచేశాడు. అతను తాడులాగి బడి ఆఖరి గంట మోయించాడు.

'హెడ్మాష్టరుగారికి జేజేలు చెప్పండి' అంటూ బాట్లీయా 'జైజై' అన్నాడు.

హెడ్మాష్టారు గారు అలా అరవడానికి నిరసనగా చేయి వూపుతూ తమ ఆఫీసు గదిలోకి వెళ్ళారు.

మేము తరగతుల్లోకి వెళ్ళి సంచులు తీసుకరావడానికి వెళ్లాము. అరపూట సెలవు యివ్వడంతో మా గాయాల నొప్పి మరచి పోయాము.

'హెడ్మాష్టరు గారు ఆ రాక్షసుణ్ణి ఉద్యోగం లోంచి తీసివేశారు. నా మాట నమ్మండి!' అని హామీ యిచ్చారు బాట్లీయా.

'అలావే కావాలి'

'అతనికి ఇది మంచి గుణపారం'

'భలేభలే!'

'సెలవులకు యిది అతనికి మంచి కానుక. ఆ రాక్షసుడికి తగిన శాస్తి జరిగింది'.

ఇలా ఉత్సాహంగా కబుర్లు చెప్పకొంటూ పిల్లలు స్వేచ్ఛాగానం చేశారు. కొట్టారన్న భయం తొలగిపోయింది. నేను ఎవరినైతే పిరికి వాళ్లు, గాడిదలు అనుకొంటూ వచ్చానో, అలాంటి జానీ, గణేశ్ కూడా బాట్లియా, నయీమ్ పక్షం వహించి నిలబడ్డడం నాకు నచ్చింది. ఒకవేళ బుద్ధసింగు మాష్టార్ని స్కూళ్ల యినస్పెక్టరు క్షమించి వదలివేస్తే ఏమి జరుగుతుందో నన్న భయం ఒకమూల లోలోపల నాలో దాగి ఉంది.

నా గుండెల్లోంచి ఈ బాధ తొలగిపోలేదు. హరీష్ సలహాకు భిన్నంగా, నేను ప్రేమించే ముంతాజ్‌ని వెళ్ల చూడాలని నిశ్చయించు కొన్నాను.

నా సంచి తీసుకొని, దిగులుగా యింటి ముఖం పట్టాను. నా శరీరం లోంచి మంటలు, కాళ్లనొప్పలు ప్రారంభమైనాయి. నా కళ్ల మంటలకు తోడు తల దిమ్మెక్కింది. ఇంటి గుమ్మం దగ్గరకు వెళ్లేసరికి, పడకపై వాలిపోయాను.

జానీతో కూడా యింటికి ముందే వచ్చిన గణేశ్ నా నుదిటిపై చేయివేసి 'జ్వరంగా ఉంది. వెళ్లిపడుకో' అన్నాడు.

గణేశ్ జైలు డాక్టరయిన జానీ నాన్నను తీసుకరావడానికి వెళ్లాడు.

# 6

అనారోగ్యసమయంలో అంతరాత్మ ప్రస్ఫుటమవుతుందని మన దేశంలో నమ్మకం!

గుజరన్‌వాలా నుండి హరీష్ తిరిగి వచ్చేటప్పటికి నా కింకా కొద్ది

పాటి జ్వరం వుంది. నేను లేచేసరికి అతను గడ్డం చేసుకొంటున్నాడు. అద్దంలో అతని ముఖం కనుబడుతోంది. కోపంతో అతని ముఖం జేవురించి బొమముడి తీక్షణంగా కనిపిస్తోంది. తన పుట్టింటికి వెళ్లగానే ద్రౌపది తానిచ్చిన వాగ్దానాన్ని కాలరాచి, తనతో తిరిగి రావడానికి యిష్టపడలేదని గ్రహించాను. ఇప్పుడు హరీష్ మా నాన్నకు సమాధానం చెప్పుకోవాలి. అగాఖాన్ మతాన్ని స్వీకరించిన వారి యింట్లో, హిందూ సమాజంలోని స్త్రీ ఎలా ఉంటున్నది? అనే ప్రశ్నకు మా సోదరవర్గం ముందు మా నాన్న సంజాయిషీ యిచ్చు కోవాలి.

హరీష్ ఎదుర్కొంటున్న ఈ సామాజిక అవరోధానికి మరో మార్గాంతరం నాకు తెలుసు. ద్రౌపదిని తిరిగి స్వీకరించడమా? ముంతాజ్‌ని పెళ్లాడటమా? బయటికి అంగీకరించకపోయినా, అతని మనసులో ఈ సందిగ్ధంతో కొట్టుమిట్టాడుతున్నాడు.

మా అన్నను చూడగానే నేను అమాయకపు పిల్లవాడిలా యిలా అన్నాను: 'నువ్వు వొంటరిగా వచ్చివేసినట్లు నాకు కల వచ్చింది .... అది నాకెంతో సంతోషంగా ఉంది....'

'సరే. నువ్వు మరీ సంబరపడిపోకు. దేవుడిదయ ఎలా ఉంటే అలా జరుగుతుంది. నీ బాధ్యత నా మీద మరీ ఎక్కువైంది' అని హరీష్ నా మాటకు అడ్డుతగిలాడు. నేను తొందరలో గణేష్ ముందు ముంతాజ్‌ని గురించి ఎక్కడ నోరు జారుతానోనని అతని భయం.

అదృష్టవశాత్తు అప్పుడే మాలీ ఈలమ్‌దీన్ పాల డిపోనుండి పాలు తీసుకరావడానికి గణేశ్ వెళ్లాడు. నేను హరీష్‌తో నగ్నసత్యం మాట్లాడి నా మనసు తేలికపరుచుకోడానికి సాహసించాను:

'అమ్మా, నాన్న నీపెళ్లి చేసి వుండకపోతే, ముంతాజ్‌తో నీపెళ్లి జరిగివుంటే నీ కీనాడు విచారమే కలిగివుండేది కాదు.' అన్నాను నేను ప్రపంచ ధోరణి తెలిసిపోయినట్లుగా. ఆ ధోరణి నాకే మూర్ఖంగా అనిపించి నా పెదాలపై మాటలు దొర్లాయి.

ఆ మాటకు హరీష్ చిరునవ్వు నవ్వి, ముఖం పక్కకు తిప్పుకొని— 'నిజమే. మన పెద్దవాళ్లు యిది గ్రహించరు. వాళ్లు పెళ్లిళ్ల

కుదురుస్తారు..... ఇప్పుడు...నూరా ఎంత అదృష్టవంతుడు! ముంతాజ్ చెల్లి మోతీని పెళ్లాడుతున్నాడు. నువు విందుభోజనానికి రేపు సిద్ధంగా ఉండాలి' అన్నాడు.

'జ్వరం ఎంత ఉందో చూడు. జ్వరం తగ్గాలిగా' అన్నాను ఉద్రేకంగా.

'నీ నుదురు పట్టుకొని చూడనీ!' అంటూ నాముందుకు వచ్చాడు. 'కొద్దిగా వేడిగా ఉంది.... థర్మామీటరు తెస్తాను'

థర్మామీటరు శాస్త్రీయ పరీక్ష అయినంతవరకు ఆదుర్దాగా వేచి ఉండి, నోట్లోంచి అది తీయగానే అతనివైపు చూశాను.

'ఇంకా 101 డిగ్రీలు వుంది! నువు నూరా, మోతీ పెళ్లి భోజనానికి రావడం మంచిది కాదని నా ఉద్దేశం.' అని తీర్పు ప్రకటించాడు.

ఆ సందర్భంలో మారు మాటాడ కూడదని ఊరుకున్నాను. ముంతాజ్‌ని చూడటమనే మంచి అవకాశం దొర్లిపోతుందనే దిగులు నాలో ఉంది.

'నువు వాళ్లను — మనయింటికి తీసుకొస్తావా?' బాధగా మాటా మాటా కలిపి అన్నాను.

'చూద్దాం. బహుశా గణేశ్ పెళ్లికి వస్తాడు.'

'సరే! నా వాటా మిఠాయిలు నాకు తెస్తావా?' అన్నాను యాసగా.

'తప్పకుండా! కాని నీవు తినవచ్చో, లేదో జ్వరంచూసి తర్వాత తినాలి.'

నూరా, మోతీ పెళ్లిజరిగిన రాత్రి, నాకు సరిగా నిద్రపట్టలేదు. పక్కమీద దొర్లుతూ మగతా నిద్రపోయాను. ముంతాజ్ నాతో కబుర్లు చెప్పే సమయం లేక హడావిడిగా ఉంటుందన్న విషయం నాకు వూరట కలిగించింది.

మా పక్కింటి సిపాయి జయ్‌సింగు నా తల పక్క కూచొని ఉన్నాడు. లాంతరు వెలుతురు మసకగా పడుతోంది; దాని ఛాయలు

గోడ మీద పడుతున్నాయి.

ఆ మసక వెలుతుర్లో నా ఆలోచనలు, సరదాలు మగతగా ఉన్నాయి. ఆ చీకటి వాతావరణంలో వెలుగు తగ్గిపోయి, అస్పష్టమైన ఛాయలు కనిపించ సాగాయి. నాలోని తీవ్రమైన భావోద్రేకం ఆ ఛాయల రెక్కల పై కూచొంటున్నాయి. పెదాలపై 'ముంతాజ్' అనే మాటలు ప్రియంగా ఉచ్చరిస్తూ, నాలో నేను గొణుగుకుంటూ నిద్రపోయాను.

ఆవిడ నా మీద ముఖం పెట్టి మాట్లాడినట్లు వూహించాను. దంతపు బొమ్మలాంటి ఆమె ముఖం చిరునవ్వులు చిందిస్తూ 'బిడ్డా! త్వరగా సిద్ధంకావాలి' అన్నట్లు అనిపించింది. ముఖమల్ పైట చెంగు తన ముఖాన్ని కప్పగా, ఆమె దరహాస నయనాలతో నావైపు చూస్తున్నట్లు కలగన్నాను. నేనలా పక్కకు వొత్తిగిలి చూస్తే, ఆవిడ నిజానికి నా పక్కన లేదు. నేనలానే పక్క మీద దొర్లుతూ, నా స్వాప్నిక జగత్తులో మునిగి తేలుతూ వున్నాను.

పెళ్లి అయిన తర్వాత మోతీ, నూరా ఏంచేస్తారు? అనే ప్రశ్న ఉదయించింది. దాగుడుమూత లాడుకొంటారు. నూరా మోతీ మెడ పట్టుకొని కొరుకుతాడు నయీామ్ నాకు యీ మధ్య చెప్పినట్లు, మోతీ కడుపులోపలికి నూరా వెళ్లి, వాళ్లిద్దరికీ బిడ్డపుడతాడు. అలా జరగడం నేను చూడలేదు. డాక్టరుగారి అబ్బాయి కాబట్టి నయీామ్ చెప్పింది నిజమే కావాలి. అలానే చిన్న పిల్లలు పుడతారు.

ఈ విధమైన ఆలోచన రాగానే, ముంతాజ్ మెడగట్టిగా పట్టుకోవాలనే గాఢమైన వాంఛ కలిగింది. దేవకి పిన్నిని గాఢంగా పట్టుకొన్నట్లు ఆవిడను కూడా పట్టుకోవాలనే కోరిక నా మనసులో కలిగింది. నాలో ఏదో మాయా భరితమైన కోరిక కలిగినట్లు, దానితో ఉద్రేకం పెరిగి నేను వణికి పోతూ కిందికీ పైకీ ఎగిరాను.

ఇలా నేను కదలడంతో తూగుతూ తలవాల్చిన సిపాయి జయ్ సింగు మేల్కొని 'అలా చెయ్యకు బాబూ' అని హెచ్చరించాడు.

ముంతాజ్ పట్ల నా ప్రగాఢ వాంఛ, జయ్‌సింగు హెచ్చరిక నన్ను పటమతం చేశాయి. నా సంతోషాన్ని అతనెందుకు తుంచివేశాడు?

అతని దృష్ట్యవరోధ ధోరణికి కారణం ఏమి? అని ఆలోచిస్తూ కళ్లు మూతలుపడిపోగా నిద్ర పట్టేసింది.

నాకు బాగా నిద్రపట్టిన చాలాసేపటి తర్వాత సుందర దృశ్యం ఒకటి కనిపించింది. దాన్ని చూడటం వల్ల నాలో కలిగిన ఆనందంవల్ల నేను పడకమీద శరీరాన్ని అలానే పడవేసి, మగతకళ్లతో ఆశ్చర్యంగా చూడసాగాను. ఆరాత్రి, ఈ దఫా నిజంగా ముంతాజ్ ముఖాన్ని ప్రత్యక్షంగా చూశాను. ఆవిడ తన సున్నితపు వేళ్లతో నా నుదురు తాకి—

'కృష్ణా! నీ గోపిక యిక్కడ ఉంది. లేచి నాకో ముద్దివ్వు' అంది.

ఆవిడ సౌందర్యకాంతిని ఒక్కసారిగా చూడటానికి నాకళ్లు తెరిపిడి పడటంలేదు సరిగదా, ఆమె కోరినట్లు నేను ముద్దెట్టుకో లేకపోయాను. అది ఎంత భయంకరమైన విషయం. జరీమిళితమైన సిల్కుపైట చెంగు కప్పుకొన్న ముఖం, ఆమె శరీరంలోంచి వెలువడే సుగంధ పరిమళాలు, నాలో జాగృతి కలిగించాయి. ఆవిడ సుతారంగా నా నుదుటిపై వేసిన చేతివేళ్లు, హరీష్‌తో ఆవిడ సున్నితంగా మాట్లాడిన మాటలు నాకు నిజంగా గుర్తు.

'ఇది మీ ప్రాసాదం...... ఆవిడగారు యిక్కడ ఉన్నప్పుడు ఎక్కడ నిద్రపోయేది?..... వద్దు. వద్దు చెప్పవద్దు. వెళ్లి మోతీ, నూరాను లోపలికి తీసుకరండి. లేకపోతే ఈ సిపాయికి ఆశ్చర్యం కలుగుతుంది. రేపు పొద్దున ఊరంతటికీ నేనిక్కడ వున్నానని చాటింపువేస్తాడు.'

ముంతాజ్ చిరునవ్వు చిందించడం కనిపించింది. ఆవిడముఖం నాముఖంపై పెట్టినట్లు స్పృహ కలిగింది. నేను నెమ్మదిగా కళ్లు తెరుస్తూ చేతులు వదులుచేసి, ఆవిడ వెచ్చదనాన్ని అనుభవించ గలిగాను. మగతనిద్ర ఆపుకొంటూ ఇలా గొణిగాను:

'వదినా! లడ్డులు ఏవి?'

'బాబూ! దేవుడు మేలుచేస్తే నేను మీ వదినెనై, నీకోసం త్యాగం

చేసే దాన్ని! నీకు బాగైతే అప్పుడు లడ్లు తినవచ్చు. అప్పుడు నీవు నన్ను వచ్చిచూడవచ్చు. మీ అన్నగారి ప్రాసాదానికి నేను మళ్లీ వచ్చే అదృష్టం రాకపోవచ్చు. నేనెవరు గనుక? కేవలం వేశ్యను.. ఆవిడ నిట్టూర్పువదలి 'మోతీ ఎంత అదృష్టవంతురాలు!' నూరాని పెళ్లాడింది. నేనో......'.

మగత కళ్లతో నిద్రపోతున్నాను. ఆ మాటతో బలంగా నా చేతులు ఆమె మెడను చుట్టాయి. బహుశా ఆవిడకు నొప్పిగా ఉందేమో నా చేయి నెమ్మదిగా తొలగించి...... 'అదుగో ఆ శుభప్రదమైన జంట. లేచి కూచొని వాళ్లను చూడు. ఎంత కళకళలాడుతున్నారో...'

తలను పైకెత్తనీకుండా నాశరీరం జ్వరం వల్ల ఎంత డీలాపడిపోయిందో తెలుస్తోంది. క్షణకాలం పాటు కళ్లు తెరిపిడి పడ్డాయి. నా సుందర సుమధుర లోకంలో మోతీ, నూరాలను గుర్తుపట్టాను. వాళ్లు నా నుదుటిమీద చేతులువేసి సానుభూతి మాటలు అనడం వినిపించాయి.

'కొద్దిపాటి జ్వరం! రేపు ఉదయం లేచి పరుగెడతాడు. ఈ లడ్డూలు అతని దిండుకింద పెడదాము. లేచి చూసుకొంటాడు.'

దిండుకు ఎడమచేతివైపు లడ్డూల కోసం చేతితో తడివాను. ముంతాజ్‌పట్ల నా ప్రేమను చూపే సమయం ఆసన్నమైనప్పుడు నేను నిద్రాదేవి వొడిలో వాలిపోవడం క్షమించలేకుండా ఉన్నాను. నాలోని తృష్ణను బలంగా అణచుకొని, ఏంచేయాలో అర్థంకాని స్థితిలో వున్నాను. ఆవిడ నా దగ్గరగావచ్చి, నా ముఖంపై ముఖం వుంచినప్పుడు ముద్దెట్టుకోవలసింది.

మరువాడు ఉదయం నా దిండుదగ్గర లడ్డూలు చూశాను. ముంతాజ్, మోతీ, నూరా మాయింటికి వచ్చినట్లు, వాళ్ల రాకను గూర్చిన జ్ఞాపకాలు నాకింకా మగతగా గుర్తున్నాయి. అది కల మాత్రం కాదు. అయితే ఆ సుందరదృశ్యాన్ని ఎలా ఆలింగనంచేయడం? ఆ గుసగుసలు వివడమెలా?

ఎర్ర చేతిగుడ్డ నిండావున్న లడ్డూలు విప్పాను.

'బాబూ! కృష్ణా! అవి తినగూడదు. జ్వరం తగ్గితే సీయిష్టం వచ్చినన్ని తినవచ్చు.' అని హరీష్ వారించాడు. అమాట అని అటు తిరిగి పడుకొని నిద్రపోయాడు. నేను మేల్కొనాల్సిన సమయంలో నిద్రపోయినందుకు, నావసితనాన్ని నేనే తిట్టుకొన్నాను.

'గణేశ్ ఏడీ!' అన్నాను కొంచెం సేపు ఆగి.

'రాత్రి వాడు నూరాయింట్లో నిద్రపోయాడు. వస్తూ ఉంటాడు. రాత్రి మనయింటికి ఎవరువచ్చిందీ ఎవరికీ చెప్పకూడదు. నేను కాసేపు పడుకొని, స్నానంచేసి ఆఫీసు కెళతాను.'

నేను కదలకుండా మెదలకుండా, నిశ్శబ్దంగా పడుకొన్నాను. అత నికి మెలకువరాకుండా పడుకొన్నాను. అతడు చెప్పేది ఒకటి, చేసేది ఒకటి. వర్థి మోసగాడు. ముంతాజ్‌పట్ల తనప్రేమను బహిరంగంగా ఎందుకు చెప్పడు?

కొంచెంసేపట్లో తలుపుతట్టి, జయిసింగు లోపలికివచ్చి —

'మున్షీజీ! మున్షీజీ! లాల్తాను గ్రామంనుంచి మిమ్మల్ని చూడటానికి ఎవరో వచ్చారు. వాళ్లు మీ కంసాలి సోదరులమని చెప్పారు.'

గ్రామస్తులు ఎవరి మాటకూ ఎదురు చూడకుండా సరాసరి లోపలి కొచ్చారు. ఇద్దరు మధ్య వయస్కులు, నడుము వంగినవారు, తలపాగాలు చుట్టుకొని నేత పంచెలు కట్టుకొని వున్నారు.

'అల్లా హరీష్‌చంద్రగారికి సాష్టాంగ నమస్కారం.' అని అందరూ ఏకకంఠంగా అన్నారు.

మా అన్న చివాలున లేచి మర్యాదా పూర్వకంగా కూచొన్నారు.

'రండి. మీరు మాకు ప్రత్యక్ష దేవతలు. కూచోండి'

'మేము లాల్తాన్ గ్రామస్తులం. నాపేరు బిందామల్, ఇతడు నాత మ్ముడు అచింతారాము.'

'మా మేనకోడలు హీరోను మీ తమ్ముడు గణేశ్‌చంద్రకిచ్చి పెళ్లి చేద్దామని సంకల్పం ' అన్నారు బెరుగ్గా.

'వాళ్లకు రెండు కుర్చీలు ఎండలో బయట వెయ్యి. జయ్‌సింగు!' అని హరీష్ ఆజ్ఞాపించాడు.

'వద్దు. వద్దు. మర్యాదలకు పోవద్దు. గ్రామస్థులమైన మాకు ఈ చాప సరిపోతుంది.'

కుర్చీలు తీసుక రావడానికి వెళ్తున్న జయ్‌సింగు వరండాలో గోడ కానించిన ద్రౌపది పాతమంచం తీసుకొచ్చి వేశాడు.

'కృష్ణకు బాగులేదు.' గదిలోంచి బయటకు వస్తూ అన్నాడు హరీష్. తన గుడ్డలు నలిగిపోయి వుండటానికీ, తాను శుభ్రంగా ఉండకపోవడానికీ కారణాలు చెబుతున్నట్లుగా అన్నాడు.

'ఆయన ముఖారవిందాన్ని చూడనీండి. మా కాబోయే అల్లుడి ముఖాన్ని చూడనీండి.' అంటూ వారిలో మరీ నడుంవంగిన వ్యక్తి నావైపు వచ్చారు.

నేను దుప్పట్లో తలదూర్చుకొని, నేను పెళ్లి కొడుకునని వాళ్లు పొరబాటుపడ్డందుకు సిగ్గుపడ్డాను.

'వీడు కృష్ణ. చిన్నవాడు.... బహుశా, మీరు వీడికంటె పెద్దవాడు గణేశ్‌ను చూద్దామని వచ్చి ఉంటారు.' అంటూ జయ్‌సింగు వైపు తిరిగి — 'గణేశ్ ఎక్కడున్నాడో చూసి తీసుకరా వెళ్లి' అన్నాడు.

జిందామల్ పొడిదగ్గు దగ్గి పొడుంకాయలోంచి నశ్యం తీసి ఒక్క పట్టుపట్టి, ఆచేయి ధోవతికి తుడుచుకొని, రైతు ధోరణిలో సంభాషణ కొనసాగించాడు:

'మీకు తెలుసో, లేదో, బాబూ అమీర్‌చంద్ర కొడుకు బాబూ అమరనాథ్. అతని భార్య లాజవంతి. ఆమె చెల్లెలు హీరో. ఆయన హిందువుగా ఉండటమా? మహమ్మదీయుడై ఆగాఖాన్ మతంలో చేరడమా? అనేది నిశ్చయించుకోలేదు. అందువల్ల మా అమ్మాయి లాజావంతి మమ్మల్ని చూడటానికి రావడం వీలుపడదు. దాని చెల్లెలు ఆవిడను చూడాలని ఏడుస్తోంది. మీకు తెలుసో. లేదో. వీళ్లిద్దరు చెల్లెళ్లు అనాధలు.... వాళ్ల తల్లిదండ్రులు చనిపోయినప్పటినుండి వాళ్లు మాదగ్గర పెరిగారు.

నేను యింకెంత కాలం బతుకుతానో తెలియదు..'

ఆ సమయంలో బూట్ల చప్పుడు వినిపించింది. జయ్‌సింగు వెంట గణేశ్ వచ్చాడు.

పెద్దమనిషి అని వాడికున్న పేరుకు తగ్గట్లు — కొత్తవాళ్లను చూడ గానే వాడు చేతులు జోడించి — 'సాష్టాంగ నమస్కారం' అన్నాడు. వచ్చిన వాళ్లెవరో తెలుసుకోకుండానే. ముందురాత్రి పెళ్లికి వాడు మంచి బట్టలు వేసుకొని వుండటం సమయానికి సరిపోయింది. పరిశు భ్రమైన ప్యాంటు, జరీ అంచు చొక్కా వాడి కనుకూలంగా అమరి వాడు బాగా ఎదిగిన వాడిలా కనిపించాడు.

'ఈ బిడ్డ మావాడు.' అని గణేశ్ చేయిపట్టుకొని జిందామల్ ఎగాదిగా తేరిపార చూశాడు. అమ్మేవాడి చేతిలో కోడిపుంజును మాలీ ఈలమ్‌దిన్ చూసినట్లుగా ఆ చూపు నాకనిపించింది.

సిగ్గుతో గణేశ్ ముఖం పాలిపోయింది. కాని, అలవాటుపడ్డ లేగ దూడలా పెద్దలముందు వాడు ప్రవర్తించాడు.

ఆక్షణంలో వాడికి అందరూ ప్రాముఖ్యం యివ్వడంపట్ల నా కసూయ వేసింది. వాడికి తోడు ఒకస్త్రీ రాబోతుందనే ఆలోచన నాలో ఉద్రేకం పుట్టించింది. ఆవిడతో అతను పడుకోవచ్చు. నయీామ్ చెప్పినట్లు భర్తలు భార్యలకు చేసినవన్నీ వాడు ఆవిడతో చేయవచ్చు. వీటి అన్నిటికీ మధ్య, ముంతాజ్ వంటి ప్రేమికురాలుండటాన్ని నేను కోరుకొన్నాను. అయితే తల్లిదండ్రులు పెళ్లిచేసిన ద్రౌపది వంటి స్త్రీతో అప్పుడు తగాదానే రాదు.

'నీ వయసెంత బాబూ! ఎంత వరకు చదువు కొన్నావు?' లాలా అచింతరామ్ గణేశ్‌ని అడిగాడు.

వాడు సిగ్గుతో తలవంచుకొని, నేలమీద కాలితో రాస్తూ నోరు మెదపలేదు.

'చెప్పు బాబూ' అని హరీష్ ప్రోత్సహించాడు.

గణేశ్ మాట్లాడకపోయేసరికి, నేను అప్రయత్నంగా అన్నాను..

'మేమిద్దరం ఆరో తరగతి చదువుతున్నాం.'

'వాడు తుంటరి పిల్లవాడు.' అని హరీష్ నా చిలిపితనానికి పెద్ద వాళ్లకు సంజాయిషీ చెప్పుకొన్నాడు.

'వీళ్లు చిరంజీవులగుగాక!' జిందామల్ శ్రద్ధగా అన్నాడు. నా చిలిపితనంమీద కంటె ఆరైతు దృష్టి దేనిమీదో లగ్నమై వుంది. గాలి పీల్చుకొనేందుకు క్షణంసేపు ఆగి—

'నేను యింతకుముందు చెప్పినట్లు, లల్లా హరీష్ చంద్ర! హీరో తల్లిదండ్రులైన మాతమ్ముడు, మరదలు చనిపోగానే, మృత్యువంటే నాకు భయమేస్తోంది. నేను ఈ ప్రపంచంలోంచి దాటుకొనేముందే ఆపిల్ల పెళ్లి చేద్దామని వుంది. రేపు వైశాఖీ లోపల ఆ శుభకార్యం చేద్దామని నా ఉద్దేశం.'

'నేను ఈరోజే నాన్నగారికి వ్రాస్తాను. మీరు మాకు దగ్గరే లాల్తాన్‌లో ఉన్నారుగాబట్టి, ఆయన సమాధానం స్వయంగావచ్చి చెబుతాను' అన్నాడు హరీష్.

'మీరు రానక్కరలేదు. ఒక్క ఉత్తరంముక్క వ్రాస్తే మేము మీ పాదాలముందు వాలుతాము. ఇతను దీర్ఘాయుష్మంతుడగుగాక! మరోమారు యితని ముఖారవిందాన్ని తనివితీరా చూసి తృప్తిపడతాను' అన్నాడు జిందామల్.

ఆమాట అంటూ తనకాబోయే అల్లుడివైపుకంటె ఎక్కడో చూస్తున్నాడు.

'అయితే మీ నిర్ణయం అలావుంచండి. ముందు టీ, బిస్కట్లు తినండి' అని హరీష్ వాదించాడు.

'లేదు. లేదు. మా విధ్యుక్తధర్మం నెరవేర్చాం. మేం బయలుదేరుతాం. భోజనానికేమీ కొరవలేదు. బాబూ హరీష్‌చంద్ర! మహమ్మదు భూస్వామి కొడుకుకు రేపువారం పెళ్లి, వాళ్లకు రాగికాసు చేసిస్తామని

వాగ్దానం చేశాం.' అంటూ పక్కమీదనుంచి లేచాడు. ఆయన ఎము కలు పటపట లాడినట్లు మంచం శబ్దం చేసింది. హరీష్‌ముందు చేతులు జోడించి నుంచున్నాడు జిందామల్.

అచింతారామ్ గణేశ్ తలను ఆశీర్వదిస్తున్నట్లు నిమిరి, నావద్దకు వచ్చి నిరుత్సాహంగా తలపై చేయి వేశాడు.

'సరే. సాష్టాంగ వందనం.' అని హరీష్‌తో జిందామల్ అన్నాడు.

'నేను వచ్చి మిమ్మల్ని సాగనంపి వస్తాను' అన్నాడు హరీష్.

నా జ్వరం కొద్దిగా తగ్గడంతో, వరండాలో చిరుఎండలోకి నామంచం పట్టవలసిందిగా చెప్పి, హరీష్ ఆఫీసుకెళ్లాడు.

గణేశ్ పెళ్లిమాటకు ఎంతో సంతోషంగా ఉన్నా, బయటికి ఏమా త్రమూ పొంగలేదు. వాడి దొంగచాటు ప్రవర్తన నాకు తెలుసు. మర్నాడు మాకు సెలవుల తర్వాత బడి తెరుస్తారు. అందుకని మాకు మాష్టార్లిచ్చిన లెక్కలు తన పుస్తకంచూసి వేసుకోవడానికి గణేశ్ నాకిచ్చాడు.

అరగంట తిరక్కముందే హరీష్ తిరిగి వచ్చేశాడు. తల బాదు కొంటూ విస్సృత్తువుగా, చేతిలో టెలిగ్రాం పట్టుకొని దిగాలుగా వచ్చాడు. మంచంమీద కూచొని ఏడవసాగాడు. కళ్లనీళ్లు కార్చేటప్పుడు పెద్దవాళ్లు ఎలా దిగాలుగా వుంటరో అలా దుఃఖంతో వణకిపోతూ ఉన్నాడు.

'ఏం జరిగింది అన్నయ్యా!' అని ధైర్యంగా అడిగాను.

'మన కర్మకాలింది. మన మిక్కడే పెళ్లిళ్లు, శుభకార్యాలు జరుపు తుంటే, ఈ ఉదయం ప్రతాప్ బాబాయి చనిపోయారు.' అన్నాడు.

హరీష్ ముఖంపై ఎలాంటి దిగులువుందో నాకు తెలియదు. జ్వరం వల్ల కలిగిన నిస్సృత్తువవల్ల దాన్నిగూర్చి తీవ్రంగా ఆలోచించలేక పోయాను. హరీష్‌కు తెలిసినట్లుగా ప్రతాప్ బాబాయినిగూర్చి నాకు తెలియదు. ఆయన సంతోష స్వభావము, ఉదార స్వభావము నాకు గుర్తుకు వచ్చాయి. జీవితం అనిత్యమనే విషయం నాకు స్ఫురణకు వచ్చింది. కౌసల్య

మరణం గూర్చి దిగులుపడ్డ బాబాయి, మరుక్షణంలో తానూ మరణేం చాడు. నేను కోరినప్పుడు మృత్యువు నావద్దకు రాలేదు. మరణం చాలా విచిత్రమైంది. దాన్ని ఎవరూ వివరించలేరు. అకస్మాత్తుగా భయంకరంగా వస్తుంది. నేనింతవరకూ ముంతాజ్ పై ప్రేమవంటి సంతోష విషయాల గురించి మాత్రమే తెలుసుకున్నాను. జయసింగు వంటి మొరటు వాళ్ళకు రాని ఆలోచనలు నాకు వచ్చి నేను వాటికి పరిష్కారాలు తెలుసుకో గలిగాను. ఒకదానిని మరొకదానితో పోల్చేశక్తి నాకు అబ్బింది ఇత రుల మాటలూ, అభిప్రాయాలూ ఇకపై నాపై ప్రభావం చూపలేవు. నేను స్వయంగా ఆలోచించడం ప్రశ్నించుకోవడం మొదలెట్టాను. నా ఆలోచనలవల్ల, విజ్ఞానవికాసంవల్ల కలిగిన మానసిక విజయాలు, మాటల కంటె మనసు లోలోపల సంతోషం కలిగించాయి. నేను కీకారణ్యం మధ్యలో వున్నట్లుగా అనిపించింది. కానీ, చెట్టును చూడగానే అది ఏజాతిదో గుర్తించ గలుగుతున్నాను. ఇప్పుడు మృత్యువు — ప్రతాప్ బాబాయి మరణం నాలో నిస్సత్తువ, నిలకడలేని తనం, జీవితంపై విరక్తి కలిగించింది. నేను మళ్ళీ అరణ్యమధ్యంలో వున్నాను. నేను ఎంత ప్రయత్నించి నప్పటికీ దానిని గురించిన మాయా జాలం నాకంతు పట్టదు. ప్రజలు పిలిచే ఆ నిత్య సత్యమే భగవంతుడైతే, అది నాలోనూ వుంది. నేను ప్రేమించే దేవకి, కౌసల్య, ముంతాజ్, నాహుందాతనం, వాటి ప్రతిరూపాలు. నాకు తెలియని దాని రూపం ఎలా వుంటుంది. మా తాతయ్య నిహాలు చెప్పినట్లుగ ప్రేమ కాకపోతే.. ... . నాకు సరిగా తెలియదు.

'ఆయన ఎలా చనిపోయారు?' దిగులు ముఖంపట్టి అడిగాడు గణేశ్.

'నాకు తెలియదు. ఈ ఉదయం చనిపోయాడని మాత్రమే తెలి గ్రాములో వుంది. ఈ ఉదయం పెండ్లి చూపులకు వచ్చిన గ్రామీణుల మూఢనమ్మకం ప్రకారం అనాథ బాలికను ఇస్తామనివస్తే దురదృష్టం కలిసివస్తుంది. అయ్యో! భగవంతుడా! ఆయన ఎలా చనిపోయాడు? ఆయనకు ఇంకా యాభై యేళ్ళయినా నిండలేదు. ఆయనకు ఏమి జబ్బు చేసిందా?' అంటూ కన్నీళ్ళు పెట్టుకున్నాడు. గొంతు బొంగురు పోయింది. నుదుటి మీద కొట్టుకోసాగాడు.

హరీష్ ఏడుపు సద్దుమణగగానే ఇల్లంతా నిశ్శబ్దం ఆవరించిది. వరండాలోకి జయసెంగు వచ్చి, గాఢంగా నిట్టూర్చడంతో, పరిస్థితి మారింది

'అమృతసర్‌కు మనం వెంటనే రైల్లో బయలుదేరాలి. 12 గంట లకు ఒకరైలు వుండాలి అది నాలుగు గంటలకు అక్కడికి వెళుతుంది. సిద్ధంకండి. నేను వారంరోజులు శలవు పెడతాను. జయసింగ్! నీవు యిల్లు జాగ్రత్తగా చూస్తుండాలి.' అన్నాడు హరీష్.

# 7

మృత్యువనేది అస్పష్టమైన, భయంకర శూన్యం. అది అకస్మాత్తుగా ఎవరో ఒకరిని కబళిస్తే, దాన్ని మా జాతిలోని స్త్రీలు మరింత భయంకరం చేస్తారు.

మేము అమృతసర్, పొలిమేరల్లోకి వచ్చేటప్పటికి, ఆడవాళ్ళంతా కాలువ వద్ద వరుసగా సైనికుల్లా నిలబడి, తలపై ముసుగు, పైట చెరగు లేకుండా, చేతులతో బాదుకుంటున్నారు. ముందు తలమీద, తర్వాత గుండెమీద, ఆ తర్వాత తొడలమీద లయబద్ధంగా కొట్టుకుంటున్నారు మంగలివాని భార్య సంతాపగీతం పాడుతూవుంటే, అందరూ 'హై, హై, షీరా' అని వంత పాడుతున్నారు. స్పష్టంగా చేతులుచరుస్తూ, అక్కడి వాతావరణాన్ని భయకంపితం చేశారు. నరకం వాకిటముందు ఉన్నట్లుగా నాకనిపించింది. ప్రతాప్ బాబాయి శవాన్ని దహనంచేసి, ఆయన ఆత్మ శాంతికోసం, ఈస్త్రీలు సంతాపం ప్రకటిస్తున్నారు. తాము శారీరకంగా బాధలు అనుభవిస్తే, అతను చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తం కలుగుతుందనీ, నరకంలో చిత్రగుప్తుడు శాంతిస్తాడనీ వారి నమ్మకం.

ఏమైనప్పటికీ, నేనూ, హరీష్, గణేష్, ఈ సంతాప వాతావరణాన్ని మధ్యలో భంగం చేయటం ఇష్టంలేక ఆమధ్యలోకి వెళ్ళలేదు నేను ఆవిధంగా బెరుగ్గా ఎందుకు వున్నాను. బహూశా ఈ ఆడవాళ్ళు

పొందే దుఃఖోద్వేగం నాకు లేదేమో! ఆ అమాయకపు ఆలోచన రాగానే నాజీవితమంటే నాకు సిగ్గు వేసింది. హరీష్ ఏడ్చినంతగా, ప్రతాప్ బాబాయి మరణానికి నేను ఏడవలేదు. నాకు సహజమైన కళ్ళనీళ్ళు కూడా రాలేదు. కౌసల్య మరణం నాలో కలిగించినంత దిగులును కూడా, ఈ మరణం కలిగించ లేదు. కానీ, ప్రతాప్ బాబాయి, దయ్యాన్ని గురించిన ఊహ మాత్రం రహస్యంగా కలిగింది. కొంతసేపటి తర్వాత ఈసంతాప గీతం తంతును ఆపివేసి ఆడవాళ్ళందరూ ఎక్కడి వాళ్ళక్కడ కూచున్నారు. తలపై ముసుగును యెదపై కప్పుకున్నారు. 'అదుగో పిల్లలు వచ్చారు.' అని గుసగుస లాడుతూ, ఏడుస్తుండగా మేము వారి మధ్యలోకి వెళ్ళాము.

ప్రతాప్ బాబాయి యింటి క్రింది భాగంలో బాల్కనీమీద, తెల్లని చీర కట్టుకుని, కురులు విరబోసుకుని, దేవకి పిన్ని కూచుని వుంది.

హరీష్ గణేష్‌ను తీసుకొని నెమ్మదిగా ఆమె ముందుకు నడిచి, బాల్కనీ స్తంభం ఆనుకొని మూగవాడిలా నుంచున్నాడు మమ్మల్ని చూడగానే, దేవకి పిన్ని దుఃఖాగ్నిశిఖలు స్మశానంలో ఇంకా కాలుతున్న బాబాయి శవంపై మంటల్లా, ఉధృతమయ్యాయి.

నేను మెల్లిక్కి నేరుగా బాల్కనీమీద కూచున్న దేవకి వద్దకు వెళ్ళాను. ఆవిడ నన్ను ఒళ్ళోకి లాక్కుని గణేశ్‌ను చేరదీసి ఏడవసాగింది.

'నాయనలారా! మీరింక ఎవరిని బాబాయ్! అని పిలుస్తారు? 'మీ ఒక్కగా నొక్క బాబాయి వెళ్ళిపోయారు. కౌసల్య చనిపోయి, ఇంకా సంవత్సరం కాలేదు. భగవంతుడా!' అంటూ హరీష్‌ను స్తంభం చాటునుంచి చేతుల్లోకి తీసుకుంటూ – 'హరీష్! నిన్ను తమ్ముడితో సమానంగా ప్రేమించే మీ బాబాయి వెళ్ళిపోయారు. శాశ్వతంగా వెళ్ళి పోయారు.'

నేను దేవకి ఒడిలో వున్నాను కాబట్టి ప్రతాప్ బాబాయి మరణ మనే అస్పష్టమైన ఆలోచన నాలో దుఃఖం కలిగించక పోయినప్పటికీ, ఆమె స్పర్శవల్ల కలిగిన వెచ్చదనంతో, నా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

పిన్ని దుఃఖోద్వేగంవల్ల నాకు గగుర్పాటు కలిగింది. ఆవిడ తొడపై

తలపెట్టుకొని నేను, మరోవైపు గణేష్ పడుకున్నాము. దేవకి కన్నీళ్ళు, హారీషు కన్నీళ్ళు కలిసి, మా యిద్దరిపై మృత్యువు చారల్లా పడ్డాయి.

స్థాణువుల్లా వున్న నాకళ్ళు దేవకి పిన్ని తెల్లచీర చెరగులోంచి క్రింది అంతస్తులోకి చూస్తున్నాయి. బాబాయి భయంకరమైన దయ్యపు ఆకారం, కౌసల్యతో కలిసి తిరుగుతున్నట్లుగా వూహించాను. ఆవిడ చనిపోయినపుడు ఆ గదిలోనే శవాన్ని వుంచారు. అమ్మ చెప్పిన సైన్‌లోక్, తదితర దయ్యాలన్నీ పక్కగదిలో స్వేచ్ఛగా తిరుగుతున్నాయి.

'పిల్లలూ! ఆయన అకస్మాత్తుగా పోయారు. ముందు రాత్రి ఎంతో ఆరోగ్యంగా వున్నారు. వుదయం నాకర్మకాలి అయ్యో భగవంతుడా! ఏమని చెప్పను, కడుపులో నొప్పి అన్నారు. ప్రక్కవాళ్ళను సహాయం పిలిచే లోపల ముక్కుల్లోంచి, కళ్ళలోంచీ నెత్తురు కారుతోంది అంతే నేలమీద పడుకో బెట్టాల్సి వచ్చింది. ఇపుడు మీ పిన్నిని ఎవరు చూస్తారు? చెప్పండి' అంటూ ఏడ్చింది దేవకి.

'వాళ్ళను వెళ్ళి ఎంగిలి పడనీ. ప్రతాప్‌కు ఈ భవబంధాలన్నీ తొలగిపోయాయి. అతని ఆత్మ సృష్టికర్త అయిన ఆ భగవంతునిలో కలిసి పోయింది' అని కర్మాన్ సముదాయించింది.

'వెళ్ళండి నాయనా! మృత్యువాసనలు ఇంకా ఇక్కడ తిరుగాడు తున్నాయి. మీ మీదుగా ఆఛాయలు కూడా రానీను' అంది దేవకి పిన్ని.

చాలా మంది ఆడవాళ్ళు గుంపులు, గుంపులుగా క్రింద కూచుని వున్నారు. వాళ్ళు కూనిరాగాలు తీసి ఏడుస్తూ తలపై చెరగు కప్పుకొని వున్నారు. మాలో అస్పష్టమైన భయము, దుఃఖము, పెనవేసుకుని ఈ విధమైన సంతాపం తంతును దాటుకుని, ఏం జరుగుతుందో అర్థంకాని స్థితిలో దేవదత్త బాబాయి గదికి వెళ్ళాము.

ఈ సందర్భంగా మేము దేవదత్త బాబాయిని తిరిగీ కలుసుకున్నామనే అనుభూతి లేకుండా విషాదచ్ఛాయలు ఆవరించాయి. కరచాలనం చేసిన తర్వాత గణేశ్, నేను ఆయన పక్కన ప్రశాంతంగా కూచున్నాము. ఆయన తన ఎమ్.ఏ పరీక్షలకు లెక్కలు చేసుకుంటూ

హడావుడిగా వున్నారు.

'కళాశాల తెరచి ఇంకా కొద్దిరోజులే అయినప్పటికీ నేను ఈరోజు లాహోరు వెళ్ళవలసింది. కానీ, మీ బాబాయి మరణం అకస్మాత్తుగా వచ్చింది.' అని ఆయన యధాలాపంగా అన్నారు.

ప్రతాప్ బాబాయితో దేవదత్త బాబాయికి అంత సఖ్యమేమీ లేదనే విషయం గుర్తుకు వచ్చింది. అందువల్లనే ఆయన గొంతు సహజంగానూ, ఉద్వేగ రహితంగానూ వుంది. మాయింటి గది తాళాలు, తీసుకునేందుకు హరీష్ అప్పుడే వచ్చాడు. దేవదత్త ఆశ్చర్యంగా అతన్ని కూడా అదే విధంగా — 'రా హరీష్'అని పలికరించాడు

'క్రితం రాత్రి ఆరోగ్యంగా వుంటే ఆకస్మాత్తుగా ఎలా చనిపోయాడో నాకర్థం కావటం లేదు' అన్నాడు హరీష్.

'ఒక్క క్షణం కూర్చో' అని దేవదత్త బాబాయి ఉపేక్షింపరాని విధంగా అంటూ, చుట్టూ ఎవరూ వినటం లేదు కదా అనిచూసి—

'కొంతమంది చెప్పటంలో అతనికి విషం పెట్టారు. మీరువచ్చేంత వరకు దహన సంస్కారాలు ఆపుదామని మేము ప్రయత్నించాము. కానీ, ఆవిడ బంధువులూ మీ కంసాలి వారూ వెంటనే దహనం చేయాలని పట్టుబట్టారు....... అసలు విషయం - ఆరోజు ఉదయం ఆయన లేచి పక్క వీధిలో వున్న సింధీవనిత లచ్చితో హాస్యమాడి అంగడికి వెళ్ళటానికి సిద్ధమయారట కూడా. అప్పుడు దేవకి పాలు కలిపి తెచ్చి యిచ్చింది. ఆ చల్లనిపాలు తాగగానే అతనికి విపరీతమైన నొప్పులు వచ్చి ముక్కులోంచి, నోట్లోంచి నెత్తురు కారసాగింది. అది గమనించి దేవకి గోల పెట్టింది. పక్కవాళ్ళు, అంగళ్ళ వాళ్ళు, లచ్చి, వూరగాయల ఫ్యాక్టరీలోని మనుషులూ, సందులోని కంసాలులూ పరుగెత్తుకుంటూ వచ్చారు. వైద్యుడువచ్చే లోగా అతను చనిపోయి, మంచం మీద నుంచి దించి నేల మీద పడుకోబెట్టారు....... ముక్కులోంచి, నోట్లోంచి, కళ్ళలోంచి, చెవులోంచి రక్తం రావటమనేది పాషాణం గుర్తులని కెప్టెన్ మానిక్‌షా నేనడిగినపుడు చెప్పారు. '

'ఘోరాతి ఘోరం. అయితే ఎవరు విషం పెట్టివుంటారు?'

దేవదత్త ఈ ప్రశ్నకు వెంటనే సమాధానం ఇవ్వలేదు.....

హరీష్ వైపు కళ్ళెత్తి చూసి – 'నీవు వూహించ గలిగినట్లే రక రకాల వదంతులున్నాయి. '

'మీ వుద్దేశ్యం.'

'నాకు తెలియదు. మీ దేవకిపిన్ని పాలుయిచ్చేంత వరకూ ఆయన ఆరోగ్యంగా వున్నాడని అంతా అనుకుంటున్నారు.'

'నిజంగానే? అలా జరగడానికి వీల్లేదు.' హరీష్ ఉద్రేకంగా అన్నాడు.

ఇంతవరకూ మృత్యువును గురించిన భయంతో వున్న నాకు దేవ దత్త ఈ సందర్భంలో దేవకి పేరు వాడటం ఎందుకోనచ్చలేదు. ఎవరిని నమ్మాలో నాకు తోచటం లేదు.

'ఈ వీధిలో ప్రచారంలో వుండే కథలన్నీ త్వరలో మీ చెవిదాకా వస్తాయి. మీకు నిజం తెలియక పోదు ఒకవేళ మీ స్థితిలో నేనుంటే పదమూడవ రోజు అస్థి సంచయనం సమయంలో ఎముకలు ఏరినపుడు వాటిని పరీక్ష చేయిస్తాను. దహనం తర్వాత కూడా పాషాణం గుర్తులు తెలుసుకోవచ్చు నంటారు.'

'అప్పటికి నాన్నగారు కూడా వస్తారు. ఆయనకు విషయం చెప్తాను....... మాయింటి క్రిందిగది తాళాలకోసం వచ్చాను నేను' అన్నాడు హరీష్.

దివాను రూములో కుడిచేతివైపు గోడకు తగిలించిన తాళాల గుత్తి లోంచి ఒక పెద్దతాళం తెచ్చి దేవదత్త యిచ్చాడు:

'ఈ రాత్రికి పిల్లల్ని నాతోనూ పార్వతిపిన్ని తోనూ పడుకోమను. అమృతసర్ లో వున్నంతకాలం ఇక్కడే పడుకోవచ్చు. చిన్నపిల్లల కేమి తెలుసు ఈ జనం మృత్యువంటే ఒక భయంకరమైన ఘోర విష యంగా చిత్రిస్తారు. పరమాత్మలో ఐక్యం కావటం అనే విషయాన్ని గ్రహించలేరు. వేదాలను మరచిపోయారు. వాళ్ళకు స్వల్ప విషయాలు ధనమూ, మాయ అంటే ప్రేమ. నిజానికి జీవితం అంతమైనపుడు

ఆత్మ అనంతాకాశంలో కలిసిపోతుంది జన్మించిన వ్యక్తి మరణించక తప్పదు. అలాంటప్పుడు మరణాన్ని అంత చెడ్డగా భావించట మెందుకు.'

'నిజంగానా,' హరీష్ గొణిగాడు. ఒక్క క్షణం పాటు తేరిపార చూచి దుఃఖంతోనూ, శ్రమతోనూ, ముఖం నల్లబడగా—

'మరీ దగ్గర బంధువులు చనిపోయినపుడు అంత నిర్వికారంగా వుండలేము' అన్నాడు.

దేవదత్త బాబాయి మరణం గురించి చెప్పిన వాస్తవం బోధ పడింది. అదే విధంగా హరీష్ చెప్పినట్లు దగ్గర బంధువుల అనుబంధము మర్చిపోలేము.

'ఏమైనా, నిజం బయటపడుతుంది' అన్నాడు దేవదత్త. ఉద్విగ్న హృదయంతో హరీష్ లేచి వెళ్ళాడు.

దేవదత్త బాబాయి వాళ్ళ విశాలమైన యింట్లో మేడవెనుక చిన్న గదిలో పరుపు మీద పడుకొని పార్వతిపిన్ని రాకకోసం ఎదురు చూస్తు న్నాను. ఆరోజు నాలోని నిస్తబ్దత, శూన్య వాతావరణంవల్ల కలిగిన విషాదంతో భయం ఎక్కువైంది. ఈ మేడకు కొద్ది దూరంలోనే ప్రతాప్ బాబాయి కౌసల్యతో కలిసి దయ్యంగా మారి వుంటాడు. ఆ అమ్మాయికి ఆయనంటే చాలా యిష్టం కాబట్టి ఆవిడక్కడ ప్రత్య క్షమై వాళ్ళనాన్నను తీసుకెళ్ళి వుంటుంది. కౌసల్యదయ్యం మృత్యు స్పర్శను ఆలింగనం చేసుకుని వుంటుందా? ఏమో!... .... ఆభీని ఆవహించిన సైన్‌లోక్ దయ్యం మాకింది గదిలో తల నేలకు కొట్టుకొని, ఆడింది. ఆవిడ అలా ఊగుతూన్నపుడు, మాకోరికలకూ, ఆశలకూ మాయాజాలంతో వూపిరి పోసింది. నిజంగా చనిపోయిన తర్వాత మను షులు దయ్యాలవుతారా?....... వాళ్ళ కేమవుతుంది? అమృతసర్‌లో వున్నపుడు నన్ను వేధించిన ఈ నిత్య ప్రశ్నలు నాగుండెలో బాకుల్లా గ్రుచ్చుకొని భయాన్ని కలిగించి, నా లోలోపల చిందరవందర చేశాయి.

ఈ ప్రశ్న అంటే దేవదత్త బాబాయి ఎగతాళి చేస్తాడు. అమ్మకు ఈ దయ్యాలంటే నమ్మకం! లేకపోతే మాయింట్లో ఈ దయ్యాలను కొలిచేది కాదు. దీంట్లో నిజం తెలుసుకునే దెలా? ఇది తెలుసుకుంటే

తప్ప ప్రతాప్ బాబాయి ఇంట్లో, మా యింట్లో హాయిగా తిరగలేను. ఎవరినైనా అడుగుదామంటే మూర్ఖుణ్ణనుకుంటారు. దేవదత్త బాబాయి పక్కలో గణేశ్ అప్పుడే నిద్ర కుపక్రమించాడు. బాబాయి సంస్కృత శ్లోకాలు వల్లిస్తున్నాడు. నా అడుగుల సవ్వడి విని ఆయన తనలో తానే హిందూస్థానీలో ఇలా మాట్లాడ సాగారు 'పరమాత్మ, సత్య స్వరూపమూ ఆదిదైవతమూ అయిన బ్రహ్మ ప్రతిరూపాలైన, ఇంద్రాగ్ని సూర్య, ఉషస్సవితృ దేవతలకు నమస్కారం. వ్యామోహవిమోహాలను మాకు బోధించండి! మాయా ప్రతిరూపమూ, నిత్య సంచారి అయిన ఓ బ్రహ్మదేవా! జీవన్మరణాలను ప్రసాదించి మోక్షమార్గం చూపు!'

నాకు వినిపించిన దేవదత్త మాటలు అర్థం కాలేదు. మేడ మీద తిరుగూతూ భయంకరమైన మృత్యువును గురించి మాత్రం వూహించ గలిగాను. భగవంతుడు సత్యస్వరూపుడై స్వార్థభరితు డెందుకు కావాలి? మనం మాయ ఎందుకు కావాలి? భగవంతుని గురించి అందరూ పరి పరి విధాలా అనుకుంటారు. దేవుడనే వాడుంటే ప్రతాప్ బాబాయినీ కౌసల్యనూ తీసుకెళ్ళి నందుకు ఆయనపై వుమ్మివేస్తాను. దేవకిపిన్ని ఇపుడేమి చేస్తుంటుంది. తనభర్త చనిపోయిన యింట్లో వుండటానికి ఆమెకు భయంగా లేదూ! నిజంగా ఆమె బాబాయికి విషం పెట్టిందా? అనే భయంకరమైన ఆలోచన వచ్చింది.

'దయ్యాలున్నాయా?' చాలాసేపు తటపటాయించి బాబాయి నడిగాను.

'క్షుద్ర దేవతలను నమ్మేవారికి నిజమే, నిత్యసత్యమైన పవిత్ర దేవతలను నమ్మేవారికి బ్రహ్మ ఒక్కడే నిజము' అన్నాడు సమాధానంగా.

'నాకళ్ళకు నిద్ర ముంచుకొస్తూ వుంది' మాటలు లేకుండా నేనూ ప్రార్థన చేశాను. దేవదత్త బాబాయి ఖండితంగా చెప్తున్నప్పటికీ ఆయన కూడా వూహిస్తున్నాడని నా అనుమానం. 'ఓ పరదేవతమైన బ్రహ్మ! నేను నిన్ను ఎప్పుడు చూడగలను' అని నేను అడిగాను.

మరికొంచెం సేపట్లో పార్వతి పిన్ని వచ్చి మేల్కొని వుండటం చూసింది. గణేశ్, బాబాయి అప్పటికే గురకలు పెడ్తున్నారు. మేలి

ముసుగు తన భర్తవైపు ముఖం కనిపించ కుండా కప్పుకొని, నా ప్రక్కన పడుకుని నా కళ్ళపై నిమురుతూ గుసగుస లాడింది. నేను ఆమె పొట్టచుట్టూ చేయివేసి అదిమి పట్టుకొని భయంతో నిద్రపోయాను. మృత్యువును గురించిన ప్రతిబింబాలు మాయమయ్యాయి.

మరునాడు వుదయం హారీషును చూడటానికి వెళ్ళి అరగంటలో తిరిగి వచ్చిన బాబాయి మమ్మల్ని చూసి అన్నాడు

'మీరు త్వరగా వచ్చేశారే!'

'మళ్ళీ సంతాపం తంతు ప్రారంభం అయింది' అన్నాను.

ఎవరైనా చనిపోతే ఈ కంసాలి వనితలు గొర్రె మందలా గుండెలు బాదుకోటం ఒక్కటే చేయగలరు. మన జాతిలో ఎవరో ఒకరు చని పోతూ వుంటారు. సరియైన పోషణ లేని శరీరాలూ, దళారులిచ్చే కొద్ది మొత్తాలకోసం రాత్రిం బవళ్ళు పాత్రసామాన్లు తయారుచేయడం, వారి జీవితాలను హరిస్తున్నది. ఈ సంతాప కార్యక్రమాలు అలానే కొన సాగుతుంటాయి. మన వీధిలో ఈరోజు, పక్క వీధిలో రేపు. ఈ నిరక్ష రాస్యులైన స్త్రీలు ఎక్కడో ఒకచోట కలిసి ఊసుపోక కబుర్లు చెప్పుకోవాలి. ఉన్నట్టుండి ఒక పెండ్లి సంబంధం కుదిర్చి, సంతాప సూచకమైన వస్త్రాలు విసర్జించి రంగురంగుల చీరలు ధరించి తీపి పదార్థాలు పంచుతూ తిరుగుతారు. సంతాపదినాల మధ్యలో వూసుపోక కబుర్లలో చెడ్డగా మాట్లాడి కోపం తెప్పించిన వారితో ఇప్పుడు సరదాగా మాట్లాడతారు. మేడమీదికెక్కి వివాహ శుభ సూచకంగా, మేళతాళాలు వాయించి మొరటు గీతాలు పాడుతూ, చుట్టు పక్కల సభ్యప్రపంచానికి నిద్ర పట్టకుండా చేస్తారు. మళ్ళీ ఎవరి చావువార్తో తెలుస్తుంది. మళ్ళీ ఈ చక్రం ప్రారంభమౌతుంది. మగవాళ్ళకైతే స్మశానానికి వెళ్ళినరోజు పనికి సెలవు. హాయిగా తాగి తందనా లాడుతారు. పిల్లలకు ఈ మురికి కూపం ఘోర నరకప్రాయం. మన మతంలోని కార్యకలాపాలు క్రమంగా క్షీణిస్తున్నాయి. ఆచారం! దాన్ని గురించి ఆర్యసమాజం ఏమీ చేయ లేకుండా వుంది' అన్నాడు దేవదత్త బాబాయి.

దేవదత్త బాబాయి ఆరోపణలు వింటూ నేనూ, గణేశ్ మూగ

మొద్దుల్లా నిలుచుండి పోయాం. వీళ్ళ జీవితాలు, అనాగరికమూ, కాంతి రహితమూ అయినప్పటికీ నిజమైనవి. వాళ్ళ విషాద జీవితాల పట్ల నాకు సానుభూతి కలిగింది.

దేవదత్త బాబాయి చెప్పిన మాటలు కూడా ఆలోచించ సాగాను. ఆయన పరిపక్వత పొందిన మనుషులను గురించి ప్రస్తావించినపుడు నన్ను కూడా కలిపితే బాగుండును. నేను అన్నిటిని గురించీ ఊహా గానాలు చేయటం, ఒకదాన్ని మరొకదానితో పోల్చటం, ఒక సంఘటనను మరో సంఘటనతో పరిశీలించి చూడటం, విమర్శించటం చేయ గల్గుతు న్నాను. కాబట్టి నేనూ ఎదిగిన వాళ్ళ క్రింద లెఖ్ఖ. నిజానికి నేను హేతు బద్ధంగా ఆలోచిస్తున్నాను నా మనస్సు తీక్షణంగా పనిచేస్తుంది. నేను కవిత్వాన్ని ఆరాధిస్తాను గాబట్టి సున్నితంగా ప్రతి విషయం పట్ల స్పంది స్తాను. శారీరకంగా నేను బలహీనుణ్ణాయినా నాకంటె ఎక్కువగా ఎవరూ ఆలోచించలేరని నాకు తెలుసు. నాలో కొత్తగా వచ్చిన గొప్పతనాన్ని ఎవరైనా గుర్తిస్తే బాగుండును

'వాళ్లు అద్భుతమైన ఆలోచనలు అర్థంచేసుకోలేరు. ఎవళ్లో ఒకళ్లు వాళ్లకు అర్థమయ్యేలా చెప్పాలి బాబాయ్!' అన్నాడు గణేశ్.

'బాబాయ్! వాడెప్పుడూ దేవతల పక్షమే అద్భుతమైన ఆలోచ నలు, దైవత్వం, ఆచారాలు, శాంతం' — అంటూ నాకు గణేశ్ పైవున్న అక్కసునంతా కక్కివేయ కలిగినందుకు సంతోషించాను.

'నోర్ముయ్' గణేశ్ నామీద విరుచుక పడ్డాడు.

'తగువులాడుకోవద్దు! కృష్ణ తుంటరివాడు. నీతో ఎప్పుడూ తగువు కొస్తాడు. కాని, గణేష్! నువ్వు పెద్ద వాళ్లముందు శాంతమూర్తివి, మీరు పెద్దవాళ్లు చెప్పినదంతా అంగీకరించకూడదు, ప్రశ్నిస్తూ ఉండాలి. మీకేం జరగబోతోందో నాకు తెలుసు మీరు తెలుసుకోవడం మంచిది. మీ ప్రతాప బాబాయికీ మీనాన్నకు మధ్య సఖ్యతలేదు. మీ పూర్వీకుల నగానట్రా మీతాత మీబాబాయికి యిచ్చివెళ్లాడని మీ అమ్మకు అతనిపై పగ. మీ నాన్నపోయిన దఫా ఇక్కడ వున్నప్పుడు ప్రతాప్ మీ యిళ్ల పంపకంగూర్చి ప్రస్తావించాడు. ఇప్పుడు ఆస్తి అంతా మీనాన్న చేతి

లోకి వస్తుంది గాబట్టి మీనాన్నకు ఆ బాధ తప్పిపోయింది. ప్రతాప్ వదలివెళ్లిన డబ్బుతో మీకు త్వరలో పెళ్లి చేస్తారు.....'

'లేదు.... నాకు పెళ్లి యిష్టంలేదు.' గణేశ్ ప్రతిఘటించాడు.

'బాబాయ్! లూధియానా దగ్గర లాల్తన్ గ్రామంనుండి మొన్న వాడికి ఒక పెళ్లి సంబంధం వచ్చింది.'

'నీ వాగుడు ఆపు.. నిన్ను చంపుతాను.' నేను రహస్యం చెప్పి నందుకు గణేశ్ నామీద విరుచుకు పడ్డాడు.

'కొట్టుకోవద్దని చెప్పానా?' దేవదత్త బాబాయి వాణ్ణి తిట్టాడు: 'నిజం నిప్పులాంటిది. కాని, ఈ మరణంవల్ల కలిగిన బాధ మిమ్మల్ని మేల్కొలపాలి. జీవితమంటే పూర్వీకులు సంపాదించిన ఆస్తిపాస్తులు మాత్రమే కాదని మీరు గ్రహించాలి. జీవితంలో ఎలా నడచుకోవాలి — అనేది ఈ మరణంనుంచి మన గుణపాఠం నేర్చుకోవాలి. సత్యంకోసం మనం నిత్యజీవితంలో అన్వేషణ కొనసాగిస్తే, అదే మహోన్నతమైన జీవితం! మన సోదరవర్గాన్ని ఉద్ధరించడానికి మనం కంకణం కట్టుకో వాలి! ఒకవేళ మన సోదరులు పతనావస్థలో వుంటే వారికి ఆ విషయం చెప్పడానికి మనలో ధైర్యముండాలి మన దేశంలో మూఢనమ్మకాలు, చెడు అలవాట్లు, ఉన్నాయి. సంప్రదాయాలకు, ఆంగ్లేయులకు మనము బానిసలమైనాము. అంతరాత్మ ప్రబోధాన్ని గ్రహించగలిగిన నిస్వార్థప రులు మాత్రమే కొంత చేయగలరు. ఇప్పుడు ఋషులతో, విప్లవకారులతో ఎంతైనా అవసరం ఉంది. మనం సత్యంకోసం నిత్యం యుద్ధం, యుద్ధం చేయాలి. పోరాటం కొనసాగించాలి.'

ఈ ఉద్బోధ తర్వాత మేము నెమ్మదించి, మాటలాడలేక పోయాము. కాని, నామనసు చెట్టుపై గూడులా ఉంది. అందులోని పక్షి ప్రపంచంలో అన్ని దిక్కులకు పరుగులు తీస్తోంది. ఒకవేళ ఏదైనా జరిగితే నేను విప్లవకారుడి నౌతానుగాని, ఋషినిగాను. జీవితంలోని ఆశారేఖకోసం నేను సమస్తానికి వ్యతిరేకంగా పోరాటం కొనసాగిస్తాను. నన్ను 'ఆశారేఖ' అని పిలిస్తే గర్విస్తాను. నేను అగ్ని జ్వాలలా జీవిస్తాను.

నేను త్వరగా ఉద్రేకంపొందే కుర్రవాణ్ణే కాబట్టి, ఈ సంతాపం

తంతువల్ల బాగా క్రుంగిపోయాను. రాత్రి కలలో పలవరించాను గాబట్టి, అమ్మా, నాన్న వస్తున్నారనే విషయం నాకు తెలియకుండా ఉంచారు. అమ్మ, నాన్నలను తీసుకొచ్చేందుకు రైల్వే స్టేషనుకు హరీష్‌తో గణేశ్ వెళ్లేటట్లు బాబాయి ఏర్పాటు చేశాడు. మరునాటి ఉదయం నాకు పాలు, రొట్టె యిస్తూ, పార్వతి పిన్ని వాళ్లు వస్తున్నారనే విషయం తెలియజేసింది.

నేను పడుకోలేదు. మా నాన్నను చూడటానికి, మా బాబాయి అంగడి వద్దకు దేవదత్త నన్ను తీసుకెళ్లాడు. హరీష్ లూధియానాకు వెళ్లిపోయాడు. అతని స్థానంలో నాన్న అంగట్లో కూర్చొని మర్యాద పూర్వకంగా కంసాలి సోదరులు సంతాపం తెలియజేయడానికి వస్తుంటే వారితో మాట్లాడుతూ కూచొన్నారు.

మా సోదరవర్గానికి చెందిన పంచాయతీ సభ్యులకు ఎదురుగా మానాన్న ఎత్తుబల్లపై సుఖాసీనులయ్యారు ఆయనకు అందేటట్లుగా నన్ను బాబాయి ఎత్తి పట్టుకొన్నారు. నేను మానాన్న మెడ కావిలిం చుకొన్నాను.

'బాబూ. మాకు అడ్డురాకు మేము మాట్లాడుకొంటున్నాం.' అన్నాడు నాన్న నిర్మొగమాటంగా. నైరుతీ ప్రాంతంలో కొంతకాలంగా ఉండివచ్చినందున ఆయన ముఖం ఆరోగ్యంతో బాగా ఎర్రబడింది.

దేవదత్త బాబాయి ఎత్తైన ఆబల్లపై కూచొని వుంటే, ఆయన కెదురుగా నేను కూచొన్నాను. నన్ను ఈవిధంగా తిరస్కరించడంతో మానాన్న మధ్యవర్తిత్వంపై నాకు చిన్నచూపు కలిగింది.

వాళ్ల సంభాషణా స్రవంతికి మారాకవల్ల అడ్డుతగిలినట్లు కొంత కాలం నిశ్శబ్దం రాజ్యం చేసింది. పెద్దవాళ్ల ముఖాలు ఎలా ఉన్నాయా అని నేను ఓరచూపులతో గమనించాను. వాళ్లు నాన్న పట్ల చూపే విలక్షణ స్వభావం వల్ల అసహ్యంగాను, అపరి శుభ్రంగాను కనిపిస్తున్నారు. నేను వారి గురించి నా ఊహా ప్రపంచంలో ఏర్పరచుకున్న రేఖాచి త్రాలలో వారు పిరికిపందల్లాగాను, ఆ చీకటి గుయ్యారపు అంగట్లో కూచొన్నట్లు కనిపించారు ముండలతో సంబంధం పెట్టుకొన్న ప్రతాప్

బాబాయిని గూర్చి వారు ఆక్షేపణీయంగా మాట్లాడుతున్నందుకు, ఈ పెద్దలపై ప్రతీకార కాంక్షతో ప్రతాప్ బాబాయి లేచివస్తాడని నాకనిపించింది.

మధ్యలో ఆగిపోయిన సంభాషణను, గుర్తు తెచ్చుకొని మాటలు ప్రారంభించినట్లు నేను వూహించాను:

'సోదరులారా! ఇదంతా మాయ. ఎవరైనా బంగారము డబ్బు, మరేదైనా తీసుకొని వుంటే నేను దాన్నిగూర్చి బాధపడను. ప్రతాప్‌కు మా అమ్మ అవి యిచ్చినప్పుడే నేను వాటిపై ఆశ వదులుకొన్నాను. భగవంతుని అనుగ్రహ విశేషంవల్ల ఈ పిల్లలకు చదువు చెప్పించే స్థితి నాకు కలిగింది.'

ఆయన తనసోదరుని మరణంపట్ల విచారంగా ఉన్నాడా? లేక కేవలం డబ్బుగురించి ఆలోచిస్తున్నాడా? అనే ఆశ్చర్యం నాకు కలిగింది.

'నిజంగానా?' అన్నాడు లల్లా ఆచర్జమల్, తన తెల్లనిగడ్డం కొద్దిగా కదిలిస్తూ బొర్లి మచ్చలు ఎర్రగా కనిపిస్తున్నాయి.

లల్లా సదానంద్ నల్లని మేకలా మెడపైకెత్తి, కృత్రిమంగా నిట్టూరుస్తూ 'భగవంతుడు గొప్పవాడు' అన్నాడు.

'భగవంతుని దయవల్ల.....' తెల్లని దుస్తులు తన తెల్లనిగడ్డానికి సరిపోయేలా ధరించిన సర్దార్ సుందర్ సింగ్ ప్రార్థనా ధోరణిలో అన్నాడు.

మా మేలీ పిన్ని భర్త, అర్జున బాబాయి పాడదగ్గు దగ్గి సరిపెట్టాడు.

ఆ నిశ్శబ్ద వాతావరణంలో, ప్రతాప్ బాబాయి ఉనికిని నేను చూడ గలిగాను. ఆ అంగళ్ల వెనకనుండి ఆయన ప్రత్యక్షమవుతున్నట్లు అనిపించింది.

'ఎవరూ బంగారం ఆభరణాలు తీసుకోలేదు.' గంభీరంగా, తన వాగ్ధాటిని వ్యక్తంచేస్తూ అనంత అన్నాడు 'ఈ వదంతులన్నీ నిరాధారం. మా అన్న భంతామల్ కుమార్తె వివాహానికి దేవకి అమ్మా, నాన్న వచ్చారు. ప్రతాప్ తన మరణానికి ముందురోజు పెళ్లిలో భోజనాలు

పడ్డిస్తూ అందరితో సరదాగా కబుర్లు చెబుతూ గడిపాడు. పెళ్లిలో ధరించడానికి వాళ్ల అమ్మకు దేవకి బహుశా తన కమ్మలు యిచ్చివుంటుంది. అంత మాత్రంచేత అది అతని చావుకు కారణం కాదు. అతను చాలా ఉదారుడు.'

'అయితే ప్రతాప్ హఠాత్తుగా గుండెపోటుతో చనిపోయి ఉండాలి.' తన తమ్ముని చావునుగూర్చి బహిరంగంగా వాగ్వివాదం రావడం యిష్టపడలేక నాన్న అన్నాడు 'నేను డాక్టరు మానెక్‌షాను అడుగుతాను. ఆయన అభిప్రాయం ఏమిటో....' అని ఆయన ఒక క్షణం ఆగి — 'డాక్టరుగారు ఏదైనా మోసం జరిగిందంటే ... మా దళంలోని కల్నల్ గారి ద్వారా పోలీసుల సహాయం తీసుకోవడానికి నాకు అవకాశం ఉంది.'

'నిజంగా, మీ పదవీ గౌరవంవల్ల మీరు దోషుల్ని సులభంగా పట్టుకోవచ్చు.' అన్నాడు లల్లా అచర్జమల్ అనంతవైపు అనుమానంగా చూస్తూ.

ఆక్షణంలో వీధులూడ్చేవాడు 'జరగండి, జరగండి' అంటూ గబగబావచ్చి, వాళ్లు కూచొన్న వేదిక కింద మురికి కాలవలో చెత్తను తొలగించి వెళ్లాడు. వేదికమీద కూచొన్న పెద్దలంతా ఈ అస్పృశ్యుని ప్రవర్తనపట్ల భీతితో కేకలు వేశారు.

ఊడ్చేవాని చేతిలో చీపురు, లల్లా అచర్జమల్ మాటలు, ఆ సంభాషణలో ఊపు నిచ్చాయి. మనసులో ఎవరంతవాళ్లు ఏదో వెతకసాగినట్టు తోచింది.

చిలిపితగాదాలకోసం వాళ్లు ఏదో ఒక కొత్త విషయంకోసం వెదకసాగినట్లు వాళ్ల మొండి ధోరణివల్ల నాకనిపించింది. నాగుండె గొంతుకల్లో మెదలాడుతున్న భావస్రవంతికి మరింత ఊపు నిచ్చాను.

'నేను సెలవు తీసుకొంటాను.' ఆ ఉద్రిక్త వాతావరణంలో దేవదత్త బాబాయి అన్నాడు.

'అయితే! సరే' అన్నాడు నాన్న.

దేవదత్త బాబాయి వెళ్లిన తర్వాతకూడా అక్కడ పెద్దలు అసహనంగా కదలాడసాగారు. మేము రావడానికి ముందు వాళ్లు వేసిన

ప్రశ్నకు సమాధానం వాళ్ళు కోరుతున్నారు. ఈ సనాతనవాదులంతా తమ వక్రించిన భావాలను ధైర్యంగా ఎన్నడూ వ్యక్తం చేసి ఎరగని పెద్దలు.

'నేను ద్రౌపదిని గంగాస్నానానికి తీసుకెళతాను.' పెద్దల కులతత్వాన్ని దెబ్బతియ్యాలని నాన్న అన్నాడు- 'తన ఆగాఖానీ తల్లిదండ్రులతో ఆవిడను వదలిపెట్టి హరీష్ తప్పు చేసినమాట వాస్తవమే!'

'ఈ రోజు నాలుగో రోజు కర్మ. పంచాయితీ పెద్దలముందు మీ తలపాగా వుంచి మీయింటి కోడలి పక్షాన వారి క్షమాభిక్ష కోరవచ్చు.' అన్నాడు అర్జున బాబాయి పొట్ట బుగ్గలు కదిలిస్తూ.

పెద్దలు ఏమీ మాట్లాడలేదు. కాని నాన్నను యిరకాటంలో పెట్టి, ఆయనను భయపెట్టడానికి ప్రయత్నించారు. హరీష్ నిర్లక్ష్యానికి, మమ్మల్ని హిందూమతంలోంచి వెలివేస్తామని వారి హెచ్చరిక కావచ్చు. ఆమాట అవి ఒకరి వెంబడి ఒకరు సెలవు తీసుకొని తలకొక దారిన వెళ్లారు.

వాళ్లు వెళ్లిన తర్వాత మానాన్న నన్ను వొడిలోకి తీసుకొంటూ — 'బాబూ! నువుబాగా సన్నబడి పాలిపోయినట్లున్నావు.' అన్నారు.

ఈ సానుభూతి నాలో జాలిపుట్టించి, మానాన్న నన్ను ఆదరిస్తాడని ఎదురు చూడసాగాను.

"ద్రౌపది నన్ను అస్పృశ్యుడి కింద జమకట్టి, నాకు వంటగది బయట అన్నంపెట్టేది." అన్నాను గద్గద స్వరంతో.

'ఆవిడ పనికిమాలిన వ్యక్తి. ఆవిడ పుట్టింటికి వెళ్లడంతో నేను ఎలాంటి బాధ అనుభవించవలసి వస్తోందో చూడు. హరీష్ ఆవిడను ఆపి వుండవలసింది.'

'వాళ్ల నాన్న వచ్చాడు. రోజూ యింట్లో గొడవలు జరిగేవి' అన్నాను బుంగమూతి పెట్టి.

'ఆవిడ పనికిమాలినది' అన్నాడు నాన్న మాటలు తుంచివేస్తూ.

ఆవిడ గురించి నేను యింకేమీ చెప్పే అవకాశం యివ్వకుండా అడ్డు

చెప్పాడు. హారీష్‌కు ముంతాజ్‌వంటి భార్య ఎంత సొంపుగా వుంటుందో చెప్పే అవకాశం నేను కోల్పోయాను. నిజం నిలకడమీద తెలిస్తే ఎంత బాగుండునని మనసులో ఆరాటపడ్డాను. నా మనసులో కోరి కల కనుగుణంగా మాయింటి వాతావరణాన్ని నేను మార్చగలిగితే ఎంత బాగుండును. నా శరీరంలో బంధించబడ్డ పక్షులు అనంతాకాశంలోకి ఎగిరిపోయి, ఈ భూమిమీద బందిఖానా తప్పించుకొని కోరికలవల్ల కలిగే విసుగును పారద్రోలితే బాగుండును.

నాన్నగారు బాగా దిగులుతో వున్నారని తెలుసుకొని నేను నోటికి తాళం వేశాను. ఆ తర్వాత కొంచెం సేపటికి, మరికొందరు పెద్దలు సానుభూతి చూపడానికి వచ్చినప్పుడు నేను నా ఆలోచనా విహంగాలను వెతుకుతూ బయటపడ్డాను.

ఆరోజు సంతాప దినం. మధ్యాహ్న విరామసమయంలో బడినుంచి నేను, గణేశ్ నాన్నను చూడటానికి వచ్చాము. ఆయన మొదటి అంతస్తు గదిలో వేసిన పరువుపై కూచొని మునలి కర్మాన్ మావంట గదిలో వండిన భోజనాన్ని తినడానికి సిద్ధంగా ఉన్నారు. మేము లోప లికి రాగానే, నాన్న ఆవిడవైపు పరికించి చూడటంతో అమ్మ వాగ్ధాటి తగ్గింది. మేము ఎంత బరువుతగ్గామో అమ్మ చూడసాగింది.

'ఆ దౌర్భాగ్యురాలు వీళ్ల కడుపులు మాడ్చింది. దానికి కోపం జాస్తి.' అని నాన్న భావాలను అమ్మ ధృడ పరిచింది.

'యుద్ధం ఆగిపోయి మాదళం సరిహద్దులనుండి సాధారణ ప్రాంతా లకు వస్తే బాగుండును. పిల్లలు మనతో ఉండి, మన సంరక్షణలో పెరగవచ్చు.' అన్నాడు నాన్న.

'అమ్మా! నాకంటె ఆవిడ గణేశ్‌ని బాగా చూస్తుంది' అన్నాను.

'సహజమే. వాడికి, దానికి కుళ్లుబోతు బుద్ధి ఉందిగా' అంది అమ్మ.

'అమ్మా! వాడు అబద్ధాలు చెబుతున్నాడు. భోజనానికి ముందు నేను ప్రార్థన చేసి, చేతులు కడుక్కొంటాను. కృష్ణ అలా చెయ్యడు.

గణేశ్ ఎదురు జవాబు చెబుతూ అన్నాడు.

'నిజంగా.' నేనన్నాను.

'చాలా రోజుల తర్వాత మనమందరం యివాళే కలుసుకొన్నాం. మొదటి రోజే మీరిద్దరూ తగూలాడుకోవద్దు. మనకు యింటినిండా తగువులున్నాయి.' అన్నాడు నాన్న.

'దేవకి నాన్న వాళ్లు మీ బాబాయికి విషంపెట్టిన గొడవలున్నాయి.' ఆశ్చర్యకరంగా అంది అమ్మ.

'నీకు తెలివి వుందా? పిల్లలు ముందు ఆ విషయాలు చెబుతారా?' అని నాన్న అరిచాడు

'రామచంద్రా! ఇదుగో ఇక్కడ గ్లాసుడు నీళ్లున్నాయి..... నాడి పరీక్షించి చూస్తే ఏదో దోషం కనిపిస్తోంది.... లేకపోతే అంత మంచి ఆరోగ్యవంతుడు అకస్మాత్తుగా ఎలా చనిపోతాడు? ఆ మొరిగే కుక్క అనంత మొదటి సారిగా మేడమీదికి వచ్చాడు.... వాడు దేవకి తల్లికి అన్నవరస. నేనడిగేది ఏమిటంటే?..... ఆక్షణంలో ప్రతాప్ చనిపోతున్నాడని వాడికెలా తెలును? సందుచివరిలోనుంచి దేవకి ఏడుపు వినిపించిందని అతనంటాడు.... నాకది నమ్మశక్యంగాలేదు... కొద్దిరోజులుగా వాడు, వాళ్ల అమ్మానాన్న యిక్కడికి వస్తూ పోతూ ఉన్నారు.' అని కర్మాన్ సొదపెట్టింది.

'వింటున్నారా?' అంది నాన్నతో అమ్మ.

నాన్న ఆవిడవైపు, కర్మాన్ అత్తవైపు పరికించి చూశాడు.

'నాయనా! రామచంద్రా! నీకీ కథ ఏమని చెప్పను? ఎలా చెప్పను?'

'సరే! ఈపిల్లలకు సుందరి తెచ్చినవి ఏవో ఒకటి పెట్టమను. ఆ తర్వాత నువు నాతో చెప్పవచ్చు ప్రతాప్ యిళ్లు భాగాలు పెట్టమని అడగటం నాకు తెలును. ఈ వెధవ అనంత, మిగాతా వాళ్లతో కలిసి ప్రతాప్ తాగితందనాలాడి వుంటాడు.... ఆ డబ్బు గణేశ్ పెళ్లికి ఖర్చు

పెట్టవచ్చు.' అన్నాడు నాన్న.

ముందురోజు దేవదత్త బాబాయి చెప్పిన మాటలు నాకు గుర్తు కొచ్చాయి. ఆయన జోస్యం ఎంత బాగా చెప్పాడు! గణేశ్‌పట్ల ద్వేషంతో మోచేతిలో వాణ్ణి ఒక్కతోపు తోశాను. కాని, వీడు చాలా పెద్దమనిషిలా ముఖం పక్కకు తిప్పుకొని, నాన్న మాటలకు అభ్యంతరం చెప్పలేదు. నాలోని విప్లవ భావాలతో ఆలోచించి చూస్తే మానాన్న మా కుటుంబంలో మధ్యవర్తిత్వం నెరపే పెద్దమనిషిలా కనిపించాడు. ఇంట్లోంచి బయటికి వెళ్లిపోయి రాంబాగ్ తోటలోకి వెళ్లిపోదామనిపించింది. అక్కడ పాడుపడ్డ గోపురం కింద, ఒంటరిగా పరిశుభ్ర వాతావరణంలో పగలంతా గడిపి, రాత్రిపూట నక్షత్రాలు చూస్తూ, నా జానపద కథల్లో నాయకుడిలా, కవిత్వంలో సత్యాన్వేషిలా గడపవచ్చు.

అమ్మ మమ్మల్ని ఆప్యాయంగా పలకరించాలనుకొంది. మాలా కండ్ నుండి తనతో తెచ్చిన కిరసనాయిలు దీపాలు వెలిగించింది. చేతి గుడ్డలతో చుట్టిన రెండు చిన్నమూటలు మా యిద్దరికీ చెరొకటి యిచ్చి—

'ఇవి శివ మీయిద్దరికీ పంపాడు. అవి యివాళ తినండి. రేపు నేను మీకు వేరే యిస్తాను.' అంది.

'అలా పరుగెత్తుకొంటూ వెళ్లి పడుకోండి.' అంటూ, 'దేవరాజు, సుశీల అక్కడ ఉంటే వాళ్లకు కూడా పెట్టండి.... దేవదత్త బాబాయికి పళ్లు తీసుకెళ్లి యివ్వండి..... ఆయన మీపట్ల ఎంతో ప్రేమగా ఉన్నాడు. ఈ 13రోజులు యిక్కడ కాలయాపనచేసి, బడికి వెళ్లిన తర్వాత పాఠాల్లో వెనకబడకుండా, బాబాయి దగ్గర చెప్పించుకోండి. ఆయన బాగా చదువు కొన్నవాడు.' అన్నాడు నాన్న.

'మేము నాలుగోరోజు కర్మ చూడటానికి రావచ్చా!' అన్నాడు గణేశ్ ధైర్యంచేసి.

'కృష్ణ రానవసరంలేదు. నువు ప్రతాప్ బాబాయి దత్తుకొడుకుగా రావలసి వస్తుంది.' అన్నాడు నాన్న ఖరాఖండిగా.

ప్రతాప్ బాబాయి కర్మక్రతువులు చేయడానికి కొడుకు కావాలని తెలుసు. దేవకి పిన్ని మెయిన్‌మీర్‌లో నన్ను దత్తత తీసుకోబోతున్నట్లు చెప్పింది. నా లోలోపల ప్రపంచం క్రుంగిపోయినట్లు అనిపించింది. మా కుటుంబం నమ్మిన మోసభరితమైన సంప్రదాయాల మధ్య దేవకి పిన్ని నన్ను అభిమానించడం పనికి రాదు. జ్వరంవల్ల కలిగిన బలహీనంవల్ల నేను ఆ వొత్తిడినుండి తట్టుకోలేకపోయాను. ఎక్కడో కొండ మారుమూలనుండి ఏడుస్తున్నట్లు బాధపడ్డాను. అయితే నా ఏడుపు ఎవరికీ వినిపించడంలేదు.

నేను మామూలుగా పడుకొనే దానికంటె, ఆ మధ్యాహ్నం ఎక్కువసేపు నిద్రపోయాను. నేను నిద్రలేచే సరికి, దేవదత్త యింట్లో గణేశ్ శిరో ముండనం చేసుకొని వున్నాడు. వాణ్ణి చూస్తే నవ్వు వస్తోంది. గుండుమీద పిలక, పాలిపోయిన వాడి మొహంమీద తమాషాగా ఉంది. ఊరగాయల కర్మాగారంవద్ద వేడినీళ్లు తీసుకెళ్లేందుకు వచ్చే జైనమునుల వలె వాడున్నాడు. వాడి పిలక పట్టుకొని ఊపి ఏడిపిద్దామనుకొన్నాను. వాడు నాలుగోరోజు కర్మక్రతువులకు వెళ్ళివచ్చి, దేవకి పిన్ని వాణ్ణి దత్తత తీసుకొన్నదని ఆలోచన భయంకరంగా కనిపించింది.

'కృష్ణవేపు చూడు. మీ నాన్న ఆలోచనలు, వాడి ఆలోచనలు ఒకే ఎత్తు!' అన్నాడు దేవదత్త బాబాయి.

కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. దేవకితో నాకు ఎడబాటు కలిగినట్లుగా బాధవేసి పడుకున్నాను.

'నా అంతట నేను చేయలేదు నేను పెద్దవాణ్ణి కాబట్టి నాన్న నన్ను తీసుకెళ్ళి ఆవిడ దత్తత చేసుకునేలా చేశాడు. గణేశ్ క్షమాపణా ధోరణిలో అంటూ — 'నేను ఆ హంతకురాలి కొడుకు కావాలని ఎప్పుడూ అనుకోలేదు' అన్నాడు.

ఆమాటలు నాకు కొంత వూరట కలిగించాయి. దేవకి నన్ను అభిమానిస్తోందనీ, నేను ఆవిడను ప్రేమిస్తున్నాననీ, ఆవిడ ఎంత చెడ్డదైనప్పటికీ నాకు ప్రేమపాత్రురాలు. హంతకురాలని పిలిచిన ఋషివంటి గణేశ్‌కు, దేవకికీ మధ్య, పొత్తు కుదరదు. ఈ ఆలోచన నాలో ప్రోదు

చేసుకుంది.

పదమూడవరోజు స్మశానంలో ప్రతాప్ బాబాయి అస్తులు, బూడిదా ఏరే కార్యక్రమం జరిగింది. వాటిని హరిద్వార్‌లోని గంగానదిలో కలిపేం దుకు తీసుకు వెళతారు. నేను పెద్దవాళ్ళ సంభాషణల ద్వారానూ, అక్కడ ఇక్కడా పోగు చేసిన సమాచారం ద్వారాను మా కుటుంబంలో ఇకపై జరగబోయే సంఘటనలు స్పష్టంగా తెలియ వచ్చాయి. అమ్మ, నాన్న, హరీష్, గణేష్ కర్మక్రతువులు పూర్తి చేసుకొని ఇంటికి తిరిగి వచ్చారు. వాళ్ళమాటలను బట్టి ఇలా అర్థమైంది

వచ్చే నెలలో గణేశ్ లూధియానా నుంచి అమృతసర్‌కు తిరిగి వచ్చి దేవకిపిన్ని దత్తుగా ఆమెతోనే వుండిపోతాడు. వాణ్ణి మళ్ళీ పండిత వైద్యనాథ హైస్కూలులో చేరుస్తారు 'లాల్‌తన్' గ్రామం నుంచి వచ్చిన కంసాలి వారి అమ్మాయి హీరోతో పెండ్లి ఈ సంవత్సరంలో కుదు ర్చుకుంటారు. కానీ గణేశ్‌కు 14 సంవత్సరాలు వచ్చి మెట్రిక్యులేషన్ పరీక్ష వ్రాసేంత వరకూ పెండ్లికి తొందర పెట్టవద్దని పెండ్లికుమార్తె వాండ్లతో సంప్రదిద్దామని అనుకున్నారు. ఒకవేళ గణేశ్ తల్లిగా దేవకి ఈ పెండ్లికి సోదరులముందు సూత్రప్రాయంగా ఒప్పుకొని, పెండ్లి జరి పితే గణేశ్‌కు మా కుటుంబానికీ ప్రతాప్ బాబాయి ఆస్తిలో భాగము, నగలు సంక్రమిస్తాయి. ఈలోగా పెండ్లి సంబంధాలవాళ్ళు తిరిగి పోతు న్నారు కాబట్టి గణేశ్‌కూ, కృష్ణకు, శివకూ నామకరణము ఉపనయనమూ జరిపించటం అవసరమనుకున్నారు వేసవి కాలంలో నాన్న ఒకనెల శలవుమీద వస్తే అమృతసర్‌లో కుటుంబం అంతా కలుసుకొని ఈ కార్యక్రమం జరిపించవచ్చు.

అప్పుడే మా వుమ్మడి కుటుంబానికి సంబంధించిన ఆస్తిపాస్తులను అమృతసర్ జిల్లా కోర్టులో మానాన్న దాఖలు పరిచే కార్యక్రమాన్ని పూర్తి చేస్తాడు. అప్పుడు కొంత తాపీగా వుంటాడు. కాబట్టి దేవకి భవిష్యత్తు జీవితాన్ని గురించి మాట్లాడి, తన తమ్ముని విధవగా గౌరవ ప్రదంగా తన విధిని అంగీకరింస్తూ వుండే విషయం గురించి మాట్లా డతారు. గణేశ్ చదువు సంధ్యలు, వివాహమూ ప్రధాన విషయాలు కాబట్టి అవి పూర్తి చేస్తారు. బాబాయి ఆకస్మిక మరణానికి సంబం

ధించిన వదంతుల్ని 'మేము' అణచివేస్తున్నాము కాబట్టి బహూశా ఆమె వీటికి అంగీకరించవచ్చు. కుటుంబంలో దూషితురాలైన ద్రౌపదిని, అమ్మ, నాన్న, దేవకి, గణేశ్‌లతో హరిద్వార్‌కు తీసుకెళ్లి అక్కడ పవిత్ర గంగాజలాల్లో స్నానం చేయించి తీసుకురావాలి. రేపు పదునాల్గవరోజు కాబట్టి ప్రతాప్ బాబాయి అస్థిసంచయనానికి గంగానదికే వాళ్ళంతా వెళ తారు. సమస్త జీవరాసులకూ ప్రాణాధారమూ, మృతుల శరీరమూ, ఆత్మ ఎక్కడ పంచభూతాల్లో లీనమై నదీ సంగమం ద్వారా సముద్రంలో కలిసి పరమాత్మలో ఐక్యం అవుతాయో ఎక్కడ మృత్యు దేవతయైన యముడు మానవుల పాపాలను శిక్షించటానికి నరకానికి పంపుతాడో అటువంటి గంగానదికి వీళ్లందరూ వెళదామనుకున్నారు.

నేను తనతో కలిసి లూధియానాకు వెంటనే రైల్లో వెళ్ళాలని హరీష్ నాతో చెప్పాడు. నాకు విషయాలన్నీ అర్థమవుతున్నాయి. దేవ దత్త బాబాయి ముందే చెప్పినట్లుగా గణేశ్‌కు పెండ్లిచేస్తే, దేవకి పెండ్లి ఖర్చులు భరిస్తుంది. జీవితాన్ని ఒకమూసలో పోయటానికి ఇలా ఒప్పుకోక తప్పదు. అనుమానాలు వ్యక్తం చేయకూడదు ప్రశ్నలు వేయకూడదు. జీవితం సుఖమయం చేసుకొని చనిపోవాలి. నా ఆలోచనా స్రవంతి సాగి పోతోంది. జీవన్మృతుడనై నేను ఒంటరిగా ఆర్తనాదాలు చేస్తూ పెద్దలు ఏర్పాటు చేసిన దోషభూయిష్టమైన దినచర్యలో భాగం కావాలి. నా మనస్సులోని నిస్తబ్దత, గందరగోళంలో మా కుటుంబంపై నా అను రాగం మారుతూ వుండటం విచిత్రంగా తోచింది. తమ ప్రవర్తన ద్వారా బ్రతక నేర్చిన వ్యక్తులుగా కనిపించే మా అమ్మానాన్నలమీద అనురాగం తరగలేదు.

ముంతాజ్ గురించి నాన్నతో చెప్పనందుకు హరీష్‌పై అయిష్టత వున్నా అతడు నాకు దగ్గరగా వున్నట్లు కనిపించాడు. ద్రౌపదిని నేను ద్వేషించినా ఆవిడ యింట్లో నేను వుండాలి కాబట్టి ఆవిడతో మంచిగా వుండాలి. గణేశ్‌ను నిందించినా నానుంచి అతణ్ణి దూరం చేయటం ఇష్టం లేదు. దేవకి పిన్ని మీద అపవాదులున్నప్పటికీ నా పూర్వానుబంధంవల్ల ఆవిడ సౌందర్య రాశిలోంచి ప్రసరించే ప్రేమాను రాగాలు, ఆమె అందించే సుగంధపరిమళాలు నాకు నచ్చాయి. ఈ

భావనా తరంగాలతో సతమతమౌతూ గుడి గంటల్లా ఆలోచనలు వూగిస లాడుతుండగా పట్టపగలు ఏర్పడిన గందర గోళంలో దేవకి పిన్ని వద్ద వీడ్కోలు తీసుకోవటానికి వెళ్లాను. నా తలను ఆమె గుండెకు హత్తు కుని ముఖం పైట చెరగు చాటు చేసుకొని చేతులతో ఆమె సన్నని నడుము వాటేసుకుని ఎడబాటును భరించలేనట్లుగా బాధపడ్డాను. నా గుండె లోతుల్లో కలలు కన్నట్లు ఒకానొక రోజు నేను ఆవిడ ఒడిలో కలకాలం పడుకోగలననీ, ఆవిడ తన వాణ్ణిగా స్వీకరిస్తుందనీ భావిం చాను. నా ముఖంలో ప్రస్ఫుటంగా కానవస్తున్న విషాదచ్ఛాయల క్రింద మౌనవేదన వినిపించింది

ఓ ప్రియాతిప్రియమైన వనితా! నన్ను ఇక్కడే వుండనీ. ద్రౌపది ఇంటికి వెళ్ళనీకు. గణేశ్‌కు ఆవిడ ఇష్టం కాబట్టి ఆవిడ వాడిపట్ల మంచిగా వుంటుంది కాబట్టి వాడే వెళతాడు నేనిక్కడ వుండి పోతాను. అమ్మనూ నాన్నను నీవు అడిగితే వాళ్ళు మనసు మార్చుకోవచ్చు.

నే నీ విధంగా కోరికలతో సతమతమౌతున్నప్పటికీ, ఆవిడపై నాకున్న ప్రేమవల్ల అనురాగ బంధంలో చిక్కుకొని అలా అనిపి స్తోందని నాకు తెలుసు నిజానికి మా అమ్మా నాన్న చేతిలో నా భవిష్యత్తు నిశ్చయమై పోయింది. నేను ఇప్పుడు ఆమె ఒడిలో వాలిపోయి నట్లుగా నేనప్పుడప్పుడూ కలుసుకున్నప్పుడు నా మనస్సులోని ఆరాధనా భావాన్ని ఆవిడకు పంచి యిచ్చి వుండవలసింది.

'బాబూ! నీవు వెళ్ళవలసిన సమయం దగ్గరపడుతోంది. హరీష్ ఎదురు చూస్తుంటాడు' అని చిన్నగా అంది. ఆవిడ దంత ప్రతిమ లాంటి ముఖం మీద మా నాన్న ఎదురుగా వున్నాడు కాబట్టి ముసుగు వేసుకొని అంచులోంచి నన్ను చూస్తోంది. నా తలపై నిమురుతుండగా ఆవిడ కన్నీళ్లు నా మెడపై పడ్డాయి

# 8

"ఇంగ్లీషు పాఠాల్లో నీవు చురుగ్గావున్నావని షేక్ సాహెబ్ అన్నారు." మేము వూరి నుంచి తిరిగి వచ్చిన తర్వాత హెడ్‌మాస్టరుగారితో మాట్లాడివచ్చి అన్నాడు హరీష్. ' ఈ రోజునుంచి షానవాజు మాష్టరు వారానికి మూడు రోజులు వచ్చి నీకు లెక్కలు చెప్తారు. నీవు పాలుతాగి సంచితీసుకొని సిద్ధంగా వుండు "

'అయితే బంతి ఆట నేర్చుకోవటమో' అన్నాను నేను.

'బాబూ! నీకు అన్నీ బాగావచ్చుకానీ లెక్కల్లో వెనకబడి వున్నావు. నీవు ప్రత్యేకంగా చదువుకోకపోతే యింగ్లీషులో నెగ్గినా లెక్కల్లో తప్పిపోతావు. కాబట్టి, ఇంట్లో మూడు గంటలు వారానికి లెక్కలు చేసుకొని మిగతా సమయంలో ఆడుకోవచ్చు' హరీష్ నాలతపై చేయి ఆప్యాయంగా వేసి నిమురుతూ అన్నాడు. ఇది మంచి పద్ధతిగా నాకనిపించింది. హెడ్‌మాష్టరు నా ఆంగ్లభాషా ప్రవేశాన్ని గురించి ప్రశంసించటంపట్ల సంబర పడ్డాను. నేను బలహీనంగా వున్న లెక్కల్లోకూడా ప్రావీణ్యం సంపాదిస్తే తెలివితేటలు ప్రదర్శించి మా తరగతికి నాయకుణ్ణి కావచ్చు. కాబట్టి కొద్దిరోజులు ఆడుకోవటం మానివేస్తే మంచిదనిపించింది.

నేను పాలు తాగే లోపల అదృష్టవశాత్తు షానవాజు మాష్టారు వచ్చారు. ఆయన నిరాడంబరత, హాస్యధోరణి కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయి. వరండాలో వేసిన మంచంమీద కూర్చొని, తలపాగా తీసి ప్రక్కన పెట్టి ఇలా అన్నాడు. 'మున్షీగారూ! గాలి పీల్చుకునేందుకు కొంచెం వ్యవధి యివ్వండి. మీరు నాకు మంచి హుక్కా ఎక్కడి నుంచైనా సంపాదించి పెడితే ఈ కుర్రవాడికి బాగా చెప్పటానికి వీలవుతుంది.'

'తప్పకుండా మా మాలి ఇలామ్‌దీన్ హుక్కా నింపి మీకు తెప్పిస్తాను' అన్నాడు అన్నయ్య. పక్కనేవున్న వంటవాడు సంతూని పంపి మాలివద్ద హుక్కా తీసుక రావలసిందిగా ఆదేశించాడు.

'నా దినచర్య మారుపరుగులు చేయటంలా కష్టమైంది. హుక్కా

నా జీవితంలో భాగమైంది. తరచూ నీలాగా సంగీత నృత్యాలకు వెళ్ళ టానికి నేను అదృష్టవంతుణ్ణి కాదు.' అన్నాడు మాష్టారు.

'అదేమీ కష్టమైన పనికాదు. ఈదఫా మీరు నాతో రాగల్గితే నూరా మోతీచేత నాట్యం చేయిస్తాదు. ముంతాజ్ కొన్ని 'గజళ్ళు' పాడుతుంది.'

'నా మనసులోవున్న మాట నీవు బాగా కనిపెట్టావు. నావ్యర్థ జీవితానికి సార్థకత కలిగి నా కవి హృదయంలోని ప్రేమను చూడగ లను. నీకు తెలియదు కాబోలు నేను కవి నౌదామని గడ్డం పెంచాను. చివరకు ఏమయ్యానో నీకు తెలుసు 'వారిష్ షా హీర్ రంజా'లోని గాథలను నేను అఖండంగా వర్ణించగలను. నావద్ద ఆగ్రంథం పాత ప్రతి ఒకటి వుంది. నాకు పంజాబీ భాష అంటే ప్రేమ. నా యౌవన కాలంలో ఆ భాషలోని అమృతప్రాయమైన మాధుర్యంపట్ల ఆకర్షితు డనై కవిత్వం వ్రాశాను. ఇప్పుడో ఎడారిలాంటి ఈ లూధియానాలో బడిపంతుల్ని ఎవరు పట్టించుకుంటారు' అన్నారు మాష్టారు షానవాజ్.

'మాష్టారూ! మీరు మరుగునపడ్డ మాణిక్యం వంటి మేధావులు. ఒకరోజు మీరు మాకు హీర్ వినిపించాలి. నూరా యింట్లో ఒకరోజు ప్రత్యేకంగా యీ కార్యక్రమం ఏర్పాటు చేద్దాం.' అర్థిస్తున్న ధోరణిలో అన్నాడు హరీష్.

ఇంతలో సంతూ మాలీవద్దనుంచి హుక్కా తెచ్చాడు. మాష్టారు ఒకటి రెండు దమ్ములు పీల్చి, దగ్గి 'కొంచెం ఘాటుగా వుంది పొగాకు, జీవితంలా తీపిచేదుల సమ్మిశ్రణం. నేనే స్వయంగా పొగాకు పొడి చేసు కుంటాను.' అని నావైపు తిరిగి 'నీవు నేను గణితంలో తయారు చేసిన పద్యాలు నేర్చుకుంటే గణితంలో మేధావి వౌతావు. ఇదిగో ఈ కాగితం లోని పద్యం నేర్చుకో! తర్వాత నీ స్నేహితులతో కలిసి ఆడుకోవచ్చు. ఈరోజు ఎక్కాల గురించి పాట నేర్చుకోవటం. మొదటి నుంచీ తర్ఫీదు చేస్తాను. చిన్న చిన్న ముక్కలుగా లెక్కలు చెప్పటం నాకు నచ్చదు. సమస్త గణిత శాస్త్రంలోని సారం నీకు అందిస్తాను.' అన్నాడు. ఆయన హుక్కా పీల్చటం పూర్తయేసరికి నేను ఆపాట నేర్చుకున్నాను. ఆ పాటలోని లయ నన్ను ఉత్సాహ భరితుణ్ణి చేసింది. అందులో లెక్క

నాకర్థమైంది.

నేను ద్వేషించే లెక్కలు కూడా ఒకవిధమైన పద్యమే. లెక్కలంటే నాలో భయం తొలగి పోయింది. మాష్టారు నాపలక తీసుకొని గుండ్రంగా గీత గీశాడు.

'ఇదేమిటి?'

'కోడిగుడ్డు.' వెంటనే సమాధాన మిచ్చాను.

'తెలివైన వాడివే. ఇది పురాతనమైన గుడ్డు. దీనిలోంచి సృష్టి ఆరంభమైంది. నీవు గుర్తుంచుకోవలసింది ఇది ఒక వృత్తం. లెక్కల్లో దీనిని 'సున్న' అంటారు. గణిత శాస్త్రాన్ని మొదట భారతీయులు కనుగొన్నారు. వాళ్ళు సున్న మొట్టమొదట గుర్తించారు. ఆ తర్వాత అరబ్ దేశస్తులు దాన్ని వాడుకున్నారు. వారివద్దనుంచి ఆంగ్లేయులకు అదిబాగా వుపయోగపడింది. ప్రతి ఒక్కరూ అంకెలు గణించేందుకు అది వుపయోగపడింది. నీవు సంపాదించటం మొదలు పెడితే ఎంత వుపయోగమో తెలుస్తుంది. జీవితంలోని క్లిష్టమైన విషయాల నన్నిటినీ అవగాహన చేసుకోవటానికి ఈ విజ్ఞానం ఉపయోగపడుతుంది '

ఆయన ముఖంవైపు ఆశ్యర్యంగా చూశాను.

'ఈ రోజుకు తమాషా అయిపోయింది రేపు మళ్ళీ మనంవెళ్ళి ఆడుకుందాం పద.' అన్నారు మాష్టారు.

అప్పుడే పాఠం పూర్తయిపోయిందేనని నేను బాధపడేంత వుత్సాహం వేసింది.

'హీరాలోంచి కొన్ని గీతాలు పాడండి. నేను ఆడుకోవటం మర్చి పోయాను.' అని ప్రార్థించాను.

'అవును మాష్టారూ!' హరీష్‌కూడా వత్తిడి చేశాడు

మాష్టారు గొంతు సవరించుకొని పాట అందుకున్నారు. హీరా తాను ప్రేమించిన వ్యక్తిని కాక మరొకర్ని పెండ్లి చేసుకొని అత్తవారింటికి వెళుతోంది. మేమందరం ఆ మృదుమధుర గానానికి నిశ్చేష్టులమైనాము.

'విషాద భరితమైన జీవితానికి కవిత్వమే ఆధారం' అంటూ ఆయన ఆపారు.

బయటినుంచీ ఆగానం విని మాలీ లోపలికివచ్చి మాష్టారు కాళ్ళకు నమస్కరించాడు. హరీష్ కళ్ళలో నీళ్ళు గమనించాను.

మర్నాడు నేను బడినుండి యింటికి వచ్చేసరికి అమ్మ, నాన్న, దేవకి, గణేశ్, ద్రౌపది వచ్చి వుండటం నాకెంతో సంతోషం కలిగించింది. వాళ్ళు హరిద్వార్‌వద్ద గంగానదిలో ప్రతాప్ బాబాయి అస్తులు కలిపి అక్కడ కాలం వృధా చేయకుండా వెంటనే రైలెక్కినట్లుగా తోస్తోంది. నాన్న మాలాఖండ్‌లోని తన దళాన్ని చేరడానికి వెళుతూ దారిలో కొద్ది గంటలు లూధియానాలో దిగి హరీష్‌ను, నన్ను చూచి పోదామని వచ్చారు.

గణితాన్ని పద్యరూపంలో నేను నేర్చుకొని సాధించిన విజయాన్ని గురించి నాన్నకు సగర్వంగా చెబుదామనుకున్నాను. కాని హరీష్ హెడ్ మాష్టారుగారు నన్నుగురికంచి ప్రశంసాపూర్వకంగా మాట్లాడిన వాక్యాలు, లెక్కల్లో నేను వెనకబడి వున్నాను కాబట్టి షానవాజు మాష్టారును ప్రత్యే కంగా కుదిర్చిన విషయమూ చెప్పేశాడు నాన్నగారు నేను హరీష్‌తో అమృతసర్ నుండి వచ్చిన రోజుకంటె చాల ఉత్సాహంగా కనిపించారు. బహుశా నా వియోగాన్ని దేవకి తట్టుకునేలా చేసి గణేశ్‌ను దత్త కుమా రుడుగా అంగీకరింపజేసి వుంటారు. నే నాయన్ను అమెరికన్ టోపీ తెచ్చిపెట్టమని అడిగాను. అదివుంటే నేను అచ్చం అబ్రహాంలింకన్ పోలి కకు సరిపోతాను. అమెరికన్‌వలె కనిపించాలనే నా ఆశయాన్ని నేను సాధించదలచు కున్నాను.

'నీవు ఆరవ తరగతి పరీక్షలు బాగా వ్రాస్తే నేను నీకు అది తెచ్చియిస్తాను. బహుశా అప్పటికి మాదళంలోని ఒకదొర యుద్ధంలో చనిపోవచ్చు. ఆయన వస్తువులు వేలం వేస్తారు' 'ప్రతాప్ గుడ్డల సంగతి వేరు. గణేశ్ పెద్దవాడైనపుడు వాడు వేసుకుంటాడు' — చనిపోయిన వాళ్ళ గుడ్డల వేలం గురించి నాన్న కటువుగా మాట్లాడినందుకు దేవకి నొచ్చుకుందేమోనని అమ్మ అంది.

'అది యింకెంతో దూరంలో లేదు. హరీష్! లాల్తన్ నుంచి పెండ్లివాళ్ళు మళ్ళీవస్తే దేవకి పక్షాన గణేశ్ పెండ్లికి నీవు ఒప్పుకో. పెండ్లి అమృతసర్‌లో త్వరలో చేద్దాం.......... కోడలు యింటికి వస్తే దేవకికి తోడు, సంతోషము కలుగుతాయి' అన్నాడు నాన్న కుటుంబంలో సర్దుబాటు వ్యవహారాలను గూర్చి మాట్లాడుతూ.

'బావగారు విషయాన్ని అతిశయోక్తిగా చెబుతారు అక్కా! కోడలువస్తే సంతోషం కలుగుతుంది అనే విషయం మనం మనయింటికి మొదటి సారిగా కోడలు వచ్చినపుడు చవి చూశామా?' అంది దేవకి అమ్మతో.

ద్రౌపది వరండాలో పీటమీద కూచుని ఆమాటలువిని గాబరాపడి, తల ఆడించింది. 'ఆవిడ తన ఆగాఖానీ తల్లిదండ్రుల వద్దకు వెళ్ళడం ద్వారా మనకు ఇబ్బంది కలిగించింది. ఇక మీదట ఆవిడ అలాంటి ప్రయత్నాలు మానుకుంటుంది. గంగా నదిలో పవిత్ర స్నానం కూడా చేసింది.' అంటూ ద్రౌపది పక్షంలో వాదిస్తున్నట్లుగా దేవకి మాట్లాడింది. ఇంతలో ద్రౌపది లేచి వినయ విధేయతలు పుట్టిపడేలా పైట చెరగు కప్పుకొని చేతులు జోడించి వంగి నాన్నకు నమస్కరిస్తూ సన్నని ధ్వనితో ఇలా అంది:

'వారిని తిరగటం తాగటం ఆపమని చెప్పండి.'

'దేవకి గణేశ్‌ను దత్తత తీసుకున్నట్లే ద్రౌపదీ! నీవు కృష్ణను నీ కొడుకుతో సమానంగా చూసుకోవాలి. వాడిని అన్యాయంగా ఇంతకు ముందులా చూడక జాగ్రత్తగా చూస్కోవాలి. నీవు బాగా చూసుకుంటావనే నమ్మకంతో నీ దగ్గర వదలి వెళుతున్నాను. నీకు పిల్లలు కలగరు కాబట్టి వీణ్ణి నీ కొడుగ్గా భావించుకోవాలి.'

'నాన్నా! అస్పృశ్యుడిలా నన్ను వంటగదికి వెలుపల కూచోబెట్టి వడ్డించవద్దని చెప్పు.' అని నేను ఉత్సాహం పురకలు వేస్తుండగా నా గురించి అందరూ పట్టించుకోవాలని అన్నాను.

'సరే, సరే. అది నీయిబ్బందుల్లో చాలా చిన్నది. ఆవిడ నీకు పుష్టిగా పెడితే నేను తృప్తి పడతాను. నీవు శవాకారంగా తయారు

కాకుండా వుంటే చాలు.'

నేను దేవకి పిన్ని దగ్గరకు వెళ్ళి ముఖాముఖీ చూస్తూ తీక్షణంగా నిలబడ్డాను. అన్నం లేకపోయినా ఫర్వాలేదు కానీ అస్పృశ్యుడిలా నాకు వడ్డించటం అవమానకరంగా తోచింది. నాన్న విషయాన్ని లోతుగా ఆలోచించకుండా యిలా దాట వేయటం నాకు నచ్చలేదు. ఎదుగుతున్న నావ్యక్తిత్వాన్ని గురించి వూహించుకుంటూ సగర్వంగా తిరుగుతున్నాను. ఆయన హరీష్‌ను గురించిన సమస్యను దాట వేశాడు. చాలా మంది భారతీయుల్లా ఒప్పందం ప్రకారం భార్య మగవాడి సంతోషానికి వుంపుడుగత్తె అనే సిద్ధాంతాన్ని మానాన్న కూడా నమ్మినట్లు నాకు తోస్తుంది.

ఆ సాయంకాలం రైలుకు నాన్న, అమ్మ, దేవకి, వూరికి వెళ్ళిపోయారు. ఆరాత్రి అసంతృప్తితో నిద్ర కుపక్రమించినపుడు చెదిరిన కలలు వచ్చాయి.

కనుగొలుకుల క్రింద మసక చీకటిలో నేలమీద ప్రతాప్ బాబాయి శవం నీలుక్కుని వుంది. మిడి గుడ్లలోంచి రక్తం కారుతోంది. ఒక మూలన దేవకి పిన్ని ఒదిగి నిల్చునివుంది అమ్మ ఏడుస్తూ అంటోంది ' ఆ హంతకురాల్ని తీసుకెళ్ళిపోండి తన భర్తకు విషం పెట్టిన నేరానికి ఆమెకు శిక్షపడుతుంది ' నేను దీపం చేతబట్టుకొని మెట్లెక్కి పైకి వచ్చాను. సూర్యోదయ కాంతి నాకళ్ళమీద పడుతుండగా పక్కనేవున్న దీపపు కాంతికి లేచాను.

అప్పుడే నేను నిద్రలేచి నప్పటికీ నాకల్లోని చాలా భాగాలు వెంటనే గుర్తురావడంలేదు. ప్రతాప్ బాబాయి దయ్యం రూపం మాత్రం అస్పష్టంగా కనిపిస్తోంది. నా గొంతు తడి ఆరిపోయింది. నేను మాట్లాడటంగానీ, ఏడవటంగానీ చేయలేకున్నాను. ఆ దుస్స్వప్నానికి జడిసి నా గొంతు మూగ బోయింది. సూర్యోదయ కాంతిలో చనిపోయిన వారిలా హరీష్, గణేశ్, ద్రౌపది నిద్రపోతూ భయంకరంగా కనిపించారు. వెళ్ళి హరీషును లేపుదామనుకున్నాను కానీ, గొడవ చేస్తున్నానని హరీష్ మండిపడతాడనీ వుద్దేశ్యంతో మానివేశాను. ఈ విధమైన రూపం నాకళ్ళముందు మాయగా చాల రోజులు కనిపించింది. నాలోని ఈ

తుఫాను పెద్దగా చెలరేగి మానసిక ప్రలోభంతో మూగ బోయినట్లుగా బాధాశప్తుడ నైనట్లుగా ఉన్నాను. నాలో ఈ భావోద్రేకంవల్ల మళ్ళీ జ్వరం వస్తుందేమోనని భయం వేసింది. నేను భగవంతుళ్ళందరికీ పాదాభివందనం చేసి నన్ను భయపెట్టవద్దని, నాలోని భావాలు అణచి వేయవద్దని, నాలో భయాలు పోగొట్టేలా చేయమని వేడుకున్నాను.

నేను బడినుంచి యింటికి, యింటి నుంచి బడికీ వెళ్లి వస్తున్న ప్పుడు, అప్పుడప్పుడు, దేవకి పిన్నికి ప్రతాప్ బాబాయి దయ్యం నాకు కనిపించినట్లే ఆమెకు కనిపించి వుండ వచ్చుననీ, ఆమె విషం పెట్టి చంపింది గాబట్టి తప్పక భయపడుతుందనీ అనుకొన్నాను. నన్ను పిచ్చి వాడో, మూర్ఖుడో అనుకొంటాడని అడగ లేదుగాని, నాకు కొన్ని చిక్కు ప్రశ్నలు అర్థంకాకుండా, ఎవరినీ అడగటానికి వీలులేకుండా సతమతం చేస్తున్నాడు. అందువల్ల శ్రద్ధగా పాఠాలు చదువుకోలేకుండా వున్నాను.

నేను సాధారణంగా అనుభవించే జీవితంకంటె భిన్నంగా, నేను కలల్లోచూసే వేరే జీవితం ఉందా? పగలు నిద్రపోకపోయినా, శరీరం మీద అవి ప్రభావం చూపుతూ ఉంటాయా? నా ఊహా ప్రపంచంలోని నాయకుల్ని ఎలా చూడ గలుగుతాను? యితరుల తలల్లో ఆలోచనలు లేకపోయినా, వాళ్లను చూడగలుగుతున్నాను.

నౌషిరాలో నాకు బాగులేనప్పుడు, నేను కొండలపై తిరుగు తుండగా నాన్న చూసి యింటికి వచ్చి నాకు పిచ్చిపట్టిందని అమ్మతో చెప్పినట్లు, నాకు నిజంగా మతిభ్రమణమా? అనే ఆలోచన వచ్చింది. అయితే ఎవరితోనూ చెప్పలేదు. నన్ను ఆవరించిన భయాలు గణేశ్‌కు పట్టవు. వాడు దేనిని గురించీ బాధపడ్డట్లు ఉండదు. బహుశా నా ఆత్మ వాడి కంటె భిన్నంగా వ్యవహరిస్తోందేమో! నాన్న చెప్పిన మాట నిజమేనా? విలువైన పసివాళ్లందరూ చిన్నతనంలోనే చనిపోతారంటారు. అలానే నేను కూడా చిన్న వయసులో చనిపోతానారా? ఇప్పుడు నేను మా నాన్నయింట్లో కొత్తవాడిలా, తాత్కాలికంగా ఉంటున్నానా? త్వరలో చనిపోతానా?

ఈ ఊహాగానాలతో సతమతమవుతూ, నేను స్థిమిత పడలేక ఈ

ప్రపంచంలో ఖైదీలా నిలిచిపోయాను.

స్కూళ్ల యినస్పెక్టరు బుద్ధసింగు మాష్టారు తప్పిదాలను క్షమించి వదిలివేసినట్లు వచ్చిన వదంతి నాచెవిన పడింది. ఎవరితోనూ చెప్ప కుండా, అతను తిరిగి వస్తాడనే భయంకరమైన ఆవేదనను అనుభవిం చాను. నా ముఖంమీద, నయీమ్ ముఖంమీద ఉన్న గాయాలను చూసి హెడ్మాష్టరు ఆయనను పనిలోంచి తాత్కాలికంగా తొలగించారు.

మా యింట్లో ప్రశాంత వాతావరణంవల్ల ద్రౌపది మా నాన్న క్షమాపణ తర్వాత సర్దుబాటు ధోరణిలో వ్యవహరిస్తోందని అనుకొన్నాను. ముంతాజ్‌ను చూడటానికి హరీష్ యింకా వెళుతూనే ఉన్నాడు. మా వదినకు ఆ విషయం తెలిసినా, ఓపికతో భరిస్తోంది. కొద్ది రోజుల తర్వాత మళ్లీ కోపం ప్రకటిస్తుందను కొంటాను.

బయట ప్రపంచం కనిపిస్తున్న ధోరణికి, నా మనసులో ఆవేదనకు చాలా తేడా ఉన్నట్లు గందరగోళ స్థితిలో ఉన్నాను. నా మనసులో ఎప్పుడూ చిన్నపిల్లవాని చేష్టలా ఒక ఆలోచన వెన్నాడుతోంది.

'కష్టాలు అనుభవించడానికి నేనెందుకు పుట్టాలి? అందరూ కష్టా లను అనుభవిస్తున్నారా? '

ఈ ప్రశ్నలకు నిజమైన సమాధానం లేదు. నా కొద్దిపాటి అను భవాన్ని బట్టి తెలియవచ్చిన విషయం — భూమ్యాకాశాలమధ్య ఖాళీ ప్రదేశంలో మధురంగా తిరిగే నాకు కొన్ని ఆలోచనలు వచ్చాయి.

ద్రౌపది అటువైపు తిరిగివున్నప్పుడు ఆవిడ కళ్లు నా చేతుల్తో మూయడం మాత్రం చేయగలుగుతున్నాను. ఎక్కువసార్లు ఆమె అస హనంగా— 'బాబూ! అల్లరి పనులు చేయకు.' అనేది. ఒకరోజు మాత్రం, ఆవిడ అమాంతం నన్ను వొడిలోకి తీసుకొని నా నుదుటిపై ముద్దుపెట్టుకొంది.

ఒక సర్వసాధారణమైన రోజు, బడిలో మేము ఆసంవత్సరం చదివిన పాఠాలన్నీ పునశ్చరణ చేయవలసిందిగా చెప్పారు. ఆరోజు మాకు ప్రత్యేక దినం. బడి మూసివేసే ముందు హెడ్మాష్టరు వచ్చి మా తర

గతిలో అందరం ఆరో తరగతిలో నెగ్గినట్లు చెప్పారు. మా ఫలితాలను తల్లిదండ్రులకుగాని, సంరక్షకుడికిగాని తెలిపి మేము ఏఏ పాఠ్యభాగాల్లో వెనకబడి వున్నామో తెలియ జేస్తామన్నారు. పరీక్షలు అయిన తర్వాత యిచ్చే సెలవులు, హిందువుల పండుగ సెలవులు కలిపి పదిరోజులు వేసవి సెలవులు యిస్తున్నట్లు ప్రకటించారు. ఆయన ఈ తీర్పు ప్రకటించే లోపల మేమందరం ఉత్సాహంతో గంతులువేస్తూ, తలపాగాలు, టోపీలు విసిరివేసుకొంటూ నించున్నాము. షేక్ అబ్దుల్ హమీద్, షానవాజు మేష్టార్లు ఇద్దరూ ఒక నెలరోజులు వాళ్లు పరీక్షల్లో అడిగే పాఠ్యాంశాలకు మాకు బాగా తర్ఫీదు యిచ్చిన విషయం నాకు యింటికి వెళ్లగానే గుర్తుకు వచ్చింది.

# 9

మేం పరీక్షల్లో నెగ్గడంవల్ల సంబరంగా గడపాలనుకొన్నాం. ఈసారి సెలవుదినంరోజు నేను, గణేశ్‌కూడ బెట్టిన డబ్బుతో ద్రౌపదిని, హరీష్‌ను సంతోషపరచాలనుకొన్నాము. మాది 'ఒకే సంతోష కుటుంబం' అని చాటి చెప్పేందుకు ఈవిధంగా చేద్దామనుకొన్నాము. గణేశ్ త్వరలో అమృతసర్‌లో దేవకితో కలిసి వుండటానికి వెళ్తున్నాడు గాబట్టి ముందుగా వాడు తేనీటివిందు చేసేటట్లు అనుకొన్నాము. వాడు వెళ్లేదానికి ముందు నేను అందరినీ పిలిచి వాడికి వీడ్కోలు సమావేశంలాంటిది ఏర్పాటు చేద్దామనుకొన్నాము. ఈ రెండు ఉత్సవాలల్లో అతిథులకు యిష్టమైన పళ్లు, పలావు వంటకం, మాంసం ద్రౌపది వండి పెట్టేటట్లు, రంగు సోడాలు ప్రత్యేక ఆకర్షణంగా తెప్పించేటట్లు అనుకొన్నాము.

కృష్ణజయంతి రోజు హోలీ పర్వదినం సందర్భంగా సెలవు యిచ్చారు. ఆరోజు మధ్యాహ్నం గణేశ్ తన తేనీటివిందు ఏర్పాటు చేసి అన్నను, వదినెను లాంఛనంగా ఆహ్వానించాడు. తెల్లకాగితలపై, బంగారు

రంగు సిరాతో నేను పెర్షియన్ వ్రాతలో అందంగా అహ్వానాలు వ్రాశాను.

ఈ సందర్భంగా ద్రౌపది వంటకాలు తయారు చేస్తుంటే, హరీష్ తన హార్మోనియం తీసుకొచ్చి కొన్నిపాటలు పాడి ఆనంద పరిచాడు. అతను బాగా ఉత్సాహంగా ఉన్నాడు. మాకు భవిష్యత్తులో విద్యా ధనం మూటకట్టి వున్నట్లు గుర్తు చేస్తూ ఎం.ఏ పరీక్షల్లో నెగ్గిన ఒక యువకుడి ఉత్సాహాన్ని పాటగా పాడాడు·

"భరించాను కష్టాలను ఎం.ఏ లో కృతార్థతకు
అనుభవించాను ఆచార్యుల నిందలను సహనంతో
ఎం.ఏ లో నెగ్గిన నేను సర్వతంత్ర స్వతంత్రుణ్ణి!
కళ్లు చెడిపోయాయి, ఆరోగ్యం క్షీణించింది,
తలిదండ్రులు నగలు కుదువబెట్టారు
ఎం.ఏ లో కృతార్థతకు కష్టనష్టాలను ఓర్చుకొన్నాను."

ఈ గీతంలోని భావాలు నవ్వులాటగా వినిపించి, వంటగదిలో పనిలో నిమగ్నమైవున్నా, ఈ పాట వినడానికి ద్రౌపది తీరిక చేసుకొని వచ్చింది. ఇందులో వ్యంగ్యానికి నేను, గణేశ్ గొల్లెల్లా నవ్వుతూ ఉన్నాం.

హరీష్ మరింత గంభీరతను ముఖంపై తెచ్చిపెట్టుకొని పాట కొన సాగించాడు:

'అధికారులకు పంపాను పండ్లబుట్టల కానుకలు,
అయినా వారికి నాపై దయకలగలేదు
అదృష్టాన్ని నిందిస్తూ నిద్రించాను రాత్రులు,
భరించాను కష్టాలను ఎం.ఏ కృతార్థతకు.
నిరుద్యోగినై అదృష్ట హీనుడనై జీవనం సాగిస్తున్నాను
వృధా జీవననౌక పయనం సాగిస్తోంది
నాపట్ల వక్రించిన విధిగాధను వివరిస్తున్నాను
ఏం.ఏ లో కృతార్థతకు భరించాను కష్టనష్టాలు '

పంజాబ్ విశ్వవిద్యాలయంనుండి పెద్ద చదువులు చదివి బయటకు వచ్చినవారి దురదృష్టం గురించి దేవదత్త బాబాయి అనుభవాలు చెబు తుంటే విన్నాము. తాను మెట్రిక్ తర్వాత చదువుకోలేదు గాబట్టి,

మా అన్న ఉద్దేశపూర్వకంగా ఈ సంఘటన తీసుకొని గీతంగా పాడి తన బాధను వ్యక్తం చేస్తున్నాడనీ, ఆయన గొంతులో ఆ వ్యంగ్యం ధ్వనిస్తోందని అనుకొన్నాను.

'ఈ పాట ఎక్కడ సంపాదించావు' అన్నాను

నా ప్రశ్నకు సమాధానం చెప్పకుండా ఆయన గీతం ఆలపించసాగాడు:

"చదువురానివాడికి ఆడంబరాలు లేవు
ఆంగ్ల దుస్తులకు డబ్బంతా వృధా చేశాను
లేకుంటే నేను సంపన్నుడినే.
ఇప్పుడు గడపగడపా తిరుగుతున్నాను
ఎం.ఏ లో కృతార్థతకు భరించాను కష్టనష్టాలు.
ఉద్యోగం రాదు - కష్టించి పనిచేయలేను
ఎం.ఏ లో కృతార్థతకు నాన్నగారి సంపద ఖాళీ చేశాను"

పాట, హార్మోనియమూ ఆపి ఆయన నవ్వసాగాడు. నేనూ, గణేశ్ సిగ్గుపడుతూ ఆయనను అనుకరించాము.,

ద్రౌపది చిరునవ్వు ముఖంతో వంటగదిలోకి జారుకుంది.

'ఓ ద్రౌపదీ! ఇలారా! ఆప్యాయంగా పిలిచాడు

ఆమె దగ్గరనుండి జవాబు లేదు.

హార్మోనియం అందుకొని మరోపాట ప్రారంభిచాడు

ఇప్ప డేంపాట పాడుతావు అన్నాను

'ఆధునిక హిందూ భార్యను గురించి' అని పాట మొదలెట్టాడు.

'ఓ ప్రియా! తీసుకెళ్ళు సంతకు
వెళుతున్నారు లక్షలాది జనం సంతకు
టాంగాలో సైకిలుపై
ఓ ప్రియా! నన్ను తీసుకెళ్ళు కారులో
తీసుకెళ్ళు సంతకు'

ఈపాట అద్భుతంగా వుంది. ఈ నవ్వులాట పాటలు ఈయన ఎక్కడ నేర్చుకున్నాడా అని నాకు ఆశ్చర్యమేసింది. బహుశా ముంతాజ్ వద్ద అయివుంటుంది.

'నేను గుర్రపుబండి లోకూడా తీసుకెళ్ళమని అడగలేదు. మోటారు సంగతి దేవుడెరుగు' అంది ద్రౌపది అక్కసుతో.

'తల చమురు, సబ్బు, అత్తరూ కావాలి
గదిలో తగిలించడానికి కావాలి బొమ్మలపటం
తెచ్చిపెట్టండి శంభుని పటం
తీసుకెళ్ళండి సంతకు.'

'మీ అన్న నాకు 'పియర్సు' సబ్బుముక్క తెచ్చిపెట్టి సంవత్సరాలు గడిచాయి.' అంది ద్రౌపది.

హరీష్ నీళ్ళకుండ తీసుకొచ్చి ఏదో కానుక తెచ్చినట్లుగా ఎఱ్ఱరంగు భార్య ముఖంపై పూసి పరుగెత్తుకుంటూ వెళ్ళి వరుపుమీద పడు కొని నవ్వసాగాడు. ఇదంతా త్వరత్వరగా సునాయసంగా పూర్తిచేసి వెళ్ళాడు. ద్రౌపది ఆడ కోతిలా కనిపిస్తోంది.

హరీష్‌తో బాటు మేమూ నవ్వాము.

ఆవిడ ఏడుస్తూ వంటగదిలోకి వెళ్ళి తలుపు వేసుకుంది. మొదట్లో ఆవిడ సరదాకు కోపంతో వున్నట్లు నటిస్తోందని అనుకున్నాం. హరీష్ కోపంగా తలుపు తట్టినప్పటికీ ఆవిడ తెరవక పోయేసరికి ఆవిడకు నిజంగా కోపం వచ్చిందనుకున్నాము.

హరీష్ మనసులో కలత పడుతూ 'ఈవిడ మరీ పనికిమాలినది. కనీసం సరదాగా మాట్లాడినా తెలియదు. ఈరోజు సరదాగా నవ్వుకునే హోలీ పండుగ' అన్నాడు.

కొంచెం సేపటికి ద్రౌపది ఏడుపులూ, పెడ బొబ్బలూ వినిపించాయి. హరీష్ ఎంత ప్రాధేయపడ్డా ఆవిడ తలుపులు తీయలేదు. హరీష్ తలుపుకంతల్లోంచి చూసి వెంటనే బలంగా తలుపు నెట్టాడు. తలుపు తెరచుకుంది. ద్రౌపది తెల్లచీర మండుతోంది. ఆవిడ వంటిపై కిరసనా

యిలు పోసుకొని అంటించుకున్నట్లుంది

హరీషు కడవనిండా నీళ్ళు తెచ్చి ఆవిడపైపోసి మంట లార్పాడు ఆత్మహత్యా ప్రయత్నమనే ఉత్కంఠవల్ల ఆవిడ సొమ్మసిల్లి పడిపోయింది మా అన్న కళ్ళనీళ్ళు పెట్టుకొని ఆవిడను తిట్టాడు. 'నీవు చనిపోయి వుంటే మా కుటుంబానికి అవమానం కలిగి వుండేది సరదాగా మాట్లాడినా అర్థం చేసుకోలేకపోతే నేనేం చేసేది భగవంతుడా! ఈవిడతో పెండ్లివల్ల నేను ఎంత దురదృష్టవంతుణ్ణయ్యాను.'

పండుగ కోసం వండిన భక్ష్యాలు వాళ్ళిద్దరూ తినలేదు హరీషు మమ్మల్నిద్దరినీ తినమని బలవంతం చేశాడు. మేము ఇద్దరం చెరొక రంగు సోడా తాగాము. పండుగ సందర్భంగా ఇతరులు రంగులు చల్లుకోవటం చూట్టానికి బయటికి వెళ్ళాము వార్డరు జయసింగుకూ, అతని భార్యకూ జరిగిన విషయం చెప్పి ద్రౌపదిని చూసుకోమని తన స్నేహితుడు నూరా యింటికి హరీషు వెళ్ళాడు బహుశా అక్కడ నుంచి ముంతాజ్ యింటికి వెళతాడు.

లాల్‌తన్ గ్రామం నుంచి జిందామల్, ఆయన తమ్ముడు అచింతారామ్ ఒక మధ్యాహ్నం రావడంతో మాయింట్లో చాలా కాలంగా నెలకొన్న నిశ్శబ్ద వాతావరణం మారిపోయింది. వాళ్ళ మేనకోడల్ని మా గణేశ్‌కు యివ్వటానికి వాళ్ళు వచ్చారు.

మేము ఆడుకోవటానికి అప్పుడే ప్రారంభించాము. జయసింగు వచ్చి గణేశ్‌ను మా అన్న ఇంటికి రమ్మంటున్నాడని చెప్పాడు. జయసింగు చేతులో గుడ్డలున్నాయి. గణేశ్‌ను తీసుకెళ్తూ— 'మున్షీగారు ఈ గుడ్డలు నీకిచ్చి మాయింట్లో మార్చుకోమని చెప్పారు. నీపెండ్లి సంబంధం కోసం లాల్‌తన్‌నుంచి వాళ్ళు వచ్చారు. రా పోదాం.'

జయసింగు నన్ను యింటికి రమ్మనలేదు కాబట్టి, నేను వెళితే హరీష్ తిడతాడని అనుకున్నాను ఇంకొంచెం సేపు పిల్లలతో ఆడుకొని చీకటిపడే ముందు, ఆట అయిపోయి యింటికి వెళ్ళినట్లుగా అమాయకంగా నటించా లనుకున్నాను.

ఆటపై నాకు మనసులేదు. అందుకని మరో అరగంట ఆడుదా

మనుకుని కూడా మధ్యలో ఆపివేశాను. ఇంట్లో తతంగం ప్రారంభం కావటానికి ముందే యిల్లు చేరుకున్నాను.

'మేం కోరుకునేది సిక్కు ఋషుల నగరమైన అమృతసర్‌కు మా అమ్మాయి వెళ్ళాలని అందునా ఒక మంచి యింటికి, మీ అమ్మ సిక్కు మతస్తుల ఇంట్లోంచి వచ్చింది కాబట్టి మీకు ఆమతంపై విశ్వాసం వుంది. ఈ పిల్లలకూ అంతే. నిజమేనా!' అన్నాడు జిందామల్.

హరీష్ అబద్ధంగానే తలవూపాడు.

'మీరు మరోలా అనుకోకపోతే ఆర్యసమాజం వారంతా తాగుబోతులూ వేశ్యాలోలురూ. వాళ్ళు రైతులను ప్రభుత్వానికి వ్యతిరేకంగా రెచ్చగొడుతున్నారు. మా అమ్మాయి హీరో స్వర్ణదేవాలయం పరిస రాల్లోని అమృతసరస్సులో స్నానం చేసే అదృష్టానికి నోచుకుంటుంది. ఈ దేవాలయంలో మీ పూర్వీకులంతా కళాకారులుగా పనిచేసి డబ్బు సంపాదించ లేదా?' అన్నాడు ఝిందామల్.

తాగుబోతులూ తిరుగుబోతులూ అనేమాట విని హరీష్ ముఖం పాలిపోయింది. కట్నం గురించి డొంక తిరుగుడుగా, వీళ్ళిద్దరూ తెలివి తేటలతో మాట్లాడటం నాకు విసుగు పుట్టించింది. గణేశ్ పెండ్లి చూపుల సందర్భంగా వాళ్ళు తెచ్చిన లడ్లు ఎప్పుడు బయట పెడతారా? అని ఎదురుచూస్తున్నాను. అదృష్టవశాత్తు జిందామల్ తన చేతులో మూట విప్పుతున్నాడు.

'మా పేదయింట్లో నుంచి ఎక్కువ ఏమీ తీసుకరాలేదు.' లాంఛ నంగా ఏవో తెచ్చాము.'

'సూటు కుట్టించుకోడానికి ఈ గుడ్డ' అచింతారామ్ అన్నాడు.

'ఈ రోజుల్లో కుర్రవాళ్లు నాజూగ్గా వుండాలనుకుంటారు. మా కాబోయే అల్లుడు పల్లెల్లో దర్జీ కుడితే నచ్చదు పట్టణంలో దర్జీచేత కుట్టించుకుంటాడని గుడ్డ తెచ్చాము '

'మీరు మరీ మర్యాదలు చూపనక్కరలేదు. మీదయవల్ల ఈ యింట్లో అన్నీ వున్నాయి. గణేశ్‌కు మీరు చూచారుగా మంచి గుడ్డల

న్నాయి.' అన్నాడు హరీష్.

గణేశ్ తలపై కొట్టవచ్చినట్లు ఎట్టని తలపాగా నవ్వు తెప్పిస్తోంది. హరీషు అతిశయోక్తులు, మరీ.

'అయినా, మా పల్లెటూరి సంప్రదాయం ప్రకారం తీసుకొచ్చాను. మీరు క్షమించాలి. మూడు తులాల బంగారం కూడా తెచ్చాను. కుర్రవాడు కావలసింది చేయించుకోవచ్చు' అన్నాడు జిందామల్.

'మీరిలా చేయకుండా వుంటే బాగుండేది. మా నాన్నకు తెలిస్తే క్షమించరు.' అన్నాడు హరీష్

'మీ యింట్లో బంగారం లేదని గాదు. మాకంత మాత్రం తెలియక కాదు.' అన్నాడు అచింతారామ్.

'మరికొన్ని వెండి నాణాలు కూడా' అన్నాడు జిందామల్.

ఇంతసేపూ పెండ్లి కొడుకుని గురించి ఎవరూ పట్టించుకో లేదు. అతణ్ణి అమ్మకానికి పెట్టినట్టు నించున్నాడు.

'గణేశ్! ముందుకువచ్చి ఆ కానుకలు తీసుకో!' హరీష్ ప్రోత్సహించాడు.

'ముందు తిలకం.' అంటూ జిందామల్ కుంకుమలో బొటనవేలు అద్ది గణేశ్ నుదుటిమీద దిద్ది, అక్షింతలు, కుంకుమ చల్లి ఆ తతంగం పూర్తయిన తర్వాత 'ఇలా నాచేతుల్లోకి రా నాయనా!' అన్నాడు.

గణేష్ అయిష్టంగానే జిందామల్ చేతుల్లోకి వెళ్ళాడు.

'మా బిడ్డను నీకిస్తున్నాము' అని ఆ ముసలాయన ఆత్మీయంగా అన్నాడు. గణేశ్ ముఖం పాలిపోయి నిస్తబ్దంగా నిలుచున్నాడు. అతనేమి ఆలోచిస్తున్నాడా అని నేను ఆశ్చర్య పోయాను.

'బాబూ! హరీష్ చంద్రా! ఇప్పుడు నీవు పిల్లవాని తండ్రి హోదాలో మీ నాన్న స్థానాన్ని ఆక్రమించాలి. నీవు వచ్చి నన్ను ఆలింగనం చేసుకుంటే మేము వెళ్ళిపోతాము.' లేస్తూ అన్నాడు జిందామల్.

మనుకుని కూడా మధ్యలో ఆపివేశాను ఇంట్లో తతంగం ప్రారంభం కావటానికి ముందే యిల్లు చేరుకున్నాను.

'మేం కోరుకునేది సిక్కు ఋషుల నగరమైన అమృతసర్‌కు మా అమ్మాయి వెళ్ళాలని అందునా ఒక మంచి యింటికి, మీ అమ్మ సిక్కు మతస్తుల ఇంట్లోంచి వచ్చింది కాబట్టి మీకు ఆమతంపై విశ్వాసం వుంది. ఈ పిల్లలకూ అంతే. నిజమేనా!' అన్నాడు జిందామల్

హరీష్ అబద్ధంగానే తలవూపాడు

'మీరు మరోలా అనుకోకపోతే ఆర్యసమాజం వారంతా తాగుబోతులూ వేశ్యాలోలురూ వాళ్ళు రైతులను ప్రభుత్వానికి వ్యతిరేకంగా రెచ్చగొడుతున్నారు. మా అమ్మాయి హీరో స్వర్ణదేవాలయం పరిస రాళ్లోని అమృతసరస్సులో స్నానం చేసే అదృష్టానికి నోచుకుంటుంది. ఈ దేవాలయంలో మీ పూర్వీకులంతా కళాకారులుగా పనిచేసి డబ్బు సంపాదించ లేదా?' అన్నాడు ఝిందామల్.

తాగుబోతులూ తిరుగుబోతులూ అనేమాట విని హరీష్ ముఖం పాలిపోయింది. కట్నం గురించి డొంక తిరుగుడుగా, వీళ్ళిద్దరూ తెలివి తేటలతో మాట్లాడటం నాకు విసుగు పుట్టించింది. గణేశ్ పెండ్లి చూపుల సందర్భంగా వాళ్ళు తెచ్చిన లడ్లు ఎప్పుడు బయట పెడతారా? అని ఎదురుచూస్తున్నాను అదృష్టవశాత్తు జిందామల్ తన చేతులో మూట విప్పుతున్నాడు.

'మా పేదయింట్లో నుంచి ఎక్కువ ఏమీ తీసుకరాలేదు' లాంఛనంగా ఏవో తెచ్చాము'

'సూటు కుట్టించుకోడానికి ఈ గుడ్డ' అచింతారామ్ అన్నాడు

'ఈ రోజుల్లో కుర్రవాళ్లు నాజూగ్గా వుండాలనుకుంటారు. మా కాబోయే అల్లుడు పల్లెల్లో దర్జీ కుడితే నచ్చదు పట్టణంలో దర్జీచేత కుట్టించుకుంటాడని గుడ్డ తెచ్చాము'

'మీరు మరీ మర్యాదలు చూపనక్కరలేదు. మీదయవల్ల ఈ యింట్లో అన్నీ వున్నాయి. గణేశ్‌కు మీరు చూచారుగా మంచి గుడ్డలు

'మీ అన్న లేకుండా నీకు ఒంటరి తనం అనిపించదూ' నన్ను ఉడికిద్దామని మాలి అన్నాడు

నేను జవాబు చెప్పలేదు.

'ఇప్పుడు జానీ కూడా వెళ్ళి పోతున్నాడు. వాళ్ళనాన్నను లాహోరు జైలుకు బదిలీ చేశారట. నిజమేనా మున్షీజీ.'

'అవును.' హరీష్ సమాధానం.

'నా శత్రువు లిద్దరూ వెళ్ళిపోతే నాకు పరమ సంతోషం. పిరికి పందలు' అన్నాను.

'ఓరి పిడుగా.' తిడుతున్నట్లుగా మాలి అభినయించాడు.

'వాడి ఫుట్ బాల్ జట్టులో యిద్దరు తగ్గితే అప్పుడు వాడికి తెలిసి వస్తుంది' అన్నాడు గణేశ్.

గణేశ్ చెప్పింది నిజమే కానీ నాలోని గర్వం వాళ్ళిద్దరూ లేక పోయినా ఫర్వాలేదని చెప్తోంది.

ఇంతలో టాంగా శబ్దం వినిపించింది. జయసింగు బండి వచ్చిం దనీ, సామాన్లు తీసుకెళ్ళాటానికి వచ్చాననీ అన్నాడు.

'కనీసం గతాన్ని గుర్తు చేసుకొనేందుకైనా, మీ అన్నతో కరచా లనం చెయ్యి.' అన్నాడు మాలి.

పెద్ద మనిషిలా గణేశ్ తన కుడిచెయ్యి చాచాడు. నేను ముఖం మరో వైపుకు తిప్పకొని చిన్నగా చేయి అందించాను.

ఇద్దరు ప్రయాణీకులకూ మధ్యాహ్న భోజనానికి పొట్లాము తయారు చేసి ద్రౌపది తీసుకొచ్చింది. గణేశ్ గుడ్డలు వేసుకుని ప్రయాణానికి సిద్ధమయ్యాడని తెలుసుకొని అతని ప్రక్కన కూచుని అతన్ని చేతుల్లోకి తీసుకొని వాడు చనిపోతే ఏడుస్తున్నట్లుగా గోలపెట్టింది.

ఆ సన్నివేశంపట్ల మాలి, వార్డరు ఇరకాటంలోపడి సామాన్లు తీసుకొని జారుకున్నారు. గణేశ్ ద్రౌపది ప్రక్కనే నుంచున్నాడు. ఆవిడ

వాణ్ణి వదలిపెట్టలేదు.

'వెళదాం రా!' అసహనంగా అన్నాడు హరీష్ గణేశ్‌ను బలవంతంగా ఈడ్చుకెళ్ళాడు. లేగదూడను తొలగిస్తే ఆవు బాధపడుతున్నట్లు ఆవిడ వుంది హరీష్, గణేశ్ టాంగా ఎక్కగానే ద్రౌపది పెద్దపెట్టున ఏడ్చింది. నాకేం చేయాలో తోచలేదు గణేశ్ నిజానికి శాశ్వతంగా వెళ్ళాడని తెలిస్తే ఆవిడకెంత కోపం వస్తుందో అనుకుంటూ తలవంచి నించున్నాను.

ఏదో ప్రేరేపించినట్లుగ నేను పక్కమీద నుంచి ఒక్క దూకు దూకి ఆవిడ మెడ చుట్టూ చేతులు వేశాను

'వెళ్ళిపో నువు అక్కరలేదు. గణేశ్ కావాలి. మీ అన్నకు వ్యతిరేకంగా అతను నావైపు ఎప్పుడూవుండే వాడు' అని అరుస్తూ ఆవిడ నన్ను నెట్టివేసింది.

నేను నాపక్కమీదకు వెళ్ళి తనివితీరని నిద్రకుపక్రమించాను.

నన్ను ఏడిపించటంలో మా వదిన కృతరాలైనట్లు ఆవిడ అనుకుంటుందేమోనని నేను ఏడుపు బయటకు పొక్కనీయలేదు . కానీ, నాగుండెలో దుఃఖోద్వేగం నన్ను అణిచివేస్తోంది. బోర్లాపడుకున్నాను. ఎదిగి పెద్దవాడినైనప్పటి కంటె చిన్నప్పుడు అమాయకంగావున్న కాలమే సంతోషదాయకమైనదని నాకు అనిపిస్తుంది అపుడు నేను ఏడుస్తుంటే అందరూ ఓదార్చటానికి ప్రయత్నించేవారు. ఇప్పుడు నన్ను బాధపెట్టడానికి అందరూ ప్రయత్నిస్తున్నారు నౌషిరాలో ఊడ్చేవారి పిల్లలతోనూ, బట్టలుతికే వారి పిల్లలతోనూ, బ్యాండుమేళంవారి పిల్లలతోనూ ఆడుకుంటుంటే ఎంత ఆనందంగా వుండేది వూహాలోకాల్లో ఎంత తేలిపోయానో.

మా అమ్మతో వాళ్ళ పుట్టింటికి వెళ్ళినపుడు డాస్కా గ్రామంలోని పచ్చని తోటలలో సీతాకోక చిలుకల వెంబడి పరుగెడుతూవుంటే ఎంత అద్భుతంగా వుండేది. కొయ్య కత్తి పట్టుకొని, రాజా రాసలు వేషాన్ని ధరించి యుద్ధం చేస్తుంటే ఎంత సంబరంగా వుండేది! జీవితాంతం చిన్నపిల్లవాడిగానే వుండిపోతే ఎంత బాగుండును!

'ఓ బాల్యమా! నాప్రేమా!' అంటూ పాట పాడినట్లు గుసగుస లాడాను.

ముంతాజ్‌తో గుసగుసలాడుతున్నట్లు, నాప్రార్థనను వినిపిస్తున్నట్లు ఇలా అన్నాను: 'బాల్యపు అమాయకత్వమా!'

కొంతసేపటికి ఉదయం నిద్రలో గాఢంగా కలల్లో తేలియాడాను. ఇంతలో జయిసింగు భార్య నాకు బిస్కట్లు, టీ తీసుకొని వచ్చి నిద్రలేపింది.

కాల కృత్యాలు తీర్చుకొనేటప్పుడూ, అన్నానికీ తప్ప ద్రౌపదిని చూడటం తప్పించుకున్నాను. బావి దగ్గర మల్బరీచెట్ల క్రింద మంచంపై కూర్చున్నాను. అమృతసర్‌లో నాన్న పుస్తకాల్లోంచి దాటవేసిన రతన్ నాథ్ సర్షర్ ఉర్దూ నవల 'ఫసానీ అజాద్' చదువుతూ కూచొన్నాను.

ఈ పుస్తకాన్ని తిరగవేస్తూ అలసిపోయి, మధ్యాహ్న భోజనం తర్వాత పడుకొన్నాను. జయ్‌సింగు నన్ను పరుపుపై పడుకోబెట్టాడు.

నేను నిద్రపోతున్నప్పుడు, ద్రౌపది నన్ను పరుపుపై పడుకోబెడు తుంటే మెలకువ వచ్చింది తన హృదయానికి హత్తుకొని, పైట చెంగు తొలగించి గుండెలకదుముకొని గుసగుసలాడింది

'నేను మీ అమ్మ ననుకొని, కృష్ణా! ముద్దెట్టుకో!'

ఆవిడను ముద్దెట్టుకొందామనే ఆనందం కలగలేదు సరిగదా; ముంతాజ్ పై ప్రేమతో నిండిపోయాను. నన్ను ఆవిడ ఆధి మానించినప్పుడు నేను ఆవిడను ప్రేమించలేక పోయానే అని మాత్రం సిగ్గుపడ్డాను

# 10

సెలవుల తర్వాత, ఎండలు ఏప్రిల్ మాసంలో తీక్షణమైనాయి. బుద్ధుడు చెప్పినట్లుగా సప్తనరకాల్లో ఒకటిగా భూమి మండిపో సాగింది. అందువల్ల బడి ఉదయం 7గంటలనుండి మధ్యాహ్నం 12గంటలవరకు మార్చారు. గణేశ్‌ను, జానీని వదలివేసిన నేను ఒంటరిగా ఒకటిన్నర

మైలు దూరం నడచుకొంటూ దిగాలుపడ్డ మొహంతో బడికి వెళ్లేవాణ్ణి. గూర్ఖా పిల్లలు మర్రిచెట్టు నీడలో గోలీలు ఆడుకునేవారు.

నా చిరకాల స్నేహితులు బాట్లియా, నయీమ్, అస్లమ్ అక్కడ కలిశారు. కబుర్లు చాలా సేపు చెప్పుకున్న తర్వాత, బడిగంట కొట్టారు. బుద్ధసింగు మేష్టారును సస్పెండు చేశారు గాబట్టి అయనకు బదులు ఇంగ్లీషు పారం చెప్పడానికి షేక్ అబ్దుల్ హమీద్ రావలసింది కాని, ఆయనరాలేదు.

'నీ ప్రధానం ఎప్పుడు?' నయీమ్ ఏడిపించటానికి నాతో అన్నాడు. గణేశ్‌కు పెళ్లి నిశ్చయమైందని అతనికి తెలిసి అడిగాడు.

'నన్ను బేరం చెయ్యడానికి వొప్పుకొనేంత మూర్ఖుణ్ణి కాను.' అన్నాను.

'నాకు పిల్లనిస్తామంటే కాదనను.' అన్నాడు బాట్లియా.

'పిరికి వెధవా! మార్వాడీ పిల్లవాడా!' అంటూ లావైన అస్లమ్ ఖండించాడు.

అందుకు బాట్లియా నోటితో అసభ్యంగా శబ్దం చేస్తూ వెక్కిరించాడు. పిల్లలందరూ బల్లలు చరుస్తూ నాయకుణ్ణి సమర్థించారు.

అప్పుడు షానవాజు మేష్టారు మా తరగతివైపు రావడం గమనించారు. అందరూ బుద్ధిమంతుల్లా, నోరు తెరవనివాళ్లలా ఎవరి కుర్చీల్లో వాళ్లు వెళ్లి కూచొన్నారు.

'మీరు చేసే గొడవ ఏమిటి?' అంటూ లోపలికి వచ్చారు మేష్టారు. దూరంనుంచి మా గొడవ ఆయనకు వినిపించి వుంటుంది.

ఎవరూ సమాధానం చెప్పలేదు

'మీ తల్లులు ముండమొయ్య! మీరు నెగ్గినందుకు సంతోషంగా గోలచేస్తున్నట్లున్నారు.' అంటూ క్షణకాలం ఆగి, అందరి ముఖాలు చూసి, తలవంచుకొని —

'మీకో అశుభవార్త! హెడ్మాష్టరుగారు బుద్ధసింగును సస్పెండు

చెయ్యడం సబబుగాదని స్కూళ్ల ఇనస్పెక్టరు తీర్మానించారు. కాబట్టి మీ పాలిటి యముడు మళ్లీ చేరుతాడు. హెడ్మాష్టరుగారిని హోషియార్ ప్రభుత్వ పాఠశాలకు బదలీ చేశారు.... బహుశా తెల్లదొరలమీద హెడ్మా ష్టరుగారు విమర్శలు కురిపిస్తారని ఆంగ్ల ప్రభుత్వానికి తెలిసివుంటుంది ఆయన భారతదేశానికి స్వాతంత్రం కోరుకుంటాడు. సాదా దుస్తుల్లో పనిచేసే పోలీసువంటివాడు బుద్ధసింగు. నావంటి అల్పప్రాణుల జోలికి వాళ్లు రాకపోయినా, ఆ కత్తి నామీద కూడా ఎప్పుడో ఒకనాడు పడి తీరుతుంది. బుద్ధసింగు తిరిగి వస్తున్నాడు గాబట్టి, నేను మరోచోట ఉద్యోగం వెతుక్కోవడం మంచిది.'

ఈ వార్తవిని తరగతి అంతా తల దించుకుంది.

మరోక్షణంలో ఫక్క తరగతుల్లో పిల్లలు, సంచులు చేతబుచ్చుకొని ఒకరి వెనుక ఒకరు పాఠశాల ప్రాంగణంలోకి రావడం గమనించాము.

ఏం జరిగిందో తెలుసుకొనే లోపల, జవాను సుభాన్ అలీ వచ్చి, షానవాజ్ మేష్టారుతో అన్నాడు

'ప్రభుత్వ ఉత్తర్వులకు వ్యతిరేకంగా పెద్ద తరగతుల పిల్లలందరూ సమ్మె చేస్తున్నారు. అందుకని అన్ని తరగతులకు సెలవు ప్రకటిస్తే మంచిదని హెడ్మాష్టరు సెలవు ప్రకటించారు.'

'కానీ' — అంటూ షానవాజు మేష్టారు చేతులుపైకెత్తి, మళ్లీ నిరాశగా దించారు.

'అయితే, మాష్టారూ!' బాట్లియా ఏదో చెప్పబోయాడు.

'అయితే, గియితే ఏమీ లేదు.' షానవాజ్ మేష్టారు అన్నారు.

'ప్రభుత్వ ఉత్తర్వులు ఉత్తర్వులే!'

* * *

షానవాజ్ మేష్టారు తెచ్చిన వార్త అధికారికంగా ధృవపడింది. మరోవారం రోజుల్లో, ఒక సోమవారంనాటి ఉదయం, దీర్ఘకాయుడు, బలిష్ఠుడు అయిన ఉత్తర పంజాబీ సిక్కు బుద్ధసింగు మా యింగ్లీషు

తరగతి తీసుకోడానికి తరగతిముందు, అడవిలో కుందేళ్ల కోసం ఎదురు చూస్తున్న పులిలా నించుని వున్నాడు.

ఆ ఉదయం ఆయన మాకు పాఠం చెప్పలేదు. తాను తిరిగి జయప్రదంగా వచ్చిన ఉదంతాన్ని గొప్పలు చేసి యీ ధోరణిలో చెప్ప సాగాడు.

'నేను తిరిగి రావడం మీ కందరికీ ఆశ్చర్యంగా ఉంటుంది!' ఆయన మామూలుగా కోపంగా ఉన్నప్పుడు సాగదీసిమాట్లాడే ధోరణిలో అన్నాడు. 'నాకూ ఆశ్చర్యం వేసింది. ప్రపంచ వ్యాప్తంగా ఆంగ్లప్రభుత్వం న్యాయానికీ, ధర్మానికీ పేరు ప్రసిద్ధులు వహించిన విషయం మీరుగాని, నేనుగాని గమనించలేదు. రవి అస్తమించని సామ్రాజ్యమని ఆంగ్లప్రభుత్వం ఘనత వహించింది అంతటా న్యాయాన్ని తెచ్చిపెట్టింది గాబట్టి, అది ప్రపంచాన్ని జయించింది. వారి సేవకుల్లో విధేయుడైన నన్ను 'సస్పెండు' చేయడానికి కారణం, మిమ్మల్ని దండించడం కాదు. ప్రభుత్వానికి వ్యతిరేకి అయిన అబ్దుల్ హమీద్‌కు నేను తెల్లదొరల మనిషినని తెలుసు. అందుకే స్కూళ్ల ఇనస్పెక్టరు న్యాయం జరిగేలా చూశాడు. నన్ను తిరిగి ఈ పాఠశాలలో ఉంచారు. మీ సంరక్షకుడైన హెడ్మాష్టరు ఆంగ్లప్రభుత్వ వ్యతిరేకులైన ముస్లిం నాయకులు (అలీసోదరుల) — మహమ్మదాలీ, షౌకత్ ఆలీల - అనుచరుడు గాబట్టి ఆయనను బదలీ చేశారు.'

నా వొళ్లు గగుర్పొడిచి వెంట్రుకలు నిక్కబొడిచాయి. నాకళ్లు తెరచుకోనట్లుగా మూతలు బడ్డాయి. ఇంతవరకు పెద్దలు ఆంగ్లప్రభుత్వ దమన నీతి గూర్చి, జర్మనుల చేతిలో వోడిపోవడాన్ని గూర్చి మాట్లాడుకొంటుండగా విన్నాను. కంటోన్మెంటులోని సిపాయిల దుస్తుల మీద, ఢిల్లీ దర్బారులో జార్జి ప్రభువు, మేరీరాణి ఉత్సవం మీద లక్షలరూపాయలు ఖర్చుబెట్టడం గూర్చి విన్నాను కోపదారులైన తెల్లదొరలు మాటలకన్న కోపం ఎక్కువగా ప్రదర్శిస్తారని తెలుసు. నాషిరాలో కన్నింగ్ హామ్ దొరవైపు తేరిపార చూసినందుకు బెత్తంతో నా వీపుమీద వాతపెట్టిన విషయం గుర్తుకు వచ్చింది. ఆంగ్లప్రభుత్వం వారి 'ధర్మపీఠం' గురించి వినడం నాకు కొత్తగా ఉంది. నాన్నగారు మొదలు ప్రతివొక్కరు,

తెల్లవారికి విధేయులైనప్పటికీ, (రహస్యంగానే) బహిరంగంగా కాకపోయిన ప్పటికీ, వారికి వ్యతిరేకంగా మాట్లాడతారు.

షానవాజు మేష్టారు జోస్యం చెప్పినట్లుగా, బుద్ధసింగు రహస్య దళంలో చేరినట్లున్నాడు. ఆయన పక్షపాతం ప్రత్యేకంగా కనిపిస్తోంది. ఆయనకు తిరిగి ఉద్యోగం యివ్వడం, పెద్దమనిషి అయిన హెడ్మాష్ట రును మారుమూల ప్రాంతాలకు బదలీచేయడం జరిగింది. కాకీ దుస్తులు ధరించిన సాధారణ పోలీసుకంటె, గూఢచారి చర్యలు చేసే వ్యక్తిపై నాకున్న బలమైన అభిప్రాయం భయంకరంగా మారింది. రహస్యవార్తలు చెప్పేవారు ఏమైనా చేయవచ్చు. తనకు నచ్చని వారిపై ఆంగ్లప్రభుత్వానికి చాడీలు చెప్పవచ్చు. ఫలితంగా అతడు అన్యాయంగా ఉద్యోగం పోగొట్టుకో వచ్చు. బడిపంతులుగా నేనెరిగిన బుద్ధసింగు కంటె, నా ఊహల్లో క్రూరమైన వ్యక్తిగా ఆయన స్వభావం కనిపించ సాగింది. ఉద్దేశ పూర్వకంగా నేను ఆయన చేతుల్లో మరింత శిక్ష అనుభవించడానికి చేజేతులా కొని తెచ్చుకొంటున్నాను.

బుద్ధసింగు మాటలు వింటున్నంతసేపు. ఈ భావాలు ఒకేసారి మెదిలాయి. నా ఊహా ప్రపంచంలో తేలియాడుతున్నాను. ఈ అల్లకల్లోల వాతావరణంలో గూడిన ప్రపంచంలో మనసు, గుండె బాధా మయమై తినివేస్తుంటే ఈవిధమైన విపరీత పరిణామాలను ఆహ్వానింప సాగాను. క్షణక్షణం కుమిలిపోవడం కంటె ఒక్కసారి క్రుంగిపోవడంమేలు! సంపూర్ణానందంగాని, కేవల దుఃఖంగాని కోరుకొన్నాను. సంతోషంగాని, బాధగాని నాకు స్వేచ్ఛనిస్తాయి. మధ్యస్తంగా ఉండటం నాకు నచ్చదు.

'తమపై కుట్రపన్నుతున్న వార్తలు ప్రభుత్వానికి బాగా తెలుసు. 'కోమా-గాటా-మారు' పేరుతో గదర్ పార్టీలో చేరిన అమృతసర్ సిక్కుల ఉద్యమం గురించి, ఆర్య సమాజ వాదులైన లజపతిరాయ్, హరదయాళ్ ఉపన్యాసాలు, రైతునాయకుడు అజిత్‌సింగు, గ్రామాల్లో దోపిడీలు తెల్ల దొరలకు తెలుసు. అందుకే ఈ ప్రజలంతా ఖైదీలో ఉన్నారు. హార్డింగు ప్రభువుమీద బాంబు కుట్రపన్నిన హరదయాళ్ అమెరికాకు, రసబిహార్ జపానుకు పారిపోయారు...... వాళ్లను తగిన సమయంలో మేము పట్టుకోగలం. ఆ విషయం అందరూ గుర్తుంచుకోవాలి '

నిరంకుశుని రూపంలో ప్రత్యక్షమైన ఆయన మాటలు పూర్తిగా విశ్వసించాను. ఆయన దృఢకాయాన్ని అప్పుడప్పుడూ మెడ తిప్పుతూ కదలిస్తూ, ఆయన నాకేసి చూస్తూ అన్నాడు:

'ఈ చుంచెలుక, హెడ్మాష్టరుతో నామీద ఫిర్యాదు చెప్పడానికి జంకలేదు. బహుశా ఈ గండుపిల్లి బడిలోంచి వెళ్లిపోయిందని, పీడవిరగడ అయిందనీ అనుకొని వుంటాడు. పెద్దపిల్లి చేతిలో రోజులు లెక్కబెట్టుకొనే సమయం వచ్చింది గాబట్టి ఈ ఎలుక సంతోషానికి అడ్డుకట్ట పడింది.'

నేను బల్లమీద చూస్తూ తల అటూయిటూ తిప్పలేదు.

'అందగాడైన నాయకుడు బాట్లియా ఏ విధంగా నన్ను ఎదిరిస్తాడో నేనూ చూస్తాను.'

బాట్లియా ఒకప్పుడు ధైర్యంగా ఉన్నాడుగాని, యిప్పుడు నోరు మెదపలేదు.

'నయీామ్, అస్లమ్! ఆంగ్ల ప్రభుత్వానికి మీనాన్న విధేయుడు. మీరు ఈ హిందూ పిల్లలతో కలవకుండా మీ ప్రవర్తన మార్చుకోవాలి. హిందువుల చేతిలో అణచివేయబడ్డ సిక్కులను, ముస్లిములను ఉద్ధరించడానికి ప్రభుత్వం సిద్దంగా వుంది నాకు తెలుసుగాబట్టి చెబుతున్నాను.... మీ స్నేహితుడైన షానవాజ్ వంటి వారు రోజులు లెక్కపెట్టుకోవాలి!'

నాగొంతులో అప్రయత్నంగా ఏదో అడ్డుపడ్డట్లయి శబ్దం ఆపుకోలేకపోయాను. నా వూహా ప్రపంచంలో 'ఆయన రోజులు లెక్కపెట్టుకోవాలి' అన్న మాటలు ప్రతిధ్వనించాయి.

'నాముందు ఎవరూ శబ్దం చేయడంగాని, గొణగడంకాని కుదరదు. నేను పాఠాలు చెప్పడం మొదలెడితే మీకు తెలుస్తుంది...... బెత్తం ద్వారా ప్రతిపాఠం మీరక్తంలోకి ఎక్కిస్తాను. ఆంగ్ల పాఠశాలల్లో ఈ గాడిద కొడుకులకు క్రమశిక్షణతో చెప్పే మార్గం ఒక్కటే అవలంబిస్తారు. కొత్త హెడ్మాష్టరు ఎవరైనాగాని, యికమీదట ఫిర్యాదులు పనికిరావు..... కామ మోహితులైన మీ తలిదండ్రులు మిమ్మల్ని కనిపారవేసి, పెంచలేక యిక్కడికి పంపించారు వాళ్లతోగాని, మరెవరితోగాని మీరు నాగురించి

ఫిర్యాదు చేయరాదు. అలా చేశారంటే మీ ప్రాణాలు తీసేస్తాను.......
మీ పుస్తకాలు తెరవండి.. ...'

బుద్ధసింగు తిరిగి రావడం, హోషియార్‌పూర్‌కు అబ్దుల్ హమీద్ బదలీకావడం హరీష్‌తో చెపితే—

'నిజంగానా? లేక నువు కల్పిస్తున్నావా?' అన్నాడు.

'ఘనత వహించిన ఆంగ్ల ప్రభుత్వాన్ని గురించి బుద్ధసింగు ఈరోజు మాకు ఉపన్యాసం యిచ్చాడు ఆయునను తిరిగి యిక్కడేవేసి, హెడ్మాష్టరు కుట్రపన్నుతున్నాడని బదలీ చేశారు మాష్టారు మమ్మల్ని బెదిరించాడు కూఢా!'

ఈ మాటలువిని హరీష్ ఉక్రోషంతో మీసాలు మెలివేస్తూ, బయటికి వినిపించకుండా ఏవో మాటలు గొణిగాడు

'బుద్ధసింగు మాష్టారు గూఢాచారి అని షానవాజ్ మాష్టారు చెప్పారు. అందుకనే ఆయనకు తిరిగి ఉద్యోగం యిచ్చారు.' అన్నాను.

'కుక్క మొరుగుతోంది.' హరీష్ సమాధానం.

ఆమాటలు అన్నప్పుడు అతని ముఖం పాలిపోయింది. బజారుకు వెళ్ళే దుస్తులు వేసుకొని — 'నాతో రా. అసలు విషయం కనుక్కొందాం.' అన్నాడు.

ఉత్సాహంగా, విశ్వాపాత్రమైన కుక్కలా అతణ్ణి అనుసరించి నడిచాను.

పోలీసు వీధులగుండా నడచుకొంటూ పోలీసు సూపరిండెంటు గారి బంగళా వద్దకు నడిచాము. ఆయున వరండాలో వాలుకుర్చీలో కూచొని విస్కీ తాగుతూ, తనముందు 'గెజిట్' పరుచుకొని చదువుతున్నాడు. మేము ముందుకు నడుస్తుంటే ఆయన పెంపుడు కుక్కలు మొరగసాగాయి. ప్రహరీలో మాలీ చెట్లకు నీళ్లు పోస్తున్నాడు.

దొరగారు పత్రిక చదువుతుంటే మాలి పరుగెత్తి కుక్కల్ని పట్టుకొన్నాడు.

మా అన్నయ్య తన ఉద్యోగధర్మం గుర్తుకు తెచ్చుకొని భక్తి శ్రద్ధ లతో నుంచుని దొరగారికి  వందనం చేశారు.

'ఓ హరీష్ చంద్ర!' అంటూ దొరగారు విలాసంగా లేచి కూచు న్నారు. హరీష్‌ను కుర్చీలో  కూచోనివ్వాలా లేదా అని ఒక క్షణం సందిగ్ధంలో పడ్డాడు.

'మంచి మేలు జాతి కుక్కలు దొరా!' అన్నాడు ప్రశంసా పూర్వకంగా హరీష్. 'మంచికుక్కలు' సూపరిండెంట్ బేటీగారు వచ్చీ రాని హిందూస్తానీలో మాట్లాడుతూ ఆంగ్లయాసలో పలికారు. హరీష్‌ను కూచోమందామనే నిర్ణయానికివచ్చి 'రా  కూర్చో' అంటూ— 'అబ్దుల్!' అని కేక వేశారు.

తెల్లని పొడుగాటి దుస్తులు ధరించిన సేవకుడు ఎర్రని తలపాగా ధరించి వరండామూలనుండి ప్రత్యక్షమయ్యాడు.

అబ్దుల్ తక్షణం రావడం నాకు నచ్చింది. దొరగారి బంగళాకు వచ్చినందుకు నాకెంతో సంబరంగా ఉంది.

'విస్కీ సోడా' బేటీదొర ఆజ్ఞాపించాడు.

'ఫర్వాలేదు సార్!' కుర్చీలో కూర్చొంటూ అన్నాడు హరీష్. అతని పక్కన నేను నించున్నాను.

'నాకు తెలుసు. నువుతాగుతావని' - ఆంగ్ల హిందూస్తానీ భాషలు కలిపి బేటీ దొరగారు అంటూ — 'ఈ పిల్లవాడు — అల్లరి పిల్లవాడు.'

'వాడు పిల్లవాడు. అంత ధైర్యంలేదు ' హరీష్ అన్నాడు.

'అమృతసర్ గూండా సిపాయికి పనికిరాడు. మీనాన్న వీడికి సరిపడే మాంసం పెట్టలేదు. అలాంటప్పుడు మంచి సిపాయి ఎలా కాగలడు? ఇతను ఆంగ్ల ప్రభుత్వానికి విధేయుడవుతాడా? లేక ఆర్యసమాజంలో చేరుతాడా?' అన్నాడు దొర.

'నేను సంవత్సరంగా ఆర్య సమాజానికి వెళ్లడంలేదు.' దొరగారు తనమీద అనుమానంతో అలా అన్నారని గ్రహించి హరీష్ సమాధానంగా

అన్నాడు.

'మీ అన్నతోపాటు నీవూ రాజీనామా చేశావు' అన్నారు దొర.

ఈ విషయాలన్నీ ఆయన కెలా తెలిశాయి? ఆశ్చర్యం వేసింది నాకు.

బుద్ధసింగు గూఢచారి అని ఇప్పుడు ధృవపడింది. మా కుటుంబ చరిత్ర అంతా లూధియానా పోలీసు అధికారికి ఆయన చెప్పివుంటాడు. బుద్ధసింగుకు (ఉత్తర పంజాబులోని చక్వాలు గ్రామంనుండి వచ్చిన) మా నాన్న దళానికి చెందిన గుమాస్తా బాబూ చతర్‌సింగు చెప్పివుంటాడు.

'ఆంగ్ల ప్రభుత్వానికి మేము నిత్యవిధేయులం. మానాన్నగారికి వారి దళాధిపతి విశిష్ట సేవాపతకం సిఫారసు చేశారు.' అన్నాడు హరీష్.

ఇది నాకు కొత్తవార్త. నేను ఆంగ్ల ప్రభుత్వాన్ని సమర్థించ లేకున్నాను. ఈ కొత్తగౌరవం మానాన్నకు మాయని మచ్చకాగలదు. దేవదత్త బాబాయి వంటివారు మా కుటుంబాన్ని, మా నాన్నను తక్కువగా చూడగలరు.

బేటీ దొర హరీష్ కోసం గ్లాసులో విస్కీ పోశారు. ఆయన సేవ కుడు అందులో సోడా వంచారు.

హరీష్ తాగడానికి అంగీకరిస్తూ, మీసాలు దువ్వుకొన్నాడు.

'ఆంగ్ల దేశానికీ, ప్రభువుగారి ఆరోగ్యానికీ.' అంటూ బేటీ దొర గ్లాసు చేతిలో పట్టుకొని నుంచున్నారు.

మా అన్నకూడా లేచి నుంచుని, బూట్లు టకటకలాడించి తాగాడు.

సోడా తాగాలని నాకూ వుంది కాని సేవకుని చేతిలో సగం ఖాళీ అయిన సోడా సీసావంక చూడటానికి జంకాను.

'భలే! నువ్వు ఎందుకు వచ్చావో తెలుసు. బుద్ధసింగు మా తరపు మనిషి ఈ కుట్రపన్నే రోజుల్లో హెడ్మాష్టరువంటి కుట్రదారుల విష యంలో మేము కళ్లుమూసుకొని కూచోలేం. మీ తమ్ముణ్ణి బుద్ధసింగు మేష్టార్ని గౌరవంగా చూడమని సలహా యివ్వు.. .. అర్థమైందటోయ్'

అన్నాడు బేటీ దొర.

ఆయన ఆంగ్ల భాషా ప్రవాహం నాకు సరిగా అర్థంకాలేదుగాని ఆయన హెచ్చరిక బోధపడింది.

మా అన్న నిశ్శబ్దంగా ఉన్నాడు. ఆయన తాగడంలేదు.

'అందరూ కుట్రదారులు' అన్నాడు బేటీ, నాకేసి చూస్తూ చేతిలో సైగచేస్తూ.

ఇంతలో ఇంట్లోంచి ఆడగొంతుక పిలుపు వినిపించింది.

'వస్తున్నాను.' అంటూ బేటీ సమాధాన మిచ్చాడు.

హరీష్‌తో కరచాలనంచేసి – డిప్యూటీ కమీషనరుగారితో కలిసి మద్యం సేవించడానికి వెళ్లాలి.' అన్నాడు బేటీ దొర.

హరీష్ కరచాలనం పూర్తికాగానే శ్రద్ధాసక్తులతో వందనంచేసి సైన్యంలో వ్యక్తిగా వినయం ప్రకటించాడు.

'నువ్వు విస్కీ తాగి వెళ్లవచ్చు. బ్రిటీషువారు యుద్ధంలో గెలిచి నందుకు మరో మారు తాగు....' అన్నాడు బేటీ దొర.

హరీష్ గ్లాసు తీసుకొని రెండు గుక్కల్లో పూర్తి చేశాడు. మళ్లీ శ్రద్ధగా నిలబడి వందనంచేసి— 'నమస్కారం! దొరగారూ!' అన్నాడు.

'నమస్కారం!..... అరే. నీపేరు కృష్ణచంద్ర గదూ!' అన్నాడు దొర, తన ముఖంమీద ముడతలు కనిపిస్తుండగా.

'దొరగారికి నమస్కారంపెట్టు' హరీష్ సలహా యిచ్చాడు.

'నమస్కారం దొరా!' అన్నాను.

శబ్దంచేయకుండా, మేము బంగళాలోంచి బయటికి రాగానే హరీష్‌ని అడిగాను:

'ఆయనకు నాపేరు ఎలా తెలుసు?'

'మన గురించి ఆయనకు బాగా తెలుసు. మనం రావడం పొర

బాగైంది. అమ్మ ;.బుతుంటుంది. అధికారుల ముందుకు, గుర్రం వెనకకు వెళ్ళగూడదు. రెంటివల్ల తన్నులు తగులుతాయి. బుద్ధసింగు నిజంగా గూఢాచారి. మనం ఆయనకు ఒకటో, రెండో దుప్పట్లు, కూర గాయలు యిచ్చి ఆయనను ప్రసన్నం చేసుకోవాలి!' అన్నాడు హరీష్.

మా అన్న పోలీసు సూపరింటెండెంటు బేటీని కలవడంతో నాకు నిస్పృహ కలిగింది. నేనూహించే ప్రపంచాలకంటె విశాలమైన ప్రపంచాలు నాకు తెలిసిన యిల్లు, బడి కంటె భిన్నమైనవి నాకు తెలియని వున్నాయి. ఈ ప్రపంచంలోని దేవుళ్లు తెల్లదొరలు. వారు తాము చేయదలచుకొన్నది చేయగలరు. తమ హృదయాల్లో ద్వేషిస్తున్నప్పటికీ, మానాన్న, హరీష్‌వంటి వారిచేత లక్షలకొద్దీ అబద్ధాలు చెప్పించి, ప్రభుత్వానికి విధేయులైన సేవకులుగా తెల్లవారు పనిచేయించగలరు. నన్ను బడిలో చుంచెలుక' అని అందరూ ఎద్దేవా చేస్తారు. బుద్ధసింగు మేష్టారు నేను తుంటరివాణ్ణి కాకపోయినా కొడుతుంటే సహించాలి. ఈ మేష్టారు గూఢాచారి కాబట్టి హెడ్మాష్టరుకంటె చాలా అధికారాలు కలవాడు. మానాన్న, అన్నలకంటె ఆయన తన అధికారాన్ని నా మీద చూపడానికి ప్రయత్నిస్తున్నాడు. బెత్తం దెబ్బ చేతి మీద పడితే, వొళ్లంతా దహించే బాధ కలిగిస్తుంది. దెబ్బ తగలకముందే క్రూరాతిక్రూరంగా నాతల మీద భయంకరమైన ఉరుములు మెరుములతో పిడుగుపడ్డట్లుగా అది భయాన్ని కలిగిస్తుంది. మరునాడు బడి తెరిచేలోగా నేను అనంతవాయువుల్లో కలిసిపోతే ఎంత బాగుండును? నేను దయ్యాన్నై బుద్ధసింగు శరీరాన్ని ఆవహించి, ఆయనకు ఎందువల్ల అలా జరుగుతోందో తెలియకుండా హింసపెడితే బాగుండును. నాలోని ఉద్రేకాలు, అనిశ్చితస్థితికి తోడు మాటిమాటికి నాలో మరణవాంఛ సుప్తంగా ప్రవహిస్తోంది. తెలివిగా ఉన్నప్పుడు తలవాల్చుకొని ఆలోచిస్తూవుంటాను. జీవితంలో భయాలపట్ల మొహం మొత్తి, చిన్నవాడినైనప్పటికీ అసహనంతో ఉండే అల్లరి పిల్లవాని లక్షణాలను గమనించాను. నిద్రలో కూడా నేను మాట్లాడసాగాను. ఈ విషయాలు • నాలో నేను చర్చించుకొంటున్నప్పుడు నేను ఎదిగినవాడివలె భావించసాగాను. నా కళ్లముందు ఈ విశ్వమంతా గోచరమైనా, ప్రపంచంలో అనేక విషయాలు నాకు

అవగాహనకు వచ్చాయి. వాలోని అస్పష్టమైన ఆలోచనలకు రూపకల్పవచేసి, అద్భుతమైన సుందర ప్రపంచాన్ని ఊహించగలిగాము. అందులో మహమ్మదీయుల స్వర్గాన్ని కోరుకొన్నాను. మాలీ ఇలందివ్ చెప్పినట్లు అక్కడ అందమైన వనితలు, మద్యం అందిస్తారు. ముంతాజ్ మతం కాబట్టి కూడా అదినాకు నచ్చింది.

మరునాడు బుద్ధసింగు మేష్టారి క్లాసులో నేనులేచి, దొడ్డికి పోవాలని రెండువేళ్లు చూపించాను.

'బడికి రాకముందు యింటిదగ్గర దొడ్డికి వెళ్లలేదా?' అన్నాడు.

'కడుపులో నొప్పిగా ఉంది' అబద్ధమాడాను.

'మంచెలుకా! వెళ్లు'

బయటికి వెళుతూ ఆయనమాటలు విన్నాను. కనీసం ఉదయం పూట ఆయన చేతిలో దెబ్బలు తప్పించుకోవచ్చు. నేను ఆవిధంగా పిరికిపందలా పరుగెత్తిపోవడం వల్ల మిగతా పిల్లలు నన్ను తక్కువగా చూడవచ్చు. నేను నిజానికి అభినయం చేస్తున్నందున వాళ్లు అలా అనుకోవడం ధర్మమే!

రేకులతో కప్పిన దోడ్డిలోకి వెళ్లి ఆ మురికిలో కూచోడానికి విసుగు వేసింది.

ఇప్పుడు వెనక్కి వెళ్లినా బుద్ధసింగు మేష్టారు దండన తప్పదు. ఆయన మాటలు నాకు వినిపించాయి కూడా: 'ఈ ఎలుక ఎంతకాలం తప్పించుకోగలదు? దానికి తన తప్పులెక్కపెట్టుకొనే రోజు వస్తుంది.'

నేను తరగతిగదిలోకి వణుకుతూ అడుగు పెట్టేసరికి ఆ నిరంకుశుడు అన్నాడు:

"ఒరే గుడ్లగూబా! మొత్తం పాఠం నీవు వినలేకపోయావు. రేపు బడి అయిన తర్వాత మాయింటికి రా. పాఠం చెబుతాను."

నన్ను బెత్తంతో కొట్టలేదు గాబట్టి, ఆయన తక్కువ దండన విధించాడని అనుకొన్నాను.

తరగతి అయిపోగానే, పిల్లల ద్వారా వాళ్లందరూ దెబ్బలు తిన్నట్లు తెలుసుకొన్నాను. నేను బయటికి వెళ్లడం సమంజసమేనని తోచింది. నేను ఆంగ్ల పారాలలో చురుకుగా వున్నాను గాబట్టి, ఆయన నన్ను దండించడానికి ఏదో ఒక సాకు వెతికి దండించాలి.

* * *

'చుంచెలుక! రా! రా!' బుద్ధ సింగు మాష్టారు నన్ను వాళ్ల యింటి వద్దకు వెళ్ళినప్పుడు ఆహ్వానించాడు తడికెలతో అడ్డంపెట్టిన వరండాలో కూచొని వున్నాడు

ఆయన నాపట్ల అంత సౌహార్దంగా ఉండటం ఆశ్చర్యంవేసింది. ఆయన ముఖకవళికలు గమనించడానికి ముఖం పక్కకు తిప్పాను. ఎప్పుడూ కోపంతోను, ఉద్రేకంతో ఎర్రబడి వుంటే ఆయన ముఖంలో సింహపు ఛాయలవెనక నవ్వుకనబడటం ఆశ్చర్యంవేసింది. ఆయన నాపట్ల చూపే అత్యధికమైన ఆదరాభిమానాలు ఆయన ముఖంపై ప్రస్ఫుటంగా గోచరి స్తున్నాయి.

'గోవిందా! ఈ కుర్రవాడికి తేట మజ్జిగ తెచ్చియివ్వు' అని సేవ కుడితో కేకవేసి చెప్పాడు.

'మాష్టారూ! నేను యింటికి వెళ్ళి భోంచేస్తాను. పారం చెప్పిం చుకొని వెళ్దామని వచ్చాను.' అన్నాను.

'తొందర ఏమీ లేదు. నీ మధ్యాహ్న భోజనం యిక్కడ చేసి, కాసేపు పడుకొని వెళ్లవచ్చు. మీ అన్న యివాళ ఉదయం కూరగాయలు బుట్ట పంపారు మీ వదినె కూడా అవే కూరలు వండి వుంటుంది.'

హరీష్ లంచం పంపిన కారణంగా ఆయన నామీద అపారమైన అనురాగం చూపుతున్నాడని తోచింది.

నేను నేలమీద కూచొని యింగ్లీషు పుస్తకం కోసం సంచి తెరవ బోయాను.

'తొందర ఏమీ లేదు.'

ఇంతలో మాష్టారి సేవకుడు గోవిందుడు వచ్చాడు. అతడు వంట వాడిలా కాక, శుభ్రమైన గుడ్డలు ధరించి వున్నాడు. కుర్తా పైజామా తెల్లవి వేసుకున్నాడు. ఈ నిరంకుశుని వద్ద సేవకుడుగా పనిచేసే అతని పెదవులు తమలపాకులు వేసుకొని ఎర్రబడి వుండటం ఆశ్చర్యం గొలి పింది

"రెండు కంచాల్లో వడ్డించు ఒకటికాదు. అంగడి నుంచి ఐస్ ముక్కలు తెచ్చి 'లస్సీ 'తయారు చెయ్యి!" అని మాష్టారు అన్నారు.

'డబ్బులు' అంటూ చేయి చాచాడు ఆ కుర్రవాడు.

బుద్ధసింగు మాష్టారు జేబులోంచి పైసలు తీసి యిచ్చాడు.

నేను పుస్తకం తీసి చదవడానికి సిద్ధంగా ఉన్నాను. అది త్వరగా పూర్తి చేసుకొని యింటికి వెళ్లాలని తాపత్రయం. వదినె వంట తయా రుచేసి నాకోసం ఎదురుచూస్తుంటుంది త్వరగా వెళ్లకపోతే, ఎండ నడినెత్తి మీదికెక్కి చెమట పోస్తోంది.

'నా దగ్గరకు వచ్చి కూచో. నేను కూర్చీలోంచి లేవకుండా.'అ న్నాడు మాష్టారు.

నా చెంపమీద ఆయన చేయి ప్రతిధ్వని పడుతుందేమోనని భయంతో నేను తటపటాయించాను.

'చుంచెలుకా! రా! నీవంటి ఎలుక పిల్లల్ని నేను కొట్టను.'— ఆయన మాట్లాడుతూ వుంటే కింది పెదవి వూగుతోంది

నేను ముందు కెళ్లేసరికి, ఆయన రెండు కాళ్ల మధ్యలోకి నన్ను వెనకగా లాగి, నా చేతిలోవున్న పుస్తకంతో సహా ఆయన దగ్గరకు తొడల మధ్యకు లాక్కున్నాడు.

చిలకలా పలుకుతానని నాకు పేరు నా సహజ ధోరణిలో నేను పాఠం చదవసాగాను.

'నువు యింగ్లీషులో బాగా నేర్పరివని మాకు తెలుసు. అంత తొందరగా వద్దు. నిదానంగా.'

మళ్లీ నిదానంగా అవే వాక్యాలు చదివాను.

'నాకు బాగా కనిపించడంలేదు— ఇంత దూరంనుండి, నా తొడల మీద కూచో నీ పుస్తకం కూడా కనబడుతుంది' అన్నాడు.

ఆయన సౌహార్ధతపట్ల నాకంత విశ్వాసం లేక తటపటాయించాను. అప్పటికే తొడలమీద కూచో బెట్టుకొని గాఢంగా వూపిరి పీలుస్తున్నాడు. ఆకస్మాత్తుగా నాలో భయం ఆవహించి అక్షరాలు కనిపించడంలేదు.

'భయపడవద్దు. నిన్ను కొట్టను.' అన్నాడు.

ఆయన మాటల్లో అస్పష్టతవల్ల ఆయన నాకు పాఠం చెప్పడానికి సుముఖంగా లేడని అర్థమైంది.

మాటలు పలకడానికి ప్రయత్నం చేశాను.

'నీకు సుఖంగా లేదా?' అంటూ నామెడమీద గాఢంగా నిట్టూ ర్చాడు.

'పనివాడు వస్తాడు' అన్నాను.

'లేదు. వాడు 'ఐస్' తీసుకరావడానికి వెళ్లాడు.' అని గుసగుసలా డాడు. ఆ మాటలు అంటూ తొడలమీదనుంచి కిందికి తోశాడు.

విసుగు పుడుతోంది గాబట్టి భయంగా లేదు. నేను యిక్కడికి రాకుండా ఉండాల్సింది. నేను రాకపోతే, ఆయన చేతి దెబ్బలు మర్నాడు తప్పవని నాకు తెలుసు.

'మాష్టారూ! యింటికి వెళ్తాను.' అన్నాను.

'ఒక్క క్షణం.' అంటూ ఆయన నన్ను కిందికి దింపి గాలి పీల్చుకొన్నాడు. నా ప్రతిఘటనపట్ల ఆయనకు కోపంరాలేదు. ఆయన నిస్సహాయంగా, మృదువుగా మాట్లాడుతున్నాడు.

నేను గందరగోళ స్థితిలో వుండటంతో చెమట ముఖమంతా పట్టింది. వెళ్లడానికి ప్రయత్నించాను.

'ఆగు' అంటూ బుద్ధసింగు అరిచాడు. ఒక్కక్షణం నన్ను కింద

ఆపి, నన్ను వదిలించి, తాను మళ్లీ చేయి మెడ కిందపెట్టుకొని నిరుత్సాహంగా కూచొన్నాడు.

'నీకుసిగ్గుగా లేదూ?' అన్నాడు.

ఆయన ఉద్దేశం నేను గ్రహించాను కాబట్టి, నాసంచి దగ్గరకు పరుగెట్టి అన్నీ సర్దుకొని, దయ్యం తరుముతున్నట్లుగా పరుగుతీశాను.

నా వెంబడి తరము కొంటాడని వెనక్కి తిరిగి చూశాను. తలను చేతుల్లో పెట్టుకొని దిగాలుగా కూచొని వున్నాడు.

తుండుగుడ్డలో మంచుముక్కలు తీసుకొస్తూ గోవిందు నాకెదురు పడి — 'ఎక్కడికెళ్తున్నావు?' అన్నాడు.

అతనికి సమాధానం చెప్పలేదు సరిగదా, అతని కేసి చూడకుండా పరుగు లంఘించుకొన్నాను. పరుగెత్తితే ఏమవుతుందా? అనే భయంతో గుండే వేగంగా కొట్టుకొంటొంది. మగవాణ్ణి ప్రేమించడాన్ని పిల్లలు అసహ్యంచుకొంటారు. ఇలాంటి ప్రవర్తన గలవాళ్ల జీవితం దుర్భరం. ఒకటి రెండు సార్లు నేను బుద్ధాని దగ్గరగా కౌగలించుకొన్నాను. కాని నేను అంత అవమానంగా భావించలేదు. ఈయన తన వడిలో నన్ను అమాంతంగా అదుముకున్నాడు. నేను ఆయన ఒడిలో కూచోన్నానని ఆయన తరగతిలో చెబితే యింకేమైనా వుందా? హరీష్‌కు తెలిస్తే!... ఆలస్యంగా ఎందుకు వచ్చావని ద్రౌపది అడిగితే ఏం చెప్పేది? ఆవిడకు ఏమైనా అనుమానం కలుగుతుందా? ఆవిడకు అబద్ధం చెబుదామని విశ్చయించుకొన్నాను.

'నువ్వు యిప్పుడు ఆ రాక్షసుడికి ప్రేమ పాత్రుడివి గదూ!' మర్నాడు విరామ సమయంలో పాడవాటి అస్లమ్ అన్నాడు. అతను మా తరగతిలోకి కొత్తగా వచ్చాడు. బుద్ధసింగు మేష్టరంటే అతనికీ పడదు.

'విన్న వినని పాఠం చెప్పించుకోడానికి వెళ్ళాను, అంతే!'

''ఆయన ఏం పాఠం చెప్పాడు?'

'కృష్ణను ఏడిపించవద్దు. నువ్వు మాష్టారి వద్ద ఎలాంటి పాఠం నేర్చుకొన్నావో తెలుసుగా. కాబట్టి యింట్లో ఆయన ఏ పాఠాలు చెబుతాడో తెలుసా?' అన్నాడు బాట్లీయా నాకు సహాయంగా వస్తూ.

'వెళ్లు, వెళ్లు, దొంగ ... నీతో మాట్లాడటం లేదు.'అన్నాడు అస్లమ్.

'ఆయన యింటికి నేను వెళ్లలేదు నువ్వు వెళ్లావు .. కాబట్టి ఎవరు .... ?'

'ఎవరు ఏమిటో నీకు చూపుతాను' అంటూ అస్లమ్ తన శరీరాన్ని పూర్తిగా పెంచి బాట్లీయా మీదకు వంగుతూ బెదిరించాడు.

'వదిలేసి వెళ్లు' అన్నాడు అస్లమ్.

'నా స్నేహితుణ్ణి ముట్టుకోవద్దు' అన్నాడు నయీామ్ నాకు రక్షణగా వచ్చి. ' అయితే మీరందరూ ఒక జట్టు! ఈ చుంచెలుకలా మీరు కూడా ఆ రాక్షసుడి యింటికి వెళ్లి పాఠాలు నేర్చుకొంటారా?' అన్నాడు అస్లమ్.

'అలా అనుకొంటే నువ్వు తెలివి తక్కువవాడివి' అన్నాను ధైర్యం చేసి.

'బాబూ! నూవు గాబరా పడకు. వాడు ఇంతకు ముందు ఆ రాక్షసుడితో ఉన్నాడు గాబట్టి, నువ్వు వెళ్లిన సంగతి వాడికి తెలుసు.' అంటూ బాట్లీయా వున్నట్లుండి అస్లమ్‌ను ఎగతాళి చేశాడు.

'నువ్వు నన్ను అలా అపనిందలు పాలు చేయడానికి, నీ ప్రవర్తన ఏమంత మంచిది గాదు' అంటూ ప్రతిఘటించాడు పొడుగు అస్లమ్.

'అతనికి సమాధానం చెప్పు చాలు.' అంటూ తన భారీ శరీరాన్ని తోసుకొంటూ వాళ్ల మధ్య వచ్చి నుంచున్నాడు, భారీ అస్లమ్.

'నీకు తెలిస్తే నువ్వు సమాధానం చెప్పు. మన తరగతిలో బుద్ధ సింగు మాష్టారికి నువ్వొక్కడివే స్నేహితుడివి.' అన్నాడు నయీామ్

'జానీని మరిచిపోవద్దు. వాడు కూడా ఆ రాక్షసుడి పక్షమే.'

అన్నాడు బాట్లియా.

'జానీని గురించి నాకు తెలియదు. నా గురించి అగౌరవంగా మాట్లాడవంటే నీ తల పగల కొడతాను. నీ కెంత ధైర్యం నన్ను అనడానికి. దొంగవెధవా!' అన్నాడు అస్లమ్.

'బుద్ధసింగు దగ్గర పనిచేసే గోవిందుకు అర్ధరూపాయి యిస్తే, నీ ముందే ఆ రాక్షసుడు నీకు ఏం చేశాడో స్పష్టంగా చెబుతాడు.' అన్నాడు బాట్లియా ధైర్యంగా.

పొడవాటి అస్లమ్ ప్రతి సమాధానం చెప్పలేక పళ్లు కొరికాడు.

'ఇప్పుడు బాట్లియాకు సమాధానం చెప్పు' అని భారీ అస్లమ్, పొడవు అస్లమ్‌కు సవాలు విసిరాడు

' వాడు దొంగ ' అన్నాడు నయీమ్.

'ఇప్పుడు తిట్టరా నన్ను.'అన్నాను ధైర్యం కూడగట్టుకొని.

'గోవిందు బుద్ధసింగు ప్రియుడని నీకెలా తెలుసు? బుద్ధసింగు యింటికి వెళ్లావు గాబట్టి గోవిందు గురించి నీకు తెలిసి వుండాలి.' అన్నాడు పొడుగు అస్లమ్ బాట్లియాతో.

'అవును. నేను వెళ్లింది నిజమే! అంతకు మించి బుద్ధసింగు నా దగ్గరకు వచ్చాడు. 'బాట్లియా నువ్వు చాలా అందంగా వుంటావు. నువ్వంటే నా కిష్టం .... దగ్గరకురా భయపడకు'అన్నాడు. నేను ఆయన దగ్గరగా వెళితే నా తొడల వెనుక లాలించడానికి ప్రయత్నించాడు. నేను పరుగెత్తి వచ్చాను.' అన్నాడు బాట్లియా ధైర్యంగా.

బుద్ధసింగు మాష్టారు నా పట్ల ప్రవర్తించిన తీరు గూడా, ధైర్యంతో పిల్లలతో చెప్పి వుంటే బాగుండేది. కానీ తొందరలో ఏవో మాటలు వదలాను

'నాకు కూడా అదే చేయబోయాడు. నేను పరుగెత్తి వచ్చాను.'

'అయితే మీరిద్దరూ యిప్పుడు తప్పు ఒప్పుకుంటున్నారు.' అన్నాడు పొడగు అస్లమ్.

'నువ్వు వెళ్లినట్లుగా మేము వెళ్లలేదు.' అన్నాడు బాట్లీయా.

బూతులు మాట్లాడుతూ పొడుగు అస్లమ్ బాట్లీయా మీదికి తోసుకొచ్చాడు.

బాట్లీయా అదే రకం బూతులు వాడి వాణ్ణి వెనక్కి తోశాడు.

నేను, భారీ అస్లమ్, నయీామ్ వాళ్లిద్దరి మధ్యావెళ్ళి తగవు తీర్చాము. ఇంతలో విరామసమయం అయిపోయినట్లు గంట మోగింది.

'దీన్ని గురించి నీకింకా ఎక్కువ తెలుస్తుంది. నేను చూపుతా నుగా!' అంటూ పొడుగు అస్లమ్ బెదిరించాడు.

వాడు బుద్ధసింగు మాష్టారితో యిక్కడ జరిగింది చెబుతాడని తెలుసు. మా అందరికీ చావు మూడిందని అర్థమైంది. ఈ విషయం బయట పొక్కడానికి పొడుగు అస్లమ్ దోహదం చేస్తాడా? తాను గూఢ చారి వర్గానికి చెందినవాడైనప్పటికీ బుద్ధసింగు మాష్టారు తిరిగి పనిలోకి చేరిన యిప్పట్లో, ఈ విషయాలను గురించి అందరూ మాట్లాడటానికి వొప్పుకుంటాడా?

మర్నాడు మాకు మొదటి పాఠం బుద్ధసింగు మాష్టారి యింగ్లీషు. ఆయన రావడానికి ముందు వెలుగుకు ముందు దూతలాగా గదిలో నిశ్శబ్దం ఆవరించింది.

నేను బడికి వచ్చే దారిలో దేవుళ్లందరికీ ప్రార్థనలు చేశాను. బుద్ధ సింగు మాష్టారు, ఆయన పనివాడు, పొడుగు అస్లమ్ చనిపోయి, ఈ అవాంతర పరిస్థితి నుంచి మేమందరమూ గట్టెక్కాలి. పొడుగు అస్లమ్ చాలా ధైర్యంగా కూచొని వుండటాన్ని బట్టి, నా పార్థనలు ఫలించలే దని వూహించాను. త్వరలో బుద్ధసింగు మాష్టారు వస్తాడు. ఆయన పనివాణ్ణి వంట చేయడానికి పురమాయించి వచ్చివుంటాడు. అవసరమైతే సాక్ష్యమివ్వడానికి వాడు వస్తాడు.

ఇంతలో నయీామ్ నన్నుగిల్లి, మూతలుబడ్డ కళ్లు తెరుచుకొని చూచేసరికి, ఆ రాక్షసుడు గదిలో ప్రత్యక్ష్యమయ్యాడు.

కుర్చీలో కూచోకుండా, ఆయన పాఠం చెప్పడానికి ఉపక్రమించే ముందు మా వైపుకు తిరిగి, బల్లమీద తిష్ఠవేసి నుంచున్నాడు.

'ఈ తరగతిలో పిల్లలు చదివింది తక్కువ. వదంతులు ఎక్కువ వ్యాపింపజేశారు. అడపాదడపా ఈ గదిలో పిల్లలు మల్లయోధుల్లా ఒకరితో ఒకరు పోటీపడటానికి సవాళ్లు విసిరారని విన్నాను.' అన్నాడాయన.

'మాష్టారు. ఇదంతా పొడుగు అస్లమ్ మొదలెట్టాడు.' భాట్లియా నుంచుని అన్నాడు.

'కృష్ణను ఏడిపించాడు.'

'నువ్వు ఈ చుంచెలుకను సమర్థించావు'

'కానీ, మాష్టారూ.....'

'ఇంక ఒక్క మాటకూడా మాట్లాడకూడదు. నాకు అడ్డు చెప్ప వద్దు......'

'కానీ......'

'నోర్మూయ్'

బెత్తం చేతిలో పట్టుకొని, బల్లమీదనుండి లేచి బాట్లియా దగ్గర కెళ్ళాడు.

'జరిగిందేమిటో కనీసం వినండి మాష్టారూ.' అరిచాడు బాట్లియా.

బాట్లియా ముఖంమీద ఆ రాక్షసుడు వాత పెట్టాడు.

'మాష్టారూ!' అన్నాడు భారీ అస్లమ్.

'నీ వరసకూడా వస్తుంది. ఓర్చుకోలేని వాళ్ల ఎముకలు ఏరేస్తాను.'

అస్లమ్‌మీదికి బెత్తం ఎత్తి ముందు కెళ్లాడు.

బెత్తం సగందారిలో పట్టుకొన్నాడు అస్లమ్. బుద్ధసింగు ఎడంచేతితో ఒక గుద్దు గుద్ది, బెత్తం లాక్కున్నాడు.

'వాళ్లంతా ఒకటే' అన్నాడు పొడుగు అస్లమ్.

'నోర్మూయ్. మీ ప్రాణాలు దక్కాలంటే నోరుమూసుకొని వుండండి. లేకపోతే మీ ఎముకలు విరిచేస్తాను.' అంటూ ఆ రాక్షసుడు వాణ్ణి కొట్టాడు.

'ఈ వూసుపోక కబురు నిజమే. మీరు నా దగ్గరకు వచ్చారు.....' పొడుగు అస్లమ్ నెమ్మదిగా ధైర్యంచేసి అన్నాడు.

బుద్ధసింగు మాష్టారు పొడుగు అస్లమ్ మూతిమీద ఎడం కాలితో తన్ని, కుడి చేతితో ఒకటి, రెండు, మూడు, నాలుగు వాతలు పెట్టాడు.

కుర్రవాడు 'అబ్బా' అని కేక వేశాడు.

'ఇది ఆశ్చర్యంగా ఉంది' అని గొణిగాడు నయీమ్.

'మీలో ఐకమత్యం నాకు తెలుసు. చేతులు చాచండి' అంటూ ఆ రాక్షసుడు కేకవేస్తూ వెనక్కి వచ్చాడు.

నయీమ్ చేతులు చాపి నిశ్చేష్టుడుగా నిలబడి దెబ్బలు తిన్నాడు.

నేను భయంతో వణికిపోతూ ఏడ్చాను.

'ఒరే. చుంచెలుకా! ఈ గొడవకు నువ్వు కారణం.' అంటూ ఆ రాక్షసుడు నా శరీంరపై ఒక వేటు వేశాడు.

'అమ్మో!' అంటూ అరిచాను.

'నోర్మూయ్' ఆయన కోపంతో ఊగిపోతూ నామెడమీద మరో వాత పెట్టాడు.

'ఈ గదిలో ఒక్కమాట బయటకు రాకూడదు. గది బయట ఎవరూ వూసుపోక కబుర్లు చెప్పగూడదు. మీ పాఠం యింకా మీరు చదివినట్లు లేదు.. మీ తల్లిదండ్రులకు గాని, కొత్త హెడ్మాష్టరుకుగాని ఫిర్యాదుచేసి ప్రయోజనం శూన్యం. మీ స్నేహితుడు అబ్దుల్ హమీద్ అడ్డుపడ్డా, నేను యిక్కడికి తిరిగి వచ్చిన తర్వాత మీరూ గుణపాఠం నేర్చుకొని వుంటారు. నేను మళ్లీ మీకు పాఠం అంతా చెప్పాల్సిన ట్లుంది. పుస్తకాలు తెరవండి, ఏడో పుట తియ్యండి.'

పుస్తకాలు తెరిచే శబ్దంతప్ప మరో శబ్దం రాలేదు. మమ్మల్ని అందర్నీ ఆయన తలలువొంచాడు మరో వందసారి నేను ఖైదులో వున్నట్లు తలపోశాను భగవంతుడనేవాడు లేడు, నేను ఎంత భయపడినా, మృత్యువు కంటె మరో మార్గంలేదు. కౌసల్యతో చేరి పోదామని అనుకొన్నా మార్గంలేదు. దేవుడనే వాడుంటే ఈ అమాయకపు పసిపిల్లలు శిక్ష అనుభవిస్తూవుంటే ఆయన సిగ్గుతో చనిపోయి వుండాలని నా అంతరాత్మ ఘోషించింది.

# 11

వేదాంత ధోరణి నా జీవితంలో భాగమై పోయింది. ప్రపంచమనే మాయ, భగవంతుడు, దేవుడు, మాయాజాలం, కర్మ, సుకృతం — ఈ మాటలన్నీ భారతీయుల యిళ్లలో కొన్ని ఏళ్లుగా ప్రశ్నలుగా నిలిచిపోయి, మన శబ్దజాలంతో నిత్యం నిలిచిపోయాయి. కాని, మానవులు వాటిని యధాతథంగా స్వీకరిస్తారు. నా ఏకాంతంలో నేను తిరగసాగాను గాబట్టి ఈ ప్రశ్నలను నాలో నేను నిష్కపటంగా వేసుకొన్నాను. ఏకాంతంలో విధి, పురాకృతం నన్ను సతమతం చేయ సాగాయి. వునికిని గూర్చిన మాయాజాలాన్ని పరిష్కరించాలని నిశ్చయించుకొన్నాను.

ఒక విధమైన నరకంలోకి నేను త్రోసివేయబడ్డానని, అనేక మార్లు చెప్పారు. అందులోంచి బయటపడే మార్గంలేదు. ఇవన్నీ నా పూర్వజన్మ దుష్కృతాలవల్ల కలిగాయని అమ్మ చెబుతుంది. ప్రతాప్ బాబాయి కూతురు కౌసల్య చనిపోవడం, గణేశ్‌ను దత్తకుమారుడుగా స్వీకరించి దేవకి నాకు దూరంకావడం, ఆగాఖానీ తల్లిదండ్రుల యింట్లోంచి ద్రౌపది బుద్ధ సింగు మాష్టారు తిరిగి పనిలో చేరడం, — ఇవన్నీ నా పూర్వజన్మ పాపాలవల్ల నాకు దండనలుగా విధించబడ్డాయి ఆ పూర్వజన్మలను గూర్చి నాకు ఏమాత్రం తెలియదు అదొక్కటే నాకు తోస్తున్న సమాధానం

భగవంతుడు మానవుల పాపాలను, పుణ్యాలను లెక్కకట్టి, వాళ్లు పునర్జన్మలో ఏఏ రూపాల్లో జన్మించాలనేది తీర్మానిస్తాడు. ఒకవేళ భగవంతుడు ఉన్నాడనే అనుకొందాం. ఆ ఆదిమధ్యాంతరహితుని ఉనికిని గూర్చి నాకు అనేక పర్యాయాలు అనుమానం కలిగింది. పూర్వజన్మలో మానవుడు చేసిన పాపాలకు తాను తగిన ఫలితాలను అనుభవిస్తాడని అనుకొందాం. ఆ జన్మలో చేసిన సుకృతాలకు ఈ జన్మలో ఫలితం యివ్వడం లేదు. ఉదాహరణకు అమాయకపు కౌసల్య శివతో బొమ్మల కోసం పేచీ పెట్టుకోవడమనే తప్పచేసి వుండవచ్చు. దానికి ఫలితంగా ఆమె క్షయ వంటి దీర్ఘవ్యాధితో చనిపోవడమనే దండన విధించబడింది. అది ఆమెకు తగిన దండన కాదు. కాబట్టి దేవుడు తప్పటడుగు వేశాడని ఆయనను నిలదీసి అడిగాను — ప్రజల తప్పొప్పులకు తీర్పు చేప్పే దండనాధికారం నీ చేతిలో వుంటే నా చెల్లెలిని నీవెందుకు శిక్షించావు? చిన్నపిల్ల అయినప్పటికీ ఆమె ఉదయం, సాయంకాలం నీ ప్రార్థన చేయడం మరిచిపోలేదు. పూర్వ జన్మలలో ఎంత క్రూరురాలైనప్పటికీ, భగవంతుడు ముంతాజ్‌ని వేశ్యగా పుట్టించడంలో ధర్మమున్నప్పటికీ, ఆవిడ దేవదూతలా మంచి పనులు చేయడమే నాకు గుర్తుకు వస్తున్నాయి. ఆమె భక్తి శ్రద్ధలతో హరీష్‌ను అమితంగా ప్రేమించింది. కాని, అతడు ఆమెను నిరాకరించాడు. అతడు తనను ద్వేషించే ద్రౌపది పుట్టింటికి పంపివేసి ముంతాజ్‌ని పెళ్లాడ లేకున్నాడు. దయామయుడైన హెడ్మాష్టరును బయటికి పంపించి వేశారు. క్రూరాత్ముడైన బుద్ధసింగును తిరిగి చేర్చుకున్నారు!

అది మధ్యాంతరహితుడైన భగవంతుని వునికిని గూర్చి, సనాతన మతవాదులు చెప్పేదానికి భిన్నంగా నేను చిన్నతనంలో ఎప్పుడైనా అనుమానించడానికి ప్రయత్నించి వుంటే, 'విధి' అనేది - న్యాయము, దయామయము అయితే ఇప్పుడు లూధియానాలో నేను ఖైదులో వున్నప్పుడు బయటికి రావాలి. విధి చేతిలో కీలు బొమ్మలైన మిగతా మానవులను కూడా నేను గమనించాను. భగవంతుడు న్యాయమనే పేరుతో చేసే అన్యాయాన్ని చూసి సహించలేక నేను ఎదురు తిరిగాను — 'నీవు అనంతాకాశంలోంచి మావైపు తేరిపార చూస్తూ

వుంటావుగాని, మా సమస్యలు నీకు తెలియవు.'

నీ చుట్టూ వున్న వారంతా భగవంతుణ్ణే నమ్మారు.

అమాయకులైన ఈ ప్రజలు విశ్వసించే భగవంతుని గూర్చి సత్యస మ్మతంగా చెప్పే విషయాలను నేను ఖండించాను. ఏకాంతంలో నేను ఆ ప్రశ్నలను గూర్చి ఆలోచించసాగాను ద్వేషమనే పండ్ల రూపంలో కనిపించే ఈ అనుమానాల విత్తనాలు నాలో మొలకెత్తడానికి కొంత వ్యవధి దొరికింది

నాలోని ద్వేషం విశిష్టం. మా అన్నపై ద్రౌపది చూపే క్రూరత్వం వంటిదిగాదు. భగవంతుని ప్రతిరూపాన్ని అగ్ని మధ్యంలో కూచో బెట్టగలిగిన విప్లవజ్వాలల ఎర్రదనం అది నేను చూసిన దేవుళ్ల ప్రతిబిం బాలపట్ల అసహన మది. ప్రార్థనలపట్ల విముఖతను చూపటం వంటిది భగవంతుని ఆరాధనను త్రోసిపుచ్చటం వంటిది.

నా అంతరాత్మ లోలోపల భగవంతునిపట్ల భయమూ, భగవంతుని శక్తిపట్ల విశ్వాసమూ వుండటంవల్ల భగవంతుడున్నాడేమోనని ఒక విధ మైన భయం ఏదో ఒకమూల దాగి వుంది భగవంతుడనేవాడు వుంటే నేను ఈ విధంగా తిరుగుబాటు చేస్తూ వుంటే ఆ సర్వాంతర్యామి నాకే విధమైన హాని చేస్తాడో తెలియదు

ఖైదీల తోటలో ఏకాంతంగా నిల్చుని భగవంతుని ఎదిరిస్తూ, ఆయన్ని ఇలా పిలిచాను— 'ఓ నిరంకుశా! హింసాత్మకా! నీకు శక్తివుంటే నేను చేసిన పాపాలకు ఇప్పుడు నన్ను చంపివెయ్యి నీకు కోపం తెప్పించటానికి నీ ముఖంమీద వుమ్మి వేస్తున్నాను '

నాకేమీ జరగలేదు సరికదా నా దగ్గరకు నేను భయపడ్డ దయ్యాలు కానీ, మరెవ్వరు కానీ రాలేదు నాకు తోచిన రీతిలో నేను నాటకీ యంగా భావించిన పద్ధతిలో నడవసాగాను. మరలా — 'నీ యిష్టం వచ్చినట్లు చేయి! బుద్ధసింగు మళ్ళీ కొట్టనీ, ద్రౌపది ఇంకా హీనంగా చూడనీ, నన్ను నరికివేసినా నీవు ఎక్కడైనా, నేను నిన్ను గురించి ఎక్కువగా ఆలోచించను '

అదే విధంగా నా తల్లిదండ్రులను గురించి కూడా వ్యతిరేకంగా అనుకోసాగాను— 'ద్రౌపది హరీష్కు వ్యతిరేకంగా వుందనీ, నాపట్లగూడా అగౌరవంగా ప్రవర్తిస్తోందనీ, వాళ్ళకు తెలియదా? గణేశ్‌ను దేవకికి దత్తత యిచ్చేటప్పుడు ఆవిడను నేను అభిమానిస్తున్నానని తెలియదా? ద్రౌపది అంటే పక్షపాత బుద్ధిని కలిగించిన అమ్మ, నన్ను వదినకు దూరంగా ఎందుకు తీసుకెళ్ళలేదు. బుద్ధసింగు మాష్టారి రాక్షసత్వం వారికి తెలియదా? భగవంతుడు దయలేనివాడైతే, నన్ను ప్రేమించి పెంచి పెద్దచేసిన వారికెందుకు దయలేదు.'

బహుశా దేవదత్త బాబాయి చెప్పిన మార్గమొక్కటే అనుసరించ దగిన పద్ధతి. ప్రజల అబద్ధాలనూ, మూఢనమ్మకాలనూ, ఎదిరించి పరిశుద్ధ సత్యాన్ని నమ్మాలి. ప్రజలు చెడు సంప్రదాయాలను నమ్మక పోతే, ఈ కపట మార్గాలన్నీ, తుడిచి పెట్టుకుపోతాయి. ఉదాహరణకు కులము, మతము నశిస్తే, హరీష్ ముంతాజ్‌ను పెండ్లాడుతాడు. చెడ్డ మనుష్యులను, గూఢచారులుగా నియమించిన పరాయి ప్రభుత్వం ప్రజలను పరిపాలించటానికి, వారిలో కలతలను రేపుతున్నది విప్లవం ద్వారా వారిని ఎదుర్కోగలిగితే న్యాయము, ధర్మమూ నెలకొంటాయి. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పనిచేసేవారు నినాదం చేసే 'ఇంక్విలాబ్ జిందాబాద్' అనే మాటలకు నిండైన అర్థం వుండే వుంటుంది. వాళ్ళ మనసు లకు సరిపడేలా తమ జీవితాలను ఈ విప్లవకారులు సృష్టించుకో గలరు. మనల్ని బలహీనులుగా పాలకులు తయారు చేశారు. మనం పాలకుల్ని తరిమివేయగల్గితే ఇంకెన్నడూ పిరికి తనం మనలను ఆవరించదు

ఆక్షణంలో ప్రపంచమంతా కుళ్ళిపోయినట్లుగా నాకనిపించింది ప్రభుత్వంపట్ల విసుగెత్తడంవల్ల కానీ, తమలో తమకు అసౌఖ్యంవల్ల కానీ పెద్దలు అసంతృప్తి చెంది, చిన్నపిల్లలు తమకు విధేయంగా లేరని ఘోషిస్తారు. వారివారి కులాల హోదానుబట్టి పేదవారు, తక్కువవారు అనే భావాన్ని పోగుచేసుకొని వారికంటె తాము గొప్ప వారమని మరి కొందరు సరదా పడతారు. నేనూ, గణేశ్ తరచూ భావించినట్లు తమ తల్లిదండ్రుల ఘనతను గూర్చి పిల్లలు గొప్పలు చెప్పుకుంటారు. అసం తుష్టులైన ప్రజలు సమస్తమూ భగవద్దత్తమని సరిపెట్టుకుంటారు. కుల

తత్వంతో కుళ్ళిపోయి దుర్గంధ భూయిష్టమైన ఈ జీవితం యధావిధిగా సాగిపోతూనే వుంది.

సూర్యకిరణాలు భూమిపై మూరుమూలల్లో అన్వేషణ సాగించి నట్లు, నావూహల బాణాలు పరుగెత్తసాగాయి. నా చిన్న పిల్లవాని బుర్రలో యువకునిలోని గర్వమూ, ఆతురతా చిడిముడి పడ్డాయి. నేను సహేతుకంగా ఆలోచిస్తూ, భావాలకూ ఆలోచనలకూ మధ్య తేడాను గమనించగల్గుతున్నందుకు గర్వపడ్డాను. నా ఉచ్ఛ్వాస నిశ్వాసలలో ఈ మార్పు స్పష్టంగా కనిపిస్తోంది.

జీవితమంతా బుద్బుదప్రాయమనీ, విషాదభరితమనీ నేను సమకూర్చుకొన్న ఆధారాలు నా ఆలోచనలను బలహీనపరచాయి. జైలు పిల్లలు ఎవరైనా వస్తే, వారితోవెళ్లి ఆడుకొందామని ఎదురుచూశాను.

సాయంకాలం చీకటిపడగానే యింటికి తిరిగివస్తున్నప్పుడు, ఆలోచనలు, చిందరవందరగా మారి, సూర్యకాంతిలో ఆలోచనాశక్తి అధికమవుతుందనీ, సహేతుకంగా ఆలోచించడానికి వీలవుతుందనీ తెలుసుకున్నాను. భయంకరమైన రాత్రి సుదీర్ఘమై తిరిగి నరకంలోకి ప్రవేశిస్తున్నామనిపించింది. పెద్దల మాటలద్వారా నాలో ఏర్పడిన భయాల విశ్వరూపం నన్ను వెంటాడి, బలహీనుడను, పసివాడిని అయిన నేను పెద్దల దయాదాక్షిణ్యాలపై బ్రతకవలసి వస్తున్నది. ఎవరితోనూ చెప్పుకోలేక నాలో నేను వణకసాగాను.

ఇప్పుడు హేతుబద్ధంగా ఆలోచించ లేకున్నాను. శరీరం భయాలకు లోనయింది. భౌతిక శరీరంలోకి వాదన అనే శక్తి ప్రసరించలేకుంది. ఒకవేళ సత్యమనేది తెలిస్తే, దాన్ని జీర్ణించుకోవడం ఎలా అనేది సమస్య!

వేసవి సెలవులకు జూన్ మాసంలో బడి మూసివేశారు. నా తోటి విద్యార్థుల సాహచర్యం లభించక, నాలో నేను ఒంటరితనంతో మరీ అధికంగా బాధ పడ్డాను. జీవన్మరణాల రహస్యాన్ని ఏదో ఒక రోజు తెలుసుకోవాలని నిర్ణయించుకొన్నాను. పుస్తకాలను జీర్ణించుకోవాలి. నీ ముందు బహిర్గతమైన వేదాంతసారాన్ని తెలుసుకొవడానికి ప్రతికీలకమైన అంశాన్ని విశిష్టమనస్తత్వంతో శోధించాలి.

ఒక రోజు బంతి ఆట జైలు కుర్రవాళ్లతో ఆడి, శారీరకవ్యాయామం వల్ల కలిగిన అమితోత్సాహంతో, చెమటతో తడిసిన నా పెరుగుతున్న శరీరంపై గర్వంతో తిరిగివచ్చాను. వంటగదిలోకి చేతులు కడుక్కోకుండా వెళ్లి మంచినీళ్లు తాగ బోయాను.

మావదినె ఆగాఖాన్ ప్రార్థనలు చేస్తూ ఏదో మంత్రాలు జపిస్తూ లేచి వచ్చింది. ఆవిడ నాకు మంచినీళ్లు అందివ్వబోతున్న దనుకొన్నాను. దానికి బదులు ఆవిడ సగర్వంగా నడిచివచ్చి నా చెంపపై చెళ్లున చరిచింది. నా చేతిలో ఇత్తడి చెంబు నేలపై పడింది

"టేడ్చేవాడా?" అంది ఆమె.

'నువ్వే వూడ్చేదానివి! నీ కంటె ముంతాజ్ నాకు వదినెగా బాగుండేది. నీ కాలిన మొహం నువ్వు' అన్నాను ఎదురుతిరిగి.

'ఆ రహస్యం బయటకు పొక్కుతోంది. మీ వదినెను గూర్చి నీకు తెలుసు, నీవు కూడా ఆ వేశ్య యింటికి వెళ్లు. యిక్కడ వుండి నా పాత్రసామాను భ్రష్టుపట్టించడ మెందుకు?'

'నువ్వు వస్తే వెళతాను. ముందుగా ఎలా వెళ్లేది?' అన్నాను ఏడుస్తూ. ఈ సమయంలో హరీష్ లోపలికి చేతిలో కర్ర వూపు కుంటూ వచ్చాడు. కళ్లి నములుతూ పెదాలు మరకలు ఏర్పడ్డాయి. తాగినమైకం యింకాపదలలేదు. బయటనుంచి నా మాటలు, ఏడుపు విన్నాడు. లోపలికి వస్తూ అడిగాడు

'ఇదంతా ఏమిటె?'

'కృష్ణ మరిచిపోయి మరికి చేతులతో యిత్తడి గ్లాసు తీసుకొని వంటగదిలో బిందెలో ముంచాడు. వాళ్ల వదినె చెంపలు వాయించింది.' వార్డరు జయసింగు వివరణగా చెప్పాడు.

నెమ్మదిగా హరీష్ నా వద్దకు వచ్చి, ఏడుస్తూ కూచున్న నన్ను ఎత్తుకోబోయాడు.

అతని స్పర్శలో మృదుత్వాన్ని, గుసగుసలాడే ధోరణిలో అతను

'బాధ పడకు బాబు!'అన్న మాటల్లో సానుభూతిని గ్రహించాను.

'నన్ను ఆవిడ ద్వేషిస్తుంది కాబట్టి కొట్టింది. ఈ అవకాశం కోసం ఆవిడ నెలల తరబడి ఎదురుచూస్తోంది.' అని అరిచాను.

'నాకు తెలుసు. నిన్ను యింకెప్పుడు ఆవిడ కొట్టకుండా చూస్తాను.' అన్నాడు అతను తూలిపడబోతున్నాడు. చేతులు వణకుతున్నాయి.

'అతను కూడా నీ పక్షమే. ఇద్దరూ వూడ్చేవాళ్లు. మీ వుంపుడు గత్తె ముంతాజ్ వద్దకు వీణ్ణి తీసుకెళ్లండి. వదిన కంటె ఇతనికి ఆవిడ అంటె యిష్టం. అతనికి కూడా పేడ, మూత్రము తాగేది నేర్పండి ' ద్రౌపది అంది.

'అనవసరంగా వాగకు.' హరీష్ కళ్ళు హంతకుడిలా ఎర్రబడ్డాయి. 'నీ ఎముకలు ఏరేస్తాను. జాగ్రత్త!' అంటూ నావైపుతిరిగి 'బాబూ! కృష్ణ! నాతోరా. మనం కలిసి తిందాం. నీకుతోడు వస్తాను రా!'

అడవి మధ్యలో వున్న నేను ఆ వాతావరణంలోంచి లేచి అతణ్ణి అనుసరించి నడిచాను.

జైలు రోడ్డుమీద అరమైలు నడిచాము. హరీష్ నన్ను నూరా యింటివైపు నడిపిస్తున్నాడు. దారిలో ముంతాజ్ పేరు ద్రౌపదికి ఎలా తెలిసింది? అని అడిగాడు. ఆవిడ నన్ను 'మరో వదినె' మీదపక్షపాతం చూపుతున్నారన్నప్పుడు, నేను ఆవిడ పేరు చెప్పాననీ, అందులో దాచు కోవలసిందేమీ లేదనీ, నేను వున్నమాట చెప్పాను. నా సత్యసంధతపట్ల అతను మెచ్చుకొన్నాడు. ఏదో ఒకరోజు ఎవరి ద్వారానో ఒకరిద్వారా సత్యం బయట పడకపోదని అతని విశ్వాసం.

ముంతాజ్ గురించి ప్రపంచానికి తెలిసినా ఫర్వాలేదు. ఆవిడ తన చెల్లెలు మోతీవద్దకు తరచూ వస్తుంటుంది. ఆవిడ నూరా భార్య. ఆవిడను చూడటానికి ముంతాజ్ వస్తుంది. ముంతాజ్ వద్ద ద్రౌపది యింట్లో కంటె సౌఖ్యం దొరుకుతుంది గాబట్టి తాను వాళ్ల యింటికి వెళ్తారు. ఈ విషయాలు అందరికీ తెలిసినా ఫర్వాలేదని హరీష్ భావన

ముంతాజ్ పేరు వుచ్చరించడంతో నాలో ధైర్యం కలిసింది

డను చూసి చాలా రోజులైంది. వేశ్యల వీధిలోవుండే ఆవిడను చూడటానికి నేను వెళ్తుంటే, హరీష్ నన్ను చెడగొడ్తున్నాడనీ, చెడ్డ వాళ్లయింటికి తీసుకెళ్తున్నాడనీ అంటారని అన్నాడు. ఆవిడ గత స్మృతులమధ్య నేను వూగిసలాడినా, వాటి భావోద్రేకాలను నేను అణచుకున్నాను. వడివడిగా పెద్ద అంగలువేస్తూ నడుస్తున్న మూఅన్న వెంబడి ఉత్సాహంగా వెళ్తున్నాను.

తలుపు తీయడానికి వచ్చిన నూరా నోట్లో ముద్ద వుంది. బహుశా, వాళ్లు అప్పుడే భోజనానికి కూచొని వుంటారు.

'మీ యింట్లో మాంసం తినడానికి మీరు పిలవకపోయినా మేమే స్వయంగా వచ్చాం. యింకా మిగిలి వుందో! లేదో!' అన్నాడు హరీష్.

'తప్పకుండా. మీకు స్వాగతం.' భుజంపై చేయి వేసి లోపలికి తీసుకెళ్తూ అన్నాడు నూరా.

'మేమంటే నీకంత భయమెందుకయ్యా! ఈమధ్య కనిపించడం మానేశావు. మీ శత్రువు బుద్ధసింగు తిరిగి చేరాడని విన్నాను.' అన్నాడు నూరా, నాగడ్డం పట్టుకొని బుజ్జగిస్తూ.

'ఎవరక్కడ?' నూరావాళ్ల ముసలితల్లి మేడమీదినుంచి పిలిచింది.

ఆమాట వెంబడి ముంతాజ్ సుమధుర కంఠం వినిపించింది:

'అతని కడుపులో మంట కలిగితే, మన యింటికి స్వయంగా వస్తాడు. అప్పుడు మనమీద దయ కలుగుతుంది.'

'ఇదుగో కృష్ణ యిక్కడికి వచ్చాడు. అతని 'కడుపులో మంట'తో వచ్చాడు' అన్నాడు హరీష్.

'నేను అతనికోసం ఏమైనా చేస్తాను.' అంటూ ఆవిడ మెట్లు గబగబా దిగివచ్చి, నన్ను ఎత్తుకొని, వళ్ళంతా ముద్దులతో ముంచెత్తింది.

'మవ్వంటే అతనికి అభిమానం. అందుకని వాళ్లవదినె అతన్ని కొట్టింది. అతను ఏడుస్తున్నాడు.'- ఎగతాళి ధోరణిలో అన్నాడు హరీష్.

'హరీష్ చేత ఆవిడను కొట్టిద్దాం. ఏదీ, నీకన్నీళ్లు ముద్దెట్టుకోనీ!

ఇలారా!' అంటూ ముంతాజ్ మా అమ్మలాగా నటించింది.

ఆవిడ నన్ను మేడమీదికి లాక్కెళ్లింది. ఆవిడ అంటే నాగుండె కొట్టుకో సాగింది. ఆవిడను వదలడం నాకు యిష్టంలేదు.

'అతనికోసం ఎంత త్యాగమైనా చేస్తాం. ఇక్కడ మేమున్నది దేనికి? నేను ఖైదులో పనిపూర్తి చేసుకొని వస్తుంటే ఫుట్‌బాల్‌తో నన్ను చావబాదాడు. ఈ ముసలిదాని దగ్గరకు రా నాయనా!' అంటూ నూరా తల్లి ఏడ్చింది.

'ఇతను నాకు కొడుకుతో సమానం. నాతోకూడా అతను భోంచే స్తాడు.' అంది ముంతాజ్ నన్ను అదిమి పట్టుకొని. ఆవిడ భోజనంమీద అందమైన గుడ్డ కప్పబడి వుంది.

'నువు అతణ్ణి పాడుచేస్తావు. అతనికి వేరే వడ్డిస్తాను.' అంది మోతీ.

'మోతీ మీ వదినెతో సమానం. ఆవిడ సనాతనవాది.... అతను నాతో భోంచేస్తాడు. హరీష్! మనమందరం సుఖమయమైన కుటుంబం లోవలె కలిసి భోంచేద్దాం.' అంది ముంతాజ్.

'రండి. మున్షీగారూ! మీకు వడ్డిస్తాను.' అంది నూరాతల్లి.

'వుండమ్మా! అతనికి కొద్దిగా మద్యం యివ్వాలి.' అన్నాడు నూరా.

'అలానే కానీ, నీయిష్టం వచ్చినట్లు చెయ్యి. అతనికి మంచి మాంసం ముక్కలు పెడితే నీకు వుద్యోగం యిప్పిస్తాడని ఆశపడ్డాను.' అంది తల్లి.

'నిజంగా విస్కీ ఆ తమాషా చేయిస్తుంది.' అన్నాడు నూరా.

'చాలామంది ఎం.ఏ చదివినవాళ్లు రంగంలో ఉన్నారు. నూరా కేవలం మెట్రిక్ చదివాడు.' అన్నాడు హరీష్.

'వాళ్ల అమ్మ జైలులో వార్డరుగా పనిచేస్తోంది. ఆవిడకు ప్రభు త్వంలో పలుకుబడిలేదు.' హరీష్‌ను వుడికిస్తూ అంది నూరాతల్లి.

'నాకు త్వరగా ఒక కారు కొని యివ్వమని అడుగుతున్నాను.'— ఏదో పెద్దిగీతం పాడుతూ నవ్వులాటకు మోతి అంది.

'కారులో షికారు కెళ్లి
హుషారుగా షికార్లు చేసి వద్దామా!
ఎండవేడి చెమట పట్టిస్తోంది' అంటూ మోతీ పాడింది.

మోతీ ఎప్పుడూ 'అది కావాలి, యిది కావాలి:' అంటుంది — తన చిన్నయింట్లో విద్యుద్దీపాలు కావాలి అంటుంది. బల్లమీద ఫ్యాను కాకుండా, వేలాడే ఫ్యాను కావాలి. కోటకు ఎదురుగా గాని, లేక ప్రముఖమైన వీధిలోగాని బంగళా కావాలి. బ్రౌన్ ఆసుపత్రిలో నర్సులు అర్ధనగ్నంగా తిరగడం చూసింది. కాబట్టి తానుకూడా గౌను వేసు కొంటా నంటుంది. ఎత్తు మడమల చెప్పులు, దానిపై బంగారు చీలలు కావాలి. గోడ గడియారము, బ్రౌన్ నెత్తిమీద పెట్టుకొనే టోపీవంటి టోపీ ఆవిడకు కావాలి.'

'మీరు భోజనం చేయుడానికి బల్ల, కుర్చీలు చెప్పలేదు.' అంది మోతి నవ్వులాటకు. 'యింటినిండా సిల్కు తెరలు, నిలువెత్తు అద్దం, పాటలు వినడానికి గ్రామఫోను.....'

'ఆవిడ సరదాలు చూడు హరీష్! అసలు మనిషి పాడటంవద్దు. పెట్టెలో దాచిపెట్టిన మనిషిపాట కావాలి.' ఎద్దేవాచేస్తూ అంది ముంతాజ్.

' "హిజ్ మాస్టర్స్ వాయిస్" వారి బొమ్మలో కుక్కవలె విశ్వా సపాత్రంగా ఆవిడ పెట్టెముందు కూచొని కలకత్తాకు చెందిన జొహార్ ఖాన్ పాట పాడుతుంది.' హరీష్ వ్యాఖ్యానంగా అన్నాడు.

'లూధియానాలో ఏదో నాటక కంపెనీవారి పనిమీద జొహార్ ఖాన్ వస్తున్నాడని విన్నాను' అంది మోతీ స్పష్టంగా.

'ఆవిడ పాట వినాలని వుంది. ఆవిడ గొంతు యింకా మధురంగా ఉందని విన్నాను.' అంది ముంతాజ్ సిగ్గుపడుతూ.

'మనలనందరినీ మున్షీగారు ఆ నాటకానికి తీసుకెళ్తారులే' అన్నాడు

నూరా వూరిస్తూ.

'కృష్ణ మగతగా నిద్రపోతున్నట్లున్నాడు. యింటికి తీసుకెళ్లాలి' అన్నాడు హరీష్.

వాళ్లందరూ సరదాగా మాట్లాడుకొనే మాటలు నేను వినకూడదని అతను అనుకొంటున్నాడని నిర్ధరించుకొన్నాను.

'ముందు భోజనం చెయ్యి నాయనా!' అంది నూరాతల్లి హరీష్‌తో.

'ఈ రాత్రికి పిల్లవాడు యిక్కడే నిద్రపోతాడు. యింటికెలా తీసుకెళ్తారు.' అంది ముంతాజ్.

'అన్నయ్యా! యిక్కడే పడుకొంటాను.' అన్నాను బాధగా.

'నా వొడిలో తలపెట్టుకొని నిద్రపో.' అంది ముంతాజ్.

ఆవిడ రక్తనాళాల్లోంచి ప్రవహిస్తున్న సుగంధానికి మైమరచి ఆమె దగ్గర పడుకొన్నాను. వాళ్ల మాటలు విందామని ఆసక్తిగావున్నా, మగత నిద్రవల్ల పొడి పొడి మాటలు మాత్రం నాచెవిలో దూరసాగాయి. హరీష్ వారికి వీడ్కోలు చెబుతున్నప్పుడు నేను సగం నిద్రలో వున్నాను. ముంతాజ్ గొంతులో కొత్తదనం పెచ్చుపెట్టుకొని ఎగతాళిగా ఒకపాట పాడింది

'ప్రేమ దాహంతో అలమటించకు! ప్రేమికా!
వీడ్కోలుకు ఎప్పుడూ త్వరపడకూ!'

హార్మోనియంమీద వారిద్దరూ ఆపాటను యుగళగీతంగా ఒకటికి రెండుసార్లు పాడినట్లు హరీష్ గొంతు కలిపి పాడాడు:

'నాముందర ముసుగెందుకు?
పరులముందు ముసుగుదాల్చు'

ఆపాట తర్వాత యిద్దరూ విరగబడి నవ్వుకొన్నారు. హరీష్ మెట్లుదిగి వెళ్లాడు.

ఆరాత్రి ముంతాజ్ నాతోపాటు నేలమీద దగ్గరగా పడుకొంది.

నా చేతులు ఆమెపై వేసి పడుకొన్నాను. ఆవిడ బిడియంలేని దానిలా అత్తరులు పూసుకొంటుంది. ఆ సువాసనల పరిమళంలో మత్తెక్కిపో యాము. ఆవిడ తన జుత్తు ముడి విప్పి దిండుపై వేసింది. మగత నిద్రలో నాముఖం ఆ ముంగురుల్లో యిరుక్కు పోయింది. ఆవిడ ప్రేమతో నాముఖకం నిమురుతూ, నిద్రలేస్తానేమోనని భయంతో, మృదువుగా తల్లి వలె లాలించింది. ఆవిడ యితరులపై ప్రేమ చూపించడమనేది సహజ సిద్ధంగా అలవరుచుకొంది. ఆ ప్రేమ నాపై చూపింది. ఆరాత్రి నాలో మగతగా మేల్కొన్న కోరిక గుర్తుకు వచ్చింది. నేను పెద్దవాడి నైతే, సంఘంలో కట్టుబాట్లకు భయపడి హారిష్ ఆవిడను పెళ్లాడటానికి ముందుకు రావడం లేదుగాబట్టి, ఆవిడ కులం గూర్చి పట్టింపులు లేకుండా నేను పెళ్లాడుతాను. ఆ చీకట్లో మళ్లీ యింటికి వెళ్లవలసిన విషయాన్ని గూర్చి భయపడ్డాను. నా అమాయకపు ముఖంపై ఈ సుగంధాల పరిమళాలు ప్రసరించడం ఎంతో ఆనందంగా వుంది.

ఆవిడను అదుముకొని పడుకొన్న ఆరాత్రి ఎంత మధురం! తరు వాతి భయంకరచరిత్రగల రాత్రులకు అది ఎంత దోహదం చేయగలదు? ఆమె దగ్గర పడుకొన్న విషయం సిగ్గుపడుతూ చెప్పుకోవాలి. వేశ్యలపట్ల హేళనా భావము, ద్వేషమూ నాలో ప్రజ్వరిల్లజేసిన దానికంటె భిన్నంగా ఆమె నాపట్ల అనురాగం చూపింది.

మరువాడు ఉదయం నూరాతల్లి తన పనికి జైలుకు వెళుతూ నన్ను యింటివద్ద దిగబెడతానంటే నిరాకరించాను. ఆరాత్రి అంతా నేను యింటికి వెళ్లకుండా, ఎవరి దగ్గర ఎక్కడ పడుకొన్నానో ద్రౌపది సులభంగా వూహించగలదు. ఆవిడకు ముఖం చూపించడం కష్టం.

మహమ్మదీయులు ఉదయమే చేసే టిఫిను, వేడి వేడి తేనీరు, రొట్టెలు నాకు బాగా తృప్తి నిచ్చాయి. భోజనం తర్వాత నూరా, మోతీ, ముంతాజ్, నేను ఫుట్ బాల్ ఆటను టెన్నిస్ బంతితో ముందుగదిలో ఆడాము. మధురానుభూతులతో వేగే స్త్రీలు వివిధంగా ఊగిపోతారో వూహిస్తూ, నేను, నూరా పగలబడి నవ్వాము. చాలా సార్లు నూరా ముంతాజ్ని ముట్టుకోవడానికి ప్రయత్నించడం గమనిం చాము. చెప్పలు తడబడ్డట్లు ఆవిడ వొరిగి పోవడమూ, వాళ్ల మరిది

ఆవిడను తన చేతుల్తో లేవనెత్తడమూ చూశాను. తన అక్కకు, భర్తకు మధ్య ఈ సన్నిహితత్వాన్ని మోతీ పట్టించుకోలేదు. ఆవిడ నన్ను కూడా ప్రోత్సాహించినట్లుంది. ముంతాజ్ పై హరీష్ హక్కులను గూర్చి అనూయపడ్డాను. గతరాత్రి నేను ఆవిడకు దగ్గరగా పడుకొన్న విషయం గుర్తుకు వచ్చింది.

మేమందరము చెమటలో తడిసిపోయాము. నూరా మావద్ద నుండి లేచి గడ్డం చేసుకోవడానికి వెళ్లాడు. మోతీ స్నానానికి వెళ్లింది. ముంతాజ్ నాకు స్నానం చేయించి, తాను స్నానం చేయడానికి తలుపు మూసుకొంది.

మే మందరం చల్లని తేటమజ్జిగ తాగాము. లూధియానా వీధిలో వస్తువులు కొనడానికి మోతీని నూరా టాంగాలో తీసుకెళ్లాడు. టాంగా వెనక పర్దా తగిలించి వుంది. ముంతాజ్ ముస్తాబవటానికి మొదలు పెట్టింది. కళ్లకు కాటుకతీర్చి, తలకు చమురు పెట్టుకొని, వొంటికి సుగంధ పరిమళాలు అలముకొంది, నే నావిడ పక్కన కూచొని బంతి ఆట ఆడుతూ కూచొన్నాను. అలా ఆడటంలో బంతి మాటిమాటికి కింద పడుతోంది. ఆవిడ నా అవస్థ గమనించి తన సున్నితమైన వేళ్లతో బంతిని తీసుకొని వంద సంఖ్య లెక్క పెట్టేవరకు బంతి కింద పడకుండా ఆడింది. నేను ఓడిపోవడానికి బాధపడుతూ, ఆవిడ అవలీలగా ఆడటానికి మెచ్చుకొన్నాను. నా చేతిలోకంటె, ఆవిడ చేతిలో బంతి ఆవిడ ముఖచ్ఛాయలు పడి తళతళా మెరుస్తోంది. ఆవిడ ముస్తాబు పూర్తి చేసుకొంటోంది. ఆవిడ నాకళ్లకు కాటుక దిద్ది, చిరునవ్వు నవ్వి నాతలపై ముద్దు పెట్టుకొంది. నేను ఆవిడను ఆరాధించసాగాను. ఇంటికి వెళ్లడానికి యిష్టపుట్టడంలేదు. ఏదో ఒక విధంగా ద్రౌపది పీడ విరగడయి, హరీష్ యింట్లో నుండి ఆమె వెళ్లిపోతే బాగుండు ననిపించింది. నిన్న వాస్తవాన్ని గ్రహించడంలో మా అన్న ధైర్యం చూపినట్లే యిప్పుడుకూడా ధైర్యం చూపగలిగితే బాగుండును. నూరా మోతీని పెండ్లాడినట్లే, ముంతాజ్ ఆయన పెండ్లాడితే బాగు.

'హరీష్ నిన్నెందుకు పెళ్లాడడు?' అన్నాను ముంతాజ్ తో

'సమాధానం సులభం. మీ చట్టిముక్కు వదినె యింట్లో వుంది కాబట్టి' అంది ఆవిడ చేతిని వూపుతూ.

'హిందువుగాని, సిక్కుగాని ఎన్నిసార్లయినా మహారాజువలె వివాహాలు చేసుకోవచ్చుననీ, మహమ్మదీయులు నాలుగుసార్లు పెళ్లిచేసుకోవచ్చుననీ విన్నాను.' అన్నాను చిలిపిగా

'అయితే నువ్వు ఎన్నిసార్లు పెళ్లిళ్లు చేసుకోబోతున్నావు?' అంది ఆటపట్టిస్తూ.

సిగ్గుతో తలవంచుకొన్నాను. నా గడ్డం పట్టుకొని ముఖం పైకెత్తి ఆవిడ అంది.

'నువు సిగ్గుపడుతున్నట్లు అభినయిస్తున్నావు.'

'విదేశీ వనితను ప్రేమించి పెళ్లి చేసుకొంటాను ' అన్నాను సిగ్గు పడుతూ.

'కోతి ముఖం తెల్లజాతిస్త్రీ... నా ముద్దు కృష్ణా! ఆవిడ గురించి ఎలా ఆలోచించ గలిగావు?'

'నేను యిక్కడ నుండి యింటి కెళ్లిపోతాను. నేను బాగా చదివి తెలివితేటలు సంపాదిస్తాను. సనాతన సంప్రదాయాలు, మూఢాచారాలకు దూరంగా ఉంటాను. మృతప్రాయమైన జీవితం యిష్టంలేదు. దూరంగా ఎక్కడికైనా పక్షిలా ఎగిరిపోవాలని వుంది' అన్నాను.

'అప్పుడు నీవు పెద్ద డిప్యూటీ కలెక్టరు వవుతావు. నేను పల్లెటూరి ముసలమ్మ నవుతాను. నేను నీవద్దకు వచ్చి నమస్కారంచేసి 'దండాలు దొరా' అంటాను. నీ ఆఫీసులోకి నన్ను రానిస్తావా?'

నాలోని తలబిరుసు ఆశయాలను ఆవిడ నవ్వులాటలుగా గుర్తు చేయడంపట్ల నాముఖం జేవురించింది. ఆవిడ కూడా చాలాసేపు మౌనంగా వుంది.

తర్వాత ఆవిడ గాఢంగా నిట్టూర్చి, తనలో మాట్లాడుకొంటున్నట్లు నన్ను వుద్దేశించి అంది

'బిడ్డా! మా వేశ్యల యిళ్లలో పుట్టడమంటే ఏమిటో తెలుసుకొనేంత నీవు ఎదగలేదు ఒకసారి యిక్కడ జన్మిస్తే యింక విమోచనం లేదు.. ఆవ్యక్తి 'చెడిపోయిన స్త్రీ'గా జీవితాంతం ఉండిపోవలసిందే!'

'మీ నాన్న ఏడి?' అప్రయత్నంగా అడిగాను నానోట్లోంచి ఆప్రశ్న వూడిపడింది. తర్వాత విచారించాను.

ముంతాజ్ కళ్లలోంచి నీళ్లు రాలాయి. పెదవులు వణికాయి. ఆవిడ తన ముఖంపై పైట చెరగును తొలగించింది. ఆవిడ మౌనంగా తనకు తెలియదన్నట్లు తల ఆడించింది మేలి ముసుగు తొలగించి ఆవిడ ధైర్యం కూడ తెచ్చుకొని నాతో అంది·

'కృష్ణా! అసలు విషయం నాతండ్రి ఎవరో తెలియదు. నాకు, మోతీకి ముఖకవళికలు వేరు. ఆవిడ తండ్రి వేరు ఆవిడకు కూడా తన తండ్రి ఎవరో తెలియదు మా అమ్మను చాలామంది వుంపుడు కత్తెగా వాడుకొన్నారు. మా తండ్రి హిందూ కొత్వాల్ అనీ, మోతీ తండ్రి గొప్ప సిక్కు భూస్వామి అనీ ఆవిడ చెప్పింది. ఆవిడ సంభాషణల అస్పష్టతవల్ల మాకు ఆవిషయం సరిగా తెలియదు. ఆవిడ విషయాలను అతిశయోక్తులుగా చెబుతుంది గాబట్టి, అబద్ధాలాడుతుంది గాబట్టి నిజం తెలియదు. మేము అమృత్‌సర్‌లో వుంటున్నప్పుడు దొరలా దుస్తులు ధరించి ఒక పెద్ద మనిషి వచ్చేవాడు. 'నాన్నగారి దగ్గరకు వెళ్లు' అని ఆవిడ అనేది. అయన మా అసలు నాన్నగారు అయివుండరు రాజనర్తకులుగా పిలవబడే సంపన్న వేశ్యల యిళ్లలో ఒక సంప్రదాయం వుంది. ఒకరితో ఆవిడ వివాహం జరిపించి రంగ ప్రవేశం చేయిస్తారు. మా ఆవిడ సంపన్నురాలు కాకపోవడంవల్ల, ఆవిడకు నృత్యసంగీతాలు రానందువల్ల ఆవిడకు యీ తంతు జరగలేదు. అందువల్ల ఆవిడ వేశ్యగా ఉండి పోయింది. నేను, మోతీ ఒక సంవత్సరం తేడాలో పుట్టాము. మాతండ్రి అయిన కొత్వాలు చాలా క్రూరుడు. మరొకరితో సంబంధం పెట్టుకొంటే ముక్కు కోసి వేస్తానని బెదిరించేవాడట. అమ్మ చెప్పింది. అయినా తగిన పోషణ చేసేవాడు కాదు అందువల్ల అమ్మ తన వృత్తి కొనసాగించవలసి వచ్చింది. . '

ఈ విచిత్రమైన కథ నాకు ఆసక్తిగా వుంది. ఆవిడ తన రహస్యాలు చెబుతుంటే నేను ఆసక్తిగా వింటున్నాను. రాజనర్తకికి, వేశ్యకు మధ్య సున్నితమైన తేడా ఏమిటి? వేశ్య తన ప్రియులతో ఏవిధమైన సంబంధాలు కలిగి వుంటుంది. ఈ విషయాలు అర్థంకాక ప్రశ్న వేశాను

'నువు పాడుతావుగాబట్టి రాజనర్తకివా?'

'బిడ్డా! ఏది ఏమైనా, డబ్బు సంపాదించి, నాకు సంగీతము, మోతీకి నృత్యము నేర్పించాలని అమ్మ దీక్ష. అమృతసర్‌లోని వేశ్యల వీధినుండి మమ్మల్ని లక్నోకు తీసుకెళ్లి ఐదు సంవత్సరాలు కాపురం పెట్టింది. మా శిక్షణ పూర్తి అయిన తర్వాత ఒక దేశానికి చెందిన రాజు తన కుమారుని వివాహసందర్భంగా మా కచేరీ తన ప్రాసాదంలో ఏర్పాటుచేశారు. ఆ కుమారునికి నన్ను 'వుంపుడుగత్తె'గా రంగ ప్రవేశం జరిపించారు మోతీని వాళ్ల నాన్నగారు వుంచుకొన్నారు.... అందువల్ల మీ అన్న నన్ను పెళ్లిచేసుకోవడానికి యిష్టపడటం లేదు..... ఆ యువరాజు ఒకానొక రోజు తిరిగివచ్చి, పోలీసులను తీసుకొని వచ్చి, జైలులో తన వుద్యోగానికి యిబ్బంది తెచ్చి పెడతానేమోనని ఆయన అభిప్రాయం.'

'అయితే మోతీని పెళ్లాడటానికి నూరా ఎలా ధైర్యం చేశాడు.'

'నూరా పోలీసులతో చేతులు కలిపాడు. కొత్వాలు కాకపోయినా కనీసం హవిల్దారు అవుతాడు. పోలీసు ఉద్యోగం అతనికి యిప్పించడానికి మీ అన్న ప్రయత్నిస్తున్నాడు. అందువల్ల నా విషయంలో తనకు కొంత స్తోమత వస్తుంది. ఇప్పుడు చౌధురి గణేశ్ అహమద్ అనే అతను రానేదారు. హరీష్‌చంద్రకు ఉద్వాసన చెప్పి నన్ను తన వద్దకు పంపమని మా అమ్మను అతను సతాయిస్తున్నాడు. మనకు పలుకుబడి లేకపోతే, పోలీసుల ఆజ్ఞలు శిరసావహించకపోతే వాళ్లు ఎంతటి దౌష్ట్యానికి పాలుపడతారో నీకు తెలియదు.'

ముంతాజ్ సౌందర్యం వెనక ఆవిడ ఎన్ని కష్టాలను ఎదుర్కొంటుందో వూహించలేకున్నాను. ఆవిడ గతంలో, తన ప్రేమికుల్ని ఎలా గుర్తుకు తెచ్చుకొంటోంది? ఆవిడ జీవితంలో వచ్చిపోయే వ్యక్తుల గురించి

ఆవిడ ఎలా భావిస్తోంది? హరీష్ ఆవిడను ప్రేమిస్తున్నాడుగాబట్టి అతనికి ఎలాంటి ప్రమాదాలు ఎదురుకాబోతున్నాయి? నాకు వూహాకందడం లేదు.

'నా హరీష్ నన్ను తీసుకెళ్ల గలిగితే, ఈ నరకంలోంచి నన్ను అతను బయట పడవేయగలిగితే.... నేను జన్మించిన కులంలోంచి బయటపడగలను.'

అనేక మంది వేటగాళ్లు ఒక్కసారిగా పక్షిని తుపాకితో పేలిస్తే, వాళ్లు దాన్ని సమీపించేలోగా అది పరుగెత్తి పోవడానికి ప్రయత్నించి నప్పుడు పక్షిచేసే బొంగురు కంఠం ఆవిడలో వినిపించింది. బాధలో ఆవిడ ముఖం ముడుచుకు పోయింది.

తన ముసుగు ముఖంపై నుండి తొలగించి ఏడవ సాగింది. నాతల నిమురుతూ, నా తలవెంట్రుకలు తన సున్నితమైన వేళ్లతో యాంత్రికంగానే సవరించసాగింది.

దురదృష్టవశాత్తు, నేను ఆవిడకు కొద్ది దూరంగా కూచొన్నందువల్ల ఆవిడ విషాదాన్ని పోగొట్టి, ఆనిడను కావిలించుకోలేకపోయాను. నాకళ్లు మగతగా మూసుకుపోతుంటే, ఆవిడ విషాదాన్ని పాలుపంచుకొంటూ, నింపాదిగా కూచొన్నాను. ఆవిడ రక్షకుడిగా, స్వేచ్ఛా వరప్రసాదిలా మారాలని నాలో తహతహతో, ఆవిడపట్ల ఆరాధన నాకు అధికమవు తోంది. ఆవిడ శారీరక సాన్నిహిత్యాన్ని సుఖంగా అనుభవించడం కంటె, ఆవిడ మృదుత్వానికి ప్రతిగా మృదువుగా ప్రవర్తించసాగాను.

ఉన్నట్లుండి ఆవిడ అంది.- 'నేను నిన్ను యిలా హింసిస్తున్నానేంటి?'

'సరే! నాకోపాట పాడి వినిపించు' అన్నాను. ఆవిడ గురించి నాకు చెబుతూపోతే, ఏడ్చే స్థితిలో వున్నాను. ఆవిడను అధికంగా ప్రేమించసాగాను. ఈ ప్రేమ విచిత్రంగా ఉంది. — ఆవిడ చేతిలో గారాబంగా వుండి పోవాలనే తాత్కాలికమైన కోరికకంటె, విషాదంవల్ల కలిగిన జాలి అధికంగా ఉంది.

ఆవిడ గొంతు సవరించుకొని, చిరునవ్వు చిందించి, ముందురోజు సాయంకాలం సరదాగా గడిపిన స్థితిలో—

'కారులో షికారు కెళ్లి
హుషారుగా పచార్లు చేసి వద్దామా?'

'లేదు.' అన్నాను ఆవిడ ఆలాపనను త్రోసి పుచ్చుతూ. 'నేను నిద్రపోవడానికి సిద్ధంగా వున్నప్పుడు పాడిన పాటపాడు ' అన్నాను. ఆవిడ కంఠస్వరంలోని స్వచ్ఛతకు, మాధుర్యానికి, లయబద్ధమైన శ్రావ్యతకు ఆసక్తి చూపాను

'హరీష్‌కు పాడిన పాట పాడమంటావా? అది మీ అన్నకోసం. ... నీకోసం ఒకమంచి గజల్ పాడుతాను.... నువు కవిత్వం రాయడం మొదలెట్టావని నాకు తెలుసు.'

'ఒకరోజు..... ఒకరోజు నీకోసం అందమైన పద్యాలు వ్రాస్తాను.' 'నాకు పదాలంటే యిష్టం' అన్నాను.

'సరే! విను!' అంది

మళ్లీ ఆవిడ గొంతు సవరించుకొని, గుండెలోతుల్లోంచి గాలిపీల్చుకొని, కూనిరాగాలు తీసింది. ఆవిడ ఆలాపనపట్ల నాకు విసుగేసింది. అప్పుడామె మృదుమధుర కంఠం విప్పి ఆలపించింది

'అతడు చిరునవ్వులు చిందించెను
అతడు మాటలాడ సాగెను
కుసుమవృష్టి, మెరుపు తీగ తళతళలు,
బాధా సర్పదష్టుడైన మానవుడు జ్ఞాని
వొరపిడికి వజ్రం కాంతి పుంజుకొంటుంది '

ఆ పద్యంలోని ఉత్ప్రేక్షలకు నాకు ఊరట కలిగింది నా లక్ష్యాన్ని చేరడానికి ఆవిడ వాడిన పదాలమత్తు నా ముక్కు పుటాలకు తగిలి గిలిగింతలు పెడుతోంది. నాలోని ఆవేదనను వ్యక్తపరచడానికి పదాల పోహళింపు ద్వారా ప్రయత్నించాలని కవిగా మారాలని ఆ ఉదయం నిశ్చయించుకొన్నాను. ముంతాజ్‌కు చెప్పకుండా ఆ కోరికను నాలో రహస్యంగా దాచుకొన్నాను.

మాంసము, రొట్టె, పసందైన వంటకాలతో భోజనం చేసిన

తర్వాత, మోతీ, నూరా, ముంతాజ్ చీట్లపేక ఆడారు. నేను ముంతాజ్ గెలుచుకొన్న ముక్కలను గమనిస్తున్నాను. నాలో వేడి ఎక్కువై మగతగా పడుకొన్నాను. సాయంకాలం హరీష్ వచ్చి లేపినంతవరకు నాకు తెలియదు.

'కృష్ణ! మీ వదినె ద్రౌపది ఏడుస్తోంది. నువు వెళ్లి ఆవిడను ఓదార్చాలి. నీవల్ల ఆవిడను చావబాదాను. ఆవిడ యింకా ఏడుస్తోంది. నువు మళ్లీ రావాలని ఆవిడ ఎదురుచూస్తోంది. నిన్ను ఎవరో ఒకరు తీసుకెళ్తారు వెళ్లు. నీకిప్పుడు మరోకొత్త స్నేహితుడు వచ్చాడు. జైలుకు కొత్తగా వచ్చిన డాక్టరు జలాలుద్దీన్ కొడుకు ఇబ్రహీం వచ్చాడు. ఆ కుర్రవాడు ఇటీవల మెట్రిక్ పూర్తి చేశాడు. నిన్ను తీసుకెళ్లడానికి కింద నించుని వున్నాడు. ఈ సెలవుల్లో నీకు పాఠాలన్నీ చెబుతాడు.' అన్నాడు హరీష్.

'ముంతాజ్ ఏది?' అన్నాను.

'ఆవిడ వాళ్ల అమ్మగారి యింటికి వెళ్లింది.' అన్నాడు.

నిద్ర ముంచుకొస్తున్నా, ముంతాజ్ నా గుండెలో యింకా మెదులుతోంది. నూరాతల్లి తెచ్చియిచ్చిన నీళ్లతో మొహం కడుక్కొని కిందికి వెళ్లడానికి సిద్ధమయ్యాను.

గణేశ్, జానీలకంటె కొంచెం పెద్దవాడు, నూరాకంటె చిన్నవాడు అందమైన కుర్రవాడు నాకోసం ఎదురుచూస్తున్నాడు.

'ఇతడు కృష్ణ!' అన్నాడు హరీష్‌తో.

'నాతోరా! నిన్ను యింటికి తీసుకెళ్తాను. ఇంకేంకావాలి? నువు కూడా ఆడుకోవడానికి ఒకటోపీ యిస్తాను. లాహోరునుండి రెండు తెచ్చాను.' అన్నాడు.

నేను యింటికి వెళ్లడానికి, నన్ను ఓదార్చుడానికి హరీష్ యితణ్ణి ఏర్పాటుచేశాడని తెలుసు. అతని చూపులు నాకు నచ్చాయి. నా వేళ్లు అతను పట్టుకొంటె సంబరంగా నడిచాను.

నేను యింటికి వెళ్లేసరికి ద్రౌపది మంచం మీద పడుకొనివుంది.

హరీష్ ఆవిడను బాగాకొట్టాడు సపతి నాతో రహస్యంగా చెప్పింది! 'మీ వదినెను కదపకు. మా యింటికి వచ్చి భోంచెయ్యమని'

'మా సోదరులలో నిన్ను ఎవరు పెద్ద చేశారు. వెళ్లు' అన్నాను సపతితో కోపంగా..

సపతి వెళ్లగానే, సూర్యకాంతి యింట్లోకి ప్రసరిస్తుంటే మృత్యుచ్ఛాయాలు అలముకొన్న యిల్లు వలె ఉన్న ఆయింటి వాకిట ముందు నించున్నాను ఏం చేయాలో తోచలేదు. దగ్గరకు వెళ్లి ద్రౌపదిని ఓదార్చడానికి ప్రయత్నించడమా? లేక హరీష్ తిరిగి వచ్చినదాకా బయట ఎదురు చూడటమా? దూరంగా వంటగదిలో పొయ్యి రాజేసినట్లు ఛాయలు లేవు. రోజంతా యింట్లో వంట వండిన గుర్తులు లేవు. అందువల్ల వాళ్లయింటికివచ్చి భోంచేయమని సపతి చెప్పి వుంటుంది అటూాయిటూ కదలకుండా కొద్దిక్షణాలు నుంచున్నాను.

ద్రౌపది క్షణకాలం పక్కకు వొదిగి, అరమోడ్పు కళ్లతో నేను వచ్చిన విషయం గమనించింది. నేను వచ్చినప్పుడు ప్రశాంతంగా పడుకొన్నట్లు మళ్లీ పడుకొంది

క్రితంలో నేను ఆవిడ దగ్గరగా వెళ్లి ఆవిడ చుట్టూ చేతులువేసేవాణ్ణి. ఆవిడ నిన్న ఉదయం కొట్టిందిగాని, అంతకు ముందు కోపంగానో, అసంతుష్టిగానో వుండేది నేను ఒకరోజు పూర్తిగా ఎప్పుడూ బయటగడపలేదు. ఇప్పుడు మా యిద్దరి మధ్యా అవాంతరం పెరిగిపోయింది. ఆవిడ నన్ను దూరంగా తోసివేస్తుందేమోనని దగ్గరగా వెళ్లలేదు. ముంతాజ్ అనురాగాన్ని పంచుకొన్న తర్వాత యీ చట్టిముక్కుదాని ఏడ్పులు వినవలసిన కర్మ నాకేమీ పట్టలేదు. ఆవిడ నావైపు చూసినప్పుడు నాకోసం ఎదురుచూస్తున్నట్లు కనిపించలేదు. మరి హరీష్ ఆవిడ నాకోసం నిరీక్షిస్తోందని ఎందుకన్నాడో ఆశ్చర్యంగావుంది.

ఆవిడ నిశ్శబ్దంగా వుంది. నాకోసం ఆవిడ దెబ్బలు తిందనే ఆలోచన వచ్చింది. నా రక్తంలో ఈ విధమైన గొప్పదనం ప్రవహించడంతో ఈ అసంతుష్టురాలైన స్త్రీ గురించి నాకు జాలి కలిగింది. ఆవిడ తన భర్త తనను నిరాకరిస్తున్నాడని బాధపడుతోంది. ముంతాజ్ గాధ

గుర్తుకువచ్చినప్పుడు ఆవిడకూడా ఎంత విషాదంగా ఉందో స్ఫురణకు వచ్చింది. హరీష్ ఆవిడను పెళ్లి చేసుకోలేదు గాబట్టి, ఆ'వదినె' పట్ల కూడా జాలివేసింది హరీష్ ఈ విధంగా లౌక్యంగా ప్రవర్తించి, అందరి జీవితాలతోను చెలగాటమాడుతున్నందుకు అతణ్ణి నిందించసాగాను.

'ఈ ప్రపంచంలో నా మనసుకు స్థానమెక్కడ?' - నేనేదో కవిత్వం వ్రాయబోతున్నట్లు ప్రశ్నించాను.

ఇబ్రహీం కనిపిస్తాడేమోనని అటూయిటూ చూశాను.

దగ్గరలో అతను ఎక్కడాలేడు అతనితో ప్రథమ పరిచయంలో కలిగిన ఉత్సాహంవల్ల. అతని సాహచర్యం వల్ల కలిగిన ప్రోత్సాహంవల్ల, డాక్టరుగారి యింటికెళ్లి తలుపు తట్టాను

'ఎవరక్కడ' అని ఒక ముదురుకొంతు వినిపించింది.

ఆ మాటలు అంటూ నల్లటి పొడుగాటి వ్యక్తి, తెల్ల తలపాగా, పొడువాటి నల్లనికోటు, తెల్ల పైజామా, కళ్లద్దాలు వేసుకొని బయటికి వచ్చి — 'ఎవరుకావాలి? నువ్వెవరు?' అన్నారు

'ఇబ్రహీంతో మాట్లాడాలి. మున్షీహరీష్ చంద్ర తమ్ముణ్ణి' అన్నాను.

'ఇంట్లో పరదాస్త్రీలున్నారు నువ్వు రావడానికి లేదు ఇబ్రహీంని పంపుతాను - ఉండు ' అన్నాడాయన

ఆ నల్లటివ్యక్తి కొత్తగావచ్చిన జలాలుద్దీన్ డాక్టర్ అని గ్రహించాను

నేను తలుపు దగ్గరనుండి పక్కకు తొలిగాను. స్నేహసౌహార్ద్రాలకు పేరువడ్డ ఈ మహమ్మదీయులు తమ స్త్రీలపట్ల ఎందుకింత కఠినంగా వ్యవహరిస్తారో? ఈయున కుమారునిలో వున్న అందం, ఈ జలాలుద్దీన్ తీవ్ర స్వభావంలో కనిపించ లేదు.

మరోక్షణంలో ఇబ్రహీం బయటకు వచ్చాడు.

'నేను భోజనానికి కూచొన్నాను. మానాయన చాలా క్రమశిక్షణ మనిషి'

'మాఅన్న వదినెతో తగవు పెట్టుకొన్న విషయం నీతో చెప్పాడా?' అన్నాను.

'లేదు, కాని యింట్లో ఈరోజు గుసగుసలను బట్టి అయన ఆవి డను కొట్టాడని విన్నాను' ఇబ్రహీం అన్నాడు.

నేను మౌనంగా నించున్నాను. నా కళ్లు శ్మశానం వైపు చూపు మళ్లించాయి. అక్కడ కాపలాదారు యింటిలోంచి దీపం వెలుతురు కనిపిస్తోంది.

హరీష్ తిరిగి వస్తుంటాడని అనుకొన్నాను.

'భయపడకు మీవదినె ద్వారా అమృత్‌సర్‌కు పంపడానికి ఏవో సామాన్లు కొనడానికి మీ అన్న వెళ్లాడు.'

ఈవార్త నాకు తెలియదు. రాత్రికి ద్రౌపది అమృతసర్ వెళ్తోంది. 'ఎవరితో' అన్నాను. హరీష్ ఆవిడతో నన్ను పంపడుగదా.

'బాబూ! నువు అదృష్టవంతుడివి కొంతకాలం ఆవిడగొడవ తప్పు తుంది. నేను ఈ వేసవి సెలవులంతా ఇంట్లో బాధపడాలి. మాయింట్లో మా అమ్మలు ఇద్దరూ ఎప్పుడూ తగూలాడు కొంటారు.' అన్నాడు ఇబ్రహీం.

'నీకు ఇద్దరు అమ్మలా!' అన్నాను దిగ్భ్రాంతితో.

'మా అమ్మ పెద్దది. కొద్ది సంవత్సరాల క్రితం మానాన్న తన అన్నగారి కుమార్తె విధవరాలైతే ఆవిడను పెండ్లి చేసుకున్నాడు. అప్పట్నించీ మాయింట్లో సుఖశాంతులు లేవు. నేను అక్టోబరులో లాహో రులోని ఇస్లామియా కళాశాల హాస్టలుకు వెళతాను. నాకక్కడ హాయిగా వుంటుంది' అన్నాడు ఇబ్రహీము

'అయితే నీవుకూడా నరకంలో వున్నావు' అందామనుకున్నాను. కానీ, నా నోటికి తాళం వేశాను.

ఇబ్రహీం నావైపు చూడలేదు కానీ బళ్ళో తనకు మాష్టారు చెప్పిన వాక్యాలు వల్లిస్తున్నట్లుగా "మహాకవి గాలిబ్ ఒకసారి అన్నట్లు

'బాధలోంచి కవిత్వం ఉద్భవిస్తుంది.' ఆయన చెప్పిన మాటలు మన జీవితాల పట్ల నిత్య సత్యాలు. ఉదాహరణకు హీర్ గీతం విను." అటూఇటూ చూస్తూ బావిదాకా తీసుకొనివెళ్ళి తన సహజ గంభీర స్వరంలో పంజాబుకు చెందిన పురాణప్రసిద్ధమైన నాయిక గాథను వర్ణించ సాగాడు.

'అయ్యో! నన్ను తీసుకెళు తున్నారు బాబూలా
అయ్యో! నన్ను తీసుకెళ్ళి పోతున్నారు!'

షానవాజు మాష్టారు కన్నా డాస్కాలోని మా బాబాయి కంఠం కన్నా ఇబ్రహీం కంఠం వారిస్‌షా ప్రబంధంలోంచి గీతాలు పాడినపుడు మధురంగా వుంది. మెరుగు పెట్టిన ఉర్దూ భాషతో పోల్చినపుడు పంజాబీ భాష మొరటుగా వుంటుందంటారు కానీ, అందులో సొగసునాకు నచ్చింది.

ఇబ్రహీము పొడుగ్గానూ, అందంగానూ వుండి చక్కగా పద్యాలు పాడగలుగు తున్నందుకు నాకు అసూయ వేసింది. అతను మెట్రిక్కు పూర్తిచేసి కళాశాల హాస్టలుకు వెళుతున్నాడు. ఒకరకంగా అది యింట్లోని తగాదాలనుంచి దూరం చేస్తుంది. తమతమ భావాలను ప్రతి ఒక్కరూ ఆచరణలో పెట్టడానికి అదిమంచి అవకాశం.

'కొంచెం నడుద్దాం పద' ఆంగ్లంలో ఒక సామెత వుంది — మధ్యాహ్న భోజనం తర్వాత ఒకకునుకు, రాత్రి భోజనం తర్వాత ఒక మైలు నడక.'

ఆ సామెతను అతడు ఉచ్చరించిన ధోరణి నాకు బాగా నచ్చింది. వాళ్ల యింట్లో పరదా పద్ధతి ఉండికూడా అతను ఏవిధంగా స్వచ్ఛమైన ఆంగ్లం నేర్చుకున్నాడా? అని ఆశ్చర్యంగా వుంది.

'అదుగో మీ అన్న! ఇంక నీకు చీకటంటే భయం వుండదు. నీకు తోడు కూడా అక్కర లేదు' అంటూ ఇబ్రహీం నన్ను హరీష్‌కు అప్పగించి, ముందుకు సాగాడు.

'గొడవపెట్టకు! ప్రతిఒక్కళ్ళూ ఏడుస్తూనే వున్నారు..... ఆ ముండను జయసింగుతో అమృతసర్ పంపుతున్నాను. వచ్చేనెలలో

నీకూ, గణేశ్‌కూ, శివకూ ఉపనయనం జరుగు తుందని నాన్న వ్రాశాడు. మరో మూడు వారాల్లో అమ్మానాన్నా మాలా ఖండ్ నుంచి తిరిగి వస్తారు అప్పటికి నాన్న దళం జీలం కంటోన్ మెంటుకు మారుతుంది. నిన్ను లూధియానా నుంచి నాన్న అక్కడికి మారుస్తారు. ఉపపనయనాలు అయేంతవరకూ నీ ఏడుపు గొట్టువదిన దేవకీ గణేశ్‌లతో వుంటుంది ' అన్నాడు హరీష్.

కోపంతో మా అన్న కంఠం కర్కశంగా వుందని గ్రహించాను. ఆయన మాటల్లో కాఠిన్యంలో మునిగి తేలుతూ ఆయన వెంబడి నేను కూడా నడిచాను.

నీవువెళ్ళి సపతి దగ్గర భోంచెయ్యి. నేను ద్రౌపదిని రైలుకు సిద్ధం చేస్తాను. మీ వదినను సాగనంపించి వచ్చిన తర్వాత నిన్ను తీసుకొ స్తాను. అప్పటి దాకా నీవు వాళ్ళింట్లోనే నిద్రపో! అన్నాడు హరీష్.

ద్రౌపది అమృతసర్‌కు వెళ్ళిన తర్వాత నేను కొంత గాలిపీల్చు కున్నాను. వుర్దూ కవిత్వంలో తరచూ వినిపించే 'బాధాతప్త హృదయం' గురించి ఆలోచించ సాగాను. ఈ ప్రపంచ వాతావరణంలోంచి బాధ నాముఖంపై ప్రస్ఫుటంగా కన్పిస్తున్నది. అది నాలోపలి నుంచి బయ టికి పొక్కి వుంటుంది. తలలోని ఆలోచనల కల్లోలం వల్ల కడుపులో మంట వల్ల బాధ కలుగుతుంటే హృదయం లోంచి బాధ వస్తుందని ఎందుకంటారు. ఇబ్రహీం చెప్పిన గాలిబ్ మహాకవి బాధలోంచి కవిత్వం వస్తుందన్న మాటలు మాలీతో తరచూ వల్లించేవాణ్ణి.

నావాఘ్దాటి అనే గర్వరేఖ క్రింద గీతాలు, వారిస్‌షా ఉద్బోధలలో విషాదమూ తొంగి చూశాయి. హీరా గొంతులో నుంచి వచ్చిన ఆ మాటలు నాలో చైతన్యాన్ని కలిగించాయి. ముంతాజ్‌పట్ల నాకు షక్షపాతం వున్నప్పటికీ ఆవిడ పాడిన హిందూ స్థానీ గీతాలు నామ నస్సుపై అలాప్రసరించాయి. ఇబ్రహీం కంఠానికి తోడు ఆ సంగీతంలో మాధుర్యమూ, పంజాబీ పదాలు నాలుగైదైనప్పటికీ వాటి శక్తి నన్ను ఆకర్షించాయి. నిజానికి మొదటి రెండుమూడు అక్షరాలూ నాగుండె లోతుల్లో అద్భుతంగా కదిపివేశాయి. నాలోని మూగ జీవం ఏవో పదా

లను వెదికి నట్లు గుండె గొంతుకలోని బాధను వ్యక్తం చేయడానికి అవకాశం దొరికినట్లు, ఆత్మఘోషకు కొంత వూరట కలిగినట్లు ఈ గీతం ఉపశమనం కలిగించింది. ముంతాజ్ కూడా లోలోపల బాధ పడుతోందని గ్రహించాను. ఈ పద్యంలోని భావం దూరాన్వయమే అయినప్పటికీ, ఆవిడకు సంబంధించి నట్లుగా భావించి మా అందర్నీ వుద్దేశించినట్లు అనుకున్నాను హీరా స్థితి కంటే ముంతాజ్ పరిస్థితి వేరు. నేను ఆవిడ ప్రియుణ్ణి కాదు ఈ పదాలను అందరికీ అన్వయించేలా భావించి కొంత వుపశనం పొందాను. అమ్మ నాకు దూరంగా వుండటం ప్రతాప్ బాబాయి మరణం వల్ల దేవకి దుఃఖము, తన తల్లి దండ్రులకు దూరమై ద్రౌపది పొందే వియోగమూ నాకు గుర్తుకు వచ్చాయి. నా సొంత వాక్యాలలో వీరి బాధలను వర్ణించాలను కొన్నాను ఈ నూతన స్థితి గతులను నూత్న విధానంలో నేనూ ఓ కవినై వ్రాద్దామనుకున్నాను. వారిస్‌షా కవిత్వం వలె మృధుమధురంగా వుండకపోయి నప్పటికీ రెండుమూడు గీతాలలో నా భావాలను వ్యక్తం చేద్దామను కున్నాను నన్ను చూసి అందరూ ఎగతాళి చేస్తారేమోనని భయం వేసింది. ముషైరాలలో పందెం కోసం వుర్దూ కవులు ఒకే బాణీకి సరిపడేలా వ్రాసే పద్యాలు కృతకంగానూ విసుగు పుట్టించే విగానూ వుంటాయి. వారిస్‌షా కవిత్వంవలె నాగుండెలోంచి వచ్చిన ఒక్క పదమైనా మధురంగా వుంటేచాలు ఒక్క క్షణకాలంపాటు నాలోని అనుభవాల దొంతరలు మత్తెక్కిచ్చాయి. నాముక్కు పుటాలు ఎగురుతున్నాయి. ప్రపంచంకేసి దృష్టి సారించాను. ఒక విధమైన అను భూతికి లోనై సముద్రపు ఆట పోట్లవలె చలిస్తూ అతిచిన్న శబ్దానికీ వూగిపోతూ వున్నాను.

ఈ ప్రపంచంలోని బాధలన్నింటికీ ప్రతిస్పందించినట్లు, సార్జంటు తాపాకొట్టిన షక్షి, గువ్వ బాధపడినట్లు ఖైదీలందరూ బాధ లనుభవి స్తున్నట్లు — వారి బాధలను వారిస్‌షా దృష్టితో నేను అవలోకనం చేసి వారికి వుపశమనం కలుగజేయడానికి నాప్రేమను పంచి యిద్దామను కున్నాను. ప్రపంచంలోని స్పందనకు అనుగుణంగా నా గుండె కొట్టుకో సాగింది. నాకు అవకాశం కలిగిస్తే, అందర్నీ ప్రేమించాలని నాతపన.

ఆరాత్రి నేను ఆమత్తులో లేచి మూత్ర విసర్జనకు వెళదామను కుంటే స్మశానం వైపు బూరుగ చెట్టుపై తెల్లటి దుస్తులలో ముస్లిం దైవం కూర్చునివుంది. నేను భయపడి వెనక్కు పరుగెత్తాను.

'ఏం జరిగింది కృష్ణా!' అంటూ హరీష్ నాదగ్గరకు పరుగెత్తాడు. 'అదుగో చెట్టుమీద పీరు' అన్నాను. దాన్ని చూడటం వల్ల విపరీతమైన భయం కలిగి మాట్లాడలేక పోయాను.

'ఇలారా! భయపడాల్సిన పనిలేదు. నీకు కలవచ్చి వుంటుంది. అంటూ నన్ను లాలించాడు. ఆయన పరుపు మీద కాళ్ళ దగ్గర పడు కున్నాను. తెల్లవారి బాగా పొద్దెక్కినదాకా నిద్ర పోయాను.'

మరునాడు ఉదయం ఆఫీసుకు పోయేముందు నాకు పాలు, బిస్కెట్లు ఇవ్వటానికి హరీష్ నన్ను లేపాడు. నేను లేచి కూర్చొని ఒక గుటక వేశాను కానీ మింగుడు పడటం లేదు. హరీష్ ఆదుర్దాగా నానుదుటిపై చేయివేసి 'ప్రతాప్ బాబాయి చనిపోవటానికి ముందు రోజు నీకు జ్వరం వచ్చినట్లుగా మళ్ళీ జ్వరం వచ్చింది. డాక్టరును తీసుకువస్తాను నీవు కదలవద్దు' అన్నాడు.

మావంట వాడు సంతూతో లోపల పక్కమీద నన్ను పడుకో బెట్టమని ఆయన వెళ్ళాడు. కొంచెం సేపటికి డాక్టరుతో తిరిగి వచ్చాడు. ఈ గంభీరాకారం ఇబ్రహీం తండ్రి. ఆయన విచారంగా నా నాడి చూసి హరీష్‌తో మందు పంపుతానని ఏదో గొణిగి వెళ్ళి పోయాడు.

నేను సెలవు తీసుకొని మధ్యాహ్నం రైలుకు నిన్ను అమృతసర్ తీసుకెళతాను అన్నాడు హరీష్. నాకు శాలువా కప్పి టాంగాలో కూచో బెట్టి జ్వరం ఎక్కువగా వుందని నాపై చేయి వేశాడు. జ్వరం ఎక్కువై రైల్లోనాకు నిద్ర పట్టలేదు. ఒళ్ళంతా చెమటలు పట్టాయి. హరీష్ నన్ను అమృతసర్‌లో గూడు బండిలో యింటికి తీసుకెళ్ళాడు. అందరూ నావైపు - దిగులుగా చూస్తున్నారు. దేవకి కాలిపోతున్న నానుదుటిపై ముద్దెట్టుకుంది. ద్రౌపది సానుభూతిగా పెదవులు కదిలించింది. గణేశ్ మహమ్మదాలీ డాక్టరును తీసుకు రావటానికి ఆత్రుతపడుతున్నాడు.

# 12

ఒళ్ళంతా నొప్పులూ, వణుకూ, చెమటలు పట్టాయి. నాలుగైదు రోజులుగా జ్వరం. మాయింట్లో క్రిందగదిలో పడుకోబెట్టారు. దేవకి నావక్కనే రాత్రింబగళ్ళు పరిచర్యలు చేస్తోంది. ఒకరోజు వుదయం కళ్ళు తెరిచి చూసే సరికి అమ్మా, నాన్న, శివా నాదగ్గర కూచుని వున్నారు. జ్వరం తగ్గకుండా వుండటంతో అప్పటికే నేను బాగా బలహీన పడి వాళ్ళవైపు మగతగా మూతపడుతున్న, కళ్ళతో చూశాను. 'ఈ దయ్యం నా బిడ్డను చంపినంతపని చేసింది.' అని ద్రౌపదిని అమ్మ ఆడిపోసు కుంది. నాకళ్ళు చెమ్మగిల్లాయి. నేను ద్రౌపది గురించి చెప్తున్న సత్యాన్ని పెద్దలు గ్రహించారనే సంతోషంతో వారివైపు నిస్సహాయంగా చూశాను. ఆ సంతోషాన్ని నేను చాలా కాలం పంచుకోలేక పోవచ్చు. కొంత కాలం పాటు ఇలానే బాధపడి కౌసల్యవలె ఈ సందులో నేనుకూడా చనిపోతానేమో.

ఉపనయనాలకు సన్నాహాలు మొదలైనాయి. అందుకు ఒకరోజు ముందు నన్ను కింది గదికి తీసుకెళ్ళారు. నేను పడుకోనున్న గది మంచిదని జ్యోతిష్కుడు చెప్పడం వల్ల అక్కడ ఉపనయనాలు జరుపు దామను కున్నారు.

ఉపనయనం తంతు నాకు కూడా జరిపించే విషయంలో కొంత చర్చ జరిగింది. చెవులు కుట్టటం, నామకరణ స్థిరీకరణ, పిలక వదిలి శిరో ముండనం చేయించటం, గంగోదకంతో స్నానం చేయించటం, జందెం వేయటం జరపాలి. జ్వరంతో బాధపడుతున్న నాశరీరానికి ఇవన్నీ చేయటం మంచిది కాదేమో!

డా. మానిక్‌షా నాకు టైఫాయిడ్ జ్వరమని నిర్ధరించాడు. దాని మీద నిమోనియా కూడా వస్తుందేమోనని మాయింట్లో వాళ్ళు భయ పడ్డారు. కానీ మా బంధువులూ పురోహితుడూ ఏవిధమైన భయమూ లేదని చెప్పారు. మేము ముగ్గురమూ పెద్దవాళ్ళమైనాము. కాబట్టి ఉప

నయనాలు ఇప్పటికే ఆలస్యమైనాయని వాళ్ళ అభిప్రాయం. ఈ పవిత్ర కార్యక్రమం ద్వారా నాజ్వరం తగ్గవచ్చునని వారి అభిమతం. హిందూ నమ్మకానికి లోబడి మా నాన్న ఈ సలహా పాటించటానికి అంగీకరించారు.

నన్ను కింద గదిలోకి తీసుకువెళ్ళటానికి ముందు నాన్న థర్మామీటరుతో నాజ్వరం పరీక్షించాడు తల అడ్డంగా తిప్పి అయినా విధిలేక ఈ తంతు జరపటానికి నన్ను ఎత్తుకొని క్రిందికి తీసుకొని వచ్చాడు.

నాతలపై కత్తి పెట్టటం, చన్నీళ్ళ స్నానం, చెవులు కుట్టడం, పురోహితులు బలవంతం చేసినా అమ్మ లాంఛనంగా నా విషయంలో జరపమని చెప్పింది జందెంవేసి, ఆతంతు జరిపారు. సంస్కృత శ్లోకాలు కంఠశోషగా వల్లిస్తూ ఏమీ వినపడకుండా వాళ్ళుచేసే కార్యక్రమం నాకు విసుగు కలిగించింది శిరోముండనం చేసి పిలక పెట్టడంతో నాముఖం మరీపాడు చేస్తున్నారని గొడవ చేశాను. చెవులు కుట్టడంతో విపరీతమైన నొప్పి, మా బంధువుల స్త్రీలంతా నానా గొడవగా పాటలు పాడుతున్నారు. తమ పాపాల ప్రక్షాళన కోసం హిందువులు తరచూ కాళీమాత అనుగ్రహం కోసం బలియిచ్చే మేకలు, మనుషుల బాధలు వూహించాను. ఈ కార్యక్రమం తర్వాత నాజ్వరం నూటనాలుగు (104°)డిగ్రీలకు పెరిగింది నాకు వూపిరాడటం కష్టమైంది. అమ్మ ఏమీ తోచక ఏడ్చింది. కొంచెం సేపైన తర్వాత డాక్టరు మానిక్‌షా వచ్చి నాపిరిస్థితి విషమించిందని ప్రకటించాడు నన్ను పక్క మీది నుంచి దించి నేలమీద పడుకో బెట్టారు. హిందువులు పరుపుమీదగానీ, ఎత్తైన ప్రదేశంపై కానీ చనిపోతే ఆత్మ బాధపడుతుంది. స్వర్గానికి వెళ్ళటానికి అవకాశం వుండదు. భూమాత వొడిలో పడుకుంటే ఆవిడ ద్వారా దేవలోకాలకు వెళ్ళవచ్చు.

నన్ను నేలమీద పడుకోబెట్టగానే మా అమ్మ, మిగతా ఆడవారూ నేను అప్పుడే చనిపోయినట్లుగా గుండెలు బాదుకోసాగారు. అదినాకు కోపం తెప్పించి నేను చనిపోగూడదను కున్నాను. నేను చనిపోబోయే ముందు నాపట్ల అందరి సానుభూతిని పొందాలని కోరిక నన్ను మళ్ళీ పరుపు మీద పడుకోబెట్టారు. బహుశా నాఆత్మ మా బంధువులతో దాగుడుమూత లాడుతోందెమో!

నాజ్వరం తగ్గలేదు శలవు అయిపోయింది కాబట్టి నాన్న వెళ్ళాలి. డాక్టరుగారి ఖర్చులు, మందుఖర్చు పెరుగుతోంది అందువల్ల జ్వరం కొద్దిగా తగ్గినా నన్ను జీలం కంటోన్ మెంటుకు తరలించాలని నిర్ణయించారు.

అక్కడ సైనిక దళానికి చెందిన వైద్యులు వుచితంగా వైద్యం చేస్తారు. నాన్న అమృతసర్ నుండి వెళ్ళాడు.

నన్నూ, అమ్మనూ తీసుకు వచ్చేందుకు మిలిటరీ ఆసుపత్రి నుండి ఇద్దరు డోగ్రా జవాన్లను అమృతసర్ పంపాడు దుప్పట్లుకప్పి బల్లమీద పడుకోబెట్టి నన్ను నెమ్మదిగా జీలం చేర్చారు.

పెద్దయింటి ముందు వరండాలో ఒకవైపు 22వ భారతీయ సైనిక దళానికి చెందిన గుర్రాల సకిలింపులూ మరోవైపు 38వ డోగ్రా సైనిక దళానికి చెందిన సిపాయీలూ కనిపిస్తుండగా నన్ను పడుకోబెట్టారు. భారతీయ వైద్య సేవలకు చెందిన కర్నల్ డగ్లస్ కంటోన్ మెంటు ఆసుపత్రి అధిపతి ఆయన వచ్చి నన్ను పరీక్ష చేసి ఒక నర్సును ఏర్పాటు చేద్దామని చెప్పాడు నాకు ఉత్సాహం వేసింది కానీ అమ్మ కిరస్తానీ వనిత మందులు ఇవ్వటానికి సుతరామూ ఇష్టపడ లేదు ఆవిడ ఉద్దేశంలో నాకు మత సంబంధమైన ఏవో కార్యకలాపాలూ, పురోహితులు దైవజ్ఞులూ, ఆయుర్వేద వైద్యులు ఇచ్చిన మూలికలద్వారా నా వ్యాధి నయంకావాలి. అందుకని జీలం నగరంలో పురోహితుడైన పండిత గోవింద చరణ్‌ను అమ్మ పిలిపించి వ్యాధి నయం చేయమని కోరింది. తెల్లని గడ్డంగల ఆముదుసలి నానుదురు పట్టుకొని ఏవో అస్పష్టమైన మాటలతో సానుభూతి చూపాడు. ఆయన చిరునవ్వుల ఆశీస్సుల వెనుక ఆమాటలు గడ్డంలోనే మిగిలిపోయాయి. నామంచం చివరన కూర్చుని అమ్మ చెవిలో ఏదో వుపదేశించాడు ఆమె వెంటనే వాటిని వుచ్చరించటం మొదలెట్టింది. ఆయన చేతితో ఒకరూపాయి బిళ్ళ, కొత్త తలపాగాకు గుడ్డ అమ్మ పెట్టింది

నా పీడకు ముఖ్య కారణం ద్రౌపది దృష్టి దోషమని పండిత గోవింద చరణు నిర్ధరించాడు ఆ దోషాన్ని తొలగించాలని దానికి ధూపం

వేయాలని ఆయన సలహాయిచ్చాడు ఆయన అటు వెళ్ళకముందే అమ్మ ధూపహారతి తీసుకువచ్చి ఆయన యిచ్చిన ధూపం అందులో నిప్పుల మీద వేసింది. ఊదగానే గాఢమైన వాసన వచ్చింది. నాతలచుట్టూ ఆధూపాన్ని తిప్పి గదులంతా ధూపంవేసి ఆవిడ ఏదో మంత్రాలు గొణగ సాగింది, నాజ్వరం తగ్గలేదు.

22వ పదాతిదళం లోని గుమాస్తా భార్య సలహా అడిగింది అమ్మ. పదాతిదళం నివసించే యిళ్ళవెనుక పీరును పూజించే ఒక ముస్లిమ్‌ను పిలిపించారు.

లూధియానాలో హరీష్ యింటిముందు స్మశానంలో కనిపించిన మహమ్మదీయ ఫకీరు వల్ల నాకీ జ్వరం వచ్చింది. కాబట్టి మరో పీరు ద్వారా నన్ను ఆవహించిన దయ్యం తరిమి వేయబడాలి. 22వ పదాతి దళానికి చెందిన ఆ మహానుభావుడు ఆకు పచ్చని దుస్తులూ, తలపాగా ధరించి వచ్చాడు. అమ్మ చెప్పిన ఖ్వాజా ఖైజరులా వున్నాడు. అమ్మ ఐదు రూపాయలు అతని చేతిలో పెట్టింది ఆయన మూడు కాగితం ముక్కలు తీసి అమ్మ నగల పెట్టెలోంచి తీసి యిచ్చిన వెండి తాయత్తులో పెట్టాడు. అమ్మ ఆ తాయత్తును నా మెడలో కట్టింది. నన్ను దయ్యం ఆవహించి ఉండవచ్చుననీ, దానికి కోపం వచ్చింది కాబట్టి నా పక్షాన పీరుతో మాట్లాడి దైవానుగ్రహం సంపాయిస్తాననీ అమ్మతో ఆయన చెప్పాడు. అలాంటిదేదో జరిగి ఉంటుందని నమ్మిన అమ్మ ఆ మహానుభావుని మాటలను విశ్వసించి, ఆయన వాగ్దానానికి కృతజ్ఞతలు చెప్పింది. ఆయనకిష్టం వచ్చినపుడు వచ్చి భిక్ష స్వీకరించ వచ్చునని చెప్పింది మా కుటుంబం ఆగాఖాన్ మతాన్ని అనుసరిస్తోం దని ఆయనతో అంది. ఆ మహానుభావుడు ఖురాన్ చదివి అల్లానూ, మహమ్మదు ప్రవక్తనూ ప్రార్థించి నా ఆరోగ్యం కుదుట పరచమని కోరాడు.

నా మెడలో తాయత్తు వుంది. దాన్ని గురించి నాన్నకు చెప్పక తప్పలేదు అమ్మకు ఒక మహానుభావుడు ఇది యిచ్చాడని అమ్మ అన్న పుడు నాన్న ఆవిడను చీవాట్లు పెట్టాడు. ఈ అప్రయోజనమైన పనులు ఎందుకు? తాయత్తులు జ్వరం తగ్గించవు. నీవంటి మూర్ఖులవద్ద నుండి

డబ్బు గుంజటానికి ఈ ఫకీర్లు కాగితం ముక్కలిస్తారు.

ఇలాంటి మహనీయులమీద నాన్నకు విశ్వాసం లేక పోవటంతో నేను కూడా సందేహంలో పడ్డాను. కానీ లూధియానాలో నేను చూసిన ఆకారం నాలో భయాన్ని ఇనుమడింపజేసింది ఈ భయంతో అమ్మ నమ్మకంవైపు మొగ్గు చూపాను. ఒకవేళ అలాంటివి శరీరంపై ఆవహిస్తే వాటిని వదిలించుకోవాలి. నాన్న అనుమాన స్వభావానికీ, కోపానికీ అమ్మ ఏడ్చింది. అమ్మ చెప్పిన మాట ప్రకారం ఆ మహ నీయుడు ఉదయం, సాయంత్రం భిక్షకు వస్తుండటంతో అతని ఆశ అమ్మకు తెలిసిపోయింది అప్పటి వరకూ వీరి రాకను ఎదురుచూసే ఆమె, మా యింట్లో వంట పూర్తిగాకముందే ఆయన వచ్చి నిల్చోని తన వాటా ఇవ్వమని అడిగినట్లు నల్లని పుత్తైను చాపేవాడు అతనికిచ్చే పైసలు ఆపి, శివ ద్వారా ఆయనకు భోజనం పంపుతానని అమ్మ చెప్పింది.

హిందూ పురోహితుని మంత్రాలుగాని, ముస్లిం మహనీయుని తాయ త్తుగాని నాకు నయం చేయలేదు. మా వీధిలో స్త్రీజనం చెప్పిన ప్రకారం మా అమ్మ మంత్రగాడిమీద నమ్మకం పెట్టుకొంది.

నా స్నేహితుడు బాకా అక్క వీధులూడ్చే సోహని. ఆవిడ ఒక ప్రమిద వెలిగించి నాలుగు వీధుల కూడలిలో రాత్రిపూట వదిలి, దాని చుట్టూ బియ్యంగింజలు చల్లమని సలహా యిచ్చింది వాళ్ల దేవత గూడా, చీపురుద్వారా మన యిబ్బందులను, అడ్డంకులను వూడ్చి, దీపం పెట్టిన వారికి రక్షణ కల్పించ గలదు. ఇది కూడా చేశారుగాని, జ్వరం తగ్గు ముఖం పట్టలేదు.

నేను దయ్యాన్ని చూసినప్పుడు ధరించిన గుడ్డలు దానంచేస్తే, ఆ పీడ అంతటితో విరగడ అవుతుందని చాకలి గులాబీ చెప్పింది. ఇలాంటి వాటివల్ల ప్రయోజనం లేదని అమ్మకు తెలుసు. అయినా ఈ గుడ్డలు వదలిపోతే, పీడ విరగడ కావచ్చునని నా చొక్కా, పైజామా గులాబీ కొడుకు రామచరణ్‌కు యిచ్చి వేసింది

అలీ తల్లి బేగం రసూల్ నన్ను చూడటానికి వచ్చి, నా కళ్లలో

కాంతిని బట్టి సైతాన్ నన్ను ఆవహించలేదని చెప్పింది. శనిదేవత కంటె తుంటరి అయిన నన్ను ఏదీ ఆవహించదని చెప్పింది కాబట్టి పేదలకు మేకనుకోసి నాపేర భోజనాలు పెట్టిస్తే తప్ప మరోమార్గం లేదని చెప్పింది.

చిన్నప్పుడు రామచరణ్ నాతలమీద కొట్టినప్పుడు, అలీ తల్లి ఈ విధంగానే సలహా యిచ్చిన విషయం గుర్తుకు వచ్చింది. ఇంట్లో ఖర్చులకు యిచ్చిన డబ్బుతో ఇలాంటి పనులన్నీ చేస్తున్న అమ్మకు ఈ సలహా చాలా ఖర్చుతో కూడుకొన్న పనిగా తోచింది.

మేకమాంసం పంచడం ద్వారా యింతకు ముందు నాకు కలిగిన దోషం పరిహరించబడిన సంగతి గుర్తుకువచ్చి, ఈ బలికోసం బేగం రసూల్ చేతిలో పదిరూపాయలు పెట్టింది. నా విషయంలో ఇలాంటి తంత్రాలు ఏవీ పని చేయలేదు చాలా రోజులు జ్వరం 103° తగ్గలేదు. కల్నల్ డగ్లస్ వద్ద సహాయకుడుగా పనిచేసే డా చునీలాల్ ధర్మామీటర్ పెట్టి చూసి ప్రయోజనంలేదని నాన్నకు చెప్పాడు ఒకసారి పెద్ద డాక్టరును తీరిక చేసుకవచ్చి చూసి పొమ్మని కోరవలసిందిగా మానాన్నకు సలహా యిచ్చాడు.

38వ డోగ్రా దళాధిపతిని యీ విషయంలో జోక్యం చేసుకోవలసిందిగా మానాన్న కోరడంతో డా. డగ్లస్ మాయింటికి యాంత్రికంగా వచ్చి పరీక్ష చేసాడు ఆయన సలహామేరకు రాత్రింబగళ్లు పరిచర్యలు చేయడానికి 'నర్సు' ఏదని కోపపడ్డాడు డబ్బు ఖర్చు అవుతుంది కాబట్టి ఆయన సలహా పాటించలేదని డా. చునీలాల్ చెబితే, రావల్పిండి సైనిక ఆసుపత్రినుండి ఒక నర్సును పిలిపిస్తానని ఆయన చెప్పారు.

కొద్దిరోజుల తర్వాత, పొడువాటి నల్లని దక్షిణ భారతదేశపు నర్సు సిస్టర్ థామస్ వచ్చింది ఆవిడ మాయింట్లో క్రైస్తవ సామ్రాజ్యాన్ని నెలకొల్పింది. ఆవిడ కోసం నాన్నగది ఖాళీ చేయించారు. ఆఫీసునుండి ఆవిడ కోసం ఒక కుర్చీ, బల్ల తెప్పించారు. ఆవిడ నేలమీద కూర్చొని భోజనం చేయలేదుగాబట్టి వాటిమీద తినేది. ఈ నల్ల నర్సు దొరతనమంతా అమ్మ ఎగతాళికి గురి అయింది కానీ, ఆవిడ పరిచర్యల

సమయంలో మతాన్ని జోడించటం అమ్మకు బాగా నచ్చింది నాముఖం తుడవటానికి వచ్చినపుడు ధర్మామీటరు పెట్టడానికి వచ్చినపుడు ఆవిడ భగవంతుని ప్రార్థిస్తున్నట్లు చేతులు గుండెలపై అడ్డంగా తిప్పటం ఆమెకు నచ్చింది ఆవిడ శారీరక పరిచర్యలతోపాటు ఈ విధంగా ఏసుప్రభువును ప్రార్థించి ఆశక్తి ద్వారా నయంచేయడానికి ప్రయత్నిస్తున్నదని అమ్మ భావన మన దేశంలోని దేవతలందరూ చేయలేని పనిని ఆ విదేశీదేవుడు చేయవచ్చునని ఆమె నమ్మింది.

కర్నల్ డగ్లస్ చెప్పినట్లుగా నాకుపట్టిన టైఫాయిడ్ జ్వరం, జ్వరాలన్నింటిలోకీ విషపూరితమైనది అది థామస్ నర్సుకు కూడా లొంగలేదు. నిజానికి ఆవిడ రాగానే నాజ్వరం 104°లకు పెరిగింది అలానే మూడు రోజులు వుండటంతో నా పరిస్థితి విషమించిందని హరీష్‌కూ, దేవకికీ టెలిగ్రాములు పంపారు నామీద అందరూ శ్రద్ధ చూపడమూ, మంత్రతంత్రాలూ నన్ను మరీ భయంభ్రాంతుణ్ణి చేశాయి. పెద్దలు బహిరంగంగా నేను బ్రతకటం గురించి సమస్యగా భావిస్తున్నారు నేను చనిపోతున్నట్లూ, ఎవరినీ ప్రేమించనంతగా నాన్న నన్ను ప్రేమించటమూ గమనించాను లూధియానాలో నాకు దొరకని అభిమానాన్ని, నేను యిలా జబ్బుపడి అమ్మనాన్నల నుండి, శివ నుండి పొంద గలుగుతున్నాను గాబట్టి ఈ జబ్బు ఇంకా కొనసాగితే బాగుణ్ణని అనుకున్నాను.

ఒక్క ముంతాజ్ నాకు అలాంటి ప్రేమ నందించేది మృత్యువుతో లోలోపల పోరాడ సాగాను నా అభినయమూ, నిజమూ ఒకటైనాయి. వరండాలోని నిశ్శబ్ద వాతావరణంలో నా జీవితం క్రమక్రమంగా తగ్గిపోసాగింది వూపిరాడటం లేదు. నన్ను మంచం మీదనుంచి క్రిందకు దించారు నాచూపులూ అమ్మ ఏడుస్తూ చేసే ప్రార్థనలూ మిగిలి పోయాయి ఏడవకుండా ప్రార్థనలు చేయమని సిస్టర్ థామస్ అమ్మకు యిచ్చిన ఆజ్ఞలు అర్థరహితంగా తోచాయి

నన్ను నేలమీద పడుకో బెట్టినపుడు దేవకీ, హరీష్ వచ్చారు. వాళ్ళు రావడంతో అందరూ గుండెలు బాదుకోవటం మొదలెట్టారు. ఊపిరి ఆడకపోయినా ఆక్షణంలో నా పరిస్థితి నాటకీయంగా వుంది. నేను వీళ్ళందరినీ వదిలి వెళ్ళవలసి వచ్చినా వీళ్ళ ప్రేమకు నోచుకున్నాను

ఇప్పుడు హరీష్ నా దృష్టిలో దోష రహితుడు. నా ఆలోచనలో అతడు ద్రౌపదిని పుట్టింటికి పంపి ముంతాజ్‌ను పెండ్లాడాడు. హరీష్ తెచ్చిన పండుకోసం నేను తాపత్రయ పడ్డాను. అలాంటి వేమీ నేను తినకూడ దనీ నాకు నయమైనపుడు పెడతామనీ చెప్పారు. నాకు స్పృహ వచ్చి దేవకిని నా పక్కన పడుకోమని బ్రతిమాలాను. నర్సు అందుకు అభ్యం తరం చెప్పింది. సిస్టర్ థామస్ మంచి రోగిలా ప్రవర్తించమని నన్ను ప్రాధేయపడింది. ఆవిడ మెడలోని శిలువపై చెక్కిన ఏసు ప్రభువు నాకు నచ్చాడు. దేవకి అందమూ, సౌందర్యమూ ఆవిడకు ఏవగింపు కలిగిం చాయి. నర్సు అమ్మతో అంది 'ఈవిడ పాపాత్మురాలు'అని. అప్పుడు దేవకి యింట్లో లేదు. పిన్నిపట్ల మా నాన్న మొగ్గు చూపటంవల్ల దేవకి పట్ల అమ్మ పక్షపాతంవల్ల నర్సు చెప్పిన మాటలు అమ్మ విశ్వసించింది. అమ్మ చూపులను నర్సు దృష్టినీ తప్పించుకుని దేవకి అభిమానాన్ని పొందాలని నా తహతహ.

జ్వరంవల్ల కలిగిన శారీరక రుగ్మతవల్ల నాపై నాకే ఉదాసీన భావం కలిగింది. నా కనుగొలుకుల్లోంచి దృష్టి సారించి నాచుట్టూ వున్న ప్రపంచాన్ని, వ్యక్తుల్ని చూడసాగాను. ప్రపంచంలోని ఈ తోలు బొమ్మలాటపై నాకు విరక్తి కలిగింది.

జీవితంపై కొద్దిపాటి ఆశతో మంచిగా ప్రవర్తించ సాగాను. అంద రితో బాగా వుండటానికి నాశక్తిని కూడదీసుకున్నాను. నేను స్వతహాగా మంచివాణ్ణి. కొద్దిరోజులు జ్వరం 101°లకు తగ్గింది. నాతో సహా అందరూ సంబరపడ్డారు. జీవితంలో తిరుగు మజిలీ ప్రారంభమైందని సిస్టర్ థామస్ నన్ను కంట్లో వత్తులు వేసుకొని శ్రద్ధగా చూడసాగింది. ఆశ్చర్యకరంగా జ్వరం 100°లకు తగ్గింది. అమ్మ దేవాలయానికి కాను కలు పంపింది. ముస్లిమ్ మహనీయునికి కడుపునిండా భోజనం వేడివేడి కూరలూ పంపింది. జ్వరం 99° దగ్గరకు వచ్చినపుడు అందరికీ లడ్లు పంచిపెట్టారు.

– చిక్కి శల్యావశిష్టమైన నా శరీరానికి బలం చేకూరటానికి కొంత వ్యవధి పడుతుంది. కోడిగుడ్డు సొన నాకు పథ్యంగా పెట్టారు. జీవితంపై ఆశలు చిగురించాయి. నాచుట్టూవున్న వారి అనురాగానికి పాత్రమ

య్యాను. నేను మేల్కొన్నపుడు బడిలో అంతా సక్రమంగా వుండాలనీ, మాస్టర్ల తిట్లూ, తన్నులూ తప్పిపోవాలనీ కోరుకున్నాను. ద్రౌపది వద్ద నుండి అమ్మవద్దకు చేరుకోవాలని తహతహ. నాకు జ్వరం నయమైతే తప్పని సరిగా ఆకానుక ఇస్తామని చెప్పారు.

నాజ్వరం లాగానే నేను కోలుకోవటానికి కూడా చాలకాలం పట్టింది. జ్వరంవల్ల నాలోని శక్తి అంతా క్షీణించి పోయింది. వారాల తరబడి నేను అలానే మంచంపై వుండిపోయాను. స్వశక్తిమీద లేచి నించోడం కానీ కూచోడం కానీ చేయలేక పోయాను.

నేను తినే ఆహారంలో మామూలు పదార్థాలు క్రమంగా పెట్ట డంతో నా ఆరోగ్యం క్రమేణా కుదుట పడుతున్నట్లు సూచనలు కనిపించాయి. తీవ్రంగా జబ్బున పడ్డవ్యక్తి శక్తిని పుంజుకోవటంలో వున్న ఉత్సాహం నాకు కలిగింది జీవన్మరణాల మధ్య వున్న తేడా నా నరనరాల్లో కనిపించిది. నేను మళ్ళీ నడవగలిగి నా స్నేహితులైన బాకా, రామ చరణ్, అలీలతో ఆడుకోవాలని కుతూహల పడ్డాను. వాళ్ళందరూ నన్ను చూడాలంటున్నారని శివ చెప్పాడు. నేను కోలుకునేంత వరకూ వారి తల్లిదండ్రులు నాకు అన్నీ ఏర్పాట్లు చేస్తామనీ వాగ్దానాలు చేశారు. నేను గండం గడిచి గట్టెక్కాను కాబట్టి మా కుటుంబం భవిష్యత్తును గూర్చి వాళ్ళు ఆలోచించ సాగారు. దేవకి మాతో జీలంలోనే వుంది కాబట్టి ఆవిడతో యధాలాపంగా మాపెంపకం గురించి అమ్మా, నాన్నా మాట్లాడారు.

యధాలాపంగా అనిపించినప్పటికీ మా అమ్మా నాన్నా వుద్దేశ్య పూర్వకంగానే ఆమాటలు వాడారు. ఆవిడ మరోరకంగా డబ్బు ఖర్చుపెట్టకుండా పిల్లలమైన మామీద ఖర్చు పెట్టాలని వాళ్ళ పథకం. ఆవిడ అమాయకంగా వాళ్ళతో ఒకసారి అంది— ఆయింటి యజమాని మిగిల్చిన పైకంలో కొంత ఆయన ఆత్మశాంతి, స్వర్గ సుఖంకోసం ఆయన పేరుతో ఏదైనా ధర్మ సంస్థకు శాశ్వత నిధిగా యిద్దామని దేవకి వుద్దేశ్యం. మొదట్లో మౌనంగా వున్నప్పటికీ అమ్మా నాన్నలకు ఆ ఆలో చన అంతగా నచ్చలేదు. మాది సుఖసంతోషాల కుటుంబమనీ మా అందరి మధ్యా ప్రేమానురాగాలు ఉన్నాయనీ ఈ కంసాలి సోదరుల

కందరికీ మా ఐకమత్యాన్ని మార్గ దర్శకంగా చూపవలసిన అవసరం వుందనీ చెప్పారు. మా కంసాలి జాతిలో కుటుంబాలన్నీ తగాదాలతో మునిగి తేలుతున్నాయి. మా పెదనాన్న కుటుంబమైన లల్లా అమీర్ చంద్ కోకోకిల్లీ కుమారులూ, కుమార్తెలు ఒకరితో ఒకరు సయోధ్యత లేక తగవులాడు కుంటున్నారు.

నా ఆరోగ్యం సరిలేని సందర్భాన్ని పురస్కరించుకొని నేను అభి మానించే పిన్నిచేత వాగ్దానాలు చేయించాలని అమ్మా నాన్నా ప్రయ త్నిస్తునందుకు విచారించాను. వీళ్ళు చెప్పిన మాటలు దేవకి నింపాదిగా విని ఆవిడ స్వశక్తిమీద ఆధారపడిన వ్యక్తి కాబట్టి ఆ విషయాలు ఆలోచించి చెపుతానంది ఆమాట అమ్మనాన్నలను కదిలించి వేసింది. అమ్మకు ఈ ముండమీద ఎప్పుడూ లేనంత ద్వేషం కలిగింది. నాన్న అభిమానమనే సూత్రం ద్వారా ఆవిడను మెత్తబరచి గణేశ్ పట్ల ఆవిడ బాధ్యతలను గుర్తు చేద్దామనుకున్నాడు.

ఆవిడ నెమలి మెడను నాపై వంచి నానుదురు ముద్దుపెట్టు కొని అమృతసర్‌కు వెళ్ళిపోయింది. ఆవిడ మీద అమ్మానాన్నా పన్నిన కుట్రగురించి ఆలోచిస్తూ పడుకున్నాను

సుఖమయ ప్రపంచం పరిధిలోనుంచి బయటకు వచ్చి ఆలోచిస్తూ ఏడవ సాగాను. బలవంతం చేస్తే తప్ప భోజనం చెయ్యటం లేదు. గుండెలో ఆవేదన నన్ను అలముకొంది. ఇంగ్లీషు పిప్పరమెంట్లు, చాక్లెట్లు కావాలని ఆరాటపడ సాగాను.

నా శరీరాన్ని పోషించటానికి మా అమ్మా నాన్నలు శ్రద్ధ చూపు తున్న ధోరణికి సర్దుబాటు ధోరణి వహించాను. నాలోని నగ్న సత్యాలను దాచుకోసాగాను.

యుద్ధం అయిపోయిన తర్వాత సైన్యంలో తన భవిష్యత్తును గురించి అనుమానాలు, సందేహాలూ, నాన్న అమ్మతో రహస్య సంభా షణల్లో వ్యక్తం చేసేవాడు. యుద్ధం అయిపోగానే 38వ డోగ్రా దళం వారిని వెనక్కు పిలిపించి, యిళ్ళకు పంపించి వేస్తారు. పదాతి ధళంలో యిప్పుడు రెండు ప్రధాన వర్గాలు ఉన్నాయి. కుమావ్ పర్వత ప్రాంతా

లకు చెందిన కొండ జాతి దళం ఒకటి. వాళ్ళందరూ ఈజిప్టు లోని యుద్ధ భూమిలో పని చేయటానికి శిక్షణ పొందిన వారు. మరో దళం డోగ్రాలది. వారు పర్వత ప్రాంతీయులను వైస్‌రాయ్ సైన్యంలో పెద్ద హోదాలకు రానీయకుండా అడ్డు పెడుతున్నారు. నాన్న తన దళానికి చెందిన అధికారి మేజర్ ట్రయిల్ తో ఈ విభేదాలు పోగట్టమని కర్నల్ హోదా ధరించినట్లుగా గొప్పలు చెప్పుకుంటున్నాడు. వారిలో కొందరిని జమేదారులుగా, సుబేదారులుగా ఘర్వాలీ దళంలో నియమించి వారి అధికారాలను వారే చూసుకొనేలా చేస్తే, ఈ బేదాభిప్రాయాలు పోతాయి. కానీ, ఈ సర్కారు ముండా కొడుకులు తగవులు పెట్టి ఐకమత్యాన్ని చెడగొట్టాలని చూస్తున్నట్లు ఆయన అభిప్రాయం. సిమ్లాలోని సైనికాధికారులు కానీ, మేజర్ ట్రయిల్ కానీ, దళాధిపతి కానీ కొండజాతి వారికి ఉన్నత పదవులిచ్చి డోగ్రాలకు కోపం తెప్పించటానికి యిష్టపడరు. కొండజాతి వారి పట్ల తన సానుభూతిని మా నాన్న చూపుతున్నాడు కాబట్టి డోగ్రా అధికారులు తమపై అధికారులకు చాడీలు చెప్పుతున్నారు. మా నాన్న చేత త్వరగా పదవీ విరమణ చేయించి, బాబూ ఛత్తర్ సింగ్‌ను కానీ, లేదా యుద్ధంలో మంచి ప్రతిభ చూపిన మరొకరిని కానీ, ఈ దళానికి హెడ్ గుమాస్తాగా నియమించమని ఒత్తిడి చేస్తున్నారు. బహుశా నాన్నకు, ఛత్తర్ సింగ్‌కూ మధ్య ఉన్న విభేదాల వల్ల ఆయన భార్య గౌరీదేవి నా అనారోగ్య సమయంలో ఒక్కసారి మాత్రం వచ్చి వెళ్ళింది. తన ఉద్యోగం పోతుందనే భయం వల్ల మా పెంపకానికి దేవకి చేత ఖర్చు పెట్టిద్దామని ఆయన ఆదుర్దా చూపుతుండ వచ్చు దేవకి వెళ్ళటానికి ముందు కంటే ఇప్పుడు నాన్న పట్ల సానుభూతి ఎక్కువైంది. కొండజాతి వారి పక్షాన డోగ్రావారికి వ్యతిరేకంగా పోరాటం సాగించటంలో నాన్న నేర్పరి అని నాకు అర్థమైంది. కొండజాతి వారు మాకు కానుకలు తెచ్చి యివ్వటం గురించి అమ్మ అస్పష్టంగా చెప్పేది. వారి పట్ల నాన్న పక్షపాతం చూపుతున్నారు కాబట్టి ఆయన పదవీ విరమణ చేసివస్తే, తేహరీ కొండ ప్రాంతానికి ఆయనను ప్రధానమంత్రిగా చేస్తామని వారు చెప్పేవారు. ఆయనకు ఎన్ని పనులున్నప్పటికీ కొంచెం సేపు నా వద్ద కూర్చొని చదువులో తర్ఫీదు యిచ్చేవాడు ఇటీవల నా చదువు భంగం అయింది కాబట్టి నిర్ణీత కాల వ్యవధిలో నేను

మెట్రిక్ పరీక్షలకు కట్టాలని ఆయన ఆశయం. మా నాన్న ఆఫీసుకు వెళ్ళినపుడు ఆయన బల్లపై పెట్టిన ఆంగ్ల నవలలు తిరగ వేసేవాడిని.

నేను పరీక్షలు పూర్తి చేసుకొని జీలమ్‌కు వస్తే నవలలు విపరీతంగా చదువవచ్చు. కానీ, అమృత్‌సర్‌లో గణేశ్ నాకంటే చదువులో ముందుకు వచ్చి, పరీక్షలు నెగ్గుతాడేమోనని అసూయ బయలు దేరింది. ఈ ఆలోచన రాగానే నేను పాఠాలు త్వరగా పూర్తిచేసి వల్లించసాగాను. లెక్కల్లో మాత్రం బాగా వెనుకబడి వున్నాను.

తెల్లదొరలు దళాధిపతులుగా మా నాన్నకు యిచ్చిన గౌరవాన్ని పురస్కరించుకొని మా కుటుంబం అంతా భేదాభిప్రాయాలు మరిచిపోయి గౌరవప్రదమైన మహోన్నత ఆదర్శాలు గల కుటుంబంగా నటించసాగాము. మా నాన్న పట్ల ప్రజల అసూయ కూడా మా హోదాను పెంచింది. ఆయన చాలా ముఖ్యమైన వ్యక్తి కాకపోతే అంత మంది శత్రువులు వుండరు.

నాలో పరిపక్వత ఏ విధంగా యవ్వనానికి దారి తీసింది, నాలో తీవ్ర అసంతృప్తి ఏ విధంగా మిగిలిపోయింది వూహించసాగాను. నాలో సుగంధ పరిమళాలు వ్యాపించి నాలోని శబ్దాలు కవిత్వంగా పుష్పిస్తే బాగుండు ననుకున్నాను. ఆ విధంగా జీవితం ఒక వుద్యానవనం కాగలదు

వేసవి కాలంలో నేను సరిగా నడవలేక పోయేవాణ్ణి. చలికాలం వచ్చేసరికి నేను తొట్రు పడకుండా కొద్ది గజాలు నడవగలిగాను. ద్రౌపది నన్ను మళ్ళీ నిర్లక్ష్యం చేసే అవకాశమూ, బుద్ద సింగు మాష్టరు కోపోద్రిక్తుడయ్యే అవకాశమూ ఉన్నప్పటికీ సంవత్సరాంత పరీక్షల దృష్ట్యా లూధియానాకు నేను హరీష్‌తో వెళ్ళాలని నిశ్చయించారు. వాళ్ళ యిద్దర్నీ గురించి నా భయాలు వ్యక్తం చేశాను. లూధియానాలో నేనున్నంత కాలం బుద్ద సింగు మాష్టారును మెత్తబరచడానికి ఏదైనా కానుక యిచ్చి నేను పరీక్షలు వ్రాసేందుకు ఆయనను అంగీకరింప చేద్దామనుకున్నారు. పరీక్షలకు నాకు తర్ఫీదు యివ్వటానికి ప్రత్యేకంగా ఒక మాష్టారును ఏర్పాటు చేస్తామనీ ఆయనకు చెబుదామను కున్నారు. గణేశ్ వచ్చినా రాక పోయినా నన్ను జీలముకు పిలిపించి ప్రభుత్వ

పాఠశాలలో యిక్కడ చేర్పిస్తామని అవసరమైన దానికంటే ఒక్క రోజు కూడా నన్ను పరుల యింటిలో వుంచ బోమనీ హామి యిచ్చారు.

ఈ ఓదార్పువల్ల నేను సంబర పడ్డాను. నా శరీర ఆరోగ్యం కంటే తెలివి తేటలతో పరీక్షలు నెగ్గి మా నాన్నకు గర్వ కారణం కావాలని సంకల్పం. నా అహంకారం కోసమైనా నేను పరీక్షల్లో నెగ్గాలని నిశ్చయించుకొన్నాను. నెగ్గితే సుప్రసిద్ధులైన ఆంగ్ల రచయితలు థాకరీ, డికెన్స్, రెనాల్డు వంటి వారి రచనలు చదవటం కొనసాగించ వచ్చు. జీలమ్‌కు త్వరగా తిరిగి వస్తే నా భావ ప్రకంపనలను చుట్టూ తిరుగుతూ ఏకాంతంలో పిచ్చివాడిగా తిరిగాడుతూ, జీవిత సార్థక్యంలో క్షణక్షణమూ మునిగి పోవాలని కోరిక. మృత్యువుకు సన్నిహితంగా వెళ్ళినపుడు జీవితమనే కానుక ఎంత అద్భుతమైనదో తెలుసుకోగలిగాను.

* * *

# మూడో భాగం

# నిరంకుశపాలన

“మేఘాల ఛాయలో నుంచున్న నేను
వీక్షించాను దవ్వుల పొలాలలో సూర్యగమనం........”

— అజ్ఞాతకవి.

‘సృష్టికర్తల ప్రళయం నుండి భూమి పొందిన మార్పులు
మానవుడు, అతని ఆలోచనలు, అభిప్రాయాలు....’

— అజ్ఞాతకవి

# 1

లూధియానాలో పరీక్షలు వ్రాసి, అమ్మ, నాన్నలతో వుండిపో వడానికి వచ్చినపుడు, 38వ డోగ్రాదళం ఇటుకరాతి బార్కాసులలోంచి, కంటోన్మెంటు చివర మట్టి బార్కాసులలోకి మారింది. నేను కోలు కొంటున్నప్పుడు ఇటుకరాతి బార్కాసులను చూస్తూవుండేవాణ్ణి.

సైన్యంలో మానాన్న హోదా హవల్దారు అయినప్పటికీ, ఆయ నకు భారతీయ అధికారికి యిచ్చే యింటిని సంపాదిచే స్తోమత వుంది అలానే సైన్యంలో లాన్స్ నాయక్ హోదాగల బాబూ ఛత్తర్ సింగుకు కూడా ఎలానో అధికార్ల యిల్లు కేటాయించారు ఈ యిద్దరు అధికా రులు తమ కుటుంబాలను తమతో తీసుక రావడమే యిందుకు కారణం. మిగతా భారతీయ అధికారులు, సిపాయిలు చాలా మంది, భార్యలను తీసుకరాలేదు. ప్రతి సంవత్సరం వాళ్లు రెండునెలల సెలవు మీద యిళ్లకు వెళ్లి వచ్చేవారు. ఎక్కువ చదువుకోక, సైన్యంలో కిందిస్థాయి నుండి పైస్థాయికి ఎదిగినవారి కంటె, పైస్రాయి నియమించిన జమే దారు, సుబేదారుల కంటే హెచ్చుస్థాయిలో ఈ యిద్దరు అక్షరాస్యులు మెలిగేవారు. తాను 'కల్నల్' స్థాయిలో వున్నట్లు నాన్న తరచు గొప్పలు చెప్పుకొనేవాడు సైనిక దళం కార్యాలయానికి ఫర్లాంగు దూరంలో 'ఏ'కంపెనీ ముందు పెద్ద మట్టి యిల్లు కేటాయించారు, 'బి'కంపెనీకి ముందు బాబూ ఛత్తర్ సింగు యిల్లు కేటాయించారు.

బార్కాసులకు ఒకవైపు, ఆఫీసు వెనుక కవాతు మైదానానికి పక్క గోరక్‌నాథ్ పేర ప్రసిద్ధమైన చిన్న చిన్న గుట్టలు వుండేవి. ఆయన ఆప్రాంతాలలో కొండ శిఖరంపై ఒక ఆశ్రమం నిర్మించు కొని నివసించిన ముని. మరొకవైపు రోడ్డుకు అవతల చిన్న చిన్న గ్రామాలు. అందులో నివసించే మహమ్మదీయ రైతులు జీలంనది నీటిపై ఆధారపడి బ్రతికేవారు ఆతీరప్రాంతాలలో మాకు ఒకమైలు దూరంలో

కాశ్మీరు లోయలోంచి ప్రవహించిన జీలంనది, మానివాస ప్రాంతానికి మూడుమైళ్ళ దూరం వరకు ప్రవహించేది. ఈ నగరానికి ఆ నదీ ప్రవాహం వల్లనే ఈ పేరు వచ్చింది.

అమ్మనాన్నలతో కలిసి వుండేందుకు కొత్తవూరికి రావటం నాకు అమితానందం కలిగించి, వుక్కిరిబిక్కిరి అయ్యాను. ఖైదునుంచి విడు దలైన కుర్రవాని ఆనందోద్రేకమూ, క్రొత్త ప్రపంచంతో ముఖాముఖీ సంబంధమూ, ఆ ప్రపంచాన్ని విచ్చుకున్న కళ్ళతో విశాలంగా చూసే అవకాశమూ కలిగాయి. ఆప్రపంచాన్ని వందలాది భాగాలుగా కాక అద్భు తనిబిడీకృత శక్తిగా చూడగలిగాను. మా ప్రక్క వీధులలోని కుర్రవాళ్ళు, శివ, బాకా, రాఖా, చోరా, రామ్‌చరణ్, అలీల అజ్ఞానం కంటె ఎక్కు వగా నేర్చుకో గలిగానని గర్వపడ్డాను మానాన్న పాత స్నేహితులలో సిపాయిలుగా వుండి ఇప్పుడు హవిల్‌దార్, జమేదార్, సుబేదార్లుగా ఉన్న తిని పొందిన వారు నాపట్ల ఆప్యాయంగానూ సుహృద్భావంతోనూ వుండి నాయోగక్షేమాలను తెలుసుకునేవారు. నేను చచ్చి బతికానని వాళ్ళకు తెలిసినందువల్ల వాళ్ళు అలా చేసేవారు. నేను 6నెలలు మంచం మీద వునప్పటికీ పరీక్షలలో నెగ్గటం నాన్న కనిపించిన వారందరికీ గొప్పగా ప్రచారం చేయటం నా అహంకారాన్ని పెంచింది నాన్న కార్యాల యానికి వెళ్ళి నేను సిరా, కాగితాలు తెచ్చుకునే దానికి వెళుతుంటే నన్ను తరచూ చూసిన తెల్ల దొరలు యముని కబంధ హస్తాల్లోంచి ఇటీవలే బయట పడిన నాబక్కపల్చని శరీరాన్ని చూచి సానుభూతి కనపరచేవారు.

ఒకసారి దళానికి చెందిన అధికారి మేజర్ 'ఓగ్లివీ' తనగది తలుపు తెరుచుకొని బయటికి వచ్చి మొరుగుతున్న తన కుక్కను అదుపులో పెట్టి, నావణుకుతున్న చేతులతో కరచాలనం చేశాడు. అలానే కెప్టెన్ సులేవాన్ బయటికి వచ్చి నేనెవరో తెలుసుకొని నాబుగ్గపై చిటికెవేసి వచ్చీరానీ హిందూస్తానీలో — 'నీవు రామచంద్ర చిన్న కొడుకువు గదూ! నీవు చాల హుషారైన వాడివనీ, కవి కాదలచు కున్నావనీ విన్నాను' అన్నాడు.

'నేను పిచ్చివాణ్ణని మా నాన్న అనుకుంటాడు సార్' అన్నాను.

దళానికి చెందిన ఉన్నతాధికారితో ఆంగ్లంలో మాట్లాడినందుకు ఎంతో పొంగిపోతూ బాగా ఎదిగానని అనుకున్నాను.

నేను నాన్నతో మొదటిసారిగా పట్నంలోకి వెళ్ళిరావటం జయప్రదమైంది. నాకు లెక్కల్లో సరియైన మార్కులు రాకపోయినా గంభీర వదనంతో కనిపించే హెడ్‌మాష్టారు రాజా ఫజల్ మహమ్మదుఖాన్ నన్ను 8వ తరగతిలో చేర్చుకున్నారు. ఈ విధంగా పనులన్నీ సులభంగా అయిపోవడం పట్ల నాన్న సంబరపడి శివ అడగ్గానే చాల ఖరీదైన కాబూల్ ద్రాక్ష బుట్టెడుకొన్నారు. మమ్మల్ని జీలం నదిపై తిప్పేందుకు పడవలో తీసుకెళ్ళారు.

గణేష్‌కూడా ఇక్కడికి మాతో కలిసివుండటానికి వస్తే బాగుండునని సరదాపడ్డాను. మానాన్న మాకు ప్రత్యేకంగా యింటివద్ద యిస్తున్న తర్ఫీదు పొందటానికి గణేశ్‌ను పంపేందుకు దేవకిని అడిగితే బాగుండును. అమృతసర్‌లోని కచ్చాఫకీర్ ఖానా సందులోని కంసాలి పిల్లల చెడుసహవాసానికి అతణ్ణి దూరం చేయాలి. లాల్‌తన్ గ్రామానికి చెందిన అమ్మాయితో అతని వివాహం జరపటానికి మాపిన్ని మరికొంత కాలంవేచి వుందామని అనుకుంది.

జీలం కంటోన్‌మెంటులో జీవితం బహిర్గతంగా చూసినపుడు మెయిన్ మీర్, లాహోర్, నౌషీరాలతో సమానమే. సైన్యం కోసం పట్టణాల్లోని సుందర ప్రాంతాలు కేటాయించ బడేటట్లుగా తెల్లదొరలు (నిజానికి ఎఱ్ఱగావుంటారు) ప్రయత్నించేవారు. కంటోన్మెంటులో క్రమశిక్షణకు వారు ప్రాధాన్యం యిచ్చేవారు. రద్దీవల్లగాని, వర్షాలవల్లగాని రహదారులు చెడిపోతే వెంటనే బాగు చేయించే వారు. దుమ్ము ఎగరకుండా ఉదయం, సాయంకాలం రోడ్లపై నీళ్లు చల్లించేవారు. బంగళాలచుట్టూ కంచెలు వేయించేవారు. అందులో వారు భయభక్తులతో, నిశ్శబ్దంగా నివసించేవారు. అప్పుడప్పుడు దొరసానులు పనివారికోసం, వంటవారికోసం వేసే కేకలు మాత్రం వినిపించేవి. బ్రిగేడియర్ జనరల్ బంగళా నాలుగు వాకిళ్ల ముందు, ఆంగ్లేయులు ఆఫ్ఘన్లతోను, సిక్కులతోను పోరాడినపుడు సంపాదించిన తుపాకులను అందంగా అలంకరించారు. బ్రిటీషు దేశ జెండా పొడుగాటి కర్రకుకట్టారు. గాలిసరిగా లేక అది ఎగరడం లేదు.

అధికారుల క్లబ్‌నుండి, దళం వంటశాలలనుండి గోధుమపిండి సేకరించి కాల్చే రొట్టెవాసనల గుమగుమలు, మద్యం, సిగరెట్లు వాసనలు వ్యాపించేవి. కోపదారి బొచ్చుకుక్కలు, జాతికుక్కలు, వూరకుక్కలు, వరండాలోంచి వాటివాటి స్థాయికి తగ్గట్లు మొరిగేవి. ఇళ్లలోకి ఎవరూ రాకుండా అవి కాపాడేవి ప్రతి అరమైలు దూరంలో నుంచున్న కాపలా దారులు చిన్నపిల్లల్ని గదమాయిస్తూ, దొరలబంగళాల చుట్టూ తిరగండి గాని, గొడవ చేయవద్దని మందలించేవారు. సాయుధ దళాలకు చెందిన సిపాయిల బార్కాసులు సాధారణ ప్రజానీకానికి అందుబాటులో వుండేవి కావు. బార్కాసుల మొదట భారతీయ అధికారికి చెందిన విశాలగృహం వుండేది. దానిని కాపలాదారులు రక్షించేవారు. ప్రత్యేకించి కవాతుమైదానాలు, సిబ్బంది కార్యాలయం, తుపాకులూ, మర తుపాకులూ, గుండ్లూ భద్రపరచిన ప్రదేశాన్నీ కాపలా కాచేవారు. రోజూ కాల చిహ్నంగా గంట మ్రోగించేవారు. సిపాయిలు క్రమశిక్షణాయుత జీవనానికి అలవాటు పడటానికి కవాతుకు, భోజనానికీ, విశ్రాంతికీ, ఆటలకూ, నిద్రకూ — సూర్యోదయానికీ, అస్తమయానికీ గుర్తుగా బాకా వూదేవారు.

అధికారుల వంటశాలలో వరండాలో నిలువెత్తు అద్దం అమర్చారు. అందులో అధికారులు టోపీ సరిచూసుకుంటారు దాని ప్రక్కనే చేతికర్ర వుంచుతారు. అక్కడికి నేను రోజూ వెళ్ళటం అలవాటు చేసుకున్నాను.

కొద్ది రోజుల తర్వాత గణేశ్ రానే వచ్చాడు ఒకసంవత్సరం తర్వాత వాణ్ణి చూసిన అత్యుత్సాహంలో వాడిపట్ల ఆప్యాయత చూపాను. అమ్మా, నాన్న, శివా, నిజానికి దళంలోని ప్రతి ఒక్కరూ నాపట్ల చూపుతున్న ఆప్యాయతలో తడిసిపోయాను. ప్రతి విషయానికీ నన్ను ప్రత్యేకంగా చూస్తున్నారు. నాలోని అహంకారం వూరట పొందింది. శివ చిన్నవాడు కావటంవల్ల అందరి హృదయాల్లోనూ స్థానాన్ని సంపాదించుకున్నాడు. గణేశ్‌కు అందువల్ల రెండవ స్థానమో, మూడవ స్థానమో రావడం నేను గమనించాను. క్రిస్మస్ సందర్భంగా మేజర్ ఓగ్లివీ, కెప్టెన్ ఓ సులివాన్ పంపిన మంచి వస్తువులలో సగం నా అంతట నేను గణేష్‌కూ పంచియిచ్చాను. ఆఫీసు అలమరలోనుండి నాన్న తెచ్చిన కాగితాలూ, హవిల్‌దార్ చత్తర్‌సింగు నాకు యిచ్చిన హాకీఆట వస్తువులూ సమం

గాపంచి యిచ్చాను. జీలం కంటోన్ మెంటులో నూతన జీవితానికి వాడికి మార్గదర్శకుణ్ణి అయ్యాను.

దేవకి పిన్ని దత్తపుత్రుడు కాబట్టి అమ్మ తనను పరాయివానిగా చూడటం గణేశ్ మౌనిగా స్వీకరించాడు. భోజనాల వేళ నాప ళ్ళెంలో కంటె వాడి పళ్ళెంలో తక్కువ పెరుగు వేసి అమ్మ పక్షపాతం చూపేది. ఇటీవల నేను నానాయాతన పడ్డానని త్వరగా కోలుకోవాలనే తాపత్రయంలో యిలా చేస్తున్నాననీ ఆమె కారణం చెప్పేది.

నా ప్రాధాన్యం గుర్తించబడింది కాబట్టి గణేశ్ పట్ల సానుభూతి ప్రకటిస్తూ, వాడిపట్ల జాలి చూపితే బాగుండదని అదివాణ్ణి గారాబం చేసినట్లవుతుందని యిలా అన్నాను

'అమ్మకు దేవకి అంటే యిష్టం లేదు.'

'నేనన్నా!' గణేశ్ సమాధానం — 'ఆవిడ డబ్బు వృధాచేస్తోంధి అని అమ్మ వుద్దేశ్యం. గురుదాస్ పూర్ జిల్లాలో కనోవాగ్రామంలో ఒక మరానికి బాబాయి స్మృతి చిహ్నంగా ఒక బావి త్రవ్విస్తానని ఆవిడ వాగ్దానంచేసింది. ఆవెధవ అనంత ఆమెను పాడుచేస్తున్నాడు.'

'అయితే అమ్మకూ నాన్నకూ ఈ విషయం ఎందుకు చెప్పకూడదూ' అన్నాను.

గణేశ్ అడ్డంగా తల తిప్పాడు. వాడు సహజంగా గోప్యంమనిషి. పెద్ద మనిషి తరహాగా వుంటూ చాడీలుచెప్పటం ఇష్టపడడు. దేవ కిని గురించి అలామాట్లాడేటప్పుడు నాగుండెలోతుల్లో దేవకి సుగంధ పరిమళాలపట్ల అవిధేయతను తిరగతోడాను. నాపట్ల ప్రత్యేకత చూపక పోవటం, పిన్ని మా పెద్దన్నను దత్తత తీసుకోకపోవటం నాలో ఈ వ్యతిరేకతకు, గణేశ్ పట్ల అసూయకు కారణం.

కొంత గొడవ జరుగుతుందని తెలిసినా నిజం బయట పెడదామ నుకున్నాను. ఎక్కువ గొడవ జరిగితే మరీ మంచిది. ఆ గొడవకు కారణం నేనౌతాను, కాబట్టి నాకు ప్రాధాన్యం యిస్తారు. భోజనాలకు ఆరాత్రి అందరం వంటగదిలో కింద కూచుని వున్నపుదు నాన్నకు అవి

షయం బయట పెట్టాను. నేను జ్వరం నుంచి కోలుకున్నప్పటినుంచీ అమాయకంగా గారాబంగా మాట్లాడటం అలవాటు చేసుకున్న ధోర ణిలో గణేశ్ చెప్పిన విషయం చెప్పాను.

ఆవిషయం అంతవరకూ అమ్మకూ నాన్నకు తెలియక దిగ్భ్రాంతి చెందారు.

'బాబూ! నిజమేనా?' అన్నాడు నాన్న. ఆయన కళ్ళు ఎఱ్ఱబ డ్డాయి. అన్నం తింటున్న చేయి అలానే నిలిచిపోయింది.

'నాన్నా!' గణేశ్ ముఖం ఈ తుఫానుపట్ల కలగబోయే వాతావర ణానికి తెల్లబడింది

'నన్ను పిన్ని కనోఘాగ్రామం తీసుకెళ్ళింది అక్కడ మనకంసాలి సోద రులు చాలమంది సమావేశమయారు. వారందరూ అక్కడ మహంతు అయిన నందగిరిని గురువుగా స్వీకరించారు. ఆగుడిలోని శీతలఘర్ అనే ముదుసలి గుడికి మైలు దూరంలో వున్న గ్రామంలో పెద్దయింట్లోంచి నీళ్ళు కొండమీదకి మోసుకొచ్చి బట్టతలవాడయ్యాడు. నందగిరి దేవకి వంటి వాళ్ళెవరైనా యిక్కడ బావి త్రవ్విస్తే బాగుటుందన్నాడు. అందువల్ల తన చనిపోయిన భర్తకు శాశ్వతత్వం సిద్ధిస్తుందని చెప్పాడు. అందుకామె అంగీకరించింది.'

'ఇది చూడు ప్రతాప్ వదిలివెళ్ళిన డబ్బు అతని ఒక్కడిదేకాదు. ఉమ్మడి కుటుంబానిది. ఆభరణాలు యిళ్ళు ఉమ్మడి కుటుంబానికి చెందినవి' అన్నాడు ఆశ్చర్యంగా నాన్న.

'రాక్షసి అయిన మీ అమ్మ ఆ తిరుగు బోతు ప్రతాప్‌కు ఆస్తివదిలి వెళ్ళింది. అతను ఈముండకు వదిలి వెళ్ళాడు' అంటూ అమ్మ నాన్నను ఎద్దేవా చేసింది.

'సరే ఆవిడను తిట్టకు. నన్నేం చేయ మంటావోచెప్పు. ఈ వృధా ఖర్చు అవటమెలా. ..... నీవు చెప్పనాయనా ఆగుడికొండ మీద వుంది కదూ?' అన్నాడు నాన్న సమాధానంగా.

'నేను వెళ్ళి చూశాను కూడా. అక్కడ చేరిన వారందరూ దేవకి

పిన్ని లేనపుడు కొండమీద బావి త్రవ్వించటం ఎంతమూర్ఖత్వమో అని నవ్వుకున్నారు కూడా' అన్నాడు గణేశ్.

'అలాంటి బావి త్రవ్వించటానికి ఆవిడ దగ్గరవున్న మూటముల్లె ఖర్చైపోతుంది. ఆతర్వాత నిన్ను చదివించటానికి, నీపెండ్లి జరిపించటానికీ గానీ, ఆవిడ దగ్గర చిల్లిగవ్వ మిగలదు' అన్నారు నాన్నకోపంగా.

'అంతకు మించి ఆవిడ మనల్ని సహాయం చేయమని అడుగుతుంది' అమ్మ వ్యాఖ్యానంగా అంది—

—పొయ్యిమీద ఎక్కువసెగలో కాలిన చపాతీకి అంటుకున్న నిప్పును తడుతూ.

'బహుశా ఆవెధవ అనంత ఈవిడను ప్రోత్సహించి ఉంటాడు' అన్నాడు నాన్న ఊహాగానం చేస్తూ.

'ప్రేమికుడో! మరొకడో యిచ్చిన ప్రోత్సాహంతో ఆవిడ తన భర్తకు విషం పెట్టింది. నగలకోసం వాళ్ళ అమ్మా, నాన్నా వుసికొలిపి వుంటారు. అందరూ అనుకుంటునట్లు ఆవిడ ఇప్పుడు'...... ...అంది అమ్మ.

'ప్రేమికులతో సరదా కాలక్షేపం' అని చెడుస్త్రీలపట్ల వాడేవ్యంగ్యం పదజాలాన్ని అమ్మ వాడింది.

'పిల్లలముందు అలామాట్లాడటానికి నీకు తెలివివుందా?' అన్నాడు నాన్న సైగచేసి వారిస్తూ

అమ్మ గొల్లున ఏడ్చింది 'నా అదృష్టమే అంత! మొదట్లో మీ అమ్మ చేతిలో బాధ లనుభవించాను. ఇప్పుడు మీకు నామీద కంటె ఇతరుల మీద అభిమానం జాస్తి. మిమ్మల్ని కనిపెట్టుకుని ఈ పిల్లల్ని పెంచి పోషించాను.'

మామూలుగా అలాంటి సమయాల్లో భోజనం ఎవరూ సరిగాచేయరు. నాన్న ఆతర్వాత ఇక తినలేదు. ఈ చెడువార్త తీసుకు వచ్చి ఈ గందరగోళం సృష్టించటానికి తాను కారణమయానవే భయంతో గణేశ్

రెండు మెతుకులు గెలికాడు. నేనూ అంతే. అమ్మ తన ఏడుపు మధ్య శివను బతిమాలి అన్నం పెట్టింది.

ఆరాత్రి నాన్న మాకు పాఠాలు చెప్పలేదు. తన వాలు కుర్చీలో కూచొని వార్తా పత్రిక చదువుతున్నాడు. ఆయన కాళ్లముందు దుప్పట్లు కప్పుకొని మేము 8వ తరగతి పుస్తకాలు చదువుతున్నట్లు అభినయించాము. సోమవారం నుండి మాకు బడి మొదలవుతుంది. రాత్రి 10 గంటలకు మాకు పాలు యిచ్చి, అమ్మ నిద్ర పుచ్చింది. చాలాకాలంగా యింట్లో జరుగుతున్న గొడవల గురించి అమ్మ నాన్న సంభాషించుకొన్నారు.

ఆ సాయంత్రం జరిగిన సంభాషణ నాలో వుత్సాహాన్ని రేకెత్తించి, నాకు నిద్రపట్ట లేదు. దేవకి పిన్ని, అమ్మల మధ్య ఎవరివైపు నా అభిమానం మొగ్గుచూపాలో అర్థంగాక, సంధిగ్ధంలో పడ్డాను. దేవకి నుంచి నేను దూరమవుతున్నానేమోననే భావాలు కలిగాయి. అసలు నిజమేమిటి?..... 'దేవకి నిజంగా' వేశ్యనా? లేక ముంతాజ్ వలె అమాయకురాలా? యిళ్లు, వాకిళ్లు, నగానట్రా కావాలనుకొనే వారి వలలో ఆమె పడిపోయిందా? అమ్మవచ్చి ఏకాంతాన్ని భంగం చేస్తుందనే భయంతో 'దేవకి, దేవకి' అని మంత్రోచ్చారణలా జపిస్తూ పడుకొన్నాను. అలా మాట్లాడుతుంటే ఆ మాయవల్ల నా మనసులో భావాలు, అవ్యక్తానురాగాన్ని ఆమెకు తెలియ జేస్తాయనీ, నా అంతరాత్మలో భావాలను శుక సందేశంలా ఆమెకు చేరవేస్తాయనీ భావించాను. నిద్ర కుపక్రమించడానికి కళ్లుమూశాను.

మరునాడు ఉదయం నిద్రలేచేసరికి, ఇంట్లో గొడవగా వుంది. నాన్న స్నానంచేసి, బట్టలు వేసుకొని వరండాలో మడత కుర్చీలో కూచొని 'సైనిక గెజిట్' తదేక దృష్టితో చదువుతున్నాడు. వంటగది వ్యూడ్చే దైనందిన కార్యక్రమం పూర్తిచేసి, అమ్మ కూర వండుతోంది. అప్పుడే నాన్నకు క్షౌరం చేయడానికి మంగలి వచ్చాడు. స్వయంగా గడ్డం చేసుకొన్నందువల్ల నాన్న అతణ్ణి వద్దని పంపించివేశాడు. శివ కొయ్య గుర్రంమీద ముంగిట్లో పచార్లు చేస్తున్నాడు. వాణ్ణి గొడవ చేయవద్దని నాన్న మందలించాడు.

ఇంట్లో వాతావరణం గమనించి, బుద్ధిమంతుడిలా గణేశ్ ఎప్పటిలా కొత్తపుస్తకాలు ముందర వేసుకొని చదవసాగాడు. ఆ పుస్తకాలు అందరం చదవాలి. నాకు ఆకలిగా వుందని అమ్మకువెళ్ళి చెప్పాను.

అమ్మ నాకు ఎండిన రొట్టె, కూర పడవేసి యిలా అంది.- 'గొడవ చేయవద్దు. దేవకి ప్రవర్తనపట్ల మీనాన్న కోపంగా వున్నారు. అక్కడ విషయాలు కనుక్కోవడానికి ఆయన ఈ సాయంత్రం రైలుకు అమృతసర్ వెళ్తున్నారు.'

ఆవిడ అలా అనడం విన్న నాన్న యిలా వివరించాడు: 'నేను వెళ్లడం ఖాయంగాదు. సెలవు దొరకడం కష్టం. ఈజిప్టుకు ఒక విభాగాన్ని పంపవలసిన పని భారం వుంది. నువ్వు వంట త్వరగా పూర్తి చెయ్యి. ఒక కూరచేస్తే చాలు. భోజనం పూర్తిచేసి నేను వెళ్లి ఓగ్లివ్ గారిని యింటివద్ద కలుస్తాను..... ఇక్కడనుండి రెండు రోజులు దూరంగా వుండటం కూడా యిష్టంలేదు. సైన్యవిభాగంలో నాగురించి కుట్ర పన్నేవారు ఎక్కువయ్యారు.'

'నేను తొందరగానే చేస్తున్నాను. నేను కట్టెనుకాదుగా త్వరగా కాలి చావడానికి. ఈ కట్టెలు తడిగావున్నాయి' అంది అమ్మ.

అమ్మ కూరలో వుల్లిపాయలు, నెయ్యివేసి పోపు పెట్టింది. ఆ కుండ తొణికి గుడ్డలమీద తిరగమోత పడింది.

'ఈ గొడవ ఏమిటో బాబూ! నేను కాలిపోతున్నాను' అంది విసుగ్గా.

'సరే. నేను ఆఫీసునుండి యింటికి వచ్చేసరికి వంటపూర్తి చేస్తే, నేను తీసుకెళ్తాను ప్రయాణానికి. దారిలో ఖర్చులు కలిసివస్తాయి. దొర గారు సెలవుపెడితే రైలుపాసు యిస్తారని అనుకోను.' అన్నాడు నాన్న.

అమ్మ నాన్నలమధ్య రగులుతున్న పొగలసెగను గ్రహించాను. బయటికి వెళ్లి నీలం మామిడి చెట్టు చూస్తూ నుంచున్నాను. నాలో భావ పరంపరను ఈ ఉదయం సాంత్వన పరచడానికి 'దేవకి' అనే ఒక్కపదం వూతగా దొరికింది.

సందులో నుంచుని నాన్న ఓగ్లివ్ గారి వద్దకు ఎప్పుడెప్పుడు వెళ తాడా అని ఎదురుచూస్తున్నాను నేను జారుకోవడం చూసి నాన్న అన్నాడు·

'గురుదేవిని చూడటానికి బాబూ ఛత్తర్‌సింగు యింటికి మాటి మాటికి వెళ్లకు. చత్తర్ సింగు నేను త్వరగా ఉద్యోగ విరమణచేస్తే, నా కుర్చీలో తాను కూర్చోవాలని ఎదురు చూస్తున్నాడు.... వాళ్లతోగాని, యితరులతోగాని, మన యింట్లో జరిగిన విషయాలు ఏవీ మాట్లాడ వద్దు.'

'నేను గురుదేవి దగ్గరకు ఈమధ్య వెళ్లడమే లేదు' అన్నాను.

'అసలు యిప్పుడు ఆవిడ కంత తీరికకూడా లేదు. తన మరిది ప్రీతం సింగు కొడుకు దర్శనసింగును దత్తపుత్రుడుగా స్వీకరించింది. తన ఆఫీసులో ప్రీతం సింగుకు చత్తర్ సింగు ఉద్యోగం యిప్పించాడు. తాను మీ నాన్న కుర్చీలోకి వస్తే, ప్రీతం సింగు చత్తర్ సింగు వుద్యోగంలోకి వస్తాడు! కాబట్టి వాళ్ల గురించి మనం పట్టించుకోనక్కరలేదు.' అంది అమ్మ.

నేను యింట్లోంచి నెమ్మదిగా జారుకొన్నాను. అమ్మ, నాన్నల సలహాలు నా చెవికెక్కలేదు. నా గుండెలో మూగవేదన అరంభమైంది.

నాకు చెప్పినదానికి సరిగ్గా వ్యతిరేకంగా చేశాను. నాన్న వెళ్లేం తవరకు వడ్రంగి పనివారిని చూస్తూ నుంచున్నాను. 38వ డోగ్రా విభాగంలో గరవాలీల సంఖ్య హెచ్చు. వారి అవసరాలకు సరిపడేలా కొయ్యతో బార్కాసులు కడుతున్నారు వడ్రంగులు. శివ, గణేశ్ దగ్గరలో లేరని నిర్ధరించుకొని, మా యింటికి ఎదురుగావున్న బాబూ చత్తర్ సింగ్ యింటి సందువైపు వెళ్లాను.

'రా బాబూ! యికమీదట నీ సహవిద్యార్థి కాబోయే దర్శన్ సింగును కలువు' అంటూ ఆయన తన కంచంలో కలిసి భోంచేస్తున్న కుర్రవాడివైపు తల ఆడించాడు. అతని వయస్సు శివ అంత వుంటుంది.

దర్శన్ నావేపు చూడకుండా, భోంచేస్తున్నాడు.

'ఎవరూ? కృష్ణనా!' —వంట యింట్లోంచి గురుదేవి కేకవేసింది. —'ఎలాగో వచ్చావు నాయనా! మా యింటికి రావద్దని మీ అమ్మ చెప్పినా వచ్చావు.'

'మనం సెలవుమీద చక్వాల్ వెళ్లాంగదా. ఎలా వస్తాడు? అతనికి కొన్ని పళ్లు తెచ్చి యివ్వు.' అన్నాడు చత్తర్ సింగు.

'అతనికేమీ యివ్వవద్దు' అన్నాడు దర్శన్‌సింగు. అతని ముఖం ఏడుపువల్ల జేవురించింది. 'పోకిరి పిల్లవాడిలా ప్రవర్తించకు. నీలాగా కృష్ణ నా కొడుకు... ఇద్దరు స్నేహంగా వుండాలి.' అన్నాడు బాబూ చత్తర్ సింగు.

బాబూ చత్తర్ సింగు నాపట్ల చూపిన అవ్యాజానురాగానికి కదిలిపోయాను. ఆ కుర్రవాడి కంటె నేను బాగా ఎదిగినవాడినని తెలియజేయడానికీ, అమ్మ, నాన్నలకు, వీళ్లకూ తగాదాలున్నప్పటికీ, వారి పట్ల నాకు అభిమానం వుందని చూపడానికి దర్శన్‌సింగు చుట్టూ చెయ్యివేశాను.

'నన్ను ఒంటరిగా వదలు' అని ఆ కుర్రవాడు విదిలించాడు.

'ప్రీతంసింగ్! దర్శన్‌ను మందలించు' అన్నాడు చత్తర్ సింగ్ తమ్ముడితో, కుర్చీలో కూచొని ప్రీతంసింగు మత గ్రంథం చదువుతున్నాడు. ముఖంమీద నుండి గడ్డం మీదికి ఒక తాడు కట్టాడు. చత్తర్ సింగు గడ్డం అస్తవ్యస్తంగా వుంటుంది. ఆయన తలవూపి, కొడుకును మందలించి, మళ్లీ ప్రార్థనా గ్రంథం పఠనంలో మునిగిపోయాడు. ఆయన ముఖం పైకెత్తి, తన చూపులు దాచుకొన్నాడు.

'రా నాన్నా!' అంటూ గురుదేవి నావేలు పట్టుకొని — 'మేము చక్వాల్ నుండి తెచ్చిన పళ్లన్నీ నీకు యిచ్చేస్తాను దర్శన్‌కు ఒక్కటీ మిగలదు' అంది.

ఆ మాటవిని కుర్రవాడు లేచివచ్చి ఆమె నడుంమీద గుద్దాడు.

ప్రీతం సింగు ప్రార్థన పూర్తిచేసి, దర్శన్ చెంపమీద ఒకటి వాయించాడు. ఆ కుర్రవాడు ఆదెబ్బకు వుండ చుట్టుకొని నేలమీద పడిపోయాడు.

బుట్టనిండా పళ్లు తీసుకొని వస్తూ గురుదేవి అంది 'అమృతసర్ నుండి గణేశ్ వచ్చాడని విన్నాను. మీ ముగ్గురికీ యీ పళ్లు, ఖర్జూరాలు యిస్తున్నాను. నీకు, గణేశ్‌కు, శివకు గుర్తుంచుకో! మావైపు నుండి మీమీద కోపమేమీ లేదని మీ అమ్మకు చెప్పు.'

నేను పళ్ల బుట్ట తీసుకొని గురుదేవికి చేతులెత్తి సిక్కువలె 'సత్ శ్రీ అకాల్' అని నమస్కరించాను.

'చిరంజీవ! ఎంతమంచి కుర్రవాడు. మధ్యాహ్నంపూట నీవు వచ్చి దర్శన్‌ను ఆడుకోవడానికి తీసుకెళ్తుండు మీ అందరితో కలసి అతను ఆడుకోవడానికి రాకపోతే, అతణ్ణి యింటికి తిరిగి పంపించివేస్తాం.' అంది ఆమె. ఈ కానుక తీసుకొని సంబరంగా పరుగు తీశాను మా శత్రువు యింటికి వెళ్లవద్దని నాన్న చెప్పిన మాటకు విరుద్ధంగా, నేను వెళ్లి నందుకు ఇది మంచి సాకు కాగలదని అనుకొన్నాను.

గురుదేవి యింట్లో జరిగిందంతా గుక్క తిప్పుకోకుండా చెప్పేశాను. నేను వూహించినట్లుగాక, ఆవిడ సంతోషంగానే పండ్ల బుట్టతీసుకొంది. మా ముగ్గురికీ తలా కొన్ని పెట్టి మిగతా తన పెట్టెలో దాచి పెట్టింది. ఆ తర్వాత ఆవిడ అయిష్టంగానే పెదవులు కదిలించి అంది.... .

'చత్తర్‌సింగును డోగ్రా అధికారులు వుసికొలుపుతున్నట్లున్నారు. ఒక రోజు మధ్యాహ్నం నేను వెళ్లి గురుదేవిని కలవాలి..... మీరు స్నానాలు పూర్తిచేసి, భోంచేసి కొంచెంసేపు చదవండి రోజంతా ఆ వూడ్చేవాళ్లతోను, చాకలివాళ్లతోను నౌషిరాలో, అమృతసర్‌లో, లూధియానాలో ఆడుకొన్నట్లు ఆడుకోవద్దు.'

మేము నిద్రలేచేసరికి చాలా పొద్దు ఎక్కింది. హాకీ ఆట ఆడటానికి మాకోసం ఎదురుచూస్తూ పిల్లలు నుంచుని వుంటారని గ్రహించాము. మా వరండాలో హాకీ కర్రలు పేర్చి వున్నాయి గాబట్టె వాళ్లు, ఆడుకో వడం కుదరదు. మహమ్మదీయులు, క్రైస్తవులు, అస్పృశ్యులు కావడంవల్ల వాళ్లు ధైర్యంచేసి మా యింటికి వచ్చి అమ్మను అడగలేదు. మమ్మల్ని నిద్రలేపమంటే అమ్మవాళ్లమీద విరుచుక పడుతుందని వారి భయం.

గణేశ్ నిద్రపోతుంటే, వాడి కాళ్లు కదిలించి అన్నాను

'అప్పుడే గడియారంలో గంట 5 అయింది. పిల్లలు మనకోసం ఎదురు చూస్తుంటారు.'

అతను కళ్లు తెరిచి మళ్లీ పక్కమీద దొర్లి నిద్రపోయాడు.

నేను సందులోంచి పరుగెత్తాను 'ఆ వ్యూడ్స్‌వాళ్ల దగ్గరకు వెళ్లే ముందు పాలుతాగి వెళ్లు' అని అమ్మ నావెనక అరుస్తోంది.

నేను యింట్లోంచి బయటకు రాగానే, పక్క సందుల్లో కుర్రవాళ్లు — బాకా, చోరా, రామ చరణ్, అలీ, మరికొందరు. కొత్త బార్కుసుల మధ్య సిగరెట్లు తాగుతూ, నావైపు నిరుత్సాహంగా చూశారు.

'ఇప్పటిదాకా ఎదురుచూసి పంజాబీ కుర్రవాళ్లు పోయారు.' అన్నాడు చోరా

'నిజంగానా? వెళ్లి పిలుద్దాం' అన్నాను బాధగా.

రామ చరణ్ చోరావైపు కన్నుగీటాడు.

'అయితే వీళ్లంతా నన్ను ఎద్దేవా చేస్తున్నారు' - అన్నాను నన్ను మూర్ఖుడి కింద జమకట్టినందుకు సిగ్గుపడుతూ.

'తమాషాకు అన్నారు. తమ్ముడూ! వెళ్లి హాకీకర్రలు తీసుకరా! నాషిరాలో ఆడుకొన్నట్లుగా సరదాగా ఆడుకొందాం.' అన్నాడు బాకా.

'మీ మురికి నాన్న చనిపోవడం అదృష్టం! లేకపోతే వ్యూడ్స్‌వాడి వైన నువ్వుమాతో ఆడుకొనే అవకాశం వుండేదికాదు.' అంటూ చోరా పరిహాసమాడాడు

'ఆ మాట అంటే గుర్తుకు వచ్చింది. ఇప్పుడు టైం ఎంత? నేను 6గంటలకు పనికి వెళ్లాలి.' అన్నాడు బాకా.

'ఇప్పుడే అయిదైంది.' అన్నాను.

'అయితే నేను వెళ్తాను. సిపాయిలు కోప పడతారు. వ్యూడ్స్‌వాడికి ఆడుకొనే హక్కులేదు. కృష్ణా! నేను వెళ్తాను.' అన్నాడు బాకా.

'గణేశ్‌ను చూసి వెళ్లువుగాని రా! ఇంటికి వచ్చి చూసి వెళ్లు

అమ్మదగ్గరకు వచ్చి మేం ముగ్గురం మీతో కలసి ఆడుకోవడానికి పంప మని అడగండి. మీరంటే ఆమెకు యిష్టమే. మీ మాటలు వింటుంది. రండి. అందరూ.' అన్నాను.

బాకా యిష్టపడ్డాడుగాని, నడకలో అయిష్టత కనిపించింది. అందరి దృష్టిలో అతడు వ్యూడ్చేవాడు గాబట్టి మమ్మల్ని చెడగొడుతున్నాడు. కులదృష్టిలో వెలివేయబడ్డ అతను పొగరుబోతు ఏనుగువంటి వాడు. దానిని నెమ్మదిగా మచ్చిక చేసుకోవాలి.

'రండి. సిగ్గుపడకండి. మీరు యిష్టపడి వచ్చే మామూలు యిల్లు. అమ్మ మిమ్మల్ని మింగివేయదు.' అన్నాను.

అందరితోబాటు అతను వచ్చాడు. నేను ఈ సంప్రదాయాలపట్ల విముఖత చూపేంత ఎదిగాను. తక్కువ కులంవారిని వెలివేసిన వారిని నాతో సమానంగా చూడ గలిగాను. కాని మా పెద్దలు వీరి స్పర్శవల్ల తమ హోదాకు భంగం కలుగుతుందని, భ్రష్టుల మవుతామనీ వీరిని దూరంగా వుంచుతున్నారు.

బాకాను తిరస్కరించిన ఈ 'ద్విజోత్తముల' అతిశయంపై నాకు విరక్తి కలిగింది. హిందూ సనాతన వాదులు ఈ విధంగా పక్షపాతం వహించడంపట్ల, మానవత్వం విలువలను స్వీకరించగూడదని శపథం పట్టాను. ఎక్కడక్కడ బానిసలు చేసే కూలిపనులు చేస్తూ, బాకా కోసం పేద వాణ్ణే కావాలని కోరుకున్నాను. సుగంధాల నన్నిటినీ చెడువాసనలతో మిళితంచేసి, నాలో విచక్షణా జ్ఞానాన్ని ప్రేరేపించి ఒక విశిష్టవ్యక్తిగా తయారు కావాలి. జీవితమనే అడుసులో కాలుబెట్టి 'దానం, దానం, దానం' చేయాలి. మా తల్లివైపు తాతగారైన ఋషితుల్యుడైన నిహాలు శ్రద్ధాభక్తులతో దినారాత్రులు పేదలకు భోజనం పెట్టేవాడు. అలా నేనూ చేయాలి. పిరికివాళ్ల మాటలు లెక్కపెట్టకుండా, నిరంతరం శ్రమించి, క్రైస్తవుడినో, బౌద్ధుడనో లేక చిన్న సాధువునో అవుతాను..... సుఖ జీవితం అక్కరలేదు. మా కుటుంబంలో దగాకోరుతనం చూస్తూ కళ్లు మూసుకోలేను. కులం అనే తెరతొలగించడానికి నేను ఎన్ని అవాంతరాలైనా ఎదుర్కొంటాను. నాన్న సర్దుబాటు ధోరణి, పురోహితుల

మూఢాచారాలు ఎదుర్కోవలసి వస్తే, నేను ధైర్యంగా మాట్లాడుతాను. నా మనసు నిర్మలంగా, అమాయకంగా ఉంటుంది గాబట్టి భయంలేదు.

అదృష్టవశాత్తు అమ్మ వాళ్లను ఆహ్వానించింది.

'రండి! బాబూ! మిమ్మల్ని అందరినీ మళ్లీ చూడటానికి ఎంతో సంతోషంగా ఉంది. మాయింటి చుట్టూ ఎన్నో సంతోష స్వరాలు..... తగువులు పెట్టుకోవద్దు. రామ చరణ్! సిగరెట్లు తాగకు. అయ్యో! బాకా! మీనాన్న పోయారట?'

'అమ్మా! ఆయన మంచంమీద చాలా రోజులున్నారు. ముసలి వాడు. ఎప్పుడైనా పోక తప్పదు.' అన్నాడు బాకా సిగ్గుపడుతూ.

'మీ అమ్మ నాకు బాగా తెలుసు. ఎంత మంచిది.' అంది అమ్మ అప్యాయంగా. 'ఉండండి! మీకు తినడానికి పెడతాను. ఎక్కడివాళ్లు అక్కడే ఉండి మాట్లాడండి. లోపలికి రావద్దు. కృష్ణ! గణేష్‌ను లేపు' అంది అమ్మ యింట్లోకి వెళ్తూ

నేను హాకీ కర్రలు తెచ్చిపెట్టాను. అస్పృశ్యత విషయం మరచి పోయి తలా ఒకటి పంచాను. నాకు, గణేశ్‌కు, శివకు తలా వొకటి వుంచాను.

గణేశ్ నిద్రలేచి వచ్చి, చాలా పెద్దవాడిలా సిగ్గుపడుతూ, పాలిపో యిన మొగంతో అందరితో కరచాలనం చేశాడు. బాకాను ముట్టుకోలేదు.

'అరే పవిత్రుడా! బాకాతో కూడా కరచాలనం చెయ్యి' అన్నాను బులిపిస్తూ.

గొర్రెవలె అతడు బాకాతో కరచాలనం చేశాడు.

ఇంతలో అమ్మ వెలుపలికి రావడంతో అతను చేతులు వెనక్కి తీసుకొన్నాడు. అందరూ ఎంతో వినయవిధేయతలు నటించి, అమ్మ దగ్గర తినుబండారాలు, పళ్లు తీసుకొన్నారు. వాళ్లముఖాలు గంభీరంగా వున్నాయి. గజం దూరంలో నుంచుని అమ్మ విసిరివేస్తే మిఠాయి బాకా వొళ్లో పడింది. అతను తీసుకొన్నాడు.

'ఇంక వెళ్లి ఆడుకోండి. ఒకళ్లనొకరు కొట్టుకోవద్దు' అంది అమ్మ.

మా గొడవకు అప్పుడే మేల్కొని శివ కూనిరాగాం తీశాడు. అమ్మ అది విని లోపలికెళ్లింది. మేము హాకీ ఆట ఆడటానికి పరుగుతీశాం.

చలికాలపు సంధ్యా చీకట్లు ముసురుకోవడంవల్ల బంతిని ఒకరి వద్ద నుండి మరొకరికి విసురుకోవడం తప్ప ఆడుకోలేక పోయాం. పాతకాలం ఆట మళ్లీ ఆడాము. నాకు సంబంధించినంత వరకు, ఈ పిల్లలు మధ్యనాకు తేడాలు లేవు. నా జీవితాన్ని పణంగాపెట్టి నేను ద్రౌపది పవిత్రతకు భిన్నంగా మహమ్మదీయుల వద్ద, క్రైస్తవులవద్ద యిళ్లలో భోజనాలు చేశాను. ఏది ఏమైనా కానీ, గణేశ్ ఏమైనా అనుకోనీ, నేను ఈ అస్పృశ్యతను మనసులో వుంచుకొని నన్ను ముట్టుకోవద్దనే పద్ధతిలో వుండదలచుకోలేదు. బాకాను ముట్టుకుంటే స్నానం చెయ్యాలనే తలపు రాలేదు. అమ్మ చంపినా ఫర్వాలేదు. నేను అతణ్ణి ముట్టుకొంటాను. ఆవిడ మాటలు ఒక చెవిలో విని మరొక చెవిలో వదలివేస్తాను.

దురదృష్టవశాత్తు, అమృతసర్ నుండి నాన్న ఆదివారం తిరిగి వచ్చినపుడు ఆయన కోపగించిన ఎలుగు బంటిలా వున్నారు. మేము ఏమి చేసినా ఆయన తీక్షణంగా చూడటం, ముఖం జేవురించడం గమనించాము. బహుశా నిద్రలేకపోవడంవల్లనో, లేక అమృతసర్‌లో దేవకి లేకపోవడం వల్లనో ఆయన కలతచెంది వుంటాడు. ఆవిడ కనోవా గుడి వద్ద బావి కట్టించడానికి యిటుకలు సమకూర్చి, బేలుదార్లను, కూలీలను మాట్లాడి బావి త్రవ్వించడానికి వెళ్లింది.

మాబడి త్వరలో ఆరంభం కాబోతుంది. మొదటి నుంచి మేము మంచి ఆధునిక దుస్తులు వేసుకోవాలనీ, తద్వారా మార్గదర్శకంగా కంటోన్మెంటు వారి శైలిలో నడుచుకోవాలనుకొన్నాను. పట్టణంలో విద్యార్థుల్లో ఎక్కువమంది పొడుగాటి దుస్తులు, తలపాగాలు ధరించి, వాటి అంచులతో చేతులు, ముక్కు తుడుచుకొనేవారు. అందకు భిన్నంగా మేము దుస్తులు వేసుకొందా మనుకొన్నాను.

లూధియానాలో వున్నప్పుడు క్రైస్తవ సహచరులతో కలిసివచ్చిన అమెరికావాసులు ధరించిన పద్ధతిలో దుస్తులు ధరించాలని నాలో తపన.

అమెరికన్లుకూడా ఆంగ్లేయులకు వ్యతిరేకులు. కాబట్టి నాలో భారతీయత నాపాదించుకొని, యాంత్రికమైన బూట్లు ధరించి వెళ్దామనుకొన్నాను.

కొత్త బట్టలు కుట్టించాలని మేం కోరేకోరికలను అమ్మ, నాన్న వినిపించుకోలేదు. దేనికిని గూర్చి ఆమె చెప్పిన మాటలను బట్టి, నాన్నకంటె, అమ్మ ఎక్కువ కలత పడింది. మా యింట్లో వున్న భోషాణపు పెట్టెలో ఏవైనా పాతగుడ్డలు వున్నాయోమో చూద్దామని నేను ధైర్యంచేసి అడిగితే, ఆమె కోపపడింది.

నేను పరధ్యానంగా వున్నట్లు, మళ్లీ నా జ్వరం తిరగ బెడుతుం దనే భయాన్ని ఆమెకు కలిగించాను. ఒకరాత్రి మేము నిద్రపోతున్నపుడు ఆమె ఆ పెట్టె తెరిచి అందులోంచి రెండు పసుపు చొక్కాలు, నిక్కరులు, పెద్దటోపీ తీసింది. తెల్లవారి లేచి చూసేసరికి అవి నాకళ్లముందు వున్నాయి.

నేను అమెరికనువలె కనిపిస్తాననే ఉత్కంఠ నాలో సంతోషం కలి గించింది. గుడ్డలు పెద్దవి అయినా లెక్క చేయలేదు. కుర్రవాళ్లు నన్ను 'పిలిపిలీ సాహెబ్' అని ఎగతాళి చేసినా ఫర్వాలేదు. నాషిరాలో బాకా టోపీ పెట్టుకొని వస్తే అతణ్ణి అలాగే గేలి చేశారు.

అమ్మ వాటిని కత్తిరించి, నాకు సరిపడేలా, సింగర్ కుట్టుమి షన్ మీద కుట్టటానికి అంగీకరించాను. హరీష్ పాత హాకీ దుస్తుల్లో హాస్యాస్పదంగా కన్పిస్తానని తెలుసు. గణేశ్‌ను కసురుకొని, శివతో కలిసి వెళ్లాను. వాడు మరింత ఆనందంగా ఉన్నాడు. నాతోపాటు సంబరపడి, హవిల్దార్ సూరజన్ వద్ద బూట్లు సంపాయించాలని ప్రయత్నిస్తున్నాడు.

భండారాన్ని కొద్ది సమయాల్లో మాత్రమే తెరుస్తారు. 'బి' కంపె నీలో తాను నివసించే ప్రదేశంనుండి, భండారం గదికి ఆయన తన స్థూలకాయాన్ని నెట్టుకొంటూ సూరజన్ నడిచేవాడు. బార్కాసుల లోని సిపాయిలను, క్రింది అధికారులను పిల్లలు చూడటానికి వీలులేదు. అందువల్ల హరీష్ హాకీ వస్తువులతో నేను బడికి వెళ్దామనుకొన్నాను. నా నుదుటిపై టోపీ వాలుతోంది. తొడుగులు లేకుండా బూట్లు నాటు రకంవి వేసుకొని నడిచాను.

# 2

నా వేషధారణలో ఆడంబరతవల్ల, బడి తెరచిన మొదటిరోజు అందరి దృష్టి నాపై పడేలా వుంది

అదృష్టవశాత్తు గంటకొట్టారు. ఆతురతగా చూసేదృష్టులు, మొరటు వ్యాఖ్యానాలు తొందరగా పూర్తి అయినాయి. మొదటి గంట మాకు ఆంగ్లపాఠం. హెడ్మాష్టరు రాజా ఫజల్ మహమ్మదుఖాన్ 8వ తరగతికి ఆంగ్లం బోధిస్తారు. ఆయన రాకకోసం మేం ఎదురు చూస్తుంటే, 31వ పంజాబీ దళానికి చెందిన కుర్రవాళ్లు కొందరు — కంటోన్మెంటులో గణేశ్‌ను, శివను, నన్ను చూసినవారు — నాతో స్నేహంచేసుకొనే మిషమీదవచ్చి, నన్ను ఏడిపించసాగారు

'నీ వస్త్రధారణం రంగును బట్టి 38వ డోగ్రా దళానికి చెందిన హాకీజట్టు నాయకుడిలా కనిపిస్తున్నావు' అన్నాడొకడు.

'అఫ్జల్! వాణ్ణి ఏడిపించకు' అన్నాడు, 31వ పంజాబీదళంలో గుమాస్తాగా పనిచేసే సిక్కు కొడుకు గురుబచన్ సింగు. అతన్ని నేనెరుగుదును.

'అతనికి హిందువుల పిలకలేదు. అందువల్ల ఆంగ్లేయుల టోపీ పెట్టు కొంటున్నాడు.' అఫ్జల్ అన్న సుభాష్ సాదిఖ్ నవ్వుటాలకు అన్నాడు— 'అయితే దాన్ని తలపై పెట్టుకో! అందరూ చూస్తారు. అప్పుడు నువ్వు ఆంగ్లేయుడి వనుకొంటారు. అంటూ బల్లమీద టోపీని తీసి నాతలపై పెట్టాడు.'

'నేను ఆంగ్లేయుడిని కాదలచుకోలేదు. అమెరికను కాదలచుకొన్నాను' అన్నాను.

కోపం వేసి టోపీ తీసి వేశాను.

మహమ్మదు ఫజల్ మళ్లీ నాదగ్గరకు వచ్చి టోపీ నాతలపై పెట్టాడు.

"ఈ టోపీ పెట్టుకొంటాడు కాబట్టి వాణ్ణి 'పిల్‌పిల్ సాహెబ్' అని మాదళంలో పిల్లలు పిలుస్తారు." అని వాడితో గణేశ్ నీచంగా నవ్వుతూ అన్నాడు.

దేవదూతల పక్షాన వుండే స్వభావాన్ని గణేశ్ వదలుకోలేదని తిడదామనుకొన్నాను. ఇంతలో హెడ్మాష్టరు రాజా ఫజల్ మహమ్మద్‌ఖాన్ ప్రవేశించారు. ఆయన గదిలో కుర్చీలో చూసిన దానికంటె గంభీరంగా, పొడుగ్గా కనిపించారు. ఆయన ఆంగ్లేయుల శైలిలో షర్టు ప్యాంటు వేసుకొని, దానిపై టై కట్టి, కాశ్మీరీ జాకెట్, గంభీరమైన పెషావరీ తలపాగా ధరించాడు. తలపాగాపై కుచ్చు ఆరు అంగుళాలు పైకి విచ్చుకొని నీలంరంగు పుష్పంలా కనిపిస్తోంది.

ఆయన వేదిక మీదికి వెళ్లి, అందరినీ కలయజూచారు అందరూ తదేకచిత్తంతో శ్రద్ధగా, జి.ఏ. వాధెన్ రచించిన 'ఆంగ్ల పద్యగద్య సంకలనం' తలలువంచుకొని చూస్తున్నారు.

నా కనుగొలకుల్లోంచి ఆయన నన్ను గమనించడం చూశాను. నేను సంప్రదాయేతరంగా దుస్తులు ధరించి ప్రత్యేకంగా కనిపిస్తున్నాను గాబట్టి, ఆయన నావైపు గుర్రుగా చూసి, కొడతాడేమోనని భయపడ్డాను. చివరకు నా వద్దకు వచ్చి

'ఆంగ్ల మర్యాద ననుసరించి గదిలోవున్నప్పుడు టోపీ పెట్టుకోరు. బయట వెళ్తున్నప్పుడే! ' అంటూ ఆయన నా తలపై టోపీ తీసి బల్లమీద పెట్టారు.

'నేను తరగతి గదిలోకి రాగానే టోపీ తీసి బల్లమీద పెట్టాను. కానీ, ఆ కుర్రవాడు మహమ్మద్ అఫజల్ నాతలమీద బలవంతంగా పెట్టాడు సార్!' 'మంచి కుర్రవాడివి నీకు మర్యాద తెలుసు. కృష్ణచంద్రను ఏడిపించినందుకు మహమ్మద్ అఫజల్ బల్ల మీద నుంచోవాలి.' అన్నాడు హెడ్‌మాష్టరు. నాలో భయాలన్నీ తొలగి పోయాయి.

నిశ్శబ్ద వాతావరణం అలముకొన్న గదిలో మహమ్మద్ అఫజల్ పైకెక్కి నించున్న శబ్దం వినిపించింది. నేను అతనిమీద చెప్పడం వల్ల జరగబోయే పరిణామల గురించి భయం వేసింది. కానీ, ఆ

భయం కనపడనీయకుండా రాజీ ఫజల్ అహమ్మద్ ఖాన్ ఉపన్యాసం మొదలుపెట్టారు—

'రోజులు త్వరగా మారిపోతున్నాయి. మనదేశాన్ని దయాదృష్టితో పరిపాలించే ఆంగ్ల జాతి మనదేశానికి రైలుమార్గాలు, కాలువలూ, రహదారులూ, మంచి పరిపాలనా ప్రసాదించింది. పశుప్రాయుల్ని మనుషులుగా మార్చుతున్నారు. జర్మన్ కైజర్ నిరంకుశత్వానికీ వ్యతిరేకంగా ప్రపంచానికి స్వాతంత్ర్యం తెచ్చిపెట్టడానికి వాళ్ళు యుద్ధం చేస్తున్నారు. నేను సిసలైన మహమ్మదీయుణ్ణి కాబట్టి వారి సంప్రదాయాలు నాకు కొన్ని నచ్చవు. ఉదాహరణకు పందిని తింటారు. మల విసర్జనచేసి నీళ్ళువాడకుండా కాగితంతో తుడుచుకుంటారు వాళ్ళ స్త్రీలు పరదాలేకుండా బయట తిరుగుతారు; వాళ్ళ భర్తలతో కాక పరపురుషుల చేతుల్లో నాట్యం చేస్తారు. కానీ, వారు మనకు తెచ్చిపెట్టిన ఇతర విషయాలు అద్భుతమైనవి. టోపీలు, ప్యాంట్లు, సైకిళ్ళు, మోటారు సైకిళ్ళు, తుపాకులు, మర తుపాకులు, వార్తా పత్రికలు .. మనదేశంలో ఎండ ఎక్కువగా వుంటుంది గాబట్టి టోపీ వరప్రసాదం లాంటిది. టోపీని పెట్టుకునే అలవాటు చేసుకుంటున్నందుకు ఈ కుర్రవాణ్ణి అభినందిస్తున్నాను. అయితే ఎండనుండి, సరియైన రక్షణ కావాలంటే మంచి టోపీ పెట్టుకోవాలి.'

ఆంగ్లేయుల కంటె అమెరికన్ కావాలని నా ఆశయమని చెబుదామనుకున్నాను. కానీ, హెడ్‌మాష్టరు అనర్గళ వాక్ ప్రవాహం కొనసాగింది.

'అతనిప్పుడు పెట్టుకున్న టోపీ వెచ్చదనాన్ని కలిగిస్తుంది కాబట్టి చలికాలంలో బాగుంటుంది. కానీ ఎండకు బాగా వుపయోగపడేది — సోలారు టోపీ. ఎండాకాలంలో భూమిని దున్నే మనరైతులందరూ అవి పెట్టుకుంటే ఎంత వరప్రసాదమో! జీలంలో నన్ను అందరూ తలపాగాతో చూశారు కాబట్టి ఇప్పుడు ఒక్కసారిగా టోపీ పెట్టుకుంటే నా వెనుక ఎగతాళి చేస్తారేమోనని భయం, లేకపోతే నేనూ టోపీ పెట్టుకునే వాణ్ణి.'

'మీరు చూడండి నేను ఆంగ్లశైలిలో బూట్లు, షర్టు పైె వేసు

కుంటున్నాను. అలానే మీ మాష్టారు లల్లా అమరనాథ్ కూడా వేసు కుంటున్నారు. చలికాలంలో ఈ దుస్తులు బాగా అనుకూలం మన స్వదేశీ వస్త్రాలలాగా త్వరగా మురికి పట్టవు. వెచ్చగా వుంటాయి.... విద్యార్థులకు నిక్కరు చొక్కా ఉత్తమమైన దుస్తులు. కృష్ణచంద్ర గుడ్డలు గాడీగా కనిపిస్తున్నప్పటికీ మీ అందరికీ ఆదర్శప్రాయంగా కనిపిస్తున్నాడు. ఈసారి మీ తల్లి దండ్రులు మీకు కొత్త దుస్తులు కుట్టించేటప్పుడు నిక్కరు, షర్టు కుట్టించమని పట్టుబట్టండి. నా మాట కొనసాగే షక్షంలో పంజాబ్ విశ్వవిద్యాలయంలోని విద్యార్థులందరికీ యూనిఫారం పెట్టేవాణ్ణి.' ఆయన ఒక్కక్షణం ఆగి మరలా మొదలుపెట్టారు.

'ఆధునిక దుస్తులు ధరించడానికి తగ్గట్టుగా స్వదేశీదుస్తులు ధరిం చిన వారికంటె మీరు ప్రభుత్వానికి విధేయంగా వుండి ఆంగ్లభాషను బాగా నేర్చుకోవాలి. కాబట్టి, కృష్ణ చంద్రను — చార్జి ఆఫ్ ది లైట్ బ్రిగేడ్ (Charge of the light brigade) పద్యం చదవమని అడుగుతు న్నాను. కృష్ణచంద్రా! లే! (80వ) ఎనభైయవ పుట ...... పిల్లల్లారా! మీరందరూ 80వ పుట తెరవండి.'

లేచి నుంచుని వణుకుతూ పుటలు త్రిప్పాను. తొందర తొంద రగా 80వ పుట తిప్పి ఉర్దూ కవిత్వం శైలిలో రాగంతీస్తూ, గుక్క తిప్పకోకుండా, పద్యం చదివాను. పద్య పఠనంతో బాటు అభినయం కూడా చేశాను. ఈ విధంగా సగర్వంగా చదవటం హెడ్మాష్టరుగారి అభిమానం చూరగొంది. పద్యంలో చివరి రెండుపాదాలూ, పూర్తిగాక ముందే ఆయన 'శభాష్' అన్నాడు

నాన్న పుస్తకాలు, హరీష్ ఇంగ్లీషు పుస్తకాలూ చదవటం నాకు బాగా దోహదం చేశాయి. అమృతసర్‌లోనూ, లూధియానాలోనూ, నాతోడి విద్యార్థులందరి కంటె ఆంగ్లపాఠాల విషయంలో బాగా ముందుండే వాణ్ణి.

'ఈ కుర్రవాడు ఆంగ్ల పదజాలాన్ని సరిగా వుచ్చరించటమే కాకుండా భావయుక్తంగా పద్యపఠనం చేసే పద్ధతి నేర్చుకున్నాడు. ఇతను యింత కంటె బాగా నేర్చుకొని పాఠశాలకే పేరు తెస్తాడు.... ఇప్పుడు గణేశ్ చంద్ర ఎందులో సమర్థుడో చూద్దాం.' అన్నారు హెడ్‌మాష్టరు.

గణేశ్ తొందరగా నావద్ద నున్న పుస్తకం తీసుకున్నాడు మేము ఎన్నిసార్లు అడిగినా మానాన్న మా యిద్దరికీ విడిగా పుస్తకాలు కొనివ్వ లేదు. మేమిద్దరం ఒకే బెంచీలో ప్రక్కప్రక్కనే కూచుంటామనీ తాను కష్టపడి సంపాదించిన డబ్బు ఖర్చుపెట్టటం ఇష్టం లేదనీ అన్నారు.

'ఇదేమిటి? నీపుస్తకం ఏది?' హెడ్‌మాష్టరు గదమాయించారు. 'మా నాన్న నాకు వేరే పుస్తకం కొనివ్వలేదు సార్.'

'పిరికి వాడా! నీకు వేరే పుస్తకం కొనివ్వమని ఎందుకు అడగలేక పోయావ్. నీ తమ్ముడిలాగా ధైర్యం తెచ్చుకో. రేపటినుంచీ నీకు విడిగా పుస్తకం లేకుండా బడికి రాకు...... సరే చదువు.'

హెడ్‌మాష్టరు ఆ విధంగా గొంతెత్తి నిందించటంతో గణేశ్ వణు కుతూ భయపడ్డాను. నన్ను 'పిల్పిలీ సాహెబ్' అని ఎద్దేవా చేసి మహమ్మద్ అఫ్జల్ ముందు నన్ను కించ పరిచినందుకు గణేశ్‌మీద కోపంగా వుంది. తీర్చుకునే అవకాశం కల్పించి వాడు సన్నని గొంతుతో మధ్య మధ్యలో ఆపుతూ చదివాడు.

'అమృతసర్‌లోని వ్యాపారిలా ఆంగ్ల పదజాలం తెలియని పంజాబీ మొరటు యాసలో చదువుతున్నావు. ఇంటి దగ్గర మీనాన్నను అడిగి చెప్పించుకో! లేకపోతే మీ తమ్ముడి దగ్గర నేర్చుకో!'

'గర్విష్టియైన మహమ్మద్ అఫజల్ ఇపుడు చదువుతాడు.'

బల్లమీద నించుని వున్న అతడు భయోత్పాతంతో పాలిపోయిన ముఖంతో అయిష్టంగా చదివాడు.

'ఇంక ఆపు. మేకపిల్లలా అరవకు. నువు ఏడిపించిన ఆ కుర్రవాడి దగ్గర పద్యపఠన పద్ధతి నేర్చుకో! పద్యం చదివేటప్పుడు ప్రతి పదాన్నీ తగిన భావాలతో అనుసంధానం చేయాలి. మీ నాటురకం గాళ్ళందరికీ పద్యం ఎలా చదవాలో కృష్ణ చంద్రపైకి వచ్చి చదివి చూపిస్తాడు. రా బాబూ! వచ్చి మొదటి పాదం చదువు.' హెడ్‌మాష్టరు పురమా యించాడు.

ఈ విధంగా మొదటి రోజే నన్ను హెడ్‌మాష్టరు స్వయంగా

తరగతి కంతటికీ ఆదర్శంగా ఎంచుకున్నందుకు గర్వపడ్డాను. హుందాగా వేదిక ఎక్కి ఆపాదాన్ని యింతకు ముందుకంటె మరింత నాటకీయంగా చదివాను.

'శభాష్! ఈ కుర్రవాణ్ణి మనపాఠశాల వక్తృత్వ పద్యపఠన జట్టులో కలుపుతాను' అంటూ హెడ్‌మాష్టరు నాభుజం చరిచారు.

వేదిక మీదనుంచి దిగివస్తూ జయోత్సాహంలో అధికార, దర్పం వెలగబెట్టాను. ఆంగ్ల ప్రభుత్వానికి నేను విధేయుణ్ణి కాదని ఆయన త్వరలో తెలుసుకుంటారని నానమ్మకం.

హెడ్‌మాష్టరు నన్ను అంతగా ప్రశంసించినప్పటికీ 'పిప్పిలీ సాహెబ్' అనే మారుపేరు విరామ సమయంలో ఆనోటా ఈనోటా బడిలో వ్యాపించింది.

హెడ్‌మాష్టరు నా ఆంగ్ల పద్యపఠనంపట్ల మెచ్చుకోలుగా చెప్పిన హోదా క్రమంగా చెదిరిపోయింది. ఉర్దూ మాష్టారు రతీరామ్ నన్ను ఆకుపచ్చని దుస్తుల్లో చూడగానే ప్రస్తుత భారతదేశం ఏవిధంగా క్షీణ స్థితిలో వుందో వుపన్యసించమన్నారు నాలో పేరుకున్న గర్వం అణచి వేయ బడింది.

'ఈ కుర్రవాడి కోతివేషాలు చూస్తే నాలో నిరంకుశత్వం పెరిగి పోతోంది. కలియుగం నిజంగా వచ్చేసింది. స్వదేశీ దుస్తులు మాని వేసి మన హెడ్‌మాష్టరు ప్యాంట్లు వేసుకుంటున్నారు. జీలం జిల్లాలోని వారంతా వదులైన పైజమా, చొక్కా వేసుకొని వస్తుంటే ఆయన తర్వాతి ఉపాధ్యాయుడు కూడా వాళ్ళ తల్లి దొరసాని యైనట్లు సూటు ధరించి వస్తున్నాడు ఈ కోతివెధవ ఇంద్ర ధనుస్సులా రంగురంగుల దుస్తులు వేసుకు రావటంలో ఆశ్చర్యం లేదు. పొద్దు తిరుగుడు పూవులా కనిపించటానికి సాదా పైజామా చొక్కా లేవా?'

రతీరామ్ మాష్టారు మేకపోతు గడ్డాం ఓరగంట చూశాను. ఆయన పరుష వాక్యాలతో బాటు చెంపదెబ్బ వేస్తారేమోనని భయపడ్డాను. పిల్లల్ని క్రమశిక్షణలో పెట్టడానికి దండన ఒక్కటే సరియైన మార్గమని ఆయన విశ్వసిస్తాడని ప్రతీతి. నా దగ్గరనుండి సమాధానం రాకపోయేట

ప్పటికి ఆయన మరింత కఠినస్వరంతో తప్పు లెన్నుతూ వ్యాఖ్యానం చేయసాగారు. కోపంతో కళ్ళు జేవురించాయి. మెడమీద నరాలు వుబ్బాయి.

'నికృష్టులైన తెల్లదొరలు ప్రోత్సాహించిన సంప్రదాయాలు నిజానికి చెడ్డవి. పిల్లలూ! చూడండి వాళ్ళు చీదేటప్పుడు చేతిగుడ్డలో చీది ఆగుడ్డ జేబులో తురుము కుంటారు. వుమ్మికూడా అలానే చేస్తారు వాళ్ళు స్నానం చేయరని విన్నాను. హిందువులకు పవిత్రమైన గోమాత మాంసం తింటారు. వారి సోదరులైన జర్మనులతో రాక్షసులవలె యుద్ధం చేస్తున్నారు యుద్ధ దేవతకు మన సోదరులను బలిగా సమర్పిస్తు న్నారు. నిరాయుధులమైన మనవంటి వారిపై తరాల తరబడి యుద్ధం చేస్తున్నారు. మనలను వారు జయించి వారి సంప్రదాయాలకు బానిసల్ని చేసారు మన హెడ్‌మాష్టరును చూడండి. మెడకు 'టై' కట్టుకుం టారు. ఈ విధమైన జీవన శైలి చూస్తుంటే నాకనిపిస్తుంది మన పాత సంప్రదాయాలకు మనం ఎంత దూరమౌతున్నామో. ఉదాహరణకు పాత రోజుల్లో దంతధావనానికి పదిపైసలిస్తే ఇరువది పుల్లలు వచ్చేవి. ప్రతి ఉదయం శుభ్రంగా పళ్ళు తోముకోవచ్చు. ఇప్పుడు పదవ తరగతి చదివే నాకుమారుడు ఎముకతో చేసిన పళ్ళు తోముకునే బ్రష్ కొని వ్వమని పట్టుబట్టాడు అది క్రిములకు తావిచ్చి నెలల తరబడి చిగుళ్ళు వాచేలా చేసి పళ్ళు రాలిపోతాయి. పట్టణాల్లో వున్న అమెరికన్ దంత వైద్యులకు అందువల్ల అదనపు ఆదాయం వస్తుంది. . . ప్రతి యింట్లో ఉదయం పూట బహిర్ భూమికి పొలాలకు వెళ్ళటం అలవాటు. అందు వల్ల మల బద్ధకం వచ్చేది కాదు. పొలాలకు ఎరువు వచ్చేది. కాలికి అంటుకున్న ముత్యాలవంటి మంచువల్ల ప్రకృతి సహజమైన విద్యుత్తు శరీరమంతా వ్యాపించి చైతన్యవంతుల్ని చేసేది. ఉదయభాను కిరణా లను చూడటంవల్ల ఎనభై సంవత్సరాలవరకు కంటిచూపు తగ్గేదికాదు. ప్రకృతికి చేరువగా వుండి పొందికగా వుండటం అలవాటు చేసుకు న్నాము. ఈ బడి మొత్తంలో ఈ విధమైన ప్రకృతి సహజ జీవనం ఒక మాష్టారు మాత్రమే అనుసరిస్తున్నారు అది మీకు చరిత్ర, భూగోళం చెప్పే హరిచంద్ర మాష్టారు.'

ఆయన కూడా నాలానే పల్లెల్లో వుంటున్నారు. స్వచ్ఛమైన పాలకోసం ఆవును పెంచుతున్నారు. లాహోరులో ఆంగ్ల శైలీ విద్యాభ్యాసంచేసి నప్పటికీ ఆయన చెడిపోలేదు.'

'అయితే మాష్టారూ! ఆయన ఈ సంవత్సరం కూడా బి.ఏ. పరీక్ష తప్పారట!' ఆశ్చర్యంగా అడిగాడు మహమ్మద్ అఫజల్.

'అనవసరంగా వాగకు.' మాష్టారు గద్దించాడు — 'బి.ఏ. పరీక్ష నెగ్గి వారసత్వాన్ని వదులు కోవడమెందుకు. నేను మున్షీ పరీక్షలో నెగ్గాను. ఆంగ్ల భాష తెలియదు. కాని నా పాండిత్యానికి కొదవలేదు. అమీర్ కుస్రో మొదలు గాలిబ్ వరకు హాలీ, ఇక్‌బాల్ వంటి వుర్దూ పండితుల కవిత్వం నాకు తెలుసు. హషన్, షేక్ సాదీ మొదలైన పర్షియన్ కవుల కవిత్వంతో పరిచయముంది. మన ప్రాచ్య విజ్ఞానంలో ఐరోపావాసుల కంటె ఎక్కువ విజ్ఞానముంది. మీరు చదివే నవలల వల్ల వ్యభిచారం సిద్ధిస్తుంది. ఆంగ్లయాసలో చిట్టిపొట్టి మాటలు నేర్చుకున్నంత మాత్రాన మీరు అధికులమని అనుకోరాదు. ఆంగ్ల భాష ద్వారా మీకు ఈ పాఠశాలలో బోధించే భౌతిక వ్యర్థ పదార్థాలకంటె వేదాంత విజ్ఞానం మిన్న. ఆత్మకూ, శరీరానికీ పరస్పర సంబంధాన్ని వేదాలు చెప్తాయి. ప్రపంచమంతా మాయ అని వేదాంతుల అభిప్రాయం. అపారమైన సంస్కృతీ వైభవం మనకుంటే ఆంగ్లేయులు చిన్న చిన్న ద్వీపాలలో శాఖా చంక్రమణం చేస్తున్నారు. ఆభాష మీరు సరిగా నేర్చుకోలేరు. స్వదేశీ భాషకు అలవాటుపడ్డ మన నాలుకను 'భౌ,భౌ, వేవే' అని కుక్కలా మొరిగి అభ్యాసం చేసుకోవటం గొప్పకాదు.'

ఆంగ్ల పదోచ్చారణను మాష్టారు అనుకరించటం చూసి పిల్లలందరూ అప్రయత్నంగా నవ్వారు.

'నిశ్శబ్దం' అని అరిచి బెత్తంతో బల్లమీద చరిచి నిశ్శబ్దం ఆవరింపజేశారు — 'నా తరగతిలో ఎవరూ తోక త్రిప్పటానికి వీల్లేదు. పుస్తకం తెరిచి గాలిబ్ తన కుమారునికి వ్రాసిన ఉత్తరాలు చదవండి: 'పిర్బీలీ సాహెబ్! నీవు మొదలుపెట్టు.'

అదృష్టవశాత్తు ఇంగ్లీషు పద్యాలవలె ఉర్దూ వచనంకూడా నేను

ప్పటికి ఆయన మరింత కఠినస్వరంతో తప్పు లెన్నుతూ వ్యాఖ్యానం చేయసాగారు. కోపంతో కళ్ళు జేవురించాయి. మెడమీద నరాలు వుబ్బాయి·

'నికృష్టులైన తెల్లదొరలు ప్రోత్సాహించిన సంప్రదాయాలు నిజానికి చెడ్డవి. పిల్లలూ! చూడండి వాళ్ళు చీదేటప్పుడు చేతిగుడ్డలో చీది ఆగుడ్డ జేబులో తురుము కుంటారు. వుమ్మికూడా అలానే చేస్తారు వాళ్ళు స్నానం చేయరని విన్నాను. హిందువులకు పవిత్రమైన గోమాత మాంసం తింటారు. వారి సోదరులైన జర్మనులతో రాక్షసులవలె యుద్ధం చేస్తున్నారు యుద్ధ దేవతకు మన సోదరులను బలిగా సమర్పిస్తు న్నారు. నిరాయుధులమైన మనవంటి వారిపై తరాల తరబడి యుద్ధం చేస్తున్నారు. మనలను వారు జయించి వారి సంప్రదాయాలకు బానిసల్ని చేసారు మన హెడ్‌మాష్టరును చూడండి. మెడకు 'టై' కట్టుకుం టారు. ఈ విధమైన జీవన శైలి చూస్తుంటే నాకనిపిస్తుంది మన పాత సంప్రదాయాలకు మనం ఎంత దూరమౌతున్నామో. ఉదాహరణకు పాత రోజుల్లో దంతధావనానికి పదిపైసలిస్తే ఇరువది పుల్లలు వచ్చేవి. ప్రతి ఉదయం శుభ్రంగా పళ్ళు తోముకోవచ్చు. ఇప్పుడు పదవ తరగతి చదివే నాకుమారుడు ఎముకతో చేసిన పళ్ళు తోముకునే బ్రష్ కొని వ్వమని పట్టుబట్టాడు అది క్రిములకు తావిచ్చి నెలల తరబడి చిగుళ్ళు వాచేలా చేసి పళ్ళు రాలిపోతాయి. పట్టణాల్లో వున్న అమెరికన్ దంత వైద్యులకు అందువల్ల అదనపు ఆదాయం వస్తుంది. . . ప్రతి యింట్లో ఉదయం పూట బహిర్ భూమికి పొలాలకు వెళ్ళటం అలవాటు. అందు వల్ల మల బద్ధకం వచ్చేది కాదు. పొలాలకు ఎరువు వచ్చేది. కాలికి అంటుకున్న ముత్యాలవంటి మంచువల్ల ప్రకృతి సహజమైన విద్యుత్తు శరీరమంతా వ్యాపించి చైతన్యవంతుల్ని చేసేది. ఉదయభాను కిరణా లను చూడటంవల్ల ఎనభై సంవత్సారాలవరకు కంటిచూపు తగ్గేదికాదు. ప్రకృతికి చేరువగా వుండి పొందికగా వుండటం అలవాటు చేసుకు న్నాము. ఈ బడి మొత్తంలో ఈ విధమైన ప్రకృతి సహజ జీవనం ఒక మాష్టారు మాత్రమే అనుసరిస్తున్నారు అది మీకు చరిత్ర, భూగోళం చెప్పే హరిచంద్ర మాష్టారు.'

ఉదాహరణకు మీకు చరిత్రలో పరీక్షాధికారి 'గ్యారెట్'ను తీసుకోవచ్చు.'

'ఆయన నన్ను బి.ఎ. పరీక్షలో రెండుసార్లు తప్పించాడు. వాళ్ళ అబ్బకన్నా నాకు భారతదేశ చరిత్ర బాగా తెలుసు. గద్దర్ పక్షం వారి సభ్యుడొకడు నాకు స్నేహితుడని వారి అనుమానం!'

ఆర్య సమాజంలోని హిందూ సంస్కరణోద్యమానికి చెందిన వాడని ఎమ్.ఏ పరీక్షలలో గణిత శాస్త్రంలో దేవదత్త బాబాయిని మూడు సార్లు తప్పించిన విషయం గుర్తుకు తెచ్చుకున్నాను. హరిచంద్ర మాష్టారి గుండెల్లోంచి అగ్నిపర్వతం బద్దలైనట్లుగా కన్పిస్తోంది. ఆయన సొట్టబడిన బుగ్గల్లోంచి, వ్యధాభరిత హృదయం ముఖంపై కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది.

'నా ఓటమి నాలో నిరుత్సాహాన్ని కల్పించలేదు. నేను చరిత్ర పారం చెప్పగలను. ఇప్పుడు మీరు చదువబోయే హిందూదేశ చరిత్ర వాధెన్ లల్లా మన్‌మోహన్ ఎమ్.ఏ. వ్రాశారు. వారి కంటె మంచిగా నేను ఒక పుస్తకం వ్రాయగలను' అన్నాడు హరిచంద్ర మాష్టారు.

ఆయనకు మళ్ళీ తుమ్ము వచ్చినట్లుంది. ఆయన మళ్ళీ తలుపుదాకా వెళ్ళి ఇంతకు ముందు చేసినట్లుగా చీది, ముఖం పైకెత్తి గాలి పీల్చుకొని వెనుకకు వచ్చి ఉపన్యాసం మొదలు పెట్టాడు:

'పిల్లల్లారా! ముందు ఈ మోసం గమనించండి. వాధెన్ తెల్లవాడు. హిందూస్తానీ మాట్లాడటం కూడా రానివాడు ఉర్దూలో వ్రాసిన పుస్తకం మీద ఆయన పేరు వుంది. లల్లామన్ మోహన్ పుస్తకం వ్రాసి అట్టమీద వాధెన్ పేరు చేర్చి ఈ పుస్తకం పాఠ్య పుస్తకంగా చేయించాడు. మనం వుంటున్న ప్రపంచం ఇలా అధర్మంగా వుంది. లంచ గొండితనం, పక్షపాతబుద్ధి, తెల్లవారికి దేవతలతో సమానం. వేదంలో చెప్పిన దేవతలను మరచి పోయాం. మహమ్మదు ప్రవక్త మరుగున పడిపోయారు. గురునానక్ స్థానమే లేదు.'

'తెల్లదొరకు ఒక పళ్లబుట్ట లంచంగా యిస్తే చాలు, పని పూర్తి అవుతుంది. ఈ విధంగా అధికారులు ఉన్నతపదవుల నధిష్ఠించవచ్చు. కాని, జిల్లాన్యాయస్థానానికి కాళ్లు ఈడ్చుకొంటూ వెళ్లి, రైతన్న రోజంతా భూమి మీద చతికిలబడి కూచోవాలి. న్యాయవాదులు అతణ్ణి పీడించి వద

లుతారు. గుమాస్తాలు అతని జేబులు ఖాళీచేస్తారు. ఆరోజు వాయిదా పడుతుంది. పది, పదిహేను మైళ్లు వెనక్కి తిరిగి వెళ్లాలి. మళ్లీ వచ్చే నెల న్యాయస్థానానికి రావడానికి తన పొలంపనులు మానుకోవాలి. పట్వారీలు, తాశిల్దారులు లంచాలు అడుగుతారు. ఇవ్వకపోతే పోలీసులు వారి మీద దొంగ ఫిర్యాదులు బనాయించి రైతన్నల జీవితాలు దారుణం చేస్తారు. ఉన్నతాధికారులు గుర్రాలమీద, మోటారుబండ్ల మీద కోళ్లు, కోడిగుడ్లు వసూలు చేసికొని వెళ్లిపోతారు. రైతులకు ఆ దుమ్ము మిగులుతుంది. ధరలా! చెప్పనలవిగాదు. ఈ ముదనష్టపు ప్రభుత్వం పరాయివారితో యుద్ధంలో వోడిపోతుంది. కాని ప్రజలను అణచివేస్తారు.

'మాష్టారూ! అందరు అధికారుల గురించి మీ రామాట అనడానికి లేదు.' వెనుక నుంచి ఒక కుర్రవాడు ప్రతిఘటించాడు.

'ఎవరక్కడ? నీ పేరేమిటి?'

'ఫకీర్ ముగీనుద్దీన్. మా నాన్న పేరు ఇఫ్తికారుద్దీన్. ఆయన సహాయ కమీషనరుగా పని చేస్తున్నారు.' అన్నాడు శుభ్రమైన దుస్తులు ధరించిన సన్నటి వ్యక్తి.

'నాకు తెలుసు.' హరిచంద్ మాష్టారు సమాధానం: ఆయన వ్యంగ్యంగా పర్షియన్ సామెత వల్లించాడు, 'మా నాన్న సుల్తాను.' — నాకు తెలుసు మీ నాన్న మెజిస్ట్రేటు. నువు కూచొని నేను చెప్పింది విను. నువు నాకు చరిత్ర పాఠాలు చెప్పకు. మీ కుటుంబం సిక్కు రాజ్యానికి ద్రోహం చేయ్యలేదా? మహారాజ రంజిత సింగు వద్ద మీ ముత్తాత స్తోత్ర పాఠాలు చదివేవాడు. నిజమేనా? మీ నాన్న ప్రభుత్వానికి విధేయుడు...'

'మీ మీద హెడ్మాష్టరుగారికి ఫిర్యాదు చేస్తాను.' ఫకీర్ ముగీనుద్దీన్ వాదించాడు.

'నీ యిష్టమైన వాళ్ళకు చెప్పుకో!' బి.ఏ రెండు సార్లు తప్పిపోయిన నాకు భయమనేది లేదు. మూడో సారి తప్పించగలరు. నా పని వాళ్ళ కిష్టం లేకపోతే, ఈ కొద్దిపాటి జీతానికి పని చేసే బదులు,

మా స్వగ్రామం డాస్కాకు వెళ్ళి పొలం దున్ని బ్రతుకుతాను.' అన్నారు మాష్టారు.

'నేను వెళ్లి చెప్పను.' తిరుగుబాటు ధోరణిలో అన్నాడా కుర్ర వాడు. 'నీ సంచి తీసుకొని బయటకి వెళ్లి పో! అసందర్భపు వాగుడు వద్దు.'

ఫకీర్ ముగీసుద్దీన్ హడావిడిగా వెళ్లిపోయాడు.

ఆయన గందరగోళ స్థితిలో పడిపోయాడు. ముఖకవళికలు మారి పోయి, వివర్ణమైంది. తుమ్ములు వస్తున్నట్లనిపించింది. శరదృతువులో ఎండిన చెట్టులా అల్లల్లాడిపోయాడు.

'నాకు జ్వరం వచ్చినట్లుంది. పరీక్షలకోసం రాత్రింబగళ్లు చదివి ఎండబెట్ట జ్వరం తగిలినట్లుంది.' — క్షమాపణధోరణిలో అన్నాడు.

నాకు ఆయనపట్ల అప్రయత్నంగా సానుభూతి కలిగింది. రతీరామ్ మాష్టారు విమర్శనాత్మక దృష్టికంటె. ఆంగ్ల ప్రభుత్వం మీద ఈయన విమర్శ సహేతుకంగా అనిపించింది. ఆయన మా అమ్మ పుట్టిల్లు అయిన డాస్కా గ్రామానికి చెందిన వాడినని చెప్పడం వల్ల మరింత ఆత్మీయత గోచరించింది. బి.ఏ. పరీక్షల్లో తప్పిపోవడం వల్ల ఆయనలో అసంతృప్తి పెరిగినట్లుంది. ఆయన విప్లవధోరణివల్ల ఆయన బలహీనపడి వణుకు తున్నాడు.

హరిచంద్రమాష్టార్ని ఎదిరించిన ఫకీర్ ముగీసుద్దీన్ ధైర్యంపట్ల మొగ్గు మరొక పక్క కలిగింది. అమృతసర్‌లో మా సందు పేరుపెట్టిన — ఫకీర్‌ఖానాతో స్నేహం చేయాలని కోరిక.

ఆంగ్లేయుల మీద హరిచంద్రమాష్టారు తిరిగి విమర్శ ప్రారంభించ డానికి సిద్ధమవుతుండగా తరగతిలో నిశ్శబ్దం తాండవించింది.

'నేను వెళ్లి అతణ్ణి వెనక్కి పిలుచుకొస్తాను.' ఆంగ్లేయులశైలిలో సూటు, కోటు ధరించిన పొడుగాటి, స్థూలకాయుడు ఇంద్రనాథ్ అన్నాడు.

'అక్కర్లేదు. రాదలచుకొంటే అతనే స్వయంగా రావచ్చు.' అన్నాడు మాష్టారు.

వాస్తవానికి, ముగీసుద్దీన్ చాలాదూరం వెళ్లలేదు. వెనక్కి తిరిగి వచ్చి — 'క్షమించండి మాష్టారు!'అన్నాడు.

'నిన్ను క్షమించాను.' అంటూ హరిచంద్ర మాష్టారిలా కొనసాగించారు: 'ఈనాడు మన దేశంలో మనకు తగిన అవకాశాలు లేవంటే, అందుకు కారణం, మనం చేసిన కొద్ది తప్పిదాలు కారణం కాదు.' పరాయి ప్రభుత్వపాలనా విధానంలో ఈ లోపం వుంది. తన శత్రువులతో పోరాటం పెట్టుకొని ప్రభుత్వం దారుణ స్థితి కొనితెచ్చుకొంది. వాళ్లు ఇతర దేశాలను కొల్లగొట్టాలని చూస్తున్నారు. మన మందరం వూహించినదానికంటె అధికంగా, యుద్ధంలో లక్షలాది సిపాయిల జీవితాలతో విధి చెలగాట మాడుతోంది. ఆంగ్ల ప్రభుత్వం గెలిచినా జర్మనులు జయం సాదించినా మన భవిష్యత్తులో మార్పు ఉండదు. అయితే మీరడగవచ్చు..... మనలను ముందుకు నడిపిస్తున్న ఈ శక్తి, అసాధ్యమైన ఈ విధి స్వరూపమేమిటి? అని ఒక్కమాటలో చెప్పాలంటే అది — "చరిత్ర", త్రాగుబోతు పాచికలు విసిరినట్లు. విధి మన జీవితాలతో చెలగాట మాడుతోంది. మనకేమవుతుందో నాకు తెలియదు. ఈనాడు జరుగుతున్న సంఘటనల ఆధారంగా గత చరిత్రను మీకు బోధిస్తాను. కేవలం వట్టి చదువుగాక, గతాన్ని మార్చిన విజ్ఞానం మీరు కొత్త చరిత్రను సృష్టించడానికి దోహదం చేస్తుంది.'

ఆయన పెద్దపెద్ద పదాలు వాడినప్పటికీ, కొత్త విషయాన్ని ఆయన బోధించే విధానం నాకు బాగా నచ్చింది. ప్రపంచ చరిత్రను క్షుణ్ణంగా తక్షణమే చదవాలను కొన్నాను. బ్రిటీషు వారిపట్ల విప్లవ ధ్వజమెత్తడానికి అది బాగా దోహదం చేస్తుంది. మాష్టారు మా మనసులకు హత్తుకొనేలా చెప్పదలచుకొన్న విషయం కూడా అదే! హరిచంద్రమాష్టారు ఎంత మేధావి అయినా, రతీరామ్ మాష్టారు చెప్పినట్లు, మన భారతీయ చెడు అలవాట్లకు ఈయన బాగా లోనయ్యారు. చీదడం అందులో ఒక భాగం ఆంగ్లేయుల పట్ల అమెరికన్లు విప్లవం చేసి స్వాతంత్రం సాధించిన చరిత్ర హరిచంద్ర మాష్టారుకు తెలుసా? -అని నాకు ఆశ్చర్యం. నాలో

ఉబ్బుకుతున్న ఉత్సాహానికి తగిన సమాధానాలు ఆయన వద్ద వున్నాయా?

రెండో ఉపాధ్యాయుడు, లల్లా అమర్‌నాధ్. నీలరంగు సూటు ధరించిన నల్లని దీర్ఘకాయుడు, బట్టతలతో ప్రవేశించి, ప్రారంభంనుండి చురుకుగా వుండాలని పాఠం చెప్పడం వెంటనే మొదలెట్టాడు. ముగీసు ద్దీన్ అడ్డు పడటంతో ఆయన సాధారణ ఉపన్యాసం చెప్పక తప్పలేదు.

'మాష్టారూ! ఈ ఉదయం రాజా ఫజిల్ మహమ్మద్ ఖాన్ ఆంగ్ల ప్రభుత్వం మంచిదని నిర్ధారించారు. ఈ 'పిల్‌పిలి సాహెబ్' ధరించిన దొరల దుస్తులు మనకు బాగుంటాయనీ, మన దేశీయమైన వస్త్రాల కంటె అవి మెరుగనీ చెప్పారు.... కానీ, హరిచంద్ర, రతీ రామ్ మాష్టార్లు ఆంగ్లేయులను నిరాదరించి, చేతి గుడ్డలను కూడా వాడకూడదన్నారు. మీ అభిప్రాయం ఏమిటి?' అన్నాడు.

అమృత్‌సర్‌లోని పండిత వైద్యనాధ పాఠశాలలోగాని, లూథియానా ప్రభుత్వ పాఠశాలలోగాని, ముగీసుద్దీన్ వలె యింత ధైర్యంగా విద్యార్థులు మాట్లాడటం నేను చూడలేదు. అతని వైపు చూశాను.

కోపకారణమైన ఈ ప్రశ్నకు హాస్యయుత ధోరణిలో లల్లా అమర నాధ్ సమాధాన మిచ్చారు. అది నాకు లక్ష్యభూతమైనా, నా పొగడ్త కెక్కింది.

'ఈ ప్రశ్నకు ఎవరూ సమాధానం చెప్పలేరు. ఈ తరగతిలో పిల్లలిద్దరికి ఈ విషయం పై చర్చ ఏర్పాటు చేద్దాం. ఒకరు ఆంగ్లే యుల దుస్తుల సౌలభ్యం గురించి, మరొకరు టోపీ, ధోవతి ప్రయోజనం గూర్చి మాట్లాడతారు. ఆంగ్లశైలి దుస్తులను 'పిల్‌పిలి సాహెబ్' సమ ర్థిస్తాడు. నువ్వు భారతీయ సంప్రదాయపు దుస్తుల్ని సమర్థిస్తావు. ఈ చర్చనీయాంశానికి పేరు - తలపాగా మంచిదా? టోపీ మంచిదా?'.

ఈ సూచనపట్ల తరగతిలో పిల్లలంతా బల్లలు చరిచి ఆమో దించారు. ఈ చర్చలో నాకు అప్పగించిన అంశం గురించి నాకు ఇబ్బందికరంగా తోచింది. ఇంతలో అమరనాధ మాష్టారు నన్ను పిలిచి

'పిల్‌పిలీ! రా!' అన్నాడు.

ఈ వాగ్వివాదంలో ఓడిపోతాననే భయంతో వణికిపోతూ కూర్చొన్న చోటునుండి లేచి, ఒక్క క్షణం ఆగాను. అమరనాథ్ మాష్టరు ముఖంపై దరహాసం గమనించి, ఉత్సాహం పొంది నోరు తెరిచాను.

'మాష్టారూ! నేను వ్యతిరేకంగా మాట్లాడవచ్చా?'

'సరే! ఆరంభించు. ఇలా ముందుకు వచ్చి, విద్యార్థులకు ఎదురుగా నిలబడు.' అన్నారు మాష్టారు. ఆయన హుషారుగా వుండటంతో నాకు ధైర్యం ఎక్కువై. ముందుకు వెళ్లి నుంచున్నాను.

'టోపీ కంటె తలపాగాలో సౌలభ్యం వుంది. తలపాగా అంచుతో ముక్కుతుడుచుకోవచ్చు — ఈ ఉదయం హరిచంద్ర మాష్టారు చేసినట్లు చేతిగుడ్డ తీసుకెళ్లవలసిన అగత్యం లేదు.'

ఈ మాటలు విద్యార్థుల్లో నవ్వుతెప్పించింది. మాష్టారు కూడా నవ్వు ఆపుకోలేకపోయారు. హాస్యగాడుగా నన్ను గుర్తించగానే అందరూ అభినందించారు.

'ధోవతి, కుర్తా ధరిస్తే ఎంతో అనుకూలం. అమ్మ బజారుకెళ్లి సామాన్లు తీసుక రమ్మంటే, ఈ దుస్తులు ముడివేసి సామాన్లు తీసుక రావచ్చు.'

అభినందన సూచకంగా బల్లలు చరిచారు.

'శభాష్!' అభినందించారు మాష్టారు. 'నువు కూచొనేముందు ఆంగ్లేయుల దుస్తుల్లో సౌలభ్యం గూర్చి ఒక్కమాట చెప్పాలి' అన్నారు.

'ప్యాంటు ధరించడంలో అత్యధికమైన సౌలభ్యం ఏమిటంటే — వుతకనక్కరలేకుండా వేసుకొని నెలలతరబడి మనందుర్గంధం మోసుకొంటూ తిరగవచ్చు.'

'ఇంకచాలు. వివరాలు మాకు వదిలెయ్. మన స్నేహితుడు ముగీసుద్దీన్ దానిమీద అల్లుకుని పోగలడు.' అన్నారు మాష్టారు.

హఠాత్తుగ ముగీసుద్దీన్ పొగరుబోతుగా మాట్లాడుతూ — 'ఈ దుర్గంధ భూయిష్టమైన చర్చలో నేను పాల్గొనదలచుకోలేదు. **విదేశీ**

వస్త్రాలు ధరించడం ఇస్లాం మతానికి  వ్యతిరేకం!' అన్నాడు.

'నిజంగా' అన్నాడు మహమ్మదు అఫ్జల్.

'అవును.' అతని అన్న సుభాష్ సాదిక్ సమర్థించాడు.

'సరే!  నేను లెక్కలు మొదలెడతాను.  నేను వ్యాపారస్తులైన 'గుప్త' కుటుంబంలో జన్మించాను.  మా కులంలో జన్మించిన వారు లెక్కలద్వారా బాగా డబ్బుగడించారు కాబట్టి నేను లెక్కలు చెప్పడానికి అరువాణ్ణి' అన్నారు మాష్టారు.

మతం పేరుతో చర్చలో పాల్గొనడానికి ముగీస్ నిరాకరించడంతో తరగతిలో ఏర్పడ్డ వుద్రిక్తత, తన మీదతానే మాష్టారు ఛలోక్తి విసర డంతో సడలిపోయింది. లెక్కలు తెలిస్తే, దాని ద్వారా మంచి పనులు, చెడ్డ పనులు ఎలాచేయవచ్చో ఛలోక్తిగా మాష్టారు చెప్పసాగారు. మొదటి రోజు ఆవిధంగా గడిచిపోవడం మా కందరికీ సరదాగావుంది. గణితశా స్త్రంలో కవిలా ఆయన  మాటలు చిరస్మరణీయం· ప్రతి కుర్రవాని విజ్ఞానానికి మానసిక వికాసం అవసరం. చదువును ఆటలతో సమానంగా భావిస్తే ఈ శక్తి యుక్తులు బహిర్గత మవుతాయి. ఈరోజు  మనం టోపీకి, తలపాగాకు మధ్య వ్యత్యాసం గురించి సరదాగా మొదటిరోజు చర్చించుకోవడంవల్ల, కడుపుబ్బ నవ్వుకొన్నాం. అలానే ప్రతిరోజూ మనం పాఠాలు నేర్చుకోవాలి.  చదువురాని  నిరక్షరాస్యులతో మీరు కాలం గడిపి, వారికి చదువు చెప్పడంతోబాటు రేఖాగణితము. జ్యామితి, కవి త్వమూ కలిపి నేర్చుకోవచ్చు.

బడి వదిలిన తర్వాత, మేము అతని వైపు వెళ్తుంటే, ముగీస్ — వాళ్లనాన్న శకటంలో ఎక్కి, డ్రైవరు పక్కన కూచొన్నాడు. మమ్మల్ని చూడగానే దిగివచ్చి నాతో కరచాలనం చేశాడు. అప్పుడు అతని ధోరణి హరిచంద్ర మాష్టారి వద్ద క్షమాపణ కోరిన విధంగా ఉంది. దుస్తుల్ని గురించి చర్చించడం ఇస్లాం మతానికి అవమానకరమని అతడు అనుకో వడం పట్ల అతనిపై నాకు  వ్యతిరేక భావం వున్నప్పటికీ, నే నతనిపట్ల ఆకర్షితుడ నయ్యాను. నా మనస్సులో మతం  గురించి ఎలాంటి భావన లేదు.  అంత చులకనగా ఎప్పుడూ మాట్లాడలేదు.  ముగీస్‌ను చూసి,

మహమ్మద్ అఫ్జల్, సుభాసాదిక్ నాతో కరచాలనం చేశారు.

నేను కూడా వారిలో ఒకడినని నమ్మించేందుకు వారు పన్నిన పన్నాగమని మరుక్షణంలో గ్రహించాను. ముగీన్ వున్నట్లుండి నాతలపై టోపీ తీసి అఫ్జల్ వైపు విసిరాడు. నేను అతని దగ్గరకు వెళ్లి తీసుకొనే లోగా అతడు నన్ను దగ్గరగా రానిచ్చి సాదిక్ వైపుకు విసిరాడు. నేనతని దగ్గరకు వెళ్లేసరికి, అతను ముగీన్‌కు విసిరివేశాడు. వాళ్లు దానితో బంతి ఆడుకోసాగారు. నేను పెద్దగా తిట్టేసరికి, ముగీన్ టోపీని రోడ్డు మీదికి దూరంగా విసిరివేసి తెచ్చోకోమన్నాడు.

ఇదంతా చూస్తూ గణేశ్ అత్యంత తటస్థ భావం వహించాడు. మేమిద్దరం కలిసి చదువుకొన్న అన్ని పాఠశాలల్లో అతని ప్రవర్తన యిలానే వుంది. ఇతర విద్యార్థుల మంచితనాన్ని చూరగొందామని వాడిలాచేస్తాడు. వాడు అఫ్జల్, సాదిక్‌లతో కలిసి ముందుకు నడవడం చూశాను. మేజిస్ట్రేటు కుమారుడైన ముగీన్‌ను, సుబేదారు మేజరు కుమారు లిద్దర్ని అసహ్యించుకొన్న దానికంటె వాణ్ణి అధికంగా ద్వేషించాను.

నాగుండె గొంతుకల్లోంచి ఆవేదనతో ఏడుస్తూ అన్నాను· 'ఓరీ! రాక్షసుల్లారా! నేను చిన్న వాణ్ణి అయినా, మీ అందరితో పోరాడగలను. నా టోపీని విసిరేయగలరు, నవ్వగలరు, పరుగెత్తగలరు. కాని, నేను పిరికిపందను కాదు. నిలుదొక్కుకొని నుంచోగలను.'

అది నిరూపించడానికి, నెమ్మదిగా గణేశ్ దగ్గరకు వెళ్లాను. నేను వాడి దగ్గరకు సానుభూతికోసం వచ్చాననుకొన్నాడు. వాడిని ఒక చెంప దెబ్బకొట్టాను.

వాడు నన్ను మళ్లీ కొట్టేలోగా, ముగీన్ నా పక్షానికి వచ్చి నన్ను వెనక్కిలాగాడు. నన్ను వాళ్ల శకటంలో యింటిదాకా దిగబెడతానన్నాడు.

'అక్కర్లేదు.' అంటూ ముందుకు నడిచాను.

'శభాష్' అన్నాడు ముగీన్. ఆనాటినుండి మేమిద్దరం మంచి స్నేహితులమయ్యాము.

ఇంటికి వచ్చే దారిలో నాలో భావాల సమ్మేళనం కలిగింది. బడిలో నాకు కలిగిన జయానికి గర్వం, మంచి ఉపాధ్యాయులు యిద్దరు లభించినందుకు సంతోషం, కలిగాయి. కాని వారిద్దరు అతి తెలివి గల వాళ్లు, ఆంగ్ల ప్రభుత్వం పట్ల వ్యతిరేకులు. బ్రిటీషు వారితో వ్యతిరేకంగా పోరాడుతున్నందుకు అమెరికన్లపట్ల నా అనుకూలతను గమనించని వారి మనస్తత్వానికీ, నన్ను అల్లరి పెడుతున్న విద్యార్థుల మొరటుతనానికి, అసభ్యతకు విచారించాను. నాపట్ల విద్రోహచర్యకు పాల్పడ్డ మా తమ్ముడి ప్రవర్తన నచ్చలేదు.

ఈ విధమైన మానసిక సంఘర్షణ నాలో కొత్త జీవిత విధానానికి నన్ను నడిపించుకొని వెళ్తోంది. జీవిత లక్ష్యం చరిత్రను తెలుసుకోవడానికేనని గ్రహించాను. వివిధ కాలాల్లో వ్యక్తుల భావాలు, కార్యక్రమాలు గమనించి, వాటిలో దోషాలను పరిహరించి, ఉత్తమవ్యక్తిగా మలచుకోవడానికి మంచితనాన్ని పెంపొందించుకోవాలి. అబ్రహాం లింకన్ జీవితాన్ని ఉదాహరణగా తీసుకోవచ్చు. కొన్ని నిత్యసత్యాలపట్ల నా దృఢవిశ్వాసంవల్ల నేను మానసిక వ్యధకు లోనవుతున్నానని గ్రహించాను. వేశ్యఅయిన ముంతాజ్ పట్ల నాకున్న దొంగచాటు అనురాగం, మూఢాచారాలుగల పెద్దల పట్ల విముఖత చూపి, నా సానుభూతి విషయంలో బాగా ఎదిగి ధైర్యాన్ని చూపగలుగుతున్నాను. నాలో జ్వలిస్తున్న భావాలు నా తప్పిదాలను రూపుమాపి నృత్యసంగీత కవిత్వాల వైపుకు నడిపిస్తాయని తెలుసు.

నా ఆత్మలో నేను ఘోషించాను:

'ఓ సుఖమా! ఓ దుఃఖమా! ఓ ప్రపంచమా! లూధియానాలో నా చుట్టూ వున్న పరిసరాలవల్ల నేను ఖైదులో వున్నట్లు భావించినప్పటికీ, నేను నిన్ను ఆలింగనం చేసుకొంటాను. నేను వీటిలోంచి బయపడాలి..... జీవిత పోరాటం కొనసాగించాలి.... నిద్రాముద్రిత జగత్తులోవున్న కంటోన్మెంటు అగ్ని పర్వతంపై నేను ఒంటరిగా నడుస్తాను; ముగీన్ వంటి సాహసోపేతమైన స్నేహితులనుకూడా తీసుకెళ్తాను. ఏదిఏమైనా, అగాధాలలోకి వెళ్లి, అగ్ని పర్వతాలలో స్నానం చేస్తాను.'

నేను త్వరగా ఎదగాలని ఆకాంక్ష. ఇతరుల ఆలోచనలు, భావాలకు వ్యతిరేకంగా నా భావాలను పోల్చుకొంటున్నాను. స్వార్థమనే పరదాను దాటుకొని, నా సునిశిత భావంతో, మొరటువారైన దున్నపోతు విద్యార్థులను అధిగమిస్తాను. నేను సరియైన దారిలో నడిస్తే, పెద్దల పక్షపాతాన్ని ఎదిరిస్తాను. అహో రాత్రాలు అసహనంలో పరిశ్రమించి వాస్తవ స్థితిగతులకు యత్నిస్తాను. నేను భయపడుతున్నప్పటికీ, నా లక్ష్యాలు నెరవేరడానికి అవిధమైన నాయకత్వలక్షణాలు అవసరం. నా కళ్లలో నీళ్లు తిరుగుతున్నా, గుండెలో తుఫాను చెలరేగినా, ఈ పరిస్థితిని అధిగమించగలను. నాలో ఈ భావాలు స్వశక్తిమీద నిలబడగల యువకుణ్ణిగా మలచ గలవు. నా శారీరక బలహీనత, రుగ్మత అడ్డువస్తాయని భయం.

# 3

యౌవన ప్రాదుర్భావ ప్రాంగణంలోకి అడుగిడుతూ, లక్ష్యసాధనకు ప్రయత్నిస్తూ, పరిపూర్ణతాసిద్ధికి కృషి చేస్తూ, నిరోధాలను ఎదిరిస్తూ జీవితం కొనసాగించాను.

నా గుండెలో అస్తవ్యస్త స్థితి, ప్రపంచంలోని స్థితికి తగ్గట్లుగా వుంది. మూర్ఖపు విషయాలనుంచి, అతి మూర్ఖ విషయాలవైపు నా మనసు మొగ్గు చూపుతోంది. ఆదిభౌతిక ప్రశ్నల విషయంలో అరకొర అవగాహన, నాలోని చిడిముడి పాటుకు దోహదం చేసింది. సాధారణ వ్యక్తులు, ఈ విధమైన అతితెలివి గలవారు హాస్యాస్పద పాత్రులవుతారు. అలానే నేను హాస్యానికి లోనయ్యాను. నా అమెరికన్ తరహా వస్త్రధారణ వల్ల నన్ను 'పిల్ పిలి సాహెబ్' అని పిలవడానికి దోహదం చేసింది. ప్రతి విషయాన్ని గురించి ఎందుకు? అని ప్రశ్నించడంవల్ల నన్ను 'సోక్రటీ స్ తనయు' డనని పిలవసాగారు.

ఇతర రెండు నగరాలలోవలె, నా ఒంటరితనంవల్ల ప్రత్యేక వ్యక్తిగా,

గందరగోళ స్థితిలో వున్న విప్లవజ్వాలగా భావించసాగారు. ఆంగ్ల ప్రభుత్వంలో తన కుమారుడు అధికారి కావాలని కోరుకుంటున్న తండ్రి కోరికలను మంట గలిపి, అమెరికా నుండి ఒక దేవతనో, చిలకనో, వేశ్యనో తీసుకవస్తాడు. (తెల్లదొరసానులందరూ అర్ధ నగ్నం గాను, సిగ్గులేని వేశ్యలుగాను భావించబడేవారు) తన గుండె గొంతుకలో నుంచి కొత్త భావాలను ప్రజ్వరింపజేసి తండ్రి అతికష్టంమీద కూడబెట్టిన డబ్బును, వృధా ఖర్చులకు వినియోగిస్తాడని వారి భావన. ఈ భయాలను పోగొట్టి, అమృతసర్, లూధియానాలలో కంటె వయస్సులో బాగా ఎదిగాను.

ఒక రాత్రి భోజనానంతరం మానాన్న విశ్రాంతిగా పడక కుర్చీలో దుప్పటి కాళ్లకు కప్పుకొని కూచొన్నారు. మేము మా పాఠ్య పుస్తకాలను చదువుతున్నట్లు నటిస్తున్నాం. అప్పుడు హఠాత్తుగా మానాన్నను ప్రశ్నించాను· 'మాలాఖండ్‌కు మీరు వెళ్లినప్పుడు, ప్రతాప్ బాబాయి అంగట్లో కంసాలి పని నేర్పే ప్రయత్నం చేయలేదేం? బాబాయి పాత్రలు కాచే కొలిమి తిత్తులను వూదడమంటే నాకు యిష్టం. నా స్వహస్తాలతో వస్తువులు తయారు చేయాలని కోరిక..... మన పూర్వీకుల వృత్తిని మీ రెందుకు ద్వేషిస్తారు?' అన్నాను.

'ఎందుకు? ఎందుకు? పూర్వీకులది ఏమిటి?' అని ఆయన మిలటరీ గెజిట్ చదువుతూ ఎగతాళి చేశారు.

ఆయన నా మాటలు లక్ష్య పెట్టకుండా ఎద్దేవా చేసినందుకు బాధపడి కుమిలి పోయాను.

కొంతసేపు ఆగి, 'బాబూ! నీ విషయం నాకు అర్థం కావడం లేదు..... నువు కెప్టెన్ ఓసులేవాన్‌తో కవిత్వం రాయాలని వుందని చెప్పావు..... ఇప్పుడు కంసాలిపని నేర్చుకోవాలని వుందంటున్నావు.....' అన్నారు.

'నేను అన్నీ నేర్చుకోవాలను కొంటున్నాను.' అన్నాను అప్రయత్నంగా.

'అన్నిటిలో సమర్థుడు' అని ఆంగ్ల సామెత వుంది. చదువుకొన్న

వాడు అంతటా గౌరవార్హుడు. 'విద్వాన్ సర్వత్ర పూజ్యతే' అన్నారు నాన్న.

'ప్రభుత్వం పెద్ద మనుషులను ద్వేషిస్తుందనీ, లెక్కపెట్టదనీ మీరే చెప్పారు. మీరు పదవీ విరమణ చెయ్యండి. మనం కంసాలి వృత్తి స్వీకరిద్దాం. మేము బడికి వెళ్తుంటాం. అప్పుడు మేము చదువుకొన్న వృత్తిపని వారమవుతాం.' అన్నాను.

'అప్పుడు మీ బడి జీతాలు ఎవరుకడతారు? మిమ్మల్ని ఎవరుపైకి తీసుకొస్తారు? డబ్బు ఎలా దొరుకుతుంది?' ప్రశ్నించాడు నాన్న.

'రండి బాబూ! పాలు తాగండి. ప్రతి రాత్రీ శివ పాలు తాగ డంలేదు. కుంభకుర్ణుడిలాగా అన్నంతినగానే నిద్ర కుపక్రమిస్తాడు.' అంది అమ్మ.

'మన యిళ్ల బాడుగలు, మీ పింఛను మనకు సరిపోతాయి. ఈ దొరలకు బానిసగా జీవించి, మీరు పేరాశకు పోకపోతే మనము సుఖంగా మధ్య తరగతి జీవనం గడపవచ్చు.' అంది అమ్మ నాన్నకు పాలగ్లాసు యిస్తూ

'పేరాశ!' నాన్న ఆపదాన్ని ఆధారం చేసుకొని అరిచాడు: 'ప్రపం చంలో గుమాస్తాలు తమ జీవనం సాగించడానికి సంపాదించుకోకపోతే, విప్లవం వస్తుంది.'

"మీకు ఆశ లేదా? దేవకి యిష్టం వచ్చినట్లు ఖర్చు పెట్టుకోనీ! ఆవిడ కనోవాల్‌లో బావి త్రవ్వకానికి డబ్బంతా ఖర్చుపెట్టనీ! మన స్వార్జితంతో గణేశ్ పెళ్ళి చేద్దాం... నేను దాచిన కొద్ది పాటు డబ్బు తెస్తాను. ప్రతి శని, ఆదివారం ఆవిడ వెంబడి బడి తిరగాల్సిన అవసరం లేదు." అంది అమ్మ.

'అనవసరంగా వాగకు.' అన్నాడు నాన్న. వాక్‌స్వాతంత్రమనే సిద్ధాంతానికి భిన్నంగా అలా అన్నాడు. స్వేచ్ఛగా ఆలోచించడమనే ఆయన మాటల కర్థం వాక్‌స్వాతంత్రమని యిన్నాళ్ళు అనుకొన్నాను.

అమ్మ కళ్ళ నీళ్ళు పెట్టుకొని, 'మాకు పాలు యిచ్చి, శివను

కష్టంగా ఎత్తుకొని పడక మీదకు తీసుకెళ్ళింది.

'మీరిద్దరూ ఏం చేస్తున్నారు?' మా యిద్దరి వైపు చూసి నాన్న అన్నారు: 'మీరు శ్రద్ధగా చదవండి. మీరు కుటుంబ ప్రతిష్ఠ నిలబెట్టండి. పరీక్షల్లో తప్పి నాకు అవమానం కలిగించవద్దు. ఈ శని, ఆదివారాలు మళ్ళీ అమృత్‌సర్ వెళ్తున్నాను. తిరిగి వచ్చిన తర్వాత యింటి వద్ద ఒక గంటసేపు రోజూ తర్ఫీదు యిస్తాను. మీరు మెదటి తరగతి మార్కులతో నెగ్గవచ్చు.'

ఆయన కంఠం కఠినంగా వుండటంతో మేము భయపడ్డాము. 'నాకు నిద్ర వస్తోంది' అందామనుకొన్నాను. నాన్న మాటలు విన్న తర్వాత ఆ మాట అనడానికి జంకాను.

కొంతసేపు గదిలో నిశ్శబ్దం రాజ్యం చేసింది. నాన్న వార్తా పత్రిక కదిలించే శబ్దం, వార్తలు చదువుతూ ముఖకవళికలు మార్చడమూ గమనించాము. దేవకిని చూడటానికి నాన్న అమృత్‌సర్ వెళ్ళడం ఈ గొడవకు అసలు కారణమని వూహించాను.

చివరకు, కళ్ళు మూతలు పడసాగాయి ఆవులిస్తూ, మగతగా మాట్లాడాను. చిన్నతనంలో నేను మాట్లాడినప్పుడు అందరూ జాలి చూపేవారు. 'నిద్ర ముంచుకొస్తోంది'

'వెళ్ళి చావు.' అన్నాడు నాన్న.

నేను గొర్రెలా వెళ్ళి పోయాను.

సగం నిద్రలో, అటూ యిటూ దొర్లుతూ, అసహనంతో నిద్ర పట్టక బాధపడ్డాను. నాన్నతో పాటు మిగతా గుమాస్తాల గురించి, వారి దైనందిన జీవనం గురించి, దొరల పట్ల భయంతో, ఒకరి పై మరొకరు చాడీలు చెప్పకోవడం, ద్వేషభావం, డబ్బుపై పేరాశ — వీటి గురించి ఆలోచించసాగాను. పనిచేయడం కూడా ఆడుకోవడంలా ఎందుకుండ గూడదని ఆశ్చర్యమేసింది చేతివృత్తులు హీనంగా ఎందుకు చూడాలి? అధికారుల చేతివ్రాతలు, లైపు చేయడం ఎందుకు గొప్పగా చూడబడాలి? నాన్న యిక్కడనుండి తప్పించుకొని వెళ్ళి, దేవకి వద్ద

సౌఖ్యం పొందవచ్చు. ఆ మాట ఎందుకు చెప్పదు? సుఖపడటం చెడ్డ పనికాదే! సిపాయిలు కూడా అలా అనుకోరు. రాసలీలల్లో పాల్గొనడనికి క్లెయిటను అనే వాద్యగాడిని పంపమని వారు వచ్చి అడగలేదా? వారు అతని సంగీతంలో వినోదం పొంద లేదా? నౌషిరాలో నాన్న ఒక హాస్య నాటికలో పోషించిన పాత్ర గుర్తుంది. అప్పుడే రైలు కదులుతోంది.... ఒక రైతుస్త్రీ వేషంలో క్లెయిటన్ వచ్చాడు. నాన్న టికెట్ కలెక్టరుగా ఆమె టిక్కెటు కొంటుంటే చూస్తూవున్నాడు. నాన్న ఈ విధంగా వేషాలు వేస్తే, నేను కవిని కావడానికి ఆయన అభ్యంతరం చెప్పే పిచ్చితనం ఏమిటి?

ఆ తర్వాత కొద్ది రోజులు అమ్మ, నాన్న, ముఖాముఖాలు చూసుకోలేదు. శుక్రవారం రాత్రి రైలుకు నాన్న అమృత్‌సర్ వెళ్ళి, సోమవారం ఉదయం ఆఫీసు వేళకు తిరిగి వచ్చాడు. ఆ ఉదయం అమ్మ తలకు గుడ్డ కట్టుకొని, జైన స్త్రీలాగా వచ్చి, వంట గది వూడుస్తూ తల నొప్పి విపరీతంగా ఉందని చెప్పింది.

అమ్మా, నాన్నల మౌనానికి వెనుక ఉన్న భావాన్ని, చిన్నవాడినైనా వూహించగలిగాను. ఈ విధంగా నాటకీయంగా వచ్చిన 'తల నొప్పికి, కట్టుకట్టడం వెనుక, అమ్మ అసూయ ముడిపడి వుందని గ్రహించాను. నేను ఆదర్శ యువకుడిలా ప్రవర్తించి, యింట్లో సామరస్య వాతావరణం సృష్టించాలనుకొన్నాను. త్వరత్వరగా ఆమె దగ్గరకు వెళ్ళి, ఆమె మెడ చుట్టూ చేతులు వేసి అన్నాను:

'అమ్మా! దిగులు పడకు'

'బాబూ! మీ ప్రతాప్ బాబాయికి దేవకి విషంపెట్టి చంపింది. అతని దయ్యం నాతలమీద కూచొని, ఆవిడ మీద కక్ష తీర్చుకోమని నాకు చెబుతోంది..... పరపురుషులతో అది కులుకుతుంటే అతనికి కోపంగా వుంది.'

నేను అమ్మ మెడ విడిపించుకొని వచ్చేశాను. ప్రతాప్ బాబాయి దయ్యం అమ్మ తలమీద నుండి నామీద వచ్చి కూచొంటుందేమోనని భయం. నేను వంట గదిలోంచి జారుకొని, ముంగిట్లోంచి కొత్త కొయ్య

యిళ్ళువద్దకు పరుగెత్తాను. అక్కడ గణేశ్ బాకా, రామ చరణ్‌లతో కోడుంబిళ్ల ఆడుకొంటున్నాడని నాకు తెలుసు.

నేను పరుగెడుతూ, నోరు తెరిచి వేడుకొన్నాను- 'భగవాన్! బాబాయి దయ్యం నన్ను పట్టకుండా చూడు.'

'అరే గణేశ్! వెంటనే భోజనం చేసి వెళ్లకపోతే బడికి ఆలస్య మవుతుంది.' అని అరిచాను.

అతడు ఆట వదలి నావెంబడి పిల్లిలా నడిచాడు. నేను చోరా చేతిలోంచి బిళ్లాకోడు తీసుకొని, తొందరగా బిళ్ల ఎగరగొట్టాను. అది తుర్రున విసురుకుంటూ వెళ్లి రామచరణ్‌కు తగిలింది. ఈ విధంగా నాలో అంతర్గతంగా వున్న వుద్రేకాన్ని యితరులపట్ల క్రూరంగా ప్రవర్తించి అణచుకో గలిగాను.

'ఆ కర్ర నాకివ్వు తమ్ముడూ!' బాకా అర్థించాడు.

అతడి కిచ్చే బదులు, నేను పరుగెత్తుకొంటూ, అప్పుడే కడుతున్న యిళ్లముందు పెరుగుతున్న మొక్కలను కర్రతో తాటిస్తూ వెళ్లాను

చోరా నావెంబడి పడ్డాడు. వాడు నా దగ్గరకు రాగానే, అక్కడ దగ్గరలోవున్న కొయ్యపలకలమీద కర్రతో కొట్టి రెండుగా విరగ్గొట్టాను.

'గాడిదా!' నా ప్రవర్తనపట్ల ఆశ్చర్యపడుతూ అన్నాడు చోరా. ఆట చెడిపినందుకు కోపం వేసింది. పరుగెత్తి రాలేక, నాన్న కోపం యింతకు ముందు రుచి చూసి వుండటంవల్ల కొట్టలేదు.

కోపంతో యింటికి వచ్చాను. అమ్మ ముభావంగా వడ్డించింది.

ఆ మధ్యాహ్నం మేము బడినుండి తిరిగివచ్చి యింట్లో అడుగు పెట్టడానికి ముందు, నాన్న పెద్దగా అరుస్తుండడం వినిపించింది. మేం లోపలికి రాగానే, నాన్న కోపాన్ని అణచుకొన్నాడు. వరండా నేలమీద అమ్మ తలకు ముసుగు కప్పుకొని దొర్లుతోంది వాళ్ల యిద్దరి మధ్య గొడవ జరిగి వుంటుందని తెలుస్తోంది.

మేము నిశ్శబ్దంగా ముందు గదిలోకి వెళ్లి సంచులు అక్కడ పెట్టి,

అమ్మ మాకు పాలు, టిఫిను పెడతుందేమోనని ఎదురు చూశాము.

ఆమె కదలలేదు. శివను అన్నం అడగమని వుసి గొలిపాము. ఆమె ఏడుస్తూ కదలలేదు.

'పిల్లలకు తినడానికేదో ఒకటి యివ్వు' నాన్న కసురుకొన్నాడు.

'నేను హరిద్వార్ వెళ్లి సన్యాసుల్లో కలుస్తాను. మీరు వాళ్లను చూసుకోండి. మీరు సరాసరి. ఆవిడను పెళ్లి చేసుకొని యింటికి తీసుక వచ్చెయ్యండి. అంతేగాని యిలా చాటుమాటు వ్యవహారాలు వద్దు.' అంది అమ్మ ఏడుపు గొంతుతో.

'అనవసరంగా పిల్లలముందు నోరుపారేసుకోకు.' నాన్న తన కోపాన్ని అదుపులో వుంచుకొంటూ అన్నాడు.

'నేను చెప్పేది నిజమా? కాదా?' అమ్మ నొక్కి అడిగింది.

'నిజం కాదు. ఆవిడ వద్ద నగలు, డబ్బు, ఆస్తి కొంత సంపాదిద్దామని ప్రయత్నం. ఆవిడ కనోవాలో బావి త్రవ్వడానికి డబ్బు ఖర్చు చెయ్యకముందే ఆపని చెయ్యాలి. ఆవిడ తన బంధువు అనంతతో కలిసి తిరుగుతోంది. నేను ఆవిడను యింటికి తీసుకొచ్చే ప్రశ్నరాదు.'

'శివమీద వొట్టువేసి ఆవిడతో మీకు సంబంధం లేదని చెప్పండి. ప్రతాప్ బ్రతికివుండగా కూడా, దానిమీద మీకు మనసు పడిందని నాకు తెలుసు '

'నన్ను రెచ్చ గొట్టకు. నీ జుట్టు పట్టుకొని యింటి బయటికి ఈడుస్తాను.' కోపంతో నాన్న రెచ్చిపోయాడు.

'చెయ్యండి చూద్దాము.' అమ్మ సవాలు విసిరింది.

నాన్న నిజంగా అమ్మను కొడతాడని శివ భయపడి, ఏడుస్తూ అమ్మను కరుచుకొని నిలబడ్డాడు.

నేను ఏడవలేకపోయినా, నా గుండెలో రాయిపడ్డట్టు వుంది. నాన్న ఆమె మీదికి వెళ్తున్న వాడల్లా వెనక్కి వచ్చాడు. ముఖం జేవురించి, కోపంతో వణికిపోతూ, చేతి కర్ర తీసుకొని యింట్లోంచి బయటికి

వెళ్లిపోయారు.

శివను కౌగలించుకొని అమ్మ పెద్ద పెట్టున ఏడుస్తూ, మాటిమాటికి — 'నాకు యింక ఏమీ మిగలలేదు నాన్నా! ఏదో ఒక పుణ్యస్థలానికి వెళ్లడమే తరణం.' అంటోంది.

చివరకు, నేను నా మౌనాన్ని వదలి, అప్రయత్నంగా ఆమె కాళ్ల మీదపడి, వూపిరి కూడదీసుకొని అన్నాను

'అమ్మా! అమ్మా! ఏడుపు ఆపు.'

ఆమె నా తల వొళ్లో పెట్టుకొని మరీ పెద్దగా ఏడ్చింది. ఏడుస్తూ స్థాణువులా నిలిచి, ప్రశాంతత కొనితెచ్చుకొంది. కళ్లనీళ్లు కారిపోనిస్తే దుఃఖం దానంతటు తొలగి పోయి, జీవించినందుకు ప్రతిఫలాన్ని పొందగలమని నాకు అనిపించింది. జీవన మాధుర్యాన్ని చవిచూడటానికి ముందు దుఃఖమనేది తాత్కాలిక మృత్యువుతో సమానంగా నాకు తోచింది.

మా యింటిపక్క కొత్తగా కడుతున్న యిళ్లమధ్య కొత్తగా తయారు చేసిన ఆటస్థలానికి మేము ఆలస్యంగా చేరుకొన్నాము. బాకా రామ చరణ్, చోరా, ఇస్మతుల్లా మాకోసం ఎదురుచూసి తలోదారి వెళ్లారు.

గణేశ్ వాళ్లను వెతకడానికి వెళితే, శివ, నేను యింటిముఖం పట్టాము. దారిలో ఒక కప్ప ఒంటరిగా కనిపించింది. ఇళ్లు కట్టే సామానులోంచి బయట కొచ్చింది. దాని మిలమిలలాడే కళ్లు ఆశ్చర్యంగా చూస్తున్నాను.

'దాన్ని పట్టుకొందాం' అన్నాడు శివ.

దాన్ని పట్టుకోవడానికి శివ ముందుకురికాడు. అది వాడికంటె రెండడుగులు ముందు కురుకుతోంది.

నేను చాకచక్యంగా వేళ్లతో దాన్ని పట్టుకొన్నాను. 'అరే! ఎవరినైనా కప్ప ముట్టుకుంటే, కుష్ఠ వ్యాధి వస్తుందంటారు'— అన్నాడు బాబూ ఛత్తర్ సింగు దత్తపుత్రుడు దర్శన్‌సింగ్. వాడు తలుపు కానుకొని నుంచున్నాడు. బలిష్ఠంగా వున్నవాడు జుట్టు ఆడవాళ్లలా ముడి

వేసుకొన్నాడు.

'అవునులేరా! నీలాంటి ఆడపిల్లలకు ఈ ఆట పనికిరాదులే!' అన్నాడు శివ.

'ఒరే! గాడిదా! నన్ను ఆడపిల్ల అని మళ్లీ పిలువు. నా తడాఖా చూపిస్తాను.' అన్నాడు దర్శన్.

శివ లేచి వెళ్లి దురుసుగా దర్శన్ చొక్కా పట్టుకొని, తలుపు దగ్గరనుండి లాగి — 'నన్ను మళ్లీ గాడిదా! అనుచూద్దాం!' అన్నాడు.

'తగులాడుకోవద్దు. యిద్దరూ వదిలెయ్యండి.' అంటూ వాళ్ల వైపు తిరిగేసరికి నాచేతుల్లోంచి కప్పు దూసుకెళ్లింది.

'అరే! పిల్‌పిలీ నువు జోక్యం చేసుకోరాదా!' అన్నాడు దర్శన్.

నా హోదాను తక్కువపరిచి దర్శన్ అవమానపరిచినట్లు భావించాను.

'నీకు తెలివి వుండే మాట్లాడుతున్నావా?' అంటూ యిద్దరినీ విడదీశాను గట్టిగా.

'మీరిద్దరూ నా ఒక్కడిమీద తిరగబడుతున్నారు.' అంటూ దర్శన్ అరిచాడు. వెనక్కి పడి పెద్దగా ఏడవ సాగాడు. నాకు కోపంవచ్చి కొట్టి వుండేవాణ్ణి. యింతలో పిల్లికళ్ల ప్రీతం సింగు, బాబూ చతర్‌సింగుతో కలిసి వచ్చాడు.

'వీళ్ళిద్దరూ నన్ను కొట్టారు.' దర్శన్ ఫిర్యాదు చేశాడు.

'అరే. మీరిద్దరూ చిన్నవాణ్ణిచేసి కొడతారా!' అంటూ వాకిలి ముందు నుంచి గురుదేవి జేవురించిన ముఖంతో అంది.

'వీళ్ళు మరీ పోకిరి వాళ్లు అవుతున్నారు.' అన్నాడు చతర్‌సింగు.

'సిగ్గులేని వాళ్లు.' అంది గురుదేవి. మా అమ్మానాన్నలమీద ఆవిడకోపం విషపూరితమైంది.

'శివను దర్శన్ ముందు తిట్టాడు.' నేను న్యాయంగా మాట్లాడు

దామని ప్రతిఘటించాను.

'వాళ్లు కప్పను చంపుతుంటే వాళ్లను వారించాను. అంతే' దర్శన్ గొణిగాడు.

ఆఫీసునుండి ఆదారిన వెళ్తున్న నాన్న హఠాతుగా అక్కడికి చేరి — 'యిది అంతా ఏమిటి గొడవ!' అన్నారు. ప్రీతం సింగు శివచొక్కా పట్టుకోవడం చూసి, సిక్కును పక్కకు తోసివేసి, శివను విడిపించారు. ఆఫీసులో తన గొప్పదనాన్ని వీరిద్దరు గమనించని కోపం అలానైనా తీర్చుకొన్నారు.

తీవ్రంగా వాదిస్తూ వచ్చిన నాన్న ధోరణి చూసి, బాబూ ఛత్తర్ సింగ్ కూడా తోసుకొంటూ ముందుకు వచ్చి అరిచాడు.

'పిల్లల తగాదాలో మీరెందుకు జోక్యం చేసుకొంటారు?' జేవురించిన ముఖం రంగు నిండైన గడ్డంమీద ప్రకాశిస్తుంటే అన్నాడు.

శివను వదలి నాన్న బాబూ ఛత్తర్ సింగ్‌తో తగాదా పెట్టుకొంటూ — 'నీవు, మీ తమ్ముడి కొడుకు డోగ్రా వెధవలతో కలిసి నామీద కుట్రపన్నుతున్న విషయం నాకు తెలుసు. మీరు నన్ను అంత తొందరగా ఉద్యోగంలోంచి తీసివెయ్యలేరని తెలుసుకోండి.'

వారిలో అణగారిన కోపాలు, ద్వేషాలు, అనుమానాలు తీర్చుకోవడానికి మా పిల్లల తగాదా ఒక మిష అని గ్రహించాను.

'నా తడాఖా చూపిస్తాను.' ఛత్తర్ సింగు తమ్ముడు ప్రీతం సింగు సవాలు విసిరాడు.

'మీమీద కుట్రపన్నితే, అది వాళ్ల మీద తిప్పికొడుతుందని చెప్పండి.' వాకిట్లోంచి బయటికి వస్తూ అమ్మ అంది.

తగువు మొదలెట్టిన పిల్లలమంతా, ఈ గొడవ ఎంత దూరం వెళ్లి భయోత్పాతంగా మారిందో చూస్తూ నుంచున్నాము. మానాన్న, ఛత్తర్ సింగు ఒకరిమీద ఒకరు కారాలుమిరియాలు నూరుతూ పళ్లు పటపట కొరుకుతున్నారు.

నా తల తిరుగుతున్నట్లుగా వణకసాగాను. నా కళ్లముందు ప్రపంచ మంతా తిరగ సాగింది.

అటువైపు వెళుతున్న సిపాయిలు చుట్టూచేరి—

'నిదానంగా మాట్లాడుకోండి. బాబూ! శాంతపడండి' అంటూ సర్దుబాటు చేశారు.

వాళ్లు ఎంత అసభ్యంగా వాదించుకొంటున్నారో అప్పటికిగాని యిద్దరూ గమనించలేదు. వెంటనే యిద్దరూ తిట్టుకోకుండా, కళ్లు పురుముతూ, చేతులు విసురుకొంటూ ఎవరి యిళ్లకు వాళ్లు వెళ్లారు.

'నువ్వు, నీ సహాయకులు ఎంత ప్రయత్నించినా నన్ను వదిలించు కోలేరు.' నాన్న చత్తర్ సింగ్‌ను బెదిరించాడు.

'అధికారులంతా నీపక్షంలో వున్నా, అదే దళంలో మేమూ వుంటాము.' ప్రీతం సింగు సవాలు విసిరాడు.

'అధికారుల కాళ్లుపట్టేవీళ్లు, అసూయతో దహించుకపోతున్నారు. ఒంటికంటి మేనల్లుడు వచ్చి వీళ్లను పురికొల్పుతున్నాడు. గురుదేవి.... తనకు పిల్లలు లేరని, నా నలుగురి పిల్లల వుసురు పోసుకొంటోంది.'— అమ్మ గురుదేవి మీద తనకున్న అక్కసు వెళ్లబోసుకొంది.

'నీలాగా, నీ మొగుడి లాగా యితరుల డబ్బు, నగలు రావాలని నేను కోరుకోవడం లేదు. మాకున్న దాంట్లో దర్శన్‌కు, స్వర్ణదేవాల యానికి వదలి వెళ్తాం.' అంది గురుదేవి.

'తూ. ధూ' అమ్మ ఎద్దేవాచేస్తున్నట్లు, జీవితమంటే తనకున్న కోపాన్ని ప్రకటిస్తూ అంది

అనుకోకుండా నేను, శివ ఈ తగాదా ఆరంభించినప్పటికీ, మేం జబర్దస్తీగా వ్యవహరిస్తున్నామని అనిపించింది. బాబూ ఛత్తర్‌సింగు ఎక్కువగా మట్లాడలేదు. మట్లాడినా ఆయన మాటలు నోరు పెగిలి రాలేదు.

నాన్న మమ్మల్ని అందర్నీ పోగుచేసి యింట్లోకి తీసుకొచ్చాడు.

'కొంచెం మంచి నీళ్లు యిస్తావా?' నాన్న ప్రియంగా అమ్మతో

ఈ అదను చూసుకొని అన్నాడు.

అమ్మ గ్లాసులో చల్లటినీళ్లు తెచ్చియిస్తూ శివతోను, నాతోను అంది: 'వాళ్లయింటికి యింక వెళ్లొద్దు.'

ఇంతలో గణేశ్ యింట్లోకి వస్తే, వాడి వైపు చూసి అంది — 'నువ్వుకూడా. .. గురుదేవి గడప తొక్కవద్దు.'

అమ్మ ఏమంటున్నదో గణేశ్‌కు అర్థంకాలేదు. ఏం జరిగిందో తెలి యక భయమూ, ఆశ్చర్యమూ వ్యక్తం చేశాడు.

పొరుగింటి వారిమీద తగాదాతో, మాయింట్లో 'సుఖమయ కుటుంబ' వాతావరణ నెలకొంది. ఇంట్లో కీచులాటలు తగ్గుముఖం పట్టాయి నాన్న మళ్లీ అమృతసర్ వెళ్లక పోయేసరికి, అమ్మ తలనొప్పికట్టు విప్పి, దేవాలయంలో ప్రసాదం పంచిపెట్టింది. మా యిళ్లవైపు వున్న వ్యక్తిగత రహదారి గుండా కాపలాదారుల్ని తప్పించుకొని బిచ్చానికివచ్చే బిచ్చగానికి అమ్మ దానం చేయసాగింది.

ఈ సౌహార్ద వాతావరణం పైపైకి కనిపించినా, నాన్న అమృత సర్‌లో చేసిన సాహసాల విచారం అంతర్గతంగా యింట్లో వెల్లివిరుస్తూనే వుంది. దళంలో కొండజాతివారి పక్షం వహించడం, కొని తెచ్చుకున్న కల్నల్ హోదా — యితరుల్లో అసూయను పెంచింది. అందువల్ల మరిన్ని గొడవలు మా జీవితంలో మొదలయ్యాయి.

ఈ విధమైన విషాదచ్ఛాయల మధ్య, నేను అమ్మపట్ల మమతాను రాగాలను పంచి యిచ్చాను. నేను దేవకిని అమితంగా ప్రేమించినా, అమ్మపట్ల అధికంగా ప్రేమ లేకపోయినా, ఆమె అమాయకవదనం చూసి ఆమెపట్ల నాలో అంతర్గతంగా వున్న ప్రేమను వ్యక్తం చేయసా గాను. అమ్మ కోపంగా అన్నప్పటికీ నాన్న దేవకిని పెళ్లాడి, ఆవిడపట్ల తన ప్రేమను బహిర్గతం చెయ్యాలి. నాన్న తరచు అమృతసర్ వెళ్లి వస్తుంటే ఆమె కళ్లు మూసుకొని ఎలా వుండగలదు. అమ్మ విధేయత, ధైర్యం నాకు నచ్చాయి. అమ్మపట్ల అవ్యాజానురాగం చూపసాగాను. దేవకిని సవతి తల్లిగా స్వీకరించగలను. అమ్మను అంటిపెట్టుకొని వుండసాగాను. నాతో పడుకునేందుకు అమ్మ వచ్చేంత వరకు నాకు నిద్రపట్టేది గాదు.

మెత్తటి పరుపుమీద పడుకొని అమ్మకోసం ఎదురుచూసేవాణ్ణి. నా మనసులో ఆలోచనా స్రవంతివల్ల. తల బరువెక్కి కళ్లు మంటలు పుట్టేవి. పద్యాలతో మిళితంచేసి గణితము, వాథెన్, మన్‌మోహన్ వ్రాసిన భారతదేశ చరిత్ర మననం చేసేవాణ్ణి. చరిత్ర పాఠంలో ప్రతిరోజూ ఒకపూట అనువాదం చెయ్యమని నాన్న నన్ను, గణేశ్‌ను పురమాయించారు. ప్రియాతిప్రియమైన ముంతాజ్ నన్ను అనునయిస్తు న్నట్లు, గదిలోకి వచ్చిన కందిరీగ వెంబడి పరుగెత్తుతున్నట్లు వూహిం చుకొని, నామనసులో అస్తవ్యస్తమైన ఆలోచనల దొంతరులు ముసురు కోగా, నాలో విచిత్ర సంఘటనలు చిత్రించుకొంటూ వుండేవాణ్ణి. వీధి తలుపు తీసి వుండటంవల్ల చలిగాలి వస్తుంటే, దుప్పటి కప్పుకొని పడు కొన్నాను. నా వేడినిట్టూర్పుల సెగలు పక్కమీద ప్రసరించాయి. నా ఒంటరి తనమనే కప్పుమీద చీకటి రాత్రులు తాండవం చేశాయి. నాపక్కన పడుకొనేందుకు వచ్చినప్పుడు అమ్మ నానుదుటిమీద ముద్దె ట్టుకోవడానికి వచ్చినప్పుడు ఆమె ప్రకాశమాన ముఖం తప్ప నాచుట్టూ చీకట్లు ముసురుకొన్నట్లు అనిపించేది. నాలో దుఃఖాన్ని ఓదార్చడానికి, ఆమె నాకు తోడునీడగా నిలిచింది. ఆవిడ వేదనా భరిత హృదయానికి నేను వూరట యివ్వగలను. ఆమె రైతుస్త్రీ ధైర్యాన్ని నేను పుణికి పుచ్చుకొనే వాణ్ణి.

'అమ్మా! అమ్మా!' అని పిలిచేవాణ్ణి.

ఆమెను ఎందుకు పిలిచానో, నాకేం కావాలో తెలియదు. నేను బాగా అలిసిపోయి, కళ్లు మూతలు పడి పోతున్నాయి. నేనింకా పసిపిల్ల వాణ్ణి కాదు. శివ అప్పుడే నిద్రపోతున్నాడు. అమ్మ, అందరికంటె నాకు తల్లి, నేను ఆమెలో భాగం. ఆమె వంటగదిలో అంట్లు తోమి వస్తుంది... ఆమె నా కొక్కడికే సంబంధించింది అనే విషయంలో అర్థంలేదు. ఒక్కొక్కసారి ఆమె శివను గాఢంగా ప్రేమిస్తుంది. అయినా నేను బాధపడను. శివను నేను కూడా ప్రేమిస్తాను... గణేశ్ నన్ను గమనించకుండా వెళ్లిపోతున్నట్లు అంతరాల్లో అనిపించింది. ఆ దృశ్యం నాకళ్లముందు నుండి తొలగిపోవడంతో, గణేశ్‌ను అధికంగా ప్రేమించా లనే తపనతో నా ఒంటరితనాన్ని అదిమిపట్టాను... మా తగాదాలవల్ల

కలిగిన ఆవేశం అడ్డువస్తోంది... నా కనుగొనకుల్లో మంటను తగ్గించా లంటే అమ్మవచ్చి ఓదారుస్తూ కళ్లు ముద్దెట్టుకోవాలనుకొన్నాను. నేను ఏడుగుతున్నాననే ఆలోచనలు నన్ను సతమతంచేస్తూ కళ్లు మూతలు పడనీటం లేదు. నిద్రముంచు కొస్తోంది.

నేను నిశ్శబ్దంగా పడుకొని, ఆమె ఎక్కడవుందో శబ్దాలు విన డానికి ప్రయత్నించాను. ఆమె కాలిసవ్వడి వినిపించకపోయినా, ఇత్తడి గిన్నెలు కదిలించే శబ్దం వినిపిస్తోంది. పాలు తెచ్చి యివ్వమని నాన్న మొరటు గొంతుతో అడుగుతున్నాడు. అమ్మ త్వరగా వస్తుందని నా నమ్మకం.

కొంచెం సేపట్లో అమ్మవచ్చి — 'నువ్వింకా నిద్రపోలేదా?' అంది.

'నిద్రవస్తోంది, త్వరగా పడుకొంటానని వాడే అడిగాడు.' నాన్న వ్యాఖ్యానం.

'నువు అక్కడకూచోకుండా రా అమ్మా!' అన్నాను చిలిపి గొంతుతో. నాన్న నన్ను అర్థం చేసుకోలేడని తెలుసు.

నాలో సహనం పూర్తిగా నశించింది. ఆమె వునికిపట్ల నాలో ఉత్సాహం వృద్ధి చెందింది. ఆమె నా అధీనంలో వున్నట్లుగా చేసుకోవ డానికి, పొదివి పట్టుకొన్నాను.

'నువ్వు ఎప్పుడూ నామీద ఆధారపడి వుండటం మంచిదిగాదు. అమ్మ ఎద్దేవా చేసింది.

ఆమె ఒడిలో సౌఖ్యంతో నాకు వూరట కలిగింది. నాలో చిర కాల వాంఛ నెరవేరినట్లయి, నా దిగాలుపడ్డ ముఖంలో వికాసం వచ్చింది.

'నీ బుర్ర వేడెక్కింది. ఇంక నిద్రపో.' అంది అమ్మ.

నాన్న అమ్మతో చెప్పడం నాకు వినిపించింది: 'వచ్చే వేసవి సెల వుల్లో వీళ్లని ఈ కంటోన్మెంటు ముదనష్టపు జీవితం నుండి మార్చాలి. గణేశ్ ద్రౌపది, హరీష్‌ల వద్దకు వెళతాడు. కృష్ణ తన కిష్టమైన దేవకి వద్దకు వెళ్ళి, డబ్బు ఎలా దుబారా చేస్తోందో చూస్తాడు. శివ మనతో

కూడా వచ్చి మనం తిన్నది తింటాడు.'

ఈ మాటలు నా చెవికి ఆనందాన్ని కలిగించాయి.

# 4

వేసవి సెలవుల్లో మాకు స్వేచ్ఛను ప్రసాదిస్తామని వాగ్దానం నాన్న ఇచ్చినందువల్ల మేము ముగ్గురం మంచి పిల్లల్లా ప్రవర్తించ సాగాము. గణేశ్ లెక్కలు ఎక్కువగా చేయసాగాడు. బాకా తమ్ముడు రాఖావద్ద చిన్న కుక్క పిల్లను సంపాదించి శివ ఇంట్లో ఆడుకోసాగాడు. నేను మెస్ గ్రంధాలయం నుంచి అరువు తెచ్చిన 'షెర్లాక్ హోమ్స్' ఆంగ్ల నవలల పుటలు తిప్ప సాగాను. నాన్న వస్తున్నాడనే అలికిడి విని మేము బుద్ధిమంతుల్లా, జీవితంలో కొత్త అధ్యాయం ప్రారంభమైనట్లుగా శ్రద్ధగా చదువుతున్నట్లు నటించే వాళ్ళం. వేసవి కాలపు మధ్యాహ్న సమయాల్లో నాన్న వేపచెట్టు నీడన మంచంమీద కూచుని తన దగ్గరకు వచ్చిన స్నేహితులతో మాగురించి పొగడ్తగా చెప్పేవాళ్ళు. మేము శ్రద్ధగా నేల మీద చాపపై కూర్చుని పాఠాలు చదివే వారము. ఎండ వేడికి నిక్కర్లు మంచివని నాన్న మాకు కుట్టిస్తే అవి వేసుకుని వంటిమీద ఇంకేమీ లేకుండా కూచునేవాళ్ళం. నాన్న దగ్గరకు ఎవరైనా భారతీయ అధికారులు వస్తే, బుట్టకుర్చీమీద కూర్చోబెట్టి యుద్ధాన్ని గూర్చిన వార్తలు ప్రస్తావించేవారు. గణేశ్ లెక్కలు చేయటంలో వడ్డీ వ్యాపారిని మించి పోయేవాడు నేను మా మాష్టార్లకంటె ఆంగ్లంలో ఎక్కువ పాండిత్యం సంపాదించాను. శివకు ఎక్కాలు గుర్తు పెట్టుకోవటంలో ఎక్కువ తెలివి తేటలు వుండేవి. ఒక్కొక్కసారి సిపాయిలు, అధికారులు మా చుట్టూచేరి మా గుండ్రటి వ్రాతను ప్రశంసించే వారు. తెలివిగల తండ్రి కొడుకులముగా, పట్టణంలో మిగతా పిల్లల కంటె త్వరగా గ్రహించే సామర్థ్యమున్న వాళ్లంగా మాకు పేరు వచ్చింది. మేము చిన్నవాళ్లముగా వున్నప్పుడు నౌషిరాలో చేసినట్లు నాన్న తరచూ మమ్మల్ని టాంగాలో పట్టణానికి తీసుకు వెళ్ళేవారు. అక్కడనుండి

పొలాల మధ్యలో ఒకమైలు నడిచి జీలం నదికి వెళ్ళి ఈత కొట్టేవా ళ్లము వచ్చేదారిలో మాష్టరు హరిచంద్ర యింటికి వెళ్ళేవారం. అక్కడ నాన్న వార్తలు విని, బడిలో మాప్రవర్తనను గురించి తెలుసుకునేవారు. మాష్టారు భార్య మాకు వెన్నతో కలిపిన మజ్జిగ యిచ్చేది. ఆవిడది మా అమ్మ స్వగ్రామమైన డాస్కా గ్రామము అందువల్ల ప్రతి ఆదివారం మాకాళ్ళకు అధికశక్తిని పుంజుకొని అలిసి పోకుండా మైళ్ళ కొద్దీ నడవ డానికి సిద్ధంగావుండే వాళ్ళం. రైతులు మమ్మల్ని హోదాగల బాబులుగా పొగిడేవారు. మేము వారివలె ఎద్దులతో కట్టిన నాగలితో పొలందున్ని అమట్టి సువాసనను ఆఘ్రాణించాలని ఎదురు చూసేవారం

వేసవి సెలవులు ఆరంభం కావడానికి ముందు, ఒక ఆదివారంనాడు మేము నదికి వెళ్లడానికి సూర్యోదయానికి ముందే లేచి తయారయ్యాం. గణేశ్ వరండాలో మసక చీకట్లో గుడ్డలు వేసుకోవడానికి వెళ్లాడు. మా యింటి సందులో నాతోపాటు మంచంమీద పడుకొన్న శివను నేను నిద్రలేపుతున్నాను. 'బుజ్జి' నిద్రలేచిం తర్వాత, నాన్న చెవిలో మెల్లగా వూదితే, ఆయన లేచి మమ్మల్ని నదికి తీసుకెళ్తాడని వుద్దేశం.

'అరే! బద్ధకస్తుల్లారా! రండి!' అన్నాను శివతో బిగ్గరగా.

'వాణ్ణి బాగా నిద్రపోనీ! నీపోకిరి చేష్టలతో నన్ను లేపకు.' అన్నాడు నాన్న కళ్లు ఎర్రచేసి అటుతిరిగి పడుకొని ఆయన మళ్లీ నిద్ర కుపక్రమించాడు.

ఆ సమయంలో ఎవరో సన్నగా తలుపు తట్టినట్లయింది. పొద్దునే ఎవరు వచ్చారా? అని అనుకొంటూ, నాన్న కోప్పడతాడని, త్వరత్వ రగా తలుపు దగ్గరకు వెళ్లాను.

'ఎవరూ?' అన్నాను.

'నేను హరీష్‌ని' అని మెల్లగా మా అన్న గొంతు వినిపించింది.

నేను గొళ్లెం తీసి, హరీష్ కాళ్లకు చుట్టుకొని ఆప్యాయంగా పల కరించాను. హరీష్ చిరునవ్వుతో పలకరించి, లోపలికి దారి తీశాడు.

అతడు మామూలు ధోరణిలో లేడు. ధోవతి, చొక్కా, మాసిన

గడ్డం, గుండ్రటి టోపీ, ధరించివున్నాడు. మామూలుగా లూధియానాలో వున్నప్పుడు టింగురంగడుగా సరిగంచు గుడ్డలు, సిల్కులుంగీ ధరించేవాడు.

నాన్న నిద్రపోతుండటం గమనించి అతడు శివపక్కన వెళ్లి పడుకొన్నాడు. 'అమ్మ ఏదీ?' అన్నాడు మెల్లగా.

'వంటగదిలో వుంది. ఆదివారాలు వదికెళ్లి స్నానం చేస్తాం. గణేశ్ సిద్ధమవుతున్నాడు. నువుకూడా మాతో వస్తావటరా అన్నయ్యా!' అన్నాను. లూధియానాలో నాకు ఆదర్శప్రాయంగా నిలిచిన వ్యక్తిగా నేను ఈత గొట్టడంలో సాధించిన ప్రావీణ్యం చూపడానికి మనసు ఉబలాటపడుతోంది.

'కూచో' అన్నాడు మెల్లగా.

అతను ఏమేమి కానుకలు తెచ్చాడోనని ఎదురు చూశాం. అతను సామాన్యంగా వొట్టి చేతుల్తో రాడు. అతనేమీ తీసుక రాలేదు. నేనడగకముందే కళ్లు మూసుకొన్నాడు.

'ఎవరక్కడ? పిల్లల్లారా! హరీష్ వచ్చినట్లుంది.' సందులోకి వస్తూ అంది అమ్మ. ఆమె రాగానే, అతని తలపై చేయివేసి ఆప్యాయంగా నిమిరి—

'బాబూ! నువ్వు వస్తున్నట్లు మీ నాన్నకు వ్రాయలేదేం?' అంది.

హరీష్ సమాధానం చెప్పలేదు. అతని బుగ్గలపై కన్నీళ్ళు కారాయి.

'ఎందుకు బాబూ ఏమైనా పొరపాటు జరిగిందా?' అంది గణేశ్ మంచం అంచున కూచొంటూ అమ్మ.

అన్నయ్య నోట మాట రాలేదు. కన్నీళ్ళు మరింత జలజలా రాలాయి. తల అడ్డంగా ఆడించాడు.

'ద్రౌపది కులాసానా?' అంది కోడలు ఆరోగ్యం బాగులేదని తెలుసుకొని.

హరీష్ తల అనుకూలంగా వూపి, మౌనంగా వుండిపోయాడు. వున్నట్లుండి ఏడుపు లంఘించుకొని — 'అమ్మా! అంతా అయిపోయింది.

సర్వ నాశనమైంది. నన్ను క్షమించవూ!' అన్నాడు.

'ఏం జరిగింది నాయనా?' నాన్న లేచేటట్లుగా అమ్మ పెద్దగా అరిచింది.

'నన్నేమీ అడగవద్దు. సర్వనాశనమైంది. మన వంశ ప్రతిష్ఠ మంట గలిపాను.'

'ఏం జరిగిందో నాకైనా చెప్పు' నాన్న గదమాయించాడు.

'నాన్నా! బాల నేరస్తుల ఖైదీలోంచి ఇరవై వేలరూపాయల ఖరీదు చేసే పత్తి బేళ్లు తీసుకొని డబ్బు కావలసి దళారీకి అమ్మాను. '

'పిచ్చి వెధవా!' నాన్న అరిచాడు.

'వాడి మీద కోప్పడకండి జరిగింది జరిగిపోయింది. హరీష్‌కు యింట్లో సుఖం లేదు. వాడి పెళ్లి చేసినరోజు మంచిది కాదు. ఆ శూర్పణఖతో వాడి పెళ్ళి జరిపించాం ..' అంది అమ్మ

'ఆ విషయం ఎవరికీ తెలియదు. మన శత్రువు ద్రౌపది, లూథియానా వెళ్లినప్పటి నుండీ నా మీద కత్తికట్టింది. పని కట్టుకొని నా బద్ధ శత్రువుతో ఈ విషయం నా పెళ్లాం — చెప్పి వచ్చింది. వాడికి నేను ఉద్యోగంలో పైకి రావడం యిష్టంలేదు... '

నిశ్శబ్దం రాజ్యం చేసింది మా మధ్యలో హరీష్ కాక, వాడి శవం వచ్చినట్లుగా తలపోశాము.

జీలం నదికి వెళ్లడం యింక కుదరదని నిరుత్సాహ పడ్డాను హరీష్ విషాదస్థితికి సానుభూతి చూపే స్థితిలో లేను అంత పెద్ద మొత్తం వాడు స్వాహా చేసినందుకు వాడి అక్రమ చర్యకు మనసు అంగీకరించడం లేదు. ఈదడంలో నా ప్రావీణ్యం అతనికి చూపించాలని తహతహలాడసాగాను. ఆ ఉత్సాహం నశించింది

'మూర్ఖుడా! అంత పని చేయడానికి నీకు తెలివి వుందా? 20 వేల రూపాయల పత్తి బేళ్లు? ఎలా కనుక్కొన్నారు?'

రోడు మీద పట్టుకొన్నారు. నేను వార్డరు ద్వారా వాటిని

దాటవేశాను. ఈ రహస్యం ద్రౌపదితో అన్నాను. ఆవిడ నన్ను అస హ్యించుకొంటుంది కాబట్టి, వెళ్లి రామ్ దత్తామల్ భార్యకు చెప్పింది. అతను వెళ్లి జైళ్ల సూపరింటెండెంటుతో చెప్పాడు ఇనస్పెక్టరు జనరల్ తో ఫిర్యాదు చేయకుండా రేపటి వరకు వాయిదా కోరాను '

'సూపరింటెండెంట్ నీ చేతికి సంకెళ్లువేసి, ఖైదులో వేయకపో వడం ఆశ్చర్యంగా వుంది.'

బేడీలు అనే మాట వినగానే, లూధియానా ఖైదీలో, పశువులతో సమానంగా చూడబడే ఖైదీలు గుర్తుకువచ్చి, హరీష్ పట్ల సానుభూతి కలిగింది.

'మీరు రక్షించకపోతే అదే జరుగుతుంది.' వెక్కి వెక్కి ఏడుస్తూ మధ్యలో అన్నాడు హరీష్. వాడు తల చేతుల్లో దాచుకొన్నాడు.

'భర్తను చంపుకొని తినే ఆ దయ్యాన్ని గూర్చి చెప్పకండి. అది నా కృష్ణను చంపినంత పని చేసింది ' అమ్మ ద్రౌపది మీద విరుచుక పడింది

'సరే అరవకు. ఎవరన్నా బయట వింటే, వీడి అప్రాచ్యపు పను లకు నా పరువు మంట గలుస్తుంది.' నాన్న అమ్మను మందలించాడు.

'క్షమించండి. కాని, రక్షించండి.' అంటూ నాన్న ముందు హరీష్ పడిపోయాడు.

నాన్న కరిగిపోయినట్లున్నాడు. క్షణకాలం మౌనంగా వున్నాడు.

'ఏం చేయాలో తోచడం లేదు... నువు బేళ్లు అమ్ముతున్నట్లు పోలీసుల కేదైనా సాక్ష్యం వుందా?'

'వార్డరు చెప్పిన మాటలే... . నేను తిరస్కరించాను. మామూ లుగా గుడ్డల తయారీకి బేళ్లు వెళుతున్నట్లు చెప్పాను. బయటికి బేళ్లు వెళ్తున్నట్లు నేను పుస్తకంలో వ్రాయలేదు. అంతే.. రామ్ దత్తామల్ వచ్చి చూశాడు.. తర్వాత పుస్తకంలో వ్రాశాను. నేను తప్పుడు లెక్కలు వ్రాశానని అతడు సూపరింటెండెంట్ కు చెప్పాడు.'

'అయితే, నేరం నీ మీద లేకుండా చూసే అవకాశం ఉంది.'

'ఆ పుస్తకాలు నేను నాతో తీసుకొచ్చాను. సూపరింటెండెంటు కల్నల్ అతల్ సాహెబ్ నా పక్షాన వున్నాడు. పుస్తకాలు నాతో వుండకపోతే రామ్‌దత్తామల్ మార్చి వేస్తాడని కల్నల్ అనుమానం.'

మళ్లీ నిశ్శబ్దం రాజ్యం చేసింది.

నాన్న నిట్టూర్పు వదలి, లేచి, క్షణకాలం నిర్వీణ్ణుడై నిలబడి — 'నువు ఆ బేళ్లను గుడ్డల తయారీకి పంపించావు. గుర్తుంచుకో, వార్డరు వాడికిష్టం వచ్చినట్లు చెప్పనీ! రామ్ దత్త కూడా నీ మీద నేరం మోపాలని చూస్తున్నాడు. నేను నీతో కూడా 9 గంటల రైలుకు లాహోరుకువచ్చి అజితాన్ సాహెబ్‌ను కలుస్తాను. జైళ్ల ఇనస్పెక్టర్ జనరల్‌ను దర్శిస్తాను. నిన్ను ఆ వుద్యోగంలోంచి తప్పించి సైన్యంలో చేర్చడం వుత్తమం.' అన్నాడు.

'నేనింక ఎప్పుడూ యిలా చెయ్యను.. నేను నాశనమయ్యాను.'

'నువ్వు ఏం చేసినా, ఆ దయ్యం నీ వెంబడి పడుతుంది. ఇంట్లో బద్ధశత్రువుతో సమానమది. నీ కర్మ!' అమ్మ కటువుగా అంది.

'సరే! నా కాకీ దుస్తులు సిద్ధం చెయ్యి. నేను స్నానం చేసి వస్తాను. హరీష్‌కు కూడా వేరే గుడ్డలు యివ్వు. వాడు కూడా సాహెబ్‌ను చూస్తాడు.'

హరీష్ మరీ మిక్కుటంగా ఏడ్చాడు. అమ్మానాన్న వూరుకొన్నారు. మేము నిశ్చేష్టులమై చూస్తున్నాము. దీనివల్ల పరిణామం ఏమిటో మాకు తెలియదు. లూధియానా కంటె హరీష్ బాగా లంచగొండిగా మారాడని మాత్రం గ్రహించాను. ద్రౌపది మరింత క్రూరంగా మారింది. ఈ పెళ్లి చాలా ముదనష్టపు రకం... హరీష్ ధర్మ పన్నాలు మాట్లాడటమే గాని, వాస్తవంలో వాటిని ఆచరణలో పెట్టడానికి, అతనికి పరువు అడ్డం వస్తోంది.

అమ్మ రోజంతా ప్రార్థనలు చేస్తోంది. పూజా మందిరంలోనూ, ముంగిటిలోను, ఎక్కడవున్నా ఆమె పూజలు చేస్తోంది. తన కొడుకును

ఖైదుపాలు చేయకుండా, ఈ క్లిష్ట పరిస్థితుల్లోంచి అతణ్ణి బయటపడ వేయడానికి భగవంతుడు సహాయపడతాడనీ, మా కుటుంబ గౌరవం నిల బెడతాడనీ ఆమె నమ్మకం. పాలుపోసిన చేతికి కాటు వేసే పాము వంటి ద్రౌపదిని భగవంతుడు నాశనం చేస్తాడని ఆమె విశ్వాసం.

అమ్మ అమాయకురాలు. ఆమె తన బిడ్డల్ని ప్రేమించి, యితరులు ఎవరైనా వారి దారికి అడ్డం వస్తే వారిని ద్వేషిస్తుంది. ఆమె ఈ ప్రేమపట్ల నేను మొగ్గు చూపాను. నా అభిప్రాయాలకు భిన్నమైనా, ఆమె పక్షపాత బుద్ధిని క్షమించి, దళం వీధిలో పండితునికి భిక్షగా ఆమె పెట్టియిచ్చిన భోజనాన్ని తీసుకెళ్లి యివ్వడానికి అంగీకరించాను.

మధ్యాహ్నం మమ్మల్ని యింట్లో నిద్రపుచ్చారు. బయటకు ఆడు కోవడానికి వెళ్లనిస్తే, పిల్లలం ఈ విషయం బయట పెడతామేమోనని భయపడ్డారు. మేము మా ఆలోచనల్లో నవ్వుకోసాగాము. నేను నవలలో కథానాయికను గూర్చి చదవసాగాను. గణేశ్ లెక్కలు చేస్తున్నాడు. శివ కొయ్యగుర్రం మీద వూగుతున్నాడు.

'భగవంతుడా! చేతులెత్తి నమస్కరిస్తున్నాను, నా బిడ్డను ఖైదు పాలు చేయ్యకు. మా కుటుంబ గౌరవం కాపాడు. నీవు న్యాయానికి ప్రతిరూపమైతే ఆ దయ్యం ద్రౌపదిని హతమార్చు. హరీష్ కు స్వాతంత్ర్యం ప్రసాదించు. మరో పెళ్లి వాడికి జరిపిస్తాము.' అని అమ్మ ప్రార్థనలు చేసింది.

రాత్రిపూట అమ్మ గణేశ్ ని తీసుకొని రహదారి కూడలిలో మంత్ర తంత్రాలతో పూజలు జరిపింది. పిండితో స్వస్తిక్ ముగ్గులు పెట్టి, కుంకుమతో పూజచేసి, ప్రమిద వెలిగించి దండం పెట్టింది. ఇంటికి తిరిగివస్తూ పై ప్రార్థనలు చేసింది.

హరీష్‌పట్ల నాకు కొంచెం పక్షపాత దృష్టి వుంది గాబట్టి, అమ్మ ప్రార్థనలకు నేను నవ్వలేదు. లేకపోతే, ఆమె ప్రార్థనలు నేను తిరిగి వ్యాఖ్యానం చేస్తూ — 'నా కుటుంబానికి అన్నీ ప్రసాదించు.' అని ఎగతాళిగా అనే వాణ్ణి. ఆమె చేస్తున్న మాయాజాలాన్ని గమనిస్తూ, నన్ను రహదారి కూడలికి రమ్మన లేదు గదా-అని సంబరపడ్డాను.

నా ప్రాణాలు తీసిన ద్రౌపది అంటే నాకు నచ్చకపోయినా, అమ్మ ప్రార్థనలు దేవుడు వింటే — ప్రజల ప్రార్థనలు ఆయనకు వినబడితే — మా వదినెను భగవంతుడు చంపగూడదని భగవంతుణ్ణి కోరుకొన్నాను ఆవిడను వాళ్ల పుట్టింటికి పంపించివేసే ప్రయత్నాలు చేసి, ముంతాజ్ వంటి సౌందర్యవతిని హరీష్ పెళ్లి చేసుకొనే అవకాశం కల్పిస్తే బాగుం డునను కొన్నాను.

ముంతాజ్ని గూర్చి ఆలోచింపసాగాను. ఆవిడ యిప్పుడు ఎక్కడ ఉంది? ఇప్పటికే ఎవరినైనా పెళ్లాడిందా? హరీష్ను ప్రేమించక పోయినా, యిప్పటికీ నన్ను ప్రేమిస్తోందా?

ఆవిడపై నా ప్రేమకు చిహ్నంగా ఒక పద్యం వ్రాసి ఆవిడకు పంపాలనుకొన్నాను. కాని నా ప్రేమకు స్వార్థగీత మవుతుందేమోనని భయం. అందరి ప్రేమికుల ఆరాధ్యదైవంగా ముంతాజ్ని భావించి నా మనసు మార్చుకొన్నాను. ఒక స్త్రీరూపంలో అందరు స్త్రీలను చూడగలిగే పదం గూర్చి వెతకసాగాను.

రెండురోజుల తర్వాత ఉదయం రైలుకు నాన్న తిరిగివచ్చాడు. మేము ఆయనవైపు చూసీ చూడనట్లు ముఖ కవళికలు గమనించి ఆయన సంతోషంగా వున్నారా? దుఃఖంగా వున్నారా? అని తేల్చుకోదలచు కొన్నాము. ఆయన రైలులో నిద్ర తక్కువ కావడం మూలాన రాగానే కాఖీ దుస్తులు విప్పి పడుకొన్నారు.

వెంటనే ఏదీ అడగటానికి అమ్మ జంకింది. ఆయన కోపపడతా రేమోనని ఆమె భయం. ఆయన అనుకొన్న మాయాజాలం సాధిం చారో లేదో తెలియదు. చివరకు వంటగదిలోంచి తేటమజ్జిగ గ్లాసులో తెచ్చి నాన్నకు యిస్తూ అంది — 'ఇంతకూ ఏమైంది?' అని.

'నేను సుఖంగా తిరిగి వచ్చినందుకు వెయ్యి దేవుళ్లకు ధన్యవా దాలు చెప్పుకో!' నాన్న స్తోత్రరూపంగా అన్నాడు 'అజితాన్ సాహెబ్ చాలా దయ చూపారు.... నా సేవాధర్మాన్ని వివరిస్తూ జైళ్ల యిన స్పెక్టరు జనరల్ గారికి ఒక చీటీయిచ్చారు. అజితాన్ సాహెబ్గారు నిద్రపోతుంటే లేపాను. ఆయన నామీద కోప్పడతారేమోనని కంగారు

పడ్డాను. వింటారా? లేదా! అని కూడా భయపడ్డాను. నేను ప్రభుత్వం వుప్పుతిన్నందుకు ఋణపడివుంటానని ఆయన గ్రహించారు. ఆయన యినస్పెక్టరు జనరల్ గారికి స్వయంగా వ్రాసి యిచ్చిన ఉత్తరంలో నా వాదనను సమర్థిస్తూ వ్రాశారు. జైలు తరపున హరీష్ బేళ్లను పంపాడనీ, స్వంతానికి అమ్ముకోలేదనీ, అతని కింద పనిచేసేవాళ్లు అసూయకొద్దీ, హరీష్ అమ్మినట్లు ఫిర్యాదు చేశారనీ వ్రాశారు. బాల నేరస్తుల జైలు సూపరింటెండెంటు కల్నల్ అటల్ అదృష్టవశాత్తు నాతో వచ్చి యిన స్పెక్టరు జనరల్ గారితో హరీష్ పూర్వ సత్ప్రవర్తన గూర్చి చక్కగా చెప్పారు. రామ దత్తామల్ లంచంయిచ్చి వార్డరు చేత, యితరుల చేత అబద్ధాలు చెప్పించాడని నమ్మించాము. బేళ్లను పంపిన తర్వాత, హరీష్ తన పుస్తకంలో వాటిని నమోదు చేయడం బాగా సహకరించింది...... అతని మీద అపనమ్మకం కలిగింది గాబట్టి, హరీష్‌ను ఉద్యోగం నుండి రాజీనామా చేయడానికి అనుమతించమని నేను యినస్పెక్టరు జనరల్ గారిని కోరాను. ప్రభుత్వసేవలో నా పెద్దకొడుకును యుద్ధానికి పంప డానికి నేను సిద్ధంగా వున్నానని చెప్పాను అది ఆయనకు బాగా నచ్చింది.... కుర్రవాడికి వ్యతిరేకంగా చెప్పబడే ఆరోపణలు తాను నమ్మ డంలేదని ఆయన నాకు నచ్చచెప్పారు. అలా చేస్తే హరీష్ గౌరవానికి మచ్చ కలుగుతుంది గాబట్టి రాజీనామా చేయవద్దని ఆయన సలహాయి చ్చారు. అతడికి సైన్యంలో వుద్యోగం దొరికేవరకు, షుమారు ఒకనెల రోజులు నేను వేచి చూడవలసిందిగా చెప్పారు.'

'కాబట్టి దేవుడి దయవల్ల హరీష్ బయటపడ్డాడు. ఆయన నా ప్రార్థనలువిన్నాడు. నిజానికి హరీష్ దొంగతనం చేసింది వాస్తవం.' అంది అమ్మ.

'మూర్ఖంగా అలామాట్లాడకు.' నాన్న కరుకుగా అన్నాడు. 'మనకు యింటి చుట్టూ శత్రువులు. అందరూ ఒకే కథకు కట్టుబడి వుండాలి. చూడు భామా! నీ దేవుడికి ఈ విషయంలో ప్రమేయం లేదు. రామ్‌దత్తామల్, యితర హరీష్ శత్రువులకు వ్యతిరేకంగా నేను పన్నిన పన్నాగంల్ల బయటపడ్డాం. అరే! పిల్లలూ! మీరూ వినండి. బయట ఈ విషయం ప్రస్తావనకు వస్తే, హరీష్‌కు వ్యతిరేకంగా వాళ్లు కుట్రపన్నారని

అందరూ ముక్తకంఠంతో చెప్పాలి.'

'మీరు న్యాయవాదిగా బాగా చలామణీ అవుతారు.' అమ్మ సరిగ్గా వ్యాఖ్యానం చేసింది. ఆయన లౌక్యము, అబద్ధాల కోరుతనము గమనించి అంది.

'తెలివి తేటలు లేకపోతే ఈ దళంలో పనిచేయడం కష్టం' — నాన్న గొప్పలు చెప్పుకొన్నారు. 'నా శత్రువులు నన్ను చాలా రోజులు క్రితమే అణచివేసి వుందురు. అమృత్‌సర్ నడి వీధుల్లో దయనీయ స్థితిలో నేను చనిపోతే నీవు, నీ పిల్లలు తిండిలేక అల్లాడేవారు. నీ నుండి, నీ పిల్లలు నుండి నేను కృతజ్ఞతలు పొందుతానని అనుకోను .... భారతీయుడు పొరుగు వాణ్ణి ద్వేషిస్తాడు. ..'

ఆయన ముఖం తిప్పుకొని ఒక గంటసేపు నిద్రపోయారు.

ఆ మధ్యాహ్నం, ఆఫీసునుండి రాగానే, గుడ్డలు మార్చుకొని, ధోవతి కట్టుకొంటూ ఆయన వ్యాఖ్యానంగా అన్నారు:

'ఏమోయ్! నీవు మోసకారి దేవుళ్లకు భక్తితో పూజలుచేసి, మరి కొంతమంది బ్రాహ్మణులకు అన్నదానం చెయ్యవచ్చు.'

'పిల్లలముందు నన్ను నాదేవుళ్ళనూ ఎగతాళిచేసే ముందు మీరు చెప్పదలచు కున్నది సూటిగా చెప్పండి. మనగురించి మనం గొప్పలు చెప్పుకో కూడదు. మన కుటుంబం మీద దిష్టి తగిలి మరో ప్రమాదం రావచ్చు.'

'సరే. 15వ దళంలో హరీష్‌కు ఉద్యోగం సంపాదించాను. ఆ దళానికి చెందిన అధికారి మేజర్ ఓ జీర్వీగారు కల్నల్‌కు, సిమ్లాలోని సైనిక దళాల ప్రధాన కార్యాలయానికీ హరీష్ పేరు సిఫార్సు చేస్తూ తంతి పంపారు. అంతకు మించి జీలం విభాగానికి చెందిన బ్రిగేడియర్ జనరల్ బెర్డువుడ్ గారి వద్దకు తనమోటారు సైకిల్ మీద నన్ను తీసుకు వెళ్ళాడు. ఆయన అందుకు వెంటనే అంగీకరించాడు' అన్నాడు నాన్న.

'అయితే ఈ రోజు దేవాలయానికి ప్రసాదం బుట్ట ఇచ్చివస్తాను. ద్రౌపది శని కూడా నా ప్రార్థనవల్ల హరీష్‌కు విరగడ అవుతుంది.'

'నీకు పిచ్చి! మంత్రాలకు చింతకాయలు రాలవు. ఈ తోలు బొమ్మలాటలో గెలుపు సాధించటానికి నేర్పు కావాలి' అన్నాడు నాన్న.

'పిల్లలకు మీరు ఎలాంటి దారి చూపుతున్నారు' అమ్మ తన తెలివి తేటలు మీదవున్న భరోసాతో ఆధ్యాత్మికంగా ఆలోచించి అంది.

'నీలాగా దేవుళ్ళకు దయ్యాలకూ పూజలు చేసి మంత్రతంత్రాలు చూపే దానికన్నా అదిమేలు.'

ఈ విధమైన కల్పనాజగత్తులో అమ్మ మూఢనమ్మకాలు కలిగివున్నప్పటికీ నాన్నకంటె నైతికంగా బలం కలిగినదని నాకనిపించింది. చెడుపనులను చేయడంలో బాధను ఆమె మనస్సాక్షి వ్యక్తం చేసేది. వాళ్ళ స్వప్రయోజనాల కోసం పూజారులు ఈమెచేత ఈ తంతు జరిపిస్తున్నారు. ఆరాధనా స్వభావంకల ఆమె నాకు ఆరాధ్య దేవత. భగవంతుడు సర్వాంతర్యామి. తప్పులు చేసినప్పటికీ ఆమె మానవ మాత్రురాలు......... ఈ విధమైన తర్కాన్ని నేను వెంటనే ఆపి వేశాను ఎవరికైనా తెలిస్తే నన్ను పిచ్చివాడను కుంటారని.

# 5

ఈ ప్రగల్భాల తర్వాత ప్రమాదం పొంచివుండనే వుంది. అమ్మ ముందుగానే చెప్పినట్లు, ఆమె హెచ్చరిక సరిగా జరిగినట్లైంది. కల్నల్ హోదా భావించుకునే నాన్నగారు జీవితంలో అతిపెద్ద క్లిష్ట పరిస్థితిని ఎదుర్కోవలసి వచ్చింది. ఇటీవల రెండు మూడు వారాలుగా 38వ డోగ్రా దళానికి చెందిన కొండజాతి వారికి డోగ్రాలకు మధ్య తగాదాలు పొడ చూపాయి. వాటిని గురించి నాన్న మాతో చెప్పలేదుగానీ, ఈ రెండు వర్గాలకు చెందిన పెద్దలమధ్య ఘర్షణ ప్రారంభమైంది.

ఒకరోజు వుదయం మేం బడికి వెళుతూ వుంటే మా వెనుక రోడ్డుమీద సిపాయిల అడుగుల చప్పుడు మా మాటల సవ్వడిని మించి

పోయింది. సిపాయిలు క్రమశిక్షణతో వుండటానికి దళాలు తరచూ ఏర్పాటు చేసే మామూలు కవాతు అని మొదట్లో అనుకున్నాము. మామూలు కవాతు అయితే ముందు 'బ్యాండు' వుండేది. సిపాయిలు తమతో గోతులు తవ్వటానికి గునపమూ, పార మిగతా వస్తువులూ తీసుకెళ్ళే వారు. ఇప్పుడలా లేదు. మా వెనక వైపువారు ముందు కెళటానికి మేము దారి యివ్వగా 38వ డోగ్రా దళానికి చెందిన కొండ జాతి విభాగం వారు పొడవాటి వరుసలలో యూనిఫారం ధరించి వట్టి చేతులతో వెళుతున్నారు. వారి వెంబడి ఆరుగురు డోగ్రా సిపాయిలు అనుసరించి వెళుతున్నారు సైనిక విన్యాసాల కవాతుకు అనుగుణంగా నడిచే సిపాయిలను చూసి ఇంతకుముందు రోజుల్లో మేము ఉల్లాసపడే వారం. వారి కవాతు వేగం లయబద్ధంగా నాట్యమాడించేది. చింతా క్రాంతులైన కొండజాతి వారిని చూసి, మా నాన్న వూహించినట్లుగా వారు క్లిష్టపరిస్థితులలో ఉన్నారనిపించింది.

నలుగురు డోగ్రా సైనిక పోలీసులు హవిల్దార్ మేజర్ ముకుంద లాల్ వెనుక భాగంలో నడుస్తుంటే అతనికి రక్షణగా వెళుతున్నారు. శివ అతన్ని పలకరిస్తే అతనేమీ సమాధాన మివ్వలేదు. ఆయన తరచూ నాన్న వద్ద సలహా సంప్రదింపులకు వస్తూవుండే వాడు. వచ్చినపుడల్లా మాకు లడ్డూలు తెచ్చిపెట్టి మమ్మల్ని ఆటపట్టించేవాడు. ఆ దళానికి ఏడు కొండజాతి విభాగాలు అరెస్టు అయినట్లుగా సులభంగా గ్రహించ గలిగాను.

కంటోన్మెంటు రోడ్డుమీద విపరీతమైన హడావిడి ఆరంభమైంది. ఆ దళానికి చెందిన ఇతర విభాగాల సిపాయిలు అటుకేసి వెళుతూ రాబోయే దుర్నిమిత్తాలను గురించి గుసగుసలు చెప్పుకోసాగారు.

సిపాయిలు ముందుకెళ్ళటానికి వీలుగా సైకిలుమీద వెళుతున్న యిద్దరు నౌకర్లు సైకిలు దిగి కబుర్లు చెప్పుకుంటుంటే వారికి తెలియ కుండా గణేశ్ వారి మాటలు విన్నాడు. వాడు తెచ్చిన సమాచారం ప్రకారం కొండజాతి వారిని రైల్వేస్టేషనుకు సమీపంలోనే బారకానుల్లో వారు సత్ప్రవర్తన అలవరచు కునేంతవరకూ నిర్బంధంలో వుంచుతారు.

బడిలో ఆరోజంతా అశ్రద్ధగానూ, ఆవులిస్తూనూ గడిపి తిరిగి వచ్చాము. మేము ముందుగానే భయపడ్డట్టుగా మానాన్న మధ్యాహ్న భోజనానికి యింటికి రాలేదు అమ్మ వంటగదిలో ఆయన కోసం ఎదురు చూస్తూ కూర్చొని వుంది.

మా భోజనాలు అయిన తర్వాత సాయంకాలం ఆయన వచ్చారు. ఏమీ మాట్లాడకుండా, నింపాదిగా పెరట్లో స్నానం చేస్తూ, 'హరిఓం, నారాయణా' అని శ్రద్ధగా జపం చేశారు. ఆయన ముభావంగా దిగులుగా వున్న నిశ్శబ్దంలో అవి స్పష్టంగా వినిపించాయి.

'అమ్మా! మా కొక కథ చెప్పు.' నిశ్శబ్దాన్ని భంగపర్చటానికి శివ పట్టుబట్టి అడిగాడు.

'నిద్రపోరాదటరా!' నాన్న అరిచారు వాణ్ణి.

అమ్మ వంట పూర్తి చేసి పొయిమీద చపాతీలు వేడిచేస్తోంది. వంట గదిలోకి నాన్న తొంగి చూస్తారేమోనని ఎదురుచూసింది. ఆయన పక్కమీద వెల్లికిల పడుకుని కాళ్ళు చేతులు బారజాపి ఆకాశం కేసి చూస్తూ పడుకున్నారు.

'వచ్చి భోంచేయండి!' అమ్మ మర్యాదపూర్వకంగా పిలిచింది.

'భోజనం చేయాలనిపించటంలేదు.... కొంప మునిగిపోతుంటే భోజనం చేయమని అంటోంది చదువురాని మొద్దు' నాన్న ఒక్కక్షణం నిట్టూర్పు విడిచి అన్నాడు.

'ఆఫీసులో ఏదో గొడవలున్నాయని నామీద విరుచుక పడితే ఎలా? నేనేం తప్పు చేశాను' అమ్మ ప్రతిఘటించింది.

క్షణకాలం నిశ్శబ్దం రాజ్యం చేసింది.

నాన్న మళ్లీ విరుచుక పడ్డాడు· 'ఏం జరిగిందో నీకు తెలుసా? నన్ను మిలటరీ కోర్టులో విచారిస్తారు. ఏం జరిగినా నీకు ఫర్వాలేదు.'

'రామ! రామ!' అంటూ 'ఏం జరిగిందో చెప్పకుండా నాకెలా తెలుస్తుంది? డోగ్రా, కొండజాతి సిపాయిలమధ్య ఏదో గొడవ జరిగిం

దని పాకీ మనిషి సోహిని యిప్పుడే చెప్పింది.... నీళ్ళు తెచ్చే లక్ష్మణ యింటివైపు ముఖం చూపలేదు.'

నాన్న ఆమెకు జవాబు చెప్పకుండా పడుకొన్నాడు.

'ఏం జరిగిందో చెప్పండి' అమ్మ ప్రాధేయపడింది.

సమాధానం రాలేదు. ఆయన మధన పడుతున్నారనేందుకు సూచనగా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు దీర్ఘంగా వినిపించాయి.

'అమ్మా! నిద్రపోతాను.' ఆ క్షణంలో శివ అన్నాడు.

'వెళ్లి పడుకో' కసురుకొంది.

'నేనొక్కడినే వెళ్లలేను. నాతోరా.' అని శివ అన్నాడు.

'పిరికి తండ్రికి పుట్టిన పిరికి తనయుడివి' అమ్మ కటువుగా మాట్లాడి, శివను పడుకో బెట్టటానికి తీసుకెళ్లింది.

పిరికి తనమనేమాట నాన్నకు చురుక్కుమనిపించి — 'పిల్లలముందు యిష్టం వచ్చినట్లు వాగకు.... ' అన్నాడు కఠినంగా తనబాధను వెళ్లగక్కి అమ్మతో మాట్లాడటానికి ఆదుర్దా పడుతున్నప్పటికీ, తన అధికార జీవితం గురించి ఆమె అమాయకత్వం గుర్తుకువచ్చి ఏమీ చెప్పలేదు. కటువుగా మాట్లా డటం మాని, ఆమెతో చనవుగా మాట్లాడటం మొదలెట్టి — 'జరగరానిది జరిగిపోయింది. నీ ప్రార్థనలు, మంత్ర తంత్రాలు యిప్పుడు రక్షించలేవు.' అన్నాడు.

'ఏం జరిగిందో సూటిగా చెప్పండి.' మొరటుస్త్రీ గొంతుతో అమ్మ అడిగింది. ఎక్కువ బాధలోవున్నా, నిస్సహాయస్థితిలో వున్నా ఆమె అలా అంటుంది.

'ఈ ఉదయం హవిల్దార్ ముకుందలాల్ నాయకత్వంలోని కొండ జాతివారు తమ జాతి అధికారులను తమకు నియమిస్తే తప్ప, తాము కవాతుకు వెళ్లమని భీష్మించుకొని కూచొన్నారు. నేను అలా చెయ్యవద్దని ముకుందకు ఎప్పుడూ సలహాయిచ్చేవాణ్ణే.... అయితే, సుబేదారు మేజర్ శివసింగు ఈ అవకాశాన్ని పురస్కరించుకొని మేజర్ ఓజిల్వీతో కొండ

జాతివారు తిరుగుబాటు చేస్తున్నారనీ, వాళ్లను బంధించాలనీ చెప్పాడు. ఈ తెలివితక్కువ అధికారి ముకుందలాల్‌ను తన ఎదుటికి పిలిపించి వాస్తవం తెలుసుకోకుండా, సుబేదారు శివ సింగు ఉత్తర్వులు అమలు జరపమని కొండజాతివారిని పురమాయించాడు. వాళ్లు ఉత్తర్వులు ధిక్కరించారు. కాబట్టి కొండజాతివారి విభాగాలు ఏడింటినీ డోగ్రా సుబేదారు మేజరు నిర్బంధంలో వుంచక తప్పలేదు.'

'వాళ్ళను రైల్వేస్టేషను వద్ద బారకాసులకు తీసుకెళ్తుంటే మేము చూశాము.' నేను అన్నాను.

'ఓజిల్వీసాహెబ్ కోరిన మీదట నేను ముకుందలాల్‌తో సంప్రదింపుల కెళ్లాను కాని అకుర్రవాడు అంగీకరించలేదు. కొండజాతివారిని డోగ్రావారు నిర్దాక్షిణ్యంగా చూస్తున్నారనీ అతనివాదన. ఆఫీసుకు, బారకాసులకు మధ్య రోజంతా తిరుగుతూనే వున్నాను.' ఆయన నిట్టూర్చి మళ్లీ మొదలెట్టాడు 'వాళ్ళను నిర్బంధంలోకి తీసుకోమని ఉత్తర్వులు యిచ్చినందుకు క్షమాపణ చెప్పుకొంటున్నామని ఓజిల్వీవారు ప్రాధేయపడినంతపని చేసినప్పటికీ ఈ కొండజాతివారు అంగీకరించలేదు. మన భారతీయ సంప్రదాయ ప్రకారం ముకుందలాల్‌కు, తెల్లదొరకు చేతులు కలిపించాను. ఆ తర్వాత ఏం జరిగిందో అడగకు...'

'ఏం! ఏమైంది?' మేం ఎదురుచూస్తూన్నట్లే ఆమె అడిగింది. అగ్ని పర్వతం బద్దలైనట్లుగా వాస్తవం బయట పడింది.

శివసింగు, కుష్ఠుమొహం సుబేదారు అచరు, ఓజిల్వీదొరతో కొండజాతివారు నిర్బంధంలో వున్న బారకాసుల వద్దకు వెళ్లారు. ముఖ్యమైన సంప్రదింపులకు బయటికి రావలసిందిగా వారిని కోరారు. సిపాయిలందరూ వరసల్లో నిలబడ్డ తర్వాత ఓజిల్వీ దొరగారిచేత వారికి కడపటి తీర్పు ప్రకటించేలా చేశారు 'మీరు వరసల్లోవచ్చి కవాతుకు సిద్ధంగా నిలుచోకపోతే, మిమ్మల్ని తిరుగుబాటుదారుల కింద జమకట్టి, 1857లో ప్రభుత్వాన్ని ధిక్కరించిన సిపాయిలను చంపినట్లు చంపివేస్తాము.'

కొండజాతివారి నాయకుడు ముకుందలాల్ వారిని కవాతుకు రమ్మని ఆజ్ఞలు జారీ చేయలేదు. ఆయన కొండజాతి వారిని ఉద్దేశించి —

'మనకు జరిగిన అవమానానికి సమాధానంగా మీరు కవాతు చేస్తారా? లేదా?' అన్నారు.

'వాళ్లు ముక్తకంఠంతో 'లేదు' అన్నారు.' అందుమీదట శివసింగు, అచరు మర తుపాకులు పట్టుకొని సిద్ధంగా వున్న డోగ్రా మిలటరీ పోలీసులతో ముకుందలాల్‌ను అతని విభాగానికి చెందిన సిపాయిలను కాల్చివేయమని ఆజ్ఞ చేశారు. వీళ్లు మూర్ఖంగా కాల్చసాగారు.. '

'అయ్యో! రామ!' అమ్మ ఏడవసాగింది.

'కొండజాతివారు వరసల్లోంచి చీలిపోయి శివసింగు, అచరు, మిగతా డోగ్రా అధికారులు నించున్నవైపు వచ్చారు. వాళ్లు కాల్చడం ఆప లేదు. రెండువందలమంది చనిపోయారు. మిగతా 111మంది పైగా చావు బతుకులమధ్య ఆసుపత్రిలో కొట్టుమిట్టాడుతున్నారు. ముకుంద లాల్ యిక లేడు...'

'డోగ్రాలు ఎంత క్రూరంగా ప్రవర్తించారు. రామా!'

ఇదంతా నాకు భయంకరమైన మహాభారత యుద్ధంలాగా అనిపిం చింది.

'బ్రిగేడియర్ జనరలుగారు ఓజిల్వీనీ, శివసింగు, అచరులను గృహ నిర్బంధంలో వుంచారనుకో! సిమ్లా, జీలమ్‌ల మధ్య టెలిఫోన్లు రోజంతా మోగుతూనే వున్నాయి. పరిస్థితి అదుపులో వుంచడానికి రావల్పిండి సైన్యం సగానికి సగం యిక్కడకు రాబోతోంది నా శత్రువులు ఏంచే శారో వూహించవచ్చు. నేను ఉద్యోగ విరమణ చేసి పింఛను తీసుకొంటే, నాపదవి చత్తర్‌సింగు కట్టబెట్టాలని శివసింగు, అచరు కుట్రపన్నారు. వాళ్లు బిరుదవుడ్‌గారితో అన్నారు— 'వాళ్లని అదుపులోకి తీసుకొన్నట్లే, నన్నుకూడా అదుపులో పెట్టమని. ముకుందలాల్‌తో స్నేహంచేసి కొండ జాతివారిని వుసికొలిపినందుకు నాకు తగిన శిక్షపడాలని వారి పట్టుదల.... అదృష్టవశాత్తు, ఈ పిల్లలు, నువ్వు చేసుకొన్న పూజాఫలంగా కల్నల్ సాహెబ్‌తో ఓజిల్వీగారు ముకుందలాల్ పట్టుబడితే నేను సంప్రదింపులు జరిపానని చెప్పారు. అందుమీదట ఆయన నాపై చర్య తీసుకోలేదు. కాని, వాళ్లు ఎంత కక్షసాధింపుకైనా పాలుపడతారని మరచిపోవద్దు.

మన జీవితాలు తులాభారంలోలాగా వూగులాడుతున్నాయి. నన్ను మిల టరీ న్యాయస్థానంలో విచారిస్తారు. ప్రభుత్వం యిరకాటంలో పడింది. తప్పులెరగని తెల్లదొర యిప్పుడు ఘోరాతిఘోరమైన తప్పు చేశాడు.'

అమ్మ చీరచెంగు కప్పుకొని ఏడవసాగింది

'పిచ్చిదానా! ఇప్పటికే కొంపమునిగింది. నువ్వు యింకా అన్యాయం చేస్తున్నావు. నేను యింకా చావలేదు. నువు విధవరాలవి కాలేదు.' మందలించాడు నాన్న.

'అలా అనకండి.' ఆమె ఏడుస్తూ శివ తల నిమిరింది.

'నీకు నిద్రపడితే వెళ్లి పడుకో. సిమ్లానుండి తంతి వస్తుందేమో నేను అప్రమత్తంగా వుండాలి.'

'ఒక ముద్ద ఎంగిలిపడండి ' అమ్మ ప్రార్థనాపూర్వకంగా అడిగింది.

'మూర్ఖంగా ప్రవర్తించకు. ఏం జరిగిందో తెలియడం లేదా?' విరు చుక పడ్డాడు నాన్న. ఆయన గాఢంగా నిట్టూర్చి, మౌనం వహించాడు.

నాన్న దగ్గరగా అమ్మ శివను పడుకోబెట్టుకొని ఎడంగా పడుకొంది. నాన్న అటు తిరిగి పడుకొన్నాడు.

నా అమాయకపు చెవులకు వాస్తవం కఠోరంగా వుంది. సైన్యం లోంచి బహిష్కరించబడిన వారిపట్ల నా సానుభూతి, స్నేహము అధికమై నాయి. ఈ విషాద సంఘటనవల్ల మనసు మూగపోయింది. ఆలోచన, భావము, మాటలు పెగిలిరావడంలేదు.

మరునాడు మేము బడికి వెళుతుంటే కొండ జాతివారి మరణ వార్త ధృవపరుస్తున్నట్లు బారకాసులకు ఒకమైలు దూరంలో మూడు గుట్టలలో శవాలను కాలుస్తున్న మంటలు పైకెగశాయి.

ప్రతి ఒక్కళ్లు తమ తల్లిని కోల్పోయినట్లు, కంటోన్మెంటు మొత్తం నిశ్శబ్దంలో మునిగిపోయింది. నాన్న మాతో చెప్పినదానికన్నా ఎక్కువ విషయాలు తెలుసుకోవాలన్న ఆసక్తి మా పిల్లల్లో వున్నప్పటికీ, మేము ధైర్యంచేసి నోరు మెదపలేదు.

అంతరాత్మలో భయపడిపోతూ, దీని అర్థమేమిటో బోధపడక బడికి నడిచి వెళ్లాను. నా బాల్యంలోని విశాలవిశ్వం వున్నట్లుండి కూలి పోయింది. ఎన్నో అవాంతరాలు, అవరోధాలు కలిగినప్పటికీ, అప్పుడు కాలము, వ్యవధి లేవు. నా అభూత కల్పనలకు అంతంలేదు. నేను మరణ ద్వారంలో వున్నప్పుడు అలానే జరిగింది. బాల్యమనే అనంత విశ్వంలోంచి, దళంలోని క్రూరజీవితంలోకి తొంగి చూశాను. ఇక్కడ దొరలు భారతీయ అధికారులు క్రూరంగా ప్రవర్తించి వారి అధికారానికి తలవంచని వారిని న్యాయం, ధర్మం పేరుతో కాల్చివేస్తారు. యముడు మన మధ్యలో దాహంగొన్న రాక్షసుడిలా తిరుగుతున్నాడేమో!

ఇంటినుండి గ్రామం బయటికి నడిచి వెళుతున్న హరిచంద్ర మాష్టారు మాకు దారిలో కలిసి నాలోని భావాలకు ప్రతిధ్వని కలిగించారు. 'ఏం జరిగిందో తెలుసా?' అని మమ్మల్ని అడిగి మా జవాబుకు ఎదురుచూడకుండా — 'మీరంతా ప్రపంచలోకల్లా యిక్కడ అంతా సవ్యంగా జరిగిపోతోందని అనుకుంటుంటే, ఇంతలో హఠాత్తుగా జరిగిన ఈ సిపాయిల హత్య, ప్రభుత్వంవారి నిరంకుశ చ్ఛాయలను చూపుతోందనుకుంటున్నారు కదూ!' అన్నారు

ఆయన మొదటిరోజు పాఠంలో బ్రిటీష్‌వారికి వ్యతిరేకంగా కటువుగా మాట్లాడిన వాక్యాలు గుర్తుకు వచ్చాయి. అమృతసర్‌లో దేవదత్త బాబాయి చెప్పిన మాటలు కూడా ఈ పంథాలోనే సాగాయి నావంటరి తనానికి అలవాటుపడి లోలోపల ఆలోచనలకు తలవొగ్గి అభూతకల్పనలు తప్ప మిగతా ఏమీ నమ్మశక్యం కావటంలేదు. అంతర్గతంగా అణచి వేసిన ఈ భావాలు నాటకీయంగా కన్పిస్తున్నాయి. నా చుట్టూవున్న ప్రపంచంలో జరుగుతున్న వాస్తవాలను ఏరగల్గినప్పటికీ నాన్న మాట్లాడే పెద్ద విషయాలపట్ల నేను ఆసక్తి కనపరచడం లేదు. విదేశంలో యుద్ధం, దళంలో కలహాలు, మా స్వగ్రామమైన అమృతసర్ ప్రధాన సంఘటనలు ఏమీ పట్టించుకోనట్లుగా, అర్థం కానట్లుగా మసల సాగాను. నాన్న గొప్పలు చెప్పుకోవటం వీటిని నేనిలా తిరస్కరించటానికి దోహదం చేశాయి. నాచుట్టూవున్న వెలుతురు అనే నరకంనుండి నేను బయట పడటానికి అది అవకాశం కల్పించింది.

ఇప్పుడు ఈ ఎదురు దెబ్బ హఠాత్తుగా తగిలింది. ఈ సన్నివేశాలపట్ల నేను వంటరితనాన్ని, విముఖతను వ్యక్తంచేసి వాస్తవాన్ని చూడగల్గుతున్నాను. జీవితాలు, జీతాలు భద్రంగా వుంచుకొని వున్నత పదవులూ, పింఛనులు పొందటానికి ఈ లౌక్యప్రపంచంలో ప్రజలు పరుగులు తీస్తున్నారని నా అనుమానం. ఈ వాస్తవాలు తృప్తిని కలిగించినా నేను వాటినుండి దూరం కాలేకపోతున్నాను.

కాల్చివేయబడ్డ కొండజాతి అమాయకులపై నా సానుభూతి ప్రచండ కాంతిలా ప్రసరించింది ముకుందలాల్ మాకు ఎప్పుడూ లడ్లు తెచ్చేవాడు ఇప్పుడు అతనులేడు. అతనూ అతని మనుషులూ పెరిగి పెద్దయై వ్యక్తిత్వం దాల్చి ఇళ్ళకు దూరంగా వచ్చి సిపాయిలుగా చేరారు. ఇప్పుడు తుపాకిగుండుకు బలియై ఈ మంటలలో మాడి మసియైపోయారు. అమ్మ అన్నట్లు మాయామయ జగత్తుకు దూరంగా తిరిగిరాని ప్రదేశంలోకి వారు వెళ్ళిపోయారు

నాగొంతులో స్వరపేటిక కిందినుంచి ఏడుపు మొదలైంది. కానీ శబ్దం బయటికి రాలేదు. నా కనుగొలకుల కిందినుంచి విపరీతమైన భయం చుట్టుముట్టింది. కడుపుతీపి వల్ల నాన్నపై జాలి కలిగింది. అతిశక్తిమంతుడైన భగవంతుడనే వాడు వుంటే ఈ క్లిష్ట పరిస్థితిలో నుండి మానాన్నను రక్షించమని ఆ భగవంతుణ్ణి మాటలులేని ప్రార్థన చేశాను.

ఆ మధ్యాహ్నపు మండుటెండలో మేము బడినుండి కాళ్ళీడ్చుకుంటూ తిరిగి వస్తుంటే గద్దలు చెట్లనీడలలోంచి పరుగులు తీయటం కనిపించింది. చెట్లకింద ఆవులు విశ్రాంతి తీసుకుంటున్నాయి. ఈ కంటోన్‌మెంటులో నిన్న హఠాత్తుగా యింతమంది చనిపోయారని గ్రద్దలకెలా తెలుసా? అని ఆశ్చర్యపోయాను. నామనసులో క్రమ్ముకున్న చీకటిపై గ్రద్దలు రణగొణధ్వని చేస్తున్నాయి. అవి మనుషులను పట్టించుకుంటున్నట్లే లేదు. నేను కూడా అలాంటి పక్షినైతే గాలిలో హాయిగా తేలిపోవచ్చు ననుకున్నాను. అప్పుడు యింటికి తిరిగి వచ్చి భయాన్ని, దారుణాన్ని, నిశ్శబ్దాన్ని చూడవలసిన అవసరం లేదు.

నేను యింటికి తిరిగి వస్తూ హాయిగా వుండటానికి బదులు నామ

నన్ను విదేశాల్లో జరుగుతున్న ఉధృతమైన యుద్ధం మీదికి వెళ్ళింది. ఆంగ్ల సంచికల్లో యుద్ధానికి సంబంధించిన బొమ్మలు నేను చూశాను చనిపోయిన జర్మనుల శవాల కుప్పల బొమ్మలు గుర్తుకు వచ్చాయి ఇక్కడ చనిపోయిన కొండజాతి వారి కంటె అక్కడ ఎక్కువమంది చనిపోతూ వుండి వుంటారు. యుద్ధం ఎప్పుడు అయిపోతుందో ఈ శవాల కుప్పలు పెరగటం ఎప్పుడు ఆగుతుందో తెలియదు. సైనికులం దరినీ తన కబంధ హస్తాలతో నలిపి వేస్తున్న భయంకర రాక్షసాకారాన్ని వూహించాను. (చనిపోయిన వాళ్ళని కాలుస్తారా? లేక క్రైస్తవులు మహ మ్మదీయుల్లా పూడ్చిపెడతారా?) అనే అనుమానం కలిగింది.

ఈ యుద్ధం ఒకనాటికి పూర్తి అవుతుందనుకొంటాను. అయితే ఎప్పుడు, ఎలా ఆగుతుందో చెప్పలేం! విషాదచ్ఛాయలతో పర్వతాలవలె పేరుకొన్న శవాలు నాకంటిముందు అదృశ్యంగా కనిపిస్తున్నాయి కళ్లు తెరచిచూస్తే భయంకరంగా వాటిమీద దయ్యాలు కూచొంటున్నాయి. అవి నన్ను ఆవహిస్తాయేమోనని భయం. పెరిగి పెద్ద వాళ్లయినవారు తగాదాలు పెట్టుకొని ఎందుకు చంపుకొంటారో తెలియదు. సమాధానం మరణ దండన. అది అంతిమ నిర్ణయం దాన్ని గురించి ఎవరూ ప్రశ్నించ డానికి లేదు. ఆమాట అనుకొని సమాధాన పడ్డాను. మృతుల బంధువులు విలపించడం నాకంటికి కనిపిస్తోంది. పరిస్థితి అగమ్యగోచరంగా వుంది. అదృశ్యంగా వున్న ఆత్మలపట్ల జాలి కలిగింది. బ్రతికివున్న వ్యక్తులపట్ల భయం కలిగింది. భగవంతుడికి ప్రార్థన చేయసాగాను. పరాత్పరుడు లేడు. ఉన్నా ఆయన ఎవరి ప్రార్థనలూ వినిపించుకోడు.

ఆరోజు, తర్వాత రోజుల్లో అమ్మ క్రమశిక్షణతో వుండమని మమ్మల్ని హెచ్చరించింది. అతిసార వ్యాధివల్లనో ఏమో, నాన్న అన్నం తినడం లేదో, ఒకవేళ తిన్నా కొద్దిగా తింటున్నాడనీ, చెప్పింది.

దాని అర్థం — మేము అసందర్భపు ప్రశ్నలు వేయకుండా, పెట్టింది తిని, నిద్రపోయి, లేచి మాపాఠాలు శ్రద్ధగా చదువుకోవాలి. ఆడుకొని తిరిగి బుద్ధిమంతుల్లావచ్చి, ఎక్కువసేపు బయట తిరగకుండా, సాయంకాలం పెందలాడే యింటికి వచ్చెయ్యాలి. స్నానంచేసి, అన్నం తిని నిద్ర కుపక్రమించాలి. తెల్లవారి ముందుగా లేచి బడికి వెళ్లాలి.

అంటే అమ్మ దగ్గర నాన్న దగ్గర మాకు ప్రీతికరంగా మాట్లా డడం కుదరదు. స్నేహితుల దగ్గరకు వెళ్లి, లేదా మా యిష్టం వచ్చినట్లు చేసి తృప్తిపడాలి.

ప్రపంచమంతా తమకు వ్యతిరేకంగా పనిచేస్తోందనీ, ఏమైనా జర గవచ్చుననీ అమ్మకు, నాన్నకు అనిపిస్తోంది. కాబట్టి మేము ప్రమాదం జరగకుండా నడచుకోవాలి. వారికి కూడా ప్రమాదం జరిగేలా నడవకూడదు. దళంలో జరిగిన ఈ విషాదంతో వారిద్దరూ బాగా చలించిపోయారు. మా కుటుంబం మంచితనానికి అవి అనుకూలం కానందున తెలియని స్థితిగతులను, వాతావరణాన్నీ వారు అనుమానిం చసాగారు. ప్రపంచమంటే వారికి గిట్టదు. వారంటే ప్రపంచానికి గిట్టదు. వారి లౌక్యదృష్టి, విరక్తిభావము మమ్మల్ని కూడా అలవరచు కోమనీ, వారి శత్రువులపట్ల జాగ్రత్తపడమనీ హెచ్చరించారు.

చిన్నప్పటినుండీ నాబలహీనత వల్ల, నిస్సహాయ స్థితివల్ల, ఏదో చేయాలనే ఆదుర్దావల్ల, అవ్యాజానురాగానికి ఎదురుచూడ సాగాను. నా వంటరితనంవల్ల తిరస్కార భావానికి రక్షణ కలిగింది. వంటరితన మనే అగాధంనుండి భూమివరకూ నేనిప్పుడు బుద్ధిపూర్వకంగా అంచుల్లో తిరగసాగాను.

ఈ విధమైన వైరుధ్యంలో నాన్న తరచూ యింట్లో లేకపోవటం ఆసరాగా తీసుకున్నాను. మధ్యాహ్న సమయాలలో జార్జి రీనాల్డు రచించిన 'Mysteries of the court of London'. (లండన్ దర్బారు రహస్యాలు) అనే గ్రంథం 17 సంపుటాలు మొదటి సంపుటి తీసి పుటలు త్రిప్ప సాగాను. అందులోని అద్భుత మాయాజాలంలో మునిగి పోయాను. అందులోని కథానాయికలైన ఒలీవియా, సోఫియాల ప్రేమలో పడ్డాను. వారి వర్ణనలో ఎఱ్ఱని బుగ్గలు, తీర్చదిద్దిన కనుబొమలూ, సన్నని నడుమూ, వూహించుకొని సోఫియా నడుంచుట్టూ చేతులు వేసి నడుస్తున్నట్లు భావించాను. ఆమె ఆ యిద్దరిలో చిన్నది. 'మేఫెయిర్' దేశం ప్రపంచ పటంలో ఎక్కడ వుందో తెలుసుకోలేక పోయాను. ఈ అమ్మాయి లిద్దరూ మగవారి చేతుల్లో పడి వాళ్ళు ముద్దులాడుతుంటే ఎందు కూరుకుంటారో అర్థంకాలేదు. గాఢాలింగనాలూ, చుంబనాలూ యింత

బట్టబయలుగా వర్ణించటం దిగ్భ్రాంతి కల్గించింది నేను తిరిగిన చోట ఎక్కడా ఎవరూ యిలా చేయగా చూడలేదు. వేశ్యల బజారులో యిలా జరుగుతుందనీ, దేవకి పిన్ని ఇలాంటి పనికి అలవాటు పడిందని అమ్మ ఆరోపణ. ఆ రచయిత మాటలపట్ల వ్యామోహంలో కల్గిన ఉద్రిక్తత వల్ల నాలో కోరికల పరంపరలు మత్తెక్కించాయి. సోఫియా వంటి ఒక అందమైన స్త్రీని కనీసం ముట్టుకోవాలని వుంది. కానీ నాకు అందు బాటులో ఎవరూ కనిపించటం లేదు. పుస్తకాల పురుగు తొలిగినట్లు, నా కళ్ళు అందులో పదాలను ముద్దెట్టు కుంటున్నాయి. రాత్రింబ వళ్ళు ఈ అభూత కల్పనలు కలల మధ్య, అస్తవ్యస్త స్థితిలో పడ్డాను దేవకి పిన్ని అమృతసర్ వంటగదిలో స్నానం చేస్తుంటే చూసిన నగ్న శరీరం గుర్తుకు వస్తోంది. ఆ దృశ్యం స్థానంలో సోఫియాను తర్వాత ముంతాజ్‌నూ వూహించాను. లూధియానాకు చెందిన ఆ నాట్యగత్తె వయసులో చిన్నది, నాపట్ల అభిమానం కలది.

ఈ విధమైన నా ప్రపంచంలోంచి నాన్న కోపం, అమ్మతిట్లు నన్ను భూమిమీద పడవేశాయి. నేను ఆ పుస్తకం రెండవ సంపుటం సెలవు రోజు చదువుతుంటే నాన్న చేతులో పట్టుబడ్డాను. ఆఫీసుకు వెళ్ళి వెంటనే అనుకోకుండా తిరిగి వచ్చి ఆయన అది చూశారు. చెంప అదిరి పోయేలా ఒక దెబ్బ కొట్టి,— 'పెద్దవాండ్లకు సంబంధిం చిన నవలలు చదివావంటే నీవు చెడిపోతావు. నేను చెప్పినట్లుగా నీవు లెక్కలు ఎందుకు చేయటం లేదు? గణేశ్ చూడు ఎంత బుద్ధిమం తుడిలా వేప చెట్టు క్రిందకూచుని వేసవి శలవుల కిచ్చిన లెక్కలు చేసుకుంటున్నాడు. నీవు వెధవాయివిగా అయేటట్లున్నావు. వాడేడి శివా!' అని గద్దించారు.

నాన్న కోపం చూసి భయపడి ఏడుస్తూ అమ్మ దగ్గరకు పరుగెత్తాను.

'బాబూ! మీనాన్న ఈ మధ్య యిబ్బందుల్లో వున్నారు. నీవు ఆయనను కలత పెట్టవద్దు.' అమ్మ ఓదార్చింది

'ఇబ్బందులా!' బహుశా నాపని అంతం కావచ్చు. మన భవిష్యత్తు ఈ రోజు నేను మిలిటరీ న్యాయస్థానంలో చెప్పే సాక్ష్యంపై ఆధారపడి

వుంటుంది. గుడ్డలు మార్చి యూనిఫారం ధరించే దానికి యింటికి తిరిగి వచ్చాను.'

'ప్రళయం రావటంలేదు. మీరు ధర్మానికి కట్టుబడివుంటే ఈ అగ్ని పరీక్షలోంచి సుఖంగా బయట పడతారు. మన పుణ్యమే మన లను రక్షిస్తుంది మన పురాకృతం మనల్ని అనుసరిస్తుంది అన్నారు గురునానక్' అంటూ అమ్మ ధర్మపన్నాలు పలికింది.

'సరేగానీ పవిత్రురాలవైన నీవు నాయూనిఫారం తీసుకురా! మూఢ విశ్వాసాలూ, మంత్ర తంత్రాలూ కలిగిన నీవు దేవతవు కాదు' అన్నారు నాన్న వికటంగా.

ఆయనను ఆవహించిన భయంవల్ల ఆయన కంఠం కటువుగానూ, కఠినంగానూ వినిపించింది.

అమ్మ వినయంగా యింట్లోకి వెళ్ళి పెద్ద కొయ్యపెట్టె తెరిచి నాన్న హవిల్‌దార్ యూనిఫారము తెచ్చి యిచ్చింది. అవి ఆయన ఎప్పుడో కానీ వేసుకునే వారు కాదు

న్యాయస్థానానికి వెళ్ళబోతూ ఆయన మొహం కడుక్కున్నారు. కన్నీళ్ళు తుడుచుకునేందుకు ఆయన అలా చేశారని నాకు తెలుసు. ఆయన పట్ల రహస్యప్రేమ నాలో కలిగింది

అమ్మ పూజామందిరంలో ధ్యానిస్తున్నప్పుడు, దేవునిపై అపనమ్మ కాన్ని సడలించుకొని నేనూ చేతులు జోడించి ప్రార్థించాను.

మధ్యాహ్నానికి నాన్న తిరిగి వచ్చారు. విరక్తి భావంతో కూడిన నవ్వు ఆయన ముఖంపై తాండవిస్తోంది.

'నేను బయట పడ్డాను. నా సాక్ష్యానికి వాళ్ళు పూర్తిగా అంగీక రించారు. వాస్తవానికి డోగ్రాలకు, కొండ జాతివారికి మధ్య సత్సంబంధాలు నెలకొల్పడానికి ప్రయత్నించినందుకు నన్ను అభినందించారు కూడా!' అని క్లుప్తంగా నాన్న అమ్మతో అన్నారు.

'అంతా ఆ దేవుని పుణ్యం.' అమ్మ చేతులు జోడించి వెంటనే అంది.

'నన్ను యిరికించాలని ప్రయత్నం చేసిన శివసింగ్, అచరూ, పండిత పరమానందూల ఉద్యోగానికి స్వస్తి చెప్పి ఫించను ఇస్తారు. డోగ్రాల మాటలను మూర్ఖంగా అనుసరించి నందుకు ఓజీర్వీగారిని బదిలీ చేశారు. దీనివల్ల ఛత్తర్ సింగు ఆట కట్టింపు అయింది.'

'మీ మీద తప్పపడలేదని ఇతరుల గురించి చెడుగా మాట్లాడకండి. వాళ్ళకూ కాపరాలు వున్నాయి.' అంది అమ్మ వెటకారంగా. ఆ మాటలు అంటూ ఆమె కళ్ళు తుడుచుకుంటూ యింకేమీ మాట్లాడలేక — 'చనిపోయిన వారు మాత్రం తిరిగి రారు' లంది.

ఆమె అలా అంటున్నపుడు ఆమె గొంతు బొంగురుపోయింది. ఆ మాటలు వ్యర్థమే అయినప్పటికీ జాలి అనే పర్వతం బద్దలైనట్లుగా అవి బయటికి వచ్చాయి. నేను వెళ్ళి ఆమె మెడ చుట్టూ నా చేతులు వేశాను.

# 6

మా చెడుకర్మల వల్ల, మా నాన్న చెడ్డపనుల ప్రభావం వల్ల, గత కొద్దినెలలుగా మాయింటిని పట్టి పీడించిన క్లిష్ట పరిస్థితి వచ్చిందని అమ్మ చెప్పింది. ఇంక తనకుగాని, నాన్నకుగాని, మాకుటుంబానికి గాని ఎలాంటి పీడ పట్టకుండా పుణ్యక్షేత్ర సందర్శనానికి వెళదామని చెప్పింది — శివుని జటాజూటంనుండి ప్రవహించి, గంగామాత భూమికి అవతరించిన హరిద్వార్, బుద్ధుడు మోక్షమార్గం కనుగొన్న బుద్ధగయ, జగన్నాథుని దేవాలయమున్న పూరీ, కన్యాకుమారి అంచున్న వున్న రామేశ్వరము, లంకేశ్వరుడైన రావణునితో అవతారపురుషుడైన రాముడు యుద్ధం ఆరంభించిన ప్రదేశము, అగాఖాన్ పుణ్యక్షేత్రమైన బొంబాయి, గీతా చార్యుడైన కృష్ణుని పవిత్రస్థానమైన ద్వారక, వెళ్లివద్దామని ప్రతి పాదించింది.

ఈ వాదనను కుటుంబంలో ప్రస్తావించినపుడు, నాన్ననవ్వి నరి

పెట్టాడు. అమ్మ మత విషయాలను నాన్న అదే పద్ధతిలో ఎద్దేవా చేస్తుంటాడు. మా అందరికీ ఆయన వాతావరణంలో మార్పు ముందుగానే సూచించారు.

తన శత్రువులు నాశనమై, సైనిక ప్రధాన కార్యాలయంలో తాను స్థిరపడ్డాడు గాబట్టి, నాన్న తన సంవత్సరాంతం ప్రయాణాన్ని చేద్దామనీ, తాను పోయిన సంవత్సరం సెలవు కూడా కలుపుతాననీ అన్నారు. హిందూ మతవిశ్వాసాల కనుగుణంగా అమ్మ పుణ్యతీర్థ సందర్శనం చేద్దామనుకొంటే, ఆమెతో అనుసరించి వస్తానని నాన్న చెప్పారు. అయితే పిల్లల సంగతి ఏమిటి? ఈ ప్రయాణానికయ్యే ఖర్చు విపరీతంగా వుంటుంది.

'మనం కూడబెట్టింది మూటగట్టుకొని చనిపోతే రేపు తీసుకెళ్లం. మనతో కూడా వస్తే పిల్లలకూ పుణ్యం వస్తుంది.' అమ్మ దీర్ఘాలు తీస్తూఅంది.

ఆ అసందర్భపు ప్రసంగం, పిసినారి నాన్న వెంటనే కాదని తిరస్కరించాడు. ఆయన జీతం కూడబెట్టి, కుటుంబానికి తీసుకొచ్చే సామాన్లు తగ్గించి, పాకీవారికి, చాకలివారికి, అస్పృశ్యులకు డబ్బు అప్పు లిచ్చి, నగలు కుదువ బెట్టుకొని సంపాయించాడు. అందరూ చెప్పే కథ నిజమైతే కంట్రాక్టర్ల వద్ద నాన్న లంచాలు కూడా తీసుకుంటాడు.

ఆయన కొంతకాలం క్రిందట చెప్పిన విధంగా శివా చిన్నవాడు కాబట్టి టిక్కెట్టు లేకుండా ప్రయాణంచేసి తీర్థయాత్రలకు తమతోరావచ్చు. గణేశ్ ఫిరోజ్‌పూర్ కంటోన్ మెంటులో ద్రౌపది హరీష్‌లతో శెలవులు గడపవచ్చు. హరీష్‌ను సిక్కు విభాగంలోకి అప్పుడే బదిలీ చేశారు. కృష్ణ దేవకి బావి త్రవ్విస్తున్న కనోవామందిరం వద్దకు వెళ్ళవచ్చు.

'అమ్మా! బావి త్రవ్వేది నేనువెళ్ళి చూస్తాను' అన్నాను గ్రామంలో హాయిగా గాలి పీల్చుకుంటూ తిరగవచ్చుననే సరదాకొద్దీ.

'దేవకి నీకు పాడు అలవాట్లన్నీ నేర్పుతుంది' అంది అమ్మ మంద్ర స్వరంతో.

'మరీ మూర్ఖంగా మాట్లాడకు.' నాన్న గదమాయించారు.

'అక్కడ ఆవిడ వాళ్ళ అనంతతో కులుకుతోంది. నీకు తెలుసుగా' అమ్మ ప్రతిఘటించింది.

'పిచ్చిదానా వాడు ఈ పిల్లవాణ్ణి తినడు. నీకన్నీ అనుమానాలే మన దగ్గర పనిచేస్తున్న నౌకర్లలో బీర్ సింగ్ అనే సిపాయి కనోవా గ్రామానికి చెందిన వాడు. అతను ఒక నెలరోజులు సెలవు మీద వెళతానని చాల రోజులుగా అడుగుతున్నాడు. అతనితో కూడా కృష్ణ వెళ్ళవచ్చు. ఆ పని చేస్తాను' అన్నాడు నాన్న.

ఈ అద్భుతమైన ఆలోచనవల్ల ఆయన ముఖం వికసించి ఈ ప్రణాళిక అమలు చేద్దామని ఆయన నిర్ణయించు కున్నారు.

'సరే! నేను మాత్రం మీతో కూడా రైల్లో ప్రయాణం చేయను. మామూలుగా మీరు టిక్కెట్టు లేకుండా ప్రయాణం చేయిస్తారు. ప్రతి స్టేషనులోనూ టిక్కెట్టు కలెక్టర్లుగా వచ్చిన ఆడవాళ్ళకు — 'నాభర్త పక్కపెట్టెలో వున్నాడు టిక్కెట్టు ఆయన దగ్గర వుంది' అని అబద్దాలు చెప్పలేను. మనం చేసే ప్రతి చెడ్డపనికీ మోసానికీ ప్రతిఫలం అనుభవించక తప్పదు.'

'సరే! సరే!' అని నాన్న అమ్మనోరు మూయించాడు.

ఆ మరునాటి సాయంకాలం జీలం రైల్వేస్టేషనకు ఒంటిగంట న్నర రైలు అందుకోవటానికి బీర్‌సింగు కంటె నాలుగడుగులు ముందు నడిచాను.

నాకిష్టమైన దేవకిపిన్ని మెడచుట్టూ చేతులు వేయవచ్చుననే ఆనందమూ, సాహస కృత్యాలు చేద్దామనే వుత్సాహమూ, కనోవా గ్రామంలో పచ్చిక బయళ్ళలో తిరుగుదామనే సంబరమూ నన్ను ముప్పిరిగొన్నాయి. గ్రామంలోకి వెళ్ళగానే తినే మామిడిపండ్లు అనుకుంటేనే నోరూరింది.

మొట్టమొదటి సారిగా చూస్తున్నట్లుగా ప్రతివిషయాన్నీ విశాల దృష్టితో విప్పారిన కనులతో చూడటం సాహసమే. దీపాల వెలుతురు నా కళ్ళముందు నీడల మధ్య తిరిగే పక్షుల్లా నృత్యం చేశాయి.

ఊలలు వేసుకుంటూ గంతులు వేస్తూ, ముందుచూపుతో యవ్వనం ముంగిట్లో అడుగు పెట్టినట్లు భావించాను, మరునాడు నేను లేచి చూసే సరికి రైలు పచ్చిక బయళ్ళ మధ్యలో శివాలికా పర్వతాలను వెనక్కు నెట్టివేస్తూ పరుగులు తీస్తోంది ప్రతిచిన్న స్టేషనులోనూ అగుతూ వుండటంతో కునికిపాట్లు తీశాను బీర్‌సింగు నాకందించిన తీపి పదార్థాలను తింటూ కాలం గడిపాను. గురుదాస్ పూర్ జిల్లా లోని దరియావాల్ రాగానే జలపాతంలా పడుతున్న నీళ్ళతో పనిచేసే విద్యుత్ కేంద్రాన్ని చూశాను. నా జీవితంలో మొట్టమొదటి సారిగా చూసిన కర్మాగారం అదే. ఆ విద్యుత్ కేంద్రం వెనుక ఉన్నివస్త్రాల మిల్లు కన్పిస్తోంది.

అది చిన్న రైలుస్టేషను.

అక్కడ మహంత నందగిరి గుర్రం నాకోసం బీర్‌సింగు మాట్లాడాడు మఠానికి చెందిన సేవకుడు శీతలగర్ నాకోసం ఎదురు చూస్తున్నాడు. అతడు నల్లగా పొట్టిగావున్నాడు

గుర్రం మీది కెక్కాలనే ఆదుర్దాలో నేను నౌకరుచేతిలో టిక్కెట్టు యిచ్చేంత వరకు కూడా ఆగలేదు. రైలు మరోపక్కనుండి త్వరగా దిగి, గుర్రాన్ని వీపు చరిచాను. శీతలగర్ నన్ను ఎత్తి గుర్రం వెనక కూచోబెట్టాడు.

దురదృష్టవశాత్తు, కూచోడానికి సరియైన వసతి, కాళ్లు పెట్టుకోడానికి తగిన ఏర్పాటు లేదు. మందంగా గుడ్డ పరిచివుంది. గుర్రంపై వేగంగా స్వారీ చేద్దామనే నాకలలు మాయమైనాయి. సరిగ్గా బుద్ధిమంతుడిలా కూచోకపోతే పడిపోతానని నా సహచరులు చెప్పడంతో కదలకుండా కూచొన్నాను. నేను అరిచిన అరుపులకు గుర్రం పొలాల మధ్యలో పరుగు లంఘించుకొంది.

మధ్యాహ్నవేళకు మేము రహదారి మార్గం సరిగాలేని పల్లెప్రాంతంలో వున్నాము. ఆంగ్ల ప్రభుత్వం వారు రావీనది నుండి మాధోపూర్ వద్ద కొత్తగా తవ్విన కాలవగట్ల అంచున వెళ్లడానికి దారివుంది. ఆకాలవనీళ్లు గోధుమ పొలాలకు వెళుతున్నాయి.

కాళ్లు పెట్టుకొన్న గొలుసులు సరిలేనప్పటికీ నేను గుర్రాన్ని పరుగు లెత్తించి, బీర్‌సింగును, శీతలగర్‌ను నా వెంబడి పరుగుతీయించాను. కనోవా గ్రామానికి ఒకమైలు దూరంలో పెద్దకాలువ దగ్గరకుచేరాము. శీతలగర్ గుర్రం కళ్లాలు బిగించి పట్టుకొన్నాడు. వూరుదగ్గర కనిపించే సరికి గుర్రం దౌడుతీసి నన్ను పడతోస్తుందని వారి భయం.

మాపై ఎండవేడి పడుతోంది. చెట్ల నీడల్లోను, ముళ్లపొదల మధ్యలోను ప్రయాణం కొనసాగించాము. చెమటలు పట్టాయి. చుట్టూ గోధుమ పొలాలు బంగారు వర్ణంలో కనిపిస్తున్నాయి. అక్కడ కూడా మామిడితోటలు యింకా పక్వానికి రాని పళ్లతో వంగివున్నాయి. పెళ్లి కూతురు మెడలో నిండానగలతో తలవంచుకొని వున్నట్లున్నాయి చెట్లు.

తన చేతిగుడ్డ తీసి బీర్‌సింగ్ నా తలకు చుట్టాడు. జీలంలో మొదటిరోజు నాగర్వం తొంగిచూసిన దానికంటె రాజాఫజల్ మహమ్మద్ ఖాన్ తన ప్రసంగంలో కుచ్చులటోపీ ప్రయోజనం గూర్చి చెప్పిన వాక్యాలు గుర్తుకొచ్చాయి. అర్ధనగ్నంగా వున్న ఈ శీతలగర్ బట్టతల వాడు. ఇతడు వడదెబ్బకొట్టకుండా ఎలా తట్టుకొంటున్నాడా? అని ఆశ్చర్యం వేసింది.

మట్టి గుడిసెలు, ఇటుకల యిళ్లు వరసగా కనిపించాయి. ఇదే కనోవా గ్రామమని బీర్‌సింగు ఆసక్తిగా చెప్పాడు. శీతలగర్ ఎడమచేయి ఎత్తి దూరంగా చూపించాడు. ఫర్లాంగు దూరంలో మహంత్ నంద గిరి మఠం చిన్నకొండపై కనిపిస్తోంది. చుట్టూ కోటలావున్న గోడలతో మందిరం ప్రకాశిస్తోంది.

చాలాకాలంగా ఎదురుచూసినట్లు దేవకిని కలుసుకోవడం ఎప్పుడా? అని గుండె కొట్టుకొంటుంది గుడిసెలు, గోధుమపొలాలు, పచ్చని మామిడి తోటలతో నిండి వున్న ఈ చిన్న ప్రపంచంలో ఆమె వుండటానికి వచ్చింది. ఇక్కడ బావి తవ్వించడానికి ఆమెరావడం, నగర వాతావరణానికి అలవాటుపడ్డ నాకు పరాయిగా కనిపించింది. మా అమ్మమ్మగారి డాస్కా గ్రామంలో కొద్ది నెలలు గడిపింది తప్ప గ్రామ వాతారణం అలవాటులేదు. అనంత, మహంత నందగిరిలతో నాకోసం ఎదురుచూస్తున్న పిన్నిని కలుసుకోవాలనే ఆదుర్దాతో ముందుకు సాగాను.

అదృష్టవశాత్తు దేవకి మఠం వెలుపలికివచ్చి నాకోసం ఎదురు చూస్తోంది. పెద్ద చెట్టునీడలో ఒక సేవకుడు పక్కనే మజ్జిగనీరు నాకోసం ఒక గ్లాసులో పట్టుకొని నించున్నాడు తెల్లని నేతచీర ముసుగు వేసుకొని, కొద్దిగా తలవంచుకొని నిలుచునివుంటే, ఆమె దంతపు ముఖంలో ఆంగ్లేయ యువ సన్యాసిని లక్షణాలు కనిపించాయి. నేను భయంకరమైన వేగంతో గుర్రం వెనకనుండి దూకి ఆమె చుట్టూ చేతులు పెనవేశాను. ఆమె చీరకుచ్చెళ్లలో నాతల దాచుకొని, అప్రయత్నంగా ఏడవసాగాను. ఆమె లాంఛనంగా కన్నీటిబొట్లు రాలుస్తోంది. నేను నిజం కన్నీటి బొట్లకోసం సరదాపడ్డాను వ్యక్తులవద్ద సువాసనల మేళవింపు నాకు తెలిసి నప్పటినుండీ ఎలా ఉందో అదేవాసన ఆమె వద్ద వస్తోంది.

'నువు పెద్ద వాడివయ్యావు' అంది ఆవిడ తన చీర అంచు కళ్లమీదికి లాగుకొంది బీర్‌సింగ్‌ను చూసి.

'అక్కయ్యగారూ! మిమ్మల్ని చూడాలని ఒకటే గొడవపెట్టాడు.'

'మీరు యిక్కడకు తీసుకొచ్చి మంచి పనిచేశారు ఇతని హడావిడిలో నేను వొంటరితనం మరచిపోతాను. . బాబూ! వచ్చి తేటమజ్జిగ తాగు.' — అని బీర్‌సింగు వైపు తిరిగి— 'అన్నయ్యా! మీరు కూడా కొంచెం తాగండి...... బాబా శీతలగర్ కూడా తీసుకొంటారు — ' అంది.

దేవకికి చేతులు జోడించి, బీర్‌సింగు నా గుడ్డలసంచి శీతలగర్‌కు యిచ్చి, బీర్‌సింగు పరుగులు తీశాడు గ్రామంవైపు.

'నేను గట్టిగా కళ్లెములు పట్టుకొన్నాను. కాలువ దాటి నది మొదలు యిల్లు చేరేంతవరకు భద్రంగా తీసుకొచ్చాను. లేకపోతే ఆడగుర్రం కుర్రవాణ్ణి కింద పడదోసి వుండేది.' అన్నాడు శీతలగర్.

'మీరు లౌక్యమెరిగిన యోగులు.' అని దేవకి ఆయనతో అని నావైపుచూసి — 'బాబూ! ఈ సాధువు కోసం నేను బావి తవ్విస్తున్నాను. అరమైలు దూరం నుంచి ఈయన ప్రతిరోజూ మఠానికి నీళ్లు తెచ్చిపోస్తున్నారు. కుండలు మోసిమోసి ఆయనకు బట్టతల వచ్చింది.

వయసు పైన బడింది..... ఆయన నిజమైన సాధువు.'

ధారివాలా స్టేషనులో మొట్టమొదటి సారి చూడగానే పనివాడులా నా కంటికి కనిపించిన వ్యక్తిని గూర్చి హఠాత్తుగా దివ్యత్వం ద్యోతకమైంది. నా అహంకారానికి నన్ను నేనే నిందిచుకొన్నాను. శీతల గర్ పట్ల సానుభూతితో నిజంగా దేవకి బావి తవ్విస్తూ వుంటే, అమ్మ చెప్పిన మాటలకు వ్యతిరేకంగా దేవకిలో మంచితనం వుండి వుండాలి.

మరం బయటి గోడ మధ్య లోతుగా తవ్విన గోతిని చూసి — 'ఇదేనా బావి?' అన్నాను.

'బావి గోడకు రెండు పక్కలా సగం, సగం వస్తుంది ఇటువైపు మరంలో నివసిస్తున్న వారు గట్టు మీద నిలబడి నీళ్ల తోడుకోవడానికి వీలుగా గట్టు వుంటుంది. గోడ కవతల గట్టు మీద నుంచి వూళ్లో ప్రజలు నీళ్లు తోడుకోవచ్చు. కానీ, బాబూ! రోజుల తరబడి మేము తవ్వుతూ ఉన్నాము గాని, నీళ్లు కంటికి కనబడటం లేదు.'

ఆవిడ ఆసరాకోసం ఎదురు చూస్తోందని గ్రహించి, కౌగలించుకొన్నాను.

ఆ మందిరంలో విశాలమైన గదిలోకి ప్రవేశించాము.

'మహంత నందగిరి ముందుగానే భోంచేశారు. ఇప్పుడు ఫలహారం చేస్తున్నారు. గురుదాసపూర్‌లో యిటుకలు కొనుక్కొని రావడానికి అనంత వెళ్లాడు. మనం భోంచేసి నిద్రపోదాము. నీవు బాగా అలసిపోయి ఆకలిగొని వుంటావు.' అంది దేవకి.

ఎత్తైనగోడలు, ఎడమచేతివైపు విశాలమైన ఖాళీ ప్రదేశము కనిపించాయి. అక్కడ గుడులు, పుణ్యపురుషుల సమాధులు వున్నాయి. మా కెదురుగా భారతీయ సంప్రదాయంలో విశాలమైన గది వుంది. తెల్లని నాపరాళ్లు పరిచి, వితర్దికలు కనిపిస్తున్నాయి. బహుశా అక్కడ మహంత ప్రార్థనా సమావేశాలు ఏర్పాటుచేస్తుండవచ్చు. బావికి మరొక మూలన ఆయావ్యక్తులు నివసించేందుకు ఇళ్లు కట్టారు.

దేవకిపిన్ని నన్ను చల్లగావుండే ఒక గదిలోకి తీసుకెళ్లింది. ఆ

గది బావికి దగ్గరగా వుంది. భోజనానికి పళ్లెములు పెట్టడానికి సిద్ధంగా రెండు పీటలు అక్కడ వేసి వున్నాయి.

కొంచెం సేపటికి శీతలగర్ కుండతో నీళ్లు తెచ్చాడు. దేవకి నా గుడ్డలు విప్పి, వాసన సబ్బుతో స్నానం చేయించింది. మొట్టమొదటి సారిగా ఆమె ముఖంలో నవ్వు చూశాను. నా కొంటెపేరుతో కలిపి ఆమె మృదుమధురంగా ఏదో ఆలపిస్తోంది.

— బుల్లీ! బుల్లీ!
నా చిట్టిబుజ్జీ, నా బంగారు తండ్రి
నా చిన్న కుక్క.......' ఇలా పాడింది.

'నేనిప్పుడు పెద్ద వాడినయ్యాను. ఇంకా బుల్లి వాణ్ణి ఎంత మాత్రం కాదు.' అన్నాను నా వ్యక్తిత్వం పైకి కొట్టవచ్చినట్లు కనిపించేలా.

నాకోపం తగ్గినతర్వాత, ముసలి శీతలగర్ భోజనం తెచ్చిపెట్టారు. దేవకి అందులోంచి రెండు, మూడు ముద్దలు స్వయంగా కలిపి నోట్లో పెట్టింది. నాకీ వాతావరణం బాగా నచ్చింది నోట్లో ముద్దలు కలిపి పెట్టడం నాకెంతో ఆప్యాయంగానూ, ఆత్మీయంగాను కనిపించింది. తల్లి ముక్కులోంచి పిల్లలకు ఆహారం అందించేటప్పుడు పక్షిపిల్లలు పొందిన ఆనందాన్ని బహుశా నేను పొంది వుండవచ్చు. లేదా నేను చిన్న తనంలో కధలు, గాధల్లో విన్న రెనాల్డ్ కధా నాయిక సోఫియా గుర్తుకు వచ్చి, ఈమె ప్రతికదలికను నేను ఆమెలో జోడించి చూడటంవల్ల అలా అనిపించి వుండవచ్చు.

చల్లటి నేలమీద ఆమె పక్కన పడుకొన్నప్పుడు ఆ అనురాగం మా యిద్దరి మధ్యా పెరుగుతోం దనిపించింది. ఆవిడ ఆలింగనంలో సౌఖ్యానికితోడు నిద్రముంచుకొచ్చింది. నాలో పశుత్వం ఆపుకోలేనంతగా ఆవహించింది. నాలో భావాలు యౌవన ప్రాదుర్భావం వల్ల కల్మషంగాను, నిష్కల్మషంగాను మెదలసాగాయి.

మధ్యాహ్నం ధరించిన తెల్లచీర మార్చి, దేవకి బూడిద రంగు చీర సాయంకాలం కట్టుకొంది. సంధ్యాసమయాన్ని సూచిస్తూ పగటి వెలుతురు మాయం కాసాగింది. పిన్ని నావైపు చూసి సుతారంగా నిట్టూర్పు

వదలినప్పుడు ఎండవేడిమి మటుమాయమై శీతలవాయువులు మాయగా ప్రసరించాయి. మరం చుట్టూవున్న పొడుగాటిచెట్లు సందులో చల్లటి నీడను ప్రసాదించాయి. మహంత నందగిరి ప్రార్థనా మందిరంలోంచి భక్తుల గీతాల హోరు బయటికి బాగా వినిపిస్తోంది.

శీతలగర్ తెచ్చిన నీళ్లతో పిన్ని నాకు స్నానం చేయించింది. జీలం నుంచి నేను తెచ్చిన గుడ్డల్లోంచి చొక్కా, పైజామా తీసి అమ్మ నా చిన్నప్పుడు తొడిగినట్లుగా పిన్ని తొడిగించింది.

'నాతోకూడా వచ్చి మహంత నందగిరి దర్శనం చేసుకోవాలి నీవు' అంది.

నాకు స్నానం చేయించి, గుడ్డలు తొడిగించడంలో ఆవిడ చేసిన హడావిడికి నాకు సంతోషంగా వున్నా, ఈ సలహా నాకు నచ్చ లేదు. స్వతంత్రభావాలకు నా ఆత్మలో స్థానంవుంది. అమ్మ చేసే తంతువ్యర్థమైనదనే అభిప్రాయం నాలో దృఢంగా పెరగడం వల్ల నాకలా అనిపించింది. అయినా దేవకి చేయిపట్టుకొని ఆవిడతో నడిచాను.

'రా! రా!' అని ఆ మహనీయుడు బొంగురుబోయిన గొంతుతో పిలిచాడు. పీలుస్తున్న హుక్కా గొట్టంలోంచి పక్కకు నెట్టాడు. దగ్గపొరలు ఆవరించి కాషాయవస్త్రాలు కదిలాయి.

ఈయన మతం ఎంత పవిత్రమైనదోనని ఆశ్చర్యం వేసింది.

'పానీయం తయారుచేశారా?' అని దగ్గుపొరల మధ్య అడిగాడాయన.

'కొంచెంసేపట్లో' అన్నాడొక సిక్కు యువకుడు, కల్వంలో పళ్లు, యితర పదార్థాలు వేసి నూరుతూ వున్నాడతను.

'బాబూ! సాష్టాంగ నమస్కారం చెయ్యి' దేవకి నన్ను పురి కొల్పింది.

'కుర్రవాడు సిగ్గు పడుతున్నాడు.' నన్ను చూసి మహంత అన్నాడు: 'కూచోబాబూ! అమ్మా, నాన్నా కులాసానా?' అని కుశలప్రశ్నలు వేశాడు.

నేను చేతులు జోడించాను. దేవకి నన్ను దగ్గరగా లాగి నందగిరి పక్కన ఎత్తయిన ప్రదేశంలో పరుపులమీద కూచొనేలా చేసింది.

'ఈ కుర్రవాడికి మన అమృతపానీయం యిచ్చి భక్తిప్రపూరితుణ్ణి చేయండి.' మహంత ఆజ్ఞ జారీచేశాడు 'మా అబ్బాయి అమర్ ఏడీ! ఇద్దరూ కలిసి ఆడుకొంటారు... మనతోటలోంచి రేపు కొన్ని మామిడి పళ్లు తెచ్చి అతని కివ్వండి.' అని, దేవకివైపు చూసి—

'చెల్లెమ్మా! మనది పల్లెటూరు, పట్టణం కాదుగదా! మనకీ మందిరం ఆశీస్సులే దిక్కు. నువ్వు బావి తవ్వించి యిక్కడి వారికి అమృతం ప్రసాదించబోతున్నావు.' —అంటూ నాతల నిమిరి —

'ఈ కుర్రవాడు ముద్దుగా వున్నాడు. నీ సొంత కొడుకు పోలికలు కనిపిస్తున్నాయి ' అన్నాడు దేవకితో.

'నిజంగా. వీడు నావాడు. నా స్వంతం ' అంటూ వత్తిపలుకుతూ దేవకి తన వొడిలోకి లాగుకొని ఆలింగనం చేసింది.

ఈ సమయంలో శీతల పానీయాలు వచ్చాయి. మొదటి గ్లాసు మహంత నందగిరికి అందించారు.

'అరే! వెధవల్లారా! ముందు కొత్తగా వచ్చినవాళ్ల కివ్వాలి!' అన్నాడు మహంత. సిక్కు యువకుడు ఓరచూపు చూస్తూ, యిది మీకు ప్రత్యేకమని సైగ చేశాడు.

'సరే! ఇది పెద్దగ్లాసు. చిక్కగా ఉంది. ఈ బాబుకు చక్కని పళ్లరసం తయారుచేసి యివ్వండి.... నీ పేరేమిటి బాబూ!' అన్నారు నందగిరి.

'కృష్ణ' అని ఆమె సమాధానం. నేను జవాబు ఇవ్వలేదు.

'సిగ్గుపడ నవసరంలేదు. మహంత గారితో మాట్లాడు' అంది.

'మీ గుర్రపు పిల్లమీద రోజూ స్వారీ చెయ్యాలని వుంది. కంటోన్మెంటులో అశ్విక దళానికి చెందిన గుర్రాలపై స్వారీ నేర్చుకొన్నాను.' అన్నాను.

అమాయకంగా కనిపించే నానోటి వెంబడి ఈ మాటలు రావడంతో అందరికీ ఆశ్చర్యంవేసింది. ఈ కోరిక మహంతని యిరకాటంలో పెట్టింది.

క్షణకాలం మౌనం వహించి — 'తప్పకుండా బాబూ! నీకు నిజంగా స్వారీ చేయడం వస్తే తీసుకెళ్లు. కానీ జాగ్రత్త!' అన్నారు.

ఈ విషయంలో అంగీకరించడంతో ఆ మహనీయుని ఖరీదైన వస్తువులు, దొంగచూపులు సహించగలిగాను. అయినప్పటికీ, ప్రతిభననుసరించి, సాధువు అయిన శీతలగర్ ఈ మందిరానికి అధిపతిగా వుండదగినవాడనిపించింది.

'చీకటిపడేలోపల బావి తవ్వే స్థలం యితనికి చూపించాలి—' అని దేవకి నైపుణ్యంగా సూచించింది.

'ఇతనికి కాబోయే స్నేహితుడు అమరతో ఆడుకోను తీసుకెళ్లమని చెబుతాను. ఇతనికి పానీయం కూడా అక్కడికే పంపండి' అన్నాడు మహంత.

'లోపలికి' అన్నాడు మేస్త్రీ గండాసింగు తాడునిచ్చెన మీద బావిలోంచి పైకి వస్తూ — 'గంట ఎంత అయిందో తెలియదు .. ఇతను మీ బావగారి అబ్బాయి కదూ' అన్నాడు.

'ఇంత ఎక్కువలోతు ఉండదు. అయినా కొళాయి పెట్టించడానికి బోరింగు గొట్టం వేయడానికి ఎందుకు ప్రయత్నించలేదు.' అన్నాను పిన్నితో.

కొత్త సాధనాలగురించి ఆలోచించే నా పారశాల బాల్యమనస్తత్వం వల్ల అలా అన్నాను. ఇక్కడ అలాచేయడానికి వీలుపడుతుందో, లేదో కూడా తెలియదు. మేస్త్రీ లోకతత్వ మెరిగిన మనిషి.

'ఇక్కడ మీ బాబాయి పేరుతో శిలాఫలకం చెక్కించాలి. బావి గోడ మీద అది బిగించాలి. బావిలోతుగా తవ్వినా, కొళాయి పెట్టించినా ఒకటే, నీళ్లు రావడం ప్రధానం! కొండ ప్రాంతం కావడం

వల్ల చాలాలోతుగా తవ్వితేగాని అది కుదరదు. అందువల్ల ఈ మరంలో బావి తవ్వించడానికి ఎవరూ ముందుకు రాలేదు.' —అంటూ ఆవిడ నిశ్శబ్దంగా తొంగి చూసింది. ఆవిడ నుదురు ముడతపడింది. చీకటి గోతిలోకి ఆదుర్దాగా చూసింది పిన్ని.

'దిగులు పడకు. నేను నీతో వున్నానుగా. నీళ్లు తప్పక పడతాయి ' అన్నాను బాగా ఎదిగిన వ్యక్తిలా మాట్లాడుతూ.

ఆవిడ నాతల గుండెలకు అదుముకొంటూ, చిరునవ్వు చిందించింది. ఆవిడ దుఃఖాన్ని నేను చూడలేనని గ్రహించింది.

'నా దగ్గర వున్న డబ్బు సమస్తం ఈ బావిలో ధారపోస్తున్నాను. ముసలితనంలో నీవే దిక్కు.'

'తప్పకుండా.' నాతల దిటవుగా ఎగురవేస్తూ అన్నాను. ఆవిడ నాతో వాస్తవం చెప్పించాలనుకొంటున్నదని తెలుసు.

'మీ అమ్మ నిన్ను వదిలిపెట్టదు బాబూ! నాగురించి, మీనాన్న గురించి ఆవిడ చేసే ప్రచారం నీకు తెలుసుగా ' అంది నిట్టూర్పు వదలుతూ.

'ఆవిడ నోరు మంచిదిగాదు.' అన్నాను

జీలంలో కంటె నేను బాగా ఎదిగినట్లు తోచింది. ఆవిడను సంరక్షించడం, ఆక్షణంలో ఆవిడకు నా రక్షణ కావాలని అనిపించడం నాచేత అలా అనిపించాయి. నా అంతరాత్మలో ముంతాజ్‌పట్ల ప్రేమకు నీతి బాహ్యంగా భావించాను. పెద్దవాళ్లు ఒకరిమీద ఒకరు చేసుకొనే అరోపణలు నేను లక్ష్యపెట్టదలచుకోలేదు. ఏది తప్పో, ఒప్పో నాకు తెలియదు. ప్రేమించడం, ప్రేమించ లేకపోవడం ప్రధానం. ఇతరులను ఆడిపోసుకొనేవారి మనసులు మంచివికావు.

తాడు నిచ్చెనమీద గండాసింగు కూలీలు నడచిరావడం ఆసక్తిగా చూస్తున్నాను

ఆ క్షణంలో దేవకి అప్రయత్నంగా సంతోషం వ్యక్తం చేసి —

'అడుగో అనంతా వచ్చాడు' అని, నేను వున్నానని గ్రహించి ఆసంతోషాన్ని సగంలో దిగమింగింది.

'అరే! బాబూ! నువ్వు వచ్చావా?' బావికి అటువేపు నుంచి అన్నాడు అనంత 'నువు చాలా పెద్దవాడివైపోయావే. గురుదాస పూరు నుండి నీకు మామిడి పళ్లు, పుచ్చకాయ తీసుకొచ్చాను.'

అతడు చాలా అందంగా కనిపించాడు. గంభీరంగా, ఉదాత్తంగా అతను మాట్లాడటం చూస్తే, నాలో అసూయ మటుమాయమై అతన్ని చూడక ముందున్న ఆలోచలన్నీ అంతర్ధానమైనాయి.

'అయితే ఇటుకలేవీ?' అడిగింది దేవకి.

'వస్తున్నాయి. రేపు వస్తాయి. తొందర ఏమీలేదు నీళ్ల అంత తొందరగా కనబడవు..'

'నీ నోరు పడిపోను. ఏమిటా మాటలు?' దేవకి మూతి ముడు చుకొంది.

'పిచ్చిదానా! అంతా సవ్యంగా జరిగిపోతుంది ' సరదాగా అన్నాడు అనంత.

ఆశావహంగా, లౌక్యంగా అతను మనసువిప్పి మాట్లాడిన మాటలు విని నా గుండె విప్పారింది.

'వచ్చి మామిడి పళ్లు తీసుకో!' అనంత బ్రతిమాలాడు.

'నిదానంగా. బావిలో పడతాడు.' దేవకి హెచ్చరించింది.

'ఇదుగో! ఇది నీకు.' అప్పుడే కడిగిన చేతులు విదిలిస్తూ నాభుజం తడుతూ అన్నాడు గండా సింగు.

'సాష్టాంగ నమస్కారం' అని చెప్పు... ఈ పెద్ద మేస్త్రీ వెళ్లిపో తున్నాడు. ' అంది దేవకి పిన్ని. అతనివైపు చూస్తూ — 'వీళ్ల అమ్మ డాస్కాలో సిక్కు కుటుంబంలో పుట్టింది.' అంది దేవకి.

'ఆశీస్సులు బాబూ! — అచ్చం మీకొడుకు అనుకొన్నాను.'

అన్నాడు గండాసింగు నవ్వుటాలు ధోరణిలో

'నిజానికి నామనసులో యితడే నాకొడుకు. లోకం దృష్టిలో వీళ్ల అన్నను దత్తు యిచ్చారు.'

ఈ మాటలు ఆవిడ అంతరాత్మలో నాస్థానాన్ని గుర్తు చేశాయి. ఈ లోకంలో నా అనేవాళ్లు వుంటే ఈవిడ ఒక్కరేనని భావించాను. దేవకి నాకు సన్నిహితురాలు కాదుగాబట్టి, ఆ స్థానంలో ముంతాజ్‌ని నిలబెట్టాను.

ఆ సాయంకాలం వంటశాలలోనుంచి మా భోజనాన్ని మందిరం మేడమీదికి తెచ్చి పెట్టారు. అక్కడ దేవకి పిన్ని తన మంచం పక్కనే నాకొక మంచం వేయించింది. సందులో తాను పడుకోబోతున్నానని అందరికీ వినిపించేటట్లు అనంత ప్రకటించాడు ఏమైనా భోజనానికి అతను రాలేదు సరిగదా, మా పిన్నితో నాకు సంపూర్ణ స్వతంత్రం కలిగించే అవకాశం యిచ్చాడు. గురుదాసపూరునుండి తనకోసం తెచ్చు కొన్న మద్యం సేవించడానికి అతనికి అది అవసరమని నా అనుమానం దేవకి, నేను కలిసి భోంచేశాము. ఆవిధంగా బహిరంగ ప్రదేశంలో కలిసి తినడంవల్ల ఆప్యాయత కలగడం సహజం. అదే ఆవిడకు నన్ను దగ్గర చేసింది. భోజనాలు అయిన తర్వాత, రుచికరమైన మామిడి పళ్లు తిని, చిన్నప్పుడు ఆవిడను కథలు చెప్పమని అడిగిన అనురాగంతో కథ చెప్పమన్నాను. ఆమె యధాప్రకారంగా తీయని కంఠం విప్పి కథ మొదలెట్టింది—

'అనగనగా ఒక చిలక, గోరువంక ఉన్నాయి...' యధావిధిగా, ప్రయాణ బడలికవల్ల నాకు నిద్రముంచుకొచ్చింది. దేవకి అడుగు తోంది— 'బాబూ! వింటున్నావా? లేదా?'

నా నిద్రమత్తులో, ఆవిడ తొడమీద తలపెట్టుకొని పడుకొని మన సుకు తృప్తిగా భావించాను శారీరకమైన సుఖం కంటె, ఒక అనురాగ హృదయంగల వ్యక్తి, ఈ కలయికవల్ల కలిగిన ఆత్మీయతను అనుభవించి నట్లు, ఈ అందమైన స్త్రీ నా సర్వస్వంగా భావించిన తృప్తి కలిగాయి. ఆవిడ నాతో చిరకాలం వుండి పోతుందనిపించింది.

సూర్యోదయానికి ముందు సిపాయి బీరుసింగు, అతని స్నేహితుడు సేత్ చురంజీతో కలిసి వచ్చి నన్ను లేపారు. ఇద్దరూ సమవయస్కుల్లా వున్నారు. నాకళ్లు నులుముకొంటూ వారి వెంట ఆ మందిరం అనుకొన్న కొండమీద నదీ ప్రవాహం వెంబడి, అతి శీతలము, అమ్రఫల శోభితము అయిన తోటలు పచ్చదనం మధ్యలో నడిచాను. అరుణోదయ కాంతులు విరజిమ్ముతున్నాయి. మామిడి పళ్ల బరువుతో కొమ్మలు వాలి వున్నాయి. గుబురుగా చెట్లనుండి బాగా పండిన పళ్లు ఒకటి రెండు బుట్టలు కోయమని తోట మాలితో చురంజీ చెప్పాడు. పిల్లగాడిద మేతకోసం పరుగులు తీసినట్లు నామనసు ఆనందతాండవం చేసింది.

'ఈ తోట చురంజీ కుటుంబానిది. వాళ్లు వడ్డీ వ్యాపారులు, బాగా డబ్బున్నవాళ్లు. కుదువ బెట్టిన వస్తువులు విడిపించుకోలేక మా తల్లిదండ్రులు వడ్డీ కట్టలేక కొంత పొలం వీరి స్వాధీనం చేశారు.' నాలోని ఆలోచనా పరంపరలు పసిగట్టి బీర్‌సింగు అన్నాడు.

'నువ్వు అతని స్నేహితుడివి?' అన్నాను.

'మేమిద్దరం కలిసి చదువుకొన్నాం.' బీర్‌సింగు సమాధానం.

'నేను కూడబెట్టిన డబ్బుతో వాళ్లనాన్న తదనంతరం కనీసం రెండు ఎకరాల పొలం తిరిగి కొనేదానికి అతన్ని వొప్పించాను.'

'ఎంత ఆశ!' అన్నాను. మా దళానికి సంబంధించి అస్పృశ్యుల వద్ద నగలు కుదువ బెట్టుకొని మానాన్న వడ్డీ వ్యాపారం చేయడం గుర్తుకు వచ్చింది. ఒకసారి నగలు కుదువబెడితే దానివడ్డీ కట్టలేరు. కుదువ వస్తువులు విడిపించుకోవడం వారి తరంకాదు.

'వడ్డీ వ్యాపారి కొడుకువిగా నీకిది అర్థమయి వుండాలి. రాజపుత్ర రైతు బిడ్డనైన నాకు ఈ గొడవలు అర్థంకావు.' బీర్‌సింగు వ్యంగ్యంగా అన్నాడు.

సిపాయి అన్న చివరి మాటలు చురంజీ విని ముందుకు వచ్చాడు. బీర్ సింగు వడ్డీ వ్యాపారి కుమారుని ఉద్దేశించి — 'ఓయీ! వడ్డీ

వ్యాపారీ! మాభూమిని స్వాహాచేసిన మీరు, తిరిగి నా భూమి నాకు అమ్ముతారా? లేక వ్యాపారస్తుని మాటలేనా?'

'అరే! నువ్వు నన్ను మాటిమాటికీ వ్యాపారి అంటుంటే నీ చెవి మెలి బెడతాను. మేము ఎంత మాత్రం వ్యాపారస్తులం కాదు.'

'మేం యిప్పుడు కేవలం ధనవంతులం మాత్రమే! మాకు ఇటు కల కర్మాగారం వుంది... నువ్వు ఫ్రాన్సు దేశం వెళ్లి వచ్చినా యింకా బుద్ధి మారలేదు. మా కళ్లు తెరుచుకొన్నాయి. విదేశాలలో వాణిజ్యరంగం ఎంత ముందుకు వెళ్లిందో నేను వాణిజ్యకళాశాలలో చదివి అద్భుతాలు తెలుసుకొంటున్నాను. జపాన్ దేశం చూడు మనవలె వారు కూడా సనాతన వాదులు. వాళ్లు యిప్పుడు ప్రపంచంలో సగ భాగానికి వస్త్రాలు ఎగుమతి చేస్తున్నారు. వాళ్ల ఆంగ్లభాష, అమెరికన్ పద్ధతులు నేర్చుకొని, 20 సంవత్సరాలలో ముందంజ వేయుగలిగారు. వాళ్లు యుద్ధంలో రష్యాను ఓడించినా ఆశ్చర్యం లేదు. బొంబాయిలోని పార్శీనూలు మిల్లులు, కలకత్తాలోని జనపనార కర్మాగారాలు యంత్రయుగంలోకి అడుగు బెడుతున్న మనదేశ ప్రగతికి సోపానాలు. నువు పల్లెటూరి బైతువి. నీకీ యుద్ధం గురించి, యుద్ధంలో పోరాడి గాయపడ్డ విషయం గురించీ తెలియదు. వారి వ్యాపారానికి జర్మనులకు మార్కెట్లు కావాలని మాకు తెలుసు. భూమి మీద అన్నిప్రాంతాలను తెల్లదొరలు ఆక్రమించుకొని వదలి పెట్టడం లేదు నువ్వు కొంచెం ఆగి చూడు. ఏం జరుగుతుందో! తెల్లదొరల ఆటలు చూడగలవు. మన దేశంనిండా కర్మాగారాలు వెలుస్తాయి. మనకు 500శాతం లాభాలు వస్తాయి. దారివాల్‌లో ఉన్నిమిల్లుల పొగగొట్టాలు ఆకాశంలోకి పైకెగసి ముచ్చట లాడుతున్నాయి. భూమి దున్ని, హలంపట్టుకొన్న రైతన్నలు రెండు పూటలా తిండికి నోచుకోని వారు భూమిని వదలి కర్మాగారాల్లో పనిచేస్తున్నారు. ఇక్కడ ఇళ్ల దగ్గర దున్నపోతుల తోకలు మెలిబెడుతూ, పశువుల సున్నిత అవయవాలతో ఆటలాడుకొంటున్న కుర్రవాణ్ణి ఆశ్చర్యంగా గురుదాస్‌పూరు, అమృతసర్, లాహోర్లలో కొత్త జీవితానికి నాందీ పలికారు. లారీలు నడుపుతున్నారు, కార్లు నడపడం నేర్చుకొన్నారు. యంత్రాలు తలలువంచి వారి మాట వింటున్నాయి.

మట్టి గొట్టుకున్న శరీరాలతో ఉండే రైతన్నలు యిక మీదట మర యంత్రాలు నడపడం నేర్చుకోవడానికి సిద్ధంగా వుండాలి. వందలు వేలల్లోకాదు, లక్షలమంది కావాలి..... అప్పుడు భూమిమీద ఆధారపడటం వెనకబడ్డవారి వంతు.... అందువల్ల నువ్వు రెండు ఎకరాలు కొని ఏం చేద్దామనుకొంటున్నావు? నీకు ఏ ఆధారమూ లేనప్పుడు నేను మా కర్మాగారంలో ఉద్యోగం యిస్తాను... 500శాతం లాభాలు ఎలా సంపాదించాలో నేర్పుతాను.'

'చదువుకొన్న మీరంతా తెలివితేటలు గలవాళ్లు. మీ అవసరాలకు అనుగుణంగా పరిస్థితులను మలచుకోగల సమర్థులు. నేను నారెండకరాలు వెనక్కు తీసుకొని, మీ కర్మాగారంలో ఉద్యోగం కూడా చెయ్యవచ్చుగా? భూమాతను స్పృశించి ఆనందం పొందాలని వుంది. సూర్యోదయ సమయంలో రైతన్న హృదయం ఎలా స్పందిస్తుందో, సూర్యాస్తమయ వేళ గ్రామీణ వాతావరణంలో హస్తకళా నైపుణ్యంతో బ్రతికేవారు ఎంత ఆనందం పొందుతారో నీకు తెలియదు.'

'సరే. నువు రెండూ పొందవచ్చు.'

'బీర్ సింగుకు ఒక యంత్రం ఎలా నడపాలో తెలుసు.... అతనికి సైకిలు తొక్కడం చేతనవును. ' అన్నాను.

'అతను ఎద్దు లాంటివాడు. అతణ్ణి మీనాన్న మనిషిని చేశాడు. నాకు తెలుసు.' చురంజీ అన్నాడు.

'ఓహో! ఏమి పెద్దరికం.' మా పూర్వీకులు నాకు దక్కేలా చేసిన వాటిలో నేను గర్వపడతాను వాళ్లు రైతులు. మీలా నెయ్యన్నం తిన్న మహారాజులు కాదు. గడ్డ పెరుగులో అన్నం తిన్నవారు. మీకు తెలిసిన కష్టమల్లా — మెత్తటి పరుపుల ఆసనాలపై కూచోడం.'

ఈ వాదోపవాదాలు సరదాగా వింటున్నాను. క్రితం రోజు ప్రయాణ సందర్భంగా పచ్చిక బయళ్ల మీదుగా వచ్చిన ప్రాంతాలను మళ్లీ చూసి ఉత్సాహం పొంగి పొరలింది. కంటోన్మెంటులో చక్కటి దారులు తప్ప, యిలా పొదరిల్లవంటి తోటలు కనిపించవు. వ్యాపారం చేయడం, కర్మాగారాల్లో పనిచేయడం నాకు తెలియదు. చురంజీ దూర

దృష్టితో చెప్పిన మాటలు నాకళ్లముందు కదలియాడసాగాయి. చురంజీ చెప్పిన యాంత్రిక జీవితమేవస్తే, జీవనసుఖం ఏమవుతుంది? యాంత్రిక సౌఖ్యంలో ఆనందముందా? అమృతసర్‌లోని వ్యాపారులకంటె బీర్‌సింగు స్నేహితుడు మరీ విప్లవకారుడులా కనిపిస్తున్నాడు. వాళ్లు మధ్య దళారీల లాభాలు పొంది సంతోష పడుతుంటే, ఈ యువకుడు కర్మాగారాలు నిర్మించి, మిల్లులద్వారా 500 శాతం లాభాలు పొందాలని కలలు గంటున్నాడు.

'గురుదాసపూరులో మీరు ఫ్యాక్టరీ ప్రారంభించబోతున్నారా?' అని సాహసించి అడిగాను.— 'కనోవా గ్రామంలో పేదరైతుల కెవరికీ ఉద్యోగాలు దొరకవు...'

'ఈ వూళ్లో స్థాపిస్తాము. మీ పిన్ని గురుదాసపూరులో యిటు కలు కొనడానికి వెళ్ల నవసరం లేదు. యుద్ధంనుండి తిరిగి వచ్చిన నిరుద్యోగుల కందరికీ ఉద్యోగావకాశం కల్పించవచ్చు. గురుదాసపూరులో ఒకటి, అమృతసర్‌లో మరొకటి మిల్లులు కడతాము. ఇక్కడ మూఢ నమ్మకాలతో మగ్గిపోయే నిరక్షరాస్యులు, మహంత నందగిరి రాజ్యం చేస్తు న్నారు. వీరి నివాసాలకు దూరంగా కట్టదలచుకొన్నాం.'

'చురంజీ దృష్టి అంతా డబ్బు, డబ్బు మీదే.' రైతుధోరణిలో కూడిన నిరాశావాదంతో అన్నాడు బీర్‌సింగు — 'బాబూ! నీకు తెలియదు. ఇతడు ప్రాచీనతలో ఒక అణువు. కాలానుగుణ్యంగా ఎలా మారాలో వీరి కుటుంబానికి బాగా తెలుసు. వడ్డీ వ్యాపారం ద్వారా వీరు ధనస్వాములు అయ్యారు. వడ్డీద్వారా సంపాదించిన మొత్తంతో ఫ్యాక్టరీలు స్థాపించే స్తోమత సంపాదించారు. ఓ యీ భగవంతుడా! నాకు జన్మజన్మాలకు ఈ మామిడి తోటలు ప్రసాదించు. ఈ సృష్టిని సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దిన ఆ భగవంతుడిపై నాకు నమ్మక ముంది. నేను నందగిరిని వదలి పెట్టినా ఫర్వాలేదు. అదుగో ఆ నదినిచూడు.'

తోట వెంబడి సన్నప్రవాహం గమనించాను. గుట్టలు, పుట్టలు దాటుకొని ప్రవహిస్తోంది. నా చెయ్యి పట్టుకొని నడుస్తున్న బీర్‌సిం

గును లాగుకొని ముందుకు నడిచాను. నదీ ప్రవాహ సరళి నన్ను మురిపించింది. ఒక్క క్షణంలో గుడ్డలు విప్పి అందులో దూకాను.

నదిలోని నీళ్లు ఎగిసి తుంపురులు పడుతున్నాయి. నీళ్లమీద అరుణోదయకాంతులతో మంచు బిందువులు మిలమిల లాడుతున్నాయి. భూమిపై తన ప్రతాపాన్ని చూపడానికి రాబోయే సూర్యుని వేడికి అవి మటుమాయం కాకతప్పదు. బాగా ఎత్తుగా పెరిగిన గడ్డిని తొలగించి, చల్లని ప్రవాహంలో పడుకొన్నాను. ప్రవాహంతో పాటు నా చూపులను వేగంగా తిప్పి భూమిమీద రకరకాల గడ్డి పరకల్ని చూశాను. బీర్‌సింగు నన్ను గట్టిగా పొదివిపట్టుకోగా, లోతుగావున్న ప్రాంతాలలో ఈద సాగాను. దూరంగా కప్పల బెకబెకలు, బురదలో తిరుగుతున్న పేడ పురుగులు, కనిపించాయి. నా గుండెలోపల ఈ తెలియని ప్రాణులను గురించి ఏదో భీతి కలిగినా, ప్రపంచమనే గాజుతొట్టిలో ప్రకాశమానంగా కనిపించే జంతువుల స్వాతంత్ర్యం నాకు నచ్చింది. దేవకి పిన్ని యిక్కడ నాతోవుంటే, నేను ఆవిడ నగ్న శరీరాన్ని పొదివిపట్టుకొని, ఆ ఆరాధ్యదేవత మన్నన పొంది వుండేవాణ్ణి. ఈ సంతోష స్వర్గంలో, నా ఆనందమయమైన ఆత్మలో. ఆమెను యిక్కడకు తీసుకొని రాగలననే నమ్మకం కలిగింది. పూర్వజన్మలో నీటిలో చేపల్లా మేము కొన్ని ఏళ్ల తరబడి జీవించామా అని ఆమెను అడగదలచుకొన్నాను. మాకంటె కొంచెం ముందుగా నడుస్తున్న చురంజీ, తన చేతిలో పొడుగాటి గుడ్డతో వెళ్తున్నాడు. తనకు రెండు చేపలు దొరికాయని సంతోషంగా ప్రకటించాడు.

ఈ వార్తవిని అతని పట్ల స్నేహదృష్టి అధికమైంది. —'ప్రతిచోటా ఏదో ఒక లాభం కోసం ఎదురుచూసే వ్యాపారమనస్తత్వం నీది' అని బీర్‌సింగు అరిచాడు.

చురంజీ తన స్నేహితుడికి చేపను యిచ్చాడు. సిపాయి అన్నాడు— 'ఇంట్లో మీరు అన్నము, కూరలు తింటారనుకొంటాను.'

'కృష్ణ, నువ్వు, — కృష్ణ వాళ్ల పిన్ని, అనంత వస్తే - ఒక సాయంకాలం మాయింట్లో భోంచెయ్యాలి.' అన్నాడు చురంజీ.

'సరే! నా భూమి సంగతి ఏమిటి?' బీర్‌సింగు ఎగతాళి కన్నాడు. చురంజీ అంటే నాకు ప్రీతి ఎక్కువైంది. అతడు వడ్డీవ్యాపారి అనీ, మిల్లు యజమానిగా గొప్పలు చెప్పకొంటాడనీ అతనిపై వున్న కోపం తగ్గింది.

వ్యక్తిగతంగా అతణ్ణి అభిమానించసాగాను. జలగలా రక్తం పీలుస్తున్నా, అతడు మంచి వాడయితే ఎలా సంభాషించాలా? అని ఆశ్చర్యపోయాను.

'మీ స్నానాలు, అయిన తర్వాత మాతోటలో పెరిగిన మామిడిపళ్లు తిందాము. మీ కవిబాగా నోరూరిస్తాయి మీరలా బాధపడుతుంటే చూసి నేను సంతోషిస్తాను ' అన్నాడు సమాధానంగా చురంజీ.

ఇది నాకు మరీ సంబరం కలిగించింది మామిడి పళ్లు తిన మనడం మహత్తరమైన అస్త్రంగా పనిచేసి నేను వెంటనే నీళ్లలోంచి బయట పడ్డాను. నా దగ్గరలో వున్న సంతోషాన్ని పాలుపంచుకోవడానికి బదులు ప్రతి అంశాన్నీ నైతిక విషయంగా భావించి వేదాంతపరంగా ఆలోచించడం పట్ల నన్ను నేనే నిందించుకొన్నాను.

బాగా పండిన మామిడిపళ్లు ఏరి తోటమాలి మూడు బుట్టలు నింపాడు. మరికొన్ని గుట్టగా ఒక చాపమీద పరిచి మమ్మల్ని తినడానికి ఆహ్వానించాడు.

గురుదాసపూరు జిల్లాలో పండిన మామిడిరకాలు, బాగా పేరు ప్రసిద్ధులుగన్న పంజాబు ప్రాంతం 'లంగ్రా'లు, పశ్చిమతీరానికి చెందిన బుల్సర్, రత్నగిరులలో పండిన రకాలకు సరిపోవు ఉత్తర ప్రదేశంలో పండిన రకాలకు ముక్కుబాగా పొడుగు. కాని, ఈ రకాల మామిడి పళ్లు హిమాలయాల సమీపంలోని శివాలికా పర్వత శ్రేణుల్లో పండినందువల్ల మంచి వాసన కలిగివుంటాయి. చిన్నవి అయినా, పెద్దవి అయినా బాగా చీకడానికి ఈ మామిడి పళ్లు ఉపయోగపడతాయి. ఈ విధంగా తినడంలో తల్లి చనుబాలు తాగినట్లుగా ప్రాణి ఆనందం పొందగలడు. అందువల్ల పెద్దవాళ్లు కూడా ఈ మామిడి రకాలు చీకుతూ, అందు లోంచి రసం చింది పడుతుంటే సంబరపడతారు. మామిడి పండు

తినడానికి నోట్లో పెట్టుకొన్నప్పుడు ముట్టె చీకుతూ అందులో రసం వస్తుంటే ఆస్వాదిస్తారు.

చిన్నప్పటినుంచీ నాకు మామిడిపళ్లు అంటే మహాయిష్టం ప్రతి సంవత్సరం మామిడిపళ్ల బుట్టలు కొనమని అమ్మని ఏడిపించేవాణ్ణి. అందులోంచి దొంగతనంగా ఒక పండు తీసుకొని యింటి వెనకకు వెళ్లి రహస్యంగా చీకి తినేవాణ్ణి. నౌషిరాలో వుండగా యిలా దొంగత నంగా తింటుంటే నాన్న చెంపదెబ్బ కొట్టడం ఇంకాగుర్తు. ఆవిధంగా బాధలుపడ్డా దొంగతనంగా తినడం మానుకోలేదు

ఆ చెట్టు నీడలో, ఆ తోట మధ్య మేము కూచున్నాం చురంజీ, బీర్‌సింగుల కంటె నేను ఆశగా తింటున్నాను. మేము చీకుతున్న శబ్దం తప్ప మరొక శబ్దం చాలాసేపు వినిపించలేదు. మధ్యమధ్యలో తోటమాలి తన యజమానితో పండటానికి సిద్ధంగావున్న పళ్లను చిలు కలు ఎలా పాడుచేసిందీ చెబుతుంటే అందులో వాస్తవం ఎంతవరకా అనిపిస్తోంది.

'చిలుకలకు, నీ ముద్దుముద్దు మాటలకు పోలిక వుంది.' నోటి నిండా మామిడి పండు పెట్టుకొని చురంజీ సేఠ్ అన్నాడు.

ఆ హెచ్చరికలు తోటమాలిపై పనిచేశాయి. ఈ తోటలో జొరబడి వూళ్లో మామిడి కాయలు ఎలా దొంగిలిస్తారో చెప్పసాగాడు. అతని ముడతలుపడ్డ కనుబొమలు తన యజమాని సేవకాధర్మంలో తాను ఏవిధంగా కష్టించి పనిచేసేది చెబుతోంది

అదివిని బీర్‌సింగు తోటమాలితో స్పష్టంగా అన్నాడు —

'నీకొడుకు కమర్ నీతోకలిసి ఇప్పుడు తోటలో పనిచేస్తున్నాడా? లేక తిరుగుళ్లు తిరుగుతూ, వాళ్ల అమ్మకు దోరమాగిన కాయలు తెచ్చి పెట్టి వూరగాయలు అమ్మడానికి సహాయం చేస్తున్నాడా?'

'మీ దయవల్ల కుర్రవాడు దారిలోకి వచ్చాడు. కాని యింకా తిరు గుడు మానలేదు.' తోటమాలి ఫక్రూ బీర్‌సింగ్‌ని పొగిడి అన్నాడు. పక్షులు కొట్టి పడవేసిన కాయలు, గాలికి పడ్డకాయలు ఏరడంలో నాకు

సాయం చేస్తాడు. వాళ్ల అమ్మకు సాయంగా ఊరగాయజాడీలు గురు దాసపూరు మోసుకెళ్తున్నాడు. శుభ్రంగాతిని, కాదు, తాగి, పట్టణంలో సంపాదించిన డబ్బు వృధాచేసి రోజుల తరబడి యింటికే రాడు.'

'అయితే వూరగాయల వ్యాపారం బాగా వృద్ధి చెందుతోంది?' చురంజీ ప్రశ్నార్థకంగా అన్నాడు.

చురంజీ అన్యాయంగా అలా అన్నాడు. తోటమాలి దరిద్రంతో కొట్టుమిట్టాడం కనబడతూనే వుంది.

'మీరు పేదలపాలిటి పెన్నిధి మాకు రెండుపూటలా తిండి దొరకడమే అంతంత మాత్రం. ఎప్పుడైనా ఎముకముక్క కొరుకుతాం. మీమీద వొట్టువేసి చెబుతున్నాను. మీతోట కాపలాకాస్తున్న యిన్ని రోజులనుంచి ఒక్క మామిడి పండు రుచి చూసి ఎరగను.' అన్నాడు ఫక్రూ.

'పండిన కాయలు కాకుండా వొగరు కాయలు తింటావా?' వడ్డీ వ్యాపారి ఎగతాళి చేశాడు. అతను జీతం పెంచమని అడిగిన ప్రశ్నను దాటవేశాడు — 'సరే! ఇందులో ఒక పళ్లబుట్ట కృష్ణ చంద్రవాళ్ల పిన్ని యింటికి, ఒకటి బీర్‌సింగు యింటికి, ఒకటి మాకు చేర్చు. బాగా పొద్దెక్కింది. యింక వెళ్లి అంగడి తెరవాలి.'

మాముందున్న పళ్లగుట్ట నెమ్మదిగా మాయమైంది. నేను మామిడి పళ్లమీద సారిస్తున్న చూపుల్ని చురంజీ పసిగట్టాడు.

'మిగిలిన కాయలుకూడా మూటగట్టి ఈ కుర్రవాడి పిన్నికి యివ్వు.' నా మిత్రుడు ఉదారంగా అన్నాడు. నా నోరువూరింది. ఈ విధంగా మామిడి తోట వొడిలో సౌఖ్యాన్ని ఆస్వాదించిన నేను, మళ్లీ కంటో న్మెంటు వెళ్లగలనా? సూర్యకాంతి మిలమిలలు నాకళ్లకు మిరుమిట్లు గొలిపాయి. మేము స్వర్ణవితర్దికలపై నడుస్తున్నట్లు భ్రమించాను.

అమృతసర్, లూధియానా, జీలం వంటి పట్టణాలలో కంటె గ్రామాల్లో ప్రజలు ఉదారహృదయులు, అతిధిసేవాపరాయణులు అన్న భావన నేను కనోవా గ్రామంలో వున్న రోజురోజుకు అధికం కాసాగింది.

తమకున్న పొలంతో యిళ్లతో తృప్తిగా వీరు జీవిస్తారు. డబ్బు ఎక్కువ సంపాదించాలనే తాపత్రయం వీరిలో లేదు. చురంజీ, వారి కుటుంబం తప్ప మిగతావారంతా డబ్బు సమృద్ధిగాలేక జీవిస్తున్నారు.

పట్టణ జీవితానికి, పల్లె వాతావరణానికి మధ్య తేడాలను నేను ఈ విధంగా తైపారు వేసి చూడకపోదును. కాని డబ్బుకలవాళ్ల హోదాను చూస్తే, వారి భావాలు ఎంత విపరీతంగా ఉంటాయో అనిపించింది. ఈ గ్రామంలో వున్నవారిలో ప్రస్తుతానికి మాపిన్ని బాగా ధనవంతురాలు. ఆవిడ వద్ద 50వేల రూపాయల రొక్కము, అమృతసర్‌లోని మా కుటుంబ ఆస్తి పంపకం ద్వారా వచ్చిన నగానట్రా విశేషంగా ఉన్నాయని అందరి విశ్వాసం. అవిగాక అక్కడ యిళ్ల అద్దెలు నెలనెలా ఆమెకు వరుంబడిగా వస్తాయి. ధనవంతులుగా పేరుగన్న చురంజీలాల్ కుటుంబంకూడా ఆమెతో పోలిస్తే తక్కువ. మిగతా రైతులవద్ద, పేద వారి వద్ద అసలు డబ్బులేదు. మహంతకు భూమి, బుట్రా ఉన్నాయి. ఆ పంటలు, కొద్దిపాటి నగలు, భక్తులు విరాళంగా యిచ్చినవి ఆయన ఆస్తి. డబ్బు అంతగా లేదు. లేకపోతే ఆయన బావి తవ్వించమని దేవకిని అడిగి వుండడు.

ఈ గ్రామీణులముందు దేవకి నెమలిపింఛం పురివిప్పినట్లు తన దానగుణం ద్వారా సగర్వంగా తల ఎత్తుకొని తిరుగుతోంది. డబ్బువల్ల ఆమెకు ఈ హోదా సంతరించుకొంది. తన చేతిలో డబ్బు ధారా ప్రవాహంగా ఖర్చయి బావిలోతుల్లోకి వెళుతున్నా, నీరు కనబడకపోవడం ఆమెకు భయం కలిగిస్తోంది. తరచు కూలీలతో మట్లాడేటప్పుడు ఆమె నాగరక వనితలా గంభీరంగా మాట్లాడినా, తన ధనమంతా యిలా వృధా అవుతున్నదనే నగ్నసత్యం ఆమె గుండెలో భయాన్ని కలిగిస్తూనే వుంది. ఆమెమీద అంతరాంతరాల్లో నాకున్న అభిమానంవల్ల ఆ భయం నన్నుకూడా ఆవహించింది.

ఆమె బావిగట్టుమీద కూచొని తదేకంగా లోపలికి చూస్తూ కళ్లల్లో వొత్తులు వేసుకొని ఆందోళనగా వొంగి చూస్తూ కూచొనేది. సాయంత్ర మయ్యేసరికి, కూలీలకు, పనివారికి కూలిపంచి యివ్వడానికి మేస్త్రీ గండా సింగుకి డబ్బుయివ్వాలి. ఇటుకలు తెచ్చినందుకు ఖర్చుతోపాటు చిల్లర

పనులకైన వ్యయమంతా పంచాలని ఆమెకు తెలుసు.

చదువుకొన్నవాణ్ణి నేనొక్కడినే గాబట్టి, బావిపనికైన ఖర్చులంతా ఒక పట్టీగా వ్రాయమని నన్ను పురమాయించింది. నేను ఆరోజువరకు అయిన ఖర్చుల జాబితా తయారు చేశాను. ఎంత ఖర్చు అయిందో బేరీజు వేయడానికి, ఆపట్టీ చదివి వినిపించమని కోరింది. అప్పటికైన ఖర్చు పదివేల రూపాయలు దాటడంతో, ఆమె తన చెవులను తానే నమ్మలేకపోయింది. లెక్కలు చేయడంలో, కూడికల్లోను తప్పు చేశానేమోనని మళ్లీ జాగ్రత్తగా చూడమంది. నా లెక్కల్లో తప్పులేదని తెలుసుకొని, ఆమె ముఖం పాలిపోయింది; ఆమె నాకేసి నిర్లిప్తంగా చూడసాగింది. కనుబొమలు ముడిపడి నిశ్చేష్టంగా వుండి పోయింది. ఆవిడ ముఖంలో అలసట గమనిస్తే, తాను వృధా ఖర్చుపెట్టి, తన అదృష్టాన్ని పరీక్షించుకోవడంపట్ల ఆమె భయపడుతోందని గ్రహించాను.

ఈ విశాల ప్రపంచంలోకి అడుగుపెట్టాననే సంబరం మధ్యలో, మా తల్లిదండ్రుల కుటుంబ వాతావరణం కంటె భిన్నమైన అంశాలు నాకు కనిపించలేదు. డబ్బు పోగొట్టుకొంటున్నామనే భయం, యింకా ఎక్కువ సంపాదించాలనే ఆశ దేవకికి వున్నప్పటికీ, మా యిద్దరి మధ్య వున్న అనుబంధంవల్ల, డబ్బు విషయంలో ఆమె పక్షంలో సానుభూతి చూపసాగాను. దేవకి వ్యాపారసరళిలో ప్రవర్తిస్తున్నప్పటికీ ఆవిడకు నష్టం రాకూడదనీ, మా అనుబంధం పెరగాలనీ కోరుకొన్నాను. డబ్బువల్ల వచ్చే ఆశ, భయము మనిషి ఎంత సున్నితంగా వున్నా ఎంత కఠినంగా చేయగలవో నాకు గోచరమైంది. గ్రామీణ వాతావరణంలో విహంగంలా రెక్కలు విచ్చుకొన్న నా ఆత్మ, ఈ నగరజీవన కారాగారంలో పక్షిలా బంధించబడాల్సి వస్తుందని కంపించిపోయాను.

మా దేవకి పిన్ని సహజగుణం ఉదారస్వభావమైనా, అప్పుడప్పుడు తగ్గుస్థాయిలో ప్రవర్తించేది. కూలీలకు డబ్బు బట్వాడా చేసేటప్పుడు లెక్కపెట్టి జాగ్రత్తగా యిచ్చేది. మరో చేతితో వాళ్ల పిల్లలు మందిర ప్రాంతంలో తారాడుతుంటే ఉదారంగా డబ్బు యిచ్చేది. ఆ కనోవా గ్రామంలో కొనుక్కోడానికి ఏమీ దొరకక పోయినా ఆమె రోజూ నా చిరుతిండి ఖర్చులకు ఒక్కరూపాయి యిచ్చేది. మా అమ్మ నాన్నలు

నాకెప్పుడు యివ్వగా ఎరగను. మానాన్నవల్ల సాయం పొందిన సిపాయిలు గాని, అతిథులు ఎవరైనాగానీ, ఆయనకు నేరుగా లంచం యివ్వడా నికి వెరచి మా చేతిలో డబ్బు పెట్టేవారు నా కాలక్షేపం కోసం ఆమె మామిడిపళ్లు తెచ్చిపెట్టేది. మధ్యాహ్నం తృప్తిగా భోజనం సమకూర్చేది. సాయంకాలాల్లో ఎండబెట్ట తగ్గడానికి మహంత నందగిరి వంటశాలలోనుంచి పళ్లరసం తెచ్చియిచ్చేది. 'పిన్నీ! బాధపడకు.' అని నేను అన్నప్పుడు ఆమె గంభీరంగా నవ్వు ముఖం పెట్టేది.

కూలీలకు రోజుకూలీ బట్వాడా చేసేటప్పుడు ఆవిడ ముఖంలో ఆందోళనను నేను గమనించకుండా, ఆవిడ నా కోరికను బలపరచేది. మహంత నందగిరితో చెప్పి, తెల్ల ఆడ గుర్రంమీద సాయంకాలాలు స్వారీ చేయడానికి వొంటరిగా వెళ్లనిచ్చేది. ఆంగ్లేయశైలిలో వున్న గుర్రపు జీను అద్దెకు తీసుకొని కాలువవంతెన దాకా వెళ్లేవాణ్ణి. దేశవాళీ గుర్రపు జీను బాగుంటుందని నేను పట్టుబట్టేవాణ్ణి.

స్వారీ చెయ్యాలనే ఉత్సాహంలో, మహంత గుర్రంమీద పరుగులు తీసే సమయంకోసం ఎదురు చూడసాగాను.

ఖర్మకొద్దీ ఈ గుర్రానికి దేశవాళీ పద్ధతిలో కదంతొక్కే విధానం నేర్పారు. అడుగులు వేస్తూ నాట్యంచేస్తూ, గ్రామీణ యువతివలె అడుగులు వేసేది. గంతులు వేయడంగాని, దౌడు తీయడంగాని చేత గాదు. దానిమీద నా సాహసమంతా చూపి స్వారీ చెయ్యాలనే ఉత్సుకత చల్లారిపోయేది. చాలాసార్లు, ఆ గుర్రం నన్ను దూరంగా పడదోసేది. మహంతనందగిరి అలా జరుగుతుందని నన్ను దేవకిని హెచ్చరించేవాడు పడదోసి నందుకు గుర్రాన్ని కొట్టేవాడు మహంతను వొప్పించి గుర్రం స్వారీ చేయడానికి మాపిన్ని ఏర్పాట్లు చేస్తే, ఆ ఆడగుర్రం 'మొరటు'గా ప్రవర్తించి, నాకు నిరాశ, నిస్పృహలు కలిగించేది.

ఆ గుర్రం ప్రత్యేకమైన నడక నా జీవితంలో క్లిష్ట పరిస్థితిని తెచ్చిపెట్టి, చాలా రోజులవరకు నాలో భయాందోళనలు కలిగించింది. గుర్రాన్ని కదను తొక్కించడానికి కాలి మడమలతో దాని డొక్కల్లో తన్న డానికి అనేక సార్లు ప్రయత్నం చేసి విఫలమయ్యాను ప్రత్యేకంగా అంగలు

వేస్తూ, నాట్యసరళిలో కదనుతొక్కేది ఉన్నట్లుండి నా పైజామా తడిసివుండటం చూసి చెమట పట్టిందనుకొన్నాను. గుర్రందిగి, భయంతో వణకిపోతూ, గుండె దిటవుపట్టించి, చెమటలు పోయించిన కారణం ఏమిటా? అని చూశాను. ఏం జరిగిందో తెలియడం లేదు. ఆలోచన పాలుపోవడం లేదు. వున్నట్లుండి ఆరోగ్యం చెడిపోయినట్లు, నేనింక బ్రతకననీ, చనిపోబోతున్నాననీ అనిపించింది.

కొంచెం సేపటికి బట్టల తడి తగ్గింది.

నాతో గుర్రాన్ని వెంబడి నడిపించుకొంటూ, కాలువదాకా నడచి వెళ్లి శుభ్రంగా వొళ్లంతా కడుక్కొన్నాను. నాలో ఏదో భయంతో కొంచెంసేపు ఏడ్చాను.

గుర్రంమీద స్వారీచేస్తే మళ్లీ అలాంటిదేదో జరుగుతుందనే భయంతో యింటికి నడచి వెళ్లడానికి నిశ్చయించుకొన్నాను. మరం దగ్గర మాత్రం గుర్రమెక్కాను.

ఏడుపుచారల ముఖం, కంగారు, బురదనీటితో కడుగుకొన్న గుడ్డలు చూసి, పిన్ని నా అవస్థ పసిగట్టింది.

'నీ గొడవ ఏమిటి?' అంది అసహనంగా.

'ఏంలేదు.' అన్నాను మొహం దాటవేస్తూ. ఏం జరిగిందో అనంతకు రహస్యంగా చెబుదామనుకొన్నాను. అతను గురుదాసపూరు వెళ్లి వున్నాడు.

'ఇలారా!' అని దేవకి పట్టుబట్టింది.

శీతలగర్ గుర్రం తీసుకెళ్లాడు.

భయంతోను, సిగ్గుతోను ఆమె వొడిలో తలపెట్టుకొని కూలి పోయాను.

'ఏం జరిగిందో చెప్పు నాయనా!' అని ముద్దుగా అంది.

చాలాసేపు తటపటాయించి, నిశ్శబ్దం భంగంచేస్తూ చెప్పాను.

ఆవిడ నాకేసి చూసి పెద్దగా నవ్వింది. బుగ్గలు నులిమింది. ఆవిడ ఎగతాళికి నేను బాధపడతానని — 'ఫర్వాలేదు. ఏమీ కాలేదు. వెళ్లు. నువు పెద్దవాడి వవుతున్నావు. అంతే ఇహమీదట నువు నా దగ్గర పడుకోవడానికి వీలులేదు. నీకో చిన్నపిల్లను తెచ్చి పెళ్లి చేస్తాము... మీ నాన్నకో వుత్తరం ముక్క వ్రాసి పడేసి విషయం తెలియ బరుస్తాను.' అని ఆవిడ మళ్లీ చిరునవ్వు వెలయించింది

'అమ్మో! నాన్నకు చెప్పకు పిన్నీ!' అర్థించాను.

'సరే! నువు రచ్చ చేసి ప్రయోజనం లేదు. నీవు యింకా పిల్ల వాడివి కాదని గుర్తుంచుకో. నువు పెద్దవాడి వయ్యావు.' అంటూ ఓదార్చింది.

ఆ సంఘటనవల్ల నాలో కలిగిన భావ సంక్లిష్టత, జీవిత వాస్త వాలపట్ల ఆమాయకత్వము తొలగి పోలేదు. పిన్ని ఓదార్పు మాటలు నాలో భయాన్ని పారద్రోలాయి.

నాకు సరైన శరణ్యంగా తోచిన అనంత — సహాయం కోసం వెళ్లాను. ఆయన ఆప్యాయంగా, వుబుసుపోకకు చెప్పినట్లు మాటలు ప్రారంభించాడు.

'బాబూ! వీటి అర్థం నీకు త్వరలో తెలుస్తుంది. పెద్దవాళ్లు నీ ఆలోచనలు, హృదయము పరిశుద్ధంగా వుంచుకోమని చెబుతారు. కాని, నా ఉద్దేశంలో నీకు తోచిన రీతిలో నడచుకోవాలి.. నువు ఒక స్త్రీని చూసి, ఆవిడను కౌగలించుకొంటే బాగుంటుందనుకొంటే అలానే చెయ్యి... అలాకాక, ఆ భావాలను అణచివేసుకొని, నీతోడి పిల్లలతో సంపర్కం పెట్టుకోవడమో, హస్త ప్రయోగం చేసుకోవడమో, చేస్తారు. ఈ కాలపు పిల్లలంతా అంతే. దానివల్ల శవాకారాలుగా మారి, కళ్లల్లో నిర్జీవం ఏర్పడి, వాళ్లకు వయస్సు వచ్చి పెళ్లిళ్లు అయినప్పుడు భార్యలను సుఖపెట్టలేరు.'

అనంత చెబుతున్న దేమిటో నాకు బోధపడింది

'ఇదుగో. ఈమందు కొద్దిగా తీసుకో!' పసుపురంగు ద్రావకం

గ్లాసులో, కొంత సోడా కలిపి నా కందిస్తూ అన్నాడు.

'మూత్రం లాగా వుంది. ఛీ' అన్నాను. అది విస్కీ అయివుంటుందని వూహించాను సంప్రదాయంలో పెరిగిన నాకది గిట్టలేదు. అమ్మ 'యిలాంటి తాగుబోతులు, వ్యభిచారులకు ' మమ్మల్ని దూరంగా వుండమని బోధించేది.

'ఇది మూత్రమే అయితే చాలా ఖరీదయింది ఆరోగ్యానికి మంచిది ప్రేమోపాసనకు దోహదం చేస్తుంది ' అన్నాడు.

'మద్యంతాగితే కవిత్వం బాగా వస్తుందని విన్నాను ' త్రాగుడుపట్ల నా ధోరణిని సహేతుకం చేస్తూ ఒక చుక్క పుచ్చుకొన్నాను ఈ చేదురుచి మందు నాకు నచ్చక — 'ఈ కొంచెం చాలు కవిత్వం వ్రాయడానికి' అన్నాను

అనంత యిచ్చిన సలహా ధోరణివల్ల స్త్రీల శారీరక సౌందర్యంపై నా మక్కువ ఎక్కువ అయింది. వంటగదిలో, స్నానాలగదిలోను అమ్మను నగ్నంగా అప్పుడప్పుడు చూశాను. అమ్మ పవిత్రమైనది కాబట్టి ఆ దృష్టితో ఆమెను తదేకంగా చూడలేదు. అందువల్ల ఆవిడ అంగసౌష్టవం ఎలా వుంటుందో నా ఊహలకు అకృతి కల్పించదలచుకోలేదు. లూధియానాలో నయీమ్ చెప్పినట్లు నేను అమ్మ కడుపులోంచి బయటపడ్డానని మాత్రం తెలుసు చిన్నప్పుడు నాతో నగ్నంగా నౌషిరాలో ఆడుకొన్న డా బాలముకుంద్ కూతురు గుర్తుకు వచ్చింది నా పగటి కలల్లో ఆవిడ నా దగ్గరగా వచ్చినట్లు, నేనావిడను ఆలింగనం చేసుకొన్నట్లు భావించాను. అలాచేస్తే ఎలా వుంటుందో నాకు తెలియదు. ఆ తర్వాత ముంతాజ్ స్మరణకు వచ్చి ఆవిడ శరీరపుష్టి తలపుకు వచ్చింది. ఆవిడ అందరి స్రీలవంటిది కాదు కాబట్టి, వృత్తిరీత్యా దేవదాసీ వంటిది కాబట్టి అలాంటి తలపు వచ్చినా ఫర్వాలేదనిపించింది. రెనాల్డ్ మహాశయుని కవితల్లో ఇద్దరు నాయికల సౌందర్యం గుర్తుకువచ్చి నాలో సెగలు రగుల్కొన్నాయి. మా దేవకి పిన్ని సోఫియాలాగా తోచి, నా ఆలోచనలు అటుకేసి మళ్లాయి. తల్లి తర్వాత తల్లివంటి పిన్నిని గూర్చి అలాంటి ఆలోచనలు రాకూడదని తెలుసు. ఆమె తనతో పడుకోవడానికి నన్ను అనుమతించి,

ఆవిడ మెడచుట్టూ చేతులు వేసుకొని, పగలంతా ఆవిడను కంటినిండా చూస్తూ వుండటంవల్ల, నా కోరికలు నెరవేరడానికి ఆమె లక్ష్యంగా తోచింది.

ఆవిడ మెడ ఎంత అందంగా వంగి వుంటుందో వూహించసాగాను దంతపు బొమ్మవంటి అందంలో మెరిసిపోయే ఆవిడ సౌందర్యాన్ని కళ్లుమూసుకొని ఒక్కసారి గుర్తుకు తెచ్చుకోవడానికి ప్రయత్నించి, ఆవిడ తోనే వుండి పోదామనుకొన్నాను. ఆవిడ బుగ్గలతో నా బుగ్గలు తాకించి, దూరమైన తర్వాత నాలో ఏదో తెలియని ఆవేదన ఆరంభమైంది. ఆవిడకు దగ్గరగా వున్న సమయము, దూరంగావున్న సమయము నాలో విసుగు పుట్టించేవి ఆవిడ ఆలింగనం నిరంతరం వుండిపోవాలనీ, ఆవిడను నా చేతుల్లో పొదువుకోవాలనీ, ఏవో చెప్పరాని వింత కోరికలు కలిగాయి.

ముందుగా ఆవిడ బొమ్మ గీయడం మొదలెట్టాను. నాన్న ఆఫీసు సొరుగులోంచి ఎరుపు, నలుపు పెన్సిళ్లు తస్కరించి, గణేశ్‌కు, శివకు, స్నేహితులకు చెప్పకుండా తెచ్చిన వాటితో బొమ్మ గీచాను. ఆబొమ్మ నాదృష్టికి సరిగా లేకపోవడంతో దాన్ని చించివేశాను దానికి బదులు ఆమెమీద ఒక జానపద గీతం వ్రాద్దామనుకొన్నాను గ్రామంలో అన్ని శ్రమలు తానే అనుభవించిన లచ్చి మీద జానపదగీతం గుర్తుకొచ్చింది. మొదటి రెండు పాదాలు తప్ప, ఈ పంజాబీ గీతం సరిగా రాలేదు. ఆగీతం యీ సరళిలో సాగింది.

'ఈ వనిత సౌందర్యం అపూర్వం!
నిరుత్సాహ నిర్జీవ ప్రతిమ ఆమె
నేను ఆమెను ఆరాధిస్తున్నాను
పొదువాటి, ఆమె ముఖంలో హుందాతనం
వంగి రహస్యం పలికినపుడు గాంభీర్యం
ఆమె నిశ్వాసమే ఒక గీతం ..'

రచనా వ్యాసంగానికి కొత్త కావడంవల్ల, నా గీతంవల్ల నాకున్న గర్వము, ఉత్సాహము మిళితమై, ఆపదాల పోహళింపులో సౌందర్యాన్ని భావిస్తూ

నించున్నాను. ఆవిడకు దూరంగా వున్నానన్న తలపు దాటుకొని, నేను శాశ్వతంగా ఆవిడకు సన్నిహితమైనట్లు భావన కలిగింది నాకు ఆమె పైగల ఆరాధనా భావము, ఆవిడ సౌందర్యంపై గల మమకారము ఈ లలిత పదాల్లో తొంగి చూశాయి. దేవకికి భిన్నంగా ప్రేమను ఆరాధ్య దేవతగా భావించే బాల్య మనస్తత్వాన్ని గుర్తుకు తెచ్చుకొన్నాను. ఈ మందిర ప్రభావంవల్ల, మా తాతగారు నిహాల్ సింగువలె యోగిగా మారితే ఎంత బాగుండునని ఆశ్చర్యపడేవాణ్ణి లేదా మామేనమామ దయాళ్‌సింగు చెప్పినట్లు భగవంతుని ఆరాధించడానికి కేవలం 'ఒగురూ! ఓహోగురూ!' అని ఉచ్చరిస్తే చాలు. ఇతర సమయాల్లో నాకు ప్రేమ పాత్రురాలైన దేవకి పిన్నికంటె భిన్నంగా సౌందర్యాన్ని భావించసాగాను. ప్రేమకు మారుగా దేవకిని ఆలింగనం చేసుకోవాలనే తలపు రావడంతో, నా ఊహాగానాలు ఆమె చుట్టూ తిరుగుతూ, నా ఆలోచనలు నాకే విపరీతంగా వినుగు పుట్టించాయి 'సౌందర్యం' అనే పదానికి మాపిన్ని నిరుత్సాహభరితమైన రూపాన్ని దర్శించినపుడు, వాస్తవంగా ఆమె వ్యక్తిత్వంలో సౌందర్యం గుర్తుకు వచ్చినపుడు — ఆ రెండింటిలో ఏది మంచి రూపమో నాకు బోధపడేది గాదు. ఈ సంఘర్షణ మధ్య నాకు కొంత ఊరట కలిగేది. ముంతాజ్ కోసం నేను ఎదురుచూసిన జ్ఞాపకాలు గుర్తుకు వచ్చేవి. ఆ క్షణానికి సరిపడే ధోరణిని అలవరచుకొని పదాల జోలపాట ద్వారా ఆభారాన్ని మరవడానికి ప్రయత్నించేవాణ్ణి. నాలో ఈ క్లిష్ట భావ పరంపరతో పెనవేసుకొన్న అహంకారం నేను యింకా పరిపూర్ణత పొందలేదని గుర్తు చేసుకొన్నప్పటికీ, ఈ విధంగానే కవులు తయారవుతారని గ్రహించాను. నేను చిన్నప్పుడు పాఠశాలలో ఉర్దూ కవితా సంకలనంలోను, వాధెన్ మహాశయుని కవితా సంకలనం లోను చదివిన కవుల హోదా, గొప్పతనము గుర్తుకు వచ్చి వారి గొప్ప తనమంతా నాలో ఆవహించినట్లు అహంకారంతో తుళ్లిపడేవాణ్ణి. సౌంద ర్యము, ప్రేమ, రెండు ఆదర్శాల ఆరాధనలో నా భావాలను లిఖిత రూపంలో కాగితంపై పెట్టాలని వుత్సుకత చూపాను. ఆ గీతం పూర్తి కాలేదు. నాలో యింతకు ముందెన్నడు లేని శక్తి నన్ను ఆవహించి, అతిమానుషమైన శక్తి పూనినట్లుగా, లేచి మామిడి తోటవెంబడి, కాలువగట్టుమీద పరుగుతీశాను.

నేను మొగ్గుచూపుతున్న కవితా ప్రపంచానికీ, జ్ఞాన ప్రపంచానికీ మధ్యగల తేడాను గ్రహించగల స్థితిలోకి వచ్చాను. చాలా రోజులవరకు నాలో అశాంతి చోటుచేసుకొంది. నాకు ఈ సమస్య పూర్వంకూడా తటస్థ పడింది. ముంతాజ్ సౌందర్యారాధనవల్ల నాలో కలిగిన నైరా శ్యాన్ని తొలగించుకోవడానికి పంజాబీ భాషలో నాకు కంఠస్థమైన గీతాలు ఆధారమైనాయి. వాటివల్ల నాలో ఏదో ఆత్మీయత చోటు చేసుకొ న్నది. కవితా కన్యకు ఆధారమైన వ్యక్తి నాకు సమీపంలో వున్నందువల్ల, అనంతాకాశంలోకి పక్షిలా నేను ఎగర దలచుకోలేదు. బావి అంచున కూచొని నీళ్లు ఎప్పుడు ప్రత్యక్షమవుతాయా? అని నిరీక్షించే దేవకి పిన్ని కళ్లు తటాలున నా చేతుల్తో మూసేవాణ్ణి. ఈ విధంగా నేను ఆటపట్టించడం ఆమెకు బాగా సరదా కలిగించేది ఆవిడ నా చేతులు మెడమీదికి లాగి, నాకో ముద్దు దానం చేసేది. 'ఎవరైందీ తెలియ నందుకు నాకు తగిన ప్రాయశ్చిత్తమే జరుగుతుంది' అని నటిస్తున్న ధోర ణిలో అనేది.

పదాలకు ఉత్తేజం కలిగించే వస్తువుతో కవితా సౌందర్యానికి ఏవి ధమైన సంబంధమూ లేదనీ, భౌతిక విషయసంపదకు ఆలోచనలు భిన్నమైనవనీ నాకు బడిలో మేష్టార్లు చెప్పారు. ఆ మాటలు నాలో సంఘర్షణకు తావిచ్చాయి. ఈ ఉద్బోధల ఫలితంగా సాధారణ ప్రపంచా నికీ, పాఠశాలలో బోధించే ప్రపంచానికి మధ్య తారతమ్యం అనంతమనీ, ఈ కృత్రిమ వాతావరణానికి అలవాటు పడలేక నేనే సిగ్గుపడ్డాను. ఏ క్షణంలోనైనా అంత్యానుప్రాసకు సరిపడేలా ఉర్దూ కవికి గీతాన్ని అల్లగల సామర్థ్యం వుంది. అది నాకు అలవాటు పడదు.

తోక ఝూడించుకొంటూ, తోక వెంబడి గుండ్రంగా తిరిగే కుక్క వలె ఆ గ్రామం చుట్టూ మాటిమాటికీ తిరగ సాగాను. అస్పష్టత నాలో ఆవరించింది. రహస్యంగా ఆలోచనలు సాగించి, నా స్వాప్నిక లోకంలో రాక్షసులు నన్ను చిత్రహింసలు పెడుతున్నట్లు, నేను అపవిత్ర మైన ఆలోచనలు కలిగినందుకు సలసలకాగే చమురులో కాలుస్తున్నట్లు తోచేది. చెమటలు పట్టి మేల్కొన్నప్పుడు దేవకి నన్ను గాఢంగా హత్తు కొని ఓదార్చేది.

రాత్రింబగళ్ళు ఆ విధంగా బాధలనుభవించిన తర్వాత నేను కూడా జార్జి డబ్లు. యం. రెనాల్డు వలె 'లండను దర్బారు రహస్యాలు' వంటి నవలా సంపుటాలను కూడా వ్రాయగలనని నాకు హఠాత్తుగా తోచింది. ఈ గ్రంథంలో నా ప్రేమమందిరంలో ఆరాధ్య దేవత దేవకి కాగలదు. అవిడ వంటి పాత్రను ఒకదానిని తయారుచేసి, అనంతకు వ్యతిరేకంగా దుష్టస్వభావంగల మహంత నందగిరి పాత్రను సృష్టించి నాలోని భావాలను అప్రణయహృదయంలో జొప్పిస్తాను. ఒక నాటి వుదయం నేను స్నానం చేస్తుండగా నాలో వుత్సాహం పెల్లుబికి నేను రచయితగా ప్రఖ్యాతిగడిస్తే మా పిన్ని నన్ను చిరకాలం ప్రేమిస్తుం దని వింతగా తలపోశాను కాని ఆలోచనఎల్ల కలిగిన ఉత్సాహ తీవ్రత కొన్ని గంటల పాటు నన్ను ఉక్కిరిబిక్కిరి చేసి ఒక్క క్షణ కాలం పాటు కూచుని ఒక్క అక్షరం కూడా కాగితంమీద పెట్టలేక పోయాను. రచయితగా నేను తొడుగుకున్న ముసుగు హటాత్తుగా తొలగి పోయింది. లౌకిక దృష్టిగల రచయితగా నన్ను నేను భావించుకున్నాను. జార్జి రెనాల్డు చిత్రం నా కనులకు కట్టింది. కళ్ళజోడు లేని ఆయన రూపాన్ని వూహించుకున్నాను. ఆయన బృహద్గ్రంథాలన్నింటిపైనా ఆయన బొమ్మ ప్రచురించేవారు. ఈ విధమైన పథకాన్ని ఆలోచించటం ద్వారా నాలో కలిగిన సంతృప్తికి నాలోని భావాలే కారణం. నా కల్పనల ముసుగులో అందులోని పాత్రలు సంఘర్షణలకు అతీతంగా నిలబడగలరు మా అంద రిలో దాగిన సత్యాలు బయట పడగలవు. ఈ విధమైన కధా కధనశైలిని నేను ఎంచుకున్నాను. రెనాల్డు తన కధానాయిక కనుబొమలను వర్ణిం చిన రీతిలో నేను కూడా అతిశయోక్తులు గుప్పించగలను. వర్ణనలు అతి ముఖ్య స్థానాన్ని వహించి ఆయనవలె కేవలం కనుబొమల వర్ణనకు నలభై పుటలు కేటాయించను. అమ్మా, నాన్నలలో వున్న దుర్గుణాలను వారు గుర్తించలేని రీతిలో వర్ణించి నాచుట్టూ వున్న ప్రజలను నేను హేళన చేస్తాను.

ఈ బృహత్ప్రణాళికతో కూడిన నవలా రచన కొనసాగాలంటే నాకు తగినన్ని పొడుగాటి తెల్లకాగితాలు కావాలి. మానాన్న తన ఆఫీసులో వాడు కునే కాగితాల వంటివి కావాలి. అవి నాతో తీసుకు రాలేదు. గురుదాస్

పూరులో మాత్రమే దొరుకుతాయి. నేను లెక్కలు వేసుకుంటున్న నోటు పుస్తకంలో మిగతా భాగంలో ఎందుకు వ్రాయకూడదా? అన్న ఆలోచన వచ్చింది. బహుశా చురంజీలాల్ దుకాణంలో కాగితాలు దొరకవచ్చు. దేవకి నాకు తినుబండారాలకు యిచ్చిన మొత్తంలోంచి డబ్బు బయటికి తీశాను. ఆ పల్లెటూరిలో ఏదీ కొనే అవకాశమే రాలేదు. అదీగాక మానాన్న పిసినిగొట్టు తనం నాచేత ఖర్చుపెట్టించనీయలేదు. నాకళా ఖండ రచనకు కాగితాలు కొందామని నిశ్చయించుకున్నాను. కళాత్మక తృష్ణతో కూడిన ఉన్మాద స్థితిలో ఉత్సాహాతిరేకంతో నాచుట్టూ వున్న ప్రజలను గూర్చిన అద్భుతాలూ, ప్రశ్నలూ, సందేహాలూ, రూపకల్పన చేసుకుంటూ కూర్చున్నాను.

ఈ ఆలోచనలో నేను నెగ్గగల్గితే నాలోని 'అహం' వల్ల కలిగే బాధలను అతిక్రమించి నేను మరో రూపంలో ప్రత్యక్షమై ఇతరులను అర్థం చేసుకోగల వ్యక్తిత్వం సిద్ధిస్తుంది. ప్రజలను సృష్టించిన భగవంతు నిలో ఔన్నత్యం నాకు సమకూరుతుంది.

చురంజీలాల్ దుకాణములో రావుసైజు కాగితాలు దొరక లేదు. వడ్డీ వ్యాపారులూ, ధనవంతులూ, వస్త్రాలూ, ధాన్యం, పప్పు దినుసులూ, కిరసనాయిలు, పట్టణాలలో తయారు చేసే విదేశీ పనిముట్లు మరలూ, చీలలూ, తలుపు గొళ్ళాలు, విద్యార్థులకు కాపీ పుస్తకాలు, పెన్సిళ్ళు, పెన్నులూ, సిరా బుడ్లు, అక్కడ దొరకుతాయి కానీ, తెల్లకాగితాలతో ఎవరికీ అవసరంలేదని చురంజీ నాతో చెప్పాడు. వాళ్ళు తమ లెక్కల పుస్తకాలు పొడుగాటి దళసరి పుస్తకాలలో చిందర వందరగా వ్రాసుకుం టూరు. ఆ వ్రాత వాళ్ళు ఏ విధంగా మళ్ళీ తిరిగి చదువుతారో నాకు బోధపడలేదు.

'అదికాదు తమ్ముడూ నీకు యింత అవసరంగా రావు కాగితాలతో ఏం పని వచ్చింది. మీనాన్న తెలివైన వాడని మాకు తెలుసు. ఆయన సైన్యంలో గొప్ప హోదా కలవాడని తెలుసు ఆ తెలివైన తండ్రికి తెలివైన కొడుకువు నీవు. నీవు కూడా పెద్ద ఉద్యోగస్తుడవౌతావని బీర్ సింగు నాతో చెప్పాడు. ఇక్కడ ఎక్కువ కష్టపడవద్దు. మాష్టార్లు పూర్తి చేయమని యిచ్చిన పాఠాలు ఈ గ్రామంలో వున్న పదిరోజుల్లో

పూర్తి చేసి మిగతా కాలం హాయిగా విశ్రాంతి తీసుకో. దర్జాగా పళ్ళు, ఫలాలు తిని చల్లమజ్జిగ త్రాగి బాగా పుష్టిగా ఎదిగి ఇంటికి తిరిగి వెళ్ళు. అసలే నీవు బలహీన శరీరం కలవాడివి' అని చురంజీ నాకు బోధచేశాడు.

నాకు తెల్లకాగితాలు ఎందుకు కావాలో అతనికి చెప్పటం యిష్టం లేదు కానీ — 'చురంజీ! గురుదాస్‌పూరు నుంచి ఆ కాగితాలు తెప్పించలేవా?' అని పట్టుపట్టాను.

'అసాధ్యమేమీ కాదు. కానీ బీర్ సింగు తన శలవు పూర్తి అయిపోవచ్చిందనీ నిన్ను తనతో జీలం కంటోన్ మెంటుకు తిరిగి తీసుకు వెళ్ళ బోతున్నాననీ చెప్పాడు. ఇంక పది రోజులు మిగిలి వున్నాయి.'

'బీర్‌సింగు ఏదీ? బహుశా అతను గురుదాస్ పూరు వెళ్ళవచ్చు అతని చేత తెప్పిద్దాం.'

'నేనతన్ని పిలిపిస్తాను' అంటూ చురంజీ తన వద్ద పని చేసే కుర్రవాణ్ణి పిలిచి — 'వెళ్ళి బీర్‌సింగును పిలుచుకురాపో.' అన్నాడు.

'త్వరగా' అన్నాను.

'తమ్ముడూ! మీ అనంత బాబాయి గురుదాస్‌పూరు వెళ్ళటం లేదా?' అని ఎదురు ప్రశ్న వేశాడు చురంజీ.

'అతను మా బాబాయి కాదు' ప్రతిఘటించే ధోరణిలో అభ్యంతరం చెప్పాను.

'సరే అతనెవరైతేనేమి?'

'అయితే అతన్ని మా బాబాయి అని పిలవ వద్దు' అని అభ్యంతర పెట్టాను. అలా ఎందుకన్నానో తెలియదు.

'అరే! ఏమిటిది.... నీకు కోపం తెప్పించాలని అనలేదు. నన్ను క్షమించు.'

అప్పటికే బీర్‌సింగు రావటం వినిపించి, అతడు నాకంటతడి చూస్తాడని ముఖం పక్కకు త్రిప్పుకున్నాను అప్రయత్నంగా నా కనుగొలకులలోంచి బాష్పాలురాలి నవ్వుముఖం వెనుక నేను కన్నీళ్ల

తుడుచు కోవటం బీర్‌సింగు గమనించాడు.

'ఏమైంది కృష్ణా! నీవు మా యింటికి వచ్చి వుండవలసింది. మా అమ్మ నిన్ను చూడాలని అంది' అన్నాడు ఆప్యాయంగా

'అనంతాను మా బాబాయి అని అతనెందుకన్నాడో నాకు తెలుసు అతణ్ణి నేను నిందించటం లేదు'అన్నాను.

'చురంజీ! నీవు మా తమ్ముణ్ణి ఏడిపిస్తున్నా వన్నమాట.'ఆప్యాయంగా అన్నయ్య స్నేహితుణ్ణి మందలించిన ధోరణిలో అన్నాడు.

'కృష్ణ చదువుకున్న యువకుడూ ఎదిగిన వాడూ కాబట్టి ఈ విషయాలన్నీ అతడికి అర్థమయి వుంటాయని అనుకున్నాను. ఈ వూళ్ళో ప్రతి ఒక్కరూ అనంత దేవకి చనిపోయిన భర్త స్థానాన్ని ఆక్రమించాడని అనుకుంటున్నారు' అన్నాడు చురంజీ.

'నీవు ఎలా నిరూపించ గలవు?' ఆ మాటకు నాలో ప్రతిస్పందన ఎలావుంటుందో చూద్దామని బీర్‌సింగు అతన్ని ఖండించాడు.

'ఊళ్ళో అందరూ అనుకునే దాన్ని బట్టి'.... ..

చురంజీ ఇంతకుముందు అనంతను మా బాబాయి అని అమాయికంగా అన్నందుకు కొద్దిగా నొచ్చుకుంటే ఈ మాటతో నన్ను అవమానించి నట్లయింది. అతనితో నేను వాదించే స్థితిలో లేను కాబట్టి లోపలనుంచి దుఃఖం వెల్లుబికి కనుగొంతులలో నీరు నిండిపోయింది.

'అరే మూర్ఖుడా? ఏం చేశావో చూడు నీవు కృష్ణ మనసును గాయపరచావని అర్థం చేసుకోలేక పోయావు, అతను ఎదుగుతున్న కుర్రవాడు అతని మనస్సునూ సున్నితమైంది.' అన్నాడు బీర్‌సింగు వాదించే ధోరణిలో.

'కృష్ణా! నన్ను క్షమించు. నా మాటలు నిన్ను గాయపరుస్తాయనుకోలేదు. మీ అమ్మా నాన్నలు కూడా యిలా అనుకొంటున్నారని నువ్వే మొన్న చెప్పావు తెలుసా!' అన్నాడు చురంజీ.

'నిజం కావచ్చు' అన్నాను కళ్లు తుడుచుకొంటూ — 'నేను మా

పిన్నిని ఆరాధిస్తాను. అందువల్ల ప్రజలు అనుకొనే మాటలు నేను విన లేను.' అన్నాను.

'తమ్ముడూ!' అన్నాడు బీర్‌సింగు ఆదుర్దాగా.

'నువు చిన్నప్పుడు బడికి వెళ్లినా, లెక్కలు చెయ్యడం తప్ప మరేమీ నేర్చుకోలేదనుకొంటాను' అన్నాడు బీర్‌సింగు చురంజీని చీవాట్లు పెడుతూ

'అతణ్ణి నిందించి ప్రయోజనం లేదు. దేవకిని గురించి ఈ గ్రామంలో అందరూ అలానే అనుకొంటున్నారు' అన్నాను ధైర్యంగా.

'కాని, అది నిజంగాదు. ఆవిడ బావి తవ్విస్తున్నందుకు గ్రామస్తులంతా కృతజ్ఞతగా వున్నారు. ఆవిడ వ్యక్తిగత జీవితంతో మనకు పనిలేదు....... నీకీ విషయాలు తెలియవు ఆవిడకు చిన్నవయసులో వైధవ్యం ప్రాప్తించింది. ఆమెకు — అన్నాడు బీర్‌సింగు.'

'నేను రావు కాగితాలు తెప్పిస్తాను.' నన్ను ఓదార్చడానికి, నాకోపం పోగొట్టడానికి అన్నాడు చురంజీ — 'మేడమీది కెళ్దాంపద. అక్కడ మామిడిపళ్లు బుట్టెడు వున్నాయి. భోజనం సిద్ధాంగా వుంది. కృష్ణా మనతో కలిసి భోంచేసే అవకాశం ప్రథమంగా లభించింది.'

'లేదు. నేను త్వరగా వెళ్లాలి. పిన్ని నాకోసం ఎదురు చూస్తుంటుంది.' అన్నాను మృదువుగా.

'నేను ఆవిడకు వెంటనే చెప్పి పంపుతాను. మా తమ్ముడు మంచివాడుగదూ! నువ్వు మాయింట్లో భోంచేస్తే నన్ను క్షమించినట్లు'

'సరే! నేను మా కృష్ణను బ్రతిమాలుతాను. మనం మేడమీది కెళ్లి మామిడిపళ్లు చూద్దాం పద.' అన్నాడు బీర్‌సింగు.

సిపాయి బీర్‌సింగు చాతుర్యము, నా ధోరణి పసిగట్టడమూ నా హృదయానికి హత్తుకొంది. వున్నట్లుండి అతను తన భుజాలపైకి నన్ను ఎక్కించుకొని, ఎడం వైపు మెట్లమీదుగా చురంజీ ఇంట్లోకి తీసుకెళ్లాడు. కన్నీటి చారలతో నిండిన నా ముఖంపై నవ్వు విరిసింది.

అన్నము, పెరుగు, తిరగమోతవేసిన కూరలు, మామిడిపళ్లు తిన్న తర్వాత, చురంజీ గదిలో నిద్రపోయాను. నేను లేచేసరికి సాయంకాలమైంది.

సిపాయి బీర్‌సింగు నాకోసం వేచి వున్నాడు. చురంజీ,- బీర్‌సింగు, మరో యిద్దరు వ్యాపారులు పేకాట ఆడుకొంటున్నారు.

'కృష్ణకు మీగడపాలు తెచ్చి యివ్వు' మాకు మధ్యాహ్న భోజనం వడ్డించిన ముదుసలితో చెప్పాడు. 'నేను కృష్ణను మఠంవద్ద వదలిపెట్టి వస్తాను.'

'అక్కర్లేదు. మీరు ఆడుకోండి. 'లస్సీ'తాగి నేను నడుచుకొంటూ వెళ్లగలను.'

'ఆ మాటలు నేను వినలేను' చేతులో పేకముక్కలు విసిరివేస్తూ, మిగతా స్నేహితులకు కోపం తెప్పించేలా అన్నాడు బీర్‌సింగు.

'అతను ఆటలో ఓడిపోయి డబ్బు పోగొట్టుకొంటున్నాడు. అందుకని వెళ్తానంటున్నాడు.' ఒక వ్యాపారి ఎద్దేవా చేశాడు.

'సరే. నువ్వు వెళ్లు. నేను యితనికి గుణపాఠం చెప్పి వస్తాను.' అన్నాడు బీర్‌సింగు కోపంగా.

ఆ పరిస్థితి గమనించి, అక్కడినుండి బయులుదేరాను.

సగం నిద్రలో లేచిన బద్ధకం నాముఖంమీద ప్రస్ఫుటమవుతోంది దేవకిని గూర్చి నవల వ్రాయాలని సంకల్పించడం తొందరపాటు ఆలోచనగా తోచింది. ఆవిడకు మరో ప్రేమికుడున్నాడనీ, నేనావిడకు దూరమవుతున్నాననీ నా ఐహిక వాంఛలకు కష్టంగా తోచింది. రావుసైజు కాగితాలు దొరకలేదనే విసుగు నాలో వున్నప్పటికీ, నాచేతిలో కాగితం వున్నా నా పథకం వృధా అవుతుందని నా అంతరాత్మకు తెలుసు. నేను ఆరాధించే దేవకిని గురించి నాకు తెలిసినదంతా వ్రాయడానికి తగిన ధైర్యం నాలోలేదు. ఈ విధంగా నాలో కలిగిన సుందర భావన కకావికలై పోవడంపట్ల చింతించాను నిజాన్ని ఎదుర్కొనే స్థితిలో లేను. నాలోని అస్థిరత కోరికల మధ్య నేను సతమతమవుతున్నట్లు భావన కలిగింది.

స్వానుభవాన్ని అవగాహనా పథంలోకి మార్చగల శక్తిని సంపాదించి, నాధ్యేయాన్ని ఏదో ఒకనాడు చేరుకోగలననే నమ్మకం కలిగింది.

బావిగట్టుమీద కూచొని దేవకి పిన్ని, నన్ను చూడగానే చిలకరించిన చిరునవ్వులు నాలో అశాంతిని పోగొట్టాయి.

'త్వరగా రా! ఎక్కడి కెళ్లావు..... నీళ్లు .... యింతకాలం ఎదురుచూసిన నీళ్లు బయటపడ్డాయి.'

'ఎక్కడ?' అరిచాను.

ఉద్రేకంతో ఆమె దగ్గరగా వెళ్లి కూలీలు తవ్వుతున్న లోతైన గొయ్యిలోకి చూశాను. కళ్లు బాగా విచ్చుకొని లోపలికి చూశానుగాని ఆ చీకట్లో ఏమీ కనిపించలేదు.

'60 అడుగుల లోతులో బిడ్డా! తేమ కనిపించింది. త్వరగా బురద తీసివేస్తే నీళ్లు వుబికి వస్తాయని గండాసింగు బెబుతున్నాడు. కొబ్బరి కాయ, కుంకుమ, లడ్లు పట్టుక రమ్మని పంపాను. నువ్వు వాటిని ఈ కూలీలకు పంచు.. గండాసింగు నిన్ను భుజాలమీద తీసుకెళ్తాడు.' అని ఆమె నన్ను గాఢంగా హత్తుకొని అంది.

నాలో ఒకప్పుడు చోటుచేసుకున్న గర్వాతిశయము, దర్పము తొలగిపోయి, ఈ భూమి అంతరాళాల్లో చెమటోడ్చి కష్టించి పనిచేసినవారిపట్ల సానుభూతి కలిగింది. వీరికంటె మహంత నందగిరి, నేను, కొంతవరకు దేవకి మెరుగు. వీరిపై అంతా ఆధారపడి వుంది. వాళ్లకు పంచిపెట్టిన ప్రసాదం తిని, త్రవ్వడం కొనసాగించారు. వాళ్లు గునపాలతో తవ్వుతూ వుంటే, వారి కండలు తిరిగిన భుజాలు నాకు ఆసక్తి కలిగించాయి.

'మేస్త్రీ! ఈ కుర్రవాణ్ణి నేను పైకి తీసుకెళ్తాను గునపం తగులుతుందేమో!' అన్నాడు వారిలో ఒకడు.

ఆ మాటలతో నాలో అతిశయం కొంత తగ్గినట్లయింది. అతని భుజాలపై వెళుతూ, నవాబు కొడుకులాగా యితరులపై మెడలపై కూచొని పోవడంకన్నా, నాఅంతట నేను వెళ్తే బాగుండేది అనుకొన్నాను.

అతను నన్ను పైకి తెచ్చాడు. మిగిలిన ప్రసాదాన్ని, అనంత తెచ్చి యిచ్చిన ప్రత్యేకమైన సిల్కు వస్త్రాలను దేవకి ద్వారా మహంత నందగిరి పుచ్చుకోవడం గమనించాను.

మనిషికి, మనిషికి మధ్య వున్న వ్యత్యాసాన్ని తైపారు వేసి చూశాను. ధనస్వాములు అధిక భాగాన్ని పొందుతుంటే, నిరంతరం శ్రమించే పేదవారికి తృణమో, పణమో మిగులుతోంది. ఈ అభి ప్రాయం నాలో తరగని సెగలను రగిల్చింది. దేవకి పిన్ని నన్ను ఒక పవిత్ర సాధువు స్థితికి ఎదిగేలా దారి చూపుతుంటే, నేను బుద్ధిమంతు డైన, విద్యాధిక వ్యక్తిగా నటించసాగాను.

ఆ రోజు మొదలు, పేదవారిని, అస్పృశ్యులను తమ ఉన్నత కులంపేర, విద్యాధిక మనస్తత్వంచేత దోపిడీ చేయడం చూశాను. మా నాన్న, ఆయన స్నేహితులు, వ్యాపారులు, బంగారు నగలు ధరించిన వారి భార్యలు — అంటే నాకు ద్వేషం ఏర్పడింది.

బావి అడుగువైపు చూస్తున్నప్పుడు దేవకి ముఖంమీద నిరంతరం తారసిల్లే కోపదృష్టి తగ్గిపోవడం చూసి తృప్తి కలిగింది. గునపాలతో తవ్వుతూ పోతుంటే తేమ అధికమై కొద్దిరోజులకు, నీటిబుగ్గ వెలిసిం దని సర్దార్ గండా సింగు చెప్పడంతో మా పిన్ని ముఖంలో చిరునవ్వులు వెల్లివిరిశాయి.

దేవకి వ్యక్తిగత సౌందర్యానికి ఈ ఆధ్యాత్మిక పరివర్తన ప్రకా శాన్ని తెచ్చిపెట్టింది. ఆవిడ మామూలు ధోరణిలో సరదాగా, నన్ను హత్తుకొంటూ, నా నుదుటిమీద ముద్దులు పెడుతూ, నా కొంటె పేరుమీద వ్యర్థగీతాలు పాడుతూ యిక్కడనుండి వెళ్లాలని గ్రహించాను. ఆవిడను నేను యింతకుముందు కంటె ఎక్కువగా ప్రేమిస్తాన్నాననీ, ఆవిడకు దూరంకావడమనే భయంకరమైన ఆలోచనను సహింపలేననీ తెలిసి వచ్చింది. జీవితంలో అనుభవింపడానికి ఎంతో ఉందని తోచింది. మామిడపళ్ల కాలం యింకా కొనసాగుతోంది మందిరంలో దైనందిన కార్యక్రమంలో భాగంగా లభించే భోజన పదార్థాలు సరిగా లేకపోవ డంవల్ల విసుగు పుట్టిస్తోంది. అండ ల్లో తాను స్వయంగా వంట

మొదలెడదామని పిన్ని సంకల్పించింది. పల్లెటూరి వాతావరణంనుండి మార్పుకోసం మేము గుర్రంమీద గురుదాసపూర్ వెళ్లి కొన్ని సామాన్లు కొని తెస్తే బాగుంటుందని సూచించింది. నగరానికి వెళ్లి రావు సైజు కాగితాలు తీసుకొని వస్తే, నేను సంకల్పించిన నవల వ్రాయడానికి అనుకూలంగా వుంటుందని నాలో లోపల గాఢంగా భావించాను. ఇతివృత్తం నా నరనరాల్లో వుడుకిపోతూ, అనంత కథానాయకుడుగా, నందగిరి ప్రతినాయకుడుగా కథ మలుపులు తిరుగుతోంది. జీలంకు తిరిగి వెళ్లడానికి ఉత్సాహంగా లేదు. ప్రేమాస్పద మనస్తత్వంలేని అమ్మానాన్నల దగ్గరకు, ఎప్పుడూ ఉద్రేకంచూపే గణేశ్ వద్దకు వెళ్ల బుద్ధి కావడంలేదు. నాన్న అరుపులు, గదమాయింపులు, మధ్యాహ్న వేళలో చదువుకోవడం, ఎప్పుడూ తిన్నతిండి తినడం విసుగు పుట్టిస్తోంది.

ఇక్కడ సుందర వాతావరణంలో కొండలు, లోయలు, విశాల వృక్షాలు, సైలయేళ్ల మధ్య తిరుగాడుతూ వుంటే, కొత్త కవిత్వం వ్రాయడానికి ఆలోచనలు వుబికి వస్తాయి. నేను వ్రాయదలచుకొన్న బృహత్తర నవలారంభానికి పునాది యింకా మొదలుకాలేదు.

భవిష్యత్తును గురించిన భయం నాలో పెనగులాడుతుండగా నాన్న దగ్గరినుండి వున్నట్లుండి దేవకికి వుత్తరం వచ్చింది. అమ్మానాన్న యాత్రలనుండి తిరిగి వచ్చామనీ, నేనొక్కడినే ప్రయాణంచేసి తిరిగి వెళ్లడం కష్టం గాబట్టి, బీర్‌సింగు సెలవు అయిపోయి తిరిగి వస్తాడు గాబట్టి వచ్చే ఆదివారం నన్ను అతనితో పంపవలసిందిగా వ్రాశారు.

దేవకికి నాన్న జిలుగుగా వ్రాసిన ఉత్తరం చదివి మూగపోయాను. ఆఖరి పదాలు చదువుతుండగా గొంతులో గద్గదికత ఏర్పడింది. ఆ మరునాడు శనివారం. దరివాల్‌లో ఆదివారం ఉదయం రైలు వేళకు చేరుకోవాలంటే, శనివారమే యిక్కడినుండి బయలు దేరాలి.

దేవకి నన్ను వొళ్లోకి తీసుకొని పక్కమీద చేరి కంట తడిపెట్టింది. నన్ను లేవదీసి బుజ్జగించి, తల నిమిరి, మెత్తని మాటలతో భోజనంపెట్టి, నా పక్కనే కూచొని సముదాయించింది.

నేను సాయంకాలం నిద్ర లేచేసరికి ఆవిడ నా పక్కమీద లేదు.

బావిగట్టుమీద కూచొని సిపాయి బీర్‌సింగుతో మాట్లాడుతోంది.

'బాబూ! బీర్‌సింగు అన్నయ్యకు కూడా ఉత్తరం వచ్చింది.' అంది.

'తమ్ముడూ! రేపు పొద్దు పొడిచేసరికి నీవు తయారుగా వుండు నీవు మహంత గుఱ్ఱంమీద, చురంజీ గుఱ్ఱంమీద నేను బయలుదేరి రైలు వేళకు చేరుకుందాము.... మీ నాన్నగారికి నీకు మామిడి పళ్లు తీసు కొద్దామని వచ్చాను. నీసామాన్లు సర్దుకొని సిద్ధంగా వుండు.' అన్నాడు బీర్‌సింగు.

'గురుదాస్‌పూరులో బట్టలు కుట్టిద్దామనుకొన్నాను— కృష్ణకు '— అంది పిన్ని.

'ఫర్వాలేదు. అక్కడ అదీ మీ యిల్లే అక్కడ మామూలుగా తిండీ, బట్టా కొరవలేదు.' అన్నాడు సహజ సిద్ధమైన మృదుసరళిలో బీర్‌సింగు.

'బాబాయ్. బొంబాయినుండి అమ్మా, నాన్న నాకు అమెరికన్ తరహా టోపీ తెచ్చివుండకపోతే, నువు డబ్బులివ్వాలి ' అన్నాను ఆశ, సిగ్గు, లజ్జ ముప్పిరిగొనగా.

'అది పెట్టుకొంటే నువు అచ్చం తెల్లదొరలా వుంటావు నిన్ను చూస్తే నాకు భయమేస్తుంది. ' నవ్వులాటకు అన్నాడు బీర్‌సింగు.

'అమెరికన్లు దాన్ని ధరిస్తారు. నిజమే ఎండవేడినుండి బాగా రక్షణ యిస్తుంది.' అన్నాను.

'తప్పకుండా బాబూ! సూటు, టోపీ రెంటికీ సరిపడే డబ్బు యిస్తాను. నాబిడ్డవైన నీవు డిప్యూటీ కలెక్టరు హోదాకు ఎదిగితే చూడాలని వుంది. బహుశా అప్పుడు నువ్వు ఈ పిన్నిని మరిచిపోతావు. ఆమె నీ బంగళాకు వస్తుంది. నిన్ను ఆలింగనం చేసుకొని ఏడుస్తుంది.' అంది పిన్ని ఆసక్తికరంగా.

ఈ మాటలు అంటూ ఆమె నన్ను పొదివి పట్టుకొని, ఆమె వైధవ్య సూచకమైన తెల్లచీరలో తలదాచుకొంది

# 7

గ్రామీణ వాతావరణంలో స్వేచ్ఛగా సంచరించిన ఉత్సాహాతిశయం అక్కడి భూమి, గాలి, వెలుతురు జ్ఞాపకాలతో నాపై చెరగని ముద్ర వేసింది. కంటోన్ మెంటులో అలవాటుపడ్డ దినచర్య సమయంలో ఆ జ్ఞాపకాలు నన్ను చుట్టుముట్టాయి. కనోవాలో ఎదిగిన కుర్రవాణ్ణిగా నాలో పొంగిపొరలిన ప్రేమ ఇప్పుడు తీపి బాధగా మిగిలిపోయింది. అక్కడ నైరాశ్యాన్ని పోగొట్టుకోవడానికి మామిడి తోటల మధ్య నేను గుర్రపు పిల్లలా పరుగులు తీసే వాణ్ణి. వడ్డీ వ్యాపారుస్తుని ఉదారం పైకి కనిపించి నంతగా మంచిదికాదు. అతడు ఐదువందల శాతం లాభాల కోసం కలలు కంటాడు.

యుద్ధానికి మరికొంత సైన్యాన్ని పంపించాలనే తాజావార్త కంటోన్ మెంటులో ప్రబలమైంది. ఆ వార్తవిని తనను ఈజిప్టుకు పంపుతారే మోనని నాన్న కంగారు పడసాగాడు. ఆయన తన ఆదుర్దాతో కూడిన మానసిక స్థితిలో మాకు బోధచేసేవారు. ఒకవేళ ఆయన యుద్ధానికి వెళ్ళవలసి వస్తే మేము రోజంతా అసలే ఆడుకోకూడదని ప్రతి పాఠ్యభాగమూ శ్రద్ధగా చదివి కుటుంబానికి గౌరవం తీసుకురావాలనీ చెప్పేవారు. మేము డబ్బుగల న్యాయవాదులమూ, సహాయ కమీషనర్లూ, డాక్టర్లూ కావాలని ఆయన కోరిక. ఇంట్లో శ్రద్ధగా చదువుకోవాలనే క్రమశిక్షణను ఆయన సైన్యంలో వలె మాపై రుద్దటం నాలో నైరాశ్యం తెప్పించింది. నవలలు చదవటం పూర్తిగా నిషేధించబడటం వల్ల, దేవకిమీద నేను కళాఖండంవంటి ఒక నవలను వ్రాసే ఆలోచన మరుగున పడింది. పిన్ని నాకు జేబు ఖర్చులకు యిచ్చిన దాంట్లోంచి ఒక రూపాయి శివకు యిచ్చాను. వాడు అమాయకంగా గణేశ్ తో చెప్పాడు. గణేశ్ నాన్నకు చెప్పాడు. నాదగ్గర వున్న డబ్బంతా అమ్మదగ్గర దాచుకోవలసిందనీ బజారులో ధూళిధూసరితమైన తినుబండారాలు కొని ఆరోగ్యం చెడుపుకోవద్దనీ, డబ్బు పాడుచేసుకోవద్దనీ నాన్న హెచ్చరించాడు. గ్రామీణ వాతావరణంనుంచి వికసించిన ముఖంతో వచ్చిన నాలో క్రమక్రమంగా

సాధారణ జీవితంలోని మాంద్యంవల్ల తేజం సన్నగిల్లింది.

కవాతు మైదానం మూలల్లో ప్రశాంతంగా వున్న చోట వంటరిగా రహస్యంగా ఆడుకోసాగాను. ఇస్మతుల్లాతో కలిసి అతని అన్న తుపాకిని దొంగతనంగా తీసుకెళ్ళే పథకం వేసి జింకలు వేటాడటానికి వూర కుక్కలను పిచ్చుకలను చంపటానికి పూనుకున్నాను. సిపాయిలు తీరిక వేళల్లో అలా చేయటం చూశాను. మట్టిలో కన్నం చేసుకుంటూ లోలోపలికి వెళ్ళే పురుగులా నేను కూడా ఆలోచనా తరంగాలలో తేలియాడి నేనూహించిన ప్రబంధ వాతావరణాన్ని వెదకసాగాను. కనో వాలో నాకున్న స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు నాకు లభిస్తే, అద్భుతమైన కవిత్వం వ్రాయగలను. చిత్రాలు గాయగలను ఏ విధమైన ఖర్చులేకుండా శివకు అత్యద్భుతమైన బొమ్మలు తయారుచేసి పెట్టగలను. నాపనిలో కలిగిన స్వాతంత్ర్యం వల్ల వెల్లువికిన ఉత్సాహంతో ఈ పనులన్నీ చేయ గలను. క్రమశిక్షణగా బడికి వెళ్ళటం, ఇంట్లో పాఠాలు చదువుకోవడం నాకు విసుగు పుట్టించి చెడ్డపనులు చేయటానికి కాలాన్ని దొంగలించే మనస్తత్వం కలిగించింది.

'ఓ ప్రియమైన దేవకీ! ఇక్కడికి వచ్చి నన్ను తీసుకెళ్ళు. నన్ను నీకొడుకుగా ఎందుకు స్వీకరించవు? అలా చేస్తే నేను ఈ డబ్బుకు దాసోహమనే కుటుంబం కోరలలోంచి బయట పడతాను. వీరికి హోదా తప్ప మరొకటి తెలియదు. నేను ఎదిగి పెద్దవాణ్ణై కవిత్వం వ్రాయటం, వేదాంతిని కావటం లేదా దేవదత్త బాబాయిలాగా గణిత శాస్త్ర వేత్తను కావటం తథ్యం' అంటూ అంతరాత్మలో ఆవేదన పడ్డాను.

ఇంతకు ముందు కంటె నాకుటుంబం నుండి విడివడిపోయినట్లుగా భావించసాగాను. న్యాయవాదిగానో, సహాయ కమీషనరుగానో పెరిగిపో యినట్లు నాదృక్పథం మారి పోయింది. పిసినారితనం, అసహనమూ, కోపమూ, జీవితంపై విరక్తి పెరిగి పోయాయి.

నా చుట్టూవున్న వారిలో, వూడ్చే పిల్లవాడు బాకాకు రహస్యాలు చెప్పాకోవాలనిపించింది. అతడు స్వయంగా పాటగాడు. పంజాబీ కవులు బుల్లే సాహెబు, ఫరీదు కవితలు అతనికి కంఠస్థంగా వచ్చు. వారిస్‌షా

రచించిన హీర్ రంజాలోంచి వల్లించగలడు.

అతడు తన గురించి గొప్పగా భావించగలడనుకొని, నాకు ఆంగ్ల భాష కొంతవరకు వచ్చు గాబట్టి, ఆడుకోవడానికి ముందు రోజూకోగంట అతనికి ఆంగ్ల పాఠాలు చెబుతానని చెప్పాను

'తమ్ముడూ! నీ వచ్చీరాని యింగ్లీషు మాటలు, నీ తెలివితేటలు, నాకు తెలుసు. మానాన్న యింట్లో లేనప్పుడు నువ్వు పెద్దపెద్ద యింగ్లీషు పుస్తకాలు చదవడం చూశాను. మీ యింటి ముంగిట చిమ్మడానికి వచ్చినప్పుడు, వరండాలోంచి, మీ అమ్మకు కనిపించకుండా ఇంట్లోకి తొంగి చూస్తుంటాను. నువు పరుపుమీద పడుకొని, పెద్దపెద్ద పుస్తకాలు చదువుతుండటం చూసి ఆశ్చర్యపోతాను. నీ తెలివితేటలపట్ల అసూయ కలుగుతుంది కూడా. నీవొక పెద్ద మేధావివి కాబోతున్నా వని అందరి నమ్మకం. నీతో పోటీపడటానికి నేనెంత వాణ్ణి నేను కేవలం వూడ్చేవాణ్ణి నా తమ్ముడు రాఖాను పెంచి పెద్దవాణ్ణి చెయ్యాలి. చెల్లెలు సోహనీకి పెళ్లి చెయ్యాలి నా చిరకాల వాంఛ అయిన జ్ఞానాన్ని నువ్వు నాకు ప్రసాదించావు అది నా జీవిత ధ్యేయం. దళంలో సిపాయిలతోగాని, నగరంలోగాని చదువుకోవడానికి పాఠశాలలో నాకు ప్రవేశం లేదు.. పాఠానికి పావలా చొప్పున తీసుకోవడానికి నీవు అంగీకరిస్తే, నీవద్ద చదువుకోవడం నాకిష్టం ' అన్నాడు.

అతడు అంత పెద్ద ఉపన్యాసం యివ్వడానికి అవకాశమిచ్చాను. అతడు చెప్పిన మాటలు నన్ను కదిలించి వేశాయి. అతని జీవితంలోని ఆశయాలను నేను కదపగలిగినందుకు నాలో నాకే ఆశ్చర్యం వేసింది.

అతడు అస్పృశ్యుడు కావడంవల్ల అతనికి చదువుకొనే అవకాశం మృగ్యం కావడమనే అంశం నా నరనరాల్లో వణుకు పుట్టించింది.

'తమ్ముడూ! నాకిచ్చే డబ్బు గురించి నువ్వు మరిచిపోతే, నేను నీకు పాఠలు మొదలెడతాను. డబ్బును గూర్చిన మాటలు నాకు అసహ్యం పుట్టిస్తాయి. మాయింట్లో డబ్బును గురించి తప్ప వేరే మాటలేదు. మా యిల్లంటే నాకు అసహ్యం.'

'కృష్ణా! నీకు పావలా యివ్వడంవల్ల దాని విలువ నాకు తెలిసివ

స్తుంది.' అన్నాడు బాకా.

అతని మాటల్లో సత్యం నాకు అర్థం అయింది. ఈ విధంగా నా జేబు ఖర్చులకు కొంత డబ్బు సమకూరుతుందనుకొన్నాను. నా సాను భూతికి తోడు మానాన్న మాకు బోధించిన డబ్బుమీద మమకారం నాకు దోహదం చేసింది.

'సరే! ఈ విషయం రెండో కంటికి తెలియకూడదు..... ముఖ్యంగా గణేశ్‌కు. వాడు అసహనంకొద్దీ మా అమ్మానాన్నలతో అంటాడు.' అన్నాను అతని వాదనకు అంగీకరిస్తూ

'అతడికి నీమీద ద్వేషమెందుకు? అతడు పెద్దమనిషిగా నాకంటికి కనిపిస్తాడు.' అన్నాడు బాకా.

అతని తటస్థ ధోరణి నాకు కోపం తెప్పించింది.

'వాడి కుళ్లబోతుదనం నీకు తెలియదు నామీద వాడు ఈమధ్య చాడీలు చెప్పాడు.' అన్నాను రక్తం వుడుకెక్కి పోతుంటే.... దేవకి పిన్ని నాకిచ్చిన డబ్బు నేను ఏ విధంగా వాడి ప్రవర్తనవల్ల పోగొట్టు కొన్నదీ సవివరంగా చెప్పాను.

'అయితే మానాన్నవలె మీనాన్న కూడా క్రూరుడు. .... కాని, మేము అమాయకులమైన వూడ్చే వాళ్లం. మీరు చదువుకొన్నోళ్లు. నేను చీపురు పట్టుకొంటాను గాబట్టి మురికి వాణ్ణే అని సిపాయిల ఉద్దేశం.'

బాకా యింకేమీ మాట్లాడ లేదు. తన కాకీ చడ్డీకి చేతులు తుడుచుకొని, నాతలపై చేయిపెట్టి నిమిరాడు

నాకు ఏడుపు వచ్చినంత పని `అయింది

'నువు చీపురు పట్టుకొంటే ఏం? నువు వారిస్‌షా కవితలు వల్లించ గలవు?' అన్నాను బిగ్గరగా.

'తమ్ముడూ! వాళ్లకు కవిత్వంమంటే గిట్టదు ఎవరైనా చూస్తారు. ఏడవకు. ధైర్యంగా ఉండు నేను యింకా యిలాంటి అవమానాలు ఎన్నో భరించాలి. శివుడు విషం మింగి గరళ కంఠుడైనట్లు నేను యివన్నీ

దిగమింగాలి...... నేను నిన్ను రక్షిస్తాను. మా గురువుగారి మీద ఎవరైనా వేలెత్తి చూపారా వాళ్ల భరతం పడతాను.'

'నా బాధలు మీకు తెలియవు' అన్నాను.

'అన్నీ నాకు చెప్పు. అన్నీ పూర్తి అయిందాకా ఆడుకోవడానికి వెళ్ల వద్దు.'

ఇది ఆసరాగా తీసుకొని, దేవకిపిన్ని డబ్బును గూర్చి మా యింట్లో జరిగే చర్చ అంతా అతనికి చెప్పాను.

నేను ఈ కథ చెప్పడం పూర్తి అయిన తర్వాత, అతను మళ్లీ నా తలమీద చేయివేసి నిమురుతూ — 'ఇదేం పెద్ద కష్టం. దీన్ని గురించి బాధ పడకు. బౌద్ధ మతం చెప్పినట్లు జీవితం దుఃఖమయం. ఈ పెద్ద ప్రపంచంలో అంతకు మించిన కష్టాలు ఎదురవుతాయి. మనం ధైర్యం వహించాలి. ఏడవ కూడదు. ఈ నాటినుండి నువు నాకు ఉపాధ్యాయుడివి. నేను నీ శిష్యుణ్ణి. నిన్ను గురువుగా ఆరాధిస్తాను.'

'నేను నీ గురువును కాదు. మూఢ విశ్వాసాలతో మగ్గిపోయే మతంలో నాకు నమ్మకం లేదు. కులాల ప్రసక్తిలేని క్రైస్తవ మతంలో నీవు చేరడం నాకిష్టం. అందులో మత బోధకులు అమెరికా తీసుకెళ్తారు. నేను కూడ అమెరికా వెళ్లాలనుకొంటున్నాను.' అన్నాను.

'ఒక్కొక్కసారి క్రైస్తవ మతం స్వీకరిద్దా మనిపిస్తుంది—' అన్నాడు బాకా.

'నీకు దేవుడంటే నమ్మకమా?'

'మనకు తెలియని అతీతశక్తి ఏదో ఉంది.'

'దేవుడనే వాడుంటే, నిన్ను అస్పృశ్యుడుగా పుట్టించిన అతడు నిర్దయుడు.'

'అలా అనుకోకు తమ్ముడూ! అతని మాటలు ఎదిరించినందుకు నీ మీద ప్రతీకారం తీర్చుకొంటాడు.' అన్నాడు బాకా.

ప్రపంచంలోని అన్యాయంపట్ల నాలో తీవ్రమైన అసహనం పెరి

గిపోయి — 'నా మీద దేవుడికి కోపం రావడానికి అతని మీద ఉమ్మివేస్తున్నాను.' అన్నాను.

నా గుండెలో గుబులు వల్లనో, నేను ఎక్కువగా తిన్న మామిడి పళ్లవలననో, ఏదైనా అంటువ్యాధి పట్టుకొన్నదో, లేక భగవంతుణ్ణి ఎదిరించినందు వల్ల ప్రతీకారం వల్లనో, నా తలమీద చిన్న చిన్న గుల్లలు కురుపుల్లా మొలిచాయి. అమెరికనువలె ఉండటానికి నేను క్లైయిటును దగ్గర తీసుకొన్న టోపీవల్ల ఈ కురుపులు లేచాయని అందరూ అంటారు. అమ్మ, నాన్న మాత్రం అది విశ్వసించరు. మా అమ్మ, నాన్నల్లో ముఖ్యంగా అమ్మ, దీనికి కారణం బాకా మురికి చేతులని నమ్ముతోంది. అతనికి నేను ఆంగ్లపారం చెబుతున్నాను గాబట్టి, అతని ద్వారా ఈ వ్యాధి సంక్రమించిందని ఆమె మతం, నాలో జ్వలిస్తున్న అగ్ని జ్వాలలు ఇలా తలపై ప్రత్యక్షమయినాయని నా నమ్మకం

ఆ మరుసటి ఆదివారం దళానికి చెందిన క్షౌరకారుడు రాము మా నాన్నకు క్షౌరం చేసిన తర్వాత నన్ను కూడ కూచోబెట్టారు. కురుపులకు మధ్యలో జాగ్రత్తగా వెంట్రుకలను కత్తిరించి, నేను ప్రియంగా పెంచుకొన్న జుత్తును కత్తిరించారు.

నా కాళ్లకింద పరిచిన తెల్లని దుప్పటి మీద నేను ఆప్యాయంగా పెంచుకొన్న జుత్తుపడినప్పుడు నేను ఏడ్చాను. కురుపులకు రాము కత్తి వాదర తగిలినప్పుడు మరింత బాధవేసి ఏడ్చాను. ఇది అదనుగా తీసుకొని నాన్న నాకు ఉపదేశం చేశాడు కుటుంబ వ్యవహారాలు క్రమంగా దారిలోకి వస్తున్న సమయంలో నేను మొత్తం కుటుంబానికి ఇబ్బంది కరమైన యిలాంటి పనులు చేస్తున్నాననీ, ప్రతి చిన్నదానికీ ఏడుపు లంకించుకొంటాననీ, కనోవాలో నాన్నా గడ్డితిని ఆరోగ్యం చెడుపుకొని, జులాయిగా తిరిగాననీ చివాట్లు పెట్టారు.

'మనం మొక్కుకున్నట్లుగా బదరీనాథ్‌కు మీరు నన్ను తీసుక పోక పోవడం వల్ల ఈ అరిష్టాలు వస్తున్నాయని' అమ్మ నాన్నతో వాదించింది.

'నీకు పిచ్చిపట్టలేదుగా!' ఆశ్చర్యంగా అన్నాడు నాన్న.

ఇలా మాట్లాడుకొని, ఆయన లౌక్యం ఉపయోగించి నన్ను అను

పత్రికి తీసుకెళుతూ..... 'అక్కడ మనకు మంచి స్నేహితుడయిన డా. చుమన్‌లాల్ ఉన్నాడు. రా! నాతో పరుగెత్తు ఇంకా చంటిపిల్లవాడిలా ఏడవకు.' అన్నాడు

'తలమీద గుడ్డ చుట్టుకో '

డాక్టరు చునీలాల్ గుండ్రటి శరీరం, సుందర విగ్రహం, బోళా తనం నాకు బాగా తెలుసు. నాకు బాగులేనప్పుడు పరిచయం అయ్యాడు.

'బాబాయ్! మీ కుర్రవాడు బాగులేకపోతే మేము గుర్తుకువస్తాం. స్నేహితులు జ్ఞాపకానికి రారు. అంత మరీ కష్టపడి పనిచేయ గూడదు. మీ కష్టాలకు సరిపడ్డ జీతం ఆంగ్ల సర్కారువారు మీకివ్వరు.' అన్నాడు డాక్టరు నాన్నను చూస్తూ. చిరకాల స్నేహం గుర్తుకు తెచ్చుకొని.

"డాక్టరు గారూ! ఈ మధ్య నామీద గొడవలన్నీ తీరి, వీళ్ల అమ్మతో తీర్థయాత్రలకు వెళ్లి వచ్చి యిప్పుడిప్పుడే గాలి పీల్చుకొంటు న్నాను. ఇప్పుడున్న దొరలందరూ నీచులు. ఈజిప్టునుండి తిరిగి వచ్చిన మేజరు ట్రయల్ ఇప్పుడు దళాధిపతి. అతనికి మెల్లకన్ను, క్రూర స్వభా వము ఆ ఓజిల్వీ సాహిబ్ ఒక మూర్ఖుడు, కానీ, పెద్ద మనిషి. ఈ డోగ్రా అధికారుల కుట్రలలో పాపం అతను బలి అయ్యాడు."

'పశ్చిమ ప్రాంతంలో ఇంగ్లీషు వారికి ఎదురుదెబ్బ తగిలినట్లుంది?' గొంతు తగ్గించి చెవిలో చెప్తున్నట్లుగా అన్నాడు చున్నీలాల్

'వాళ్ళు టర్కీవారిని చితగ్గొట్టారు అమెరికా వారి సహాయం దొరకటంతో జర్మనులను కూడ తరిమి కొట్ట గలరు.'

చున్నీలాల్ హఠాత్తుగా మాట మార్చాడు— 'ఈ కోతి పిల్లకు ఏమైందేమిటి?'

'ఉన్నట్లుండి నెత్తిమీద కురుపులు లేచాయి వీడితో నాకు ఒకటే బాధ. వాడి పదునైన మెదడు ఎప్పుడూ ఏదో ఒకటి ఆలోచిస్తూనే వుంటుంది. వీడికి ఆ చంద్రుడు కావాలి. ఆ కోతి ముఖం చూడండి ఎలావుందో?'

'మీ కొడుకులు ముగ్గురిలో ఇతను మరీ సున్నితం' అన్నాడు డాక్టరు.

'నిజంగానే. ప్రతి చిన్నదానికీ ఆడ పిల్లలా గోల చేస్తాడు' అన్నాడు నాన్న.

'ఏది నాన్నా! యిటు చూపించు నేను నయంచేస్తాను' అన్నాడు డాక్టరు నావైపు తిరిగి.

'తల అంతా అసహ్యంగా వుంది. వీడి వెంట్రుకలన్నీ పోతాయేమోనని నా అనుమానం!' నాన్న బాధపడుతూ అన్నాడు.

'లేదు' డాక్టరు నా తలమీద కురుపులు తవుడుతూ— 'ఎవరక్కడ?' అన్నాడు.

ఆసుపత్రిలో నుంచి ఒక డోగ్రాసిపాయి బయటకు వచ్చి నాన్నకు శ్రద్ధగా నమస్కరించాడు.

'ఎలావున్నావు రఘునాథ్? నీకీమధ్య ప్రమోషను వచ్చిందా? హవిల్దార్ అయ్యావా?' అడిగాడు నాన్న.

'అయ్యా! అంతా తమ చేతుల్లో వుంది. తాకట్టుపెట్టిన భూమి విడిపించు కోవాలంటే నాకు ఇప్పుడొస్తున్న జీతం చాలదు.'

'రఘునాథ్! తుత్తునాగం పూతమందు, దూది యింటికి తీసుకు రా! — 'బాబూ రామచంద్ర ఎప్పుడోగాని రారు. కొంచం టీ, బిస్కెట్లు తీసుకొంటేగాని వెళ్ల నీను. అంటూ డాక్టరు చకచకా నడుచు కుంటూ మాకు దారి చూపుతూ వందగజాల దూరంలో వున్న వారి యింటికి మాట్లాడుతూ తీసుకెళ్లారు.' చూడండి ఆసుపత్రి దగ్గర మనసు విప్పి మాట్లాడుకోలేము. నేనంటాను మనదేశం ప్రమాద స్థితిలో వుంది. ప్రభుత్వం రాజకీయ ఖైదీలను వదిలిపెట్టలేదు. జర్మనుల చేతిలో వారికి తగిన శాస్తి జరిగినా ఇంకా బుద్ధిరాలేదు. మనకు స్వాతంత్ర్యం రావాలంటే.....' నాన్న చెవిలో ఏవో మాటలు చెప్పారు.

'అది చాల కష్టం డాక్టరుగారూ! పాపం ఆ కొండప్రాంతం వారిని వారు ఏ విధంగా శిక్షించారో మీకు తెలుసుగా.'

'నేను దాన్ని హత్య అంటాను' అన్నాడు డాక్టరు వుద్రేకంగా — 'వారు రక్త పిపాసులైన నియంతలు. చూడండి రామచంద్రగారూ! ఈ ఘోర సంగ్రామంలో తమ వస్తువుల అమ్మకానికి కాలనీల ఏర్పాటుకు ఎందరినో బలిచేశారు. మృత్యువుతో చెలిమి చేసే ఈ వర్తకులకు ప్రధాన దేవత లాభం.'

'పెద్దవాళ్ళిద్దరూ మాట్లాడుకుంటున్న మాటల్లో ధ్వని నాకు కొద్దిగా బోధపడింది. బ్రిటీష్ వ్యతిరేక ధోరణి కలిగిన డాక్టరుగారి ఆత్మీయ వ్యక్తిత్వం పట్ల నాకు ఎనలేని అభిమానం కలిగింది. నాలో నిద్రిస్తున్న విప్లవశక్తి మేలుకొంది. తిరుగుబాటు ధోరణి ప్రజ్వరిల్లింది. తెల్ల దొరలు 'మృత్యువుతో చెలిమి చేసే వర్తకులు' అని భోధపడింది.'

ఇంటి తలుపు తట్టి లోపలికి అడుగుపెట్టి 'శకుంతలా! అతిధులను తీసుకొచ్చాను. బాబూ రామచంద్ర, చిన్న కొడుకు కృష్ణ వచ్చారు.!' అన్నాడు డాక్టరు.

'అమ్మగారు వంట గదిలో వున్నారు' అన్నారు నీళ్ళకావిడ మోస్తున్న వ్యక్తి బయటికి వస్తూ.

'బ్రహ్మాండమైన టీ పట్టుకురా! ముందు వచ్చి అతిధులకు నమస్కారం పెట్టు.' పిలిచారు డాక్టరు.

'ఇప్పుడీ మర్యాదలన్నీ ఎందుకండీ!' అన్నాడు నాన్న.

'లేదు నా బోధనలు ఏ విధంగా రూపందాల్చాయో చూద్దామని అన్నాను. నేను నీలాగా దొంగ ఆర్య సమాజవాదిని కాదు. రామచంద్రా! నేను చెప్పింది చేసి చూపుతాను. చూడు. నా భార్య యిప్పుడు బయటికి వచ్చి మర్యాదగా నీకు నమస్కారం చేస్తుంది.'

ఒక యువతి దేవకి కంటె వయసులో చిన్నది బయటికి వచ్చింది. మా పిన్నిలాగా అందంగా ముస్తాబై గంజిపెట్టిన తెల్లచీర కట్టుకొని చీర కొంగు తలమీదుగా కప్పుకొని వుంది. మేలి ముసుగులోంచి అందమైన గుండ్రని ముఖం నున్నని మృదువైన బుగ్గలు, బుల్లి గడ్డం కొట్టవచ్చినట్లు కనబడుతున్నాయి. నాన్నకు నమస్కారం చేసి నా తల నిమిరింది.

ఆవిడ నా తల కురుపుల మీద చేయి వేయడంతో నేను అప్రయత్నంగా ఏడ్చాను.

'జాగ్రత్త! అతని తల నిండా కురుపులు' అన్నాడు ఆమె భర్త.

ఆమె వెంటనే నన్ను దగ్గరగా తీసుకొని వంగి నాతల అసహ్యంగా వున్నా ముద్దుపెట్టుకొని, — 'నేను నిన్ను బాధ పెట్టానా? ఎంత పాపిష్టి దాన్ని— బాధపడకు. నేను చేత్తోముట్టుకుంటే బాధ నయమౌ తుందంటారు. నీకు త్వరగా నయమౌతుంది.'

'మా మృదువైన చేతి వేళ్ళకన్నా మేము వాడే పరికరాలు వ్యాధి నయం చేస్తాయని మా నమ్మకం.' అన్నాడు డాక్టరు — ముందు వీళ్ళకి టీ తీసుకురా. ఇంతలో రఘునాథ్ మందు తీసుకు వస్తాడు. మాకు కొంచెం వేడి నీళ్ళు కావాలి' —. వరాండాలోకి తీసుకురా.

శకుంతల తన కుడిచేత్తో నన్ను దగ్గరకు తీసుకొని తన వెంబడి తీసుకు వెళ్ళింది. తలపై కొంగు తొలగించి ఆమె అందమైన సుందర వదనాన్ని చూపించింది ముచ్చటగా తీర్చిదిద్దిన వంట గదిలోకి తీసు కెళుతూ 'నీకు' కట్టుకట్టించు కునేందుకు వేడి నీళ్లు యిస్తాను అంది. అవిడను చూడగానే నాకు ఎంతో ముద్దేసింది.

'ఆవిడ పరదా ధోరణిని నేను పూర్తిగా మాన్పలేకపోయాను. ఈ పాత పద్ధతులన్నింటినీ వదిలిపెట్టి త్వరలో ఎమ్.బి.బి.ఎస్ పూర్తి చేయమని చెప్తున్నాను. రెండవ సంవత్సరం చదువుతుండగా చదువు నిలిపి వేసింది. నాకు వంట మనిషి కావాలని వాళ్ళ నాన్న అనుకు న్నట్లుంది...... అవిడ పెషావరు నుంచి వచ్చింది అక్కడ ఆడవాళ్ళకు సంబంధించినంత వరకూ హిందువులు కూడా మహమ్మదీయుల్లా ప్రవర్తి స్తారు.' అన్నాడు డాక్టరు మా నాన్నతో

'సరే! నేను ఈ అబ్బాయి తలపుండ్లు కడగటంలో మీకు సహా యపడి సిగ్గుపోగొట్టుకోవటానికి ప్రయత్నిస్తాను' అంది ఆమె ధైర్యంగా.

'శకుంతల వంటి కోడలు నాకు వుంటే ఎంత బాగుండేది. నేను మా హరీషను ఎమ్.బి.బి.ఎస్. చదవమని పంపాను. వాడు తన

పెండ్లాము వంటరిగా వుండలేదని చదువు మానేసె మూర్ఖంగా యింటికి వచ్చాడు చదువురాని పిల్లతో పెండ్లి చేయటం నాదే బుద్ధి తక్కువ ఆవిడ మరీ మొద్దుగా తయారైంది.' అన్నాడు నాన్న.

'ప్రశంసా వర్షంతో ఆవిడ తలదిమ్మెక్కి పోయేలోగా, శకుంతలను ఒక ఆదర్శవంతమైన భార్యగా తీర్చిదిద్దుతాను. ఉపనిషత్తులలో 'గార్గి' అనే మునిపత్ని ప్రజలకు సేవచేసినట్లుగా ఈవిడను మలచుతాను. మన స్త్రీలు ఎంత అణచి వేయబడ్డారు ఏమని చెప్పను.' అన్నాడు డాక్టరు

ఆయన చెప్పిన మాటల ధోరణి నాకు బాగా నచ్చింది శకుంతల అందమైన కదలికలు చూసి నాకు బాధ తగ్గినట్లైంది కాంపౌండరు, మా నాన్న ఉన్నప్పటికీ ఆవిడ ఏవిధమైన బెరుకు లేకుండా నా కురుపులు శుభ్రం చేయటంలో భర్తకు సహకరించింది ఆవిడ పట్ల నాకు ఎనలేని ఆరాధనా భావం ఏర్పడింది.

'బాబూ! నీకు త్వరగా నయమైపోతుంది' అంటూ డాక్టరు నెమ్మదిగా కురుపులకు మందుపూసి, కాంపౌండరును, భార్యనూ, నా తలకు కట్లు కట్టమని పురమాయించారు.

'టీ ఏదీ!' అన్నాడు డాక్టరు.

"వేడినీళ్లు కాచాను. టీపొడి సిద్ధంగా వుంది మీ యిష్టమొచ్చినట్లు పెట్టుకొంటారా కమ్మగా" అంది శకుంతల

'నన్ను దత్తత చేసుకోండి.' అన్నాను అమాయకంగా నవ్వుతూ. ఆవిడ నా తలలో పిన్ను పెట్టింది.

'మీ నాన్న వొప్పుకొంటే తప్పకుండా.' అన్నారు డాక్టరు.

'దేవకి పిన్ని మా అన్న గణేశ్‌ని దత్తు తీసుకొన్నట్లు, నేను మీ యింట్లో వుండిపోతాను.' అన్నాను ఆశగా.

'ఓరి వెధవా!' అన్నాడు నాన్న నవ్వుతూ. ఆయన యిరకాటంలో పడ్డారు.

నాలో నైరాశ్యమంతా మాయమవుతుందనే ఆలోచన నాకు

సంతోషం కలిగించింది.

'అమ్మను అడిగి చెబుతానని చెప్పు శకుంతలగారిని మీ వదినెగా భావిస్తానంటే నాకే అభ్యంతరమూ లేదు ఆవిడ నీ పట్ల అభిమానం చూపుతోంది.' అన్నాడు నాన్న సలహా యిస్తున్న ధోరణిలో

ఆ విధంగా ఆ సన్నివేశం నాకు బాగా గుర్తు వుండిపోయింది ద్రౌపదికంటె నాకు శకుంతల వదినెగా దగ్గరయింది నాకు సుదూరంగా వున్న దేవకిపిన్నికంటె రెనాల్డు కవి చిత్రించిన సోఫియా రూపాన్ని శకుంతలలో చూడసాగాను. ప్రతిరోజూ తన భర్తకు సహాయంగా రోజూ నా తలపుండ్లు శుభ్రం చేయడంతో ఆవిడ నాకు దగ్గరయింది వాళ్ల యింటికి వస్తూపోతూ దేవకికంటె అధికంగా ఆమెను ప్రేమించ సాగాను

ఈ కొత్త బాంధవ్యం డాక్టరు దంపతులు మా యింటికి ఒక ఆదివారం మధ్యాహ్నం భోజనానికి రావడంతో బలపడింది అమ్మా, నాన్న డాక్టరు దంపతుల్ని ఆరోజు భోజనానికి పిలిచారు ఆ రోజు వాళ్లిద్దరూ బాగా ముస్తాబై వచ్చారు డాక్టరుగారు పైజమా, లక్నోలాల్చీ వేసుకొన్నారు. శకుంతల నీలంరంగు బంగారుజరి శల్వారు ధరించింది అమ్మ శకుంతలను ముద్దుపెట్టుకొని కొద్దిగా మాట్లాడింది. మాంసం కూర, రకరకాలు కూరలు, పాయసాన్నము వడ్డించారు. పరమానంద వాతావరణం నెలకొన్న మా యింట్లో, అతిధులను మెప్పించడానికి, పిల్లలమంతా శ్రద్ధగా చదువుకొంటూ కూచొన్నాము

భోజనానంతరం డాక్టరుగారు, నాన్న ముందుగదిలో విశ్రాంతిగా కూచొన్నారు. వారి మాటల్లో భారతీయుల్లో యుద్ధం పట్ల విముఖతను గూర్చి ప్రస్తావన వచ్చింది గణేశ్ శ్రద్ధగా వారి సంభాషణ వింటూ నించున్నాడు. నేను, శివ వరండాలో అమ్మ, శకుంతల పక్కన కూచొన్నాము. వాళ్లిద్దరూ అమ్మ పుల్కారీకోసం ఎర్రరంగు నేత చీరకు రకరకాల సిల్కుదారాలు చమ్కీ అల్లకం అల్లుతున్నారు శకుంతల వంటి అందమైన పిల్ల హరీష్ భార్యగా వచ్చివుంటే ఎంత బాగుండేదో, చప్పిడి ముక్కు ద్రౌపది గొడ్రాలు, ఎలా అయిందో అమ్మ తన మాటల్లో శకుంతలకు చెప్పింది. ఆవిడ పట్ల తన అభిమానాన్ని వ్యక్తం చేసింది

మధ్యమధ్యలో శకుంతలకు మా కుటుంబ విషయాలు పూసగుచ్చినట్లు చెప్పసాగింది. ప్రతాప్ బాబాయి ఘోరమరణము, దేవకి పట్ల నాన్న ప్రత్యేక శ్రద్ధ చూపడంలో తన అనుమానము, మాటల మధ్యలో దొర్లాయి. అమ్మ మాటల్లో రహస్యాలు వినడంకన్నా, పుల్కారీ కుట్టడంలో శకుంతల శ్రద్ధ చూపించింది. డాక్టరుగారి భార్య మర్యాదస్తురాలిగా వ్యవహరించింది.

అమ్మ మాటల పట్ల ఈ వదినెకు తలనొప్పి కలిగివుంటుందని గ్రహించాను. ఆమె కృత్రిమ కంఠ స్వరంతో మధ్యమధ్యలో 'నిజంగానా?' అనే మాటల ధోరణి ఆమె అనాసక్త బుద్ధి వ్యక్తం చేసింది. కాని, ఆమె ఎంతో గౌరవాన్ని అమ్మ పట్ల చూపుతోంది ఆ సెప్టెంబరు మాసపు చిరు ఎండగాలి శ్రమ పోగొట్టడానికి ఆమె మాటల్లో శీత లత్వం ఉపకరించింది. నాకు ఒక ప్రియురాలు కావాలా? అని అడిగింది. తన చెల్లెలు పెషావర్‌లో ఉందనీ, ఆవిడ బుగ్గలు ఆపిల్ పండ్లవలె, పెదాలు ద్రాక్షవలె వుంటాయనీ చెప్పింది ఆవిడ మాటలు వినగానే నాకు ఎక్కడలేని సిగ్గువేసింది — 'నీ బుగ్గలు కూడా బాగా ఎర్రబడి, నీవు యింకా కొంచెం లావెక్కితేగాని ఆవిడను పెళ్లాడటం కుదరదు. అది నీకంటె ఒక సంవత్సరం కాబోలు పెద్దది —' అంటూ బుగ్గలు చిదిమింది.

ఈ మాటలు అమ్మను కదిలించాయి నా మనస్తత్వాన్ని బాగా పసిగట్టినట్లుగా శకుంతలతో అమ్మ చెప్పింది 'వీడు తనకంటె వయసులో పెద్దవారిని ప్రేమిస్తుంటాడు.'

'అయితే నేను జాగ్రత్తగా వుండాలి.' అంది శకుంతల.

నా పక్షాన మాట్లాడుతున్నట్లుగా అమ్మ అంది— 'జరగ వలసిన అన్యాయమేదో జరిగిపోయింది. ఇప్పుడు వాణ్ణి మార్చడం కుదరదు.'

శకుంతలకు ఇందులో నిజం తెలుసు ఈ విషయం పట్ల నేను శ్రద్ధ చూపగూడదని ఆమె నైపుణ్యంగా మాట మార్చింది. శివ, నేను బజారుకు వెళ్లి వేడివేడి పకోడీలు, మసాలవడలు తీసుక రమ్మంది. 'ఇప్పుడు సిద్ధంగా వాడు కాలుస్తుంటాడు వెళ్లి' రమ్మని చెప్పింది. ఆ మాటవిని మేము పరుగు తీశాము. గణేశ్ ఒక్కడే యింటి దగ్గర

వుండిపోయాడు. నేను యింట్లోలేని సమయంలో ఈ 'వదినె' అనురాగాన్ని వాడు తస్కరిస్తాడేమోనని నా లోలోపల అసూయ కలిగింది.

ఆ రోజు మొదలు తరువాత నెలల్లో నేను క్రమక్రమంగా శకుంతల గుండెలో చోటు సంపాదించ గలిగానని గ్రహించాను. నా తల వుండ్లు శుభ్రం చేయించడానికి రోజూ వెళ్లడం వల్ల, కుక్కవలె నన్ను బుజ్జగిస్తే బాగుంటుందనుకోవడం వల్ల, ఆవిడ వైద్య విద్యకోసం పరీక్షలకు చదువుతున్న పుస్తకాల పట్ల ఆసక్తి చూపడం వల్ల ఈ విషయం బయటపడింది. నేను తరచు చిలిపి ప్రశ్నలు వేసే ధోరణి చూసి డాక్టరు నన్ను వరాలరాశిగా భావించసాగాడు. మాష్టారు హరిచంద్ర పక్క గ్రామంలో వుంటున్నాడు. అతని తోటలోంచి ముల్లంగి దుంపలు, క్యారెటు దుంపలు దొంగతనంగా తెచ్చి శకుంతలకు యిచ్చేవాణ్ణి. ఒకసారి నేను జీలం నదిలో ఒక పెద్ద చేపను పట్టుకొచ్చాను. గుట్టు చప్పుడులేకుండా ఆరోజు బాకాతో ధైర్యంచేసి వెళ్లాను. అలా దేశదిమ్మరిగా తిరగడానికి వెళ్లినందుకు నాన్న నన్ను చావబాదకుండా డాక్టరు చుమన్‌లాల్‌గారు రక్షించారు. పెషావరు వంటకం మాదిరిగా రుచికరంగా శకుంతల ఆ చేపను వేయించి కూరచేసింది. ఆ కూరను నాన్నకు కొంతపంపుతూ ఒక చీటీ వ్రాసి పంపింది. అప్పుడప్పుడు మాతో నన్ను కూడా చేపలవేటకు వెళ్లడానికి అనుమతి యివ్వమని వ్రాసింది. పుస్తకాలు గుడ్డిగా చదివి తల దిమ్మెక్కిపోయే స్థితినుండి కాపాడటానికి ఆమె మాట సహాయం నాకెంతగానో ఉపకరించింది. నాకు లెక్కలు, జ్యామితి అంటే విసుగు. అది తప్పించుకోగలిగాను. కాని అవినాకు జీవితంలో ముక్తిని ప్రసాదిస్తాయని పెద్దలు చెప్పారు. ఇంట్లో క్రమశిక్షణాయుత జీవనానికి ఆటవిడుపు కలిగింది. మా అన్నయ్య వివాహానికి ముందు ఏర్పాట్లు చేయడానికి అమ్మ, నాన్న, గణేశ్ అమృతసర్ వెళ్లారు. దేవకి పిన్ని వద్ద యింకా ఏదైనా కొంత డబ్బు మిగిలివుంటే ఖర్చు చేయిద్దామని వెళ్లారు. శివ, నేను చునీలాల్, శకుంతల వాళ్ల యింట్లో వుండిపోయాము. ఈ యింట్లో వారి సుఖసంతోషాలపట్ల నా కెంతో ఆనందం కలగడం అటుంచి, మనదేశం ఏ విధమైన క్లిష్ట స్థితిలో ఉందో మరింత స్పష్టంగా తెలుసుకోగలిగాను. అమృతసర్‌లో దేవదత్త

యింట్లోకంటె, యీ యింట్లో నేను ఒక భాగస్వామినిగా తలపోశాను. ఒకే తలగడపై యిద్దరూ తలలు పెట్టుకొని, ఒకరి కౌగిట్లో ఒకరు పడుకొని ఎంతోసేపు డాక్టరు దంపతులిద్దరూ ప్రియంగా మాట్లాడు కొంటుంటే, నేను వారి పరుపు కాళ్ల దగ్గర పడుకొని వాళ్ల మాటలు ఆసక్తిగా వినేవాణ్ణి. ఈ దంపతుల మధ్య అరమరికలులేని ప్రేమను నేను మరెక్కడా చూడలేదు. నాకు ఈ అదృష్ట దేవత ఉదారంగా ప్రసాదించిన నా ప్రియురాలైన శకుంతల చెల్లెల్ని రహస్యంగా ముద్దెట్టు కోవాలని వాంఛ.

# 8

శకుంతల అనురాగ హృదయపు వేడిమిలో నా జీవితంలో మరి కొన్ని నెలల పాటు దేదీప్యమాన ప్రభలు వెలిగాయి. బడికి వెళ్లడం కూడా సంతోషదాయకమైంది. వస్తూ, వెళుతూ ఆవిడను చూసే అవకాశం దొరికేది. నాన్న తరచు వారాంతాలలో అమృతసర్ వెళ్లి వస్తుండేవారు. (గణేశ్ పెళ్లి పనులు చురుకుగా చేయాలనే మిషతో వెళ్తుండేవారు రాబోయే వేసవిలో పెళ్లి నిశ్చయమైంది. తన భర్తను, తాను, దేవకి కలిసి అనుభవించాలనే స్థిర సంకల్పానికి అమ్మ వచ్చింది.) నాన్న ఊర్లో లేనప్పుడు శకుంతల నాకు పాఠాలు చెప్పడంలో తోడ్పడేది. ఉర్దూలోంచి ఒక పుటను ఆంగ్లంలోకి నేను అనువదిస్తుంటే ఆమె పర్యవేక్షించేది. ఇది నాన్న పురమాయించిన పని జీవితంలో అనేక ఆసక్తికర విషయాలను తెలుసుకోవాలంటే విజ్ఞాన శాస్త్రము, గణితము నేర్చుకొంటే ఎంత దోహదం చేస్తాయో ఆవిడ వివరించేది. భారతదేశ చరిత్ర, ఆంగ్ల గద్యపద్యభాగాలు చిలకపలుకుల్లా నేను వల్లిస్తుంటే ఆమె వినేది.

బడిలో చదివే పాఠాలు 'ఎందుకు? ఎంత వరకు?' నేర్చుకోవాలనే విషయాన్ని మాష్టారు అమరనాథ్‌తోపాటు, శకుంతల కూడా వివరిం చేది. ఉదాహరణకు జ్యామితి పరిశోధించిన గ్రీకుపండితుడు తేల్సను

గూర్చి ఆమె నాకు చెప్పింది. సమానాంతరరేఖ, వక్రరేఖ, వృత్తము అంటే ఏమిటో తెలుసుకోవాలనే కుతూహలంలో ఆయన అది కనుగొన్నాడు. తేల్స్ మహర్షి పేరు నాకు జపనామంగా నాలుకపై నర్తించి సాగింది. త్రికోణము, బీజగణిత సూత్రాలు వల్లించి, దానికి సంబంధించిన అంశాలు కంఠస్థం చేసి లెక్కలంటే సులభమని మిగతా విద్యార్థులకు నా తెలివితేటలు ప్రదర్శించే వాణ్ణి. నిత్య జీవితంలో ఉదాహరణలతో ఆమె నాకు రసాయన భౌతిక శాస్త్రాలు చెప్పేది. మన తాతముత్తాతలకు పూర్వీకుడైన ఆదిమమానవుడు ఏవిధంగా రాయికిరాయి తగిలించి నిప్పు ముట్టించే వాడో, ప్రాణవాయువు పీల్చడం వల్ల మనం ఎలా బ్రతుకుతున్నామో, బొగ్గు పులుసువాయువు ప్రాణాలు ఎలా తీస్తుందో, మన సుఖాలు పెరగడానికి ఈ విజ్ఞానం ఎలా దోహదం చేస్తుందో ఆమె విశదం చేసేది. ప్రపంచంలోని ఋషులలో అధికభాగం పురుషులనీ, స్త్రీలు తక్కువ అనీ ఆమె కోపం విజ్ఞానమంతా పురుషుని చుట్టూ తిరుగుతుందనీ, స్త్రీల గురించి ప్రత్యేక శ్రద్ధ లేదనీ ఆమె వాదన. వంట పాత్రలు శుభ్రం చేయడానికి, గిన్నెలు తోమడానికి ఏదైన ఒక యంత్రం తాను స్వయంగా కనిపెట్టాలనీ, ఈ పరిశోధనలో తనకు తగిన ప్రోత్సాహము, సమయమూ కావాలని అనేది ఈ యంత్రం కనిపెడితే ఆవిడకు సంగీతాభ్యాసానికి ఎక్కువకాలం దొరుకుతుంది. బాధా శప్తులైన వారికి ఉల్లాసం కలిగించడానికి సంగీతం ఉపశమనం.

నా చురుకైన మనసుకు యివన్నీ ఆసక్తిదాయకంగా ఉన్నాయి. ప్రపంచంలోని వాస్తవాలను నగ్నసత్యాలుగా గ్రహించడానికి ఇది ప్రతిభావంతము, నిష్కపటము సులభము అయిన మార్గము. ఆవిడ సహేతుకంగా చెబుతున్న సిద్ధాంతాలలో నిజాన్ని లోగడ నాలో నేను గుప్తంగా వెదికి కనుగొన్న విషయమే! బహూశా ఆవిడ వైద్యవిజ్ఞానం ఆమె తెలివితేటలకు ఉపకరించి ఉంటుంది. నేను పెరిగి పెద్దవాడినయిన తర్వాత కవికంటె వైద్యుణ్ణి కావాలని కోరిక. మానవుల బాధను తగ్గించడమే వైద్యశాస్త్ర పరమావధి అని ఆవిడ నాకు బోధ పరచింది. లూధియానాలో ముంతాజ్ భక్తుడనైనట్లే, నేను యిక్కడ శకుంతలకు బానిస నయినాను. మేము వైజ్ఞానిక విషయాలు మాట్లాడుతూ

మధ్యమధ్యలో ఆమె నాకోరిక మన్నించి పంజాబీ జానపదగీతం ఒకటి పాడేది. హార్మోనియంపై క్లిష్టమైన గానం ఒకటి ఆలపించేది. ఆవిడకు పెషావర్ నుండి తల్లిదండ్రులు పంపిన ఖర్జూరాదిఫలాలను నాకు ఉదారంగా తినడానికి యిచ్చేది. అదొక సరదా.

ఫలితం సంవత్సరాంత పరీక్షలలో నేను అతిసులభంగా నెగ్గాను. గణేశ్ కంటె అన్నిట్లో నాకు ఎక్కువ మార్కులు వచ్చాయి. శకుంతల తీపి జ్ఞాపకాలతో మా కుటుంబ స్థితిగతులను అధిగమించి నా శరీరంలో ఏదో నూతన ఉత్తేజం ఆవహించింది. అపరిమిత మేధా సంపత్తితో ఉన్నత పథంలో సంచరిస్తున్నట్లుగా నా మెదడులో అనేక సిద్ధాంతాలు పుట్టాయి. నా జేబుల నిండా తినబండారాలు, చేతిలో చేపలగాలము లేదా హాకీ కర్ర వుండేవి

పరీక్షలయిన తర్వాత ఒకవారం సెలవులు దొరికాయి. విజయోత్సాహం పుంజుకొని నిర్భయంగా మేము ఆటలపై దృష్టి కేంద్రీకరించాము. 'మీరు రోజంతా ఇలా అడ్డ తిరుగుళ్ళు తిరుగుతూ ఆడుకుంటుంటే తప్పకుండా పరీక్ష తప్పుతారు.' అని నాన్న గాని, 'తిరగండి, తిరగండి కాలికి బలపం కట్టుకొని తిరగండి. మీవి మట్టి బుర్రలు' అని మాటిమాటికి అమ్మ ఎద్దేవా చేయటం కానీ శలవల్లో కుదరదు. బాహ్య ప్రపంచంలోని ఘర్షణలతో సతమతమై నేను నెమ్మదిగా సున్నితమూ, సుతారమూ అయిన జీవితంలోకి అడుగిడుతున్నట్లుగా ఈ సమయంలో గుర్తించాను. పిల్లల చిలిపితగాదాలో ఈ తేడాను నేను వెంటనే గమనించాను. 31వ పంజాబీ పిల్లల జట్టుతో హాకీ ఆట ఆడినప్పుడు ఈ సంఘర్షణ మొదలైంది. మా జట్టుకు తిరుగులేని నాయకుడైన బాకా శక్తియుక్తుల వల్ల మేము నాలుగు 'గోలులు' సంపాదించాము. వాళ్ళకు ఒక్క 'గోలు' మాత్రమే దక్కింది. మా ఆటలో బాకా మధ్య ఆటగాడుగా స్వయంగా నాలుగు గోలులు కొట్టాడు. ఎదుటి పక్షంలో మొహమ్మద్ అఫజల్ ఒక్క గోలు మాత్రమే సాధించాడు. ఈ ఆటకు 'రెఫరీ'గా వుండమని మా నాన్నను బలవంతం చేశాము. ఆయన వాళ్ళ దళం ఆడేటప్పుడు మధ్యస్తుడుగా వ్యవహరించేవాడు. ఆయన రావడం వల్ల మా ఆటకు ప్రతిష్ఠ పెరుగుతుంది. ఆయన స్వయంగా న్యాయ

నిర్ణయం చేయడం వల్ల మేము ఆట సరిగా ఆడలేదని నెపం రాదు. మా నాన్న ఆటకాగానే వెళ్ళి పోయారు మేము పెద్దల పంథాలో నడవాలని ఎదుటి జట్టువారికి సోడా సీసాలు అందరి దగ్గరా వసూలు చేసిన డబ్బుతో మా అతిథులకు కొని యిచ్చాము.

పంజాబీ జట్టు నాయకుడైన మొహమ్మదు అఫ్జలు ఆ సోడా సీసాలు తమ మిత్రులు ముట్టుకోవటానికి అనుమతించ లేదు ఆ సీసాలను ఊడ్చే కుర్రవాడు బాకా ముట్టుకున్నాడని అతని అభ్యంతరం. హీన కులాల వారు ముట్టుకంటే సాధారణంగా మహమ్మదీయులు అభ్యంతరం పెట్టరని మాకు తెలుసు హిందువులు మహమ్మదీయులను ఇంచుమించు అస్పృశ్యులుగా భావిస్తారు అందువల్ల తన జట్టు ఓడిపోయినందుకు అఫ్జలు దుఃఖ పడుతున్నాడని నిర్ణయించాము. అఫ్జలు సణుగుడు విని చోరా డంబాలు పలకటంతో పరిస్థితి విషమించింది —

"బహుశా మీకు తెలియదేమో, ఈ అస్పృశ్యుడైన బాకా మా జట్టు నాయకుడుగా మిమ్మల్ని చితకగొట్టి వోడించాడని—" అన్నాడు చోరా.

'అరే! ఎవడ్రా' ఎదురు సవాలు విసిరాడు అఫ్జలు

ఇంతలో తన విరిగిన హాకీ కర్రను రామచరణ్ అఫ్జల్‌ను కొట్ట డానికి పైకెత్తాడు.

'కొట్టండి' అఫ్జల్ తన జట్టును వుసి గొల్పాడు

'వద్దు, వద్దు' అన్నాడు అఫ్జల్ పిన్నికొడుకు సాదిక్.

'మీ పిన్నికొడుకుపట్ల నీవు ద్రోహం చేస్తున్నావని మీ నాన్నకు చెబుతాను.' అని ఎద్దేవా చేశాడు అఫ్జల్. ఆ మాట అంటూ రామ చరణ్ మీదికి వెళ్లాడు.

చోరా మధ్యలో కలుగ జేసుకొన్నాడు. గందరగోళ పరిస్థితి ఏర్ప డింది దగ్గరలో వున్న చెట్టుమీద ఎక్కి నేను తప్పించుకొన్నాను.

ఈ మాటలకు ఖిన్నుడైన బాకా దూరంగా నిలబడి— 'మీరు

తన్నుకోవడం ఆపకపోతే, నేను వచ్చి మిమ్మల్ని అందర్నీ ముట్టుకొం టాను.' అంటూ ముందుకు వచ్చాడు.

తగులాడుకొంటున్న అందరూ, వూపిరి బిగబట్టి, నిరుత్సాహంగా తిట్టుకొంటూ ఆపేశారు జుట్టుజుట్టు పట్టుకొని అఫ్జలు, చోరా వొకళ్లనొ కళ్లు తిట్టుకొంటూ, ఒకళ్లనొకళ్లు మసి చేద్దామన్నంత కోపంగా వున్నారు. బాకా వాళ్ల యిద్దరి మధ్యలో వెళ్లి విడదీయడానికి ప్రయత్నించాడు. అఫ్జలును ముట్టుకొన్నప్పటికీ, అతను వదలి పెట్టకుండా, బాకా చేతిని కసిగా కొరికాడు. బాకా వాడి చెంపమీద ఒక దెబ్బవేసి, చోటాను విడిపించాడు.

'వూడ్చేవారికి, అస్పృశ్యులకు, గడ్డితినే హిందువులకు నా తడాఖా చూపిస్తాను.' అంటూ అఫ్జల్ అరుస్తూ తన జట్టును ముందుకు తీసు కెళ్లాడు. తన ఓటమిని చేతులూపడం ద్వారా వెళ్లగక్కాడు

'అరే కృష్ణా! గణేశ్, మీరిద్దరూ రోజూ మాయింటి మీదుగా బడికెళ్లాలి. గుర్తుంచుకోండి!' అన్నాడు అఫ్జల్.

వాళ్లు కనుచూపుమేర వెళ్లిన తర్వాత మాజట్టు అంతా ఒకచోట కలిశాం. తలా రెండేసి సోడాలు తాగి, వాళ్ల ప్రవర్తనకు నవ్వుకొన్నాం. తమ ఓటమిని సరదాగా స్వీకరించలేని పిరికిపందల మనస్తత్వానికి నవ్వు వచ్చింది. ఎవరైనా నౌకరు లేకుండా బడికి ఒంటరిగా వెళ్తే ప్రమాదం జరగవచ్చునని గ్రహించాను. అందుకని నా మనసులో మాట అంద రికీ చెప్పాను. ఈ వుదంతాన్ని మా నాన్నకు అందరం కలిసి వెళ్లి చెప్పాలనుకొన్నాం.

మధ్యవర్తిగా వ్యవహరించిన మా నాన్నకు కోపం వేసింది. ఈ తగాదా గురించి, దీనివల్ల తన కొడుకులకు జరగబోయే ప్రమాదం గురించి సుబేదారు మేజరు అహమ్మదుఖానుకు వెంటనే వ్రాద్దామని నిర్ణయించారు.

పంజాబీ కుర్రవాళ్లు మా మీద విరుచుకపడకుండా, బడినుంచి వచ్చేటప్పుడు ప్రతి ఉదయం ఆసుపత్రి దగ్గర కాపలాకాచి మమ్మల్ని యింటికి తీసుకురమ్మని హరిచంద్రకు పురమాయించారు. బడికి వెళ్లే దారిలో మాకు ఏమీ జరగకుండా ఈ చర్య తీసుకొన్నారు.

ఈ ప్రపంచమనే అడవిలో క్రూరమైన వేటగాళ్లు వున్నారనే తలపు వచ్చి వణకి పోయాను. నాకున్న తెలివి తేటలతో ఆలోచిస్తే, అటువంటి వారి సహచర్యం ఎప్పుడూ కోరకూడదని అనిపించింది. విజ్ఞాన సముపార్జనపట్ల ఆసక్తి, ఆంగ్లేయులపట్ల విప్లవం సాధించే యుక్తీ, సుమధుర జ్ఞాపకాలు లభించే డా. చునీలాల్ యింటికి వెళ్లడానికి ఉత్సుకత చూపాను.

ముష్టాముష్టి జరిగిన కొట్లాటలో అఫ్జల్ హిందువులను మతద్వేషంతో తిట్టిన మాటలను డా. చునీలాల్‌కు వివరించాను. 'ఆంగ్లేయులు హిందువుల మీదికి మహమ్మదీయుల్ని రెచ్చగొడుతున్నా'రని ఆయన నా మాటను తిరస్కరించారు.

'అది ఎలా? మనమందరం భారతీయులమైతే!' అని ప్రశ్నించాను.

'ఈ కుర్రవాడిలా, నాకూ వినాలని ఆసక్తిగావుంది. మనవారు ఒకరిపట్ల ఒకరుద్వేషం ఎందుకు పెంచుకొంటున్నారు? పిల్లల్లో కూడా ఎందుకీ ద్వేషం' అడిగింది శకుంతల.

'ఓ ప్రియా! ఇలా రా! కూచో. టీ కప్పులో పోస్తూ మాట్లాడు.' అంటూ ప్రియంగా భార్యను పలకరిస్తూ అన్నాడు.

ఆమెవచ్చి తన ప్రియమైన వేళ్లతో టీ తయారుచేస్తూ అంది— 'సరే! ముద్దుల భర్తగారూ ఆరంభించండి.'

'చెప్పడానికి వాస్తవంలో ఏమీ లేదు.' అంటూ చునీలాల్ ఆరంభించాడు 'తమ సైనిక, రక్షకభట దళాలతో ఆంగ్లప్రభుత్వం మనదేశానికి వచ్చి మన నాగరకతను పాడు చేసింది. అస్తవ్యస్త పరిస్థితిని అంతటా సృష్టించింది. పూర్వపు రోజుల్లో అయితే, నేను ఒక ఆయుర్వేద వైద్యున్ని వద్ద కొంత కాలం శిక్షణపొంది, వైద్యవృత్తిని గౌరవప్రదంగా చేసుకొని ఉండేవాణ్ణి. ఈనాడు, నేను సహాయకుడిని మాత్రమే. ధనవంతుల పిల్లలు లాహోరులోనో, లండనులోనో యం.బి.బి.యస్. పరీక్షలు వ్రాసి, భారతీయ వైద్యసేవలో చేరి కెప్టనులుగా, మేజర్లుగా కల్నల్‌గా నామీద కర్రపెత్తనం చెలాయిస్తారు. భారతీయుల్లో రాజవంశాలనుండి వచ్చినవారికి తప్ప ఈ హోదాలు యివ్వడం లేదు. అధికశాతం ఈ

హోదాలను ఆంగ్లేయులకే సంక్రమింప జేస్తున్నారు. హిందువులకంటె మహమ్మదీయులకు ఎక్కువ ప్రాముఖ్యం యిస్తున్నారు. అదే విధంగా మీ నాన్న క్షత్రియవంశంలో పుట్టలేదు కాబట్టి కేవలం హవిల్‌దారుగా మాత్రమే ఉన్నాడు. 38వ డోగ్రాదళానికి చెందిన కల్నలు, సుబేదారు మేజరు పని అంతా ఆయనే చేస్తున్నప్పటికీ ఆయన కేవలం హెడ్ గుమస్తా మాత్రమే. ఆయన ఎప్పటికీ ఇంగ్లీషు అధికారి కంటె ఉన్నత మైన పదవిలోకి అర్హత ఉన్నప్పటికీ పంపరు. భారతీయులెవరూ దళానికి నాయకత్వం వహించే స్థితిలో లేరని వారి వుద్దేశ్యం. భారతీయులు ఒక చిన్న కంపెనీని సమర్థించలేరని వాళ్ళనుకుంటున్నప్పుడు దళానికి నాయ కత్వం వహించే ప్రశ్న అసలు రానేరాదు. ప్రధాన దళాధిపతియైన సర్. జేమ్స్ విల్‌కాక్సు సిద్ధంతమిది. లాలా లజపతిరాయ్ వంటి మేధావులు చెబుతున్నది.— 'భారతదేశం మాది దాన్ని మేము పరిపాలించుకుంటాం.'

'జర్మనులు మా స్నేహితులు కాబట్టి వారితో యుద్ధం చేయం' అన్నాను నేను మధ్యలో అడ్డుతగులుతూ అమృతసర్‌లో దేవదత్త బాబాయి మాటల సందర్భంలో చెబుతూ వచ్చిన ఉబుసుపోక కబుర్లు గుర్తుకు వచ్చి.

'ఓరి రాక్షసుడా!' అరిచాడు డాక్టరు.

'అది నిజమే కదా! లాలాజీ కూడా అదే చెబుతున్నారుగా' శకుంతల ప్రశ్నించింది.

'నిజమే.' రహస్య ధోరణిలో డాక్టరు అన్నారు — 'యుద్ధంలో ఆంగ్ల ప్రభుత్వం ఓడిపోతే మనకు స్వేచ్ఛ లభించటానికి అవకాశం దొరు కుతుంది.'

'అది ఎలా కుదురుతుంది.' శకుంతల ప్రశ్న.

'వాళ్ళకున్న సైన్యమూ, పోలీసులు, తుపాకులూ, గూఢచారులూ ఎంతమందో వూహిస్తే ఇది కేవల మాటలతో సాధ్యపడేది కాదని తెలుస్తుంది.' అన్నాడు డాక్టరు అప్రయత్నంగా.

'మన హితులు అమెరికాలోనూ జర్మనీలోనూ యితర విదేశాల

లోనూ దీనికి ప్రతిక్రియ చేయటానికి కార్యకలాపాలు కొనసాగిస్తున్నారని నీకు తెలియదా? లాలా లజపతిరాయ్ స్నేహితుడైన సర్దార్ అజిత్ సింగ్ నల్ల సముద్రం దాటి ప్రపంచమంతా తిరుగుతున్నాడు. వజ్ర సమానుడైన లాలా హరదయాళ్ విదేశాలలో భారతీయ విప్లవకారుల్ని ఒక త్రాటిమీదికి తీసుకు వస్తున్నారు. అతణ్ణి అతని సహచరుల్ని బెర్లి న్‌లో ఈ కార్యకలాపాలు చేయడానికి జర్మను కైజరు అనుమతించాడు. అక్కడ వారు తురుష్కులతోనూ ఈజిప్షియనులతోనూ, జర్మను అధి కారులతోనూ తరచూ సమావేశాలు జరిపారు ఇక్కడ ఆంగ్లప్రభుత్వాన్ని ద్వేషించే కైజర్ విల్‌హెమ్ రహస్య ప్రతినిధులైన జర్మన్ సైనిక అధికా రులతో కూడా వారు చర్చలు జరిపారు కవయిత్రి సరోజినీ నాయుడు సోదరుడు చటోపాధ్యాయ చాల తెలివైనవాడు అతడు లాలాహరదయా ళ్‌తో కలిసి పనిచేస్తున్నాడు. సర్దార్ అజిత్ సింగ్ లాలాహరదయాళ్ చటోపాధ్యాయ ముగ్గురూ కలిసి జర్మనులు బందీలుగా తీసుకు వెళ్ళిన భారతీయ సిపాయిలను సమకూర్చి భారతదేశంలో విప్లవం కొనసాగిం చటానికి ప్రయత్నాలు చేస్తున్నారు విప్లవం నెగ్గితే పరిపాలించటానికి ప్రత్యామ్నాయ ప్రభుత్వాన్ని కూడా వాళ్ళు ఏర్పాటు చేశారు ...... ఆ సుముహూర్తంకోసం సిద్ధంగా వుండమని భారతదేశంలోని నాయకులకు, మహారాజులకూ వాళ్ళు ఉత్తరాలు వ్రాస్తున్నారు '

నేనూ శకుంతలా వూపిరి బిగబట్టి వింటున్నాము. ఆసక్తికరంగా కూచుండిపోయి నేను నోరు మెదపలేదు. దేవదత్త బాబాయి యింతకు ముందు చెప్పిన మాటలు డాక్టరుగారి మాటలతో ఏకీభవించి ఉద్రిక్తతను కల్పిస్తున్నాయి. వీరు కోరుతున్న మార్పు అంత సాధ్యమైంది కాదు. నా చిరుత మనస్సుకు యిందులో క్లిష్టతలు స్పష్టంగా కన్పించి అది అసాధ్యమేమో ననిపిస్తుంది. శకుంతల చెప్పినట్లుగా అఖండ దేశభక్తితో తిరుగుతున్న కొద్దిమందిని బ్రిటీష్ ప్రభుత్వం సర్వనాశనం చేయగలదు. అయినా వారు విదేశాలకు పరుగెత్తుకెళ్ళి విప్లవాన్ని కొనసాగిస్తున్నారు. ఒకవేళ జర్మనులు నెగ్గితే గద్దర్ నాయకులతో కలిసివచ్చి ఢిల్లీలో పరి పాలన కొనసాగిస్తారేమోనని నాకనిపించింది. గుండె వేగంగా కొట్టుకొని కడుపు తరుక్కు పోతోంది జర్మనులు సమర్థవంతులూ, కరినాత్ములూ

అని చెప్పకుంటారు. వారు బృహత్తర యంత్రాలను తయారు చేయ గలరు. ఆంగ్లేయులనూ, ఫ్రెంచి సైన్యాలను వారు అనేక మారులు ఓడించారు...... డాక్టరుగారి మాటల వల్ల నా మెదడులో కలిగిన అను మానాలూ, తర్కాలూ అధికమై నా ఆత్మ రహస్యంగా పలకరిస్తోంది. పగటిపూట నిద్రాణంగా వుండి మిగతా వేళలలో జ్వాజ్వల్యమానంగా వుండే నాకనుచూపుతో భవిష్యత్తును దర్శించాను. ఈయన మాటల వల్ల నాకందిన సమాచారమూ, దేవదత్త బాబాయి ఉబుసుపోక కబుర్లు, అమృతసర్‌లో ప్రతాప్ బాబాయి అంగట్లో విన్నవార్తలు, జైలర్లు, బడి పంతుళ్ళు చెప్పిన విశేషాలూ నాకంటె ముందు ప్రత్యక్ష మయాయి నాకు తెలియని రహస్యాలంటూ యింకేవీలేవని ఆక్షణంలో నాకనిపించింది.

నాలో ఒక కొత్త ఆలోచన ఉద్భవించినట్లు స్వయంగా తెలుసు కోగలిగాను. దాన్ని పునరావృతం చేసి చూస్తే ఒక క్రొత్త ఉత్సాహం ద్యోతకమైంది. దాని క్రూర బృందగానం నాకు వినిపిస్తోంది. వంటరిగా వున్నప్పుడు నాలో నేనే మాట్లాడుకోసాగాను. ఈ కార్యకలాపాలను గూర్చి నూత్న గీతాలను రచించే వారితో నేనూ కలిసి పనిచేయాలనీ సరదాపడ్డాను. ఈ విషయాలన్నీ నా గుండెలో పదిలపరచుకొని తలపొ గరుతో తిరగసాగాను. నాలో ఎదిగిన మనస్తత్వాన్ని పుణికి పుచ్చేలా మాట్లాడటానికి ఉత్సుకత చూపాను. అహంభావం అధికమైంది. డాక్టరు చునీలాల్ తరచూ ప్రస్తావించే భక్తి విశ్వాసాలు నన్ను అదుపులో పెట్టాయి. అమ్మ ఎందరో దేవుళ్ళను కొలవడం నేను ఎగతాళి చేసినప్ప టికీ ఆవిడ వద్దనుండి భక్తి భావం నాకు సంక్రమించింది. మరికొంత మా తాతగారు నిహాలు ఋషి ద్వారా సంక్రమించింది.

సాహసవంతమైన వ్యక్తిగా వుండాలని ప్రయత్నించి నప్పటికీ ఈ విజ్ఞానమంతా నేను జీర్ణించుకోలేక పోయాను. నాలో నేను బిగ్గరగా పాడుకునే ఈ భావాల అర్థం నాకు తట్టేదికాదు ఈ రహస్యాలను మరొకరితో పంచుకుందామని నిశ్చయించుకున్నాను. నేనింకా ఇంగ్లీషు పాఠాలు చెప్తున్న బాకాతో ఈ విషయాలు ముచ్చటిద్దామను కున్నాను. కాని అతడు ఆంగ్లప్రభుత్వానికి వత్తాసుపలికే 38వ డోగ్రా దళానికి చెందినవాడని గుర్తుకు వచ్చింది. ఈ విధమైన దేశద్రోహకరమైన ప్రసంగం

వల్ల ప్రభుత్వంతో అతనికి చిక్కులు కలగవచ్చు.

చాలసేపు ఆలోచించి నాలోనేను మధనపడి నిగ్రహించుకున్నాను. అమరనాథ్ మాష్టారు తమ్ముడైన లల్లా కేదారనాథ్‌ను చివరగా ఎంచుకున్నాను. అతడు లాహోరులోని కళాశాలలో బి.ఎ. డిగ్రీకి నాల్గవ సంవత్సరం చదువుతున్నాడు. అతడు మాష్టరు హరిచంద్రతో మాట్లాడే ధోరణిని బట్టి విప్లవం పట్ల మొగ్గు చూపుతున్నాడని అనిపించింది.

మా బడికి యాభై గజాల దూరంలో అమర్‌నాథ్ మాష్టారు యిల్లు. వాళ్ళయింటి ముందుగదిలో ఈ కుర్రవాడు వుండటం పసిగట్టాను. మా నాన్నకోసం 'ట్రిబ్యూను' వార్తాపత్రిక తీసుకెళ్ళడమనే నెపంతో వాళ్ళింట్లోకెళ్ళాను. వారి యింట్లోనుంచి ప్రతి శనివారమూ ఆ పత్రికలన్నీ మా నాన్న అరువు తెచ్చుకుంటాడు. సాయంకాలం నాలుగు గంటలకు ఆంగ్ల సంప్రదాయంలో కేదారనాథ్ టీ తాగుతుంటాడని నాకు తెలుసు.

భయపడుతూ వెళ్ళి గుక్కతిప్పుకోకుండా పరిచయం చేసుకున్నాను.

'నాపేరు కృష్ణచంద్ర. మా నాన్న బాబూ రామచంద్ర!'

'నాకు తెలుసు. నీవు పేపరు తీసుకెళ్లడానికి వచ్చావు. మీ నాన్న పేపరు కొనడానికి కూడా పిసినారి.' అన్నాడు తను.

'అలా కాదు ఆయన సివిల్, మిలిటరీ గెజిట్ చదువుతారు. అది ఆఫీసర్ల మెస్ నుండి ఉచితంగా తెస్తారు.' అన్నాను.

'ఒకరి నమ్మకాల వల్ల మరొకరు బాధపడాలి. ఆయన నమ్మకాలను ఆచరించే ధైర్యమాయనకు లేదని నాకు తెలుసు. మా ఆశయాల పట్ల సానుభూతి ఆయనకున్నా, ఆయన పిరికి పంద...... విప్లవకారుణ్ణే ఈనాడు నేరస్తుడిగా చూస్తున్నారు. వారిని వేటాడుతున్నారు. మేమందరం నేరస్తుల మవుతాము. తెల్లదొరలనుండి స్వాతంత్ర్యం కోసం - ఆ ఆశయసిద్ధి కోసం - అతిమానవ ధైర్యాన్ని, నమ్మకాన్ని పొందడానికి మేము బాధలు అనుభవించాలి.'

ఆయన తన ఉద్దేశాలను ఇలా స్పష్టంగా చెప్పేసరికి, నేను నా

చిన్నతనమనే గూడులో యిరుక్కొని, సమర్థించుకోవలసిన స్థితిలో పడ్డాను.

'భయపడకు నేను తినను.' అన్నాడు కేదారనాథ్ నెమ్మదిగా— "ఇవిగో. నా వద్దకొన్ని భక్ష్యాలున్నాయి. రా. నాతో కూచొని తిను." అంటూ నన్ను లాగి వాలు కుర్చీలో పడుకోబెట్టి, పళ్లెంలోంచి ఒక భక్ష్యం తీసియిచ్చాడు.

వాలుకుర్చీలో పడుకోవడం అసహ్యమేసి లేచి కూచొని భక్ష్యం తిన బోయాను.

'లాహోరు పెద్ద పట్టణమా?' అన్నాను.

'అవును. అక్కడ దారి తెలియక అవస్థ పడతావు.' అన్నాడు అతను నాకు టీ కలిపియిస్తూ.

'అక్కడ ఒక కుట్రకేసు జరుగుతోందనుకొంటాను.'

నా తీక్షణ బుద్ధిపట్ల కేదారనాథ్ మూగపోయాడు.

'ఈ కేసు గురించి నీకేమి తెలుసు? ఏసు క్రీస్తువలె ఎందరో మన స్నేహితులు బలి అవుతారు..... కాని, వారి స్థానంలో లక్షలాదిమంది వస్తారు. బాలగంగాధర్ తిలక్, పింగళే, సావర్కార్ ఉన్నారు.'

ఇప్పుడు నాకు మాట్లాడే అవకాశం దొరికింది. మాష్టారు హరిచంద్ర డా. చునీలాల్ నాకు చెప్పిన విషయాలు బయట కక్కి వేద్దామనుకొన్నాను. కేదారనాథ్ గంభీరంగా మాట్లాడిన ధోరణి, దురదృష్టవశాత్తు నానోరు నొక్కివేసింది.

నేనేదో తుంటరి ఆలోచన చేస్తున్నానని కేదార్‌నాథ్ ఒక్క క్షణంలో పసిగట్టినట్లున్నాడు. ఆయన టీ చప్పరిస్తూ, దారిన వెళుతున్న వారిని పరికిస్తూ కూచున్నాడు.

దేశంలో మా నాన్న పరిస్థితి ఎంత క్లిష్టంగా వుందో, కేదార్‌నాథ్ మాటల వల్ల అర్థమవుతోంది. దీని పర్యవసానం ఎలా పరిణమిస్తుందో ననే భయం నాలో ఆవహించి నా మెదడును కలవరపరచింది. ప్రభుత్వాన్ని ఎదిరించడానికి వ్యక్తులంతా సమూహంగా ప్రయత్నించడము,

నా విజ్ఞానానికి ఎరుకపడని ఎందరో మహనీయుల పేర్లు ఇతని ద్వారా తెలియడము నన్ను మంత్రముగ్ధుణ్ణి చేశాయి. నాలో కలుగుతున్న కొత్త ఆలోచనలు, ఆ ఆలోచనల కొత్తదనం వల్ల నాలో ఒక ఉత్సాహ స్థితికి ఎదిగేలా చేశాయి. రెనాల్డ్సు మహాకవి వలె దేవకి మీద నవల వ్రాయాలని అప్రయత్నంగా నాలో ఏర్పడ్డ భావాలు ఒక వైపు, విప్లవ మనస్తత్వంతో కేదార్‌నాథ్ మాటలు వినడం మరొకవైపు కనిపించాయి. గద్దర్ ఉద్య మంలో చేరడానికి అమెరికా వెళ్లాలని నిశ్చయించుకొన్నాను స్వేచ్ఛా జీవనం గల ఆ దేశంలో స్వాతంత్ర్యం కోసం పోరాడటం సులభం.

'ఈ విప్లవ కారుల కుట్రలో చేరడం ఎలా?' అన్నారు.

'ఉష్! మూర్ఖంగా మాట్లాడకు ఇదంతా చెప్పడంలో నేను చేసిన ప్రతిజ్ఞలన్నీ మరిచిపోయాను..... నేరస్థులనీ అమాయకులనీ వేలాది ప్రజ లను దమననీతి వహించే ఆంగ్ల ప్రభుత్వం భారత రక్షాచట్టం కింద అరెస్టు చేసి జైళ్లలో బంధించింది. ఆవిషయం నీకు తెలుసా? పోలీసులు దొంగనేరాలు మోపి, డబ్బులిచ్చి సాక్ష్యాలు చెప్పించి, వారిమీద కుట్రకే సులు బనాయించి, జట్లుజట్లుగా భారతీయుల్ని అండమాన్ ద్వీపాలకు తరలించడమో, ఉరితీయడమో జరుగుతోంది. సిపాయిలను అన్యాయంగా వారి చట్టప్రకారం విచారిస్తున్నారు.'

'మా దళంలో కొండప్రాంతం వారిని, ఏ విధమైన విచారణ లేకుండ కాల్చివేశారు.' గొప్పగా చెప్పాను.

'అక్కడ పరిస్థితి మరీ అన్యాయంగా ఉంది. ప్రభుత్వ అణచివేత చర్య అనే ఆటు పోట్లకు ఎవరు బలి అవుతారో తెలియదు...... నేను చెప్పిన మాట పొల్లుపోకూడదు.'

'తప్పకుండా. నేను బయట పొక్కనీను' అన్నాను వెంటనే.

'సరస్వతి మీద వొట్టు పెట్టు. నీ చేతిలో వున్న పుస్తకాల సంచి తలమీద పెట్టు కొని ప్రమాణం చెయ్యి.'

నేను తలమీద పుస్తకాల సంచి పెట్టుకొన్నాను.

'నేను చెప్పిన మాటలు మళ్లీ వల్లించు— సరస్వతి మీద ప్రమాణం

చేసి చెబుతున్నాను. కేదార్‌నాథ్‌తో మాట్లాడిన విషయాలు మా అమ్మానాన్నతో గాని, మరెవరితోగాని ప్రస్తావించను.'

ఆయన చెప్పిన మాటలు యధాతథంగా వల్లించాను.

'అంత పెద్దగా కాదురా మూర్ఖుడా ఇంట్లో వాళ్లు ఎవరైనా వింటారు. వాళ్లు బయట పెట్టవచ్చు దానివల్ల మా అన్నకు బడిలో సహాయ హెడ్మాష్టరు పదవికి ముప్పు వస్తుంది...... సరే. ట్రిబ్యున్ పత్రికలు ఎక్కడున్నాయో వెదకనీ! నువు యిప్పటికే యింటికెళ్లడం ఆలస్యమైంది గాబట్టి, మా అన్నయ్య సైకిలు మీద నిన్ను యింట్లో దిగబెడతాను.' అన్నాడు కేదారనాథ్.

కేదార్‌నాథ్ పట్ల నాకు విపరీతమైన ఆరాధనాభావం కలిగింది. నాకు తెలిసిన విషయాలకంటె అతను ఎన్నో కొత్త విషయాలు చెప్పాడు. నేను సాధారణంగా వెళ్లి మాట్లాడటానికి, ప్రత్యేకంగా లాహోరు గురించి తెలుసుకోవడానికి యితని దగ్గర చనువు ఏర్పడింది. అపరిచిత వ్యక్తులను గురించి, కొత్తకొత్త ఆలోచనలను ఆయన వద్ద తెలుసుకొందామనే ఆసక్తి గలిగింది. జీలంలో మరో యితర కుర్రవానికి తెలియని రహస్యం, నేను తెలుసుకోగలిగినందుకు నాలో అత్యుత్సాహం పెల్లుబికింది. నాలో భయమున్న మాట వాస్తవమే అయినా, ఒక కొత్త ఆలోచనా విధానంలో అనుభవంకల వ్యక్తినయ్యాను. ఆ ఉత్సాహంవల్ల ఏర్పడ్డ పిచ్చితో స్వాతంత్రం సాధించడానికి స్థిర సంకల్పంతో ఉన్నాను. నా తలకు మించిన అపారదృష్టి అనూహ్యంగా, అవ్యక్తంగా నాలో మెదలుతోంది. నా ఆలోచనలను తికమకచేసి, సహేతుకంగా ఆలోచించ గలుగుతున్నాను. ఈ పిచ్చిదారిలో నడచి నేను మృత్యువు వాత పడవచ్చు. లేదా నా లక్ష్యసాధనలో కృషి కొనసాగించ వచ్చు.

కొత్తకొత్త ఆలోచనలకోసం నా మెదడు వెదకసాగింది. భారతీయతా సౌభాగ్యం గురించి నా ఆత్మలో అన్వేషించడం, డా. చునీలాల్, లాలా కేదార్‌నాథ్ నాలో కలిగించిన ఉత్సాహం వల్ల ఏర్పడిన ప్రశ్నల పరంపరలకు సమాధానాలు వెదక నారంభించాను.

దురదృష్టవశాత్తు మహా లౌక్యుడైన లల్లా కేదార్‌నాథ్ చెప్పిన

మాటల్లో కొన్ని మాత్రమే — త్యాగము, ఏసుక్రీస్తు, సరస్వతి, ప్రతిజ్ఞ అండమాన్లు, స్వాతంత్రము, గుర్తున్నాయి. కాని, అవి నా ఆత్మలో చొరబడలేదు. విప్లవమనే నాటకంలో దేవుని పాత్రను పోషించడానికి నాముఖంపై ప్రకాశిస్తున్న ఉజ్జ్వలతారలు యీ మాటలు మాత్రమే.

'వీటిని అలవరచుకోవడ మెలా?' అవి నాలో భాగమై, నా సంక ల్పాన్ని బలపరిచేవిగా ఎలా మారుతాయి - అనే ప్రశ్న నన్ను నేనే వేసుకొన్నాను.

నేను విప్లవవాదిని కావడానికి ముందు, మానాన్న దృష్టిలో 'వికా రపు వ్యక్తి'గా గుర్తింప బడాలి. ఇదంతా గొప్ప సంభాషణ, - జీతం, హోదా, పింఛను - వీటితో సంబంధం లేదు. నిద్ర కుపక్రమించడా నికి ముందు నాలో నేను అనుకొన్న మాటలేవీ తెల్లవారేసరికి గుర్తు వుండేవి కాదు.

జీవిత ధ్యేయాన్ని గూర్చి సంశోధన చేసే అస్థిరమైన ఆత్మలో అవ్యక్తమైన ఆందోళన మెదలసాగింది.

మరునాడు బడికి వెళ్లి వస్తూ, లల్లా కేదార్‌నాథ్‌ను కలుద్దామను కొన్నాను. వేదాంతాన్ని వీలైనంత త్వరలో చదవగలిగితే, నా ప్రశ్నలకది సమాధానం యివ్వగలదేమోనని ఆశ.

అమరనాథ్ మేష్టారు బీజగణితం పాఠం చెబుతుంటే, రెండు మార్లు బెంచీ మీద నుంచోవలసి వచ్చింది. పాఠాలు బోధ పడటం లేదు. విరామ సమయంలో నా గురువుకోసం పరుగులు తీశాను.

లల్లా కేదార్‌నాథ్ తదేకంగా చదువుతున్నారు. నేను వెళ్లి భంగ పరచడంతో కోపపడ్డారు. అనుకోకుండా నేను వెళ్లినందుకు నా మీద ఆయన కోప్పడతారని నేనూహించలేదు.

'ఒక్క నిముషం మీతో మాట్లాడాలని వచ్చాను. వేదాంతమంటే ఏమిటి?'

తన మనస్సు మీద హఠాత్తుగా దాడిచేసి, తాను ఏదో విషయం గూర్చి ఆలోచిస్తుంటే భంగపరచినందుకు, ఆయన కళ్లు పైకి ఎత్తిచూసి,

ముఖ భంగిమమార్చి, నాలుక తడుపుకొంటూ, నవ్వి అన్నాడు·

'వేదాంత మంటే ఏమిటి?'

'అవును. వేదాంత మంటే ఏమిటి?' అన్నాను నొక్కి.

'సరే' అన్నాడు బుర్ర గీకుకొంటూ నవ్వి. నన్ను తరిమివేసే బదులు, ఆయన చేతిలోవున్న పని నుండి కొంత విశ్రాంతి తీసుకోవచ్చు ననుకొన్నట్లుంది.

'కొంచెంసేపు కూచో. నాలో ఆలోచనల్ని కూడ దీసుకొనీ!' అన్నాడు మరింత బిగ్గరగానవ్వి.

నేను శ్రద్ధగా ఆయన మాటవిని, శిష్యుడిలా ఆయన కాళ్లముందు కూచొన్నాను. ఇది ఆయనకు మరింత నవ్వు తెప్పించినట్లుంది. ఆయన ఆవులించి, చేతులు విరుచుకొని, అట్టహాసం చేసి మొదలెట్టాడు

'తమ్ముడూ! నాకు తెలిసినంత వరకు అన్ని సమాధానాలు అందరికీ తెలియవు. జీవితం గురించి ప్రజలు ప్రశ్నిస్తూనే వుంటారు. మా విశ్వవిద్యాలయంలో ఆచార్యులు ముఖ్య విషయాన్ని దాటవేస్తారు. తర్క శాస్త్రంపై దివాన్ చంద్ర శర్మ వ్రాసిన రెండు పుస్తకాలు, మెకంజీ పండితుని 'నీతి శాస్త్రము,' జెవాన్ రచించిన 'వేదాంతమంటే ఏమిటి?' చదివి ఎవరైనా డిగ్రీ సంపాదించవచ్చు. హాఫ్‌డింగ్ రచించిన తత్త్వ చరిత్రవంటి ఉద్గ్రంధాలు చదివి నావలె త్వరలో వేదాంతంలో ఎం.ఏ. డిగ్రీ సంపాదించవచ్చు. గోడమీద పిడకలు ఎలా నిలుస్తున్నాయి? వంటి ప్రశ్నలకు సమాధానాలు నేర్చుకొంటారు. ఇది నిజమా? అబద్ధమా? లేక మిధ్యా. ఈ విధమైన కళాశాల బోధనా విధానంలో రెండు ప్రాథమిక ప్రశ్నలు మిగిలిపోతాయి. 'సత్యమేదీ? దాన్ని తెలుసుకోవడమెలా?' పుస్తకాలు కంఠస్థం చేసి, వల్లించి డిగ్రీలో రెండవ తరగతి సులభంగా సంపాదించవచ్చు.'

'కోపపడవద్దు, నాకు కావలసింది నా అంతరాత్మను గురించి నీ ఆత్మను గురించి మీరేమి తెలుసుకొన్నారో - అది నాకు కావాలి.'

లల్లా కేదారనాథ్ నవ్వారు. గంభీర ముఖం దాల్చి ఆయన చెప్పారు.

'మా తరగతి గదిలో నీవు ఇదే ప్రశ్నవేస్తే, మా ఆచార్యుడు నీ ప్రశ్నను చాదస్తంగా కొట్టి వేసి, 'వెళ్లి ఎవరైనా మోసగాడి నడుగు. ఇక్కడ మేము శాస్త్రబద్ధమైన వివరాలు తెలుసుకోడానికి ఉత్సాహం చూపుతాం.' అంటాడు. నీ ప్రశ్నలో ఉద్దేశమేమిటో నాకు తెలుసు. మేము కలత చెందినట్లే, నీవు కూడా కలత పడుతున్నావు నేను వేదాంతం ఒక విషయంగా చదవడానికి కారణమిదే.'

'నేను కూడా తత్త్వశాస్త్రం చదువుతాను.' అన్నాను అప్రయత్నంగా— మా పిన్ని కూతురు కౌసల్య, మా ప్రతాప్ బాబాయి, చనిపోయినప్పటి నుండీ నాలో భయం ఆవహించింది. ప్రతి ఒక్కరూ చనిపోవాలని నాకు తెలుసు. మానవుడు చనిపోవడానికే ఎందుకు పుడతాడు? తాను చేసిన మంచి, చెడు కర్మల ననుసరించి - అమ్మ చెప్పినట్లు - స్వర్గమనేది అసలు వుందా? ఇదంతా భగవంతుడు సృష్టించాడా? లేక ఎలానో ఉద్భవిస్తోందా? ఈ ప్రశ్నలు నన్ను బాధిస్తున్నాయి. ఇతరులు పశువుల వలె అన్ని విషయాలను యధాతథంగా స్వీకరిస్తే, నేనొక్కడినే ఈ ప్రశ్నలన్నీ అడుతున్నట్లనిపిస్తుంది.

'ఎప్పుడో ఒకప్పుడు ప్రతి మానవుడు కష్టాల నెదుర్కొంటాడు' — మా గురువుగారు అడ్డుతగిలి అన్నాడు: 'నువ్వొక్కడివే కాదు. ప్రియమైనవారు చనిపోతారు. అప్పుడు మనుషులు చికాకు పడతారు. మృత్యువు అంతిమ విషయంగా భావించి జీవితం గూర్చి ఆలోచిస్తారు. లేదా ఏకాంతాన్ని అనుభవించి యితరులతో సంబంధం తెగిపోయినట్లు భావిస్తారు. ఏం చేయాలో తోచదు. మంచి, చెడూ ఆలోచన రాదు. ఈ తల్లిదండ్రులు నియమాలు పెడతారు. వాళ్లు వాటిని అతిక్రమిస్తారు. వాళ్లు సత్యానికి దూరంగా వెళుతున్నట్లు నీకు తెలుసు. చట్టాల్ని ఉల్లంఘించినవారు దోషులా? లేకనీవు దోషివా? ఇద్దరిలో ఎవరిది సరియైన మార్గం? అనే ప్రశ్న కలుగుతుంది అసలు ఈ నియమాలు అంగీకార యోగ్యమైనవా? కావా? నీకు తెలియదు. నీకు కళ్లున్నాయి. నీకు నైతికంగా అగమ్యగోచరస్థితి. ప్రతిదానిని గురించి డోలాందోళన పరిస్థితి నీ యింట్లోనే నీవు చెరసాలలో వున్నట్లు భావిస్తావు. అందువల్ల నీవు మళ్లీ అందరినీ ప్రశ్నలు వేయనారంభిస్తావు...... ఇదొక విషవలయం.'

'నిజానికి నా పరిస్థితిని సరిగా చెప్పారు' అన్నాను — 'మాయింట్లో పరిస్థితులు అస్తవ్యస్తంగా ఉన్నాయి. డా. చునీలాల్‌గారి యింట్లో వుండి పోదామనిపిస్తుంది. ప్రతిదానిలో దేవుడున్నాడని మా అమ్మ భావన. అన్ని మతాల దేవుళ్లను ఆమె ఆరాధిస్తుంది. మా నాన్న యిష్టపడే దేవకి పిన్నిని మాత్రం ద్వేషిస్తుంది. మేం పరీక్షల్లో నెగ్గా లని మా నాన్న కోరిక. దాని వల్ల ఆయనకు హోదా. ఆయనకు డబ్బుపై విపరీత మమకారం. మా నాయనమ్మ తన నగలు ఆస్తి మా బాబాయికి వీలునామా వ్రాసింది. మా నాన్నకు వ్రాయలేదు. మా వదినెకు మా అన్న అంటే గిట్టదు ఆవిడ అతనికి విషం పెట్టడానికి వెనకాడదు. మా అన్నయ్య గణేశ్ చెప్పినదల్లా చేస్తాడు గాబట్టి వాడు మంచివాడు. మా తమ్ముడు శివ అమాయకుడు. నేను కవిత్వం వ్రాయడం, వేదాంతం నేర్చుకోవడం, అస్పృశ్యుడైన బాకాతో తిరగడం, స్వాతంత్రం కోసం పోరాడడం చేస్తాను. అందువల్ల నేను వెధవను, తిరుగుబోతును, జులాయిగాడిని, ఎందుకూ పనికిరాని వాడిని '

'నీ అంతరాత్మలో, నీకిన్ని బాధలున్నా అందరికంటె నీవు గొప్ప వాడివిగా భావిస్తావు. ఈ బాధలను కనుగొన్న మొట్టమొదటి వ్యక్తిగా నీకు నీవే గొప్ప.'

నేను తల అడ్డంగా కిందికీ పైకి తిప్పి, అవునని అంగీకరించాను.

"నీ వయసులో నేనూ ప్రతిభావంతుడినిగా భావించాను. ఆ తర్వాత వినయం నేర్చుకొన్నాను." అన్నారు లల్లా కేదార్‌నాథ్.

'నాలో పసితనం వుందని తెలుసు అయినా ఈ ప్రశ్నలు అంటే మిగిలి పోయాయి' అన్నాను.

'నిజమే. ఆ ప్రశ్నలు నీ ఒక్కడికే కాదు. అందరికీ మనసులో నిలిచిపోతాయి.' అంటూ కేదారనాథ్ ఇలా చెప్పాడు. 'ప్రపంచంలోని అతి పెద్ద మేధావులకు కూడా ఈ ప్రశ్నలకు సమాధానాలు లభించలేదు. మన దేశంలో, ఇక్కడ పంజాబ్‌లోనే దాదాపు రెండువేల సంవత్సరాల నాడు ఈ ప్రశ్నలను అడిగారు. సృష్టిగీతలో వేదఋషి ప్రపంచం ఏ విధంగా ఆరంభమైందీ వూహించాడు. ఉపనిషత్తుల్లో మానవుడు తన్ను తానే

ప్రశ్నించుకున్నాడు: మనిషి అంటే ఏమిటి? సుఖదుఃఖాలను అనుభవించే తానే మానవుడా? మానవునిలో ఒక వ్యక్తిత్వమేకాక అనేక వ్యక్తిత్వాలు వున్నాయి: ఒకవైపు భావనలు మరోవైపు శక్తివంతమైన వ్యక్తి చేష్టలు, మరోవైపు భావ పరంపరల మానసిక స్థితి వీటన్నింటినీ మించి మన విజ్ఞానంలో భాగమైన మరొక అంశవున్నాయి. ఉదాహరణకు కోపంగా వున్నప్పుడు ఒకవ్యక్తి సహజంగా వున్నప్పటికంటె వికారంగా వుంటాడు. పరుగిడుతున్నపుడు ఎదుటి వస్తువులు అస్పష్టంగా గోచరిస్తాయి. ఒక విషయంపై భిన్న వ్యక్తులకు భిన్న స్థలాలలో భిన్నాభిప్రాయాలు కలుగవచ్చు. తీవ్ర ధ్యానం ద్వారా జ్ఞానముద్రలో ఈ ఉన్నత పథంలో సత్యాన్ని బహిర్గతం చేస్తుంది. అదే అత్యంత ఉన్నతమైన ఆత్మ, భగవంతుడు...... ఆ విధంగా పరమాత్మ ఎంతో కొంత ప్రతి ఒక్కనిలో ప్రతిబింబిస్తాడు.'

'అయితే భగవంతుని ఎవరైనా చూశారా?' అన్నాడు ఆశ్చర్యంగా.

'దర్శించిన యోగులు తాము చూశామని అంటారు. కానీ ఆయనను వర్ణించలేరు. ఆయన యిది కాదు. అది కాదు అంటారు. భగవంతునితో తాము ముఖాముఖీ వున్నపుడు ఆనంద ప్రవాహంలో మునిగితేలినట్లు నొక్కి చెప్తారు..... ఆయనలో ఐక్యం కావటానికి భక్తి, ధ్యానములతో కూడిన యోగసాధన అవసరమని హిందూ మతం చెప్తుంది. ఈ జీవన్మరణ వలయంనుండి చివరగా విముక్తిపొందాలంటే ప్రపంచంలో అదే మార్గం. ఆ విధంగా మనిషి బాధను, దుఃఖాన్ని అధిగమించగలడు.'

ఆంతరంగిక జ్ఞానాన్ని గురించి నామెదడులో అంధకార బంధుర స్థితి ఏర్పడింది. ఎవరేమి చెప్పినా అంగీకరించే స్థితిలో లేదు. పరమాత్మను గురించి నాకు సదభిప్రాయం లేదు.

'అది ఇదికాదు, అదికాదు అని చెప్పటం వల్ల ప్రయోజనం ఏమిటి? నిజంగా అది సహేతుకమైన వివరణకాదు!' అన్నాను.

'ఉపనిషత్తుల ప్రకారం ప్రశ్నలకు కూడా ఒక అవధి వుంది. బుద్ధుడు కూడా హిందువులు చెప్పే భగవత్స్వరూపానికి వ్యతిరేకి. జీవితం దుఃఖ

మయమని ఆయన చెప్పారు. బాధలకు విముక్తి మరణం. నిష్కపటంగా నీవు పనిచేస్తే నిర్వాణం సిద్ధిస్తుంది.' అని సమాధాన మిచ్చాడు లల్లా కేదారనాథ్.

'మీ వ్యక్తిగత అనుభవం ద్వారా మీ స్వీయమార్గమేమిటని అడిగాను. మీరు అది అంగీకరించారా. ...' అని పట్టుబట్టాను.

'తమ్ముడూ! ఇతరులు సమాధానం చెప్పలేని ఈ ప్రశ్నలకు సమాధానం నేనూ చెప్పలేను. నీవలె నేను కూడా ఇలా ప్రశ్నలే వేస్తుంటాను ఈ ప్రశ్నలను వివిధ మార్గాలలో వివధ వ్యక్తులు ఏవిధంగా వేశారో పుస్తకాలు చదివి తెలుసుకున్నాను. నాలోని తర్కబుద్ధి మిగతా భర్తీ చేస్తుంది. నేను నీతో చెప్పిన ఉపనిషత్తుల సిద్ధాంతం పట్ల నా మొగ్గు మనిషిలో ఒక వున్నత స్థితి వుందని నా నమ్మకం. ఇదే మనసాక్షి. అది మన ప్రవర్తనకు కొన్ని నియమాలను ఆదేశిస్తుంది. దాని ప్రకారం మనం జీవించ వచ్చు నా ఉద్దేశ్యంలో సత్యమే భగవంతుడు.'

'అయితే అజ్ఞానులూ, నిరక్షరాస్యులు అయిన వారు సత్యాన్ని తెలుసుకోలేరు. మరి వారి గతి ఏమిటి? బాకా స్థితి ఏమిటి? అతని బాధలు? ప్రపంచంలోని మానవుల స్థితి ఏమిటి?'

'వారు వారి శుభాశుభ కర్మల ఫలితంగా జీవన్మరణ వలయంలో తిరిగాలని నా భయం. వారు వివేకం పొంది, ఈ ప్రశ్నలను వేసుకొని బంధ విముక్తికి ప్రయత్నించాలి.'

అయితే మా వంటివారికి ఈ విధానంలో ఆశలేదు. మనో వీధిలో నృత్యం చేయ సాగాను. ఈ ఉత్సాహంలో దిగ్భ్రమచెంది మనసు వికలమైంది

'మేము ఏచెడ్డ పనులు చేయటం ద్వారా ఈ విధమైన బాధ లనుభవిస్తున్నామో నాకు తోచలేదు. బహుశా ఏవో కొన్ని తప్పు పనులు చేసి వుంటాను.' అన్నాను ప్రతిఘటనా ధోరణిలో.

'బాధ లనుభవించటం ద్వారా మన నేరాలను శాంతింప జేయాలి' అన్నాడాయన.

'నేను నేరం చేశానని అసలనుకోను నేను తప్పు ఏమీ చేయ లేదు— కొన్ని అబద్ధాలు చెప్పి వుండవచ్చు నేను అమాయకుణ్ణి' అన్నాను.

'అయితే ఈ ప్రశ్నలన్నీ అడగటం ఎందుకు? మానవుని ధ్యేయం గురించి బాధల గురించి ఆలోచించట మెందుకు? భవిష్యత్తును గూర్చిన వూహేమిటి?' అడిగాడు కేదారనాథ్.

నేరాన్ని అంగీకరించనందుకు ఇప్పుడు బాధపడ్డాను.

'ప్రతిదానికీ తికమకపడి, అజ్ఞానంలో వున్నానని నేను నిజంగా అనుకోవటం వల్ల కావచ్చు.'

'మరి కొంచెం టీ తాగుదాం పద!' అన్నాడు.

# 9

నాలో పెరుగుతున్న ఆదుర్దాకు సరిపడేలా, నా ఊహలతో సత మతమవుతున్నాను. మా నాన్న, అమ్మ సహజంగా తల్లిదండ్రులు అను భవించే ఆదుర్దాలో వున్నారు. గణేశ్ పెళ్లి పనుల హడావిడిలో - మంచి ముహూర్తం పెట్టించడం, పెళ్లి జరపడానికి మంచిరోజు నిర్ణయించడం - జేస్తున్నారు. యుద్ధం ముగియ బోతూవుంది గాబట్టి, ఈజిప్టునుండి దళాలు వెనక్కి తిరిగి వచ్చే అవకాశం వుండటం వల్ల దురదృష్టవశాత్తు పని ఎక్కువ కావచ్చునని నాన్న వూహించాడు. ఏప్రిల్ నెలలో తనకు 15 రోజుల సెలవు మాత్రమే దొరుకుతుంది గాబట్టి, ఆ సమయంలో ఈ పెళ్లి ముహూర్తం కుదర్చాలని ఆయన ప్రయత్నం.

రెజిమెంటల్ వీధిలో పురోహితుడు కుట్రలు పన్నడంలో చూపే తెలివి తేటలు, తారాబలం చూసి ముహూర్త నిర్ణయం చేయడంలో చూపలేదు గాబట్టి ఆయనను సంప్రదించలేదు. జీలంలోని వివిధ దేవాల యాలలో బ్రాహ్మణులను చాలా మందిని సంప్రదించారు. దీనికంతటికీ

డబ్బు కావాలని నాన్నకు చికాకు గణేశ్‌ను దత్తత తీసుకొంది కాబట్టి, పెళ్లి ఖర్చులన్నీ దేవకి భరించాలని నాన్న ఉద్దేశం. అమ్మ సలహా ప్రకారం మంచిరోజు నిర్ణయించారు గాబట్టి, బ్రాహ్మణుడికి తాను దక్షిణ యిచ్చింది. ఏప్రిల్ మొదటి పక్షంలో ఆయన తారాబలం, చంద్రబలం చూసి ముహూర్తం పెట్టాడు. దేవకి పెళ్లిఖర్చు పెట్టి, పెళ్లి తంతులో తాను అత్తగారి పెత్తనం చెలాయించి తనకే ఎసరు పెడుతుందని తారాబలం మీద ఆశ పడింది అమ్మ. విధవరాలైన తన తోడికోడలు, తన ప్రత్యర్థి మీద గెలుపు సాధించి, కొడుకును, కోడలిని యింటికి తెచ్చుకోవడమే గాక, తన భర్తను కూడా తనవైపుకు మరులు కొలుపగలదని అమ్మ అనుమానం తా నాశించిన ఫలితాలకోసం ఒక యంత్రం వ్రాసి పెట్ట మని నాచేత నదిదగ్గర గుడిపూజారి పండిత సూర్యకాంతకు ప్రత్యేక సందేశం పంపింది. ఆయనకు పది రూపాయలు దక్షిణ, పంచభక్ష్య పరమాన్న భోజనము ఆశ చూపింది.

ఆ బ్రాహ్మణుడు సన్నగా తీగవలె వంగి చామనచాయగా కొట్ట వచ్చినట్టు కనపడే వ్యక్తి. ఆయన వెంటనే అంగీకరించి కాగితము ముక్కలు తీసుకొని దాని మీద రాశిచక్రాలు, యంత్రాలు వేసి యిచ్చాడు వాటిని అన్నములో కలిపి గణేశ్‌కు అతని కాబోయే భార్యకు, దేవకికి, నాన్నకు విడివిడిగా యివ్వమని చెప్పాడు. నాన్న ప్రతిదఫా అమృత సర్ వెళ్ళినపుడు అమ్మకు వచ్చే తలనొప్పి ఈ దఫా రాలేదు. ఈ మంత్రతంత్రాల ప్రభావం వల్ల చివరకు తాను విజయాన్ని సాధించగల ననే నమ్మకం ఆమెకు కలిగింది. మహత్తర ప్రభావంగల మందు నిచ్చిన పండిత సూర్యకాంత్ శక్తి వల్ల కలిగిన ఉత్సాహంతో పెండ్లి పనులు చూడటానికి తరచూ వెళ్ళి రావలసిందిగా అమ్మ నాన్నను పురమాయిం చేది. పెండ్లికొడుకు ధరించ వలసిన దుస్తులకు కొలతలు యివ్వటానికి దేవకి వద్దకు గణేశ్‌ను ఉద్దేశ్యపూర్వకంగా ఒకనెల ముందు పంపింది.

అసక్తి లేకపోయినా ఈ ఏర్పాటులన్నీ గమనిస్తూనే వున్నాను. చాలా కాలంగా ఉన్న కుటుంబ తగాదా పట్ల నాలో విసుగు పుట్టింది. అమ్మ మంత్ర తంత్రాల పట్ల విముఖత ఏర్పడింది. రాబోయే శుభ కార్యంలో ఖర్చులన్నీ పెట్టించి నా కిష్టమైన దేవకిపిన్నిని దివాలా తీయిం

చాలనే అమ్మా, నాన్నల ప్రయత్నాన్ని నిర్లిప్తంగా గమనిస్తున్నాను. ఈ విషయాలన్నీ శకుంతల వదినతో ముచ్చటించాను. ఆవిడ దిగ్భ్రాంతి చెంది, శివను, నన్ను తప్ప మిగతా కుటుంబ సభ్యులను ఏహ్యాభావంతో చూడసాగింది.

డాక్టరు చునీలాల్, లల్లా కేదారనాధ్ అరువుగా యిచ్చిన పుస్తకాల ద్వారా జ్ఞానతృష్ణను తీర్చుకునే వాడిని. వారానికి ఒక పుస్తకం చొప్పున చదివే వాణ్ణి. కేవలం ఉబుసు పోకకు చదవటం కాక, కర్తవ్యోన్ముఖులను చేసే దూతలుగా అవి నాకు కనిపించాయి. వాటి భయంకర అజ్ఞాత శబ్దాలు, వర్ణాలు, సువాసనలు, భయంకరమైన ఆలోచనలూ, నా శరీరంలోంచి ఆత్మను వెలికి తీసే జ్ఞానదృష్టిని జీర్ణించుకోవడానికి సహాయపడ్డాయి.

పెండ్లి ముహూర్తం యింకొక పది రోజు లుందనగా అమ్మ సామానులన్నీ సర్దింది. నాకు, శివకూ కొత్త బట్టలు వేసింది బీర్‌సింగు సహాయంతో అమృతసర్‌కు రాత్రిరైలు ఎక్కాము.

స్వగ్రామానికి తిరిగి వచ్చిన ఉత్సాహము, పాతస్నేహితులను, స్వర్ణ దేవాలయాన్నీ దర్శించే అవకాశమూ, అమృతసరస్సులో ఈదే భాగ్యమూ అమృతసర్‌కు రావడంతో కలిగాయి యధావిధిగా దేవకి నాపట్ల అనురాగం చూపింది. నుదుటిపై, బుగ్గలపై ముద్దుపెట్టుకొంది 'ఇంక తర్వాత నీ పెండ్లి వుంది.' పెండ్లి కూతుర్ని చూపించి పెండ్లి చేసే అవకాశం ఎప్పుడు కల్పిస్తావని నాతో చమత్కారం చేసింది.

బంధువులు రావటం పోవటం మా సందులో వంటవాడు పిండి వంటలు చేయటం వాటిని నలుగురికీ పంచటం కంసాలులు నగలు చేయటం చూస్తూ అందులో లీనమై పోయాను. దర్జీలు పెండ్లి కూతురు గుడ్డలు కుడుతున్నారు. పట్టుగుడ్డపై చమ్కీలు, జరీపుటాలు మాయింటి మొదటి అంతస్తులో కుడుతున్నారు. దేవకి యింటి మొదటి అంతస్తులో కంసాలులు బంగారు ఆభరణాలు చేస్తున్నారు. ఈ మధ్యలో నేను దేవదత్త, భగవాన్ దత్త బాబాయిలను కలిసి వచ్చాను. వారిద్దరూ లాహోరులోని డి.ఏ.వీ. పాఠశాలలో స్వచ్ఛంద ఉపాధ్యాయులుగా పని

చేస్తున్నారు. వాళ్ళిపుడు శలవులకు యింటికి వచ్చివున్నారు.

కడుపునిండా పిండివంటలు తినడానికి సరదాగా గుడ్డలు వేసుకోవటానికీ, చుట్టూ సుఖ సంతోషాలను పంచటానికీ హిందువుల పెండ్లి మంచి అవకాశం కల్పిస్తుంది సంప్రదాయ బద్ధమూ, కేవల తంతు అయిన ఈ వివాహం జరపటానికి మా కుటుంబం పూనుకున్నందుకు దత్తాబాబాయిలు సంస్కరణ దృష్టితో విమర్శించే వారు. ఆ అభిప్రాయాలను నేను మామూలు ధోరణిలో కాక ప్రత్యేకంగా వినే వాడిని. మేము లాంఛనంగా పంపిన తినుబండారాల కానుకలను వాళ్ళిద్దరూ నిరాకరించారు. నేను వారిద్దరికీ ప్రీతిపాత్రమైన వాడిని కాబట్టి నేను తీసుకు వెళితే వారు అంగీకరిస్తారని నాన్న సలహాయిచ్చాడు.

ఆదేశంతో సమానమైన ఈ సలహాకు నేను అంగీకరించాను. నేను బుట్టను దేవదత్త బాబాయి కూర్చున్న గదిలోకి చేర్చగానే ఆయన భగవాన్‌దత్త బాబాయిని పిలిచి — 'ఈ తెలివి తక్కువ పని చూడ'మన్నాడు. ఇద్దరూ కలిసి నాకు ఉపన్యాస మిచ్చారు·

'హిందూ మతంలో సంస్కరణవాదమైన ఆర్య సమాజంవైపు మొగ్గు చూపుతున్నావనుకున్న నీవు కూడా ఇలా చేశావా? ఈ పని నీచేత చేయించటానికి నీవు ఎలా వొప్పుకున్నావు?' దేవదత్త బాబాయి వ్యాఖ్యానించాడు

'దేవకెపెన్ని తన డబ్బును ఇతరత్రా ఖర్చు చేయకుండా గణేశ్ పెండ్లికి మాత్రమే వినియోగించాలని నాన్న అనుకోవటం వల్ల యిదంతా జరిగింది.' నిజం వెళ్ళ గక్కాను.

'ఎంత తెలివైన ఆలోచన! కొద్దిపాటి డబ్బుకోసం ఒక కుర్రవాడి జీవితాన్ని బలిచేస్తున్నారు— ఈ వరకట్నాలు యింకా—' అంటూ విసుగుతో సోదరుని గదిలోనుంచి బయటికి నడిచి ముంగిటిలోంచి తన సంస్కృతాధ్యయన మందిరంలోకి వెళ్ళాడు.

'నాయనా యిది సిద్ధాంతాలకు సంబంధించిన ప్రశ్న. చదువుకున్న నీ కుటుంబం కూడా వాటిని ఆచరణలో పెట్టటం లేదు' దేవదత్త బాబాయి నిండు మనస్సుతో అన్నాడు.

'నాన్న స్నేహితులందరూ సంస్కరణవాదులు కదా!' అన్నాను. 'ఆయన మాకు నిజమైన స్నేహితుడైతే సైన్యంలో నుంచి రాజీనామా చేసివుండేవాడు. ఇప్పుడిక సర్దుబాటు వ్యవహారమేమీ లేదు. ఆంగ్లప్రభుత్వం తయారు చేయబోయే రౌలత్ చట్టం చూడు—' దేవదత్త బాబాయి విషాదంగా అన్నాడు.

'రౌలత్ చట్టమా? ఈ పీడ ఏమిటి బాబాయ్' అని అడిగాను.

'ఒకచోట నలుగురు సమావేశమైతే నేరమని ప్రభుత్వం చట్టం చేసింది' ఆయన కనులు ఎఱ్ఱనై ఉద్రేకంలో అప్రయత్నంగా కుడిచేయి పైకిలేచింది— 'ఈ రాక్షసి చట్టానికి వ్యతిరేకంగా దేశమంతా ప్రతిఘటన ప్రారంభమైంది. యుద్ధంలో సిపాయిలు చేసిన సేవలకు ఆంగ్ల ప్రభుత్వం మన దేశానికి యిస్తున్న బహుమాన మిది..... ప్రజలందరినీ ప్రతిఘటించమని మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ కోరుతున్నారు ఇప్పుడిక సర్దుబాటు ధోరణి లేదని నీకు చెప్తున్నాను.'

అంతకు ముందు నేనెన్నడూ మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ పేరు వినకపోవటం వల్ల దేవదత్త బాబాయివైపు తెలివి తక్కువగా చూశాను.

'దక్షిణాఫ్రికాలో బారిష్టరుగాంధీ. ఆయన టాల్‌స్టాయ్ అనుయాయి. బ్రిటీష్ వారినుండి మన స్వాతంత్ర్యాన్ని అహింసా మార్గం ద్వారానూ, సహాయ నిరాకరణ ద్వారానూ, పొందవచ్చునని చెబుతున్నాడు' అన్నాడు దేవదత్త బాబాయి.

'బానిసలకు విముక్తి కలిగించిన టాల్‌స్టాయ్ గదా!' అన్నాను తెలివి తేటలు ప్రదర్శించటానికి. ఇటీవల కేదారనాథ్ దగ్గర అరువు తెచ్చుకొని ఆయన వ్రాసిన పుస్తకాలలో 'పునర్నిర్మాణం' అనే గ్రంథం చదివాను.

'ఈ రష్యన్ రచయిత చెడుకు వ్యతిరేకంగా అహింసాయుత పోరాటం గూర్చి ఒక గ్రంథం వ్రాశాడు. ఆఫ్రికాలో తెల్లవారికి వ్యతిరేకంగా గాంధీ ఈ పద్ధతి ననుసరించాడు. నల్లవారిని తాము నడిచే దారిలో నడవనీకుండా తాము ప్రయాణించే రైలు పెట్టెలో వారిని

అనుమతించకుండా వుండేవారు....... ఒకసారి గాంధీమొదటి తరగతి రైలుపెట్టెలో ప్రయాణిస్తున్నారు. తెల్లవారు ఆయనను త్రోసివేశారు. అదిమొదలు ఆయన దక్షిణ ఆఫ్రికాలో నీగ్రోలు, భారతీయుల పక్షాన అహింసా మార్గంలో పోరాటం చేస్తున్నారు...... ఇటీవల ఆయన భారత దేశం వచ్చారు. ఆయన అహింస గురించి వ్రాశారు. ఈ నిపురు గప్పిన నిప్పు నీ దగ్గర వుందా? ఆయన వ్రాసిన వ్యాసం ఇక్కడ వున్నట్లు లేదు. ఆయన కథల పుస్తకం ఒకటి నీకు యిస్తాను. నేను పారంచెప్పే బడిలో అది పాఠ్యపుస్తకం....... నీవు తెచ్చిన చెత్తబుట్ట తీసుకెళ్ళు. మధ్యాహ్నం వస్తే పుస్తకాలు వెదికి పెడతాను.'

అహింస అనే అర్థంకాని కొత్తపదంతో యింటిముఖం పట్టాను.

సర్దుబాటు ధోరణిలో నడిచే నాన్న ప్రపంచం; కఠినమైన నియమాలతో నడిచే జాతీయవాదుల ప్రపంచం — నేను నివసిస్తున్న ఈ రెండు ప్రపంచాల మధ్య ఏవిధమైన తేడాలున్నాయో నాకు ఇప్పుడిప్పుడే బోధపడుతుంది. ఈ రెండు పరిధులమధ్య నేను నలిగి పోయాను. నియమ బద్ధమైన ప్రపంచం పట్ల అంతరాంతరాల్లో మొగ్గు చూపుతున్నాను. నాలో ఎదుగుతున్న ఆత్మ అందుకు దోహదం చేసింది. బాల్యంలోని చిందర వందర ఆలోచనలు క్రమక్రమంగా యవ్వనంలోని ఆత్మ స్థైర్యానికి దారిచూపి అవ్యక్త విషయాలను తెలుసుకోవాలనే ఆలోచనా పరంపరలకు తావిచ్చింది.

దురదృష్టవశాత్తు వంటగదిలో కూచుని నాకు చెప్పలేని ఏదో కారణంతో అమ్మ ఏడవటం చూశాను. దేవకిని గూర్చి అమ్మా నాన్నల మధ్య ఏదో తగాదా వచ్చి వుంటుందని గ్రహించాను. పెండ్లి ఏర్పాట్లు చేయటంలో గణేశ్ దత్తు తల్లిగా దేవకికి ప్రాధాన్యం యిస్తున్నారు. ఉన్నతభావాలు కల దేవదత్త భగవాన్ దత్త బాబాయిలు, డాక్టరు చునీలాల్, లల్లా కేదారనాథ్ ఆశయాలకు సరితూగేలా మా కుటుంబం ఎదగకపోవటం అవమానకరంగా వుంది. ఇది మా దైన్యానికి మరింత దోహదం చేసింది. ఈ పెండ్లివల్ల ఏర్పడే తగాదాలు, తర్వాత రాబోయే కీచులాటలూ చూస్తే, మూఢాచారాలు, అమాయక విషయాలపట్ల మా కుటుంబం ప్రాముఖ్యమిస్తున్నట్లుగా తోచింది. మరొకవైపు మిగతా ప్రజ

లందరూ ఆదర్శ ప్రాయమైన ఆశయాలపట్ల ఆసక్తి చూపుతూ బాల్య వివాహాలు అరికట్టటం వితంతు పునర్వివాహాలు జరిపించటం దేశ స్వాతంత్ర్యానికి పోరాటం సాగించటం చేస్తున్నారు. తెల్లదొరలు పోయి వారి స్థానంలో భారతీయులు రావటం తప్ప స్వాతంత్ర్యమంటే ఏమిటో నాకు బోధపడలేదు. డాక్టరు చునీలాల్ నాకు చెప్పిన ప్రజ్ఞా నిధులైన తిలక్ వంటివారు, గాంధీవంటి మంచి మనుషులూ, స్వాతంత్ర్యోద్య మంతో ముడిబడి వున్నారు. అంతేగాక మహమ్మదీయులకు స్వేచ్ఛను ప్రసాదించటం, బలవంతంగా వారి మీద రుద్దిన హీన కులాల వారి అస్పృశ్యతను తొలగించటం యిందులో యిమిడిన ప్రధానాంశాలని, ఆర్య సమాజ నాయకులు లాలా లజపతిరాయ్, లాలా హరదయాళ్ అభి ప్రాయ పడుతున్నారు. ఈ విషయాలన్నీ అర్థం చేసుకోవటం నాకు సాధ్యమైన పనికాదు. అర్థం చేసుకోగల నాన్న ఏమీ తెలియని వాడిలా వున్నాడు. నాకిక్కడ రహస్యాలు చెప్పకోవటానికి శకుంతల వంటివారు లేరు. సంప్రదాయ బద్ధమైన సోదర జాతిలో పుట్టిన ఈ కంసాలి జాతి వారి అలవాట్లను విడనాడి అభ్యుదయం సాధించటం కష్టం. నాన్న వారి అలవాట్లను అనుసరిస్తున్నాడు.

ఆ మధ్యాహ్నం మాయింటి మొదటి అంతస్తులో అమ్మ పెద్దపరువు మీద నేను కునుకు తీద్దామని అనుకుంటుండగా జనం వచ్చిపోతున్న శబ్దం వినిపించింది. నాలోని ఉద్రిక్తత వల్ల నేను మరీ దూరమై పోతున్నానని నాకనిపించింది. నా రక్తం వుడుకెక్కి నరాలు జివ్వుమన్నాయి. పక్క మీద నిద్రపోదామని అనుకుంటుండగా అన్న హరీష్, ద్రౌపది వచ్చారనీ, ఆపిలుపండ్లు, మరేవో పండ్ల బుట్టలూ తెచ్చి మేడ క్రింద వున్నా రని నన్నుకూడా రమ్మని పిలిచాడు. జ్వరంగా వున్నందువల్ల లేవలేనని చెప్పాను. మా కుటుంబ మంతా మరు క్షణంలో నా చుట్టూచేరింది. అందరూ ఎంతో ఆతురతతో చూస్తున్నారు. గత సంవత్సరం నన్ను పూర్తిగా నిర్లక్ష్యంగా చూసి చంపినంత పనిచేసిన ద్రౌపది కూడా వచ్చి నిలుచుంది. వాళ్ళ నందరినీ కలవర పరచిన అంశం ఆ మరునాడు పెండ్లివారు లూధియానా దగ్గర లాల్ తన్నా గ్రామానికి పూరేగింపుగా వెళుతున్నపుడు గుర్రం వెనుక గణేశ్ తోపాటు కూచోవటానికి నేనొ

క్కణ్ణే సరియైన వాణ్ణిని వాళ్ళ వుద్దేశ్యం. ఇదేదో అశుభ సూచకంగా అనిపించింది. పార్సీ డాక్టరు డా. మానెక్షాను తీసుకు వచ్చారు. జ్వరం ఎక్కువగా వుందనీ, అజీర్ణం చేసిందనీ బాగా బలహీనంగా వున్నాననీ డాక్టరు నిర్ధరించాడు. పెండ్లి వారితో బాటు ప్రయాణంచేసే శ్రమను నాకు కలిగించ వద్దని ఆయన సలహా యిచ్చాడు. ఆయన మాటలు ప్రతి ఒక్కరి ముఖాల మీద ఆందోళన కలిగించాయి.

పెళ్లి కూతురు వాళ్ల యింట్లో కడుపునిండా పిండివంటలు తిని, కొత్త గుడ్డలు కట్టుకొనే అవకాశం లేకపోయిందే అనే నిరుత్సాహాన్ని కొంతవరకు జయించగలిగాను. నాకు నిద్రవట్టేంత వరకు మా పిన్నిని నా పక్కన కూచోమని కోరాను. ఆవిడ పని హడావిడిలో వుండటం వల్ల కొద్దిసేపు మాత్రమే నాతో కాలక్షేపం చేయగలిగింది. పోకిరి పిల్ల వాడిననే పేరు నాకు ఎటూ వచ్చింది గాబట్టి, దేవదత్త బాబాయిని పుస్తకాలు కొని తెచ్చి పెట్టమని మారాము చేశాను. ఇందుకు అంగీక రించి, నేను చదువుకోవడానికి శివను కొన్ని పుస్తకాలు అరువు తెచ్చి పెట్టమన్నారు. పుస్తకాలు వచ్చేసరికి నిద్రకుపక్రమించారు. మరునాడు ఉదయం లేచేసరికి నా వక్కమీద పుస్తకాలున్నాయి.

మరునాడు నా జ్వరం తగ్గుముఖం పట్టలేదు. నన్ను వదలి వెల్దామని నాన్న అయిష్టంగానే నిశ్చయించుకొన్నారు. 'కాశీ యాత్ర చాలాక్లిష్టం' అంటూ జహంగీరు బృందం బ్యాండుమేళం వాయిస్తు న్నారు. ఇంట్లో గందరగోళంగా ఉంది. అందరూ సుఖసంతోషాలతో వుండటం నాకు కొంత నిరుత్సాహం కలిగించింది. ఈ సంబరంలో నేనూ పాలువంచుకోలేనందుకు దుఃఖంగా ఉంది; అందులో భాగస్వామిని కానందుకు కొంత సంతృప్తిగా ఉంది. నా అన్న మీద నాలో పెరుగు తున్న అసూయవల్ల, ఈ తంతు జరపడం వల్ల నాకున్న అసహనం వల్ల, లోలోపల అన్వేషణా దృష్టి పెరగడం వల్ల ఏర్పడ్డ తపన వల్ల ఇలా అనుకోసాగాను.

పెళ్లి వారి బృందం తరలిపోయిన తర్వాత, అమ్మ నాతో వుండిపో యింది. పెళ్లికొడుకును సాగనంపడానికి మిగతా ఆడవారు రైల్వేస్టేషను దాకా వెళ్లారు. నేను తల పెట్టుకుని పడుకునేందుకు అమ్మ తొడయిచ్చి,

ఏమీ చెప్పకుండా ధారాపాతంగా ఏడ్చింది. మధ్యమధ్యలో తన చీర చెరుగుతో కన్నీళ్లు తుడుచుకుంది. మాటలు చెప్పలేని మమకారంతో ఆవిడ చుట్టూ చేయి వేసి మా యిద్దరి మధ్య వున్న అనుబంధాన్ని ధృవపరచాను. ఆవిడ మూఢ నమ్మకాల పట్ల, అన్యాయ పట్ల, నీచత్వం పట్ల, నాలో ద్వేషం వున్నప్పటికీ ఇప్పుడు మరిచి పోయాను.

నా జ్వరం తగ్గుముఖం పట్టడంతో దేవదత్త బాబాయి పంపిన మూడు పుస్తకాలలోంచి ఒక కరపత్రం తీశాను. అది మహాత్మా గాంధీ వ్రాసిన 'హిందూ స్వరాజ్యం'. అది అతి సులభమైన ఆంగ్లశైలిలో వ్రాసివుండటం వల్ల జ్వర ప్రకోపంతో కూడిన వుత్సుకతతో, ఆదుర్దాతో నా పసి మనస్సుపై చెరగని ముద్ర వేసేలా చదివాను. అది నా జీవితాన్ని ప్రభావితం చేస్తుందని అప్పుడు నాకనిపించలేదు. కానీ, తెల్లదొరల పట్ల, ఆంగ్ల ప్రభుత్వం పట్ల నాకున్న అనుమానం కేవలం అతిశయోక్తులని నాకనిపించింది. ఈ విషయాలు నా కింతకు ముందెవరూ చెప్పలేదు సరిగదా, తెలుసుకోలేని మూర్ఖుణ్ణి కూడా నేను. ద్రోహచింతనగల బ్రిటీష్ సామ్రాజ్యం మన దేశాన్ని జయించి ఏ విధంగా కొల్లగొడుతున్నారో, వారికి మన దేశంలోని దేశద్రోహులు ఏ విధంగా సహకరిస్తున్నారో తెలిసింది. ఎంత ప్రయత్నించినా వారిలో ఒకరుగా మా నాన్నకు స్థానం ఇవ్వకుండా ఉండలేకపోయాను. స్వాతంత్ర్యమనే సువాసన — అవ్యక్తమైన ఆపదం, (మృతులకు సుదూరంగా వున్న ప్రపంచాన్ని తెలిపే ఆ పదం) నాలో ప్రవేశించింది. పిశాచులతో సమానమైన విదేశీయులను అంగీకరించిన వారిపట్ల ద్వేషం పెరిగింది. ప్రతిఘటించిన వారిని తుపాకి గుండ్లకు చేసే దృశ్యం కనిపించింది. ఫలపుష్పశోభితమైన సుందర వర్ణమైన ఉద్యానవనం సువాసనలు నన్ను తాకాయి. అక్కడ అవ్యక్తమైన పరిశోధనలు నిత్యనూతనమైన వూహలు ప్రవేశిస్తాయి.

మొన్న మొన్నటివరకు ఉబుసుపోకకోసం చదివేవాణ్ణి. విషాద ప్రణయగాధల పట్ల నా మనసు కరిగిపోయేది. ఇంతకుముందు నేను చదివిన పుస్తకా లన్నింటికంటె ఈ పుస్తకంలో, పదజాలసౌరభ్యం నన్ను ఆకట్టుకుంది.

పదగర్భితమైన భావాలను తలచుకొని ఆనందించాను. అతి సుల భశైలిలో గాంధీ రచించడమే గాక, 'సత్యాగ్రహం' వంటి కొన్ని క్లిష్టమైన సంస్కృత పదాలను వాడారు. అన్యాయాన్ని ఎదురించాలనే ధోరణి, న్యాయాన్యాయాలను వింగడించే బాల్యచేష్టలు కలిసి సత్యాగ్రహ పదాన్ని నేను ప్రార్థనాగీతంలా పక్కమీద పడుకొన్నప్పుడు కూడా వల్లించసా గాను. అస్పష్టంగా దాని అర్థం నాలో తర్వాత లీనమైపోయింది.

మౌన నిగ్రహం వంటి సత్యాగ్రహమంటే నిగ్రహించుకోవడమని గ్రహించాను. ఉదాహరణకు నాన్న తన మీద కోపంగా వున్నప్పుడు, దాన్ని తగ్గించడానికి అమ్మ ఉపవాసం ఉండటం, కూరగాయలు తిన డంతో విసిగిపోయిన నేను అన్నం వద్దని మారాము చేయడం చెప్పుకోవచ్చు. మేము యిలా చేసినప్పుడు అమ్మ, నేను, మాత్రమే కోపంగా ఉంటాము. గాంధీ చెప్పినట్లుగా హింసాయుతంగా గాని, కోపంగా గాని వుండ రాదు. పాపాన్ని ఎదురించేటప్పుడు మనం సత్య నిష్ఠతోను, కష్టాలను అనుభవించడానికి సిద్ధంగాను ఉండాలి. ఇతరుల మనసులను నొప్పించ రాదు. మంచితనము, ప్రేమలద్వారా, ఆత్మ స్థైర్యంతో యితరులను జయించాలి. గాంధీ అహింసాయుత పద్ధతుల ద్వారా దక్షిణాఫ్రికాలో ఉద్యమాలను సాగించి, అహింసకు నిర్వచనం చెప్పారు. అందువల్ల విద్రో హాన్ని ఆత్మశక్తితో జయించగలగాలి.

ఎవరైనా నన్నుకొడితే, మా నాన్నగారైనా సరే, నేను కోపం తెచ్చుకోకుండా ఉండటమనేది వాస్తవానికి నాకు సాధ్యపడే విషయం కాదు. మౌనంగా కష్టాలను సహించలేను. అందువల్ల గాంధీ ప్రారంభిం చిన 'సత్యాగ్రహసభ'లో చేరలేను. దూరం నుండి వారి కార్యకలాపాలను మెచ్చుకోగలను........ కంటకావృతమైన గమ్యంలో పయనిస్తూ, అంధ కార బంధురమైన ఈ దేశానికి ధృవతారగా కనిపించే మహాత్ముడు గాంధీ, ఆయనను అనుసరించగలను. ఆయన సత్యాహింసలను పాటించ గలను — అని ఒకరోజు నా కనిపించింది.

నాకు తీవ్ర అనారోగ్యం చేసి పెండ్లివారితో నేను వెళ్ళలేదని దేవ దత్త బాబాయికి తెలిసి నా దగ్గరకు వచ్చి పక్కమీద కూచున్నారు. దత్తా తెటుంబం మేము పంపిన పిండివంటలు నిరాకరించి పెండ్లివారితో

కలిసి వెళ్ళకపోయినప్పటికీ మాతో సంబంధాన్ని పూర్తిగా తెగతెంపులు చేసుకోనందుకు అమ్మ సంతోషించింది.

ఆయన నల్లని ముఖం జేవురించటం చూడలేదు. కాబట్టి ఆయన ఉద్రేకాలను కనిపెట్టడం కష్టం. ఆయన కనుగుడ్లు ఎఱ్ఱగా వుండటం చూస్తే రాత్రంతా ఆయనకు నిద్రపట్టినట్లు లేదు. అయినా ఆ హాస్య ధోరణిలో ఇలా అనారు:

'నా వుపన్యాస ప్రభావం వల్ల నీవు కూడా పెండ్లి వారితో వెళ్ళ లేదు'.

'ఆ పిండివంటలు తిని నాకు అరగలేదు' అన్నాను.

'నీ కనారోగ్యం చేయటం మంచిదే అయింది. లేకపోతే పెద్దవాళ్ళ మోసంలో ఎల్లప్పుడూ పిల్లలు ఇరుక్కు పోతారు. మా దేవరాజు చచ్చి బయటపడ్డాడు.' తనలో అక్కసు బయటబెడుతూ అన్నాడు.

'ఎలా?' లేచి కూచుంటూ ఆసక్తిగా అడిగాను.

'ఉద్రేకం వద్దు. అతడు సురక్షితంగా ఉన్నాడు. ప్రజలను చావ బాదుతూ వుంటే వాళ్లు ఎలా బతికి బయట బడతారు'.

'ఎవరు చంపుతున్నారు బాబాయ్'.

'ఆ రోజు నీతో చెప్పలేదూ?.... ప్రభుత్వం రౌలత్ చట్టం పెట్టినప్పటి నుండీ కోర్టుకేసుగానీ, వకీలుగానీ, అప్పులు గానీ లేదు....... ఏప్రెలు 6వ తేదీ సమ్మె చేయవలసిందిగా గాంధీ కోరారు. అంగళ్ళన్నీ మూసి వేశారు. కానీ, ఢిల్లీ స్టేషనులో ఒక టీ దుకాణం పనిచేస్తూనే వుంది. సత్యాగ్రహులు ఆ యజమానిని కొట్టు మూసివేయవలసిందిగా కోరారు. అక్కడ పనిచేస్తున్న ఆంగ్లో యిండియన్ స్టేషనుమాష్టరు దురుసుగా ప్రవర్తించి వారిని అరెస్టు చేయించాడు. ఢిల్లీ ప్రజలు వారిని వదలి పెట్టవలసిందిగా కోరారు సైన్యం రప్పించ బడింది. వారు గుంపుపై కాల్పులు జరిపారు. ఎంత మంది చనిపోయారో ఎందరికి గాయాలయ్యాయో తెలియదు. భారతీయులు మామూలుగా వుమ్మి వేసినా అది తమను అవమానించినట్లుగా ఆంగ్లేయులు భావిస్తారు. ఏ

కొద్దిపాటి కారణం కనిపించినా -వారు ప్రజలను హతమారుస్తున్నారు'.

ఆయన మానాన్న మీద నాకు ద్వేషం తెప్పించడానికి 'సైన్యం' అనే పదం ఉద్దేశ్య పూర్వకంగా వాడారని తెలుసు. అందుకని సర్దు బాటు ధోరణిలో నేనన్నాను: 'బహూశా కాల్పులు జరిపింది ఆంగ్లదళానికి చెందిన వారై వుంటారు'.

'తెలియదు, సైన్యమంటే సైన్యమే ఉత్తర్వులను శిరసావహించ వలసిందే'.

అమ్మ వంట గదిలోంచి వేడిపాలు నాకు తెచ్చింది. పైట చెరగు కప్పుకొని కంఠంలో బాధవ్యక్తమయేటట్లుగా అంది:

'అన్నయ్యా! రైళ్ళు సకాలంతో రావడం లేదని విన్నాను. ఢిల్లీ స్టేషనులో ఏదో గొడవ జరిగిందట. లూధియానా నుంచి పెండ్లివారు ఎలావస్తారు?...... వాళ్ళువెళ్ళి నాలుగు రోజులైంది. నిన్న రావలసింది'.

'ప్రభుత్వం చాలా దురుసుగా ప్రవర్తిస్తోంది. ప్రజలు చాలా ప్రశాం తంగా వ్యవహరిస్తున్నారు. రైళ్లు నడుస్తున్నాయి. పెండ్లివారు ఇవాళ తప్పకుండా వస్తారు.' అన్నాడు దేవదత్త బాబాయి.

ఈ మాటలు ఆయన అంటుండగా 'టెలిగ్రామ్' అన్నకేక విని పించింది! 'కృష్ణ చంద్ర! నీకు టెలిగ్రామ్' అన్నాడతను.

'మీనాన్న దగ్గర నుండి అయివుంటుంది' అంది అమ్మ ఆదుర్దాగా.

ఊరగాయల ఫ్యాక్టరీలో పనిచేసే తులసి టెలిగ్రామ్ తెచ్చి యిచ్చాడు.

దేవదత్త అది చించి నవ్వుతూ అన్నాడు:

'అంతా సుఖంగా వున్నారు. సాయంత్రం వస్తున్నారు. బ్యాండు మేళం ఏర్పాటు చేయవద్దనీ, స్వాగతం చెప్పటానికి ఎవరూ రావద్దనీ దేవకికి చెప్పమని తంతిలో వుంది.'

దేవదత్త బాబాయి చెప్పిన వివరణను దేవకిపిన్ని అప్పుడే యింట్లో కడుగు బెడుతూ విన్నది.

'నీకడుపు చల్లగుండ! శుభవార్త చెప్పావు' అంది అమ్మ. 'అక్కా! నాకోడలు బ్యాండుమేళం లేకుండా యింటికి రావాలా!' దేవకి బాధగా అంది.

'మీ బావగారు స్పష్టంగా తంతి యిచ్చారు' అన్నాడు బాబాయి. 'ఇది అపశకునం కాదుగదా!' అంది దేవకి.

ఇంట్లో అందరూ ఎదురు చూస్తున్నారు. మధ్యాహ్నమంతా స్త్రీ జనం మద్దెల వాయిస్తూ పాటలు పాడుతుంటే నాకు నిద్రపట్టలేదు. ఢిల్లీలో కాల్పుల గురించి దేవదత్త బాబాయి నాకందించిన చెడువార్తతో నా మనసంతా నిండిపోయింది. నేను చదివిన 'హిందూ స్వరాజ్యము' అనే గ్రంథమూ అందులో పదాలు నాలో ఉత్సాహం రేకెత్తించాయి. మన నగరాలలోని ప్రజలంతా మొరటు వారనీ, గాంధీ అహింసా పద్ధతిని అర్థంచేసుకోలేరని నాకు తెలుసు. ఈ ఆలోచనలతో నాబుర్ర వేడెక్కింది, దేవదత్త బాబాయివల్ల. నిజం చెప్పాలంటే ప్రజల ఉద్రేకం వల్లనే అక్కడ అలా జరిగివుంటుంది. అందుకని ఢిల్లీలో రైళ్ళు నడవటం ఆలస్యమై పెండ్లివారి రాక ఆలస్యమైవుంటుంది.

ఎలాగైతేనేం, మా వీధి చివరిలో హడావిడి ప్రారంభమైంది. స్వాగత గీతాలు మొదలయ్యాయి. అమ్మ ఆదుర్దాగా చమురు తీసుకువచ్చి ద్వార బంధం కీళ్ళల్లో వేయమని, పెండ్లి కొడుకు పెండ్లి కూతురు వచ్చేస్తున్నారనీ దేవకికి పురమాయించింది. పెండ్లి కూతురుతో గణేశ్ వచ్చేశాడనుకున్నాను.

ఆ క్షణంలో మేడమీదికి వచ్చి తన అనురాగ హృదయంతో నన్ను ఉత్సాహపరిచాడు నాన్న. 'భారతదేశమంతా దగ్ధమైపోతుంటే ఈతం~ చేయడం ఏమిటి?' అని కఠిన స్వరంతో అమ్మను మందిలించాడు పక్క దగ్గరకు వచ్చి నాచేయి పట్టుకొని

'బాబూ! జ్వరం తగ్గిందా? లేదా?' అన్నాడు.

ఆయన ముఖంలో ఆందోళనను చూసి నాపట్ల సానుభూతికి ఆనందించాను. ఆయన నా నుదుటిమీద, చేతిమీద స్పర్శచేసి అనురాగం వర్షించడంతో సమాధానం చెప్పకపోయి నప్పటికే నాకు ధైర్యం వేసింది.

'ఇంకా జ్వరం వుందంటారా?' వెనక నడిచివస్తూ అడిగింది అమ్మ. సిల్కుచీర, దానిమీద అందంగా చెమ్కీలు కుట్టిన నెమలి పింఛం రంగు బెనారసు రవిక వేసుకుంది. పెండ్లి సందర్భంగా ఆమె ఈమధ్య ఈ వేష భూషలు ధరిస్తూనేవుంది. ఈ ఏర్పాట్లు చేయడంలో సతమతమై వప్పటికీ దత్తు తల్లిమీద అసలు తల్లినైన తాను అధికారం చూపించాలని తగాదాపడుతున్నప్పటికీ కోడలు వస్తోంది అన్న సంబరం ఆమె ముఖంలో కొట్టవచ్చినట్లు కనపడుతూ వుంది.

'వెధవ గడ్డితింటే జ్వరంరాక ఏమి చేస్తుంది.' నాన్న కోపంగా అన్నాడు: 'ఉపనయమప్పుడు టైఫాయిడు జ్వరం మళ్ళీ ఇప్పుడు జ్వరం వున్నట్లు లేదు. లేకపోతే రేపు నాజీలం ప్రయాణం పెట్టుకుని వుండేవాళ్లే కాదు.'

'మీ శలవు యింకా వుందిగా. పెండ్లి తర్వాత జరగవలసిన కార్య కలాపాలు ఇంకా మిగిలే వున్నాయి.' అంది అమ్మ.

ఆ సమయంలో హరీష్ వచ్చి తల వంచుకుని నిలబడ్డాడు. వాడు మామూలుగా అలానే నిలుచుంటాడు.

'శలవంతా రద్దుచేశారు.' తీవ్రంగా అన్నాడు నాన్న.

'తంతి వచ్చింది. పనిలో చేరాలి హరీష్‌కూడా అంతే. ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఒకకొత్త తిరుగుబాటు వచ్చిన విషయం తెలియదా?'

'నాకెలా తెలుస్తుంది?' విసురుగా అంది బాధపడుతూ.

పిల్లవాళ్లే చూట్టానికి వచ్చి ఢిల్లీలో జరిగిన గొడవల్ని గురించి దేవదత్త ఏదో చెప్పాడు. ఆ నికృష్టుల సేవ అంతే. వాళ్లు పెత్తనం చెలాయించి యిలాంటి పాడు చట్టాలు చేస్తారు. ప్రజలు విప్లవం చేయక ఏం చేస్తారు?

హరీష్ ఆ మాటలకు వ్యతిరేకంగా ఏదో అనబోయాడు. నాన్న కోప్పడుతూ 'పిచ్చిదానిలా మాట్లాడకు. దేవదత్త బృందానికి అంతా సర్వ్వమే. నేను ప్రభుత్వోద్యోగిని ఒంటినా సైన్యంలో వున్నాను.

యిలా మాట్లాడితే నన్ను సైన్యం కోర్టు ముందు నిలబెడతారు. మన వాళ్ళ ప్రవర్తన కూడా అంతే. ఈ పెండ్లిలో ఇష్టంవచ్చినట్లు తిని నాటు సారాయి తాగి తందనా లాడరు. ప్రభుత్వంవారు గట్టిగా వ్యవహరించక యింకేం చేస్తారు.'

ఆయన ఉద్రేకంగా మాట్లాడటంతో, ముఖాలు చాటు చేసుకొని, ఆలోచనలు కట్టిపెట్టి ఎవరి దారిన వాళ్లు వెళ్లి పోయారు.

నాన్న ప్రవర్తనపట్ల నాలో కోపం పెరిగి, ఆయన ధోరణిని నిరసించాను: 'ఎప్పుడూ ఆయన ప్రభుత్వంవైపు, ఆయన మమ్మల్ని అందరినీ ఇలా వదిలి వెళ్లే పరిస్థితి సంకటంగా రావడం బాధవేసింది. అయితే నేను దేవకి, దేవదత్త బాబాయిల దగ్గర యిక్కడ అమృతసర్‌లో ఉండి పోతాను. అయితే డా. చునీలాల్, శకుంతల, లల్లా కేదారనాధ్‌లను కలుసుకొనే అవకాశం వుండదు యిక్కడ... హంతకులైన తెల్ల దొరలతో సఖ్యత కుదుర్చుకోవలసిన అవసరం వుండదు.

కొంచెం సేపట్లో నా అంతరంగంలో కోరిక నెరవేరింది. దేవకి పిన్ని మేడ మీదికి వచ్చింది. బుగ్గలనిండా ఏదో తింటోంది.

'రా అమ్మా! నా యింకో కొడుకు కృష్ణను చూడు. ఆరోగ్యం సరిగా వుంటే యితను తోడు పెళ్లికొడుకుగా కూచొని వుండేవాడు. రా'— అంది: కళ్లువిప్పి నాకేసి చూస్తూ అంది: 'నువ్వు లేచికూచో నవసరం లేదు. నీకు పెళ్లి కూతుర్ని చూపిద్దామని వచ్చాను.'

దేవకి చూపిన అనురాగం వల్ల నాలో గర్వం తొణికిసలాడింది. ఆవిడ నా ముందుకు వచ్చింది. ఆవిడ వెంబడి ఎర్రచీర, మేలిముసుగు, బంగారు ఆభరణాలు ధరించిన సన్నని పొడువాటి అమ్మాయి వచ్చింది. పిన్ని నా పక్కలో వచ్చి కూచొంది. మా వదినె ద్రౌపది, ఆ గుంపుతో వచ్చి పెళ్లి కూతురికి కూచోడానికి ముక్కాలిపీట తీసుక వచ్చింది.

'బాబూ! మీరాదేవి' అని నాతోచెప్పి, దేవకి పెళ్లి కూతురితో — 'మేలి ముసుగు తొలగించి నీ మరిదికి ముఖం చూపించు!' అంది.

పెళ్లికూతురు సిగ్గుతో తల అటూయిటూ ఆడించింది గాని,

ముసుగు తొలగించలేదు.

'తన భర్తకూడా యింకా తన నిపూర్తిగా చూడలేదు. నీవు చూడ లేక పోచున్నావని అనుకోనవసరం లేదు. శివ బాగా చూశాడు.... ఏడీ ఆ కుర్రవాడు?' అంది దేవకి.

'ఈ పెళ్లి తంతు మూర్ఖత్వం చిలిపి చేష్టలవంటిది.... జ్ఞానవంతులైన వారిలో పరదా పద్ధతిలేదని దేవదత్త బాబాయి చెబుతుంటారు.' అన్నాను పొగరుగా.

'అవును తాగుబోతులు, నాగరకుల మధ్య ఈ పరదాలుండవు' అంది ద్రౌపది, తన సహజ ధోరణిలో.

'కుర్రవాడు చెప్పింది నిజమే.' అంది అమ్మ నన్ను సమర్థిస్తూ.

అసలు తల్లికంటె, మారు తల్లిగా పెళ్లి తంతు వైభవంగా జరపాలని పట్టుబట్టిన దేవకిమీద దెబ్బతీయాలని అమ్మ అంది.

'అవునమ్మా! ఈ సంస్కరణవాదులు కొట్లాటలు సృష్టించి గణేశ్ భార్య గృహప్రవేశ కార్యక్రమాన్ని పాడుచేశారు.' అంది దేవకి.

'గాంధీ సలహామేరకు హర్తాళ్ జరుపుతున్నారు.' అన్నాను ఆమె మాటను కాదంటూ —'ఇంతకుముందు అది ఢిల్లీలో జరిగింది..... రేపు యిక్కడ ప్రారంభం కావచ్చు.

పెళ్లి కూతురు ముందు అందరికంటె ఘనంగా నా తెలివితేటలు ప్రదర్శించాలని మాట్లాడాను. నా తెలివి తేటలపట్ల ఆమెకు అభిమానం కలిగితే, నాతో పోల్చిచూసినప్పుడు గణేశ్ తెలివిహీనుడుగా బయటపడి పోతాడనే కుతంత్రం నా మనసులో వుంది.

'అయితే మీ నాన్న, హరీష్ రేపు హర్తాళ్ వుంటే ఎలా వెళతారు?' అంది దేవకి ఆదుర్దాగా.

'వాళ్లు డిప్యూటీ కమీషనరు వద్ద 'పాస్' తీసుకరావడానికి వెళ్లారు.' అంది అమ్మ— దేవకినుండి నాన్నను విడబరచాననే సంబరంలో.

'అక్కా! హరీష్ ద్రౌపదిని యిక్కడ వదలి వెళ్తాడు గదా!'—

అంది దేవకి, మనదంతా ఒకే సుఖమయకుటుంబమని చాటిచెప్పా లని. నామీద పక్షపాతం వల్ల హరీష్ భార్యపట్ల ఆవిడకంత అభిమానం లేదని నాకు బాగా తెలుసు. 'పెళ్లికూతురు మరులుపెళ్లికి తన పుట్టిం టికి వెళ్లేంతవరకు యింకా ఎన్నో పనులున్నాయి.... పురోహితుడు శుభ ముహూర్తం చూసి పెట్టారేమో కనుక్కుంటాను' అంది.

'కలియుగంలో చాలా మార్పులు వస్తాయని దైవజ్ఞులు చెప్పారు. ఆంగ్ల ప్రభుత్వం ఒక మహాత్ముణ్ణి ఎదుర్కోవలసి వస్తుందని మా నాన్నకు ఒక యోగి చెప్పారు.... ఇప్పుడున్న గాంధీయే ఆ మహాత్ముడంటారు. జలి యాన్‌వాలాలో సిక్కులను తెల్లదొరలు ఎలా వూచకోతకోశారో తెలిస్తే నీవు కూడా దేవదత్తవలె మాట్లాడుతావు.' అంది అమ్మ స్థిరంగా.

'గణేశ్ ఏడీ?' అన్నాను సంభాషణ మార్చాలని. సత్యాగ్రహం గురించి, గాంధీ హిందూస్వరాజ్యం గురించి నేనేం చదివానో ఈ ఆడవాళ్లకు తెలియదు.

'పెళ్లి కూతురుకంటె అతను మరీ సిగ్గుపడుతున్నాడు.' అంది ద్రౌపది.

'పెళ్లికూతుర్నీ, పెళ్లికొడుకునీ కూచోబెట్టి పాటలు పాడుతారు. కృష్ణ! ఈ సమయంలో నువుకూడా తయారుగావాలి. ఇంకనీ అనా రోగ్యం కట్టిపెట్టు. నీకు కూడా తినడానికి ఎన్నో పెడతాను. మనం పేకాట ఆడుకొందాం. అందరం కలిసి—' అంది దేవకి.

'నాయకులైన డా. సత్యపాల్, డా. కిచ్‌లూలను అరెస్టుచేశా రనీ; ప్రభుత్వం నిషేధాజ్ఞలు జారీచేసినప్పటికీ ప్రజలు గుంపులుగుంపులుగా చేరుతున్నారనీ దేవదత్త బాబాయి చెబుతున్నారు.' అన్నాడు గణేశ్.

'దేవదత్త పిచ్చికుక్కలా వాగుతున్నాడు..... ప్రభుత్వం పరిస్థితి అదుపులో పెట్టింది..... డిప్యూటీ కమీష్నర్‌గారు నాకంతా చెప్పారు..... సైన్యంలో వున్నాను గాబట్టి నాకు రక్షణయిస్తారు. మీరు ప్రశాంతంగా వుండి పరిస్థితి గమనించండి. పిల్లల్ని క్షేమంగా చూడు.... నా దారి ప్రయాణానికి ఏదైనా తినడానికి కట్టియివ్వు' అన్నాడు నాన్న.

ఈ గొడవలన్నీ జరుగుతున్నాయని నాలో సంబరం కలిగింది. ఈ మాటలన్నీ నాలో ఉత్సాహాన్ని పెంపొందించాయి. నాకు ఆదర్శప్రాయులైన దేవదత్త బాబాయి, డా. చునీలాల్, లాలా కేదార్‌నాధ్‌లు ఉద్బోధించిన వాక్యాలు నాలో గింగురులు తిరుగుతున్నాయి. స్వాతంత్రం గురించి ఏదో ఒక గొప్ప అంశం జరగబోతోందని తెలుసు. ఆ నాటకం యిప్పుడు ఆరంభమయినట్లుంది. నా సమ్యక్ దృష్టి ఒక ఆకృతి దాల్చబోతోంది. గాలి కదలాడడం లేదు. బయటకు తలంపంకించి విన్నాను. ఏవేవో జరుగుతున్నాయి. నా బుల్లి ప్రపంచానికది అంతం కావచ్చు. స్వాప్నికులు దర్శించిన స్వప్నానికి ఇది నాందీప్రవచనం కావచ్చు.

నాన్న వెళ్లగానే, అమ్మ వంట గదిలో కూచొని, తొడల మీద తలపెట్టుకొని గందరగోళ స్థితిలో పడి ఏడ్చింది. నేను అనారోగ్యంగా పడుకొని పక్క దగ్గరకు పిలిస్తే రాలేదు ఏదో జరగగూడనిది జరిగిందని గ్రహించాను. నేనే ఆవిడ దగ్గరకు వెళ్లి, ఆమె మెడచుట్టూ చేతులువేసి, 'ఏమి జరిగిందమ్మ!' అంటే సమాధానం లేదు.

'మీ నాన్నతో కలిసి దేవకి యింట్లో భోంచేశాననీ, తనకింక రాత్రికి భోజనం వద్దనీ శివ చెప్పాడు.. మీరందరూ వెళ్లి మీ కొత్త అమ్మ దగ్గర కలిసి వుండండి.' అంది కోపంగా అమ్మ. ఆమె అలా బాధపడటానికి కారణం నాకు అర్థమైంది.

నేను ఆవిడను కావిలించుకొని ఓదార్చడానికి ప్రయత్నించాను. ఆవిడ నన్ను తోసివేసి, కోపంగా అంది --

'వెళ్లి పడుకో. లేదా నీ ముద్దు మురిపాలు చూసే పిన్నిదగ్గరకు వెళ్లు. ఆవిడ నాస్థానాన్ని ఆక్రమించాలని చూస్తోంది నాకు తెలుసు, అరే! చూడండి. చీకటి ఆవరించింది - అయ్యేనే ఆవిడ దగ్గర తిన్నాడు. పెళ్లి కూతురికి ఎవరు అత్తగారో తెలియజేయాలని ఆయన ఉద్దేశం. నేనేమో నిత్యసేవకురాల్ని. ఆయన ప్రయాణానికి కావలసిన పదార్థాలు వండిపెట్టాలి.'

సాయంత్రం ఆడవాళ్లంతా ఆటపాటలతో కాలక్షేపం చేస్తుంటే, దేవకి పిన్ని దగ్గరకు వెళదామనుకొన్నాను. ఆమె యీ మాటలు

అన్న తర్వాత నిగ్రహించుకొన్నాను. ఇలాంటి చిన్న విషయాలు నాకు విసుగు పుట్టిస్తున్నాయి. సాహసోపేతమైన మాటలు, కార్యక్రమాలకోసం అన్వేషిస్తున్నాను. నేను మెట్లుదిగి కిందికి వచ్చి, సందులగుండా ఫకీర్ ఖానావైపు నడిచాను.

ఇంట్లో విషాద వాతావరణం నుండి బయటపడాలని నా ఉబలాటం. అమృతసర్‌లో ఏం జరుగుతోందో తెలుసుకోవాలని వుంది.

పండిత వైద్యనాథ్ పాఠశాలకు వెళ్లినదారి నన్ను నడిపిస్తోంది. నా అడుగులు గడియారం స్తంభంవైపు నుండి మాయా సేవావైపు వెళ్ల లేదు. వైశ్యల బజారు కేసి నడిచాను. చిన్నప్పుడు నేను నడిచిన పాఠశాల భవనాలు, ఎప్పుడూ పసివాడని సంతోష్ చెరువువైపు వెళ్లాను.

నేను వేశ్యల బజారులోకి వెళ్ళేసరికి మనుషులెవరూ లేకపోవడంతో, భయం వేసి, రాక్షసుడు తరుముకున్నట్లుగా పరుగెత్తసాగాను. మసక వెలుతురులో వేశ్యల బజారులో అలా పరుగెడుతుంటే వెనుకనుంచి కేకలు వినిపించాయి:

'వెనక్కు వెళ్ళిపో! యింటికి'

'అరే! ఎవర్రా నువ్వు? ఎక్కడికెళుతున్నావు?'

'ఎవరి పిల్లవాడు! ప్రమాదంలో వున్నాడు.'

ఈ కేకలు నాలో భయం పుట్టించాయి. కానీ వాళ్ళు ఆశించిన ఫలితం కలగలేదు. పెద్దలందరూ మాట్లాడిన మాటలు, మమ్మల్ని జాగ్రత్తగా చూసుకోమని నాన్న అమ్మకు యిచ్చిన ఆదేశాలు నాలో సుళ్ళు తిరుగుతున్నాయి. చీకట్లో సాహసంగా దూసుకు పోవాలనే ఆసక్తి నన్ను ప్రేరేపించింది. నిశ్శబ్ద వాతారణం వల్ల నాలో భయం కలిగి జ్వరం తిరగ బెట్టినట్లుగ చెమటలు పోశాయి. బలహీనంగా వున్న నా శరీరం వల్ల తలతిరిగింది. అమ్మకు కోపం వస్తుంది. 'నేను యింట్లో కనిపించక వాళ్ళు అందరూ ఏడుపు లంకించుకొని వుంటారు. ఆ సన్నివేశం వూహించుకుంటే నా కళ్ళముందు నాటకీయత గోచరించింది. పెండ్లి కొడుకు గణేశ్‌కంటె అందరి దృష్టి నావైపు మళ్ళుతుంది. నాన్నకు

దూరమై అమ్మపడుతున్న బాధను చూసి ఆమెపట్ల జాలి కలిగింది.

అలా ఆలోచిస్తూ నా మెదడులోంచి భావాలు భయపడి పరుగె డుతున్న పక్షుల్లా ఎగురుతుంటే ఆ సన్న వీధిల్లోంచి పరుగుతీశాను.

వందగజాల దూరంలో పోలీసులు గుంపును చెదర గొడుతున్నారు. కర్రలు ఝుళిపిస్తూ మరో ఐదుగురు పోలీసులు గుంపు వెనక్కు రాకుండా కాపలా కాస్తున్నారు. పోలీసులు నన్ను చూడగానే గోల చేశారు.

'గుంపుకు ముందుగా గుడ్డల అంగళ్ళవైపు నుంచి ఆకుర్రవాడు వస్తున్నాడు చూడండి.'

'పట్టుకోండి.'

'ఆపండి.'

నేను పరుగెత్తుకుంటూ ఆ సందులోంచి సంతోక్‌సర్‌వైపు వెళ్ళాను.

దురదృష్ట వశాత్తు చెరువుగట్టు మీద యిద్దరు పోలీసులు తుపా కులు పట్టుకొని నుంచుని వున్నారు. పారశాలవైపుకు పోలీసు స్టేషను వైపుకు ఎవరూ వెళ్ళకుండా వారు అడ్డుగా నిలబడ్డారు.

'అరేయ్! ఎక్కడికెళుతున్నావు రా?'

'ఎక్కడికీ లేదు!' అన్నాను భయపడుతూ.

'ఎక్కడికీ లేదా! కొడతా! ఇలారా!'

వాళ్ళకు ఐదుగజాల దూరంలో నుంచుని వెనక్కు వెళదామని అనుకునేలోగా ఒకడు వచ్చి నన్ను పట్టుకున్నాడు.

వాణ్ణి తప్పించుకొని నావెనక నుంచి వస్తున్న మరో ముగ్గురు పోలీసుల చేతుల్లో పడ్డాను. నా చెంప చెళ్ళుమంది. నేను పడబోయాను.

'వీణ్ణి స్టేషనుకు తీసుకెళ్ళండి. ఈ చిన్న వెధవలకు కూడా నిషేధ వుత్తర్వును ధిక్కరించే ధైర్యం వచ్చింది.' అన్నాడొకడు.

'రా! నిన్ను కొట్లో తొయ్యాలి.' అన్నాడు మరొకడు నా చేయి

గట్టిగా పట్టుకొని.

'మా నాన్న సైన్యంలో వున్నాడు' అంటూ ఏడ్చాను. ఈ విధంగా గొప్పగా చెబితే వాళ్ళమనసు కరుగుతుందేమోనని నన్ను రక్షించుకోవటానికి ఈ విధంగా మరొకరి పేరువాడుకోవటం నాకు సిగ్గువేసింది.

'అరేయ్! కుక్క!, పంది! గాడిదా! ఇలారా!' అని హవీల్దారు అరిచి నన్ను పోలీసు సూపరిండెంటు వద్దకు తీసుకెళ్ళమన్నాడు.

కదలకుండా కూచున్నాను. నా వీపుమీద ఒకతన్ను పడటంతో, అప్రయత్నంగా ఏడ్చాను. లేచి పరుగెడితే నన్నొక పోలీసు పట్టుకున్నాడు.

పోలీసు స్టేషనులో ఇటుకరాతి యింటి వరండాలో టేబులమీద రివాల్వరు పెట్టుకొని ఆంగ్లోయిండియను పోలీసు ఇనస్పెక్టరు కూచుని వున్నాడు. నన్ను ఆయన ముందు హాజరు పరచారు.

వరండాలోని జైలుగదులు రెండూ మనుషులతో నిండిపోయాయి. ఇనుప కటకటాలనుంచి వాళ్ళు తొంగి చూస్తున్నారు. వరాండాలో గుంపులు గుంపులుగా జనం చేతులకు బేడీలు తగిలించుకొని కూచుని వున్నారు. వాళ్ళను బంధిస్తూ ఒక తాడు కట్టారు.

'హుజూర్!' అన్నాడు నన్ను తీసుకొని వచ్చిన పోలీసు ఇనస్పెక్టరు గారికి వందనం చేస్తూ.

'ఓహో!' అన్నాడు దొర నాతో పంజాబీలో. నేను నోరుతెరిచి ఏదో గొణిగేలోగా ఇనస్పెక్టరు నన్ను పంజాబీలో తిట్టాడు:

'ఒరే! పందివెధవా! గాడిదకొడకా! నీవు తల్లిపాలుతాగి గూండాగా మారావా? ఎవరు నువ్వు? నీ పేరేంటి?'

'మావాన్న సైన్యంలో వున్నాడు' అన్నాను యింగ్లీషులో.

నేను ఆంగ్లంలో మాట్లాడటం వల్ల గూండాను కానని నిరూపించుకోవచ్చునని అనుకున్నాను.

'కర్ఫ్యూ విధించినపుడు నీవు బయటికి ఎందుకు వచ్చావు?' అంటూ

యింగ్లీషులో కేకలు వేశాడు ఇనస్పెక్టరు.

'మా నాన్న యిప్పుడే డిప్యూటీ కమీషనరు వద్ద పర్మిషను తీసుకొని జీలం కంటోన్‌మెంటుకు వెళ్ళాడు. యిలా వూరికే వచ్చాను.' అన్నాను. నేనిచ్చిన ఈ సమాధానం ఆఫీసరును సంతృప్తి పరచినట్లుంది.

ఇనస్పెక్టరు మనసు మారిపోయి నన్ను నిర్బంధంలో వుంచుతాడేమోనని ఒణికిపోయాను. ఇక్కడ రాత్రంతా నేను వుండిపోతే మా అమ్మ ఎలా భయపడుతుందోనని గుర్తుకు వచ్చి నా గుండె కుమిలిపోయింది.

'తర్వాత వాడు.' ఇనస్పెక్టరు గదమాయించాడు.

నన్ను పట్టిలాగి వేస్తే తూలిపడ్డాను.

నా చేతులకు బేడీలు వేయటానికి పోలీసు ప్రయత్నించినపుడు అవమానంతో కుంచించుక పోయాను. నేల మీదపడి పొర్లాడి ప్రతిఘటించాను. హవిల్‌దారు చడామడా కొట్టి నన్ను పట్టుకున్నాడు. మరో పోలీసు నా చేతులకు బేడీలు తగిలించాడు.

'ఫర్వాలేదు బాబూ! మనమంతా యిక్కడ కలిసే వుందాం' అని ఒక మధ్యవయస్కుడైన నిర్బంధితుడు నన్ను ఓదార్చాడు.

కొంతసేపు తర్వాత ఇనస్పెక్టరు బల్లమీద టెలిఫోను మ్రోగింది. నాపట్ల సానుభూతి చూపిన నిర్బంధింతులను ప్రశ్నలు వేయటం మాని ఆయన తన మోటారు సైకిలుమీద వెళ్ళిపోయాడు.

'అతనికి తగిన శాస్తి జరగాలి.' నాతో సానుభూతిగా మాట్లాడిన వ్యక్తి అన్నాడు.

'అవును, అతను తిరిగి రాకపోతే!..... .. ముండాకొడకు. సగము భారతీయుడు సగము ఆంగ్లేయుడు అశ్వికదళం గుంపుమీద పరుగెడుతుంటే హాలుగేటు వంతెన వద్ద అతను గుంపుమీద క్రూరంగా విరుచుకపడ్డాడు. మేము చేసిన నేరం — డాక్టరు సత్యపాల్, డాక్టరు కిట్లులను విడిపించమని డిప్యూటీ కలెక్టరు వద్దకు మహజరు సమర్పించటానికి

వెళతామన్నాము.' అన్నాడొక యువ నిర్బంధితుడు సాహసంగా.

'నిజమే! భగవంతుని కోపంగా మనమీద వీళ్ళు జులుం చూపిస్తున్నారు. నేను స్టేషను మీదుగా వంతెనపై నడిచి వెళుతుంటే నన్ను అరెస్టు చేశారు. మా యిల్లు లూన్‌మండిలో వుంది నా భార్య పిల్లలు గాబరాపడుతూ వుంటారు. ఇంతకుముందు పోలీసులు కాల్పులు జరిపేవారు కారు. పిండి మిషనులో గింజలు నలిగినట్లు వందగజాల దూరంలో పోలీసుల తుపాకీ గుండ్ల శబ్దం విన్నాను.' అన్నాడొక వృద్ధుడు.

'పోలీసు కాల్పులకు ముందు ఆశ్వీక దళం విరుచుక పడింది.'

'ఊ.........' నోరుమూయండి దొరగారు వస్తున్నారు.' పోలీసు కేక.

నాకు చెవులుండీ వినపడనట్లుగా అభినయించాను. అందరి వ్యాపిరులు ఒక్కుమ్మడిగా అలలుగా లేచి పెద్ద శబ్దంగా వినిపించి, భయపడి హవిల్‌దార్ లేచి నుంచున్నాడు. అప్పుడు మళ్ళీ గుసగుసలు ప్రతిఘటనలు వినిపించాయి. హాలుబజారు నుంచి కేకలు అరుపులు వినిపించటంతో అది సద్దుమణిగి పోలీసుల దృష్టి మళ్ళింది. వాళ్ళు లేచి 'బెల్టులు' సవరించుకొని తుపాకులు పట్టుకొని గుంపును ఎదిరించటానికి సిద్ధమయారు. గుంపు తమ సహచరులను ముట్టడించి యిక్కడ వచ్చిపడుతుందేమోనని వారి భయం.

హాలు బజారులో గుంపు పోలీసు స్టేషనుపై దాడిచేస్తారనీ, గందరగోళం ఏర్పడుతుందనీ ఎదురుచూస్తూ చాలాసేపు కూచొన్నాను. అలా జరిగితే పరుగెత్తిపోవచ్చుననే ఆలోచన వచ్చి నాతల దిమ్మెక్కింది. అలా జరిగితే అది చావుకు దారి తీస్తుంది. ఈ భయము, అమ్మను గూర్చి ఆందోళన నా సరదాకోరికను అణచివేశాయి. ఐదారు రోజులుగా జ్వరంవల్ల కలిగిన బడలికతో ఆవులించాను. బయట చీకటి ఆవరించి, నిద్ర ముంచుకొచ్చి, పక్కగోడకు వాలి నిద్రపోయాను.

మధ్యవయస్కుడు తన తొడపై నా తలవుంచారు. నా చుట్టూ ఏం జరుగుతుందో నాకు తెలియలేదు

మర్నాడు ముందుగా లేచినవారి దగ్గులు, ఉమ్మివేతలు, సందడికి

యింకా నిద్రలేవని వారిని పోలీసులు లేవకొట్టారు.

నిద్రలో నాకు ఎన్నోకలలు. ఆమగతనిద్రలోంచి నన్ను గొడవ పెట్టి లేపారు. కళ్లు తెరిచి, నిద్ర చాలించి లేచే సరికే, అమ్మ నా గురించు ఎంత బాధపడుతోందోనని గుర్తువచ్చి ఉన్మాదస్థితి కలిగింది. హాలు గేటువంతెన వద్ద కాల్పులు జరిగాయని ఆమె వినివుంటే, నేను చనిపోయానని ఆమె అనుకొని వుంటుంది.* నావునికి గురించి ఆమె కెలాతెలుస్తుంది. ఆమె మా నాన్నకుగాని, హరీష్‌కుగాని తంతిపంపితే, వాళ్లు వచ్చి నన్ను వదలి పెట్టమని పోలీసులకు చెబుతారు. నా పట్ల నాకు నిన్న సాయంత్రంలా మళ్లీ సానుభూతి కలిగింది. మమ్మల్ని అందర్నీ వాళ్లు కాల్చి చంపుతారనే ఆలోచన వచ్చింది. ప్రభుత్వంవైపు మొగ్గు చూపినందుకు మా నాన్న తర్వాత బాధపడతారు. తన కుటుం బాన్ని వదలిపెట్టి, సైన్యంలో చేరినందుకు పశ్చాత్తాప పడతారు. కాని, ఈ దుశ్చేష్టకు నేను తప్ప, మరెవరూ కారణంకాదని తెలుసు.

నాకళ్లముందు మిలమిలా మెరుస్తున్న నక్షత్రాలవంటి వ్యక్తుల ముందు గందరగోళ స్థితిలో పోలీసు ఇనస్పెక్టరు అటూయిటూ తిరుగు తున్నాడు.

'హవిల్దార్ దీన్ మహమ్మద్! వాళ్లను ప్రహరీ లోపలికి తీసుకెళ్లు' హుకుం జారీ చేశాడు.

'వరసలో నిలబెట్టు.'

హవిల్దార్ దీన్ మహమ్మద్ తన రంగువేసుకొన్న గడ్డం మెరు స్తుంటే, 'ఛలో! ఛలో!' అని ఆజ్ఞలు జారీ చేశాడు - మృత్యుదేవతలా. మమ్మల్ని అందరినీ ఒకేత్రాటికి కట్టివేసి, తాడుకొనలను తుపాకులు పట్టుకొన్న పోలీసులు పట్టుకొని నడుస్తున్నారు. సగం నిద్రమత్తులో వున్నవారిని, పడుకొన్నవారిని, తాడుతో లాగుతూ ముంగిట్లో వరసగా నిలబెట్టారు. కొత్వాలు వరండా రాజవీధికి ఎదురుగా వుంది.

ఇనస్పెక్టరు గుంపు నుద్దేశించి పంజాబీలో ప్రసంగించాడు:

'నగరంలో కర్ఫ్యూ విధించారని మీకు తెలియదు. సాయంత్రం

6.30నిల నుండి ఉదయం 5.30 వరకు వీధుల్లో తిరగడం నేరం. మేజి స్ట్రేటు వుత్తర్వుల ప్రకారం మరణదండన కూడా విధించవచ్చు..... ఈ ఆజ్ఞ మరచిపోకుండా మీకు తలా 11 కొరడాదెబ్బలు పడతాయి. తర్వాత వదలివేస్తాం. హాలుగేటువంతెన వద్ద కొట్లాటకు దిగిన గూండా లను వదలి పెట్టేది లేదు.'

తన పక్కనే వున్న పోలీసులకు, హవిల్దార్‌కు ఆయన సైగచేశాడు.

భయంతో వణికిపోతూ, నా వరసకోసం ఎదురుచూస్తున్నాను. నా కడుపులోపలి నుంచి వణకు ప్రారంభమైంది. పెద్దవాళ్లంతా ఏడుస్తూ ప్రతిఘటిస్తూ తలలువంచి దెబ్బలు తిన్నారు. వాళ్ల అరుపులకు నా గొంతు బొంగురు పోయింది. నా శిరస్సు అభిమానంతో ఆకాశంలో తేలియాడింది.

ఏడుస్తున్నప్పటికీ బతికివున్నట్లు గాలిపీల్చిపోల్చుకున్నాను. ఒంట్లో వణుకు ప్రారంభమైంది. బళ్లో వున్నప్పుడు బల్లమీద నిలబెట్టి నావరుస వచ్చేంతవరకు దెబ్బలు తినటానికి ఎదురు చూసినట్లు ఎదురుచూడ సాగాను. దెబ్బకంటె ఎదురుచూడటం మరీ బాధగావుంది. మొదటి దెబ్బ తినగానే చేయి గట్టిపడి రెండవ దెబ్బతినడానికి సిద్ధంగా వుంటుంది..... ఈ విధమైన నిస్సహాయ నిర్భర ఏకాంత స్థితిలో ఎవరూ సహాయం చేసేవారు లేరు. ఏడుపుల హాహాకారాలు ఆకాశాన్ని చుట్టుముట్టే క్షమి స్తారనే ఆశ నశించింది.

నావరున వచ్చేటప్పటికి భయము, నిస్సత్తువతో సొమ్మసిల్లి పడి పోయాను.

'సరిగా నిలబడు.' పోలీసు హెచ్చరించాడు.

నేనులేచి సరిగా నిలబడకపోయేటప్పటి వీపు మీద క్రూరంగా నిర్దాక్షిణ్యంగా దెబ్బలు వేసిలేపాడు. పెద్దవాళ్ళ ం కొట్టిన దెబ్బలకంటె నాకు ఎక్కువ పడ్డాయి.

మొదట్లో పడ్డ ఒకటి, రెండు దెబ్బల తర్వాత నేను ఏడుపు ఆపి ప్రశాంతంగా శిక్ష అనుభవించడానికి ప్రయత్నించాను.

నా ప్రవర్తన పట్ల కానిస్టేబులు కనికరించినాడో లేక నేను దయా భిక్షకోసం ఎదురుచూస్తున్నట్లుగా భావించాడో, నన్ను వదలి ముందుకు వెళ్ళాడు. చిన్నా పెద్ద దెబ్బలన్నీ కలిపి ఏడుతగులాయి. శిక్షకంటె దాని జ్ఞాపకాలు గాఢమై, అతను వెళ్ళిన తర్వాత ఏడవటం ఎక్కువ చేశాను.

'నోర్మయ్! లేకపోతే యింకా కొడతాను' అంటూ వెనక్కువచ్చి బెత్తం ఝుళిపించాడు. వుడికిపోతున్న రక్తంతో నరాలు వణుకుతుంటే తల ఆడించాను.

వరండాలో బల్లముందు ఆంగ్లోయిండియను ఇనస్పెక్టరు కూచుని వున్నాడు. నిర్బంధితుల పునః పరిశీలన ప్రారంభమైంది. కొందరిని వదిలి వేశారు. మరికొందరికి ఇనప సంకెళ్ళతో బేడీలు వేశారు. నా వరుస యింకా రాలేదు. సూర్యోదయపు ఎండపడకుండా నుంచున్నాను. ఏడుపుతో వుడికిన నా కళ్ళు ఈ ఉత్కంఠంతో ఎదురు చూస్తూ విసుగు పుట్టిపోయింది.

నా దగ్గరలో వున్న పోలీసుతో నేను అమాయకుణ్ణనీ, పసివాణ్ణనీ, మా అమ్మ నాకోసం ఎదురు చూస్తూ వుంటుందనీ నన్ను త్వరగా ఇనస్పెక్టరు ముందుకు తీసుకెళుతే నేను త్వరగా వెళ్ళవచ్చుననీ చెబుతామని ఆదుర్దా కలిగింది. నేను అల్లరి వాణ్ణనీ, గూండాయిజం చేస్తున్నాననీ నిర్బంధిస్తారని నిగ్రహించుకున్నాను.

పొద్దు ఎక్కేంతవరకూ నన్ను వదిలిపెట్టరని అనుకున్నాను. దూరంగా నిర్బంధితుల మధ్యలో అమ్మ, దేవకి బంధువు అనంత కనిపించారు. నా కళ్ళు నేను నమ్మలేకపోయాను. ఆమె వేరుదారిలో వెళుతూ వుంటే, 'అమ్మా! అమ్మా!' అని అరిచాను. ఆమెకు నా మాటలు వినిపించలేదు. అనంత చెవులు రిక్కించుకుని చుట్టూ కలియ జూశాడు. క్షణకాలం పాటు అటూయిటూ కలయజూసి నన్ను గుర్తుబట్టాడు—

'అడుగో' అన్నాడు.

'మా నాయనా!' అమ్మ దగ్గరగా ఏడుస్తూ చుట్టూ వున్న పోలీ

సులను తోసుకొని ముందుకు వచ్చింది.

ఆమె చెదిరిన జుట్టు ముఖంపై కన్నీళ్ళు చూసి నాకు ఏడుపు వచ్చింది. నేను దుఃఖంలో వున్నట్లు ఆమె గమనిస్తే, నేను బయట తిరిగినందుకు ఆమె నన్ను తిట్టదని గ్రహించాను. ఆమెను చూడగానే నా బాధ తగ్గింది.

'నిన్ను ఏం చేశారు నాయనా వాళ్ళు.'

నన్ను వాళ్ళు కొట్టారని చెప్పటానికి సిగ్గువేసి ఏడిచాను.

'పెద్దవాళ్ళకు పదకొండు, పిల్లలకు ఏడు దెబ్బలు కొట్టారని' — నా పక్కనున్న మధ్యవయస్కుడు అన్నాడు.

'ఓరిమూర్ఖులారా! కళ్ళు మూసుకుపోయాయా! నా బిడ్డను కొట్టటానికి వాళ్ళకు ఎంత ధైర్యం. వాడు ఏం చేశాడు. పోలీసు వెధవల్లారా!' అంటూ నిర్భయంగా గొంతెత్తి అరుస్తూ నన్ను లాక్కొని ఇనస్పెక్టరు వద్దకు తీసుకెళ్ళింది.

నన్ను తాడుతో కట్టివేసి వున్నారు. కాబట్టి నన్ను వదిలి, తలపై ముసుగు సవరించుకుంటూ వరండాలోకి వెళ్ళింది.

'అమ్మా! దొరగారికి కోపం వస్తుంది. అక్కడకు వెళ్ళకు' — పోలీసు హెచ్చరించాడు.

'పిల్లలపట్ల మీకు జాలిలేదా! మీరు దొరలు కావచ్చు కంటోన్ మెంటులో చాలమంది దొరలను చూశాను. అంతా ఒకటే. చిన్న రాళ్ళతో పావురాలను చంపేవారే' — అమ్మ అరిచింది.

'ఎవరామె? బయటకు తీసుకెళ్ళండి.' ఇనస్పెక్టరు హుకుం జారీ చేశారు.

'నా బిడ్డను నాకివ్వరా? రాక్షసుడా. వాణ్ణి చంపివుంటారని రాత్రంతా దిగులు పడ్డాను..... వదిలిపెట్టండి. వాడేమీ అపకారం చేయలేదు.' అమ్మ అరిచింది.

'ఆవిడను పక్కకు తీసుకెళ్ళండి! వరండాలోకి ఎవరినీ తీసుకు

రావద్దు!' అన్నాడు ఇనస్పెక్టరు.

అమ్మ కోపంగా ముసుగు తొలగించి విషాదసమయంలో విలాపగీతం ఆలపించినట్లు— 'నాబిడ్డను కాల్చుకు తిన్నారు' అంటూ ఏడవసాగింది.

ఆవిడజుట్టు విరబోసుకుని అలావుండటం నా గుండెకెలికి వేసింది. ఇది చూసి ఇనస్పెక్టరుకు కోపంవచ్చి అమ్మను తన్నడానికి లేచాడు.

'ఆవిడ బిడ్డను ఆవిడకివ్వండి. దొరగారూ! ఈ కుర్రవాడు అటూ యిటూ తిరిగాడు. ఏమీ చేయలేదు' అనంత అభ్యర్థించాడు.

అమ్మను ఇనస్పెక్టరు తన్నడానికి సిద్ధంగా వున్న సమయంలో ఆమె ముందుకు వెళ్ళి అతనికో చెంపదెబ్బవేసింది. అతని ముఖం ఎఱ్ఱనై భుజాలు ఎగురవేసి మళ్ళీ కొట్టబోయాడు. సాహసమో అవమానమో అతణ్ణి ఆవరించి, ఈ ధిక్కారాన్ని దిగమింగి పకపకానవ్వాడు.

'సరే! వాణ్ణి వదిలి వేయండి పిచ్చిది ..... నీవు ఆడదానివి ం బట్టి క్షమిస్తున్నాను.'

'రాక్షసులారా! వీళ్ళను కొట్టినందుకు ఫలితం అనుభవిస్తారు' అని శాపనార్థాలు పెడుతూ వెనక్కు తిరిగి నన్ను పట్టుకుంది— 'మీ పను లన్నింటికీ భగవంతుడు సాక్షి' అంటూ నా వైపు తిరిగి—

'రా! నాయనా! అన్నం, నీళ్ళు లేవు. నీ గురించి ఎంత బాధపడ్డాను. చనిపోయావనుకున్నాను. అలా యింట్లోంచి బయటకు రాకూడదని. మీ నాన్న చెప్పలేదు —' అంది.

'ఇప్పుడు వాణ్ణి తిట్టకు' అన్నాడు అనంత పోలీసులు తాడు విప్పారు. నా భుజం పట్టుకొని అనంత నడిపించాడు

నిర్బంధితుల వరుసలను చూస్తూ నాకనులు సూర్యోదయ కాంతిలో ఎఱ్ఱరాతి గోడల ప్రకాశానికి చెదిరాయి. పోలీసుస్టేషను కెదురుగా అమృతసర్ మునిసిపాలిటీ వుంది. నా పూర్వ సహచరులు ఎలా వున్నారో చూస్తూ అమ్మ వెంబడి నడిచాను.

అపస్మార స్థితిలో దేవకి తొడలపై తలపెట్టుకొని పక్కమీద పడు

కున్నాను. వీధిలోని అమ్మలక్కలందరూ మాయింటికి వచ్చి నేను చనిపోబోతున్నట్లుగా చుట్టూ వచ్చి కూచున్నారు. వాళ్ళ ముఖ ప్రీతి మాటల వెనుక, పెద్దింటివారి అబ్బాయిని రాత్రి అంతా నిర్బంధించి కొరడాతో కొట్టారనీ ఆదుర్దా కనిపించింది. ముఖ్యంగా కంసాలి సోదరుల స్త్రీల మాటలలో యిది వ్యక్తమైంది.

'సైన్యంలో పని చేస్తున్న రామచంద్ర కొడుకు అని అయినా వదిలి వేసి వుండకూడదూ' ముసలి అత్త కర్మాన్ అంది

'ఢిల్లీలో అమాయక ప్రజలపైన సైన్యం విరుచుక పడిన ఫలితం వీళ్ళయింటి మీద కనిపిస్తోంది. సైన్‌లోక్ నాకు ఆవహిస్తే నేను అన్నీ చెప్పగలను' అంది ఎప్పుడూ గణాచారి ఆవహించే ఆఖీ

'అయ్యో! కలియుగం నిజంగా వచ్చేసింది. నడిరోడ్డులో ఫిరంగులు ప్రజల్ని కాల్చివేశాయి. చిన్న పిల్లల్ని కొట్టారు' నేను పడుకున్న మంచానికి ఎదురుగా కిటికీలోంచి తొంగిచూస్తూ అంది లచ్చి.

'ఈ విషయం అన్నయ్య రామచంద్రకు తెలియ జేయండి' అంది పక్కింటి నవాబ్జాన్.

'వాణ్ణి పడుకోనీండి.' ఈ విషయంలో తనకంటూ ఏమీ అభిప్రాయంలేని వైరోతల్లి అంది.

లల్లా అచర్జమల్ వికారపు భార్యగుజ్రీ, కంసాలి సోదర బృందానికి చెందిన చౌదరి మేడమెట్లెక్కి రావడం చూసి దుప్పట్లో తలదూర్చి పడుకున్నాను.

వైరో తల్లి సలహాయిచ్చినప్పటికీ గుంపు క్రమక్రంగా అధికమైంది. నిద్రపోతున్నట్లుగా అభినయించి ఈ సానుభూతి పరుల చూపులను తప్పించుకున్నాను. నన్ను నిర్బంధించటమూ ప్రొద్దున్నే కొట్టడమూ, ఇనస్పెక్టరు పట్ల అమ్మ విపరీత ప్రవర్తన జ్ఞాపకాల దొంతరల్లోకి దొర్లిపోయాను. నా ఏకాంతమూ, నైరాశ్యమూ, నేననుభవించిన అవమానమూ దుర్భరమైనాయి. గణేశ్ భార్య ఏమనుకుంటుంది! ఆవిడనన్ను నీచంగా భావిస్తుంది. నా ప్రియమైన దేవకిపిన్ని ఈ పరిస్థితి తెచ్చి పెట్టినం

దుకు మనసులో నిందించుకుంటుంది. నా మీద అభిమానం వల్ల ఆవిడ అమ్మ కోపానికి గురి అవుతోంది. (ఆవిడ నాపక్కన కూర్చోవటం ఈ విషమపరిస్థితి ఎదుర్కోవటానికి ప్రయత్నించటం అమ్మకు ఇష్టంలేదు. దత్తు తల్లిగా, అత్తగారుగా ఆవిడకు అధిక ప్రాధాన్యం వచ్చిందని అమ్మ వుద్దేశ్యం.)

కొంచెం సేపట్లో దేవదత్త బాబాయి మేడమీదికి నన్ను పిలుస్తూ వచ్చాడు — ఆడవాళ్ళు ముసుగులు సరిచేసుకున్నారు. ఆ ఆదర్శ వ్యక్తి రాకవల్ల ఈ సానుభూతి పరులు తొలగిపోయారు.

'కృష్ణకు ఎలావుంది?' నాపక్కమీద కాళ్ళ దగ్గర కూచునివున్న గణేశ్‌ను అడిగాడు.

దేవకిపిన్ని తలముసుగు కంటిమీదికి సవరించుకొని — 'మళ్ళీ జ్వరంగా వున్నట్లుంది' అని సమాధానం చెప్పింది.

'దీనికి తగిన ఫలితం వాళ్ళు అనుభవిస్తారు. డిప్యూటీ కమీషనరు వద్దకు ప్రశాంతంగా వెళ్ళి నిరసన వ్యక్తం చేద్దామని వెళ్ళారు హోలు గేటు వంతెన వద్ద మరణించిన వారిని, గాయపడిన వారిని చూస్తూ వూరుకోరు' అన్నాడు దేవదత్త బాబాయి నా పక్కమీద ఓరగాకూచుంటూ.

'అమాయకులను కూడా కొట్టమని ఆ దొర కొత్వాలీవారికి చెప్పాడట' — అన్నాడు దేవదత్త వెంబడి వచ్చిన అనంత.

'దానికి తగిన శాస్తి జరిగి తీరుతుంది. అల్లరి మూకలు పరిస్థితి తమ చేతుల్లోకి తీసుకున్నారు. ఈ ఉదయం ఐదుగురు తెల్లవారిని చంపివేశారు—' అన్నాడు దేవదత్త బాబాయి.

'చనిపోయిన దొరలు ఎవరూ?' అనంత అడిగాడు.

'నేషనల్ బ్యాంకులోనూ, చార్టెర్డ్ బ్యాంకులోనూ పనిచేసే తెల్లవారు' అన్నాడు దేవదత్త మామూలు ధోరణిలో.

ఆడవాళ్ళు వూపిరి బిగపట్టి గడ్డం క్రింద చేయి వేసుకొని

కూచున్నారు.

'ఇక పోలీసులు కనిపించిన వారినల్లా కాల్చివేస్తారు' అన్నాడు అనంత బాధగా.

'ఇది కేవలం వదంతి. గుంపులు టౌనుహాలుకు, బ్యాంకు భవనా లకు క్రైస్తవ చర్చికి నిప్పు పెట్టారు' దేవదత్త నొక్కి చెప్పాడు.

'బాబాయ్! ఈ ఉదయం టౌనుహాలు చూశాను' అన్నాను తల పైకెత్తి. సత్యాగ్రహ సమయంలో అహింసా పద్ధతిని అవలంబించాలని హిందూస్వరాజ్యగ్రంథంలో చెప్పిన గాంధీ ఉద్బోధలు గుర్తుకు వచ్చాయి. నా పట్ల నాకే ప్రతీకార బుద్ధి, పిరికితనం వుండటం వల్ల వారిని ఎది రించ లేక పోయాను.

'ఆ తర్వాత చాలా చాలా జరిగాయి కృష్ణా! ఇంకా ఎక్కువ జరి గినా ఆశ్చర్యం లేదు. ఇప్పుడున్న పరిస్థితిలో మనమెవ్వరమూ బయటికి వెళ్ళకూడదు....... ఆ గుంపులో వెళ్ళినందుకు నీకు ఏం జరిగిందో తెలుసుగా.' అన్నాడు బాబాయి.

'ప్రజల మీద నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించినందుకు ఆ కోపాగ్నిలో వాళ్ళే శలభాలుగా మాడిపోతారు. ఇతరులకు దుఃఖాన్ని తెచ్చిపెట్టిన వారు బాధల ననుభవిస్తారు. వారు చెడ్డపనుల విత్తనాలను నాటుతున్నారు.' అంది అమ్మ.

అమ్మ ఈ విధంగా మాట్లాడటంతో గదిలో ప్రశాంతత ఏర్ప డింది. ఆడవాళ్ళు గుసగుసలాడుకొని తలకో దారి వెళ్ళారు

'నీవు బాగా అలసిపోయి వుంటావు! నిద్రపో! నేను సాయంత్రం వచ్చి మళ్ళీ పలకరిస్తాను. బహుశా కొంత మందిని కలుసుకొని పరిస్థితి ఎలావుందో తెలుసుకుంటాను' అన్నాడు బాబాయి.

కలత నిద్రపోయి సాయంత్రం బాబాయిని చూడాలన్న ఉత్సుక తతో లేచాను. నాకు నిద్రలో కలవచ్చింది. కారణం తెలియదు కానీ మా నిహాలూ తాత రెండుకొమ్ముల రాక్షసుడుగా కనిపించాడు. నేను దున్నపోతుని ఎక్కి, బాగా కూరుకున్న బురదలో వెళుతున్నాను

ఆ బురదలోంచి ఒక త్రాచుపాము పైకిలేచి దాని పడగపై నన్ను నిలబెట్టి రక్షించింది. ఈ కలవల్ల కలిగిన భయంతో నిరుత్తరుణ్ణయ్యాను. నేను చిన్న పిల్లవాడినై బొటనవేలు చీక్కునివుంటే హాయిగావుండేది.

చాలాసేపు బాబాయి కోసం లేచిచూసి ఆయన దగ్గరకు వెళతానని అమ్మనడిగాను. నేను దూరంగా వెళ్ళటం ఆమెకు యిష్టంలేదు:......

'అలా వెళ్ళిగదూ! నీవూ తంటాలు పడ్డావు! మాకూ కష్టాలు తెచ్చిపెట్టావు.'

ఆమె తంటాలు అనే మాట అన్నప్పుడు జరిగిన విషయమంతా స్ఫురణకు వచ్చింది. పోలీసుల కర్కశహస్తాలూ, నిర్దాక్షిణ్యంగా కనిపించే ఇనస్పెక్టరు ముఖమూ గుర్తుకు వచ్చాయి. అమ్మను తిరగబడి కొట్టలేదు. కొంతవరకు మేలు. వాళ్ళు కొట్టిన ఏడుదెబ్బలూ నా మనసుకు తగిలాయి. మరి పదకొండు దెబ్బలు తగిలినవారి పరిస్థితి ఏమిటి? నా నరనరాల్లో చైతన్యం వుదికి వచ్చి గాయాలను మాన్పసాగింది. ఎందరో ప్రాణాలు బలి యివ్వటం పట్ల దుఃఖం కలిగింది పొడగరులు, దృఢకాయులూ— ఎన్నో జీవితాలు ఒక కంటి కదలికకు భస్మమయ్యాయి. కాల్పులు జరిగివుంటే నేను అక్కడికక్కడే మరణించి వుండేవాడిని. నా పట్ల సానుభూతి చూపటానికి వచ్చిన ఆడవాళ్ళు మంగలి భార్యతో కలిసి విషాదగీతాలు ఆలపించి వుండేవారు

అమ్మ మేడమీదికి వచ్చి నాతో అంది

'నీకు ఏమి వండాలో తోచటం లేదు అంగళ్ళు మూసివేశారు. యింట్లో దుంపకూరలు వున్నాయి ఆకూరలంటే శివకు గిట్టదు. భయంకర పరిస్థితి ఏర్పడింది. డాక్టరమ్మ షేర్‌వుడ్‌ను దుండగలు చుట్టుముట్టారట మంచివాళ్ళు ఎవరో కాపాడారు '

'ఎక్కడ అమ్మా!' అడిగాను.

'ఏమో! నాకు తెలియదు. ఫరీదు చౌకువద్ద అన్నారు. మీనాన్న వుంటే బాగుండేది. అందరం ఆయనతో వెళ్ళినా సరిపోయేది ఈ పేదరాలు పెండ్లి కూతురు రావడంతో అపశకునాలు బహుశా ఆవిడ

అమృతసర్‌లో అడుగు బెట్టినందు వల్ల ఇక్కడ ఈ విషాదం వచ్చి వుంటుంది' అంటూ ఆలోచిస్తున్నపుడు చూపులుని విపినట్లుగా చూస్తూ నిలుచుంది.

'అమ్మా! నీదిమరీ చోద్యం. ఇన్నాళ్ళూ డాక్టరు చునీలాల్, దేవ దత్త బాబాయి, లాలా కేదారనాథ్ ప్రభుత్వాన్ని ఎదిరించాలని అనడం తెలియదూ!..... పాపం అమాయకురాలు ఆ పెండ్లి కూతురు ఏం చేస్తుంది. నీకు ఆ అనుమానమే వుంటే ఈ పెండ్లి జరపడం ఎందుకు?

'నేను ఈ పెండ్లి జరపలేదు. మీ నాన్న నిర్వాహకం దేవకి డబ్బు గణేశ్ పెండ్లి కోసం ఖర్చుపెట్టించాలని ఇలా చేశారు' అమ్మ ఎదురు చెప్పింది.

'భలే దానివమ్మా! నీవు కూడా ప్రణాళికలు వేస్తుంటే విన్నాను. ఈ విధంగా దేవకిపిన్ని డబ్బు ఖర్చుపెట్టాలని నీకూ వుంది నీవు అభినయించినట్లు నీకు దేవునిమీద నమ్మకం వుంటే— నీవే మంచి ముహూర్తం కోసం పురోహితులను సంప్రదించావు '

'నిజమే నాయనా!' అంటూ ఆమె ఒప్పుకుని నవాబ్‌జాన్ యింటికి ఎదురుగా వున్న కిటికీ వద్ద కుప్పగా కూలిపోయింది

'ఈ పెండ్లి ఏర్పాటు చేసిన రోజు గుర్తుకు వస్తే దుఃఖం వస్తోంది. పెండ్లి కూతురు ఒక్కసారి తప్ప ఇంట్లో అడుగుపెట్టలేదు. అన్ని పనులకూ నేను కొత్తదాన్ని! ఆవిడ అసలైన అత్తగారు కనడం తప్ప నేను మరేమీ చేయలేదు. ఈ తిరుగుబోతు దుబారా వ్యక్తి ప్రభావం కిందికి కుర్రవాళ్ళిద్దరినీ మీ నాన్న వదిలి వేశారు' అంటూ ఏడవసాగింది.

అమ్మను ఎదిరించినందుకు బాధపడ్డాను. ఆమె సంకుచిత భావాల పట్ల నాకు ఏవిధమైన జాలీ కాలుగలేదు కొద్దిగా పశ్చాత్తాప పడ్డాను. ఇంకా పెద్దపనులేవో జరగబోతున్నాయి. నా భావాలు పరస్పరం సంఘ ర్షణ పడుతున్నాయి. పోలీసు ఇనస్పెక్టరు మీద ద్వేషం వున్నప్పటికీ తెల్ల డాక్టరమ్మను బలాత్కారం చేశారంటే బాధవేసింది. నా తల బరు వెక్కింది.

నాలో ఆందోళనలు మామూలుగా చెలరేగాయి...... నిరంతరం బాధించే ప్రశ్నలు తల ఎత్తాయి.... ఇంటిగోడలు కూలిపోతున్నాయి. మృత్యువు కబళించినా, అంతాప్రళయం అయినా తిరుగుతూనే వున్నాను.

మర్నాడు పక్కమీద విసుగ్గా పడుకొన్నాను. తెగిపడిన నక్షత్రాల వలె, ఆకాశంలో తారలు కనిపిస్తున్నాయి. దేవకి పిన్నితోను, గణేశ్, పెళ్లి కూతురులతో పేకాట ఆడటానికి రమ్మని శివ నన్ను బలవంత పెడుతున్నాడు. పోలీసులు పెట్టిన బాధకంటె, గణేశ్ చేతిలో పడ్డ బాధలు ఎక్కువగా తోచాయి.

'దేవదత్త బాబాయి మాటలు విని, జులాయిగా తిరిగినందుకు— ప్రభుత్వాన్ని ఎదిరించినందుకు ప్రభుత్వానికి విధేయుడైన మానాన్నను కాదన్నందుకు తగిన శాస్తి నాకు జరిగిందని' గణేశ్ అన్నాడని శివ చెప్పాడు.

దేవదత్త బాబాయి నా వద్దకు రాకపోవడంతో ఒంటరివాడినైనట్లు బాధపడ్డాను.

మా నాన్న పాతపుస్తకాల దొంతరలవద్దకు వెళ్లి, కలయబెట్టి సంగుటద్దాల మధ్యలో — "రెండు మహానగరాలు" — అన్న పుస్తకం చూశాను. రచయిత చార్లెస్ డికెన్సు. నాలో పరుగెడుతున్న భావా లకు అనుగుణంగా ఆ పుస్తకం చదవ సాగాను. నేను నిర్బంధంలోకి వెళ్లి దెబ్బలు తిన్నానని తెలిస్తే నాన్నకు, దానివల్ల కుటుంబానికి చెడ్డ పేరు తెచ్చానని కోప్పడతాడని భయంవేసింది ఈ విధంగా రహస్యమైన ఆలోచనలతో సతమతమై భోజనానంతరం నిద్రకుపక్రమించాను.

లేచి, ఈ బాధలు అనంతమైనప్పటికీ ధైర్యంగా వుండాలని నిశ్చ యించుకొన్నాను. దానికి ప్రత్యామ్నాయం.

నాకంటి కెదురుగా ఐదవజార్జి, మేరీరాణి చిత్రపటం కన్పించింది. పట్టాభిషేక వస్త్రాలలో రాజదంపతుల చిత్రం ఏదో వార్తాపత్రికలో వచ్చుయింది. దానిని నాన్న కత్తిరించి అద్దం కట్టించి గోడకు తగిలిం చాడు. ఆపటానికి కింద ఉర్దూలో వ్రాసింది. ఆ ప్రకటనను చదవడానికి దగిరి గంతేసి వెళ్లాను. అందులో వాక్యాలు హాస్యానికి చదివితే యిలా

వుంటుంది:

'పట్టాభిషేకోత్సవాలను ఢిల్లీ దర్బారులో ప్రజలు ఎంతో విధేయంగా భక్తి శ్రద్ధలతో జరిపారని తెలిసి మహాప్రభువు, మేరీరాణి సంతోషాన్ని వ్యక్తం చేశారు. భారతదేశంలోని రాజులు, సైన్యానికి, ప్రభుత్వానికి చెందిన అధికారులు, హిందువులు, ముస్లిములు, సిక్కులు, క్రైస్తవులు, జొరాష్ట్రియన్లు ఏకమై, శ్రద్ధగా, ఉత్సాహంగా ప్రదర్శనలు జరిపారు...... ఈ సంబరాలలో పాలుపంచుకొంటున్న మేము ఘనత వహించిన ప్రభువులు మరిచిపోని విషయాలు గుర్తుకు తెస్తున్నాం. నిజమైన క్రైస్తవులుగా దైవకటాక్షం పట్ల కృతజ్ఞత చూపుతున్నాము. రవి అస్తమించని బ్రిటీషు సామ్రాజ్యాన్ని కాపాడి విజ్ఞానము, అవగాహన, ఉచితజ్ఞత, శక్తిసామర్థ్యాలు ప్రసాదించినా దైవాన్ని నమ్ముతాము. భగవంతుని పట్ల భయం మాలో ఉంది.'

ఆ వాక్యాలు నాలోనేను చదివి, అందులో మూఢత్వము, మూర్ఖత్వము, అబద్ధమూ గుర్తుకు వచ్చి ముఖం జేవురించింది హార్డింగు ప్రభువు మీద ప్రజలు బాంబు విసిరిన అంశాన్ని ప్రభుత్వం విస్మరించింది. 38వ డోగ్రా దళంతోపాటు నాన్న నన్ను ఢిల్లీదర్బారుకు తీసుకవెల్లి వుంటే బాగుండేదని అనుకొన్నాను. బరోడా మహారాజా, ప్రభువుకు నమస్కరించి వస్తూ, పృష్ఠ భాగం చూపి అవమానించాడని వదంతులు ఆరోజుల్లో వ్యాపించాయి.

రాజదంపతులను రాజద్రోహబుద్ధిగల వారు చంపడానికి ప్రయత్నించే ప్రమాదం వుందని కూడా వదంతి. రాజదంపతుల పట్ల విశ్వాసాన్ని ప్రకటించారన్న విషయం. లాలా లజపతిరాయ్, తిలక్, గాంధీలపట్ల నా నిష్కల్మషమైన బుద్ధికి నమ్మశక్యంగా తోచడం లేదు. నాన్న గూడా ఈ 'పాడు ప్రభుత్వాన్ని' విమర్శించాడు ఏ నేరమూ చేయక పోయి నప్పటికీ వారిని కొరడాలతో కొట్టారని తెలిస్తే నా పట్ల సానుభూతి ప్రకటించి, తన కుమారుని కొట్టినందుకు ప్రభుత్వానికి నిరసన తెలియజేస్తాడు. సైన్యంలో చేరారు గాబట్టి, అధికారులకు సలాములు చేసి, తన దళాధిపతి ఆజ్ఞలు శిరసావహిస్తాడు. ఈ విధమైన ద్రోహకరమైన ఆలోచనలు చేసినందుకు నన్నొక మూర్ఖుడి క్రింద జమకట్టి తోసివేస్తారు.

నేను చిన్నవాణ్ణి అస్వతంత్రుణ్ణి కావడమనే నిస్సహాయ స్థితిలో, నాలో సత్యాన్వేషణ తపన నశించిపోయింది. చార్లెస్ డికెన్సు గ్రంథాన్ని తిరిగి చదవసాగాను. మనదేశంలో దైవసమానులుగా భావించబడి, ఏవిధమైన నేరము చేయులేని తెల్లదొరలకు తమలో శత్రువులున్నారని తెలిసి సంతృప్తి చెందాను. మన మధ్యలో గూండాలు వున్నట్లే, వారి శత్రువులు కూడా అబద్ధాలు పలకడం, మోసం చేయడం ఎరుగుదురు.

ఈ మాటలకు వెనక అవమానాగ్నితో రగుల్కొంటున్న నా మృతకణాల రాచపుండు బాధ అధికమై నా ఆయువుపట్లలో బలహీనత ఏర్పడింది. ప్రభుత్వం మీద కోపము అనే వెల్లువలో చార్లెస్ డికెన్సు గ్రంధములోని పుటలు తప్తమైనాయి. ఈ విధమైన అస్తవ్యస్త స్థితి, గాఢమైన ఆలోచనల పట్ల వ్యామోహము కొనసాగేవి.

కలెక్టరు దొరగారు జిల్లా పాలనా యంత్రాంగాన్ని సైనిక దళాల అధిపతి అయిన జనరల్ డయ్యర్‌దొర హస్తగతం చేశాడని, ఆ మధ్యాహ్నం అనంత ఒక వదంతి పట్టుకొచ్చాడు. అలానైనా ఆంగ్ల సామ్రాజ్య ఆధిపత్యం కొనసాగుతుందని వారి ఉద్దేశ్యం. మా సందులో ఆడ, మగ, గుంపులు గుంపులుగా చేరి ఏదో చర్చిస్తున్నారు.

ఖురాన్‌లో చెప్పిన తుది తీర్పుదినం అతిత్వరలో రాబోతూం దని, నవాబ్‌జాన్ అన్నాడు. పూర్వకాలంలో సింధులో జరిగినట్లుగా మహా ప్రళయం వచ్చి, భూమి బ్రద్దలై, భూకంపం వస్తుందని లచ్చి, అంటోంది. పరిస్థితి సైన్యం అదుపులో వుంది. ఆడవాళ్ళంతా అమ్మ సలహాకోసం ఎదురుచూస్తున్నారు. తెల్లవాళ్ళు పందిమాంసం తింటారనీ, ఎప్పుడూ కోపంతో వుంటారని, అన్ని కంటోన్మెంట్లలలో వ్యభిచరిస్తా రని, అధికశాతం చెడుప్రవర్తన కలవారని, ఆమె అభిప్రాయం. వాళ్ళ ప్రవర్తన కొంత మందికి, దేవకిలాంటి వాళ్ళకి సరిపోవచ్చును కానీ, తన వంటి వారు తలుపులు గొళ్ళాలు పెట్టుకొని యీలాంటి పోకిరి జనం జొరబడకుండా జాగ్రత్తపడుతున్నారని అమ్మ వుద్దేశ్యం.

ఆ మరునాడు అన్ని జ్యోస్యాలు ఫలించాయి కుచాఫకీర్ ఖానా సందులో ఏడుపులు, పెడబొబ్బలు, విషాద గీతాలు వినవచ్చాయి.

అందరూ దేవదత్త బాబాయి ఇంటి వైపు పరుగెత్తి, జలియన్‌వాలా బాగ్, హత్యాకాండ గురించి దుర్భరమైన వార్త విన్నారు

జనరల్ డయ్యర్ పదాతి దళంతో, నాలుగు వైపుల గోడలున్న, జలియన్‌వాలాబాగ్, వద్దకు వెళ్ళాడు. అక్కడ ఒక సమావేశం జరుగుతూంది. ఏవిధమైన, ముందు హెచ్చరిక లేకుండా కాల్పులు జరపవలసిందిగా ఆజ్ఞలు జారీచేశాడు. వందలాది మంది చనిపోయారు. ఎందరో రక్తసిక్త వదనాలతో గాయాలతో ఏడుస్తూ తిరిగి వచ్చారు.

జనరల్ డయ్యరు, డిప్యూటి కమీషనరు ఊరంతా కలియ తిరిగి, ఏ సమావేశము జరప కూడదని, తప్పెట వాయించారు. మరికొందరు చెప్పడంలో తమ పరిసరాల్లో ఆలాంటి హెచ్చరిక వినిపించలేదు.

"డయ్యరు నగరంలో తిరుగుతున్నపుడు కొందరు ప్రజలు దూషించారని, గూండాలలో ఒకరు, నేలపై ఉమ్మి వేశారని" మా వీధిలో డబ్బాలు తయారు చేసే, రషీద్ అన్నాడు

"మామూలుగా ఉమ్మివేసుకొన్నా కూడా తమను అవమానించినట్లుగా, యీ తెల్ల దొరలు భావిస్తారు." అంటూ దేవదత్త బాబాయి - 'స్వాతంత్రం కోసం అరిస్తే అవమానకరంగా ఏడుస్తున్నారని అంటారు. చుట్టు పక్కల గ్రామాల రైతులంతా నగరంలోకి, ఉద్యమం కోసం, ప్రవేశిస్తున్నారని, వారి ఆరోపణ. ఈ మాసంలో వైశాఖి ఉత్సవాలను జరుపుకోవటానికి, దర్బారు సాహెబ్ వద్దకు రైతులు వస్తారని నీకు, నాకు అందరికి తెలుసు.... ప్రశాంతంగాను, శాంతియుతంగాను ఉన్న ఈ పట్టణానికి యీ బహుమతి లభించింది.'

"మా వీధిలోని కొందరు కుర్రవాళ్ళు సమావేశానికి హాజరు అయ్యారు. నాతో వస్తే, ఎందరు చనిపోయారో, ఎందరికి గాయాలయ్యాయో, మీకే తెలుస్తుంది." అన్నాడు అనంత.

ఆమాట విని, మోతీ, వీరు, సదానంద, అనంత, దేవదత్త బాబాయి వంటి కంసాలి పెద్దలు, జలియన్‌వాలాబాగు వైపు నడిచారు. నాలో ఉత్కంఠ అధికమైంది. భయం వల్ల, ఏడుపును దిగమ్రింగుకొంటూ, పరిశీలించటానికి వెళ్ళిన వీళ్ళను నిశితమైన చూపులతో గమ

నించసాగాను.

"నేను మంచిపని చేశాను కదూ. ఈ భయంకరమైన దినాల్లో నిన్ను ఇంట్లోంచి వెలుపలికి వెళ్ళనీయలేదు. ఇప్పుడు తెల్లదొరలు, సగర్వంగా తలలు పైకెత్తారు" అంది అమ్మ.

మసక చీకటి పడేసరికి హత్యోదంతాన్ని గురించిన వార్తలు పూర్తిగా తెలియవచ్చాయి. కొలిమిలో నించి వచ్చిన పొగలతో, మా వీధి ఎప్పుడూ, మసక చీకటిగానే వుంటుంది. దానికి తోడు, మృతుల దయ్యాలను గురించిన భ్రమలతో నా మనసంతా చీకటిమయమైంది 'ఇపుడు చని పోయిన వారి ఆత్మలు ఏ మౌతాయి?' అని అమ్మను అడిగాను. వాళ్ళు క్రూరమైన చావు చనిపోయారు కాబట్టి, వాళ్ళ వాళ్ళ వీధుల్లో దయ్యాల్లాగా తిరుగుతూ, వెంటపడతారని అమ్మ చెప్పింది. మత్తెక్కిన మా కళ్ళ ముందు, మంత్ర శక్తితో పైకి లేస్తున్న, కొన్ని కాంతులు కనిపించాయి. ఇంటికి తిరిగిరాని వారిని గూర్చి సందుల్లో ఆడవాళ్ళు మూలుగుతున్నారు. ఆ విషాద సమయంలో పరిస్థితి దుర్భరంగా వుంది. నాకళ్ళు రక్తసిక్తమైనాయి. నా ఆత్మ ఘోషిస్తోంది. నాలోని న్యాయం మాయమవడానికి బదులు పచ్చి పుండుగా తయారైంది.

నా గుండె గొంతుకల్లో విషాదచ్ఛాయలు ఆవరించినా జలియన్ వాలాబాగులో కాల్పులు సక్రమమైన వేనని, నా కన్పిస్తోంది. నేను అందులో బాధితుణ్ణి కాక పోయినా, ఏకాంత స్వభావం నన్ను వదిలి పెట్టలేదు. పోలీసు వారి అదుపులో ఒక రాత్రి గడిపి, ఏడు దెబ్బలు తిన్న ఉదంతం మా కుటుంబంపై మాయని మచ్చగా నిలిచి పోయినా, అదొక గొప్పగా కనిపించసాగింది ఈ విధంగా ఆలోచించడం వల్ల నన్ను నేను దూషించుకొన్నా సహేతుకంగా ఆలోచించినపుడు క్లిష్ట పరిస్థితిలో వున్న యితరులవైపు మొగ్గు చూపాను.

ఆ మరునాడు ఒక సమావేశంలో దేవదత్త బాబాయి యింట్లో చేరిన వారంతా, నా వీపుమీద దెబ్బలు చూపమని, నిజానికి ఆయన్ను ప్రోత్సహించారు.

"కుర్రవాడేదో, అటూ, ఇటూ తిరుగుతూ వుంటే వాళ్ళేదో పట్టు

కున్నారని అదొక సాహస కార్యంగా చూపవద్దని" అమ్మ వారించింది. ఈ విధమైన చెడ్డపేరు వల్ల నేను పాడుకాగూడదని, ఆమె ఉద్దేశ్యం. నాకు తగిలిన దెబ్బలను నేను నలుగురికి చూపించే విషయం, నలుగురికి తెలిసి పత్రికల కెక్కితే, సైన్యంలో నాన్న స్థానం దెబ్బ తింటుం దేమోనని ఆమె భయం. అందుకని, నాన్నకు గణేష్ చేత ఉత్తరం వ్రాయించింది. ఈ నరకంలోంచి, మమ్మల్ని తప్పించి, జీలం తీసుకెళ్ళ టానికి సిపాయిని సహాయంగా పంపమని తెలిపింది.

ఆ రాత్రులలో నాకు వచ్చిన కలల తాకిడికి అమ్మను కరుచుకొని పడుకొనే వాణ్ణి. భూమి మీద అంతా, మృతుల దయ్యాలతో నిండి పోయినట్లుగా నాకళ్ళకు కనిపించేది. పాలిపోయిన నా పెదాలు అసందర్భ ప్రేలాపనలు చేసేవి. ఈ ప్రకోపాలను నాలోని పిచ్చి ఆవేశం లీనం చేసుకొనేది.

అమ్మ ఉత్తరం నాన్నకు చేరటానికి ముందే ఆయన భగీరద్ అనే సిపాయినీ మమ్మల్ని వెంట పెట్టుక రమ్మని పంపారు అతడు సైన్యం దుస్తులు ధరించి తుపాకీ భుజానికి వేలాడుతుండగా అమృతసర్ వచ్చి, అపుడు నడుస్తున్న కొద్ది రైళ్ళలో మమ్మల్ని తీసుకెళ్ళటానికి వచ్చాడు.

38వ డోగ్రా విభాగానికి చెందిన అధికారి సంతకంతో ఒక ఉత్తరాన్ని పోలీసు సూపరిండెంటుకు భగీరథ తెచ్చాడు దారిలో మాకుటుంబానికి కావలసిన సహాయాన్ని అందజేయవలసిందిగా అందులో పేర్కొనివుంది. ప్రభుత్వంపట్ల అమృతసర్ ప్రజలకున్న ద్వేషాన్ని పురస్కరించుకొని పోలీ సుల కనుచూపుమేరల్లోకి కూడా వెళ్ళవద్దని అమ్మ ఔచిత్యం గమనించి చెప్పింది. భగీరథ సైన్యం దుస్తులు ధరించి తుపాకీ పట్టుకొని వచ్చి నందుకు అమ్మ గాబరాపడింది.

భగీరథ పోలీసు సూపరిండెంటుకు ఆ ఉత్తరం చూపించి వుంటే నేను ఆయనకు ఆనాడు చెప్పినమాటలు వాస్తవమేనని గ్రహిస్తాడని చిలి పిగా అనుకున్నాను. పోలీసుల దౌష్ట్యానికి గురియైన ప్రజలముందు నేను అప్రయోజకుడిలా కనిపిస్తాననే ఆలోచన వచ్చింది. ప్రభుత్వాన్ని ధిక్క రించమని చెప్పిన నా గురువు దేవదత్త దృష్టిలోకూడా నేను చులకన

అవుతాను. నాలో ఈ పిరికితనం ఎందుకు వచ్చింది? ఆశ్చర్యపోయాను. నా శరీరమూ, మనస్సూ, ఆత్మ ఒకటిగా గుదిగుచ్చటానికి ఒకతాడుతో గానీ, గొలుసుతోకానీ కట్టివేస్తే బాగుంటుంది.

కుటుంబ వ్యవహారాలు సర్దుకోవటానికి ఒకరోజు పట్టింది. గణేశ్‌ను దేవకి వద్ద వదిలి వేశాము. పెండ్లి హంగామా అయిన తర్వాత సంప్రదాయ ప్రకారం లాల్ తన్ గ్రామానికి పెండ్లి కూతురుతో అతడు మరులు పెండ్లికి వెళ్ళాలి. వధువు తన పుట్టింటికి వెళ్ళి నాలుగు సంవత్సరాలు వుండి సంసార జీవితానికి మానసికంగా తయారుకావాలి. దేవకి చెడుప్రభావానికి లోనుగావద్దనీ అత్తగారి పెత్తనం చెలాయిస్తున్న ఆవిడ నీడలో చెడు అలవాట్లను అతని భార్యను అలవరచుకోనీయ వద్దనీ అమ్మ మా అన్నకు పదేపదే చెబుతూ ఏడవసాగింది. కొన్ని నగలను భూమిలో పాతి పెట్టాలని చెప్పింది. దత్తు తల్లికంటె అసలు తల్లియైన తన స్థానాన్ని నిలుపుకునేందుకు అమ్మలక్కలు వత్తాసు పలక వలసిందిగా కులం వారి నందరినీ కోరింది

ఈ విధంగా మల్లగుల్లాలు పడ్డ తర్వాత, గడియార స్తంభం వద్ద నుండి గుర్రపు బండిని తీసుకొచ్చారు. బండి చుట్టూ అద్దాల తలుపులు వున్నాయి. మమ్మల్ని త్వరత్వరగా కుచాఫకీరు ఖానానుండి రైలు స్టేషనుకు తీసుకెళ్లారు. భగీరథ్ డ్రైవరు పక్కన తుపాకీ వంచి కూచొని వున్నాడు. భుజంమీద తుపాకి వేళాడుతూనే వుంది.

నిర్మానుష్యంగా వున్న వీధులగుండా వెళుతూ వుంటే కాపలా కాస్తున్న పోలీసులు, సైనికులు కనిపించారు ఆంగ్లేయుల అధీనంలో వున్న బ్యాంకు కార్యాలయాలు, పురమందిరము మంటల్లో కాలిన ఛాయలు కనిపించాయి. అప్పటి వరకు జరిగిన రక్తపాతపు నీడలు, అక్కడి వాతా వరణంలో కొట్టవచ్చినట్లు గుప్పుమంటున్నాయి. శివ ఏదోఒకటి వాగుతూ ఉంటే అమ్మవాడి నోరు మూసింది. నేను పడిన బాధల చేదుగుర్తుల వల్ల నేను మళ్లీ ముందు కురుకుతానేమోనని అమ్మ నన్ను ఒకచేత్తో అదిమిపట్టుకొని కూచొంది. అర్ధనిమీలిత నేత్రాలతో పరిస్థితిని వూహించి విలయతాండవం గమనించి మూగబోయాను

# 10

రైళ్ళు అతి కొద్దిగా నడుస్తున్నాయి. మూడవతరగతి టిక్కెట్లు ఇవ్వటం లేదు. 38వ డోగ్రా విభాగానికి చెందిన అధికారి యిచ్చిన మాయా జాలం గల ఉత్తరం భగీరథ చూపించిన మీదట ఆంగ్లోఇండియన్ స్టేషను మాష్టరు మమ్మల్ని ఒక మిలిటరీ రైలులో ప్రత్యేకంగా ప్రయాణం చేసే సదుపాయం కల్పించాడు. మాకు అచ్చంగా మూడవతరగతి సేవకుల పెట్టె కేటాయించారు. దాన్ని ఆనుకునే మొదటితరగతి అధికారుల పెట్టెవుంది. లాహోరులో రైలు చాలాసేపు ఆగినపుడు ఆ నగరంలో జరిగిన విశేషాలను గురించిన వదంతులను భగీరథ మోసుకొచ్చాడు.

'అమ్మా! ఇంటినుంచి పిల్లలకు భోజనము తీసుకురావటం మంచి దయింది. నేను రొట్టెలకోసం వెళితే ఒక హోటలుగానీ, దుకాణం గానీ తెరిచి లేవు, మంచి నీళ్ళు కూడా దొరకలేదు. రైల్వేవంటశాల నుంచి ఈ కుండ నిండా మంచి నీళ్ళు పట్టితెచ్చాను. కిటికీలోంచి మీకు కనిపిస్తూ వుంటుంది — పోలీసులూ, సిపాయిలూ తిరగటం.'

'అమృతసర్‌లో జరిగిన ఘోరం ప్రజలకు జరుగకుండు గాక!' అంటూ అమ్మ ప్రార్థించింది 'కృష్ణా! శివా! మీరు అన్నం తిని పడుకోండి నాయనా! బాబూ! భగీరథ్! నీవుకూడా తిను.' అంది.

'అమ్మా! ముందు పిల్లలకు పెట్టండి తర్వాత నా సంగతి. నాకు మంచినీళ్ళు కావాలి ముందు' అన్నాడు భగీరథ.

'మహమ్మదీయుల కుండలోంచి నీళ్ళు తాగుతావా?' అడిగింది అమ్మ.

'మతాన్ని గురించిన ప్రసక్తి ఇప్పుడు లేదు. అమృతసర్‌లో జనరల్ డయ్యర్ దొరవలె లాహోరులో కల్నల్ జాన్సన్ దొర పెత్తనం చెలాయిస్తున్నాడు. రాత్రి ఎనిమిది దాటిన తర్వాత ఎవరూ బయటికి వెళ్ళటం లేదు: వెళితే తుపాకీ కాల్పులకు గురికావచ్చు, కొరడా

దెబ్బలు తగలవచ్చు, జుల్మానా లేదా జైలుశిక్ష పడవచ్చు. ప్రభుత్వం వారు టాంగాలన్నీ స్వాధీనం చేసుకున్నారు. విద్యార్థులు రోజుకు నాలుగు సార్లు పోలీసుల ముందు హాజరు వేసుకోవాలి. తిండి గింజలు దొరకటం లేదు. వారి కర్మననుసరించి ప్రజలు ఈ శిక్షకు అర్హులో కాదో నాకు తెలియటం లేదు. నాకు అసంతృప్తిగా వుంది. నేను ప్రభుత్వం వారి ఉప్పు పులుసు తింటున్నాను. అయినా వారు ప్రజలను తుపాకీ గుండ్ల ఎఱచేయటం తప్పు.' అన్నాడు భగీరథ.

'అవునన్నయ్యా! రాత్రి ఎనిమిదిగంటల తర్వాత వీధులలో తిరుగు తున్నందుకు కొట్టడానికి కృష్ణ చేసిన తప్పేమిటి?.... కృష్ణను కొరడాతో కొట్టిన విషయం నీకు తెలుసనుకుంటాను.'

నాకు తగిలిన కొరడా దెబ్బలను గురించి భగీరథ్ విన్నాడు. బ్రిటిష్ ప్రభుత్వం పట్ల విధేయత ప్రజలపట్ల సానుభూతి మధ్య అతను వూగిసలాడి మౌనంగా వుండిపోయాడు.

మేము ఏరైలుకు వస్తామో తెలియక నాన్న స్టేషనుకు రాలేదు. మేము ఉదయం 8 గంటలకు టాంగాలో ఇల్లు చేరేసరికి ఆయన ఆఫీసుకు వెళ్ళిపోయారని పనిమినిషి చెప్పింది. మేము వచ్చిన విషయం చెప్పటానికి భగీరథ్ ఆఫీసుకు వెళ్ళాడు అమ్మ వంటగది సర్దటంలో నిమగ్నమైపోయింది. శివ ఆటబొమ్మల కోసం వెదుక సాగాడు. నాన్న తెచ్చిన కొత్తపుస్తకాల కోసం వేట సాగించాను. మేరీ కరోలీ రచించిన 'సైతానుపాట్లు' (Sorrows of Satan) కనిపించింది

మధ్యాహ్న భోజనం వేళకు భగీరథ్ ద్వారా నాన్న వర్తమానం పంపించాడు. ఇంటికివచ్చి భోజనంచేసి వెళ్ళే వ్యవధిలేనందువల్ల ఆఫీసుకు భోజనం పంపమన్నాడు.

సైనికశాసనం అమలులో వుండటమే అత్యవసర పని అని నేను గ్రహించాను. జాతీయ రహదారి మీద దళాలు కదం తొక్కుతూ వెళ్ళటం గమనించాను. ఈ విషయం మీద డా. చునీలాల్ అభిప్రాయం తెలుసుకోవాలని దుగ్ధగావుంది.

భోజనానంతరం ప్రయాణ బడలిక తీర్చుకోవటానికి నిద్ర

పోవలసిందిగా అమ్మ సూచించింది. నాన్న సలహా అందేంత వరకు మేము బయట తిరుగ కూడదని ఆజ్ఞ పెట్టింది.

సాయంత్రం నాలుగు గంటలప్పుడు వరండాలో నాన్న కంఠం వినిపించింది. మొరటుగా కటువుగా ఆయన అమ్మను మందలిస్తున్నాడు. నన్ను బయట తిరగ నిచ్చి తనకు క్లిష్ట పరిస్థితులు తెచ్చిపెడుతున్నావని ఆమెపై కోప్పడ్డాడు. నేను ముందు గదిలో భయంగా కూచుని వున్నాను. నాకు జరిగిన దురదృష్టకర సంఘటన విని కుటుంబ వ్యవహారాలను గురించి అమ్మ ప్రస్తావిస్తే ఆమెమీద విరుచుకు పడతాడేమోనని భయం. నాపక్కన శివ హాయిగా నిద్రపోతున్నాడు. ఇప్పుడున్న పరిస్థితిలో నాఅంతట నేను లేచివెళ్ళి నాన్న దగ్గరకు పోవటానికి ధైర్యం చాల లేదు.

'నేను వెంటనే ఆఫీసుకు వెళ్ళాలి. పాలుతెచ్చి యివ్వు' అని అమ్మతో అనటం విన్నాను.

'వేడి చేసి తెస్తా నుండండి' అంది.

ఆయన మండిపడుతూ— 'నీకు పిచ్చి' 'నేను రాగానే కాచకూడదూ! దేశంలో ఈ నాడు ఎంత విపత్కర పరిస్థితివుందో నీలాంటి వాళ్ళు అర్థం చేసుకోలేరు. గాంధీ ప్రారంభించిన తిరుగుబాటు విప్లవంగా మారవచ్చు. దొరలు విధేయులైన తమ సేవకుల మీద ఆధారపడతారు. ఇప్పుడు అధికారం సైన్యం చేతుల్లో వుంది. మా దళం ముందుకు సాగుతోంది. మేము తింటున్న ఉప్పు, పులుసుకు భిన్నంగా వ్యవహరించటం లేదని మాలాంటి కొందరం నిరూపించుకోవాలి..... నా గౌరవం కాపాడటానికి ఈ చిన్న వెధవను ఆ దగాకోరులతో తిరగకుండా చేసి వుండవలసింది. యదార్థానికి దొరలకు ఈ విషయం ఇంతవరకూ తెలియదు. లేకపోతే నా శత్రువులు ఈ సంఘటన ఆధారంగా చేసుకొని కుట్ర పన్నివుందురు.'

ఈ మాటలంటూ పాలుకాచి తెచ్చేంతవరకూ కూడా వుండకుండా వెళ్ళిపోయాడు.

నాన్న ఈ విధంగా విరుచుక పడ్డ తర్వాత, డాక్టరు చునీలాల్‌ను

శకుంతలనూ చూడటానికి వెళ్ళనిమ్మని పట్టు బట్టాను. నన్ను దూరంగా పంపడానికి యిష్టపడక గౌను వేసుకొని అమ్మ నన్ను, శివను నడిపించు కుంటూ ఆసుపత్రి సమీపంలోని నా స్నేహితుల యింటికి తీసుకెళ్ళింది.

ఆదర్శవధువైన శకుంతల వద్ద అత్తగారుగా తాను పోగొట్టుకున్న పెత్తనంపట్ల సానుభూతి పొందటానికి ఆమె నాతో రావడానికి ఆసక్తి చూపింది.

ఆవిడ అమ్మను ఆలింగనం చేసుకొని, పిల్లలకి మాకు ముద్దు లిచ్చింది. 'వారి' కోసం టీ తయారు చేస్తున్నాననీ, ఆయన ఆసుపత్రి నుండి యిప్పుడే వస్తారనీ చెప్పింది.

గణేశ్ పెండ్లికి వాళ్ళు చదివింపులు చేసినందుకు ప్రతిగా అమ్మ వాళ్ళకు పిండివంటల బుట్ట, రవిక గుడ్డ కానుకగా యిచ్చింది. పెషావరు నుండి అప్పుడే వచ్చిన పండ్లబుట్టను శకుంతల అమ్మకు కానుకగా యిచ్చింది. ఈ విధమైన హార్దిక స్వాగతం లభించిన ఉత్సాహంలో వుండగా డా. చునీలాల్ ప్రవేశించి పన్నీరు చిలకరించినట్లు మాట్లాడారు. ఆయన గుండ్రని ముఖంలో ముడిబడ్డ పాలభాగం కొట్టవచ్చినట్లు కనబడుతోంది.

శకుంతల తన భర్త ముఖంలో కోపాన్ని గమనించి హిందూ స్త్రీ సహజంగా అడిగిన ధోరణిలో— 'మీ శత్రువులకు ఏమైంది?' అని అడిగింది.

డా. చునీలాల్ వాలుకుర్చీలో కూలబడుతూ —

'శత్రువులు ప్రజలను తుపాకీ గుండ్లకు ఎరచేసి కొరడాలతో కొట్టి రోడ్లమీద ఈడ్చి, బాధిస్తున్నారు.'

'శకుంతలా! యిక్కడకు మేము రావటం అద్భుతం. అమృతసర్‌లో చీకటిబడిన తర్వాత వీధులలో తిరుగుతున్నాడని కృష్ణను పోలీసులు నిర్బంధంలోకి తీసుకున్నారని మీకు తెలియదు. రాత్రి అంతా నిర్బంధంలో వుంచి కొరడాతో కొట్టారు.' అంది అమ్మ.

పైట చెరగులో కన్నీటిముఖాన్ని దాచుకుంటూ శకుంతల లేచివచ్చి నన్ను హత్తుకుంది. సానుభూతితో నా కళ్ళు చెమ్మగిల్లాయి. డాక్టరు

చునీలాల్ మాపట్ల కఠినంగా వ్యవహరించినందుకు చిన్న బుచ్చుకుని నన్ను దగ్గరకు తీసుకున్నాడు. అదే అదనుగా శివ శకుంతల మెడ కరుచుకున్నాడు.

'నీవు ఏడవ నవసరంలేదు. మాతృభూమికి తగిన బిడ్డ వనిపించు కున్నందుకు గర్వపడాలి. మీ నాన్న పిరికితనాన్ని అధిగమించావు.' అన్నాడు చునీలాల్.

'పిరికివాడు అనేపదం వీళ్ళ నాన్నపట్ల సార్థకం. ఆయన మరీ బలహీనుడు. క్లిష్ట సమయాలలో ఆయన ఎప్పుడూ దేవదూతల పక్షం వహిస్తాడు' అంది అమ్మ.

'వదినా! కసాయివాడైన ఆ డయ్యరు అధికారుల ముందు తన తఢాఖా చూపించడానికి జలియన్ వాలాబాగ్ లో గుంపులపై కాల్పులు జరి పించారు. గాయపడిన వారినీ, చనిపోతున్న వారినీ వైద్యసహాయం లేకుండా అక్కడే వదిలి వేశాడు. చావునుండి ఎందరినో కాపాడి వుండవచ్చు. తుపాకీ గుండ్లను తప్పించుకుందామని పాడుబడ్డ బావిలో దూకిన కొందరు సహాయం అందక చనిపోయారు. వారిని ఆదుకోవ టానికి ఎవరినీ వెళ్ళనీయలేదు. ఆ భయంకర వాతావరణం యింకా కొనసాగుతూనే వుంది. ఇప్పుడు అమృతసర్ లో ఈ శాసనం రాజ్యం చేస్తోంది.' అన్నాడు డాక్టరు.

'అన్నయ్యా! నిజానికి చీకట్లు కమ్ముకున్నాయి.' అమ్మ వ్యాఖ్యా నించింది.

'ఈ దారుణ శాసనమేమిటి?' అడిగింది శకుంతల

'అవును. అమృతసర్ లో ఇంగ్లీషు డాక్టరు కుమారి షేర్ వుడ్ ను కొట్టిన వీధిలో వెళుతున్న ప్రజలంతా దోగాడుతూ వెళ్ళవలసిందిగా డయ్యరు ఆజ్ఞాపించాడు. ఆశ్చర్యకరమైన విషయం! అదే వీధిలోని సహృ దయులైన కొందరు భారతీయులు ఆమెను రక్షించి వారి యింటికి తీసుకొనివెళ్ళి రక్షించారు. అయినప్పటికీ ఆ వీధిలోని వారు కూరలు తెచ్చుకోవడానికి వెళ్ళినా ఈ మట్టి బుర్ర జనరల్ ఆదేశాలను శిరసా వహించవలసిందే...... జనాన్ని కొరడాతో కొట్టడానికి రాజ వీధులలో

వేదికలు కట్టారు. పట్టణాల్లో, రైలు స్టేషన్లలో, కొరడాలతో కొట్టే పద్ధతి ప్రవేశపెట్టారు. యూరోపియన్లు తప్ప మిగతావారి సైకిళ్ళను స్వాధీనం చేసుకున్నారు.... ఇది సైనిక శాసనం కాదు. భయంకర కార్యకలాపం. రౌలత్ చట్టాన్ని వ్యతిరేకించిన ప్రజలను శిక్షించటానికి ఎత్తుగడ...... ఢిల్లీకి సమీపంలో గాంధీని నిర్బంధించి పంజాబుకు వెళ్ళ డాన్ని నిషేధించి బొంబాయికి తిప్పి పంపించి వేశారని ఒక వదంతి. నిజమో? కాదో? తెలియదు. కుడి చెంప మీద కొడితే ఎడమ చెంప చూపించమని చెప్పడానికి ప్రజల వద్దకు ఆయన వచ్చారు.'

డాక్టరు ముఖం కందగడ్డలా జేవురించింది. మరుక్షణంలో ఆయన నన్ను గాఢంగా హత్తుకొని బిగ్గరగా ఏడ్వసాగాడు. టీ కలుపుతున్న శకుం తల ఆదుర్దాగా వచ్చి ఆయన మెడచుట్టూ చేతులు వేసింది.

ఎప్పుడూ సిద్ధంగా వుండే కన్నీళ్ళు కార్చాను. ముగ్గరం ఓదార్చ టానికి వీలు లేనంతగా దుఃఖించాము. భయపడి శివకూడా అమ్మ వొడిలో తలపెట్టి ఏడ్చాడు. అమ్మ పైటచెరగులో తల దూర్చిఏడ్చింది.

'నేను ఈ మిలిటరీ వైద్యసేవనుండి రాజీనామా చేస్తాను. ఈ పాడు ప్రభుత్వంతో మనకు పొత్తువద్దు' అన్నాడు డాక్టరు కటువుగా.

'మీకు యిష్టమైతే అలానే చేయండి. నేను త్వరలో పరీక్షలు పూర్తి చేస్తాను. ఇద్దరం కలిసి చిన్న పట్టణంలో ఎక్కడైనా వైద్యవృత్తి చేపడదాం.'

'నాకు సంబంధించినంత వరకూ నేను మాయింట్లో వాతావర ణాన్ని బట్టి — హరిద్వార్ వెళ్ళిపోయి సన్యాసి నౌదామనుకుంటున్నాను. వీళ్ళ నాన్న భయస్తుడు. కీటకంలా తయారయ్యాడు. డాక్టర్లమందరమూ కలిసి చదువుకున్న వాళ్ళను ఒక సమావేశానికి పిలిచాము. అందరం కలిసి రాజీనామా చేసే విషయమై చర్చించటానికి ఆయనను కూడా పిలిచాము. ఎంతో మంది జవాన్లను పంపినప్పటికీ ఆయన రాలేదు. మీ కుటుంబంతో సంబంధం తెగతెంపులు చేసుకుందాంమనుకున్నాను. మీ కృష్ణ దెబ్బలు తిని మమ్మల్ని వశపరచుకున్నాడు.' అన్నాడు డాక్టరు.

'వాళ్ళ నాన్నకు మీరీవిషయం చెప్పండి. కుర్రవాడిమీద ఆయన

కోపంగా వున్నారు. కృష్ణ మేలుకొని వుంటే మధ్యాహ్నం ఆయన వాణ్ణి కొట్టివుండేవారు.' అభ్యర్థనగా అంది అమ్మ.

'నాకృష్ణ వొంటి మీద చేయివేస్తే వూరుకునేది లేదు.' శకుం తల మొండిగా అంది. ఆమాట అంటూ నా ముఖంలో ముఖంపెట్టి చూస్తూ, నాకు ధైర్యం నూరి పోశారు. అమృతసర్‌లో పోలీసు స్టేషనునుండి తిరిగి వచ్చిన తర్వాత నాలో సన్నగిల్లిన ధైర్యాన్ని ఆమె దయార్ద్ర దృష్టితో ప్రోదిచేశారు.

భగీరథ్ ఉదయం లాగానే మళ్ళీ నాన్నకు భోజనం తీసుకెళ్ళటానికి సాయంకాలం వచ్చాడు. మేము పడుకునేలోగా నాన్న ఆఫీసునుంచి తిరిగి రాలేదు. మర్నాడు ఉదయం నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ గురకపెడ్తూ, నిద్రపోవడం చూశాము. ఎప్పుడూ గొడవచేసే శివకూడా వరండాలో సద్దుచేయకుండా కొయ్యగుర్రం తీసుకొని బయటికి వెళ్ళిపోయాడు.

నేను బడికి దూసుకు పోవటానికి సిద్ధంగా వుండగా నాన్న లేచారు. కళ్ళుబాగా వుబికిబాగా ఎఱ్ఱనై వున్నాయి. నన్ను పిలిచి — 'ఒరేయ్, అమృతసర్‌లో చేసినట్లుగా జీలంలో కూడా తుంటరి పనులు చేసి నాకు చెడ్డపేరు తీసుకురాకు.... ఎక్కడికి బయలుదేరావ్? ఈ పరిస్థితుల్లో బడి వుండదు' అన్నాడు.

'వాడి మీద కోప్పడకండి. వాడు అమాయకుడు' అంది అమ్మ.

'పిచ్చిదానా! వాడు అనవసరంగా బయటికి వెళ్ళి నిషేధాజ్ఞ లను ధిక్కరించాడు. అమాయకుడను కుంటున్నావా? ఆపనికి మాలిన వాళ్ళతో కలిసి దెబ్బలు తినడానికి ! మనయింట్లో ఎవరైనా జైల్లో ఒక రాత్రి గడిపారా?— ఆమొరటు పంజాబు గుంపు అస్తవ్యస్త స్థితి కల్పిస్తు న్నారు. మీరు అదృష్టవంతులు కాబట్టి సైన్యం రైలులో రాగలిగారు. నేను ప్రభుత్వానికి సేవ చేస్తున్నాను కాబట్టి అది వీలుపడింది. లేకపోతే మీరందరూ మాడిమసి అయిపోయివుందురు గుజరన్‌వాలాలో రైలుకు గుంపు నిప్పంటించింది. ఫ్లాట్‌పారం మీద మంటలు రేపారు. అదే విధంగా ఢిల్లీలోనూ కసూరులోనూ చేశారు పిచ్చి ప్రజలు! ప్రభుత్వం మనకు చేసిన సదుపాయాలు ఆలోచిస్తే— రహదారులు, రైలుమార్గాలూ

నిర్మించారు. ఇప్పుడు మన కంటోన్మెంటు చుట్టూ సైనికులు గస్తీ తిరుగుతున్నారు. బయటికి వెళ్ళాలంటే 'పాస్' కావాలి. బడి తప్ప కుండా మూసివేసి వుంటారు. ఇంట్లో కూర్చుని నీకు రాని లెక్కలు వేసుకో.'

నేను తలుపు దగ్గర నుండి ముందు గదిలోకి వచ్చి సంచి తెరి చాను. నాన్న కోపం పట్ల భయకంపితుణ్ణై, ఆయన ఎప్పుడు విరుచుక పడతారోనని ఎదురుచూస్తున్నాను. అంత కోపంగా ఆయన మాట్లా డటం నేను ఇటీవల చూడలేదు.

అమ్మ బహుశా ఆయన కోపాన్ని రెచ్చగొడుతూ — 'ఇది వెధవ ముండ ప్రభుత్వమని మీరే అనేవారు' అంది.

'అనవసరంగా వాగకు. నీ ద్వారా దళంలోని నా శత్రువులకు ఇలా నిందించినట్లు తెలిస్తే నన్ను సైనిక శాసనం ద్వారా శిక్షిస్తారు.' అని తిట్టి అమ్మ నోరు మూయించారు.

'మీరు సిగ్గుపడుతున్నంతగా కృష్ణను చూసి డా. చునీలాల్ సిగ్గు పడటం లేదు.' అంది.

'ఈ యువరక్తం పొంగిపొరలే మూర్ఖుల గురించి నావద్ద చెప్పకు. వారు గొడవలు కొని తెచ్చుకుంటారు. నేను విధేయంగా 20 సంవ త్సరాలు ప్రభుత్వసేవ చేశాను. ఈనాడు ఈ విప్లవకారులతో కలిసి నా ప్రవర్తనకు మచ్చ తెచ్చిపెట్టుకోలేను తెలిసిందా? వాళ్ళమాటలు వినటానికి వెళ్ళకు. పిల్లలను కూడా పంపకు. ఈ వైద్యులను త్వరలో సైన్యంనుండి బయటికి గెంటి వేస్తారు' అని నాన్న బదులు చెప్పారు.

ఆయన ఆమాటలు ఉచ్చరించిన తీరు నాకాయనపట్ల ద్వేషాన్ని కలిగించింది. ఆయన వ్యక్తిత్వంపట్ల నాతో పాదుకున్న కాంతి రేఖలు క్రమంగా మాయమయ్యాయి. మా నాన్నలో పశుత్వ లక్షణాలను గుర్తుకు తెచ్చుకున్నాను. ముఖ్యంగా ఒకరోజు నౌషిరాలో వున్నపుడు నేను బడికి వెళ్ళటం ఆలస్యమైతే దీన్‌గుల్ మాస్టారు నన్ను కొడతారని తెలిసి కూడా ఆయన మంగలిని పిలుచుక రమ్మని పంపాడు. నేను దెబ్బలు తిన్నా ఫరవాలేదని ఆయని ఉద్దేశ్యం.... ఆయనను లోలోపల నిందిస్తూ

నేను మగతగా ఆలోచనలలో మునిగి పోయాను. కొద్దిరోజులలో ఆయన నన్ను చావ బాదుతాడని గుర్తుకువచ్చి భయంతో వణికి పోయాను. అమృతసర్‌లో పోలీసుల చేతుల్లో తిన్న దెబ్బల ధ్వని వినిపించింది. సిపాయిలు నైపుణ్యంకోసం తుపాకీ గుండ్లు వదలుతూ దారినవెళ్ళే స్త్రీ, పురుషులను బాధిస్తున్నారు. జేవురించిన ముఖంతో గాడిదతల కలిగిన జనరల్ డయ్యర్ సైనికులను కాల్పులు జరపమని ఆదేశించటం రాక్షస రాజు రావణుని గుర్తుకు తెస్తోంది. నాన్నకు ఆ శబ్దాలు ఎందుకు వినిపించవో ఆశ్చర్యంగా వుంది. నిర్దాక్షిణ్యంగా తుపాకీ గుండ్లతో మానవ శరీరాలను తూట్లు పొడుస్తున్న ఆ శబ్దాలు ఆయనకు ఎలా వినిపించవో వూహించ లేకుండా వున్నాను.

అదృష్టవశాత్తు నాన్నను సైనిక విభాగం అధిపతి మేజర్ బ్రైలు దొర పిలుస్తున్నారని భగీరథ్ వర్తమానం తెచ్చాడు.

నాశరీరంలో అగ్ని పర్వతం వంటి తిరుగుబాటు మనస్తత్వం రగులుతోంది. డయ్యర్ కల్పించిన భయంతోపాటు తప్పించుకుని వెళ్ళగలమనే ఆశ కలిగింది. నిజానికి అమృతసర్ వీధుల్లో యధాలాపంగా తిరిగినట్లు ఇక్కడ కూడా అలా వెళ్ళి వద్దామన్న దుర్గ నన్ను తొందరపెట్ట సాగింది. ఈ యింట్లోని దుర్గంధ వాతావరణంలోంచి బయటపడితే నేను గాలిపీల్చు కోగలను. బహూశా నన్ను వాళ్ళు పట్టుకువచ్చి ఇంత కంటె ఎక్కువగా భయంకరమైన పరిణామాలను ఎదుర్కోవలసి రావచ్చు. భయమనే ఉన్మాద స్థితిలో దిక్కుతోచక పోతుందేమోనని అనిపించింది. అయినప్పటికీ చునీలాల్ యింటి స్వేచ్ఛా వాతావరణం నా ఆత్మకు అయస్కాంతంగా పనిచేసింది. నాలోని ఆలోచనలు పిరికితనాన్ని ఆవహించక ముందే, అమ్మ వంట గదిలో వున్నపుడు జారుకున్నాను.

పరుగెడుతున్నంత సేపూ నానెత్తి మీద ఇద్దరు సూర్యులు ఘర్షణ పడుతున్నట్లు తోచింది. ఉదయ సూర్యుని తాపంవల్ల ప్రకాశమానంగా భాసిస్తున్న తెల్లని సూర్యుడొకవైపు, నా వెనుకవైపు నుండి వస్తూ ఆకాశాన్ని ఆవరించిన మా నాన్న కోపమనే నల్లని సూర్యుడు మరొకవైపు ఘర్షణ పడబోతున్నారు. ఇద్దరు సూర్యులూ దగ్గర కాబోతున్నపుడు పరుగెత్తటం ఆపాను. ఆశ్చర్యం! కొత్తయిండ్ల నీడల మీదనుండి చెల్లని

గాలి వీచి నా చెమట ఆరిపోయింది అడుగులు వడివడిగా వేస్తూ, మామూలుగా నడుస్తున్నట్లు అభినయించాను ఆసుపత్రి దగ్గర బజార్‌లో అమ్మకు సామాన్లు తెచ్చేందుకు వెళుతున్నట్లుగా నడిచాను

నేను వాళ్ళ యింటికి వెళ్ళేసరికి శకుంతల స్నానం చేస్తోంది. ఆమె భర్త ఆసుపత్రిలో పనికి వెళ్ళారు.

'నేను కృష్ణను! వచ్చాను.' బయటనుండి పిలిచాను. 'ఏమిటి నాయనా విషయం?' అడిగింది ఆమె.

'ఏమీ లేదు.' అని అబద్ధమాడాను.

ముందు గదిలోకి వెళ్ళి 'వస్తుగుణ దీపిక' (Indian Materia Medica) పుస్తకం దొంతరల్లోంచి తీసి మెత్తటి పరుపుమీద కూచుని చదవ సాగాను.

కొద్ది క్షణాల్లో తెల్లని చీర కట్టుకొని కురులు ఆర్చుకుంటూ శకుంతల వచ్చింది. నన్ను చూడగానే ఆమె పరిస్థితి గ్రహించింది.

'నీ సంచికూడా తీసుకుని వచ్చివుంటే నీకు పాఠాలు చెప్పివుందును. సరే రోజూవలె నీకు పాయసం తాయారు చేద్దాం వారి గుడ్డలు నీకు సరిపోయేలా కత్తిరిస్తాను. నీవు నా బిడ్డతోసమానం తెలిసిందా?' అంది.

నా ముఖం మారిపోయింది. ఆవిడ తన చేతుల్లోకి నా తల తీసుకుంది. నాకు ఏదో వూరటగా అనిపించింది

'అమృతసర్‌లో నేను బయట తిరిగినందుకు, వాళ్ళు నన్ను కొట్టినందుకూ, నాన్న తిట్టాడు. నేను పరుగెత్తుకుని వచ్చేశాను.'

'ఫరవాలేదు నీవూ నేనూ ఆడిపాడి కాలక్షేపం చేద్దాం. ఇంతలో ఆయన పని నుండి వస్తారు. అందరం కలిసి పిండి వంటలు హాయిగా తిందాం.'

ఆరసమయ ఘట్టం ఎంతోసేపు నిలవలేదు. మధ్యాహ్నం అమ్మ వచ్చింది. శివను తోడు తీసుకొని గాబరాగా వెదుకుతూ ఎక్కడికి వెళ్ళివుంటానో తెలుసు కాబట్టి సరాసరి వచ్చింది.

'నాయనా! నీకోసం బజారు అంతా గాలించాను. నీవు సుఖంగా ఇక్కడ వుంటావని తెలుసు. అయినా చూస్తేగానీ తృప్తి తీరలేదు.'

కునుకు తీద్దామని అనుకున్నాను. ఆమె మానసికంగా నావల్ల చూపుతున్న అదువుకు ఆగ్రహం వేసింది. మా తల్లిదండ్రులు మా ఉన్నత వంశ గౌరవ ప్రతిష్టల కోసం కట్టు కథలుగా అల్లిన వల యంలోంచి నేను బయటపడాలనుకున్నాను. ఈ కపట సంభాషణ, వాగుడు, నాన్న కటువైన నిందలు సహించ లేకపోయాను.

'అమ్మా! నాతప్పు లేకపోయినా నాన్న నన్ను తిట్టాడని నీకు తెలుసు.'

'బాబూ! మీ అమ్మ మనషక్షం' నా పక్కనే పడుకున్న శకుంతల లేచి కూచుంటూ అంది.

'అన్నయ్యా! గణేశ్ పెండ్లి నుండి తెచ్చిన పిండివంటలు అమ్మ నాకు పెట్టింది. నీకోసం భోషాణం పెట్టెలో భద్రపరచింది.' అన్నాడు శివ ఆప్యాయంగా.

'బాబూ! మనయింట్లో నీకన్నీ వున్నాయి. శకుంతల ఎక్కువ పెట్టలేదని అనటం లేదు. నీవు యిక్కడికి వస్తున్నట్లు నాకు చెప్ప వలసింది. నేనెంత గాబరా పడ్డానో! అదృష్టవశాత్తు మీ నాన్న మధ్యాహ్న భోజనానికి యింటికి రాలేదు. నీవు యింట్లో లేవని ఆయనకు తెలి యదు' అంది అమ్మ.

'అక్కయ్యా! వాళ్ళనాన్న తిట్టినపుడు నీవు తనకు వత్తాసు పల కలేదని నీతో చెప్పిరాలే దనుకుంటాను. పిల్లవాణ్ణి తిట్టటం మంచిది కాదని అన్నయ్యకు చెప్పు. దొరలంటే ఆయనకు భయం వుండవచ్చు.... ఇతణ్ణి పరుషంగా మాట్లాడరనే వాగ్దానం యిస్తేతప్ప మీ యింటికి రాడు. లేకపోతే, యితను మాతో వుంటాడు.' అంది శకుంతల.

'భగీరథ్ వేపచెట్టుకు ఉయ్యాల కడుతున్నాడు మనకోసం' అన్నాడు శివ.

'చెల్లీ! శకుంతలా! నేనేంచేసేది?' నిట్టూరుస్తూ అంది అమ్మ:

" 'వారు' నామాటవినరు. వారికి 'భయం' అనేమాట వాస్తవం. అందుకే ఆయన ఊరికే విరుచుక పడతారు. ఆయన నోరు మంచిది కాదు. మమ్మల్ని మింగేస్తారు. ఆయన కోపానికి భయపడి జీవిస్తున్నాను. దేవకి భర్త చనిపోయినప్పటి నుండి 'వారు' మారిపోయారు. నీకు తెలుసా?"

ఈ మాటల వెనక భావం నాకు తెలిసింది. ఈ విధంగా కప టము, అబద్ధాలు, హింసలతో దుర్గంధ భూయిష్టమైన ఈ ప్రపంచంనుండి ఆకాశంలోకి ఎగిరి పోవడానికి రెక్కలువుంటే బాగుండు ననుకొన్నాను.

'సరే! అయితే యితన్ని యిప్పుడు పంపను. చాలారోజులుగా మావద్దలేడు గాబట్టి డాక్టరుగారు నేను మాతో కొద్ది రోజులు యితణ్ణి వుంచుకొంటామని అన్నయ్యకు చెప్పు. అన్నయ్య ఒక రోజు వచ్చి మాట్లాడ వచ్చు. ఆయన జనాలను చంపడంలో ప్రభుత్వానికి తోడ్ప డుతూ తీరిక లేకుండా ఉన్నారు. తీరికగా వున్నప్పుడు వచ్చి కృష్ణను తీసుకెళ్ల వచ్చు...... ఇంక ఎక్కువగా యీ విషయంలో మాట్లాడ వద్దు. ఈ మధ్య నేను చేసిన జరీపని నీకు చూపిస్తాను. మనం తేట మజ్జిగ తాగుదాం.' అంది శకుంతల.

అమ్మ వాదించలేక సరేనంది.

కొద్ది రోజుల తర్వాత నేను యింటికి వెళ్ళి సంచిలో పుస్తకాలు తీసి పాఠాలు పూర్తి చేద్దామనుకొన్నాను సాయంకాలం 5 గంటల సమయంలో వెళ్లాను. ఆ సమయంలో నాన్న జీలంలో హాకీ ఆటకు 'రెఫరీ'గా వెళ్ళివుంటారని తెలుసు.

దురదృష్టవశాత్తు బ్రిటీషు వారు ఎదుర్కొంటున్నా ఈ విపత్కర పరిస్థితుల్లో హాకీ ఆటలు ఆడరని నాకు గుర్తురాలేదు. ఆయన చాలా రోజుల కష్టమైన పని బడలికతో నిద్ర పోతున్నారు.

ముందుగదిలోకి నడిచాను. నేను లేనప్పుడు తనతో ఆడుకోవడా నికి ఎవ్వరూ లేకపోవడంతో, నన్ను చూడగానే శివ కేరింతలు కొట్టాడు.

'అమ్మా! కృష్ణ వచ్చేశాడు. కృష్ణ!'

ఈ మాటలకు నాన్న లేచాడు. అమ్మ వంట గదిలోంచి బయటి కొచ్చింది.

'ఎవరూ?' అన్నాడు నాన్న కటువుగా.

నేను భయంతో అమ్మ కాళ్లు చుట్టుకొన్నాను. ఆమె నా తల నిమురుతూ నా మీదికి వంగి — 'భయపడకు. ఆయన మింగివేయరు.' అంది.

నేను తిరిగి వచ్చానని నాన్నకు తెలిసింది.

ఆయన ముందుగదిలోకి వచ్చి, అమ్మ దగ్గరనుండి నన్ను లాగి, చెంపమీద చెళ్లునకొట్టి అరిచాడు:

'చుంచెలుకా! నీవు నాకు తలవంపులు తెచ్చేలా ప్రవర్తించి, నాకు సైన్యంలో శిక్షపడేలా చేసి, ఉద్యోగం లోంచి తీసివేయిస్తావు.... ఇంట్లోంచి బయటికి వెళ్లడం ఎప్పుడు నేర్చుకొన్నావురా గాడిదా?'

'నా బిడ్డను కొట్టకండి.' అంటూ అమ్మ నన్ను పొదివి పట్టుకొంది.

అమ్మ తన చీరచాటున ఏడుస్తోంది

'ఈ యింట్లో అందరూ నాకు వ్యతిరేకమని తెలుసు. మీరిలానే ప్రవర్తిస్తే మిమ్మల్ని అందర్నీ అమృతసర్ పంపివేస్తాను. మూర్ఖుల్లారా!' అంటూ గాఢంగా నిట్టూర్చి, ముఖంలో విసుగు కనిపిస్తుండగా, ఆయన ముఖం కడుక్కోని వచ్చారు.

ముందుగదిలో ఒకమూల భయంతో వణుకుతూ వొదిగి నిలబడ్డాను. నాన్నమీద ద్వేషంగా వుంది. కొద్దిపాటి తిరుగుబాటు చేసినా, ఆయన మళ్లీ చావబాదుతాడని భయమేసింది. ఉద్రేకంతో కూడిన పొగలు నా కళ్లల్లోకి వచ్చి కన్నీరుగా మారాయి. రాత్రిపడుకొంటే నన్ను హింస పెడుతున్న రాక్షసుల కలలు వచ్చాయి. డయ్యర్ భయంకర వదనం నన్ను దహించివేస్తోంది. కళ్లు ఎర్రనచేసి, నాలుక బయటకు చాచి, తలమీద కొమ్ములు ఊగుతుండగా, వివర్ణమైన నా ముఖంలోకి ఆయన చూస్తున్నాడు. నన్ను కొట్టడానికి కొరడా తీసుకొని సిద్ధంగా వున్నవారి

పక్కన మరోవ్యక్తి ముఖం ఎర్రగా వుంది. ఆ సమయంలో కళ్లు తెరిపిడిపడి భయపడుతున్నానని తెలిసింది. కేకలు పెట్టడంతో గొంతు తడి ఆరిపోయింది.

'నిద్రపో!' నాన్న అరిచాడు.

భయంతో నా చెవులు దిమ్మెక్కి, ఎండిన గొంతుతో— 'నీళ్లు' అని మాటిమాటికి అరిచాను.

అమ్మలేచి వచ్చి నీళ్లుయిచ్చి నా నుదురు పట్టుకొని— 'జ్వరం వచ్చింది' అంది.

'నిత్యదరిద్రుడు! దుప్పటికప్పు. విశ్రాంతి తీసుకోనీ! రేపు ఉదయం జ్వరం సంగతి చూద్దాము.' అన్నాడు నాన్న

ఇంకేదైనా శబ్దం వినిపిస్తే, నాన్న లేచివచ్చి నా చెంపలు వాయిస్తాడని భయపడి నిద్రపడితే బాగుండు ననుకొన్నాను.

ఏడుపు దిగమింగుకొని, చెమటలు పడుతుంటే కళ్లు మూసుకొని పడుకొన్నాను. తలనొప్పి, విపరీతంగా వొళ్లు నొప్పులు గుసగుసలుపోతూ, ఉట్టినే వణికిపోతూ, వేకువజామున నిశ్శబ్ద వాతావరణంలో నిద్రముంచుకొచ్చింది. మరునాడు ఉదయం జ్వర తాపానికి చెమటలు పట్టాయి.

డా. చునీలాల్ నన్ను చూడటానికి రోజూవచ్చి పోతూ మౌనంగా వుండటం గమనించాను. తన మిత్రుడు తనపట్ల అసహ్యభావం చూపడం పట్ల మా నాన్న గుండెలో సాత్వికభావం ఏర్పడి, ముఖంమీద ప్రశాంత దృక్కులు పారించారు.

'మందులు, కోడిగుడ్డు సొన యివ్వు' ఆఫీసుకు వెళుతూ నాన్న అమ్మకు పురామాయించాడు.

ఉదయం ఆఫీసుకు వెళ్లి, తన మామూలు పద్ధతిలోగాక, మధ్యలో వచ్చి నన్ను పరామర్శించడానికి నాన్న వచ్చాడు.

ఆ మధ్యాహ్నం బాగా ఎండకాస్తోంది. జ్వర తీవ్రతవల్ల పళ్లు పటపట కొరుకుతూ పడుకొని వున్నాను. నాన్న వచ్చి నాడిచూసి —

'ఏమైనా తిన్నాడా?' అని ఆప్యాయంగా అడిగాడు అమ్మను. 'ఔ'న న్నట్లు అమ్మ మౌనంగా తలవూపితే, ఆయన ఆదుర్దా కనపరుస్తున్నట్లు చూసి —

'ఈ సెలవుల్లో కృష్ణ కాంగ్రాలోయలో గడపటానికి ఏర్పాట్లు చేశాను. 31వ పంజాబీ విభాగానికి చెందిన బాబూ కుషీరామ్ వెళ్లుతున్నాడు. ఆయన తమ్ముడికొడుకు భగవాన్ సింగు, ఈ మధ్యనే దక్షిణాఫ్రికా నుండి తిరగివచ్చి మన కృష్ణతో బడిలో చేరాడు అతనికి తల్లిదండ్రులు లేరు. కాబట్టి కృష్ణకు అక్కడ తోడు వుంటుంది అక్కడ కాంగ్రాలోయలో వాతావరణం బాగుంటుంది అలంపూర్, హమీర్‌పూర్ గ్రామాలకు చెందినవాళ్లు బాబూ కుషీరామ్, సుబేదార్ గర్కాలు.'

'ఆ గర్కా కొడుకు మీకు బద్దశత్రువు గదూ.' అంది అమ్మ.

'యుద్ధభూమిలోంచి సైన్యాలు వెనక్కి వచ్చేస్తున్నాయి కాబట్టి జనాలను మనవైపుకు తిప్పుకోవాలి. కాంగ్రాలో వుండగా ప్రభుత్వానికి వ్యతిరేకంగా కృష్ణ ఏమీ మాట్లాడకూడదు అమృతసర్‌లో తనకు తగి లిన దెబ్బలను గూర్చి పల్లెత్తుమాట అనకూడదు. బాగా చదువుకొని ఈ సంవత్సరం అత్యధిక మార్కులతో ఉత్తీర్ణుడు కావడానికి సిద్ధపడాలి.'

మా యింట్లో గొడవలనుండి బయటపడి నేను బయటకు వెళుతు న్నానంటే సంబరం వేసింది. ఇంట్లో వుండటం చెరసాల అయితే, యింతకంటె మరో మంచి చెరసాలకు ఎందుకు వెళ్లగూడదు?

'ఎప్పుడు వెళతాడు?' అడిగింది అమ్మ

'రెండురోజుల్లో! ఈలోగా నయం అయితే

'నేనూ వెళతాను.' అన్నాడు శివ దీర్ఘం తీస్తూ

'నోర్ముయ్! వాడికి ఆరోగ్యం బాగులేదు నువ్వు సలక్షణంగా వున్నావుగా.' అరిచాడు నాన్న— 'అదీగాక ..' అంటూ.

ఆ తిట్లకు శివ నోరుమూసుకొన్నాడు ఆయన మాటల్లో 'అదీ గాక.....' అనే పదానికి అర్థం నాకు తెలుసు

సెలవుల్లో నేను కాంగ్రాకు వెళ్లితే నాలో తిరుగుబాటు ధోరణీ, చునీలాల్, శకుంతల సాహచర్యమూ దూరమవుతాయని నాన్న ఆశ. లోలోపల నేను పిచ్చివాణ్ణిగా తయారవుతున్నానని ఆయనకు తెలియదు. ఈ లౌకికప్రపంచపు దృష్టినుండి మరింత ముఖ్యమైన విషయాలపట్ల నా దృష్టి సారించానని ఆయనకు తెలియదు. నిజానికి నేను చపలత్వం కలవా డినని ఆయన ఉద్దేశమైతే, నాలో దివ్యత్వంతో కూడిన చపలత్వం వుంది. లోలోపలి అంతర్నాదంతో కూడిన సంగీత ధ్వనులను వినగలుగుతున్నాను.

# 11

పంజాబ్‌లోని వివిధ నగరాలకు సిపాయిలను తీసుకెళుతున్న రైలులో మేము వెళ్ళటం వల్ల ప్రయాణం శ్రమపడి చేయువలసివ చ్చింది. తరచూ వస్తూ, పోతూ వుండటం వల్ల అమృతసర్ స్టేషను రాగానే నాలో ఒక విధమైన మమకారం ఏర్పడింది. ప్లాట్‌ఫారం మీద జనం లేరు. సిపాయిలు అటూ యిటూ తిరుగుతూ భుజాలకు తుపా కులు తగిలించుకొని కనిపించారు. ఈ విధంగా సైనికుల గస్తీ పఠాన్ కోట్ వరకూ కనిపించింది. అక్కడ దిగి ఒక పాత తపాల బండిలో ప్రయాణం సాగించాము. పాము మెలికల్లా వంకరలు తిరిగిన మట్టి రోడ్డు గుంటామిట్టలతో అస్తవ్యస్తంగా వుంది. దారివెంబడి అందమైన మామిడి తోపులు, వరిపొలాలు కనిపించాయి. నాగరిక జీవితానికి అల వాటు పడ్డవ్యక్తి బిడ్డగా ఈ డోగ్రా సిపాయిల నివాసం ఎంత అందంగా వుంటుందని నేను ఎన్నడూ వూహించలేదు.

నూర్పూరు గుండా సివాలిక్ కొండల వరకూ వెళ్లాము. దారి పొడుగునా బాబూ కుషీరామ్ ఆ ప్రాంతపు సాహసగాధలు చెప్పాడు. ఎదురుగా మంచుకొండ దౌలాధర్ కనిపించింది ప్రపంచంమీద విస్తృతంగా తన జటాజూటం పరచికొని పరమశివుడు కూచుని వున్నట్లు చెప్పిన సాహసగాధ ఉత్సాహం రేకెత్తించింది. నేను నా స్నేహితుడు

భగవాన్ ప్రక్కన కూచున్నాను. మా నాన్న నన్ను బాధపెట్టిన దాని కంటె అతన్ని వాళ్ల పెదనాన్న మరింత కఠినంగా బాధించసాగాడు. పీక్కుపోయిన ముఖం పల్చటి శరీరంగల బాబూ కుషీరామ్ మరింత కఠినంగా ప్రవర్తించ సాగాడు. సానుభూతితో నా క్రొత్త స్నేహితుని చేయి అదిమి పట్టుకున్నాను. ఇటీవల కొన్ని నెలల తరబడి నాలో పెరిగిన ఉద్రిక్తతలు మౌన పర్వత శ్రేణుల గాలికి మాయమయ్యాయి.

ఆ చిన్నచిన్న కొండలపై నాపరాతి కప్పులతో ఇండ్లు సరదాగా కనిపించాయి. కాంగ్రా కోటకంటె బలంగా ఈ కుగ్రామాలు ఆ ప్రాంతంలో ప్రబలంగా కనిపించాయి. మంచుతో కప్పబడ్డ ఆ ప్రాంతాలు శీతల వాయువులతో ఎండ బాధను పోగొడుతూ శబ్దాలకు ప్రతి ధ్వనులు కలిగిస్తున్నాయి.

మెయిన్ మీర్ కంటోన్‌మెంటులో వేసవికాలంలో సరుగుడు చెట్ల మధ్య నడుస్తున్నపుడు వీచిన గాలుల శబ్దానికి దగ్గరగా యిక్కడ శబ్దం వినిపించింది. ఆ శబ్దాలకు తోడు దూరంగా ఎవరో మనుష్యులు ఉచ్చరిస్తున్న మంత్రాలు వినిపించాయి. ఇదంతా నేను వూహిస్తున్నానా? ఏమో! తెలియదు. దౌలాధర్ ప్రాంత రణగొణ ధ్వనులు స్పష్టంగా వినిపిస్తున్నాయి. నా ఆలోచనను ధృవపరుస్తున్నట్లుగా బాబూ కుషీరామ్ ఇక్కడి గాథ చెప్పాడు. ఈ మహా పర్వతాలు మీద పరమశివుడు వున్నాడనీ కాంగ్రాలోయలో పార్వతీదేవి క్రింద వుంటోందని చెప్పాడు. నా చెవులకు వినిపించిన శబ్దాలు పరమశివుని సూర్యోదయ ప్రణవ మంత్రాలుగా తోచాయి.

ఎత్తైన ప్రాంతంలో పాలంపూర్ పట్టణం వద్ద మేము తపాలా వారి లారీనుండి దిగాము. అక్కడ కుషీరామ్ తమ్ముడు హరిహర్‌ని కలిశాము. ఆయన పట్టభద్రుడు. అలంపూర్ పాఠశాల ప్రధానోపాధ్యాయుడు. ఆయన అచ్చం కుషీరామ్ వలె వున్నాడు. విశాలమైన నుదురు విప్పారిన కన్నులు, అందమైన ముక్కు, పాలిపోయిన రంగు కలిగిన అతను సరదా మనిషి. ఆయన తనతో భోజనము, రెండు గుఱ్ఱపు పిల్లలు పట్టుకొచ్చాడు. ఒకటి తెల్లగా పొడుగ్గా వుంది. మరొకటి పొట్టిగా నల్లగా వుంది. వాటితోబాటు ఇద్దరు మొరటు పిల్లలు వచ్చారు. కుష

రామ్ తెల్లని గుఱ్ఱముపై రాగా పిల్లలము మేమిద్దరము నల్ల గుఱ్ఱముపై ఎక్కాము. మా గుఱ్ఱము కళ్ళాలు హరిహర భద్రంగా పట్టుకున్నాడు. మా వెంబడి ఆ పిల్లలు పరుగెత్తారు. మేము సన్నని దారి గుండా వెళ్ళాము. చుట్టూ గుట్టలు గుట్టలుగా రాళ్ళు బండలూ వున్నాయి. ఆ కనుమలో ఎండిపోయిన నదీప్రవాహపు మార్గం గుండా వెళుతుంటే మధ్యాహ్న సూర్యుని తాపం గడ్డిపరకలను కాలుస్తూ మా కళ్ళముందు ఎండమావుల్ని కల్పించింది అలంపురం గ్రామానికి కనుచూపు మేరల్లో వచ్చేసరికి నేను గుర్రాల మీదనుంచి క్రిందపడే స్థితిలో వున్నాను. నాకు బాగా నిద్రవస్తోంది. బాబూ కుషీరామ్ యింటి ముంగిట క్షణ కాలం నిలవడం గుర్తు. వాళ్ళయిల్లు ఆ కనుమలో చిన్న కొండ మీద వుంది. ఇంటిచుట్టూ దట్టంగా చెట్లు వున్నాయి.

'ఇద్దరూ వేడిపాలు తాగండి' అంటూ కుషీరామ్ కసురుకున్నాడు. కళ్ళు మూరుకుపోతున్నా, నేను అతిథిని కాబట్టి లేచి కూచున్నాను. భగవాన్ సింగు ఆలస్యం చేశాడు. బాబూ కుషీరామ్ వాడి చెంపమీద ఒక దెబ్బ వేశాడు. బాగా అలిసిపోయిన ఆరోజు నా అనుభూతులలో అదొక అపశ్రుతిగా మిగిలిపోయింది.

ఆ రాత్రి నాకు కలలో ఇతర దృశ్యాలతో బాటు మా తమ్ముడు శివ కనిపించాడు. అతడు జటాజూట ధారియైన పరమశివుని భలె కనిపించి నన్ను చూసి నవ్వుతున్నాడు. ఎడమచేతిలో నల్లని పుఱ్ఱె భిక్షాపాత్రగా పట్టు కొని కుక్కరూపంలో కుషీరామ్ శివుణ్ణి చూసి మొరుగుతున్నాడు. మా శివ నుదుటిమీద మూడవకన్ను విచ్చుకొని అందులో నుంచి అగ్నిజ్వాలలు ప్రజ్వరిల్లి వీధిలో సర్వస్వాన్ని భస్మం చేశాయి. ఆ యిండ్లలోనుండి మంటలు పైకెగసి ఆకాశాన్నంటాయి. మృతుల కనులు వజ్రాలలాగా మెరుస్తున్నాయి. అమృతసర్‌లోని లోహఘర్ గేటు వెలుపల అంతా స్మశాన వాటికలా పొగచూరి పోయింది. నేను భయంతో వణికిపోతూ చెరువు కనిపించేంతవరకూ వెళ్ళి అది కనిపించగానే అందులోకి దూకి మునకలు వేశాను.

ఈ భయంకర స్వప్నం నుండి చికాకుపడి లేచాను. ఆ చీకట్లో ఒంటరిగా పడుకుని వున్నాను కాబట్టి నన్ను నేను శాంత పరచుకున్నాను.

ప్రయాణం చేయటానికి అనుమతించాను. యౌవనోత్సాహంతో కూడిన ఆనందాతిశయంతో అదృశ్యతీరాలకు పయనించాలని అనుకున్నాను. ఈ కొత్త వాతావరణం నన్ను బాగా ఆకర్షించింది. ఇక్కడ సూర్యచంద్రులు, విశాల భూభాగం నాముందు క్రొత్త ప్రపంచాన్ని చూపించాయి.

ఈ అస్పష్టమైన ప్రకృతి దృశ్యాల వెనుక ఏదో మంత్రశక్తి ఇమిడి వుంది. నాలో కలతగా వున్నప్పటికీ, బియాస్ నది వంపులో శోభాయమానమైన పరిసరాలు నన్ను తమలో లీనం చేసుకున్నాయి. ఆ ఇంటి వరండాలోంచి చూస్తే అంతా స్పష్టంగా కన్పిస్తోంది. అదొక అద్భుతమైన గాథలతో నిండిన ప్రపంచం నా కుడివైపు పాత రాజభవనాలూ, ప్రవాహ వేగానికి అటువైపు కన్పిస్తున్నాయి. కవచంవలె ఉన్న గోడలతో వాటి రూపురేఖలు నన్ను పూర్తిగా ముగ్ధుణ్ణి చేశాయి. ఇటీవల కాలంలో నా భయంకరమైన అనుభవాలు పూర్తిగా మరచిపోయాను.

మర్నాడు ఉదయం కుషీరామ్ సరదాగా కన్పించాడు. రెండు టీ కప్పులు తీసుకువచ్చి నాకూ, భగవాన్ సింగుకూ యిచ్చి 'రాత్రి బాగా నిద్రపట్టిందా?' అని అడిగాడు. దూరంగా చూస్తూ మంచుతో కప్పబడ్డ ప్రాంతాన్ని తన కుడిచేతి చూపుడు వ్రేలితో చూపుతూ నదికి అటువైపు నున్న ఒకగుట్ట కథ చెప్పసాగాడు

'మీ కుడి చేతివైపు వున్న ఆరాజప్రాసాదం మహారాజా సంసార చంద్ర శీతాకాలపు విడిది గృహం. అది అలంపురం నది కివతల సుజనపూర్ తీరంలో వున్న ప్రాసాదంలో ఆయన వేసవికాలం గడిపేవారు.'

అంతకుముందు రోజు బాబూ కుషీరామ్ చరిత్ర ప్రసిద్ధుడైన ఆ మహారాజును గురించి కొంత చెప్పి వుండటం వల్ల ఆయన నివాసాన్ని చూడటానికి ఎగిరి గంతేశాను. ఒకప్పటి విశాలమైన ప్రాసాదపు గోడల తాలూకు చిహ్నలు కనిపించాయి. ఆ పురాతన ప్రపంచపు రూపురేఖల లోంచి అల్లావుద్దీన్ అద్భుత గుహ కనిపించింది. ఆవేదనతో కూడిన నా అంతరాత్మకు అదొక మంత్రశక్తిలా కనిపించి నన్ను పునీతుణ్ణి చేసింది. ఇంటికి దూరంగా యిక్కడ మరో ప్రపంచంలో ఒకపెద్ద దృశ్యాన్ని చూశాను. మాలో ఆసక్తిని రేపిన తర్వాత బాబూ కుషీరామ్ మనసు

విప్పి యిలా అన్నాడు.

'పొద్దునే రెండు గుక్కలు హుక్కాపీలిస్తే తప్ప నాకు హుషారు రాదు.'

మేము స్నానాలు చేసి బట్టలు మార్చుకున్నాము. బాబూ కుషీ రామ్ వరండాప్రక్క చిన్నగదిలోకి వచ్చాడు. అక్కడ నాకూ భగవాన్ సింగుకూ పడకలు అమర్చారు. ఆయన వెంబడి ఒక స్త్రీ ముఖం సగం కనపడేటట్లు పైటచెరగు కప్పుకొని వుంది. ఆమె పొడవాటి కుర్తా, తెల్లటి పైజామా వేసుకొని వుంది.

'మీ పిన్ని నిర్మల' అన్నాడు బాబూ.

'మంచి దానివి కదూ కూచో' అని భర్త ఆజ్ఞాపించాడు.

భగవాన్‌సెంగు పక్కవైపు చూస్తూ, 'ఈ పిల్లలముందు నీ తల ముసుగు తొలగించు. వీళ్ళు బిడ్డలతో సమానం.'

నిర్మల పిన్ని ఆయన ఆజ్ఞను శిరసావహించింది. దంతపు బొమ్మలా వున్న ఆమె ముఖ వర్చస్సు, విశాలమైన కళ్ళూ, కోటేరు వేసిన ముక్కూ, గుండ్రటి బుగ్గలూ, అందమైన గడ్డమూ చూడగానే మాకు సిగ్గువేసి తలలు వంచుకున్నాము. నిశ్శబ్ద వాతావరణం రాజ్యం చేసింది. బాబూ కుషీరామ్ హుక్కా తాగుతూ దగ్గటంతో పరిస్థితి మారింది. ఇంత అంద మైన అమ్మాయితో ఆ ముసలి బాబాయికి ఎలా పెండ్లి అయిందా అని ఆశ్చర్యం వేసింది.

'ఇతడు 38వ డోగ్రాకు చెందిన పెద్దబాబు కొడుకు.' అంటూ తన భార్యకు పరిచయం చేశాడు. 'వీళ్ళ నాన్నకులాగా వీడిదీ పెద్ద బుర్ర. అయితే కొంచెం తుంటరి. కానీ, మన మూర్ఖుడి కంటె తెలి వైన వాడే. మనవాడు లోలోపల దొంగ వెధవ. ఉదాహరణకు మా తాగుబోతు తమ్ముడితో కలిసి ఆఫ్రికా వెళ్లేముందు వీళ్ళ అమ్మ నగలు ఎక్కడ దాచి పెట్టిందో వీడు చెప్పడు.'

మాట్లాడకుండా నిర్మల పిన్ని నిట్టూర్చింది.

మాటకొనసాగిస్తూ బాబూ రామ్ అన్నాడు. 'డబ్బుసంగతి కూడా చెప్పడు. భగవాన్ సింగు తల్లి చనిపోయిన తర్వాత ఆ తాగుబోతు కిరీటి రామ్ తాను వుంచుకున్న నీగ్రోవనితకు యిచ్చివుంటాడు అతను చనిపోవడానికి ముందు అతడు'

'మా యింట్లో నీగ్రో సేవకురాలు ఒక్కతే గదా వున్నది బాబాయ్!' అన్నాడు మాటకు అడ్డుపడుతూ భగవాన్ సింగ్. అతని ముఖం మరీ పాలిపోయింది.

'బాబూ నాకు తెలిసినంతగా నీకు మీ నాన్నను గురించి తెలియదు అతడు దొంగ, తాగుబోతూ, అబద్ధాలకోరు. నా బీరువాలోంచి దారి ఖర్చులకు అతడు డబ్బు దొంగలించాడు.'

ఆ మాటలు విని భగవాన్‌సింగు కనుబొమలు ముడిపడ్డాయి. నేను సిగ్గుతోబాటు ఇబ్బంది కరంగా భావించాను. డబ్బు గురించీ, నగల గురంచీ ఇలా బయటపడి మాట్లాడుకోవటం అసహ్యం వేసింది, అన్ని కుటుంబాలలోనూ బాంధవ్యాలు చెడిపోవటానికి అవి విష సమానమని నాకు తోచింది.

చాలాసేపు మౌనం రాజ్యం చేసింది. మధ్యమధ్యలో హుక్కా పొడి దగ్గులు వినిపించాయి.

పర్వత ప్రాంతపు యాసతో నిర్మలపిన్ని యిలా గొణిగింది. 'ఎప్పుడో ఒకప్పుడు మా బుల్లి భగవాన్ నాకు చెప్తాడులే.'

'పిచ్చిదానా! వాడికి తెలిసినా నీకు చెప్పడు' అన్నాడు భర్త.

'నా బిడ్డ నాకు చెబుతాడు.' అంది నిర్మల గోరింటాకు పెట్టుకొన్న తన చేతుల్ని ఆప్యాయంగా చాపుతూ.

'వాణ్ణి ముట్టుకోకు, అస్పృశ్యపు కుక్క.' ,అన్నాడు కుషీరాం అతని వాడిపోయిన ముఖం రాక్షసుల ముఖంవలె వుంది.

అతడు ఆ విధంగా పాశవికమైన ఆజ్ఞను జారీ చేసిన తర్వాత నేను తలవంచుకొని కూచొన్నాను. నా ముందు పరచుకొన్న శూన్యం

లోకి నా ఆలోచనలు దొంతరలుగా దొర్లి పోతున్నాయి. ఆ చుట్టుపక్కల రణగొణ ధ్వనులు పర్వత ప్రాంత ప్రజల గురకలవలె వినిపిస్తున్నాయి.

నేను ధైర్యం కూడ దెచ్చుకొని అడిగాను.

'మనం ముజఫర్‌పూర్ తిరా ఎప్పుడు వెళ్తాము?'

'నిన్ను హరిహర తీసుకెళ్తాడు. రహస్యం చెప్పేంత వరకు ఈ గాడిద వెళ్లడానికి వీలులేదు.'

ఈ మాటలు అంటూ ముంగిట్లోకి నిర్మలతో కూడా కలిసి వెళ్లాడు: 'ఈ మధ్యాహ్నం హరిహరను రమ్మన్నాను. మీరు చదువు కోండి. తర్వాత అతను వస్తాడు.'

నన్ను పట్టించుకొనే వాళ్లు లేక ఆలోచనలు చుట్టుముట్టాయి. మా నాన్నతో సహా, ఈ గుమాస్తాలకు బంగారం మీద అంత పిచ్చి ఎందుకో తెలియదు. కుషీరామ్ బాబాయి కొయ్య చెప్పుల సవ్వడి దూర మైన తర్వాత భగవాన్‌సింగు మెల్లగా నా దగ్గరకు వచ్చి, కళ్లలో నీళ్లు తిరుగుతుండగా —

'నాతో స్నేహం చేస్తావు గదూ' అన్నాడు

'నేనెప్పుడూ నీతో స్నేహం చేస్తాను' కుషీరామ్ మాటలవల్ల కలి గిన భయాన్ని అతనిలో పోగొట్టడానికి ధైర్యంగా చెప్పాను.

నా మాటలు విని, వూరుకోకుండా అతను ఏడవటం మొదలె ట్టాడు. తన ఏడుపు చిన్నన్నకు వినిపిస్తుందని చేతిగుడ్డతో తన నోరు కుక్కుకున్నాడు.

ఈ యింటి వాతావరణంలో చేదు చవి చూసిన తర్వాత, మా యింటి గొడవలను గూర్చిన భయాలు పారిపోతాయని అనిపించింది.

భగవాన్‌సింగు పరుపు దిండ్లలో తలదూర్చి ఏడుస్తుంటే, నేను అతని మీద చేతులువేసి పక్కలో పడుకొన్నాను. నాలో ఆప్యాయత అతను చవి చూశాడు. అతని పాలిపోయిన ముఖం, బక్కపలచని శరీరం, నాలో ఆప్యాయతకు తావివ్వకపోయినా, అతణ్ణి అనురాగంతో

చూశాను.

మేము చేతులు పెనవేసుకొని ఆ మధ్యాహ్నం పడుకొనివున్నప్పుడు, కాంగ్రా పర్వత ప్రాంత నుడికారంతో హరిహరను బాబూ కుషీరామ్ పలకరించడం వినిపించింది

'అరే బుజ్జీ! హరిహర బాబాయి వచ్చాడు, పలకరించండి' మేము నిదానిస్తే బాబూ కుషీరామ్‌కు మళ్లీకోపం వస్తుందని వెంటనే లేచాము. ఆ గదిమూలన రాతిపలకపై ముఖాలు కడుక్కొని గుడ్డలు నలగకుండా చూసుకొని, గదిలోంచి బయటికివచ్చి హరిహరతో కరచాలనం చేశాము.

'అరే సంతూ బాబూ హరిహరకు టీ తీసుకరా' అంటూ కుషీరాం బాబాయి పనివాడికి కేకవేశారు.

'నన్ను 'బాబూ' అని పిలవకండి సైన్యంలో మీకు అలా పిల వడం అలవాటైపోయింది. నేను అందుకు వొప్పుకోను. చదువుకొన్న మనమందరము వాళ్ల క్రింద వుద్యోగాలుచేస్తూ అడ్డచాకిరీ చేస్తుండాలని ఆంగ్లప్రభుత్వం తలంపు. వాళ్లను తన్ని తరిమివెయ్యాలి. ఆంగ్లేయుల బిరుదం 'మిష్టర్' గూడా నాకు యిష్టంలేదు.' అన్నాడు హరిహర.

విప్లవకారుల సాహచర్యం నుంచి నన్ను దూరంగా వుంచుకొని మా నాన్న చేసిన ప్రయత్నం, యీ పర్వత ప్రాంతాలలో కొత్త విప్లవకారుని వల్ల విఫలమైనందుకు నాకు సంతోషంగావుంది

కొబ్బరి హుక్కా తాగుతూ గొంతు సవరించుకొంటూ హరిహర మాటలు పెడచెవిని పెట్టాడు కుషీరాం బాబాయి—

'మా తమ్ముడు దయానంద లాహోరు ఆంగ్ల - ప్రాంతీయ కళా శాలలో చదివాడని పిల్లలూ! మీకు తెలియదు అక్కడ విప్లవకారులంతా చదివారు.'

మళ్లీ గట్టిగా హుక్కాపీల్చి, ముఖం ఏటవాలుగా పెట్టి - బాధ వ్యక్తంచేస్తూ, తన తమ్ముడికి అర్థం అయ్యేలా అన్నాడు:

'నిజానికి నేను ప్రభుత్వోద్యోగం చేసే నా జీతంలో నాలుగు రాళ్లు

యితని లాహోరు చదువుకు మిగిల్చాను...... ఇప్పుడు భగవాన్ సింగుకు కూడా అలానే చేస్తున్నాను.'

ఈ మాటలు హరిహర బాబాయిని బాగా నొప్పించి, తలవంచి, ముఖం ఎర్రజేశాడు.

బాబూ కుషీరామ్ మౌనం వదలి మళ్లీ - దాడిచేయసాగాడు.

'కృతజ్ఞత అనేది భారతీయ సంప్రదాయం. అది ఈనాడు సన్నగిల్లింది.'

ఈ మాటలు హరిహరబాబాయి ఓర్చుకోలేక పోయాడు. ఎంతో నిగ్రహించుకొని మెల్లగా అన్నాడు

'మన సరిహద్దుల్లో రష్యను విప్లవం అయినప్పటినుండీ మా ఆలోచనల్లో మార్పు వచ్చింది. తెల్ల దొరలకు "చిత్తం" అనడం మామూలు ప్రకారం యింక కొనసాగదు. కృతజ్ఞత వుంటుంది. కాని డబ్బుతో కూడిన వ్యవహారం వేరు. భారత స్వాతంత్ర్యం కంటె దూరంగా మేము ఆలోచిస్తున్నాము విప్లవం గూర్చి మాట్లాడుతున్నాము. ఫ్రాన్సు దేశంలో ఒక విప్లవం వచ్చింది రష్యాలో మరొకటి ఇక్కడ మరొకటి రావాలి - స్వాతంత్ర్యం కంటె భిన్నమైంది. మానవులుగా అందరూ సమానమనే ఆలోచన రావాలి.'

'భలే!' కుషీరామ్ అదిరి పడ్డాడు. 'ఇదంతా హిందూధర్మానికి వ్యతిరేకం. రష్యాలో దోపిడీ దార్లు, హంతకులు చక్రవర్తిని చంపారు. వాళ్లను మీరు సమర్థిస్తున్నారు. నీవు యిలానే మాట్లాడుతూవుంటే, మన కుటుంబానికే చెడ్డపేరు తెస్తావు పోలీసులు నీ వెంట పడతారు. నన్ను కూడా వదలరు.'

మళ్లీ మౌనం.

భగవాన్ సింగు ఏమి ఆలోచిస్తున్నాడో నాకు తెలియదు. బాబూ కుషీరామ్ గంభీరంతో పాటు కోపంగా వ్యవహరించినందుకు భిన్నంగా హరిహర తన మాటల ద్వారా నాలో ఒక మహాత్మకాంతిని ప్రవేశ పెట్టాడు. రష్యాలో జరిగిన విషయాలను గూర్చి వినివున్నప్పటికీ,

ఈ బడిపంతులు మాటల ద్వారా సంహిట్సుల్లో విప్లవం గూర్చి విని నాలో అగ్ని జ్వాలలు రేగాయి. గాంధీజీ స్వాంతంత్ర్యోద్యమ శంఖారావం కంటె భిన్నంగా ఈ ఉద్యమం ముందుకు సాగుతోంది. రష్యా గురించి మరింత తెలుసుకోవాలని వుంది. చిన్న పిల్లలు వున్నట్లు చూడటమే గాని, శబ్దం ద్వారా తెలియగూడదనే కట్టడి గుర్తుకొచ్చి నోరుతెరవ లేదు.

తన అన్న మాటలకు హరిహర బాబాయి సమాధానం చెప్పక పోవడంతో, బాబూ కుషీరామ్ తన తమ్ముణ్ణి మరింత రెచ్చగొట్టాడు

'ఇప్పుడు నీ చదువు పూర్తి అయింది గాబట్టి, నీకు ఏమీ లెక్క లేదు. నేను మా తాగుబోతు సోదరుని దురదృష్టవంతపు కొడుకుని-- ఈ అనాధని సంరక్షించాలి నా ఉద్యోగం వూడగొట్టే ప్రయత్నమేమీ చేయవద్దు! పోలీసులైతే విచారణ చేసి నిన్ను వదిలి వేస్తారు. సైన్యంలో మాకు అలా కాదు. నేరస్తుడు తప్పించుకోలేడు.'

తమ్ముడు ప్రతి సమాధానం చెప్పలేదు. తనను తాను నిగ్ర హించుకొంటున్నట్లు ముఖ భంగిమ పెట్టాడు. ఏమీ పట్టనట్లుగా ముఖ కవళికలు మార్చి యిలా అన్నాడు.

'సిపాయిలూ, పోలీసులూ మానవత్వంవున్న పేదవాళ్ళు. వాళ్ళు శుభ్రమైన యూనిఫారం దుస్తులు వేసుకుంటారు. కాబట్టే ధనవంతుల్లాగా, గొప్పవారిలాగా కనిపిస్తారు. రష్యాలో పడవలలో సిపాయిలు అగ్నిజ్వాలలను రగిల్చిన మొట్టమొదటివారు. అమృతసర్‌లో గూండాలకంటె పోలీసులే దోచారు. పోలీసు బారకానుల ముందు నోట్ల కట్టలు, గుడ్డలు దొంత రలూ కనిపించాయి. అంతకుముందు ఫ్రాన్సులో సామాన్య జనమూ, సైనికులూ చట్టానికి వ్యతిరేకంగా తిరగ బడ్డారు సైనికులూ, పోలీసులూ మనలోవారే.'

ఆ సమయానికి ఐదు ఇత్తడి గ్లాసులలో టీ కలుపుకొని పనివాడు సంతూ వచ్చాడు. అతని వెనుక పళ్ళెం నిండా పిండివంటలతో నిర్మల పిన్ని వచ్చింది.

'సరే తమ్ముడూ బాధపడకు టీ తాగు. ఈ పిల్లల్ని సుజన్

పూర్ తీరానికి ఎప్పుడు తీసుకెళతావో చెప్పు. రేపు ఆదివారం గదా!' అన్నాడు బాబూ కుషీరామ్ తెచ్చిపెట్టుకున్న హాస్యంతో.

నిర్మలపిన్ని భర్త ప్రక్కన వచ్చి నిలబడ్డది. ఆవిడను చూడగానే హరిహర బాబాయి లేచి వినయవినమిత గాత్రుడై చేతులు జోడించాడు. మళ్ళీ కూచుని అన్నకు సమాధానం చెప్పాడు 'రేపు తీసుకెళతాను. కొండమీది కెళటానికి మూడు గుఱ్ఱపు పిల్లలను మాట్లాడదాము.'

'సరే టీ తాగు.' అన్నాడు బాబూ కుషీరామ్ ఆంగ్లంలో తన భార్యముందు గొప్పగా. ఆమెకు డోగ్రీ, వచ్చీరాని పంజాబీతప్ప మరే ఇతర భాష మాట్లాడటం రాదు

'రేపు ఈ పిల్లలను తీరాకు, నర్మదేశ్వర దేవాలయానికి కొండ మీద రాజప్రాసాదానికి తీసుకెళ్ళు '

హరిహర బాబాయి గ్లాసుతీసుకొని తాగబోతున్నపుడు వాళ్ళ అన్న మళ్ళీ డోగ్రీ భాషలో మొదలెట్టాడు

'పాలంపూరులోని ఆంగ్లపరిపాలకుల ప్రాంతం నుండి ఈ తేయాకు వస్తుందని టీ విషతుల్యమైనదని అనవు గదా!'

'తెల్ల దొరలు పాలంపూర్‌లో పర్వతప్రాంత కూలీల చేత బండ చాకిరీ చేయిస్తారు.' నవ్వుతూ తాపీగా సమాధానమిచ్చాడు హరిహర బాబాయి· 'మరిగిన ఈ టీలో ఆకూలీల స్వేద బిందువులు వుండవచ్చు' అన్నాడు.

'మా వదిన ముందు వాదన వద్దు' అంటూ బాబూ కుషీరామ్ అదే నేను చెప్తున్నది— మీ సామ్యవాదులకు పెద్దాచిన్నా తేడా, ఆడవాళ్ళంటే గౌరవ మర్యాదలు లేవు భౌతిక వాదం రావడంతో భారతీయత అనేది నశించింది.' సంతూ దగ్గర టీ గ్లాసు తీసుకొని అప్పుడప్పుడూ చప్పరిస్తూ తాగసాగాడు.

చప్పరిస్తూ బాబూ కుషీరామ్ చేసిన ఈలలఎంటి ధ్వనులు కోపంతో వున్న నాగు పామును గుర్తుకు తెచ్చాయి.

గుర్రపు పిల్లలమీద కూచొని పాలంపూరునుండి ఆలంపూరు గ్రామానికి వచ్చాను. హరిహర బాబాయి పొడుగాటి తెల్లగుర్రంపై వచ్చాడు. బియాస్ నదికి దూరంగా సుజనపుర తీరానికి చేరుకొన్నాము. చుట్టూ పరచుకొన్న వరిపొలాల మధ్య, దట్టమైన పొదలు కనిపించాయి అప్పుడప్పుడు చెట్లపొడవల్ల నీడలు ముఖంపై పడుతున్నాయి. నునుపయిన ఈ పర్వతప్రాంతాల సౌందర్యానికి మాకళ్లు ఆశ్చర్యచకితమయినాయి. ఎలా వచ్చాయి? ఎందుకు వచ్చాయి వంటి ప్రశ్నల పరంపరతో మానోళ్లు నిరంతరం తెరుచుకొనే వున్నాయి. మమ్మల్ని పాలంపూరునుండి తీసుకొచ్చిన కుర్రవాళ్లు గుర్రపు పిల్లలను అదుపులో పెట్టారు. లేకపోతే మేము వున్నట్లుండి ఆశ్చర్యం ప్రకటించిన సమయంలో అవి సిగ్గుపడి పరుగెత్తివుండేవి. నేను కూచొన్న నల్ల గుర్రం, మేము వస్తున్న దారిలో గుర్రాల సకిలింతలకు సమాధాన మిస్తూ వచ్చింది. హరిహర బాబాయి తాపీగా వస్తున్నాడు. ఆయన తన తెల్ల గుర్రంమీద హుందాగా వున్నాడు. కాంగ్రాశైలిలో తలపాగా, కోటువేసుకొని ఆయన మేము అడిగిన అన్ని ప్రశ్నలకు దారి పొడువునా సమాధానాలు ఓపికగా యిచ్చాడు.

ఒక మరపడవలో బియాస్ నదిని ఒక సన్నని దారిలో గుర్రాలతో సహాదాటాము. మాకు అక్కడి విశేషాలు తెలియ చేస్తున్న మార్గదర్శి మాకు మంచి స్నేహితుడు అయ్యాడు. మా కళ్లముందు కనిపిస్తున్న పురాతన రాజ్యవైభవాన్ని చూసి ఆయన ఉత్సాహం పొందివుంటాడు.

బియాస్ నదికి ఎదురుగా ఒక గోపురం కనిపించగానే— 'అరే' అని అరిచాను.

'మనదేశాన్ని, పురాతన కట్టడాలను మనం ప్రశాంతంగా ప్రేమించడం నేర్చుకోవాలి....' అంటూ హరిహర బాబాయి: 'మొట్టమొదట సంసారచంద్ర మహారాజా ప్రాసాదానికి సంబంధించిన అవశేషాలు చూద్దాం' అన్నాడు.

'బహుశా, మీకు కూడా ఉత్సాహంగా వున్నట్లుంది. కాని, మీరు పెద్దవాళ్లు. గాబట్టే వూరకున్నారు.' అన్నాను వుండబట్టలేక. భగవాన్ సింగు ముఖంమీద చిరునవ్వు నా వూహ నిజమేనని నిర్ధరించింది.

'నిజానికి నీమాట వాస్తవమే' అంటూ గలగలా నవ్వాడు— లాహోరు కళాశాలలో చదువుకొంటున్నపుడు ఆంగ్ల సంప్రదాయంలో మర్యాదలకు అలవాటుపడి ఈ చెడు పద్ధతి నేర్చుకొన్నాను. నేను ఒడవంతుల్ని కావడంతో పరిస్థితి మరీ అధ్వానమైంది.'

ఆయన తన పెద్దరికాన్ని విడనాడాలని అనుకొన్నప్పటికీ, ఆయన తన సహజ ధోరణిలో ప్రవర్తించాడు. కోట గోడ మధ్య ఉన్న కట్టడాల వద్దకు మా గుర్రాలు మమ్మల్ని తీసుకెళ్లాయి.

'డోగ్రా వంశాలు చాల పటిష్ఠమైనవి, గొప్పవి. మహాభారతంలోని పాండు వంశానికి చెందిన ఓడ్డలు వీరు. కురుక్షేత్ర యుద్ధం తర్వాత మా పూర్వీకులు పంజాబులోని వివిధ ప్రాంతాలలో స్థిరపడ్డారు. మా వంశానికి చెందిన రాజులు బలవంతులైన యుద్ధతంత్ర నేర్పరులు. పఠాన్ సైన్యాలను తప్పించుకొని ఈ కాంగ్రా పర్వత ప్రాంతాలకు వచ్చి ఈ వేగానికి అలవాటు పడ్డారు సానువుల్లో యుద్ధం జరుగుతున్నపుడు వీరిక్కడ లోయల్లో నిలిచిపోయారు. అందువల్ల మొగలులు కూడా మమ్మల్ని అణచిలేక పోయారు మొగలు సామ్రాజ్యం బలహీన పడ్డప్పుడు అక్కడ పరివారము, హస్తకళ నిపుణులు మా రాజుల వద్దకు పనిచేయడానికి వచ్చారు... ... మాలో మేము కులప్రాతిపదిక మీద తగాదాలు పెట్టుకొని, ఐకమత్యంగా వుండకపోవడమన్నది ఒకేఒక్క సమస్య. పర్వత ప్రాంతీయులు కాంగ్రా కోటను ముట్టడించారు. సంసార చంద్ర మహారాజు పరుగెత్తి సుజనపుర తీరంలో యిక్కడ కోటకట్టుకొన్నారు. అప్పుడు సిక్కులు మాపై దాడి చేశారు. మా పురాతన రాజవంశం అప్పుడు పతనమైంది అప్పుడు ఇక్కడ పర్వతప్రాంతం వారు అమృతసర్‌లో కూలీలుగాను, ఆంగ్లప్రభుత్వంలో సిపాయిలుగాను చేరారు.' అన్నాడు హరిహర బాబాయి.

ఆ మాటలు పలుకుతున్నప్పుడు హరిహర బాబాయి ఉద్రేకపూరిత కంఠంతో, కళ్లు మూతలు పడగా బాధపడ్డాడు. ఆయన ముఖం జేవురించింది. నేను అదిగమనించి, యౌవనోత్సాహంలో, నిర్దాక్షిణ్యంగా వ్యాఖ్యానించాను:

'మాష్టారూ! మా నాన్న మా చేత మన్‌మోహన్ రచించిన 'భారతదేశచరిత్ర' గ్రంధంలోంచి ఒకపుటను ఉర్దూనుండి ఆంగ్లంలోకి తర్జుమా చేయించారు. అందులో గమనించాను వేయి సంవత్సరా లుగా మనం పిరికిపందలుగా బ్రతికాం. ఐదువందల మంది సైనికులతో మనమీద దండెత్తి వచ్చిన ప్రతియోధునికీ మనం తలవంచాము.'

'ఊఁ' అని భగవాన్‌సింగు నన్ను నిగ్రహించబోయాడు. వాళ్ల బాబాయిమీద గౌరవంతో నన్ను నిందించాడు. 'అలా అనకు— మేము పిరికి పందలమని.'

'నీవు సరియైన మాట అన్నావు నాయనా!' అంటూ హరిహర బాబాయి తన ముఖంలో ప్రశాంతత కొనితెచ్చుకొన్నాడు 'సత్యాన్ని చెప్పే ధైర్యం నీలో వున్నందుకు సంతోషంగా వుంది. నీ జీవితానికి ఒక సూత్రాన్ని చెబుతాను.' ' మనుషుల్ని బాధ పెడతామేమోననే భయంతో సత్యాన్ని చెప్పడానికి జంకవద్దు.'

'అది వ్రాసుకొంటాను మాష్టారూ!'

'ఈ పురాతన రాజ ప్రాసాద శిధిలాలను చూపనీ' అన్నాడు బాబాయి.

ఆయన ఆ వరండాలోకి తీసుకెళ్లాడు. అక్కడ సుందరమైన యిళ్లు, ముందువసారాలోకి చిన్నచిన్న కిటికీలు కనిపిస్తున్నాయి. అమృతసర్‌లో, దేవదత్త, భగవాన్‌దత్త బాబాయిల యిళ్లలో నేను చూసిన కాంగ్రా చిత్రపటాలు గుర్తుకువచ్చాయి. గోడల శిధిలాలు తప్ప అంతా పడి పోయాయి. మొత్తం భవనం దయ్యాలమయంగా కనిపించింది చీకటి మూలల్లో శబ్దం చేస్తున్న గబ్బిలాలు గుంపులుగా పరుగులుతీస్తూ ఆ శిధిలాలను మరీ అధ్వాన్నం చేశాయి. నేనూ, భగవాన్‌సింగు చెట్టా పట్టాలు వేసుకొని దయ్యాలు ఎదురుపడతాయని పరుగు తీశాము.

సంసారచంద్ర మహారాజా పాఠశాల ఆవరణకు సమీపంలో వున్న బజారులో ఒక వంటవాడి వద్ద హరిహర బాబాయి మాకు భోజనాలు పెట్టించాడు.

'మీరు బుద్ధిమంతులైన కుర్రవాళ్లు. సుజనపూర్ తీరాలో మీకు నేను ఏమి చెప్పానో కుషీరామ్ బాబాయికి చెప్పనంటే, యిక్కడ జరిగిన ఒక వాస్తవగాధను మీకు చెబుతాను' అన్నాడు

'ఒక్క మాట కూడా చెప్పము, కదూ భగవాన్‌సింగ్' అన్నాను ఓపికలేక.

'నువ్వు వాగుడుకాయువు. నేను కాదు' అన్నాడు భగవాన్.

'మనమంతా ఎంత సత్యసంధులమయ్యాము' అన్నాడు బాబాయి: 'మనం నడుస్తూ మాట్లాడుకొందాం. నేను గతచరిత్ర మీకు చెబుతున్నానంటే, వెనక్కి నడుస్తున్నాననుకోవద్దు. చరిత్ర మనల్ని వుత్తేజితుల్ని చేసి స్వాతంత్ర్యానికి తీసుకెళ్తుంది. తెలియుని భవిష్యత్తు, గతం కంటె మంచిది.'

'ఇప్పుడు కథలోకి వద్దాం.' అంటూ హెడ్మాష్టరు కధ ఆరంభించాడు

'ఈష్టు యిండియా కంపెనీలో ఓబ్రెయిన్ అనే ఐర్లాండు దేశీయుడు సైనికాధికారిగా వుండేవాడు. అతడు ఇంగ్లీషువారిని వదిలి వచ్చాడు. కంపెనీ సైన్యాలు భారతీయులను అణచి వేస్తున్నాయని బాధపడి కాంగ్రా పర్వతాలకు పరుగెత్తి వచ్చాడు. ఆయన నేరుగా సంసారచంద్ర మహారాజా దర్బారులోకి వచ్చాడు. మహారాజా కనికరించి, తన సైన్యాన్ని క్రమశిక్షణలో వుంచమని అతణ్ణి నియమించారు. ఆయనకు భార్యలుగా ఐదుగురు పర్వతప్రాంత వనితలను యిచ్చారు. ఒక తెల్ల గుర్రాన్ని, ఒక నల్ల గుర్రాన్ని యిచ్చారు. బ్రిటీషు వారు ఎన్ని సార్లు వెనక్కి రమ్మని కోరినా వెళ్లకుండా అతడు యిక్కడే చాలా సంవత్సరాలు జీవించాడు. ఒకసారి జాన్ కంపెనీనుండి ఒక దూతవచ్చి అతణ్ణి తీసుకెళ్లడానికి నాలుగు రోజులు వేచివున్నాడు. ఓబ్రెయిన్ తప్ప తాగి పడిపోయాడు. తాగుడు ఆయనకున్న మహావ్యసనం. అతడు తిరిగి వెళ్లడానికి నిరాకరించాడు. ఇక్కడే మరణించాడు అక్కడే అతణ్ణి, బియాస్ నది వొడ్డున పాతి పెట్టారు. సజీవంగా వున్న రెండు గుర్రాలను ఆయన పక్కనే పాతిపెట్టారు....... మహారాజా సంసారచంద్ర సాహసి, ఉదారుడు......

ఓబ్రెయిన్ పట్ల మాత్రమే కాదు. ఆయన ఔదార్యం! ఒకసారి ఆయన దారిలో అందమైన గొల్ల పిల్లను చూశాడు. ఆకర్షితుడై ఆమెను పెళ్లి చేసుకొని తన రాణులతో సమానంగా పోషించాడు.'

మా కిలాంటి సంతోషకరమైన కధలు చెబుతూ, అక్కడ జన సమ్మర్దంగావున్న బజారు వీధి దాటించాడు. అక్కడ వ్యాపారులు, గొర్రెల కాపరులు పొడుగాటి వస్త్రాలు ధరించివున్నారు. అక్కడనుండి సుజనపుర తీరా గ్రామానికి ఓ సందులో నడిచాము. వేగంగా ప్రవహిస్తున్న బియాస్ నది హోరపిడిని మేము వినగలిగాము. ఐర్లండు దేశస్తునితోపాటు అతడి గుర్రాలను కూడా సజీవంగా పాతి పెట్టడం నాలో ఆసక్తి రేపింది.

ఆయనకంటె ముందుగా పరుగెత్తి అక్కడ ఏటవాలుగా వున్న ప్రదేశంలో దిగి అక్కడ మూడు సమాధుల దగ్గర కెళ్లాము. ఒక సమాధిని సిమెంటుతో కట్టారు. మిగతా రెండు సమాధులపై రెండు గుర్రాల ప్రతిమలను గుర్తుగా వుంచారు సమాధిపై గుర్రాల ప్రతిమలను చూడటంతో ఐర్లండు దేశీయుని గాధకంటె ముందుగా నా ఆలోచనలు సాగాయి. అతని పేరును వుచ్చరిస్తూ గీతరూపంలో గానం చేయసాగాను.

'మీ నాన్న దళంలో పని చేస్తున్న సుబేదార్ మేజర్ గర్కాసింగు వద్ద అందమైన కాంగ్రా చిత్రాలున్నాయి. అందులో ఓబ్రెయిన్ కనిపిస్తాడు. గొల్లపిల్ల రాణి కూడా కనిపిస్తుంది.' అన్నాడు హరిహర బాబాయి నాకు సహకరించే ధోరణిలో.

'అయితే మనం యిప్పుడే వెళ్లి చూద్దాం.' అన్నాను.

'ఓపికపట్టు. ఎక్కడికైనా వెళ్లేముందు మనం పెద్దల అనుమతి తీసుకోవాలి.' అన్నాడు భగవాన్‌సింగు హెచ్చరికగా.

'సుబేదార్ గర్కాకొడుకు జమేదార్ అజిత్‌సింగుకు నేనంటే గిట్టదు. అయినా గ్రామమైన అమీర్‌పూర్ వైపు మనం వెళుతున్నాము. మీ కుషీ రామ్ బాబాయి గర్కాసింగు ఇంట్లో ఈ రాత్రికి మనం బసచేస్తున్నట్లు వర్తమానం పంపాడు. అందువల్ల వెళ్ళక తప్పదు.'

బియాస్ నదీ ప్రవాహ తరంగ మాలికల్లో ఉద్భవించిన సాహస

గాధల్లో నేను లీనమై పోయాను. నదికి పైన పర్వతం మోటున చిన్న చిన్న యిండ్లు వాటిలో చక్కటిగాలి ప్రసరించే గదులు నాకు ముచ్చట వేశాయి. జీవితమంతా యిక్కడే గడుపుదామనిపించింది. నాలో నేను ఓ పద్యం వల్లించసాగాను.

'మహాసాహసి కుబ్లాఖాన్
ఆనందానికి పరమావధి అతని జీవితం.'

'ఆంగ్లేయుల గొప్పతనం అదే. వారి కవిత్వం' అని ఒప్పుకున్నాడు బాబాయి.

సుబేదార్ మేజర్ గర్భాసింగు మమ్మల్ని ఆప్యాయంగా పలకరించాడు. నన్నూ, భగవాన్ సింగును తొడలపై కూర్చోబెట్టుకొని మా నుదుటిపై ముద్దు పెట్టాడు. హరిహర బాబాయివైపు చిరునవ్వు చిందించాడు. వెంటనే పనివాడికి టీ తీసుకు రావలసిందిగా పురమాయించాడు. మేము మేడమీద అరుగుపై బియాస్ నదికేసి చూస్తూ కూచున్నాము. భారతీయ సంప్రదాయంలో వున్న దిండ్లు, అద్దకం గుడ్డ కప్పిన కుర్చీలు తప్ప ఆయన యింటి వాతావరణంలో నాకు ఏమీ మార్పు కనిపించ లేదు. నౌషిరాలో ఆయన యింట్లో కూడా ఇలానే వుండేది. విశాలమైన నుదురుతో గంభీరంగా వున్న ఆయన ముఖంలో ఎదిగిన గడ్డానికి చిన్న ముడి వేశాడు. తలపై డోగ్రా తలపాగా సైనికుల శైలిలో చుట్టాడు. ముచ్చటగా పైజామా లాల్చీ వేసుకున్నాడు.

'మా అబ్బాయి అజిత్‌సింగు కొంచెం సేపట్లో వచ్చి మీ పడకలూ, భోజనాలూ చూస్తాడు.' మేము ఎదురు చూస్తున్న వార్త మాకందిస్తూ అన్నాడు: 'అతడు వేటకు వెళ్ళాడు. త్వరలో వస్తాడు. అదిగో-అతనిగొంతు వినిపిస్తోంది.'

అజిత్‌సింగు పేరు చెప్పడంతో బాబాయి యిబ్బంది ముఖం పెట్టాడు. ఎండకు వాడిన ముఖంతో పుష్టికరమైన అవయవ సౌష్ఠవంతో ఆయువకుడు మా ముందుకు వచ్చాడు. అతడు మాట్లాడిన కొద్ది మాటల వల్ల బాబాయికి అతగాడిపై అయిష్టత ఎందుకు ఏర్పడిందో అర్థమైంది.

'నాన్నా! మూడు మగ దుప్పులను చంపడానికి బదులు యుద్ధంలో జర్మనులను చంపాలనుకొన్నాను' అంటూ అజిత్ సింగు మాట కొన సాగించాడు.

'బాబూ! ఇతడు బాబూ రామచంద్ర కొడుకు. ఇతడు బుల్లి నీకు గుర్తుందా?'

'నిజమే! వాళ్ళ నాన్నకు ఇతను పెద్ద గొడవై పోయాడు. అమృతసర్‌లో గాంధేయ వాదులతో ఇతడు కలిసిపోయాడు. ఇతడు తరచూ యిండ్లకు వెళ్ళే డాక్టరు బాబుల పట్ల దొరలకు విశ్వాసం లేదు. ఈ చదువుకున్న వాళ్ళు రైల్వే స్టేషనులను తగుల బెట్టి నవారిని, బ్యాంకులు కొల్ల గొట్టినవారిని, విద్యుచ్ఛక్తికి అంతరాయం కల్గించిన వారిని, దొరసానులను హత్య చేసిన వారినీ, సమర్థిస్తున్నారు. వీరంతా ప్రజలను ఉద్రేకపరుస్తున్నారు. అందువల్ల బాబూ రామచంద్ర ఈ కుర్రవాడిని కాంగ్రాకు శలవుల మీద పంపాడు.'

'సుబేదార్ మేజరుగారూ! ఇలాంటి కుర్రవాడికి ఇది మంచి దండన. ఇతడు సంసారచంద్ర మహారాజా పట్టణాన్ని కూడా చూశాడు.' అంటూ పొడి దగ్గుతో బాబాయి ధ్వనిగా మాట్లాడాడు.

'సంసారచంద్ర గతించి పోయాడు. ఉప్పు, పులుసు తిన్న వారికి మోసం చేయమని ఆయన చెప్పలేదు.' అన్నాడు అజిత్‌సింగు.

'మా మహారాజు విదేశీయులతో పోరాడి స్వాతంత్ర్యం విలువను మనకు బోధించారు. విదేశీయులనుండి మన స్వాతంత్ర్యం కోసం ప్రజలు గాంధీజీ అరెస్టుకు వ్యతిరేకంగా ప్రతిఘటించారు' అన్నాడు బాబాయి.

'వీళ్ళు గాంధీ వలె పిరికిపందలు. వీళ్ళందరినీ జర్మనులతో బాటు సొరంగాలలో ఉంచాలి. అప్పుడు తమ రక్తం రుచి వారికి తెలుస్తుంది' అన్నాడు అజిత్‌సింగు బాబాయి మాటలకు ఉద్రేకం తెచ్చుకొని.

మాష్టారు! అంటూ గర్టా అడ్డుపడుతూ అన్నాడు: 'ఆంగ్ల ప్రభుత్వ సేవలో అజిత్‌సింగు రెండు మారులు గాయపడ్డాడు. ఒక మంచిపని కోసం

ఇతడు తన సాహసాన్ని నిరూపించాడు. చదువుకున్న మీవంటి వారి ధైర్యం వినాశంవైపు మొగ్గు చూపుతోంది. రైలుమార్గాలూ! రహదారులూ వేసి తపాలా కార్యాలయాలు కట్టి భారత ప్రజలకు ప్రభుత్వం మంచి చేసింది. తెల్ల దొరలు చేసిన ఈ చిరస్థాయి పనులను గమనించడంలోనే మన విజ్ఞానం వుంది.'

'అయితే, మీ సేవలకు లిల్లాపూరులో భూమిని దానం చేసిన ఈ ప్రభుత్వకు లాభాల రూపంలోనూ, జీతభత్యాల రూపంలోనూ మన దేశం నుండి లక్షలాది రూపాయలను పట్టుకెళ్ళి పోతున్నారు. ప్రజలు అహింసతో ఈ దోపిడీ విధానాన్ని ఎదిరించాలని గాంధీ చెపుతున్నాడు.' అన్నాడు బాబాయి.

'సుబేదారు గారూ! పోలీసు సూపరిండెంటు నన్ను కొరడాతో కొట్టాడు. నేను ఏమీ చేయలేదు. వూరికే వీధిలో తిరుగుతున్నాను. అమృతసర్‌లో ప్రజలను పోలీసులు నిర్దాక్షిణ్యంగా కొరడాలతో కొట్టారు' అన్నాను వుండబట్టలేక.

'ఓహో!' అజిత్‌సింగు నాకేసి నవ్వి పంజాబీలో యిలా ఉపాన్య సించాడు. 'మిడతలకు రెక్కలు వున్నాయి. కొంటె కుర్రవాళ్ళను బడి పంతుళ్ళు తరచూ కొడతారు నేను కూడా అలానే దెబ్బలు తిన్నాను. అమృతసర్‌లో గూండాలైన గుజరన్‌వాలా, కసూర్‌లకు ఒక జనరల్ డయ్యరు దొర మాత్రమే గుణ పాఠం చెప్పగలిగాడు. పట్టణాలలో తాగుబోతులూ, దోపిడీలూ, వ్యభిచారులు, మోఅటువారూ ఉన్నారు.'

అతని తీక్షణతకు సూర్యుడు ఎఱ్ఱబడ్డాడు. నాలో రక్తం వుడుకెక్కి పోయింది.

'డాక్టరు కిచులూ, డాక్టరు సత్యపాల్ తిరుగుబోతులు కాదు. మంచి వారు. అలానే లాలా లజపతిరాయ్' ప్రతిఘటన ధోరణిలో అన్నాడు బాబాయి.

'అంతా విప్లవకారులు. అందరినీ కాల్చివేయాలి. అప్పుడు ఏవిధమైన సమస్యా వుండదు. ఈ బుల్లీసీ 38వ డోగ్రా దళంలో చేర్చాలి. అప్పుడు ఇతడు నాకిందికి వస్తాడు. నేను చక్కదిద్దుతాను' అంటూ

అరిచాడు అజిత్‌సింగు.

'బాబూ రామచంద్ర కుమారులలో ఒకడైనా సైనికుడైతే బాగుం డును. వ్రాతగాడు కాకుండా వుంటే మంచిది. నేను తరచూ చెబుతుంటాను. అతణ్ణి ఆర్య సమాజం వదిలిపెట్టమని' అన్నాడు గర్బ్యాసింగ్.

'బాబూ రామచంద్ర మంచివాడే నాన్నా! వాళ్ళయింట్లో అందరూ కూరగాయలే తింటారు. ఈ బుల్లికి మాంసాహారం అలవాటు చేద్దాం..... నేను మూడు దువ్వలు తెచ్చాను. ఈ మాంసాన్ని ఒకముక్క చక్కెరలోనూ మరో ముక్క ఉప్పులోనూ, మరో ముక్క ఫ్రాన్సు వారి పద్ధతిలోనూ, వేయిద్దాం... మాంసం తినని బాబూలకు చావు మూడింది' అన్నాడు అజిత్‌సింగు.

'నీకు నచ్చిన వంటకాలు చేసిన ఫ్రెంచి వారు, వారి రాజును కూల ద్రోశారు' అన్నాడు బాబాయి.

'అప్పుడు జనరల్ నెపోలియన్ అధికారంలోకి వచ్చాడు. కారణం ఒక్క సైన్యం మాత్రమే సమర్థవంతంగా పరిపాలించ గలదు.' అన్నాడు అజిత్ సింగు.

ఈ మాటలు గట్టిగా అంటూ ఆ గొడవను ముగించి ముంగిట్లోకి అతడు నడిచాడు.

'మాష్టారూ! రెండు సంవత్సారాల క్రితమే అలంపూరు బడిలో అజిత్ మీ శిష్యుడు. మీరు అతన్ని చూసి గర్వపడాలి. నేను చేసిన సేవలకు ప్రభుత్వం ఇతణ్ణి నేరుగా వైస్రాయ్ సైన్యంలో చేర్చుకు న్నారు. యుద్ధరంగంలో సాహసోపేతమైన వీరుడుగా ఇతడు పతకం సంపాదించాడు.' అన్నాడు గర్బ్యాసింగు.

'సుబేదార్ మేజరుగారూ! మాటలూ, చేతలూ ఈ రెండింటిలో ఇతడు చేతలవైపు మొగ్గాడు. ఇతడు ఎనిమిదవ తరగతి తప్పాడు. మెట్రిక్కు పూర్తి చేయలేకపోయాడు. కానీ ప్రభుత్వం వద్ద ఎన్నో పతకాలు పొందాడు. ఈ అబ్బాయి కృష్ణ అన్ని పరీక్షలూ నెగ్గి మన

దేశంలో ఒక ధృవతారగా నిలుస్తాడు.' అన్నాడు బాబాయి.

బాబాయి ఆఖరి వాక్యం నన్ను ఉద్రేకపరచింది. నక్షత్రంలా ప్రకాశించాలని నాలో కోరిక చెలరేగింది. జర్మనులతో యుద్ధం చేయడంతోబాటు గాంధీవంటివారితో చెరసాలలకు వెళ్ళకుండా నేను ఏవిధంగా వున్నట్లుండి నక్షత్రంగా ప్రకాశిస్తానో బోధపడలేదు. వాస్తవ పరిస్థితులు అని నేననుకున్న విషయాలను గౌరవనీయులైన పెద్దలు కాదంటున్నారు. నేను దాహంతో ఎదురుచూసిన వాటిని వేరు చేస్తున్నారు. ఇతర ప్రజల అభిప్రాయాలను గూర్చిన నా అమాయకత్వం పట్ల నాకు విసుగు పుట్టింది. లోలోపల నేను ఆలోచించలేకపోతున్నానని అనిపించింది. అసత్యాన్ని ఎదిరించి దాన్ని గురించి తెలుసుకోవాలని నేననుకోవటం పొరపాటా! వాళ్ళకు చాలా మందికి ప్రపంచం గురించి, దాని చరిత్ర గురించీ తెలియదు. అందువల్ల వాళ్ళు ప్రశ్నలకేసి చూడరు. మనం విభిన్నభాషలలో మట్లాడుతాము. పెద్దవాళ్ళు కావటంవల్ల గురుపీఠంపై కూచుని హుందాగా వారు వ్యవహరిస్తారు.

చిన్న వాళ్ళమైన మమ్మల్ని తృణీకరించి నోరుమూయించి వేసారి పోయేలా చేస్తారు.

'రండి బాబూ! మాష్టరుగారు మీకు చూపిద్దామనుకున్న కాంగ్రా కలంతో గీచిన చిత్రాలను చూపిస్తాను' అన్నాడు గర్భాసింగు.

మాకళ్ళముందు ఎన్నో అద్భుత చిత్రాలు దొర్లిపోయాయి. పర్వతాలూ, చెట్లూ, అందమైన రంగుల్లో ఉడుత కుంచెతో దిద్దిన రాధాకృష్ణుల చిత్రాలు సంసారచంద్ర మహారాజా, అతని కుమారులు అనిరుద్ధ చంద్ర..... విచిత్రమైన దుస్తుల్లో వున్న డోగ్రా సైనికులకు శిక్షణయిస్తున్న ఓబ్రైన్ చిత్రం నవ్వు తెప్పించింది.

'క్రూరులైన ఆంగ్ల దొరలను వదిలి సంసార చంద్ర మహారాజాను కొలిచిన ఐరిష్ దేశస్తుని చూసి జమేదార్ అజిత్‌సింగు ఎంతో నేర్చుకోవలసి వుంది' అన్నాను.

'దేశద్రోహి వాడొక గూఢచారి' అంటూ అరిచాడు అజిత్‌సింగు.

నాముఖం కందగడ్డలా అయింది. నేను విప్లవకారుణ్ణే మాత్రమే కాక నేనే విప్లవమనిపించింది.

గర్కాసింగు యింటినుండి మేము బయటికి వస్తుంటే సూర్యోదయతుహినకాంతులు ఆ గ్రామంపై పడి కాంగ్రా ప్రాంతపు వేసవి మంచు పొరలు విచ్చుకుంటున్నాయి. మా గుర్రపు పిల్లలు యితర గుర్రపు పిల్లలను చూసి సకిలిస్తున్నాయి. పొలందున్నుతూ హడావిడిగా వున్న రైతన్నలతో మాతో వచ్చిన కుర్రవాళ్ళు మాట్లాడుతున్నారు.

'అరేయ్ గోవిందా! రాకూరూ! నేను ఒకటో, రెండో సిగరెట్లు కాల్చాలి. అగ్గిపెట్టె తీసుకురండి. దారిలో కావలసివస్తుంది.' అన్నాడు హరిహర కుర్రవాళ్ళతో.

గోవింద తలవూపి అన్నాడు

'రైతులను అడిగాము. బాబూ! వాళ్ల దగ్గర అగ్గిపుల్లలు లేవు. వాళ్లు పొలంపని చేసేటప్పుడు తంబ వేసుకొంటారు. ఇళ్లకు వెళ్లేంత వరకు పొగతాగరు.'

కొండ మీదికి గాని, కిందికిగాని వచ్చేటప్పుడు గుర్రాల కళ్లెం పట్టుకొన్నప్పుడు గోవిందను, రాకూరును నేను సరిగా చుడలేదు. వికారంగా వున్న వాళ్ల శరీరాలను యిప్పుడు చూశాను. మొరటుగా వంగిన వారి శరీరాలు, నాన్న ఆఫీసుముందు సైన్యంలో చేరడానికి వచ్చిన వారిని గుర్తుకు తెచ్చాయి. గోవింద ముఖం పసుపు పచ్చగా కోలగా వుంది. సన్నటి మీసం కనిపిస్తోంది. రాకూరు నల్లగా, పీక్కుపోయిన కనుగుడ్లతో, గంజాయి పీల్చిన వాడిలా కనిపిస్తున్నాడు.

'నేను అంగళ్లకు వెళ్లి అగ్గిపెట్టె తెస్తాను.' అన్నాడు గోవింద.

'నీవు వుండు. నేను వెళ్లివస్తాను.' అన్నాడు రాకూరు.

'వేయించిన సెనగలు కూడా తీసుకురా' అన్నాడు గోవింద.

హరిహర బాబాయి గుర్రం దిగి రాకూరుకు డబ్బులు యివ్వడానికి జేబులు వెతికాడు.

'మనం మామిడి తోటలో విశ్రాంతి తీసుకొందాం.— వాడు అగ్గిపెట్టె తెచ్చినంతవరకు. నాకు సిగరెట్టుతాగాలని వుంది. సుబే దారుయింట్లో అగ్గిపెట్టె అడగడానికి ధైర్యం చాలలేదు.' అన్నాడు బాబాయి.

భగవాన్‌సింగు, నేను గుర్రాలమీద కూచొని వున్నాము. కళ్లాలు గోవింద చేతిలో వున్నాయి. అటూ యిటూ చూస్తుంటే, మామిడి కాయలు కోస్తున్న రైతుస్త్రీలు మాకేసి చూస్తున్నారు.

'పచ్చి మామిడికాయలు తింటే వాళ్ల కళ్లు కలగవా?' అన్నాను.

నేను ప్రశ్న లడగడం యిష్టం లేనట్లుగా బాబాయి సైగచేశాడు. మరికొంత సేపటిలో సమాధానం నాకు తెలిసింది.

ముగ్గురు రైతులు వచ్చి, ఆడవాళ్ల దగ్గర వున్న రొట్టెముక్కలు తింటూ, వచ్చి మామిడికాయలు కొరకసాగారు. మా సందులో పర్వత ప్రాంతీయులు కూడా రొట్టె, ఊరగాయ తినేవారు. రాత్రి సుబేదారు యింట్లో మేము కూడా తిన్నాము. దుప్పి మాంసం ఈ రైతులు కూడా తింటే బాగుండు ననుకొన్నాను.

మౌనాన్ని భంగపరుస్తూ బాబాయి గుసగుసలాడాడు: 'పట్టణాలలో వున్నవారు అనుకొంటారు— ఈ రైతులు మొరటువారు, పశుప్రాయులు అని..... కాని వాళ్లది కష్టభూయిష్టమైన జీవితం. వాళ్లు పొద్దుపొడవగానే పొలంలోకి వచ్చి, మండుటెండలో పగలంతా పని చేస్తారు. వాళ్ల మేడ యిళ్లు ఆకాశాన్ని అంటుతాయి. సంవత్సరమంతా తిండికి సరిపోయేలా పర్వతాల్లో వరి పండించడానికి కృషి చేస్తారు. రొట్టెగాని, వరి అన్నంగాని కొద్దిగా తిని, ఊరగాయగాని, లేక వగరు మామిడికాయ గాని, ఉల్లిపాయగాని తింటారు. కొద్దిపాటి కూరగాయలు ఎప్పుడో తింటారు. ఈ విధంగా కడుపు మాడ్చుకొని బ్రతికే వీరు ఎలా కుప్పలా కూలిపోకుండా నిలబడగలరో తెలియదు. పాలు పితుకుతూ, పెరుగు చిలుకుతూ, కట్టెలు ఏరుతూ, గొడ్లు కాస్తూ, నూరుస్తూ వుంటారు - వాళ్ల స్త్రీలు. భగవంతుడా! వాళ్ల జీవితం దుర్భరం. వాళ్ల పిల్లలు 'స్కర్వీ' వ్యాధితో, కురుపులతో బాధ పడతారు.... ఈ పర్వతప్రాంతం

వారు రోజురోజుకూ దైన్యమైన జీవితం గడుపుతున్నారు.. బలిష్ఠమైన యోధులవంశంలో జన్మించినప్పటికీ, సరియైన పోషణలేక వాళ్ళు చనిపోయేలా వున్నారు... నేను నా పుస్తకాలన్నీ వదలి వాళ్లకు సేవ చేద్దామనుకొంటున్నాను. నెలకు 11 రూపాయల జీతము, కాకీ గుడ్డలు యిస్తారని ద్రవ్యంకోసం సైన్యంలో పనిచేసే విదేశీ సైన్యంలో చేరి, విదేశాలలో తన సొంతవారినే కాల్చి చంపే ఉద్యోగంలో జమేదార్ అజిత్‌సింగువలె చేరాను.'

నిరాశాద్వేషాలతో మాస్టారు ముఖం వివర్ణమైంది. 'ఈ అజిత్ సింగు తన పేరు చెడబుట్టాడు. 'ఓరైతన్నా! నీ తలపాగా సవరించు.' అని చెప్పిన ప్రసిద్ధుడైన అజిత్‌సింగు పేరు మీరు వినివుంటారు.' అన్నాను నేను.

హరిహర తలవూపాడు. తన మాటలకు తానే చలించిపోవడం గమనించాను. ఆయనలో కోపచ్ఛాయలు సన్నగిల్లగానే కళ్లు మూతలు పడసాగాయి.

ఇప్పటి వరకు రైతుల దుర్భరపరిస్థితులను గూర్చిన నగ్న సత్యాలు నాకు తెలియవు. మా అమ్మతరపు వారైన మాతా మహుల యింటికి డాస్కా గ్రామం వెళ్లినపుడు, బాగా పుష్టిగా భోజనం చేసే మా బంధువులను మేనమామలను చూశాను. గ్రామీణ జీవితం సుఖమయమని భావించాను. స్వచ్ఛమైన గాలి, సంతోషభరిత వాతావరణము, కావలసినన్ని తేట మజ్జిగ, మామిడి పండ్లరసాలు, బావిదగ్గర స్నానము, మధ్యాహ్నం కంటినిండా నిద్రపోవడము చూశాను. సంపన్నులైన గృహస్థుల జీవితం యింతే. గర్భదరిద్రులైన అస్పృశ్యులను గూర్చి యిప్పుడు ఆలోచించసాగాను. డాస్కాలో నేను వారితో ఆడిపాడాను. నా మిత్రుడు ఫజలు వాళ్లకు ఎకరాలో నాలుగు భాగం భూమి, మా తాతగారి బావికి సమీపంలో వుంది. తన కొడుకు యితరుల పొలంలో క్యారెటు దుంప దొంగలించాడని చావబాదాడు. మా బంధువు హరనామ్ సింగు, వడ్డీ వ్యాపారి వద్ద తన భూమిని తాకట్టునుండి విడిపించు కోవడానికి అప్పుకోసం మా అమ్మను అర్థించడం గుర్తు. చిన్న పిల్లలు సైతం ప్రొద్దుటే లేచి తమ తండ్రులతో కలిసి పొలానికి వెళ్లి గుంటలు తవ్వాలి. నాలో నిద్రాణంగా వున్న భావాలలో సానుభూతి వుందని యిప్పుడు

అర్థమైంది. నాకుటుంబం మీదకంటె యీ పేదరైతుల మీద నాకు ప్రేమ జాస్తి. మా అమ్మవాళ్ల వూర్లో తలపాగాలు ధరించి, బురద గుడ్డలతో కనిపించే రైతులంటే నాకిష్టం. శల్యావశిష్టమైన శరీరాలతో నిదానంగా నడుస్తూ, తోలు కాగితాలవంటి ముఖాలతో కనిపించే పర్వతప్రాంతీయులను గూర్చి పగటి కలల్లో మునుగి తేలాను. కొండ క్రింద ఒకటిన్నర మైలు దూరంలో వున్న బియాస్ నదినుండి కుండలతో నీళ్లు తెచ్చి వీరి స్త్రీజనం తమ సున్నితమైన పెంపకంలో వారిని బతికిస్తున్నారు.

హరిహర అసహనంగా మాట్లాడ సాగాడు.

'మనం బయలుదేరక పోతే సూర్యుడు నెత్తిమీదికి వచ్చేలా ఉన్నాడు. అగ్గిపెట్టె తెమ్మనక పోయినా బాగుండేది.'

'అదుగో రాకూరు వచ్చేశాడు.' గోవింద సర్ది చెప్పాడు.

మేము క్రమంగా ప్రయాణం సాగించి రైతులను వారివారి గత జీవితాలకు వదలి వెళ్ల సాగాము. వాళ్లు అన్నాలు తినడం పూర్తి చేసి కుండలలో నీళ్లు తాగుతున్నారు. వారిలో ముదుసలి వ్యక్తి శరీరం బండరాయిలా పాలిపోయి, స్ఫోటకం మచ్చలతో కొట్టవచ్చినట్లు కనబడుతోంది. అతని చిన్న కొడుకు పాలిపోయిన శరీరంతో సన్నగా, కనులపై చారలతో కామెర్ల వ్యాధిగ్రస్తుడిలా కనిపిస్తున్నాడు. వారికి కొంచెం దూరంలో అస్పృశ్యుడిలా ఒక సహచరుడు కూచొన్నాడు. అతని గుండ్రని ముఖం నున్నగా వుంది. లోతైన కళ్లతో అందమైన పల్లెటూరి రైతులా వున్నాడు. దూరంగా చెదిరిపోతున్న గొర్రెల్ని ఒకచోట చేర్చడానికి అతడు 'చ్చుచ్చు' అంటూ శబ్దాలు చేస్తున్నాడు.

'ఈ గాడిద లడఖ్ ప్రాంతం వాడా లేక టిబెట్ వాడా?' అడిగాను.

'కృష్ణ! అలా నిందించకూడదు.' అనివారించాడు భగవాన్‌సింగు:

'అతడు గొల్లవాడు. లోయలో చలికాలం గడిపి, మంచుకొండల మీదికి వెళ్తున్నాడు. ఈ తెగవారంతా చలికాలం లోయలో గడిపి, మంచు కరగగానే పైకి వెళ్తారు. కష్టపడి పనిచేసే అందమైన పేదవారు.'

మరునాడు సాయంకాలం నిద్రలేచి బయటకు చూస్తే కొండల

జంటలు బాబూ కుషీరామ్ యింటి మీదుగా వెళ్లడం చూశాను. సూర్య కిరణాలు తళతళలలో గడ్డిపోచలు మెరిసిపోతున్నాయి. నీళ్లలో చేపలు గాలి పీల్చుకోవడానికి పైకి వచ్చి మునకలు వేస్తున్నాయి. కొండ చరియల్లో వరి పొలాలు మెల్లమెల్లగా వూగుతున్నాయి. కాకులు తమతమ గూళ్లకు చేరుకొంటూ కావుకావు మంటున్నాయి. వరండాలో పిచుకలు కిచకిచలాడుతున్నాయి.

క్రితంరోజు సుజన్‌పూర్ తీరానికి వెళ్లి, సుబేదార్ మేజర్ గర్కా సింగు యింటివద్దనుండి గుర్రం మీదవచ్చిన శ్రమ యింకాపోలేదు. నా కళ్లలో నిద్రమత్తు యింకా వదలలేదు. యుద్ధంలో జరుగుతున్న అన్యాయాలను గూర్చి అజిత్‌సింగు చెప్పిన నగ్నసత్యాలు, ప్రభుత్వం పట్ల ఆయన విశ్వాసము నాకు రాత్రి నిద్ర పట్టనేలేదు. భగవాన్ సింగు యింకా నిద్రపోతున్నాడు. నేను మా కిటికీలోంచి పొలాలవైపు చూస్తూ మా గదిలో కూచొన్నాను. బాబూ కుషీరామ్ వచ్చి లేవమంటాడేమోనని భయపడుతూ వున్నాను. కాని, ఆయన కంఠం గరగరలు వినిపించలేదు గాబట్టి, ఆయన దూరంగా వున్నాడనుకొన్నాను.

ఈ స్వామిభక్తులు స్వామిద్రోహపరుల మాటలు నన్ను ఆక్రమించాయి. నా చెవుల్లో వారి మాటలు గుసగుసల్లా వినపడుతూనే వున్నాయి. పొలాల్లో గింజలు వెతుక్కుంటూ స్వేచ్ఛగా తిరిగే పక్షిలా నేనూ జాలిస్తే బాగుండుననిపించింది. మేము తిరిగి వచ్చేటప్పుడు హరిహర బాబాయి ఫ్రెంచివిప్లవం గురించి చెప్పాడు. నేను కూడా 'విప్లవకారుడ'ను అయివుంటే నేను భూమిమీద గంతులు వేస్తూ ఒక చేతిలో తుపాకీ, మరో చేతిలో జెండా పట్టుకొని తిరిగే ప్రమాదం వుంది. అప్పుడు నన్ను వాళ్లు కాల్చి, తునాతునకలు చేసివుందురు. నాలో విప్లవభావాలు ఎలా వచ్చాయో నాకు తెలియదు. గందరగోళస్థితి నా గుండెలో చోటుచేసుకొంది. అర్థరహితంగా నా దృష్టిదట్టంగా వున్న చెట్ల మధ్యలోవున్న సరస్సుపై పడింది. పగటి భారమంతా మెల్లమెల్లగా ఎడవేడిమితో పాటు తగ్గిపోతోంది.

నా యౌవనోద్రేకానికి ఎక్కడో గాయం తగిలినట్లయింది. హరిహర వంటి తిరుగుబాటు దారులు తప్ప మా కుటుంబము, బయటి ప్రపం

చము నన్ను దుబారా మనిషిగా పోల్చి వదలి వేశాయి. ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరిగే యుద్ధంలో మరణించే వారిని గూర్చిన వూహా జగత్తులో పిచ్చి పట్టినట్లుంది.

భగవాన్‌సింగు లేచే సూచన లున్నాయేమోనని వెనక్కు చూశాను. అమాయకమైన అతని ముఖంలో అస్పష్టమైన మాటలసవ్వడి వినిపిస్తోంది. అతని గాయపడ్డ మనసులోంచి ప్రతిఘటనాశబ్దాలు ఈ విధంగా బయటికి వస్తున్నాయనిపించింది.

నిద్ర మరణంతో సమానమై, విపరీతమైన ఆలోచనలను కలిగి స్తుంది. నాలో భయోత్పాతం కలిగి ఒంటరిగా భావించసాగాను. బయట సరస్సులో చేప గంతులు వేయడంతో కొంగలు భయపడి పారి పోతున్నాయి. పక్క యిళ్లలోంచి పొగలు ఆకాశమంతా ఆక్రమించాయి. పొగలు రాక్షసుల ఆకారంలో తిరుగుతుంటే వాటివెంబటి పరుగులు తీద్దా మని ఉత్సుకత కలిగింది. లోలోపల భయంగానూ వుంది. ఉన్నట్లుండి నా కళ్లు ఎవరివో చేతులు మూయడం గమనించాను. బహుశా నిర్మల పిన్ని అయివుంటుందని వూహించాను. అంతకుముందు తలుపు దగ్గర ఆవిడను గమనించాను.

'పిన్ని!' అన్నాను.

'అదుగో. నువ్వు పొలాలవైపు పరుగెడుదా మనుకొంటుంటే పట్టుకొన్నాను.' అంది నవ్వుతూ.

మేము మాట్లాడుతుంటే శబ్దానికి, వొళ్లు విదిలించాడు భగవాన్ సింగు.

'అరే బద్ధకస్తుల్లారా! నా పెంపుడు పిచుకలు చూడండి.' అంది పిన్ని.

ఆవిడ అందంగా తలకు రంగు వేసిన ఎర్రపిచుకను, పచ్చపిచుకను మాకు చూపించింది.

'వాటిని నన్ను పట్టుకోనీ!' అన్నాడు ఆనందంతో పొంగిపోతూ.

'జాగ్రత్త! గట్టిగా పట్టుకో. లేకపోతే పారిపోతుంది' అంటూ నా ఎడమ చేతిలో ఎర్రపిచుకను పట్టేయిచ్చింది.

'రెండోది కూడా' అని అరిచాను.

నిర్మల నా కుడిచేతిలో నెమ్మదిగా రెండో పిచుకను పెట్టింది.

నేను అప్రయత్నంగా రెండో చేతిలో ఎర్రపిచుకను మూర్ఖంగా వదిలాను. అది తుర్రున పారిపోయింది.

'అరే' పిన్ని నా మీద కోప్పడుతుందేమోనని అన్నాడు భగవాన్ సింగ్.

ఆమె నవ్వుతూ అంది· 'రెండో దాన్ని కూడా వదలు. పక్షులు పంజరంలో కంటె ఎగురుతుంటే అందంగా ఉంటాయి. తినడానికి మళ్లీ తిరిగివస్తాయి. మీరు వచ్చి పాలుతాగండి.'

ఆమె నాపై అపారమైన మంత్ర శక్తిని ప్రదర్శించినట్లుగా ఆమె మాటలు పాటించాను. హింసా అంహింసల మధ్య ఘర్షణలో నెమ్మదిగా తగ్గిపోయింది.

'భగవాన్ వెళ్దాం రా!' అన్నాను ఉత్సాహంగా.

మేము మధ్యాహ్నం పాలుతాగుతుండగా, మా సంరక్షకుడైన బాబూ కుషీరామ్ తన హుక్కా పీలుస్తు వచ్చాడు. ఆయన భార్యకు, మాకు మధ్య వున్న సుహృద్భావ వాతావరణం పోయి, ఆయన రావడంతో మా మా ఆలోచనా విహంగాలు పరుగులు తీశాయి. మంచితనము, లౌక్యము తమ తీర్పును ప్రకటిస్తాయన్నట్లు మేము మౌనంగా కూచొన్నాము.

మేము అనుకొన్నట్లుగా ఆయన తన తీర్పు ప్రకటించారు:

'గర్కాసింగు యింట్లో మీరు చాలా అల్లరి చేశారని విన్నాను, బడిపంతులైన మా తమ్ముడు తల పొగరు నాకు తెలును. అతడు మిమ్మల్ని తప్పుదారి పట్టిస్తాడని తెలుసు. నేను అతని ప్రమేయానికి మిమ్మల్ని వదలకుండా వుండాల్సింది...... మీరు విప్లవాన్ని గూర్చిన ప్రసంగాలు వింటున్నారని అజిత్‌సింగు నాకు వర్తమానం పంపాడు...

చూడండి! ఇప్పుడది పనికి రాదు. నేను ప్రభుత్వ సేవకుణ్ణి. మా దళానికి చెందిన కల్నల్‌కు అజిత్‌సింగు నా మీద ఫిర్యాదు చేయడం నాకిష్టం లేదు.... కృష్ణా! ప్రత్యేకించి నీవు ఈ చెడు ప్రభావాలకు దూరంగా వుంటావని యిక్కడికి పంపారు. మీకు ఫ్రెంచి రష్యా విప్లవాలను గూర్చి చెడుపాఠాలను ఈ గాడిద హరిహర చెప్పాడు.'

నేను ఏడవ లేకపోయినా, నా గొంతు తడి ఆరిపోయి బాధపడ్డాను. సత్యాసత్యాలపట్ల నా ఆత్మ ఘోషించింది. మేము హరిహర బాబాయి మాటలు విన్నది నిజమే అయినప్పటికీ, దానికి ప్రతిస్పందించ లేదు. మేము మౌనంగా వుండటం వల్ల, ఆ బడిపంతుల మాటలు అంగీకరించామని అజిత్‌సింగు, కుషీరామ్ ఎలా అనుకొంటారు? అమృతసర్ అంటే ఏమిటో తెలియని వాడు, నోరువిప్పని భగవాన్ సింగును గూర్చి వాళ్లు అలా ఎందుకనుకోవాలి? బడిపంతులు చెప్పినా అభిప్రాయాలతో నా కర్థం అయినంతవరకు నేను అంగీకరించిన మాట వాస్తవమే. అందుకు తప్పు చేసినవాడిలా బాధపడుతున్నాను. అమాయకతతో నిండిన నా నిజాయితీ గుడ్డిగా పట్టుకొని వేళాడాను. నా అమాయకత్వాన్ని మా నాన్నగారు తిరస్కరించినట్లుగా, కుషీరామ్ కూడా రెచ్చగొడుతున్నాడు. ఆయన చెప్పే అబద్ధాలు, ఉపన్యాసాలు వినలేక శూన్యంలోకి కూరుకు పోదామనిపించింది. నేను యింట్లోవారికి, బయటివారికి అవసరం లేకుండా పోయాను. ఎక్కడికి వెళ్లాలో తోచలేదు.

నా బాధను గమనించి, పిన్ని నా పక్షానికి వచ్చి, భర్తతో అంది: 'వీడు నా బిడ్డ. నాతో వుండటానికి వచ్చాడు. మీతో గాదు.'

ఈ మాటలు నా హృదయానికి తాకి, కన్నీళ్లు మౌనంగా దొర్లాయి. మా నాన్నకంటె, ఈ రాక్షసుడు కుషీరామ్ పట్ల నాకు భయం వేసింది.

'బాబూ రామచంద్ర సలహాకోసం వ్రాయాలి....' అన్నాడు కుషీరాం: 'ఏదివిమైనా హరిహరను వీళ్లు కలవకూడదు. ఆ మూర్ఖుడితో నేను స్వయంగా మాట్లాడతాను... వాడు నోరు మూసుకోకపోతే, నా ఉద్యోగానికి మూడుతుంది..... అరే భగవాన్! నీకు తెలియని విషయాలు కృష్ణనడిగి చెప్పించుకో...... ఇంక పుస్తకాలు తెరువు.'

పిన్ని శరీరానికి నాతల ఆనించాను. కుషీరామ్ గంభీర వదనం, రక్తంసిక్తనయనాలు నాలో రగులుకుంటున్నాయి.

బాబూ కుషీరామ్ ఉద్బోధలు నా కడుపులో త్రిప్పినట్లుగా అనిపించింది. ప్రతిసారీ గొడవ జరిగినప్పుడల్లా నా కడుపులో దేవినట్లుగా ఎందుకుంటుందో ఆశ్చర్యంగా వేసింది. జ్వరానికి ముందు చికాకుగా వున్నట్లు అనిపించింది. నిర్మలపిన్ని నా నుదురుపట్టుకుని చూసి నాడి వేగంగా కొట్టుకోవటం గమనించి భర్తను పిలిచింది. నాకు బాగులేదనే విషయం విని కుషీరామ్ గాబరా పడ్డాడు. సుజన్‌పూర్ తీరానికి వెళ్ళినపుడు నాగురించి పట్టించుకోనందుకు తన తమ్ముని మీద విరుచుకపడ్డాడు. హరిహర బాబాయి అక్కడ లేడు కాబట్టి ఆయన భగవాన్ సింగు మీద దండెత్తాడు. బాబాయి మాకు గొడుగులు తెచ్చియిచ్చి, ఎండలో గర్గ్యా యింటికి నడవకుండా మధ్యాహ్నం నిద్రపోవడానికి బలవంతపెట్టి ఆదరంగా చూసి వుండవలసిందని ఆయన అభిప్రాయం. ఆయన మాటలలోని కరుకుదనం నాకు జరిగిన అన్యాయం పట్ల మరింత దయనీయ స్థితిని గుర్తుచేసింది. నా అంతఃచక్షువులతో ఆ గదిలో వున్న ముగ్గురినీ వింతగా చూశాను. నా నరనరాల్లో బాధ వణికిపోతున్నట్లుగా అనిపించి నా ఆత్మలో రగులుకుంటున్న పాత జబ్బు తిరగబెట్టి, సర్వేంద్రియాలను ఆక్రమించినట్లు అనిపించింది. పెద్దల ప్రపంచం క్రూరత్వమనే సుస్థిర భవనం వంటిదనీ, కోపంగా వున్న నావంటి జంతువుకు అందులో స్థానం లేదనీ, వారి మాటలుతోనూ, కోపంతోనూ, నన్ను తరుముకుంటారనీ తెలుసు. నేను బడిలో చదువుకున్న విలియం బ్లేక్ పద్యం గుర్తుకు వచ్చింది. నేనో అందమైన పెద్దపులిగా భావించుకుంటూ నా వూపిరి బిగబట్టి ఈ మాటలు వల్లించాను:

'పులి! పులి! ప్రకాశంగా వెలుగుతోంది.'

'అనవసరంగా ఏదో ఒకటి ఆలోచిస్తూ కూర్చోక నిద్రపో!' దయతో మిళితమైన కరిన స్వరంతో అన్నాడు కుషీరామ్.

'బాబూ! నీవు అలా పడుకో. నేను వెళ్ళిపాలు తెస్తాను' నాతల నిమురుతూ పిన్ని మెల్లగా అంది.

'నీవు అతడి దగ్గరగా వెళ్ళకు. నీకు కూడా అంటువ్యాధిలా అది రావచ్చు.' అని భార్యతో చెప్పి — 'భగవాన్‌సింగ్! వెళ్ళి వైద్యుణ్ణి పిల్చుకురా' అన్నాడు.

ఈ హెచ్చరిక నా వ్యాధిని మరింత అధికంచేసి, భగవాన్‌సింగు శరీరం కుంచించుకునేలా చేసింది. నేను నిద్రపోతున్నట్లుగా నటిస్తూ కళ్ళుమూసుకున్నాను.

కనుగుడ్లు గట్టిగా మూశాను కాబట్టి భయంకరమైన మేఘాచ్ఛాదిత వాతావరణం అలముకొని బాహ్యప్రపంచం గందర గోళంగా కనిపించింది. కొద్దిపాటి గాలి సోకినా జబ్బున పడే బలహీన శరీర తత్వాన్ని మా నాన్న నిందిస్తున్న కరకు కంఠస్వరం నాకు వినిపించింది. నాలుకలు చాచుకొని విషనాగులు నా వైపుకు వస్తున్నాయి. మండ్రగబ్బలు, నిశ్శ బ్దంగా వచ్చి ముంజేతులు కాటువేస్తున్నాయి. నిర్మలపిన్ని వెళ్ళిపోయింది. కాబట్టి నా తల వుంచుకునేందుకు చోటు లేదు. నన్ను హింసించే వారి నోట్లోకి వెళ్ళిదూరి మింగివేసేలా చూద్దామను కున్నాను. లేచి వెళ్ళి గదిలోంచి బయటికి పరుగెడుదామను కున్నాను. 'ఈ ప్రపంచంలోంచి నేను పరుగెత్తి వెళ్ళేందుకు ఏదైనా దారివుందా?' అని నా అంత రాత్మ ఘోషించింది. 'నేను ఎగిరి వెళ్ళేందుకు రెక్కలు వున్నాయా?'

తన అన్న బాబూ కుషీరామ్ తన రాకను ప్రతిఘటిస్తాడని తెలిసి నప్పటికీ హరిహర బాబాయి సుజనపూర్ తీరానికి చెందిన గ్రామ వైద్యుడు, వైద్యరత్న పండిత సైనదాసుతో వచ్చిచూడాలని పట్టు బట్టాడు. మాటలతో నా జబ్బు నయమయేటట్లు వుంటే వాటికి కొరవలేదు.

వైద్యరత్న చూపరియైన పర్వతప్రాంతీయుడు. మహారాజా సంసార చంద్ర సైన్యంలోని ఐర్లండు దేశానికి చెందిన ఉపాధ్యాయుని కుమా రునిలా కనిపించాడు. ఆయన కళ్ళు బూడిదరంగులో వున్నాయి. తల నల్లగా నిగనిగలాడుతోంది. అతని ముక్కు డేగ్రాలవలె కొనతేలివుంది. నా నాడి పరిశీలించి ఆయన వ్యాధి నిర్ణయం చేయ సాగాడు.

'మూడురకాలైన జ్వరాలున్నాయి మొదటిది ఏదైనా భౌతిక

సంబంధమైనది. లేదా అజీర్తి వలన వచ్చేది. రెండవది చీకాకుగా వున్న బుర్రతో ఉన్నపుడు వచ్చేది. మూడవది మనసులో దిగులుగా వున్నపుడు వస్తుంది. బాబూ కుషీరామ్! ఈ విషయంలో మూడు కారణాలూ వుండవచ్చు' అని నావైపుకు తిరిగి 'బాబూ! నాల్క తెరువు' అన్నాడు. నాలుక పరిశీలించి వెంటనే హరిహర బాబాయితో అన్నాడు 'అంతా గజిబిజి.'

'సుజనపుర తీరంలో హరిహర వీడికి ఏమి పెట్టించాడో' అంటూ బాబూ కుషీరామ్ తమ్ముడి మీద మండి పడ్డాడు.

'భగవాన్‌సింగు నడగండి' మేము ఇంటివద్దనుండి తీసుకు వెళ్ళిన భోజనమే తిన్నాము. ఆ సాయంత్రం గర్కాసింగు కొడుకు దుప్పిమాంసం వండించాడు.

'తీయగావున్న ఆ మాంసం నాకు నచ్చలేదు' అన్నాను.

'అదే బాబూ! నీవు అపవిత్రమైన ఆ దుప్పిమాంసం తిన్నావు.' అంటూ వైద్యరత్న — 'అది తీయగావుండనీ, ఉప్పగా వుండనీ మన డోగ్రా తెగవారు జంతువుల మాంసం తినడం మొదలుపెట్టినప్పటి నుండీ మన పతనం ప్రారంభమైంది. మానవుడు మరో మాంసాన్ని తింటే మానవరక్తంతో మృతరక్తం కలిసినపుడు ఒకటిగా వుండదని నీవు అంగీకరిస్తావు గదా! సున్నితమైన నరాలూ, అతిసున్నితమైన మానవుని జీర్ణకోశమూ, పరాయివస్తువులను ఎలా జీర్ణం చేసుకుంటాయి.'

'అందుకే గాబోలు నాకు మలబద్ధకం. హుక్కా తాగితే గానీ నాకు దొడ్డికిరాదు' అని కుషీరామ్ నేరం అంగీకరించాడు

'నిజానికి నీ విషయంలో మల బద్ధకం కాదు, నరమాంసం భక్షణం. అన్నయ్యా! నీవు నోరు తెరిస్తే మనుషులను తినడం మొదలు పెడతావు' అంటూ హరిహర బాబాయి నిందించాడు.

'నేను నీతో మాట్లాడటం లేదు' అంటూ కుషీరామ్ తన తమ్ముని నిర్లక్ష్యంపట్ల కోపంతో వణికిపోతూ నిలబడ్డాడు.

'మాంస భక్షణంవల్ల కలిగే బాధలలో మలబద్ధకం చాల చిన్నది.'

అంటూ వైద్యరత్న నా నుదుటిపై చేయివేసి నా మంచం పక్కన వచ్చి కూచున్నాడు: 'పశుమాంసం రాచరణం కల్గిస్తుంది. అది నయంకాని మృత్యు సమానమైన వ్యాధి. నీవు పీల్చే హుక్కాలోని పొగాకు కూడా ఆ వ్యాధిని కల్గిస్తుంది.'

'నేను అది లేకుండా బతకలేను. నిషేధించకండి.' అంటూ అభ్యంతరం చెప్పాడు కుషీరామ్.

'మరణానికి హేతువులను మాత్రమే నీకు చెప్పాను.' అంటూ వైద్యరత్న— 'మాంసము, పొగాకు కాకుండా మద్యంవుంది. అది మూత్ర పిండాలలో రాళ్ళు సృష్టించి గుండెను బలహీనం చేస్తుంది. కాంగ్రా పర్వత ప్రాంతంలో సగానికి సగం చావులు తాగుడువల్ల కలుగుతున్నాయి.'

'పిల్లవాడికి ఏదైనా మందు యివ్వండి. ఎముకల్లో నొప్పితో బాధ పడుతున్నట్లు వుంది.' అన్నాడు హరిహర బాబాయి.

'నా పక్కన వచ్చి కూర్చోండి మాస్టారూ!' అని అర్థించాను. ఇలా అడగటం కుషీరాముకు యిష్టం వుండదని తెలుసు.

'నేను వెళ్ళి నీకు మందులు తీసుకురావాలి. వచ్చిన తర్వాత నీ ప్రక్కన కూర్చుంటాను.' అన్నాడు హరిహర బాబాయి.

'నా అనుమతి లేకుండా నీవు ఈ యింట్లోకి వచ్చేదానికి లేదు.' అని కుషీరామ్ కేకలు వేసి — 'భగవాన్ సింగ్! నీవు వైద్యరత్నతో వెళ్ళి మందులు తీసుకురా!' అన్నాడు.

అంతకు ముందు రోజు హరిహర బాబాయి ముఖంలో చూసిన ప్రశాంతగంభీరత మళ్ళీ నాకు కనిపించింది.

కుషీరామ్ ముఖంలో కోపంతో కూడిన క్రూరదృష్టి మామూలు ముసుగు మాత్రమే. వారిద్దరి మధ్య ఘర్షణవలనే నాకు యిప్పుడు ఈ జ్వరం రావడానికి కారణమని నా అంతరాత్మకు తెలుసు. వైద్యరత్న నిర్ధరించినట్లు అదికేవలం భౌతికమైన జ్వరం కాక నా లోలోపలి మథనం వల్ల యేర్పడిన ఆధ్యాత్మిక జ్వరం.

మూడురోజుల తర్వాత నా జ్వరం 103°ల నుండి 100°కు తగ్గింది. నా కోసం ప్రత్యేకంగా పాలంపూరు నుండి ఒక ఆంగ్లవైద్యుని తీసుకు వచ్చారు. ఆయన జ్వరమానిని పెట్టి చూసినపుడు అది తెలిసింది. ఆ మధ్యాహ్నం నేను లేచేసరికి మా నాన్న కంఠం వినిపించింది. నేను నమ్మలేకపోయాను నా చెవులు రిక్కించి వరండాలో సంభాషణ వినసాగాను. ఆ గొంతు మా నాన్నదేనని గుర్తు పట్టాను. చివరకు ఆత్మీయంగా 'నాన్నా!' అని అరిచాను

'బాబూ! యిక్కడే వున్నాను.' అని సమాధానం వచ్చింది

మరుక్షణంలో నాన్న, కుషీరామ్, భగవాన్ సింగు లోపలికి వచ్చారు.

నేను లేచి కూచున్నంత పని చేశాను.

'ఉద్రేకపడకు' అంటూ నాన్న నాకు భరోసాయిచ్చి — 'నీ జ్వరం తగ్గిందని విన్నాను. ఈ దిగులుతో మీ అమ్మ నిద్రపోవటం లేదు. నిన్ను తీసుకెళదామని వచ్చాను.'

ఏడ్వాలని అనిపించినా నోరు విప్పలేదు. పెదిమలు కదిలాయి. ఎంత చెడ్డవారైనా మా అమ్మా, నాన్నలు నా గురించి జాగ్రత్త చూపి నా జీవితం పట్ల ఆసక్తి కనబరుస్తున్నారనే వాస్తవం గ్రహించి వణుకు పుట్టింది.

'ఆయనకు జీలంలో చేతినిండా పని వున్నప్పటికీ, నేను తంతి యిచ్చాను. కాబట్టి మీ నాన్న శ్రమపడి వచ్చారు' అన్నాడు కుషీరామ్.

'బాబూ! ఈజిప్టు నుండి ఇంక పదిరోజులలో దళం వచ్చేస్తోంది. నీ ఆరోగ్యం ఎప్పుడూ సున్నితంగా వుంటుంది కాబట్టి నేను వచ్చాను. ఈ విధంగా జ్వరాలు రావడం నాకిష్టం లేదు. యింక అవి నిన్ను వదిలి వెళ్ళాలి........ నీ వయసువాడైన భగవాన్ సింగు చూడు అతనికి జ్వరమేరాదు.'

మానసికమైన గందరగోళంవల్ల నాలో అసంతుష్టిగా వుందని ఆయనకు చెప్పలేకపోయాను. నాలోని అస్తవ్యస్త పరిస్థితిని ఆయనకు

వ్యక్తపరచలేక పోయాను.

'రామచంద్రగారూ! ఈ అబ్బాయి ఆరోగ్యాన్ని గురించిన బాధ్యత మీ మీద వదిలి వేస్తున్నాను' అన్నాడు కుషీరామ్.

'మీరు మంచివారు కాబట్టి యిక్కడికి తీసుకువచ్చారు.' అన్నాడు నాన్న: మీ పొరపాటువల్ల జ్వరం రాలేదు. ఎప్పుడూ జ్వరం వస్తూ నేవుంటుంది. లూధియానాలో టైఫాయిడ్ జ్వరం వచ్చింది. చాకలి పిల్లవాడు కొట్టినపుడు జ్వరం వచ్చింది. అప్పటి నుండీ బలహీనంగా వున్నాడు....... కుషీరామ్ గారూ! ఏం జేస్తాం చెప్పండి. వాళ్ళు మన సంతానం. మనం వాళ్ళను పెంచి పోషించి చదివిస్తాము. వాళ్ల సరిగా—'

మా కృతఘ్నత గురించి ఆయన తప్పనిసరిగా వాడే మాటను ఆయన వాడలేదు. బహుశా నా అనారోగ్యం ప్రవచనం వల్ల ఎక్కువ అవుతుందేమోనని ఆపివుంటారు.

'నాకు తెలుసు నా తమ్ముడు హరిహర అందుకు ఉదాహరణ.' అంటూ కుషీరామ్ — 'నేను మిగిల్చిన డబ్బు అంతా అతని చదువు మీద పెట్టాను. అతను యిప్పుడు విప్లవ వాది. తన యిష్టం వచ్చి నట్లు ప్రవర్తించి నా ఉద్యోగం ఊడగొట్టడానికి సిద్ధంగా వున్నాడు. మీ దళానికి చెందిన జమేదార్ అజిత్‌సింగుతో ఈ పిల్లలముందు తగవు పెట్టుకున్నాడు. అదీగాక—'.

'నేను యిక్కడికి వచ్చాను కాబట్టి గర్గాసింగును అజిత్ సింగును తప్పకుండా కలవాలి' అన్నాడు నాన్న: 'వాళ్ళు ఎంత దూరంలో ఉన్నారు? రేపు రాత్రి పదిగంటలకు పరాన్‌కోట నుండి బయలుదేరే రైల్లో ఈ పిల్లవాణ్ణి కూడా తీసుకెళ్ళాలి.'

'అన్నీ ఏర్పాటు చేస్తాను' అంటూ కుషీరామ్: 'నేను రెండు గుర్రపు పిల్లలను అరువుతెస్తాను రెండుగంటలలో మన యిద్దరం అక్కడకు వెళ్ళి రాత్రి తొమ్మిది గంటలకు తిరిగి రావచ్చు. రేపు మధ్యాహ్నం పాలంపూర్ నుండి బయలుదేరే తపాలా బస్సులో మీరు పరాన్ కోట్ వెళ్ళవచ్చు.'

నిర్మల పిన్ని నుండి, బియాస్ నది నుండి, భగవాన్ ఆత్మీయ తనుండి హరిహర బాబాయి అగ్ని జ్వాలనుండి కలిగే వియోగం పట్ల నాలో ఆవేదన కలిగింది. నేను ఎక్కడ వున్నప్పటికీ నా రక్తంలో ఫ్రెంచి, రష్యను విప్లవాల జ్వాలలు రగులుతూనే వుంటాయి. మహోన్న తమైన దౌలాధర్ పాదాలముందు వున్న కాంగ్రా లోయ ఆకర్షణ ఈ భావాల అట్టడుగున వుండనే వుంటుంది.

# 12

నేను మా యింటికి వచ్చిన తర్వాత మా నాన్న నా భావాలకు వ్యతిరేకంగా తన ఆలోచనలను ప్రభావాన్ని చూపడం క్రమంగా తగ్గిం చినట్లు గమనించాను. లేదా తాను నాకు ఉద్బోధలు చేయడం వల్ల నా నూతన భావాల పట్ల గట్టి నమ్మకం కలుగుతుందని నిర్ణయించు కున్నట్లున్నారు. ఆయన నా పట్ల డబ్బు విషయంలోనూ ప్రేమ చూప టంలోనూ మరింత ఉదారంగా వ్యవహరించారు.

మా అమ్మ నాపై చూపే ప్రేమ విషయంలో నాకు భరోసా వుంది. నాన్న దృష్టిలో మార్పురావడానికి కారణం ఆవిడవల్లనేనని గ్రహించాను. ఆవిడ ఏమీ మాట్లాడక పోయినప్పటికీ ఏ విషయం లోనూ జోక్యం చేసుకోక పోయినప్పటికీ స్వదేశీ వస్త్రాలు ధరించడం లోనూ, మాంసాన్ని ముట్టుకోక పోవడం లోనూ, సత్యంపట్ల విశ్వాసం చూపడంవంటి అన్ని విషయాలలోనూ ఆమె గాంధీని అనుసరిస్తున్న ట్లుగా కనిపించింది. ఈ క్రొత్త సిద్ధాంతాలను అవలంబించడంలో ఆమె చదివి ఆరాధించిన భగవద్గీత తోడ్పడింది. ఆమెకు అది ఎక్కువ అర్థం కాకపోయినా అది చదవసాగింది. ఆమె ఈ చిన్న వేదం, 'గీత' మోహన్‌దాస్ కరంచంద్ గాంధీకి ప్రీతి పాత్రమైన పుస్తకం అంటారు. అందులోని ధర్మసూత్రాలను తిరిగి తనకు బోధిస్తున్నప్పుడు నాన్న వారించ లేక పోయారు. అది చదవమని ఆయనే చెప్పారు.

దానికి తోడు పేదలపట్ల సానుభూతి. అమృత్‌సర్‌లో నాలో బల పడ్డ విప్లవభావాలు నా వెంట వచ్చాయి. హరిహర బాబాయి చెప్పిన రెండు మహా విప్లవాలూ నా భావాలను బలపరిచాయి. దైనందిన విద్యా విధానం కన్నా, యాదృచ్ఛికంగా ఏర్పడ్డ స్నేహాలు ఏ విధంగా మానసిక, శారీరకక్రమాన్ని ప్రభావితం చేస్తాయో తెలిసింది.

ఆంగ్ల ప్రభుత్వం పాలన నుండి స్వాతంత్ర్యమనే నినాదమేగాక, భూస్వాముల చేతిలో నలిగిపోతున్న సామంతులవంటి రైతుల స్వాతంత్ర్యం నా ముందున్న మహత్తర ఆశయాలలో ప్రధానంగా కనిపించింది. స్వేచ్ఛాభూమి అయిన అమెరికా స్థానాన్ని ఫ్రాన్సు, రష్యా దేశాలు ఆక్ర మించాయి నాలోని అవ్యక్తమైన అహంభావాన్ని ప్రోదిచేసి విప్లవతారగా భాసించాలనుకున్నాను. అందుకు మానాన్న నన్ను ప్రోత్సహించారు.

మా యింట్లో శాంతియుతవాతావరణాన్ని కాపాడటానికి నాన్న దృక్పథంలో మార్పు దోహదం చేసింది. జాతీయ భావాలను కలిగివున్నా డనే నెపంతో డాక్టరు చునీలాల్‌ను ప్రభుత్వోద్యోగం నుండి తొలగించా రనే వదంతి మా నాన్న చెవి సోకింది. బ్రిటీష్ ప్రభుత్వ దమన నీతి ఆయనకు దిగ్భ్రాంతి కలుగజేసింది. ఈ వదంతితో బాటు శకుంతలకు వూపిరి తిత్తులలో క్షయ వ్యాధి వచ్చిందని తెలిసింది. ప్రభుత్వంపట్ల అసహనంతో బాటు తన పాత మిత్రుని భార్యపట్ల సానుభూతితో నాన్న చలించి పోయాడు. తనకు జరిగిన అన్యాయం తర్వాత డాక్టరు నన్ను చూడటానికి వస్తాడా? రాడా? అని అమ్మా, నాన్న ఎదురు చూస్తున్న సమయంలో డాక్టరుకు, శకుంతలకు జరిగిన అన్యాయాన్ని గురించి నాకు తెలిసింది.

రెండు బరువైన దుప్పట్లు కప్పుకొని చెమటలు పట్టి పక్కమీద నేను పడుకుని వున్నప్పుడు నా నరాల బాధ అధికమై నా తల తిరగ సాగింది. డాక్టరు చునీలాల్ యిల్లు ఎండ మావిలా నా కంటిముందు దగ్గరౌతున్నట్లు మసకగా కనిపించింది. ఉత్సాహ భరితమైన నా యువ హృదయం పొరల వెనుక డాక్టరు దంపతులు నా పట్ల చూపిన అభి మానం వల్ల కలిగిన ఆత్మస్తుతిపాత్రమైన జ్యోతి వెలుగుతోంది. వాళ్ళు వెళ్ళిపోతే నేను విన్న వదంతులు నిజమైతే నా మధురానుభూతికి

కలిగే గాయాన్ని గురించి ఆలోచించాను. సామెతల్లో చెప్పినట్లు దీప పుకాంతికి భ్రమించి దానిచుట్టూ తిరిగి ఆత్మాహుతి చేసుకునే దీపపు పురుగు వచ్చింది.

చిట్టచివరకు ఆ సాయంకాలం డాక్టరు దంపతులకు మా యింట్లో మా నాన్న సాదర ఆహ్వానం చెప్పటం వినిపించింది. నా స్నేహి తులు రావడం గమనించాను. డాక్టరుగారు మందస్మితవదనంతో చరచరా నడుచుకుంటూ వస్తే, ఆయన భార్య మందమందంగా ఆయన వెనక దిగాలుగా నడుస్తోంది.

డాక్టరుగారు నా తల నిమిరి సహజ గంభీర ధోరణిలో — 'అరే! వెధవా! ఈ అశాంతిలో మమ్మల్ని వదిలి పెట్టి నీవు కాంగ్రాకు పరుగెత్తి వెళ్ళావు. మళ్ళీ తిరిగివచ్చి నాకబంధహస్తాలలో ఇమడక తప్పలేదు.'

శకుంతల తన పెదిమలతో 'ష్, ష్,' అని శబ్దంచేసి భర్తను వారించి పక్కకు నెట్టి నన్ను కావిలించుకుంది. తన బుగ్గలు నా బుగ్గల కేసి అదుముతూ తన జీవన మంతా నాకు ధారపోస్తున్నట్లు వ్యవహరించింది.

అమ్మ ముఖంలో ఆందోళన గమనించాను. నా మంచంముందు నిలబడి శకుంతలకు అతిదగ్గరగా నేను ఉండరాదని ఆమె కనుసైగల ద్వారా చేతిసైగల ద్వారా సూచించింది.

నాన్న ముఖం కందగడ్డలా మారింది. తన బాధలో మగ్నమై దుర్భర విషాదంలో వున్న శకుంతల నన్ను కావిలించుకొని —

'నీవంటి కొడుకు కావాలని కోరుకున్నాను. ఇప్పుడేమో నాకు జబ్బుచేసింది........ నీకంటె ఎక్కువ జబ్బు.'

'ఇలారా! శకుంతలా! నేను పరీక్ష చేయాలి.. జబ్బునయం కావ టానికి ఆప్యాయతతోబాటు మందుకూడా కావాలి' అన్నాడు డాక్టరు ఆమెతో.

'జరిగినదంతా నేను మరిచిపోవాలి' అంది శకుంతల. నన్ను వదిలిపెట్టి లేచి తన కళ్ళలో నీళ్ళు తుడుచుకుంది.

డాక్టరు జ్వరమానిని గట్టిగా విదిలించి పాదరస మట్టం తగ్గిన తర్వాత నా నోటిలో పెట్టాడు.

'మనమంతా స్నేహాన్ని మరిచి పోవాలి' అని తన భార్యకేసి అన్నప్పటికీ ఆ వ్యాఖ్యానం నాన్న నుద్దేశించి అన్నాడు.

నాన్న ఆయన మాటల్లో ప్రాధాన్యం గుర్తించి — 'డాక్టరు గారూ! నేను కొన్ని మాటలు విన్నాను. అవి నిజమేనా?' అన్నారు.

'బాబూ! రామచంద్ర! మీరు విన్నది కొంచెం' అన్నాడు డాక్టరు బాధగా. 'అన్ని విషయాలు మీరు వినలేదు. అమరయోధుల నగరాలైన అమృతసర్, లాహోరు, గుర్జనవాలా, కసూరు, షేక్ పురాలలో — ఎక్కడ ఎక్కువ ఘోరం జరిగిందో నాకు తెలియదు. వ్యక్తిగత అధికారులుపడే బాధలు మరీ ఆసక్తికరంగా వున్నాయి. ఉదాహరణకు కల్నల్ ఓబ్రెయిన్ తీసుకోండి. భారతీయులు ఆంగ్లేయ అధికారులు తటస్థపడినప్పుడు వారికి నమస్కరించాలి, సైకిళ్ల మీద నుండి, టాంగాల మీద నుండి దిగాలి. గొడుగులు ధరించి వెళ్తుంటే మూసివెయ్యాలి — అని బ్రెయిన్ ఆజ్ఞాపించాడు. మిగిలిన విషయాలు అటుంచి, గొడుగు ముడవడడం విచిత్రంగా వుంది — వినడానికి. నిషేధాజ్ఞలు, ప్రయాణాల రద్దు, కొరడాలతో కొట్టడం, సందర్భానికి చెందిన తార్కాణలు, శిక్షించడం, ప్రత్యేకన్యాయస్థానాల్లో విచారణ — ఇవన్నీ అర్థం చేసుకోగలం. కానీ, తెల్లవాడు కనిపిస్తే గొడుగుముడవడం హాస్యాస్పదం' — అంటూ విరగబడి నవ్వారు. డాక్టరు నవ్వుతున్నప్పటికీ, హేళనగా ఆ మాటలు వాడారు.

'నిదానం. నిదానం. గాంధీజీ చెప్పినట్లు కోపానికి స్థానం యివ్వకూడదు.' అంది శకుంతల.

'సత్యం ఎప్పుడూ కోపంవలె కనిపిస్తుంది. శకుంతలగారూ!' డాక్టరుగారి పక్షంలో మాట్లాడుతూ అంది అమ్మ.

నాన్న మౌనంగా వుండి పోయారు.

డాక్టరు సంభాషణ కొనసాగిస్తూ 'ఓబ్రెయిన్ అన్నాడు ప్రజ

లకు తమ కొత్త పాలకుల గురించి తెలియ జెప్పడానికే ఇదంతా. తన ద్వేషం వల్ల యితర అధికారులతో సమానంగా ఇతడు కూడా భయంతో విచిత్రంగా ప్రవర్తించాడు. ప్రజలను బందీలనుచేశాడు. వారి విచారణకు ఆరు వారాలకు మించి ఎదురుచూడాల్సి వస్తోంది. ఒకచోట, వేలాది పౌరుల్ని బందీలుచేసి, మండుటెండలో మైళ్లకొలది నడిపించి, ఒక మోటారుబండిలో తోసి అదిమి పెట్టారు. మరి కొందర్ని అర్థనగ్నంగా లాహోరుకు గూడ్సుబండిలో పంపారు. 24 గంటలపాటు వారిని అందులో నిర్బంధించి మలమూత్రాలకు కూడా వదలలేదు. వారు లాహోరు వీధులలో నడుస్తుంటే, మరికొందరు శృంఖలాబద్ధులను వీరితో కలిపారు. కొత్తగా ప్రారంభించిన హిందూ మహ్మదీయ ఐకమత్యానికి హేళనగా హిందువులను, మహమ్మదీయులను ఓబ్రెయిన్ కట్టగట్టి హేళన చేసినట్లు ప్రవర్తించాడు. ఓబ్రెయిన్‌కు ఎలాంటి దయ్యం నెత్తికెక్కిందో తెలియదు........ షేక్‌పురా గ్రామానికి చెందిన ఒక వృద్ధుడు చేసిన నేరం — 'తన కుమారుల జాడ చెప్పకపోవడం.'

ప్రభుత్వ సానుభూతి పరుడైన యితను తన పట్టణానికి ఎన్నో మంచిపనులు చేశాడు. ఢిల్లీ దర్బారుకు 1911వ సంవత్సరంలో చక్ర వర్తి విచ్చేసిన సందర్భానికి జ్ఞాపకార్థం జార్జి ప్రభువు పేర ఒక ఉన్నత పాఠశాల స్థాపించడానికి లక్షరూపాయలు విరాళం యిచ్చాడు. యుద్ధ నిధికి, యుద్ధ ఋణాలకు ధారాళంగా మొత్తాలు ప్రకటించాడు. అతన్ని కూడా ఈ ఖైదీలతో కలిపి నడిపించారు. అతని విధేయతకు తగిన ప్రతిఫలం అతను అనుభవించాడు..... "నాన్నను ఉద్దేశించి ఈ ఆఖరి మాటలు ప్రయోగించి డాక్టరు నాకేసి తిరిగి నా నోట్లో జ్వరమానిని తీశాడు."

'అరే 99 డిగ్రీలు' అంటూ ఆశ్చర్యపోయి, మా అమ్మవైపు తిరిగి — 'చెల్లెమ్మా! యింక వెళ్లి లడ్లు పంచిపెట్టు.' అన్నాడు.

హడావిడి లేకుండా, స్టెతస్కోపు చెవుల్లో పెట్టుకొని, గుండెశబ్దం వింటూ చేతితో తట్టసాగాడు.

ఆయన మాటలపట్ల నాకు ఆసక్తి పెరిగింది. ఆయన నాకు

అందనంత దూరంలో వెళ్లిపోతారని నా మనసులో ఆవేదన మొదలైంది. మంచితనానికి ఎప్పుడు శిక్ష ఎందుకు పడుతుందో తెలియక అంధకార బంధురమైన అవస్థలో ఆయనను తడివి చూశాను. ఆయన ప్రస్తావించిన దయనీయ సహోదరులకోసం, ఆయన కోసం త్యాగం చేయడానికి నా అంతరాంతరాల్లో భక్తి ఆయనపై పెరిగింది. ప్రభుత్వానికి వ్యతిరేకంగా చేసే పోరాటంలో నేనింకా తీవ్రతను ప్రకటించడం లేదని పించింది. పోరాటానికి తగిన జవసత్త్వాలు నాలో లేవనిపించింది.

'ఏడుపు ముఖం పెట్టక నవ్వాలి.' అంటూ - 'నేను యిప్పుడు వెంటనే నీకు మందు యివ్వడం లేదు. తర్వాత పంపుతాను. నీవు చేదు మాత్రలు మింగడంలో అసాధ్యుడవని నాకు తెలుసు.'

'ఎప్పుడూ జబ్బునపడి వుండటంవల్ల' అన్నాడు నాన్న.

'లేదు, నా నుంచి సహనాన్ని వాడు నేర్చుకొన్నాడు' అంది అమ్మ: 'మా నాన్నకు తపస్వులంటే యిష్టం. వారు తనకు బోధించిన విషయాలను మాకు చెప్పారు. భక్తి విశ్వాసాలు, భగవంతుని నిర్ణయానికి తగ్గ సహనము నేర్పారు.'

'మహానుభావురాలా! డాక్టరు దంపతులకు తేనీరుయిస్తారా?' అన్నాడు నాన్న అమ్మ విజ్ఞానంపట్ల అసహనంతో.

'రండి శకుంతలగారూ! వరండాలోకి వచ్చి తేనీరు తీసుకోండి. మీరు ఎంత మర్యాదగా అందిస్తారో తెలియదు నాకు.' అంటూ అమ్మ ముందుకు నడిచింది.

'ఆకలి. ఆకలి అనేది మనకు వింతయజమాని.' అంటూ నాన్న తన నేరానికి వ్యాఖ్యానం చేశారు.

'నాకు తెలును. మీది పెద్దకుటుంబం. నేను ఎక్కడైనా స్వంత వైద్యం మొదలుపెట్టగలను. మీరు కూడా అలానే అనుకొన్నా, నా వలె ఉద్యోగం వదలి స్వంత కాళ్ల మీద నిలబడలేరు. అందువల్ల మీరు సర్దుబాటు ధోరణిలో వ్యవహరించక తప్పదు. ప్రపంచంలోని గుమాస్తాలందరూ యిదే చెయ్యాలి. నేను రెండురకాల జీవితాలు నడపలేను —

ఒకరకంగా అనుకొని, మరోరకంగా ప్రవర్తించడం చేతగాదు.'

నాన్న పట్టుదలగా వుండటాన్ని ఈ మాటల్లో చురుకుదనం బాగా సడలించాయి.

'మీ సత్యం జయిస్తుంది. శకుంతల అనారోగ్యం ఒక్కటే—' అన్నాడు నాన్న హుందాగా.

'నేను వెళ్లాలి గాబట్టి తేనీరు సేవిద్దాంరండి.' అన్నాడు డాక్టరు, మా నాన్న శకుంతలను గూర్చి చేసిన ప్రస్తావన దాట వేద్దామని. నావైపు చూసి — 'బాబూ, రెండురోజుల్లో నీకు నయంచేస్తాను. నీవు వచ్చి వారాం రోజులు మాతోవుండు. కోడికూర, గుడ్లు, పెషావర్ పండ్లు నీకు కావాలి గదా!'

నా కోరికను బలపరుస్తూ ఆరోగ్యం గురించి మాటమార్చడం నా కిష్టం వేసింది. కోరిక అనే బలవత్తరశక్తి అద్భుతాలు సాధించగలదు.

డాక్టరు చునీలాల్ మరో రెండుమార్లు వచ్చి వెళ్లడంతో జ్వరం మామూలుకు వచ్చింది. తన స్నేహితుని రాజకీయ వ్యాఖ్యానాల వల్ల కలిగిన ధైర్యంలో మా నాన్న, వాళ్ల యింటికి రెండు మూడురోజులు వెళ్లి రావడానికి అంగీకరించారు. శకుంతలకు క్షయవ్యాధి వుంది గాబట్టి ఆవిడకు దగ్గరగా నా ముఖం పెట్టవద్దని అమ్మ మాటిమాటికి వారించింది.

రైలు ద్వారా తమ సామాన్లు పంపడానికి మూటాముల్లె సర్దు కోవడంలో హడావిడిగా వారిద్దరూ వున్నారు. శనివారం మధ్యాహ్నము, ఆదివార మంతా శకుంతల పర్యవేక్షణలో, ఆసుపత్రి కొత్త పనివాడు సీబు సహాయంతో డాక్టరు పెట్టెలు సర్దసాగారు. నన్ను పక్కమీద పడు కోబెట్టారు. కాంగ్రా లోయలో గడిపిన కొద్దిరోజుల్లో జరిగిన విషయాలు నేను వాగసాగాను.

సర్దుతున్నప్పుడు డాక్టరు చేతికి చేతిరుమాళ్లు, బొమ్మలు, ఫైలు కనబడితే శకుంతల వాటిని పక్కన పెట్టమని చెప్పేది. 'పెరిగి పెద్ద వాళ్లయితే వాడుకొంటా'రని గణేశ్‌కు, శివకు, నాకు మూడేసి చొప్పున పక్కన పెట్టమని చెప్పేది. ఆమె భర్త వెంటనే మూడేసి పక్కన వదలి,

నీ యిష్టమొచ్చిన రంగు ఏరుకోమనేవాడు. ఈ విదేశీ సిల్కు వస్త్రాలు మేము విదేశాలకు వెళ్లినపుడు వాడుకోవచ్చునని అయన చెప్పేవాడు. గాంధీజీ సలహా మేరకు యికమీదట స్వదేశీ నేతవస్త్రాలు ధరించాలని నిర్ణయించుకొన్నట్లు చెప్పారు. విదేశీ వస్త్రాలను వేలంపాటలో విక్ర యిస్తానని చెప్పారు.

'మాంసం తినగూడదనే విషయంలో మననాయకుని మాట నే నంగీకరించను. మనదేశంలో స్వరాజ్య స్థాపనకోసం సహాయ పడుతుం దనుకొంటే దానిని గూడా వదలడానికి సిద్ధమే.' అన్నాడు డాక్టరు.

సేవకుడు తన మాటలు వినబడనంత దూరంలో వున్నాడని గ్రహించినప్పుడే డాక్టరు జాగ్రత్తగా ఆ మాటలు చెప్పేవాడు. మేము స్వేచ్ఛగా మాట్లాడుకోవడానికి సీబు అడ్డు పడుతున్నాడను కొన్నప్పుడు, ఏదో ఒక పనిమీద దూరంగా పంపేవాడు. అప్పుడు మేము ముగ్గురం సంతోషంగా మాట్లాడుకోవడానికి వీలుపడేది. మధ్యమధ్యలో తినడానికి ఏదో ఒకటి పెట్టి, సాయంకాలం పూట పెందలకడనే నిద్ర పుచ్చేవారు. మా ఆరోగ్యంకోసం నన్ను, శకుంతలను మధ్యాహ్న సమయంలో నిద్రపో నిచ్చేవారు. శకుంతల పెద్దవరుపు మీద ఆమె కందుబాటులో పడుకొని అమ్మకిచ్చిన వాగ్దానాన్ని నిలబెట్టుకోలేక పోయాను.

ఆదివారం సాయంకాలం మా స్నేహితులకు, నాకు మధ్య వియో గానికి భగవంతుని సంతాపం వలె ఆకాశం మేఘాచ్ఛాదితమై తుంపర చినుకులు పడ్డాయి. టీ సమయంలో నా కిష్టమైన తీపి పదార్థాలు శకుంతల చేసి పెట్టింది. సామాన్లు సర్దడం పూర్తి అయిన తర్వాత వరండాలో కూచొని సుష్టుగా భోంచేశాము.

ఇలా తీరికగా కూచొన్న సమయంలో డాక్టరుగారిని నేను అడిగాను. 'మా నాన్నతో మొన్నటిలాగా సైనిక శాసనం గూర్చి మాట్లాడు తారా? మీరు వెళ్లిన తర్వాత మీ సంభాషణవల్లనైనా కనీసం నాపట్ల దయగా ప్రవర్తిస్తాడు మా నాన్న. నేను ఎంతో కష్టపడి మన స్థితి గతుల్ని గూర్చిన సత్యాలను తెలుసుకొన్నాను. అందువల్ల నేను ఈ విషయంలో వెనక్కి వెళ్లలేదు.'

'నిజమే!' అంటూ డాక్టరు ముఖం కోపంతో ఎర్రబడటం గమనించాను. "బాబూ! నువ్వు నమ్మకపోవచ్చు. ఆంగ్ల ప్రజలంతా ఈ అధికారుల చర్యలను సిగ్గుతో తలవొంచుకొనేటట్లుగా ఈ సైనిక శాసనాధికారులు భయంకరమైన పనులు చేశారు." ఊపిరి పీల్చుకోవడానికి ఒక్కక్షణం ఆగి — 'నీ వొక్కడివేగాదు, వందలాది చిన్నపిల్లల్ని హింస పెట్టినందుకు తప్పనిసరిగా మీ నాన్న జాలి చూపుతారు.'

తన భార్య పళ్లెంలో తెచ్చిపెట్టిన వేడివేడి దోసె తిని, తేనీరు తాగి అన్నాడు. 'ఆ గాడిద ఓబ్రెయిన్‌కు తోడు, కసూరులో పాలనాధికారిగా కెప్టెన్ డొవ్టన్ అనే వాడు ఉండేవాడు. అనేకరకాలైన శిక్షణలను కనిపెట్టిన మేధావి అతడు. జనరల్ డయ్యర్ వలె నేలమీద పాకే శిక్ష విధించి, ప్రజలు నేలమీద పాకేలా చేశాడు..... అతడు తెల్లనున్నంతో మనుష్యుల శరీరాలు కాలిపోయేంత వరకు వెల్లవేయించాడు. తలమీద టోపీ పెట్టుకొని తనముందు నాట్యం చేసేలా చూశాడు. తాను పట్టుకొన్న ఒక విప్లవ కవిచేత, తన గౌరవార్థం ఒక గీతం వ్రాయించాడు. తన న్యాయవిచక్షణను ప్రజలు ప్రశంసించారని ప్రగల్భాలుపలికాడు. వాళ్లు పరుగెత్తి పోకపోవడంతో వారి కృతఘ్నతకు గుర్తుగా వారి ఆస్తులను స్వాధీన పరచుకొన్నాడు.'

'మీరు అది తినండి. ఈ కుర్రవాడు, మీరూ మరీ కఠినంగా తయారు కాకండి' అంది శకుంతల.

'ఈ విధానమైన పశుత్వాన్ని గూర్చి తెలుసుకొనికూడా ఎలా మౌనంగా ఉండేది? ఈ కుర్రవాడు దేశభక్తుడుగా పెరగాలి.' అని సమాధాన మిచ్చాడు డాక్టరు: 'కృష్ణా! నీవు మమ్మల్ని ప్రేమిస్తున్నందుకు నిదర్శనంగా నీ వొక ప్రతిజ్ఞ చెయ్యాలి. మనకు స్వరాజ్యం వచ్చేంతవరకు ఆంగ్లేయులతో పోరాడుతానని చెప్పాలి.'

'నేను ప్రతిజ్ఞ చేస్తున్నాను.' అన్నాను గందరగోళంలో.

'కాని, గాంధీజీ చెపుతున్నారు — నేను నా శత్రువుల్ని ప్రేమిస్తున్నానని. కాబట్టి మీరు అహింస నవలంబించాలని గుర్తుంచుకోండి!' అంది శకుంతల పట్టుదలగా.

'నీకు నా ప్రేమ తెలుసు. కుడిచెంప మీద దెబ్బవేస్తే, ఎడమ చెంప చూపించిన ఎందరినో వారి బలి తీసుకొన్నారు. రోమను సైని కులు ఏసుక్రీస్తుకు చేసినదదే!......... రోము సామ్రాజ్యంలో అధికా రుల కంటె ఓబ్రెయినులు, దేవటనులు, బాస్‌వర్త్-స్మితులు భిన్నంగాదు. ఇక్కడ కూడా ఎందరో ఏసుప్రభువు లున్నారు. షేకుపురాలో బోస్ వర్త్‌స్మిత్ పరిపాలిస్తున్నాడు. రెండు వారాల కాలంలో దాదాపు 500 మందిని తన స్వంతభవనంలో బహిరంగ విచారణ జరిపి కొరడాలతో కొట్టించాడు. తన బంగళా న్యాయస్థానంతో సమానమని అతని ఉద్దేశం. తనముందు ప్రతి వొక్కరూ నేర మంగీకరించారంటాడు. ఎర్రగా వున్న ముఖం నేరం అంగీకరించినట్లు కనిపిస్తుంది. అతని ముఖం అలాంటిదే'

నౌషిరాలో నా మీద బెత్తం ఝుళిపించిన కన్నింగ్‌హాం దొరచూపు స్ఫురణకు వచ్చింది నాకు.

'ఈ ముగ్గురు ప్రముఖులు చిన్న వారిమీదికన్నా, పెద్ద వారి మీద కఠినంగా ప్రవర్తించారు. ప్రభుత్వ జెండాకు రోజుకు మూడుసార్లు వందనం చేయవలసిందిగా పాఠశాల విద్యార్థులను పురమాయించారు. ఈ ఆజ్ఞ చిన్న తరగతుల మొదలు 9,10 తరగతులవరకు వర్తిస్తుంది. ఎండవేడికి పిల్లలు స్పృహతప్పిపడ్డారు. కాని, వారు వదలలేదు. వారిని మాటిమాటికి ఈ మాటలు వల్లించమన్నారు:'

'నేను ఏమీ తప్పు చెయ్యలేదు: నేను తప్పు చెయ్యను. నేను వల్లిస్తున్నాను, నేను వల్లిస్తున్నాను.' ఆంగ్ల ప్రభుత్వంపట్ల గౌరవం ప్రక టించడానికి ఇది మార్గమని వాళ్లు భావించారు.

'ఇంకచాలు, నేను ఇప్పుడే చేసిన యిది తినండి'— అంది శకుంతల.

నేను నా చేతులు చాచి, ముఖం పైపెకి చాపి, పెద్ద కుర్చీ మీదకూచొని, పడుకొనే వీలులేక, భయంతోకూడిన ఉద్వేగంతో ఏదో చేద్దామనుకొన్నాను. ఆకాశంకేసి చూస్తున్న నా రెండుకళ్లు మరింత వెలుతురు కోసం చూస్తున్నాయి. ప్రకాశానికి నేను నోచుకోలేదు. నా తల తిరిగి పడిపోయేటట్లు అనిపించింది.

శకుంతల యిది గమనించి తన చేతుల్లోకి నా తల తీసుకొంది.

వారి నిద్దరినీ వదలివెళ్లే సమయం ఆసన్నమైంది. వారిని జీలం రైలుస్టేషనులో వీడ్కోలుచెప్పడానికి నేను, శివ, అమ్మ, నాన్న, మా కుటుంబమంతా వెళ్లాము.

సతమతమవుతున్న రైతన్నలు, మొరటుగావున్న దుకాణా దారులు రైలుస్టేషను నిండావున్నారు.

సైనిక శాసనం వల్ల ఏర్పడ్డ అంతరాయంతో గత కొద్దినెలలుగా నడవని రైళ్లు యిప్పుడిప్పుడే నడుస్తున్నట్లున్నాయి. తమ పనులు ఆగి పోయిన ప్రజలు తిరిగి మొదలెట్టారు.

'ఇప్పుడు మీ చెల్లెల్ని మా కృష్ణకు యిస్తారను కొంటాను.' అంది అమ్మ శకుంతలతో ఆప్యాయంగా.

'అమ్మా! పిచ్చిగా మాట్లాడకు.' అన్నాను.

'ఈయన తన ఆదర్శాలను అమలు జరిపితే, ఆవిడ స్వయంగా వచ్చి అడుగుతుంది.' అంది శకుంతల.

స్టేషను వరండా నా తల మీద కూలినట్లు తోచింది. రైల్వే వారి యిళ్లు అన్నీ భూకంపంలో వూగినట్లు నా కళ్లముందు కదిలాయి. జ్వరం గాలిలో కలిసిపోయింది. కాని దాని ప్రభావం నా మీద యింకా చూపుతోంది. వ్యాధిగ్రస్తునివలె నాలో బలహీనత కల్గింది. సూర్యాస్త మయం ఆకస్మికంగా వచ్చినట్లు కనిపించింది. కొంచెం సేపట్లో నా స్నేహితులు వెళ్లిపోతారు. నేను నా భావాలతో మిగిలిపోతాను. నేను ప్రోదిచేసిన భావాలతో నేను వొంటరిగా మిగిలి పోతాననే విషయం నాలో భయం పుట్టించింది. నాలో అంత శక్తి వుందా? నేను చేసిన ప్రతిజ్ఞ గుర్తుకు వచ్చింది. నా కుటుంబం మీద నేను మానసికంగా జయం పొందినట్లు భావించాను. నేను ప్రేమించిన వారికి, ప్రతిజ్ఞకు మధ్య భక్తితో పొంగిపోయాను.

నాలో అసందర్భంగా వున్న ఆలోచనల్ని వెనక్కు నెట్టి ప్లాట్ ఫారం గంట మ్రోగింది. వాళ్లు త్వరలో వెళ్లి పోతారు. నా కడుపులో దేవినట్లుగా వున్న మామూలు పరిస్థితి ఏర్పడింది.

మేము చూస్తుండగానే యింజను కూత పెట్టింది. నేను కూడా యింజను కూతతోబాటు వెళ్తునట్లుగా భావించాను.

తాము కూచొనేందుకు స్థానం దొరుకుతుందో లేదోననే అస్థిరత్వంతో దుకాణా దారులు, రైతులు దాని వెంబడి పరుగెత్తుతూ కేకలు వేస్తున్నారు.

సూర్యాస్తమయకాంతిలో శకుంతల ముఖం పాలిపోయింది. అమ్మ ఆమెను కౌగలించుకొని వీడ్కోలు సూచకంగా కంట తడ బెట్టింది. శకుంతల స్థిమితంగా వున్నట్లు కనిపించినా, దుఃఖం ఆపుకోలేక, తన ముఖం పైకప్పుకొన్న చెరగు తొలగించి కన్నీరు కార్చింది.

ఆవిడ దుఃఖాన్ని చూడలేని నేను, నిరాశతో ముందుకు పరుగెత్తాను. ఆ సమయానికి తగినట్లుగా ఏడవాలని వున్నా ఏడవలేక ఆమెను వెళ్లి కరచుకొన్నాను.

కూలీలు వెంటరాగా డాక్టరు, మా నాన్న, స్టేషనుమాష్టరు పెట్టెవైపు వెళ్లారు.

తినుబండారాలు అమ్మేవారి అరుపులతోబాటు, పొడగరులు, మొహమాటంలేని వారు అయిన రైతుల పంజాబీ యాసతోకూడిన భాషను విన్నాను.

శకుంతల శివను ఎత్తుకొని ముద్దుపెట్టుకొని, వాడి చేతిలో ఒక వెండినాణెం పెట్టి, చేయి మూసివేసింది. తర్వాత నా దగ్గరకు వంగి, ఆమె బుగ్గను నా బుగ్గతో నిమిరింది. అలాచేస్తే నాకు యిష్టమని ఆమెకు తెలుసు. నా జేబులో వందరూపాయల కాగితం పెట్టింది.

'చిన్నా! నేను చనిపోయినా నన్ను అభిమానిస్తానని వాగ్దానం చేస్తావా?' అంది.

'నీ కోసం నేను ఏ త్యాగమైనా చేస్తాను. అలాంటి మాట అనకు' అంది అమ్మ.

నా ముఖాన్ని ఆమె నునుపైన ముఖంతో అదిమాను. వూపిరి

గుసగుసలే మా సంభాషణ. ఆమె మరణించే క్షణంలో నేను కూడా మరణిస్తానని నావైపు మాటయిచ్చాను. లోలోపల నేను చనిపోవడం యిష్టం లేదనే క్రూరమైన తలపువుంది. అందువల్ల ఆమె చనిపోవడం యిష్టంలేదు. నా ఆత్మహత్యా వొప్పందం ఆవిడతో కుదుర్చుకోలేదు. ఆవిడ వెళ్లవలసి వస్తుందనే దుర్భరవేదనతో నా కళ్లవెంబడి నీళ్లు దొర్లాయి.

చునీలాల్ ఆమెకోసం తిరిగి వచ్చాడు. ఆమె మీద నేను ఆధార పడి వుండటాన్ని వ్యక్తపరిచే ఒక అద్భుత పదం వుంటే బాగుండునని తోచింది. ఆవిడ చనిపోవడం నాకిష్టం లేదని చెప్పాలని వుంది. కౌసల్యను తీసుకెళ్ళినట్లుగా ఈవిడకు జరుగకూడదు. నా మూగ ప్రపంచంలో మాటలన్నీ మిగిలి పోయాయి. నేను ఆరాధించిన స్త్రీలు — దేవకి, ముంతాజ్, శకుంతల దయ్యాలరూపంలో అందులో నివసిస్తున్నారు. ఈ వేర్లమీద అస్పష్టమైన మేఘంవలె మృత్యువు వెంటాడుతోంది.

ఇంజను పొగవదిలింది. మరో పొగరావడంతో మేము ఒకరి నొకరు ఆప్యాయంగా చూశాము.

'రాజకీయాలు ముదనష్టమైనవి' అన్నాడు నాన్న డాక్టరుతో సగం క్షమాపణ ధోరణిలో మిగతా సగం లౌక్యం ప్రదర్శిస్తూ.

'రామచంద్రగారూ! జీవితమంటే.......... ఔను జీవితమంటే ప్రభుత్వోద్యోగమే కాదు.'

గార్డు విజిల్ వూదాడు.

ఇంజను కూతవేసి పొగవదిలింది. రైలు నెమ్మదిగా బయులు దేరింది.

నా నాలుకపై ఇంజను పొగ అలుముకుంది. కన్నీళ్ళురాని చూపులతో నేను నిలుచుండగా నా కళ్ళముందు స్టేషను కూలిపోయినట్లుగా నా శరీరం వణక సాగింది.

నాకు ఎందుకు ఏడుపురాదో ఆశ్చర్యం వేసింది.

# 13

డాక్టరు చునీలాల్ దంపతులు వెళ్లిన తర్వాత, ప్రభుత్వోద్యోగం గురించి నాన్న తన అభిప్రాయాలను డాక్టరు మాటల ధోరణిలో ప్రతి ధ్వనింప చేస్తూ మాట్లాడారు. కొద్దినెలల క్రితం పర్వతప్రాంతీయులు తిరుగుబాటు జరిపినందుకు భాగస్వామిగా నాన్నపై న్యాయవిచారణచేసి ఆయన నిర్దోషి అని నిర్ధరించారు. దళంలో తగాదాలు అంతటితో సమసి పోయినట్లు కనిపించలేదు. ఈజిప్టులో విధులు నిర్వర్తించి దళాలు తిరిగి వచ్చిన తర్వాత డోగ్రా గుమాస్తాలలో ఒకరిని హెడ్‌గుమాస్తాగా నియ మిస్తారని అనుకోసాగారు. బాబూ రామచంద్రను తప్పనిసరిగా పదవీ విరమణ చేయిస్తారని, డోగ్రా అధికారులు వదంతిని బాగా వ్యాప్తి జేశారు. నన్ను,శివను రెజిమెంట్ వీధిలో వ్యాపారస్తులు ఈ విషయం గురించి ప్రస్తావించి, 'అమృతసర్ వెళ్లడానికి మా కుటుంబం వారు సామాన్లు సర్దు కొంటున్నారా?' అని అడగ సాగారు.

దళం వారంతా తిరిగి వస్తున్నారని, కవాతు జరుగుతున్నపుడు మేజర్ ట్రయిల్ వచ్చీరాని హిందూస్తానీ భాషలో చెప్పిన విషయాలను నాన్న తన మాటల సందర్భంలో చెప్పేవారు. 'ప్రతిభ మీద ఆధారపడి, సేవలను గుర్తించి ఉన్నతపదవులు లభిస్తాయి. ' 'ఆఫీసుకు సంబంధిం చినంత వరకు, మెట్రిక్ కూడా ఉత్తీర్ణులుగాని డోగ్రాగుమాస్తాల ఏదో లభిస్తుందని ఆశపడడం వృధా.' 'యుద్ధరంగానికి వెళ్లిన వారు మెట్రిక్ పూర్తి చేయనప్పటికీ, గుమాస్తాలలో ఒకరిద్దరికి ఉన్నత పదవులు లభించే అవకాశాలున్నాయి.' నాన్న పదవికి సంబంధించినంతవరకు ప్రధానమైన ప్రమాదం తప్పి పోయినప్పటికీ కొద్దిపాటి చిక్కులు యింకావున్నట్లు నాన్న అమ్మతో ఫిర్యాదు చేసిన మాటల ద్వారా తెలిసింది:

'ఈ వెధవ ప్రభుత్వం అనిశ్చితమైంది. అది ఎవరిమీద మొరుగు తుందో, ఎవరిని కరుస్తుందో చెప్పలేం.' అనేవారు.

అమ్మ తానే తెలివిగలదానిగా వ్యవహరించి, మామూలుగా మాట్లాడే

పదాలు పునశ్చరణ చేసేది

'మా నాన్న అంటుండేవారు 'వ్యవసాయం అత్యుత్తమం. ఆ తర్వాత వ్యాపారం, అన్నిటికంటె అధమం ఉద్యోగం' అని.'

చివరకు ఒకనాటి సాయంకాలం నాన్న కూరలో ఉప్పుతగ్గిందనీ, చపాతీలు సరిగా కాలలేదనీ, భోజనం రుచిగా లేదనీ ఫిర్యాదు చేసినప్పుడు, అమ్మ న్నాన్నవైపు తేరిపారజూసి అడిగింది

'ఈ మధ్య మీ కేమైంది? భోజనం ఎప్పటిలానే వుంది మన యింట్లో. అధమంగానూ లేదు, అతిరుచికరంగాను లేదు. ఇంటి ఖర్చులకు మీరిచ్చిన డబ్బుతో యింతకంటె నేను బాగా చెయ్యలేను '

నాన్న క్షణకాలం మౌనంగా వుండి, ముఖం చిట్లించారు. పిల్లల ముందు ఆయన గౌరవాధిక్యాలను చాటడానికన్నట్లు సత్యం మొరటుగా బయట పడింది.

'వాస్తవమేమిటంటే, మనం యిల్లు ఖాళీచేసి, పక్కవీధిలో రెండు గదుల యింట్లోకి మారాలి. అక్కడ సన్నజాతి వారి కుటుంబాలు అన్నీ ఉన్నాయి. డోగ్రా అధికారులకు ఈ యిళ్లు కేటాయించారు. ఇంటి వసతి చాలా కష్టంగా వుంది - అందువల్ల ఒక్కొకయింట్లో ఇద్దరు చొప్పున ఉండాల్సివస్తుంది. ఇందులో నాకు అవమానం ఏమీ లేదు. మన తర్వాత బాబూ చత్తర్ సింగును కూడా ఖాళీ చేయిస్తారు. చదువుకొన్న వారందరు, బానిసలతో సమానంగా చూడ బడతారనేది నిజం.'

'సరే!' అంది అమ్మ వేదాంతిలా: 'అయితే నాకిక మీదట సామాన్య స్త్రీలతో కాలక్షేపం అవుతుంది. ఇన్నాళ్లు జనసామాన్య జీవితానికి దూరంగా వుండిపోయాము. పిల్లలకు కూడా వాళ్ల తోడి బాలురతో ఆడుకొనే అవకాశం దొరుకుతుంది. తమపై తిరుగుబాటు చేస్తారేమో నన్న అనుమానంతో చూసే సిపాయిల చూపులు తొలగిపోతాయి.'

'ఈ సాధారణజనాల యిళ్లు చాలా చిన్నవి... అయితే మనం యింటి మధ్యలోవున్న గోడ పడగొట్టి గదిని కొంత విశాలం చేయ

వచ్చు...... తన అస్పృశ్య సోదరులతో ఆడుకోవచ్చుకాబట్టి కృష్ణకు సంతోషంగా వుంటుంది.' అన్నాడు నాన్న.

నా గాంధేయ భావాలపట్ల మొరటుగా వ్యవహరించ వద్దని డా. చునీలాల్ చెప్పిన మాటలు నాన్నపై కొంత ప్రభావం చూపాయని, ఆయన నన్ను పేరుపెట్టి పలకరించడంతో అవగతమైంది. ప్రభుత్వం చేతిలో ఆయన బాధలు అనుభవిస్తున్నప్పటికీ, ఆయన నాపట్ల మృదువుగా ప్రవర్తించాడు తన ఉనికికీ ఇబ్బంది కలిగించే రీతిలో వున్నందున నాపట్ల, దళంలో తన హోదా, అధికారము అన్నిటికంటె అధికమని భావించడంవల్ల, అధికారపక్షంపట్ల — ఆయన అలా ప్రవర్తించారు. ఆయన మీద నేను చేసిన వ్యాఖ కఠినమైందని నా బుర్రకు తట్టింది.

తెచ్చి పెట్టుకున్న గర్వంతో కరడుగట్టిన ఆయన మనసు కంటె యవ్వనోల్లాసంతో మత్తెక్కిన నా భావాలను అర్థంచేసుకో గలిగాను. బాల్యంలోంచి యవ్వనంలోకి అడుగు పెడుతున్నానన్న ధ్యాస నన్ను తొందర బొందర చేసి యోగ్యత అనే పొగరుబోతు భావన నా బాధ్యతలను గుర్తు చేసింది.

* * *

విశాలమైన మా ఎదురింటి చెట్ల నీడలో మా నాన్న మంచం వాల్చుకొని మధ్యాహ్న భోజనానంతరం కునుకు తీసేవాడు. మా కొత్త యింటి గోడ నీడలో గుట్టలు చదును చేసి - తన హోదాను నిలువు కునేందుకు, చుట్టు పక్కల అస్పృశ్యులకంటె ఆధిక్యత నిరూపించు కునేందుకు, పగటి నిద్రకు అక్కడ శుభ్రం చేశారు. బడి తెరవగానే అమృతసర్ నుండి గణేశ్ తిరిగి వచ్చాడు. వాడు, నేను, శివ అల వాటు ప్రకారం మా గుడ్డలన్నీ విప్పి పల్చటి గుడ్డలు వేసుకొని నాన్న నిద్రబోయే సమయంలో చాపమీద కూర్చుని పాఠాలు చదువుకునేవాళం.

తక్కువ హోదా కలవారి సందులో నివసించడానికి వచ్చాం గాబట్టి నాతో బాటు చదువుకుంటున్న ఇనుముతుల్లా, బాబూ కుషీరామ్ బంధువు భగవాన్ సింగు మా పక్క యిళ్ళలోంచి వచ్చి మాతో కలిసే వారు. మహ్మద్ అఫ్జల్‌కు శుభ సాదిక్ (సుబేదార్ మేజర్ అహమ్మద్

ఖాన్ కొడుకులు) మధ్య పోటీ భావం ఆ విధంగా అధికమైంది. హాకీ ఆటకు రెఫరీగా వ్యవహరించడానికో, సైకిలు మీద పట్టణానికో, స్నేహితులతో కబుర్లకో నాన్న వెళ్ళినప్పుడు మేము హాకీ కర్రలు గానీ, క్రికెట్టు బాట్లుగానీ బయటికి తీసే వాళ్ళం. ఆ సమయంలో మాతో బాటు దళానికి చెందిన మిగతా బాలురు — బాకా, రామచరణ్, చోటా, ఆరవ తరగతిలో రెండుసార్లు తప్పి దళానికి చెందిన బాండు మేళంలో (డమ్కు వాయించడానికి ఇటీవల ఉద్యోగంలో చేరిన) అలీ మాతో కలిసేవారు. క్లారెనట్ వాద్యంవాయించే, వంకీలు తిరిగిన జుత్తు కల క్లైటన్ మాకు రెఫరీగా వ్యవహరించే వాడు అతడు ఎక్కువ భాగం అధికారులకు సేవలు చేసేవాడు.

బ్యాండు మేళానికి చెందిన హవిల్దార్ మౌలాభక్ష్, క్లారెనెట్ వాద్యగాడు జిమ్మీ, బ్యాండు మాష్టరు జోన్సు మా ఆట తిలకించే వారు నా మనస్సులో గతానికి చెందిన స్మృతులు హిమాలయాల వలె భారంగా తోచాయి అస్పృశ్యులకు స్వేచ్ఛను ప్రసాదించటం గురించి గాంధీ వుద్బోధలు చేప్తూ బాకాతో కలిసి నదివైపు వెళ్ళేవాణ్ణి. తాను అస్పృశ్యుడననే భావం మరిచిపోయి తల ఎత్తుకుని తిరిగి తన భౌతిక వాసనలను కవిత్వరూపంలోకి మార్చడానికి బాకాను ప్రోత్సహించాలని నాలో రహస్యమైన వాంఛ చెలరేగింది.

ఒక్కొక్కసారి ఆట అయిపోయిన తర్వాత బాబూ కుషీరామ్ నివసించే రెజిమెంటులు బజారువైపు అనాథ అయిన భగవాన్ సింగుతో కలిసి అమ్మకు పచారీ సామానులు తెచ్చే నెపం మీద వెళ్ళే వాడిని. సాయంకాలాల్లో మేము చెట్టాపట్టాలు వేసుకుని అలంపూర్‌లో స్నేహంగా వుందామని చేసుకున్న వాగ్దానం మేరకు కలిసి తిరిగే వాళ్ళం. ఆ తిరిగే సమయంలో హరిహర బాబాయి మాటలను ప్రశంసిస్తూ డాక్టరు చునీలాల్ నాతో చెప్పిన అన్ని విషయాలనూ అతనికి రహస్యంగా చెప్పే వాడిని. బాబూ కుషీరామ్ తనలో కలిగించిన భయాందోళనలను త్రోసి పుచ్చి దక్షిణాఫ్రికాలో తాననుభవించిన జీవితాన్ని గురించి చెప్తూ వుంటే ఆశ్చర్యంవేసింది. భారతదేశానికి రావడానికి ముందు వాళ్ళనాన్న ఆ దేశవాసి. ఆయన గాంధీని ఎలా చూడగలిగిందీ అతను చెప్పాడు.

హబ్బీలుగా పిలువబడే నీగ్రోలు మనకంటె కొంచెం నల్లగావున్నప్పటికీ మన వంటి వారేనని, తెల్లవారికి వ్యతిరేకంగా గాంధీ వారి పక్షం వహించా డనీ తెలుసుకున్నాను. తన సొంత తల్లి చనిపోయిన తర్వాత నీగ్రో పనిమనిషితో వాళ్ళనాన్న కలిసి వుండేవాడని భగవాన్ సింగు చెప్పాడు.

తన సవతి తల్లి అయిన నీగ్రోవనిత తనపట్ల ఎంతో అభిమానం చూపిందనీ, వాళ్ళనాన్న చనిపోయిన తర్వాత తనను భారత దేశానికి పంపడానికి అంగీకరించ లేదని చెప్పాడు. నీగ్రోవనితతో తన తమ్ముడు సంబంధం కలిగివుండటం బాబూ కుషీరామ్ క్షమించలేక పోయాడు. నేను మాన్నను ఎదిరించడానికి సిద్ధపడినట్లే బాబూ కుషీరామ్‌ను ఎదిరించడానికి (భగవాన్ సింగ్ అభిప్రాయాలను కాలరాస్తున్నందుకు) సిద్ధపడ్డాను.

ఒకరోజు హకీఆట తర్వాత ఇస్మతుల్లా, భగవాన్ సింగు నాతో వచ్చారు. దక్షిణాఫ్రికాలో భారతీయులను ఆఫ్రికనులను తెల్లవారు ఏ విధంగా అస్పృశ్యులుగా భావిస్తున్నారో తెలియ జెప్పమని భగవాన్ సింగును కోరాను. గతకొద్ది మాసాలుగా యిస్మత్ అమృతసర్‌లో నేను దెబ్బలు తిన్నందుకు నన్ను ఆరాధనా భావంతో చూస్తున్నట్లు చెప్పాడు. అలీ సోదరులతో గాంధీ స్నేహం చేసి అస్పృశ్యులను వుద్ధరించడానికి సమ కట్టి నందుకు తనకెంతో సంతోషంగా వుందని చెప్పాడు. మమ్మల్ని కొట్టినా తిట్టినా నానా దుర్భాషలాడినా, మా విప్లవ భావాలపట్ల సాన్నిహిత్యంతో విశ్వాస పాత్రమైన స్నేహితులముగా వుండి పోవాలని చేతులతో చేతులు వేసి ముగ్గురమూ ప్రమాణాలు చేశాము.

ప్రమాణం చేసిన తర్వాత మాలో ప్రతి ఒక్కడూ తనలోని రహస్య వాంఛలు వెలిబుచ్చాడు. కష్టపడి చదివి మెట్రిక్కు ప్రథమ శ్రేణిలో నెగ్గి హరిహర బాబాయివలె బడిపంతులు వుద్యోగం చేసి దక్షిణా ఫ్రికాలోని బంధువుల అమ్మాయిని తను వివాహమాడాలనుకుంటున్నట్లు భగవాన్‌సింగు చెప్పాడు. తన బాబాయిలు దక్షిణాఫ్రికాలో వున్నారనీ భారతీయులకూ హబ్బీలకు సేవ చేయడానికి దక్షిణాఫ్రికా మోటారు సైకిలుపై వెళ్లానని వుందన్నాడు — ఇస్మతుల్లా. విప్లవకారుడు లాలా హరదయాళ్ పనిచేస్తున్న జర్మనీ దేశానికి వెళ్ళాలనే కోరికను నేను

బయట పెట్టాను. అక్కడ నేను వేదాంతం అధ్యయనం చేసి ఫ్రెంచి విప్లవానికి జన్మస్థానమైన పారిస్ నగరానికి రష్యన్ విప్లవ స్థానమైన లెనిన్ గ్రాడ్ పట్టణానికి వెళ్ళ వచ్చునని నా అభిప్రాయం.

ఈ విధమైన నిష్కల్మషమైన భావాలూ, స్వప్నాలూ రకరకాల సుందర దృశ్యాలను మేము ముగ్గురమూ దర్శించేలా చేశాయి. ఈ అభిప్రాయాలను కొన్నింటిని మేము మార్గమధ్యంలో హరిచంద్ర మాష్టారుతో ప్రస్తావించాము. ఏది సంభవమో, ఏది అసంభవమో ఆయన మాకు సాధారణంగా చెప్తుంటారు. ఉదాహరణకు మామూల సిద్ధాంతాలను ఆయన అంగీకరించినప్పటికీ, తన నీగ్రో సవతి తల్లి కూతుర్ని భగవాన్ సింగ్ పెండ్లాడటం విషయంలో సందేహం వెలిబుచ్చారు మోటారు సైకిలుపై అఫ్ఘనిస్తాన్, ఇరాన్, టర్కీ, ఈజిప్టుల మీదుగా దక్షిణాఫ్రికా చేరుకోవాలన్న ఇస్మతుల్లా భావన మూర్ఖంతో కూడిన సాహసంగా ఆయన భావించారు. దారిలో పర్వతాలూ, నదులూ, ఎడారులూ వుండటమే అందుకు కారణం జర్మనీ, ఫ్రాన్సు, రష్యా దేశాలకు కాలి నడకన వెళ్ళాలన్న నా సంకల్పాన్ని ఆయన అంగీకరించలేదు. దానికి బదులు మేము ముగ్గురమూ పెద్దలు కుదిర్చిన పెండ్లిళ్లు చేసుకో కూడదనే నిర్ణయాన్ని మాష్టరు హరిచంద్ర అంగీకరించారు. వీలైనన్నిసార్లు కలిసి భోంచేసి హిందూ, ముస్లిమ్ సఖ్యతను బలపరచాలనే అభిప్రాయాన్ని ఆయన సమర్థించారు. మీ ప్రయత్నాలను సరిదిద్దుకునేలా నన్ను ఇస్మత్తును కవిత్వం వ్రాయడానికి మా మార్గదర్శి, స్నేహితుడూ అయిన ఆయన అంగీకరించారు. బడినుండి తిరిగి వచ్చేటప్పుడు ఆయన తప్పని సరిగా భగవాన్ సింగును పహాడీ జానపద గీతం పాడమని కోరేవారు.

మా ముగ్గురినీ హరిచంద్ర మాష్టారు అభిమానించటం మాతోడి విద్యార్థులపై పరోక్ష ప్రభావం చూపింది. మేము చెప్పిన ప్రతి విషయాన్ని వారు శ్రద్ధతో వింటున్నట్లుగా, మా అభిప్రాయాలతో ఏకీభవిస్తున్నట్లుగా నటించేవారు. వారి మనసుల్లో వారి తల్లిదండ్రులు, ఉపాధ్యాయులూ చెప్పినట్లుగా విప్లవభావాల పట్ల భయం మాత్రం వుండేది.

ఎలానైతేనేం పంజాబ్‌లో జరిగిన సంఘటనల ప్రభావం వల్ల కుర్రవాళ్ళమందరమూ పెరిగి వ్యక్తులంగా మారాము. నాటకీయంగా జరిగిన

సన్నివేశాలను గురించిన వదంతులు, వార్తలు ఆయా మార్గాల ద్వారా మాకు అందినపుడు మేము ఉత్సాహభరితులమై వాటివల్ల కలిగే ఫలితాలను గూర్చి భయపడే వాళ్ళం. మేమూ ప్రధానమైన గంభీర వ్యక్తులమైనట్లు, ఆత్మతృప్తిగల యువదేవతలముగా భావించసాగాము. సర్వాంతర్యామియైన ఆంగ్లప్రభుత్వ పునాదులను హరించి బహిరంగంగా ప్రశ్నించలేక పోయి నప్పటికీ మాలో భావసంఘర్షణ చెలరేగింది. మహోన్నతమైన విదేశీ ప్రభుత్వ చిహ్నాలు మా ఆంతరంగిక భావాలతో సంఘర్షణ పడేవి. విశాల విశ్వాన్ని అదృశ్యంగా ఆవరించిన తెల్లదొరల కఠిన శాసనాన్ని ప్రత్యేకించి కంటోన్మెంటులో చూచినందువల్ల మాకలా అనిపించింది. రవి అస్త మించడని పేరు గాంచిన బ్రిటీష్ సామ్రాజ్య విశాలవినీలాకాశంలో సూర్యుని ధిక్కరించేలా గాంధీ వెలిగించిన మాలోని చిన్నచిన్న సూర్యులు, చిరుదివ్వెలూ కాంతి వంతమయ్యాయి. నా లోలోపల పిరికితనం ఆవ హించినపుడు గాంధీని గురించిన ఆలోచన, ఆంగ్ల ప్రభుత్వాన్ని ఆయన ధిక్కరించిన విధమూ, నాకు ధైర్యాన్ని కలిగించేవి ఆయన విశాలమైన చెవులు నాకు నచ్చకపోయినప్పటికీ ఆయన మాటలను చిలక పలుకుల్లా వల్లించాను.

మా అమ్మ చెప్పిన కథలోని సాహస వీరుడు రాసలు రాజా తన కళ్ళముందున్న ప్రపంచాన్నీ, మార్గమధ్యంలోని దుర్గమాలను అధిగమించి రాక్షససంహారం లేకుండా జయించినట్లు నన్ను గురించి నా కనిపించింది. ఉత్సుకతతో నిండిన నాకళ్ళలో బాహిర్విషయాలు అనంతమైన హిమా లయ పర్వతాలవలె ముందువచ్చి నిలిచేవి.

నాన్న నాపట్ల సానుభూతిగా ప్రవర్తించటం గమనించాను. పర్వత ప్రాంతీయుల తిరుగు బాటు తర్వాత సైనిక న్యాయస్థానంలో నాన్న ఉద్యోగం వూడిపోయి వుండొచ్చుందనీ, లేదా దళంలోని ఆయన వ్యతిరే కుల చిక్కులవల్ల ఆయన బలవంతంగా రాజీనామా చేసివుంటారనీ నేను గమనించాను. అలా జరిగివుంటే డాక్టరు చునీలాల్ వలె ఆయన కంటోన్ మెంటు వదిలి వెళ్ళవచ్చు. నాయిష్టం వచ్చినట్లు నేను మాట్లాడవచ్చు, పనిచేయవచ్చు. అపుడు బాబూ రామచంద్ర కుమారుడు తిరుగు బాటు దారుడని దొరలకు ఫిర్యాదు చేసే అవకాశం ఎవరికీ లభించదు.

దురదృష్టవశాత్తు దళంలో నాన్న పరిస్థితి దుర్భరమయేలా సంఘటనలు కుట్రదారులు మలిచారు. నా కంటిముందు మెదిలే క్రూరాత్ముల అన్యాయాలకు బలి కావలసి వచ్చింది. విశ్రాంతిలేని నా జీవితంలో పై కెదిగి స్థిరపడి బుద్ధిమంతునిగా మెలిగే అవకాశం నానాటికీ నశించి నా గుండెలో మౌనగీతాలు, విషాదమూ, ఆవరించాయి.

యూరపులోనూ మధ్య ప్రాంతంలోనూ గత నాలుగు సంవత్సరా లుగా జరిగిన యుద్ధంలో పనిచేసిన 38వ డోగ్రా దళం హెడ్ గుమాస్తా బాబూ తీనూరామ్ ఈజిప్టు నుండి తిరిగి వచ్చాడనీ తెలిసింది ఆయన నోట్లో తుపాకి పెట్టుకొని స్వయంగా కాల్చుకొని ఆత్మహత్య చేసుకున్నా డనే వార్త పొక్కింది. బాబూ తీనూరామ్ మా నాన్న మధ్య మంచి సఖ్యత వున్నప్పటికీ, విద్యార్హతలను బట్టి రెజిమెంటు కార్యాలయంలో ఉన్నతి పదవులు లభిస్తాయని మేజర్ ట్రయల్ సూచించినప్పటికీ, ఈ పెద్దమనిషిని నాన్న వ్యతిరేక వర్గం వారు హెడ్‌గుమాస్తా పదవికి పోటీగా నిలబెట్టే అవకాశం లేకపోలేదు (బాబూ తీనూరామ్ నిజా నికి సరియైన ప్రత్యర్థి కాదనే తృప్తివుంది) ఇప్పుడు ఆ భయం కూడా తొలగిపోయింది.

తీనూరామ్ ఆత్మహత్య నాన్నను మూగవాణ్ణిచేసింది. చాలా రోజులు ఆయన మౌనంగా వుండిపోయారు. ఆయన దుఃఖం నిజ మైందో కాదో, మేమెవరూ గ్రహించలేక పోయాం.

కొంతకాలం తర్వాత ఆ సందర్భాన్ని గురించి అమ్మతో చేసిన వ్యాఖ్యానం బట్టి ఆయన మానసిక స్థితి గ్రహించాము

'తీనూరాం మంచివాడు ఆ ఉద్యోగానికి మెట్రిక్ పూర్తి చేయా ల్సిన అవసరం లేదు. ఆ ఖాళీకి చత్తర్‌సింగు కంటె అతడు మంచి నేర్పరి. అయితే సుబేదార్ అజిత్‌సింగ్ వంటి వాళ్లు అతణ్ణే నా మీద ఎదురుపావుగా నిలబెట్టడానికి ప్రయత్నించి వుండేవారు. ఇలా అతగాడు ఎందుకు చేశాడో అర్థం కావడం లేదు.'

నిండుగా, ఎప్పుడు నవ్వుతూ, సగం బట్టతలతో వున్న బాబూ తీనూరాం గుర్తుకు వచ్చాడు. అతడు మాకు తియ్యని, పుల్లని మామిడి

పళ్ల తాండ్ర, బొమ్మలు తెచ్చిపెట్టేవాడు. నౌషిరాలోని బారకాసుల వద్ద గాని, మరెక్కడైనాగాని కనిపించినప్పుడు మమ్మల్ని ఆప్యాయంగా నెత్తిమీద కూచోబెట్టుకొని తిప్పేవాడు. నోట్లో తుపాకి పెట్టుకొని నిల బడ్డ బాబూ తీనూరాం విగ్రహాన్ని నా కళ్లముందు వూహించుకోసా గాను. రాత్రిపూట అతని దయ్యం ఆకారం నాకంటిముందు ఎత్తుగా కనిపించేది. మేము యింటి బయట పడుకొనేవాళ్లం. ఒక్కొక్కసారి గురుగోరక్‌నాథ్ పర్వతానికి అరమైలు దూరంలో శవాలను కాల్చడం కనిపిస్తుండేది. అక్కడే పర్వత ప్రాంతీయుల్ని కూడా పూడ్చిపెట్టారు. ఆ భయానికి తోడు నేను అటువైపు చూసినపుడు ఈ ఇనుప చట్రం వంటి ఆకారం నాకంటి ముందు భయంకరంగా కనిపించేది. పొలాల్లో మొక్క జొన్న కంకులు, నక్షత్రాలు, ఆకాశంలో కీచుకీచుమనే శబ్దం, నాకంటిముందు దయ్యాలవలె కనిపించి, మానాన్న చేసిన పాపాలకు ప్రతిఫలంగా నన్ను ఆవహించినట్లు అనిపించేది.

కలత నిద్రలో వచ్చిన స్వాప్నిక జగత్తులో ఈ రాక్షసుల భయం మధ్యలో అమ్మను కరుచుకుని పడుకునే వాణ్ణి. నా స్నేహితులు నన్ను వదిలి పోయిన ఖాళీ భర్తీ చేయడానికి దళానికి చెందినవారు తిరి గివస్తున్నారనే పెద్దల మాటలు నాకు వినిపించాయి. ఈ గొడవలు ప్రారంభమైనది మొదలు లాహోరులో జైలు శిక్ష అనుభవిస్తున్న అమర్ నాథ్ మాష్టారు సోదరుడు లాలాకేదారనాథ్ రాకకోసం నేను ఎదురు చూడసాగాను. ఆయన నాకు నిజమైన మార్గదర్శి కాగలడు. హరిచంద్ర మాష్టారుకు చరిత్రలో మాత్రమే యిష్టంకాగా తన జీవితమంతా దానికే ధారబోసినవాడు లాలాకేదారనాథ్. ఆయన హరిచంద్ర మాష్టారు కంటె అధిక సాహసి అయివుండవచ్చునని నా అనుమానం.

దళానికి స్వాగత సన్నాహాలు పలకడానికి కార్యకలాపాలు కొద్ది రోజులుగా కొనసాగుతున్నాయి ఈజిప్టునుండి పడవ మీద ఆ దళం ఏ రోజున కరాచీకి వస్తుందో జీలంస్టేషనుకు ఏరోజున వస్తారో సరిగా ఎవరికీ తెలియదు.

చివరకు 38వ డోగ్రా దళం బొంబాయి చేరిందనే వదంతి వచ్చింది. మరునాడు నాన్నకు ఆఫీసుకు ఒక తంతివచ్చింది. ప్రత్యేకరైల్లో దళానికి

చెందిన మొదటి విభాగం వస్తున్నారని అందులో వార్త. నాన్న భోజనానికి కూడా ఇంటికి రాకుండా అహోరాత్రులూ పనిచేశాడు. మా దినచర్యలో తేడారాకుండా అందరం కలిసి వెళ్ళి బడినుండి తిరిగి రావాలని ఆయన మాకు సలహాయిచ్చారు

మా గణేశ్ మహమ్మద్ అఫజల్, శుభా సాదిక్ వంటి విశ్వాస పాత్రులైన అధికారుల కుమారులతో కసిలి హెడ్‌మాష్టరు రాజాఫజల్ మహమ్మదు ఖాన్ వద్దకు వెళ్ళాడు నాకు గానీ భగవాన్‌సింగుఇ స్మదుల్లా లకు కానీ చెప్పలేదు. రైలు స్టేషను నుండి బారకాసుల వరకు 38వ డోగ్రా దళం పదవిన్యాసం చేస్తూ వెళ్ళటం చూసేందుకు ప్రత్యేకశలవు మంజూరు చేయమని వాళ్ళు అడిగారు. రైలుస్టేషను నుండి బారకాసులవరకు దారి పొడుగునా బడిపిల్లలను వరసల్లో నిలబె డితే బాగుంటుందని ప్రధానోపాధ్యాయుడు భావించారు. నాన్న ద్వారా ఈ అభ్యర్థనను బ్రిగేడియర్ జనరల్ బర్ట్‌వుర్ట్‌కు అందజేశాడు. ఆయన వెంటనే అందుకు అంగీకరించారు.

అందువల్ల ఈ ముగ్గురు కుట్రదారులు, మిగతా పిల్లలతో కలిసి మర్నాడు ఉదయం 9గంటలకు దారిపొడుగునా నిలుచున్నారు

దళంవారు కవాతు జరుపుతూ వెళుతున్నప్పుడు మేము జేకొట్ట వలసిన నినాదాలను మా కొకగంటసేపు నేర్పారు

'చక్రవర్తి చిరంజీవ!' 'జర్మన్ కైజరు నాశనం!'

'ఆంగ్లప్రభుత్వం అలరారాలి!' '38వ డోగ్రాలకు జేజేలు.'

ఆ మధ్యాహ్నపుటెండను భరిస్తూ, మా ఉత్సాహం నశించేంత వరకు ఆనందంగా అక్కడ నిలుచున్నాం. తెల్లదొరలు ముందు నడవగా దళం కనిపించింది.

మిగతా పిల్లలు మాకిచ్చిన నినాదాలను గొంతెత్తి అరిచారు నేను ఆపదాలను గొణిగాను. ఈ పరిస్థితినుండి ఎలా బయటపడాలా అని భగ వాన్‌సింగు, ఇస్మత్ నాకేసి తేరిపారజూశారు. నాకేమీ పాలుపోలేదు. శూన్యంలోకేసి నించున్నాను. మిగతా అస్పృశ్యులతో పాటు దూరంగా

నుంచున్న రామచరణ్, బాకాలకు ఏదోఒక వార్త తెలియ జేయాలనే ఆతురత నాలోవుంది. మేము పొందిన ప్రత్యేక గౌరవాన్ని గుర్తింప్గించి చూస్తూవాళ్లు నించున్నారు. బ్యాండు మాష్టారు జోన్సు గీతం అల పిస్తూ ముందుకు వచ్చినప్పుడు నేను ముందుకు వొంగాను. తన చేతిలో కర్ర ఝుళిపిస్తూ, తన వెనక దళం నడుస్తుండగా ఆయన అడుగులు వేస్తున్నాడు. నా వెన్నముకలో తీవ్రచలనం ఆపుకోలేక పోయాను. మేము తర్ఫీదు పొందిన నినాదాలు గొంతెత్తి ముక్తకంఠంతో అంతా అరిచారు.

విదేశాలలో మరణించిన సిపాయిలు — కృప, ధాను, బాబూ తీనూరాం, హవిల్దార్ లక్ష్మణసింగుల కంఠాల ప్రతిధ్వనులు నాకు చూచా యగా వినిపించాయి. ప్రతివారం మాయింటికి వచ్చే చిత్రాల వార్తాపత్రిక 'సిపాయి'లో మృత్యులశరీరాల గుట్టలు నా కళ్లముందు కనిపించాయి. వాళ్ల సమాధుల్లోంచి దయ్యాలు లేచివచ్చి ఈ సిపాయిలవెంట వస్తు న్నట్లు తోచింది. బారకాసుల చుట్టూ వాళ్ల పిశాచాలు నివసిస్తుం టాయి కాబోలు! వాళ్ల శవాలకు తిలతర్పణాలు, పిండాలు పెట్టకపోతే అవి స్వర్గనరకాలకు పోలేక యిక్కడే తిరుగుతుంటాయని అమ్మ చెబు తుంటుంది. కవాతు చేసి వెళుతున్న సిపాయిల పాదధూళి దట్టంగా లేచి, నాలోని అవ్యక్తానుభూతిని కమ్మివేసి కలవరపరచింది. వాళ్లు శవ పేటికలను చీల్చుకొని, దవడలు కదిలిస్తూ గుంపులుగుంపులుగా నా కళ్లముందు అయోమయంగా కనిపించారు. నా మనసు వికలమైంది. నన్ను రక్షించే దేవుడు కనిపించక, భౌతికంగా నిరాశ కలిగి, ఒంటరి వాడినైనట్లు బాధవేసింది.

దళం ముందుకు వెళ్లగానే విద్యార్థుల ఉత్సాహం మిన్ను ముట్టింది. రోడ్డు పక్కన వరసల్లోంచి ముందుకు గెంతి తలపైటోపీలు విసిరి చెల్లా చెదురుగా నడిచారు. ఇంతలో హెడ్మాష్టరు రాజా ఫజాల్ మహమ్మద్ ఖాన్ రంగ ప్రవేశంచేసి, బెత్తం ఝుళిపించి కేకవేసి క్రమశిక్షణ నెలకొ ల్పారు. మిగతారోజు సెలవు ప్రకటించి, ఇష్టం వున్నవాళ్లు నెమ్మదిగా పదవిన్యాసాలు చూడవచ్చుననీ, తుంటరి తనము, రౌడీ చేష్టలు లేకుండా చూడమన్నారు.

కుర్రవాళ్లు కేరింతలుకొడుతూ ముందుకురికారు తెల్లదొరలు నిల బెట్టిన వరసల మధ్యలో గలభాచేస్తూ నడిచారు. గంభీరంగా క్రమశిక్షణ పాటించే తెల్లదొరలు వీరిని చూస్తూ నవ్వుకొంటున్నారు

గొంతులు చించుకొని అరుస్తూ కాళ్ళు నొప్పులు పుట్టేలా పరు గెత్తే అల్లరి పిల్లలను చూస్తూ మేము ముగ్గురము కుట్రదారులమూ చెట్టాపట్టాలు వేసుకొని నడిచాము. మా దగ్గరవున్న చిల్లరడబ్బులు పోగుచేసి వేడివేడి వేరుశనగ కాయలు కొనుక్కొని చెట్టునీడన కూచుని తిందా మనుకున్నాము బాగా అలసిపోయి భయ కంపితులమైనందున మనసులోని మాట చెప్పడానికి వీలుపడలేదు భగవాన్‌సింగు పాడితే బాగుంటుందని ఇస్మత్ అన్నాడు. కొంచెం సేపు సిగ్గుపడి ఆ స్నేహి తుడు నాకిష్టమైన పాట పాడాడు ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా 1857లో సిపాయి తిరుగు బాటుకు నాయకత్వం వహించినందుకు దేశ బహిష్కృతుడై రంగూన్‌లో మరణించిన మొగల్ పాదుషా బహదూ ర్‌షా జఫ్ఫార్ విరక్తిలో వ్రాసిన గీతమది

"నేను ఎవరి కను వెలుగునూ కాను
నేను ఎవరి మానసికానందాన్నీ కాను"

ఆ ఉదయం పదాతిదళ విన్యాసం తర్వాత జరిగిన కవాతు ప్రద ర్శన చూసి నాన్న సంతోషంగా యింటికి వచ్చాడు. కవాతు ప్రదర్శన సమయంలో సంతోష పారవశ్యకరమైన సన్నివేశాలను చూసి ఆయన ఉత్సాహపడినట్లు కనపడుతోంది

'నా సహాయంతో పండిత పరమానంద్ అధికారుల నుదుట విజయ తిలకాన్ని పెట్టడానికి దొరలు అంగీకరించారు.... బ్రిగేడ్‌యర్ జనరల్ బిరుడ్‌వుడ్ గారు 38వ డోగ్రా దళానికి స్వాగితం పలుకుతూ హిందూస్తానీలో ఉపన్యసించారు. విక్టోరియా శిలువ, సేనా శిలువ, విశిష్ట సేవా పతకాలు గెలుపొందిన వారి పేర్లను ఆయన చదివారు. మీకేం తెలుసు మొత్తం దళంలో నన్ను, హవిల్‌దార్ సూర్జన్‌ను ప్రత్యేకించి విశిష్ట సేవా పతకాలకు ఎంపిక చేశారు....... నాపై కుట్రలు జరి పిన వారందరికీ నన్ను పదవిలోంచి తొలగించేందరు యింక అవకాశం

దొరకదు. లెఫ్టినెంట్ కల్నల్‌గా వున్నత పదివిని సంపాదించిన మేజర్ ట్రయల్ నన్ను హవిల్‌దారు నుండి జమేదారుగా చేశారని చెప్పారు. వైస్రాయ్ సేనలోకి భారతీయ సైనిక దళంలోనుండి ఎంపిక చేయబడ్డ కొద్దిమంది హెడ్ గుమాస్తాలలో నేనొకడినని ఆయన చెప్పాడు. ఇప్పుడు మీరు అందరికీ తినుబండారాలు పంచండి. ఈ పిల్లలు మెట్రిక్కులో నెగ్గితే ఖర్చుతో కూడినపని అయినప్పటికీ ఒక వందమంది అతిథులను భోజనానికి పిలిచి వేడుకలు చేద్దాం '

ఏదో సాధించాననే సంతోషం ఆయనను ఆవహించింది. నా ప్రతిఘటనా ధోరణిపట్ల ఆయన కనికరం వహించి మనసు మార్చుకుంటారో లేక నా విప్లవ ధోరణులను ఖండించే పద్ధతి కొనసాగిస్తారో తెలియక నా అయోమయంలో నేను పడిపోయాను.

# 14

మేమందరమూ పరీక్షలలో నెగ్గామని చెప్పినతర్వాత తరగతి గదుల్లోంచి బయటికి త్రోసుకు వచ్చాము పంజాబీ చలికాలపు సూర్యరశ్మి తళతళలు మెరిసి పోతున్నాయి. వచ్చే సంవత్సరం క్రొత్త పుస్తకాలు కొనడానికి ఫీజులు కట్టడానికి, యింకా ఎన్నో గురుతర బాధ్యతలను వహించడానికి శలవుయిచ్చారు. నాకూ, గణేశ్‌కూ బడిలో అది ఆఖరు సంవత్సరం. శివకు ఐదవ సంవత్సరం. ప్రధానోపాధ్యాయుని గదికి ముందు చిన్న తోటలో పూల మొక్కలు రంగురంగుల తళతళలతో మెరిసి పోతున్నాయి. గడ్డిపరకలపై కరిగిన మంచు బిందువులు మెరుస్తున్నాయి. రాజా ఫజల్ మహమ్మద్ ఖాన్ తన సహచరుడు లాలా అమర్‌నాథ్‌తో శ్రద్ధగా మాట్లాడుతూ చేతులు పట్టుకొని నడుస్తున్నాడు. బడిగేటు వద్దకు విద్యార్థులు వుత్సాహంతో పరుగెత్తి గంతులు వేస్తున్నారు. కొందరు పక్కవాడి టోపీలుపైకి ఎగురవేస్తూ, త్రోసుకుంటూ, నెట్టుకుంటున్నారు. ఉన్నట్లుండి మా ఉపాధ్యాయులు నిశ్శబ్దం వహించారు. మాకేసి వస్తున్న ప్రధానోపాధ్యాయుడు, అమర్‌నాథ్ గారలు పరస్పరం

పలకరింపులకు ముందు మావైపు దయాపూరిత దృష్టులను ప్రసరించారు.

'దేశ భక్తులు లాలా లజపతిరాయ్ రాక గురించి ఆందోళన పడు తున్నారు' అని రహస్యంగా నా చెవిలో చెప్పాడు ఇంద్రనాథ్. ఇతడు మా తరగతిలో ఇటీవల చేరాడు. వాళ్ళ అన్న ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు. ప్రజాపనుల శాఖలో పనిచేస్తున్న ఆయనను లాహోరునుండి జీలముకు బదిలీ చేశారు.

'నీకూ తెలుసు?' అడిగాను నేను.

'నీకు రహస్య సమాచారం ఎక్కడనుండి అందుతుందో నాకూ అక్కడ నుండి ఈ సమాచారం అందింది'. ..... లాలా కేదారనాథ్ అన్నాడు నావైపు వంగి రహస్యంగా.

అతడు విశాలమైన ముఖంనిండా నవ్వు తెచ్చుకొని గంతులు వేశాడు 'నాకు తెలుసు నీవు మా పక్షం. ఈ రోజుమనం కేదారనాద్ యింట్లో కలుద్దాం' అని చెప్పాడు— నాకన్నా నాలుగడుగులు గణేశ్ ముందుకు వేసేంత వరకూ ఆగి.

ఆ సమయానికి శివ ఉత్సాహంగా పరుగెత్తుకుంటూ వచ్చి 'నేను కూడా నెగ్గాను తెలుసా?' అన్నాడు.

'భలే!' అంటూ తమ్ముళ్ణి మెచ్చుకున్నాను.

ఇంద్రనాథ్ ఆహ్వానం గురించి ఆలోచించే అవకాశం అపుడు కలి గింది.

'ఈ రోజు కాదు' అన్నాను, ఇంట్లో వాతావరణం ఎలా వుంటుందో గ్రహించి తర్వాత చెబ్దామని. లాలా లజపతిరాయ్ వచ్చినపుడు ఒక విధమైన ప్రదర్శన నిర్వహించే విషయం గురించి లాలా కేదారనాథ్ నాతో మాట్లాడదలచాడని నాకు తెలుసు.

నా ఒంటరితనానికి తగిన మానసిక స్థైర్యం తెచ్చుకుందామని బడికి వచ్చేదారిలో భగవాన్‌సింగు ఇస్మతుల్లాలకు నా మనసులో మాట చెప్పాను.

మేమందరమూ తొమ్మిదవ తరగతిలో నుండి పదవ తరగతిలోనికి వచ్చామని అమ్మకు చెప్పి ఆమెతో కూడా వంటగదిలోకి నడిచాను. లాహోరు నుండి ప్రముఖ నాయకుడు లాలా లజపతిరాయ్ వస్తున్నారని ఆమెకు రహస్యంగా చెప్పాను.

ఆమె ఒక్క క్షణం ఆగి — 'బాబూ! తొందరపడి ఏదీ చేయకు. మీ నాన్న సంగతి నీకు తెలుసు' అంది నెమ్మదిగా.

'అమ్మా!' అన్నాను ఆమె నిస్తబ్ధంగా యిచ్చిన సమాధానానికి నిరుత్సాహ పడుతూ. ఆమె చివరకు రాజీ పడుతుందని నాకు తెలుసు. తన దైనందిన గృహకార్యకలాపాలలో మౌనంగా తిరుగులేని విధేయతతో భగవత్ ప్రార్థనలు చేస్తూ ఆమె గడపటం నాకు తెలుసు.

'నా బుర్రపాడు చేయకు. ముందు నీవు పరీక్షలో నెగ్గినందుకు బజారులోని గుడిపూజారికి కానుకలు ఇవ్వాలి. తర్వాత నీకు తినుబండారములు పెడతాను.. ...... ఇప్పటి నుండే మెట్రిక్ పరీక్షకు తయారవ్వేందుకు సిద్ధపడాలి. మీ నాన్న చెప్పినట్లు — 'నీవు ఏ పరీక్షలోనూ తప్పకూడదు.' ఆ విధంగా మాట్లాడి నన్ను కించపరచానని గమనించి, — ఆమె నా తల నిమిరి దగ్గరకు తీసుకొని అంది

'మనిద్దరమూ కలిసి హరిద్వారకు వెళ్ళి సన్యాసమన్నా స్వీకరించాలి లేదా మీ నాన్న మాట ప్రకారం నడుచుకోవాలి.'

ఆమె నా తల నిమిరి నాపై కనికరం చూపినందుకు కృతజ్ఞత చూపుతూ నా ప్రతిపాదనను తిరస్కరించినందుకు మౌనరాగంతో ఆవిడను కౌగలించుకున్నాను. శకుంతలకు దూరమై దేవకి, ముంతాజ్‌ల జ్ఞాపకాలకు వేరుపడిన నేను అమ్మకు సన్నిహితం కాక తప్పలేదు. ఆవిడ అంతగా చదువుకోలేదు. కాబట్టి స్పష్టంగా జవాబు యివ్వలేదు. నాలోని అసహనాన్ని కొంతవరకు గుర్తించింది కాబట్టి ఆవిడ సమక్షంలో నాకు సౌఖ్యం వుందని తెలుసు. సంసారాన్ని వదిలి పెడదామని ఆమె చెప్పిన మాటలు ఆమె అంతరంగిక స్థితికి నిజమైన ప్రతిబింబం. ఆవిడ గుడికి వెళ్ళడానికి పూజారికి కానుకలు ఇవ్వడానికీ ఇష్టపడక పోయినప్పటికీ నేను కేకలు పెట్టలేదు. ఆవిడ భౌతికాకర్షణలో జనించిన విశ్వప్రేమపట్ల ముగ్ధుడనై

తల్లి కరుచుకున్న తనయుని వలె యింట్లో వుండి పోయాను. గాంధీ వుద్బోధల పట్ల ఆవిడ ధ్యాస తగ్గినదని తెలిసినప్పటికీ చివరకు నన్ను వదలిపెట్టదని తెలుసు.

అంగళ్ళకు కొద్ది దూరంలో దక్షిణంవైపు పెద్ద మర్రి చెట్టుక్రింద తాత్కాలికంగా నిర్మించిన మందిరంలోనికి అడుగు పెట్టాము. బజారు లోని పండిత బదరీనారాయణ దేవాలయం నిండా దేవుని విగ్రహాలు గాక చదరంగం ఆడే మనుష్యులు ఎక్కువగా వున్నారు.

ఎదురులేని ఆధ్యాత్మికపరమైన అధికార సంపదతో వెలిగిపోతూ పుష్టిగా కనిపించాడు బ్రాహ్మణ పూజారి. కాశ్మీరీనేతతో తయారుచేసిన కోటు, పైజమా ఆయన ధరించాడు. ఆయన నుదుటిపై తీర్చిదిద్దిన మూడు పట్టెల గంధపు పూత తప్ప అతడు అచ్చుగుద్దినట్లు అమృత సర్‌లోని జూదరి హరియావలె కనిపించాడు

యంత్రపు బొమ్మవలె ఆయన ఆడుతున్న ఆటనుండి బయటపడి అమ్మ వద్దనుండి కానుకల పళ్ళెం తీసుకున్నాడు.

'అబ్బాయిలూ! పంతులుగారికి నమస్కరించండి' అంది అమ్మ.

కృష్ణావతారంలో వున్న విష్ణు పరమాత్మకు చేతులు కపటంగా జోడించి నమస్కరిస్తూ.

'బ్రాహ్మణులు ఆశపోతు కుక్కలు' అనే సామెత పండిత బదీర నారాయణ మా అమ్మవద్ద కానుకలు తీసుకున్న ఆదుర్దా ఆ సామెతను బలపరచింది. అయితే అమ్మ ఈ మనిషిపట్ల అంత గౌరవం ఎందుకు చూపుతోంది?

పండిత బదరీ నారాయణ లేచి వ్రేలాడుతున్న గంటను మ్రోగించి, భగవంతుని లేపి కానుకలను ముందుపెట్టాడు. తీర్థపాత్రను తీసుకొని పంచామృతాన్ని అమ్మ చాచిన చేతుల్లోకి పోశారు. ఆ తర్వాత నాకు, గణేశ్‌కు, శివకూ, తీర్థమందించారు. తర్వాత ఏవో అర్థంగాని ప్రార్థనలు చేసి భగవంతుని వేదిక ముందు ధూపం వెలిగించి ఎత్తైన ప్రదేశంలో పద్మాసనం వేసుకొని కూచున్నాడు.

'పిల్లలు పరీక్షలో నెగ్గినందుకు పరమాత్మకు కృతజ్ఞతలు అందించండి. వచ్చే సంవత్సరం కూడా నెగ్గాలని ప్రార్థనలు చేయండి' అంది అమ్మ.

'విధేయులైన మీ కుటుంబానికి కృష్ణభగవానుని ఆశీస్సులు ఎప్పుడూ వుంటాయి.' అన్నాడు పూజారి· 'మీ ఆయన భక్తుడు, చదువుకున్న లౌక్యుడు. ప్రభుత్వం ఆయనను గౌరవిస్తుంది. రిజిమెంటల్ దేవాలయంలో పూజారి వుద్యోగానికి ఖాళీ వచ్చినపుడు నన్ను గుర్తుపెట్టుకోమని ఆయనకు చెప్పండి. నేను ముందుగా చెప్పినట్లు ఆంగ్లప్రభుత్వం అధర్మాన్ని నాశనం చేసింది. జర్మనులకు వ్యతిరేకంగా ధర్మం జయిస్తుందని నేను ముందే జోస్యం చెప్పాను.'

'మహాభారత యుద్ధంలో పాపులైన కౌరవులకు వ్యతిరేకంగా ధర్మాత్ములైన పాండవులు జయించడానికి కృష్ణపరమాత్మ తోడ్పడ్డాడు. ఆయన పేరు నేను నా మూడవ బిడ్డ కృష్ణకు పెట్టాను. ఆయన వలె వీడుకూడా వీరుడు కావాలని.' 'అమ్మా. నీవు ఎందుకు అలా చెస్తావు?' అవమానంతోనూ, గర్వంతోనూ ముఖం జేవురించగా అడ్డు చెప్పాను. నా పక్షంలో ప్రత్యేకంగా ఆమె యాచనాధోరణి, జిడ్డు ముఖమైన పూజారిని పొగడటం నాకు యిష్టంలేదు. నేను రాకుండా వుంటే బాగుండేది. రహస్యంగా బ్రాహ్మణుని ముఖం గమనిస్తే అతడు కేవలం మోసగాడుగా కనిపించాడు. మంచి మల్లయోధునిలా వున్న అతని భంగిమలో పవిత్రత కనిపించలేదు. అమృతసర్‌లోని సంస్కరణవాదులలో చిన్నవాడైన భగవాన్ దత్త బాబాయి ముఖంలో ఆ పవిత్రత నాకు కనిపించింది. గుడికి తెచ్చిన కానుకల కోసం ఆవురావురుమంటున్న దాస్యప్రవృత్తి గలిగి రెజిమెంటులో వుద్యోగం అడిగిన బ్రాహ్మణుని కంటె నాలోనేను దైవత్వాన్ని చూశాను.

నాముఖంలో అనాదర భావాన్ని గమనించిన పండిత బదరీ నారాయణ అమ్మ నుద్దేశించి ఉపదేశం ప్రారంభించాడు. గణేశ్, శివలతో కలిసి ఆమె ఆయన పాదాల ముందు కూచుని వుంది. నేను నించుని వున్నాను.

'శ్రీకృష్ణ పరమాత్మ ఎప్పుడూ నవ్వు ముఖంతో వుండే నీల మేఘ శ్యాముడు. ఆయన పేరుతో వున్న ఇతడు దిగాలుగా వున్నాడు........ చెల్లెమ్మా! నీకు తెలుసు భగవంతుని అవతారాలైన ఎందరో దేవుళ్ళు రాక్షసులు వున్నారు. వారికి తలలపై కొమ్ములు, పొట్టేలు ముఖాలు, వికారమైన శవి రూపాలూ వున్నాయి—' అన్నాడాయన.

'కొంతమంది మనుషులకు జంతువుల ముఖాలు కూడా వున్నాయి. మనమధ్యకొందరు రాక్షసులు కూడా వున్నారు. గుడులలో శివుని వాహనమైన వృషభాలు కూడా వున్నాయి' అన్నాను అసహనంగా ఆయన మాటల మధ్యలో.

పూజారికి వ్యతిరేకంగా నేను అనదలచుకున్న మనసులోని మాటలను గుడివెలుపలకు రాగానే వెళ్ళగక్కాను.

'అంతా మోసం. బలిసిన వృషభంలా వున్నాడు. మనిషికాడు. అతనికి వచ్చిన మాటలను యధాతధంగా నిరర్థకంగా వాడుతుంటాడు. యుద్ధంలోనూ, మతకలహాలలోనూ వేలాదిమంది చనిపోతే భగవంతుని యందు విశ్వాసముంచటానికి నీకుగానీ, ఆయనకుగానీ ఎలా మనసు కుదురింది?'

'బాబూ! నీకేమైందిరా? నీవు ఎలానమ్మలేవు? క్రూరమైన ప్రపంచంలో కష్టాలను భగవంతుడు కల్పిస్తున్నాడంటే అందుకేదో మంచి కారణం వుంటుంది. మనం చేసే పాపాలను గూర్చి ఆలోచించు.'

'వీడికీ మనసులో పిచ్చిపట్టింది' అన్నాడు గణేశ్ అసంతృప్తిగా: 'వీడు పాపి. అయినా నీవు వీణ్ణి సమర్థిస్తావు. వీడు నాస్తికుడు కాబోతున్నాడు. కుట్రలలో ప్రవేశించి హంతకుడు కాబోతున్నాడు.'

'నోరుముయ్! స్వాతంత్ర్యం కోసం పోరాడి చనిపోవాలని డాక్టరు మునీలాల్ వద్ద ప్రమాణం చేశాను.' అని అరిచాను.

'నీ వ్యతిరేకులైన దొరలను చంపాలను కుంటున్నావు!' 'అవసరమైతే అంతే. వాళ్ళమరణమో, అపజయమో నాకు కావాలి' అని సమాధాన మిచ్చాను.

కోపావేశంతో మండి పోతున్న నేను చేయగలిగిన దానికన్నా అధి కంగా డంబాలు పలుకు తున్నానని తెలుసు. నా చుట్టూవున్న వైరుధ్యానికి నేను జంకలేదు.

'అమ్మ కానుకలన్నీ ఆమనిషి తీసేసుకొని తీర్థం యిచ్చి సరిపె ట్టాడు' నాపట్ల సానుభూతిగా నాచేయి పట్టుకొని అన్నాడు శివ.

'నేను పిచ్చివాణ్ణి, నేను నిజం చెబుతున్నాను. అబద్ధాలు కాదు' అన్నాను కోపంగా.

ఆ మాటలు అని అమ్మకు, గణేశ్‌కు, శివకు ముందు పరుగెత్తాను. పూజారివలె నేనూ ఉన్మాదిని. ఆ విషయాన్ని అంగీకరించటానికి నాలో గర్వం ఒప్పుకోవటం లేదు.

వందగజాల దూరంలో రెజిమెంటల్ బజారులో కిళ్ళీకొట్టువద్ద నించొని అక్కడ వేలాడుతున్న పొడవాటి అద్దం వెనుక సరస్వతీదేవి, విసనకర్రలు చేతిలో పట్టుకున్న జపాను అమ్మాయిల రంగురంగుల చిత్రాలు వేలాడదీసి వున్నాయి. నా తల మీద కొమ్ములు లేక పోయినప్పటికీ రాక్షసుడిలా వున్నానా? ఆ విషయం ధృవపరచు కుందా మనుకున్నాను. నా కళ్ళు ఎఱ్ఱబడి నాముఖం రక్తవర్ణచ్ఛాయతో వుంది. నా అంతరాత్మలో కోపం పెచ్చుపెరిగి పోతోంది. కారణ మేమిటో తెలి యదు. నేను రాక్షసుణ్ణయితే రాక్షస పూజారి నన్ను రాక్షసుడిగా మార్చి వుంటాడు. అయినప్పటికీ నాపట్ల పక్షపాతంతో ఈ మోసగాళ్ళ గురించి పట్టించుకో గూడదనుకున్నాను. నా అంతరాత్మలో దహిస్తున్న సత్యం గురించి ఆలోచిస్తున్నాను. అనుమానమనే రాచపుండు నా మనసులో బయలుదేరింది. నేను చెప్పిన దంతా సహేతుకమూ నిజమూ అయితే నేను భయపడట మెందుకు. ఎల్లప్పుడూ నాలో ఆందోళన ఎందుకు కలగాలి?

నిజానికి హింసకు అర్థంలేదు. నేననుకున్నది ధర్మమే అయినప్ప టికీ నా చేతులతో ఎవరినీ చంపలేదు. గాంధీకి అది యిష్టంలేదు. నా లోలోపల సత్యం లోంచి ఆ భావన వచ్చింది. నా బుర్ర చెడిపోయింది.

'వడ్రంగి గొడు వద్దకు వెళదాం పద. క్రికెట్టు బ్యాటు చేయమని

చెప్పాముగా తెచ్చుకుందాం' అన్నాడు శివ నా వద్దకు పరుగెత్తుకొని వచ్చి.

నాలోని రాక్షసావేశం నుండి తప్పించుకోవడానికి మా తమ్ముని కోరిక ననుసరించాను.

మాయింటి బయట బారకాసు వీధిలో ఎత్తైన ప్రదేశంపై నిలబడి స్మశానానికి వెనక గురుగోరఖ్‌నాథ్ మందిరాన్ని పిచ్చివానిగా తేరిపార చూశాను. ఆ గ్రామానికి అరమైలు దూరంలో వున్న జీలంనదీ ప్రవాహవేగాన్ని ఆ భ్రమలో నేను వినగలిగాను. ఆ గ్రామంలో బి.ఏ. తప్పిన హరిచంద్రమాష్టారు వుంటారు. నా వెనుక యుద్ధంనుండి తిరిగి వచ్చిన వందలాది సిపాయిలున్నారు. పండితబదరీనారాయణ సూచించిన పిచ్చితనం కంటె అధికమైనది ఏదో నా మనసులో వుంది. ఒక విధమైన వ్యతిరేకత. నా తలలోని భావాలన్నీ నా రక్తం ద్వారా నా ఉదర కుహరంలోకి ప్రవేశించినట్లు, పిచ్చివానిలా ఉద్రిక్తంగా తిప్పుతున్నట్లు అనిపించింది. నేను ఏడ్చివుండాల్సింది. కానీ, నాలో బలహీనత ప్రవేశించి నా కళ్ళలోకి నిరంతరం ప్రవహించే జలధారలను ఆపుదామను కున్నాను.

'నేనెందుకు బాధపడుతున్నాను?'......... సమాధానం వచ్చింది — 'ఒంటరి వాణ్ణి కాబట్టి'.......... తన పెదనాన్న బాబూ కుషీరామ్ కరిన వాక్యాలను వింటూ నా స్థితిలోనే వున్న భగవాన్‌సింగు — 'లేదు' అన్నాడు.

అలానే ఇస్మతుల్లా, లాలా కేదారనాద్, ఇంద్రనాద్ వున్నారు. అయినప్పటికీ, అవ్యక్తమూ, అస్పష్టమూ, అనదృశమూ అయిన ముందు చూపుతో నేను అమాయకుణ్ణని గ్రహించాను. నాకు తెలియని విషయాలను తెలుసుకోవాలని నా ఆత్మ ఘోషిస్తోంది. కాబట్టి నాలో ఈ దైన్యం అంతా కలిగింది. చునీలాల్ దంపతులు యిక్కడ వున్నపుడు నాకు ఎన్నో విషయాలు చెప్పేవారు....... గణేశ్ మిగతా పిల్లలు పిలిచినట్లు నాది స్వతహాగా 'ఏడుపుగొట్టు ముఖం.' ఈ అనుమానం నా మెదడులో కదిలింది. నేను అలా పుట్టాను. అమ్మ చెప్పినట్లు ఎవరి ఖర్మ వాడివెంట వుంటుంది. నీవు లెక్కలు సరిగా చేయకపోతే మెట్రిక్కు పరీ

క్షలో తప్పతావని నాన్న అంటాడు. పండితబదరీనారాయణ అంటాడు— 'అంతా మాయ. అయినా అది సత్యస్వరూపం'...... 'వాడు పాపాన్ని చివరలో అనుభవిస్తాడు' అని అందరూ నన్ను ఖండించినప్పటికీ వాళ్లు అనుకున్నంతగా నేను గుడ్డి నమ్మకం గలవాణ్ణి కాదు.

మా యింటి బయట బారకాసు వీధిలో ఎత్తైన ప్రదేశంలో నిల బడి బ్యాండు వాద్యగాడైన జిమ్మీ నల్లటి కూతురు హెలెన్ ఈ దారిన వెళితే బాగుండు ననుకున్నాను. వాళ్ళయింట్లో కిరోసిన్ దీపానికి రెండు అణాల చమురు తీసుకు రావడానికి ఆమె తరచు సాయంకాలాలు యిటు కేసి వెళుతుంటుంది. నేను వెళ్ళి ఆవిడను ముట్టుకుంటాను. 'పక్కవాళ్ళు చూస్తున్నారు' అని ఆవిడ ఒకసారి నేను సాహసించి ముట్టు కున్నపుడు అంది. 'చూస్తే చూడనీ!' నాన్నను ముఖస్తుతి చేసే హవిల్‌దార్ మౌలా భక్ష్, బ్యాండు మాష్టారు జోన్స్, నిరంతరం పార్థనలు చేసే షమ్షుద్దీన్, త్రాగు బోతులైన అతని కుమారులూ, నా స్నేహితుడైన అతని చిన్న కుమారుడు ఇస్మత్ తప్ప.........

హెలెన్ నల్లని శరీరకాంతి ఇతర స్త్రీలపై వ్యామోహం వలె నన్ను ముగ్ధుణ్ణి చేసింది. దేవకి పిన్ని సువాసనలు, నౌషిరాలో గుండ్రని ముఖం గల మాయాదేవి చూపు, లూధియానాలో నాట్యగత్తె ముంతాజ్ రోజాపుష్పసుగంధాలు, యిక్కడ జీలంలో శకుంతల అనురాగమూ, మా అమ్మ మాధుర్యమూ గుర్తుకు వచ్చాయి.

నా మనసులోని ఆవేశాన్ని అణచడానికి లేపనం వంటి స్త్రీమృదు శరీరస్పర్శ, శారీరక మృదుత్వము, రహస్య ప్రణయమూ కావాలి. నన్ను ఎవరైనా కౌగలించుకుంటే ప్రణయంలో కరిగిపోతాను. ఆ ప్రణయంలో పూర్తిగా మునిగిపోయి నాశనమౌతాను, లేదా, సిద్ధిపొంది తాను...... నన్ను ఆకర్షించిన స్త్రీలు తప్ప మిగతా ప్రపంచమంతా సంపూర్ణ వ్యతిరేకత కలిగినట్లు ఎందుకు అనిపిస్తుందో నాకు తెలి యదు. నా ముందున్న గులకరాళ్ళనూ, బండలనూ తన్నడానికి కారణం అవి నాకు అపకారం చేశాయని అనుకోవడమే.

మా యింటి బయట బారకాసు వీధిలో ఎత్తైన ప్రదేశంలో నిల

బడి, గురు గోరక్‌నాద్ పర్వతమూ, అక్కడిరాళ్ళు, జీలంనది, పొలాలు, బారకాసులు నా మార్గానికి అడ్డుపడుతున్నట్లు భావించాను. మా కుటుంబము మా నాన్న జీవితంతో ముడిపడ్డ సిపాయి లందరూ నా మార్గాని కడ్డుపడుతున్నారు. నా శక్తిని నిరోధించడానికి ఎదిరించే ఈ వస్తువులు, సింహాలూ, తోడేళ్ళు, గాడిదలూ, అనిపిస్తున్నాయి......... ఈ రాక్షసులు వున్నారనటానికి నిదర్శనం తెల్లదొరల ముఖాలలోనూ, వారికి విధేయులైన భారతీయ అధికారులలోనూ, రెజిమెంటులో కొత్త పూజారిగా చేరాలనుకున్న పండిత బదరీనారాయణ వికార ముఖంలోనూ కన్పిస్తున్నాయి. ఈ ఆలోచనలను నేను ఒక్కడినే ప్రోదు చేయడం లేదు. నాతో ప్రమాణం చేసిన నా మిత్రులందరూ ఇలానే భావిస్తు న్నారు. కొత్త భావాలను నెలకొల్పాలని అందరూ చిత్తశుద్ధితో పని చేస్తున్నారు. ప్రభుత్వం గాంధీ, కిచులూ, సత్యపాల్, ఉత్సాహవంతులూ, యువ కిశోరాలూ అయిన దత్తా సోదరులూ, చునీలాల్, హరిహర, కేదా రనాద్ ఇంకా వేలాది మందిని మెత్తబరచాలను కొంటోంది. నావంటి కుర్రవాడు ఏం చేయగలడు. వాళ్ళ నాన్న ముఖ్యంగా ఒక గుమాస్తా గనుక.

మాయింటి బయట బారకాసు వీధిలో ఎత్తైన ప్రదేశంలో నిలబడి, ప్రపంచమనే అగాధంలో గాఢంగా కూరుకుపోయిన పిచ్చివాడిలా భావిం చాను. పెద్దలందరూ తమ భావాలను అణచుకున్నారన్న అనుమానం కలిగింది. అన్నిటికీ తలవంచి ఈ కుట్రలో భాగస్వాములై అన్ని తప్ప లకూ మౌనం వహించి వాళ్ళ దేవతలపట్ల కూడా కుట్ర పన్నారు. నెలాఖరులో వాళ్ళ భార్యలముందు జీతపురాళ్ళు లెక్కబెట్టడమే వారి ధ్యేయం.

పదో తరగతి గదిలో ముందువరసలో కూచొని పాఠం వింటు న్నప్పుడు జీలం న్యాయవాదుల గదినుండి గలగల ధ్వనులు దూరంగా వినిపించాయి. అమరనాథ్ మాష్టారు గణిత శాస్త్రపాఠంలో నిష్పత్తుల సూత్రాలను నల్లబల్లపై వ్రాసి చెబుతుంటే శూన్యంలోకి తేరిపార జూస్తు న్నాను. బయటి శబ్దాలు మాత్రం వినిపిస్తున్నాయి. నాకు కుడిచేతివైపు దూరంగా కూచొనివున్న భగవాన్‌సింగు, ఇస్మతుల్లా, ఇంద్రనాథ్‌లకేసి

రహస్యదృక్కులు ప్రసరించాను. వాళ్లు పాఠంలో లీనమై ముందు కేసి చూస్తున్నారు. లాలా కేదార్‌నాథ్ మాటిమాటికీ తలపంకించి బడి బయట గోడకేసి చూస్తున్నాడు. నేను ఆ గోడకు ఐదుగజాల దూరంలో కూర్చున్నాను. ఆ దారిలో వెళ్లే లాలా లజపతిరాయ్ వూరేగింపులో చేరడానికి వాళ్ళందరి మీదినుంచి దూకి బయటకి వద్దా మని మేము చేసిన వాగ్దానాన్ని గుర్తుచేస్తున్నాడు.

'మీరు మొదట గణితంలోని సిద్ధాంతాలకు వెనుక సూత్రాన్ని తెలుసుకుంటే లెక్కలు వేయడం సులభము.' కుడి చేతి వేళ్ళమధ్య సుద్దముక్క పట్టుకుని మాకేసి చూస్తూ అన్నారు మాష్టారు.

ఆ మాటలు వినాలని నేను స్థితప్రజ్ఞుడనై ఆ వాక్యం విన్నాను. సూత్రాలు గ్రహించలేక పోయాను. మాష్టారు చెబుతున్న ప్రతి శబ్దమూ జాగ్రత్తగా విని బయటి శబ్దాలను చెవిలోకి జొరనీయడం లేదు.

'ప్రభుత్వ కార్యాలయాలలోని గుమాస్తాలు ముఖ్యంగా నిష్పత్తులను గూర్చి తెలుసుకోవాలి.' అంటూ మాష్టారు·

'అధికారి వెంటనే సమాధానం కావాలని చెప్పినపుడు వీళ్ళు సమా ధానంతో సిద్ధంగా వుండవచ్చు..... నూటికి 5 అయితే 50కి ఎంత? అరే విజ్ఞానీ!' అని తన వేళ్ళు, సుద్దముక్క నాకేసి చూపుతూ అన్నారు.

'$2^1/_2$' అన్నాను.

'శభాష్! ఇప్పుడు నల్లబల్లకేసి చూడు.' అని మాష్టారు ప్రశంసిం చారు. ఆ తర్వాత మిగతా పెద్ద శాతాలను గురించి చెప్పసాగారు.

నిష్పత్తుల గురించి నాకర్థమై పోయింది కనుక నల్లబల్లకేసి చూడక పోయినా పరవాలేదు. అందుకని బయటి గోడకేసి తలపంకించి తదేకంగా చూడసాగాను. నాకంటె రెండింతలు ఎత్తున్న ఆగోడను దూకటం ఎలా? బడిమూలలకు వూరేగింపు వస్తున్న శబ్దం వినిపించినపుడు మేము సిద్ధంగా వుండాలని కూడబలుక్కున్నాము. లాలాకేదార్‌నాథ్ నాకు సైగచేస్తాడు. అప్పుడు నేను పాడిదగ్గుదగ్గి, రెంటికి వస్తోందని అడగాలి. అదే సాకు మీద మిగతా కుట్రదారులు కూడా నన్ను అనుసరిస్తారు. ఒకవేళ లాలా

కేదార్‌నాథ్ తన అన్నతో మేమిలా చేస్తామని మమ్మల్ని వదిలివేయమని చెప్పాడేమో తెలియదు. మేము నలుగురమూ ఒకే సాకుమీద బయటికి వెళితే మేము అబద్ధాలాడుతున్నామని స్పష్టంగా తెలిసి పోతుంది. ఈ పిచ్చి ఆలోచన రాగానే మేము వేసుకున్న ప్రణాళిక అంతా పాడై పోతుందని భయము వేసింది. అటూయిటూ చూశాను. గదిలో పిల్లలందరూ నల్లబల్ల మీద అంకెలలో లీనమైపోయారు. నేను కూడా శ్రద్ధగా విందామని ప్రయత్నించాను. కానీ సాధ్యపడలేదు. సైగచేయగానే దగ్గే భాద్యత నామీద వుంది.... ఈ కుర్రవాళ్ళు మరచిపోయారా! లేక భయసందేహాలకు అతీతంగా వుండగల ధైర్యస్థైర్యాలు వీళ్ళకున్నాయా? వాళ్ళ చూపులు నల్లబల్ల మీద వున్నాయి. ఇంద్రనాథ్ నాకేసి దొంగ చూపులు చూసి తిరిగి పాఠంపై దృష్టి సారించాడు.

ఊరేగింపు కదిలి వస్తున్న శబ్దం వినిపిస్తోంది. మరు క్షణంలో లాలా కేదార్‌నాథ్ గోడకేసి తలపంకించి తల ఆడిస్తున్నట్లుగా సైగ చేశాడు. నేను పొడిదగ్గు దగ్గాను నాకే అది కృత్రిమంగా వినిపించింది.

వున్నట్లుండి మాష్టారు నాకేసి చూశారు. ఆయన అనుమాన దృష్టితో చూశాడనిపించింది. నేను అప్పటికే లేచి నా రెండువేళ్ళూ మడిచి రెంటికి వెళ్ళాలని సూచించి — 'మాష్టారూ! వెళ్ళవచ్చా!' అన్నాను.

మాష్టారు తల ఆడించారు.

నేను బయటకు జారుకొని స్నేహితులకోసం దారి కాచాను.

క్షణాలు బాధగా గడిచిపోయాయి. ఉత్కంఠ ఆపుకోలేక పోయాను. 'లాలాలజపతిరాయ్‌కీ' జై అన్న నినాదం వందగజాల దూరంలో వినిపించింది. నేను తాళలేక వెనుదిరిగి తలుపుగుండా తల పంకించి చూశాను. ఇంద్రకేసి గమనించాను. అతడు లేచి దగ్గి వేళ్ళు చాపాడు.

బహుశా మాష్టారు 'సరే' నన్నట్లున్నాడు. వాడు నవ్వుతూ బయటికి వచ్చాడు.

గదిలోంచి మేము బయటికి వచ్చి గోడమూలకు చేరాము. వాడు

వెంరనే గుర్రపు పిల్లలా వంగి నించున్నాడు. నేను వాడి మీదికి ఎక్కి గోడదూకి అటుకేసి వెళ్ళాను.

ఇంద్ర పొడుగాటి వాడు. వాడు గోడమీద పాకి ఆ వుత్సాహంలో ఇంచుమించు పడ్డట్లుగా దూకాడు.

'భగవాన్‌సింగు! ఇస్మత్తు ఏడీ?' అన్నాడు లాలాకేదారనాథ్.

'వాళ్ళు పట్టుబడి వుంటారు.' అన్నాను.

రాజాఫజల్ మహమ్మద్‌ఖాన్ తన గంభీరస్వరంతో కేకలు వేయడం వినిపించింది: 'ఇది ప్రభుత్వ పాఠశాల. దేశద్రోహులతో మీరు కలవడానికి వీలు లేదు. గదులలోకి వెళ్ళండి' అని బెత్తం ఝుళిపించారు.

ఆసక్తితో చాలమంది గదిలోంచి బయటకి వచ్చి వూరేగింపులో పాల్గొందామని అనుకుని వుంటారు. తొమ్మిదవ తరగతి ఆంగ్లపాఠం చెప్తున్న ప్రధానోపాధ్యాయుడు పరిస్థితి గమనించి బయటికి వచ్చి వారిని అదుపులో పెట్టాడు.

మేజిస్ట్రేటు కుమారుడైన ముగీజుద్దీన్ వున్నట్లుండి గోడదూకి కేక వేశాడు: 'అల్లాహో అక్బర్! అలీసోదరులు చిరంజీవ! ఖిలాఫత్ ఉద్యమం జిందాబాద్!'

ముగీసును కేదార్‌నాథ్ బాహువుల్లోకి ఆహ్వానించి 'హిందూ ముస్లిమ్ సమైక్యత వర్ధిల్లాలి!' అని కేక పెట్టాడు.

మమ్మల్ని ముగ్గురినీ గుమి కూడ్చి ప్రధాన వీధిలోకి తీసుకెళ్ళాడు. వూరేగింపు గందరగోళంగా వుంది. పోలీసులు చుట్టుముట్టారు.

'లాలా లజపతిరాయ్‌కీ జై! అని అరవండి' అన్నాడు.

మేము అరిచాము.

వూరేగింపుకు కుడిపైపునుండి పోలీసు ఇనస్పెక్టరు మొహమ్మదాలీ పరుగెత్తు కుంటూ వచ్చాడు. అతడు లాలాకేదార్‌నాథ్ మెడపట్టుకు న్నాడు. ముగీస్ మొహమ్మదాలీ మీద పెద్ద పులివలె విరుచుకపడి— 'ఖిలాఫత్ ఉద్యమద్రోహి' అని అరిచాడు. మొహమ్మదాలీ కేదార్‌నాథ్‌ను

వదలి ముగీన్‌ను పట్టుకున్నాడు.

'వాణ్ణీ, మిగతా పిల్లలనూ పట్టుకోండి' అని తన మనుషులకు ఇనస్పెక్టరు ఆదేశించాడు.

'దేశద్రోహులారా!' అంటూ ముగీన్ అరిచాడు.

పోలీసుల పట్టు విడిపించుకొని మేము గందరగోళంగా పరుగెత్తి లాలా లజపతిరాయ్ దర్శనం చేసుకుందామనుకున్నాము. పదకొండు జతల ఎడ్లు కట్టిన బండిమీద వేదికపై ఆయన ఆశీనుడై వున్నాడు. కానీ పోలీసులు మమ్మల్ని చుట్టుముట్టి వెంటనే బంధించారు.

ఈ సమయంలో లాలా లజపతిరాయ్‌ని చూశాము. నాన్నకు వలె నిండు మీసాలు, బలిష్టమైన శరీరమూ, పొట్టి మెడనిండా పూలమాల లతో నిండి వృషభ దేవతవలె వున్నాడు. వేదికపై నిలబడి నినాదాలను మించేలా అరుస్తున్నాడు·

'ఊరేగింపుదారులను పోలీసులు రెచ్చగొట్టకపోతే శాంతి నెలకొం టుంది. ఈ పిల్లలను హింసించి లాఠీచార్జీ చేస్తే గుంపు సరిగా ప్రవర్తిస్తుందని నేను సరిగా హామీ ఇవ్వలేను.'

'లాలా లజపతిరాయ్‌కీ జై!' బడిలోంచి పిల్లల అరుపులు వినిపిం చాయి.

'లాలా లజపతిరాయ్‌కీ జై!' అప్రయత్నంగా అరిచాము. 'మైదా నంలో సమావేశం అయేంత వరకూ ఓపికపట్టండి.' అంటూ కేదార్‌నాథ్ సలహా యిచ్చాడు.

* * *

నేను తరగతిగదిలో సరిగా వినని నిష్పత్తి పాఠాన్ని గణేశ్‌తో కూచుని మాయింటి బయట గుడారంలో ఆ మధ్యాహ్నం నేర్చుకుంటు న్నాను. మా నాన్న వచ్చి నా మీద విరుచుక పడ్డాడు. తన కోపమంతా నిగ్రహించుకుంటున్నట్లుగా గంభీరంగా కనిపించారు.

'అరే! గాడిదా! ఓరేకుక్కా! నేను విన్నదేమిటి? నీవు నాకు,

మన కుటుంబానికీ తల వంపులు తెచ్చావు' అన్నారు.

'లేదు.... నాన్నా!' సాహసించి అని దెబ్బపడుతుందన్న భయంతో చేత్తో నాముఖం కప్పుకున్నాను.

'ఒరేయ్ అడ్డగాడిదా?....... మరి నీవంటే ఇష్టపడ్డ రాజా ఫజల్ మహమ్మదుఖాన్ నిన్ను బడిలోంచి బహిష్కరించాడు. నాకు ఒక చీటీ వ్రాసి పంపాడు.'

'నాన్నా!' అభ్యర్థనగా అన్నాను.

'నోర్ముయ్! మూర్ఖుడా!' నాన్న విరుచుకపడ్డారు.

టపటపా నా చెంపమీద, తల మీద నాలుగు దెబ్బలు తగిలించారు. నాచేయి అడ్డపెట్టాను

దెబ్బలు తగులుతాయన్న భయంతో నేను అప్పటికే ఏడవ సాగాను.

'మీ అన్న చూడు. పిచ్చివాడిలా నీవలె బడిగోడదూకి వూరేగింపులో చేరలేదు.'

'మీరు ఆర్యసమాజంలో సభ్యులు గదా!' — అసహనంతో కూడిన ధైర్యంతో అడిగాను

'కానీ మీరు ఆంగ్లప్రభుత్వం మీద విశ్వాసంతో వెనక్కు మళ్ళారు.'

'నోర్ముయ్! చర్మం వొలిచేస్తాను.' అని నాన్న వూపిరి బిగబట్టి నా చెంప మీద మరొకటి వాయించాడు.

'మీది అన్యాయం. మేజిస్ట్రేట్ కుమారుడు ముగీన్, ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు కుమారుడు ఇంద్ర, భగవాన్‌సింగు, ఇస్మతు నాతో వున్నారు.' అని ఏడ్చాను.

'మిమ్మల్నందరీ బడిలోంచి తొలగించారు. వీధిలో అడుక్కుతినే వాళ్ళలాగా తిరిగి సంపాయించండి. మిమ్మల్ని మెట్రిక్ పరీక్షకు కూచోనీరు.'

నా ఏడుపులూ, పెడబొబ్బలూ విని అమ్మ బయటికి వచ్చింది.

'అయ్యో! నాయనా! నా బిడ్డగతి ఏంగాను!' అంటూ గుండెలు బాదుకుని ఏడ్చింది.

'నీవు వాణ్ణి చెడగొట్టావు! ఇప్పుడు ఏడుస్తున్నావు. ఈ పాడు వెధవ నాశన మయ్యాడు - హెడ్మాష్టరుకు దయగలిగితే తప్ప.'

నేను ఏడుస్తుంటే అమ్మ వచ్చి నన్ను దగ్గరకు తీసుకుంది. నేను పడ్డ బాధవల్ల అవమానంతో కళ్ళుమూతలు పడ్డాయి. నాకన్నీళ్ళు యింకిపోయి నాన్న బయటికి వెళ్ళేంత వరకు కళ్ళు తెరవలేదు.

'ప్రభుత్వానికి బుద్ధి, నీతిలేదు వారికిష్టము లేనివారిని హతమా రుస్తుంది.' అన్నాను నిరసనగా.

'నీలోని మంచితనం వల్ల నిరోధబావం బయటికి వస్తుంది నాయనా! నాకు తెలుసు'అని అమ్మ ఓదార్చింది.

'అయితే మాలో ఎవరిది ధర్మం? నాన్నదా? నాదా?'

అమ్మ సమాధానం చెప్పలేదు. నన్ను ముద్దు పెట్టుకుని నవ్వి ఏడవసాగింది.

నన్ను ఆమె యింట్లోకి తీసుకువెళ్ళింది. నేను ఏడుస్తూ వరం డాలో పక్కమీద పడుకున్నాను. అమ్మ అప్పుడప్పుడూ వచ్చి నాతల నిమిరి వెళ్ళేది. నా వ్యతిరేకతను నేను ఖండితంగా చెప్పిన వేదన గ్రహించి ఆమె నాపట్ల సానుభూతి చూపినందుకు ధైర్యం కలిగింది. గణేశ్ నా చుట్టుపట్ల లేడు. శివ నాదగ్గరకు వచ్చి — 'నేను అన్నం తీసుకువస్తాను. మనిద్దరం కలిసి తిని అమ్మ దగ్గర పడుకుందాం' అన్నాడు.

'నీవు వెళ్ళి తిను' అన్నాను.

ఆరోజంతా నేను మౌనంగా వుండి ఎవరితోనూ మాట్లాడలేదు. ఒక్క శివతో మాత్రమే ఒకటి, రెండు మాటలు ఇప్పుడు అన్నాను. అది గమనించిన అమ్మ నేను శివపట్ల చనువుగా వున్నానని గమనించింది. అందువల్ల నాకు వర్తమానం పంపడానికి వాడిని అమ్మ వుపయోగిం

చుకుంది. భోజనాన్ని గూర్చిన వర్తమానం ఒకటి రెండు మార్లు పునరావృతమైంది. నేను కోపంగా — 'నేను తినదలచుకో లేదు. నేను ఛస్తాను' అన్నాను. వాడు వంటగదికి వెళ్ళిపోయాడు. నేను వెళ్ళి ఇంతలో అమ్మ పడక మీద పడుకున్నాను. ఇంట్లో జరుగుతున్నదంతా వింటున్నాను. కానీ, నా మౌన ప్రతిజ్ఞ, నిరశనవ్రతమూ, వదలుకోదల చుకో లేదు. గాంధీ బోధించిన నిరసన విధానం ఇదే. నాస్థితి గతుల పట్ల అమ్మ సహకార సానుభూతులు పొందటానికి ఏర్పడిన ఆవశ్యకతవల్ల ఈ విధానాన్ని అవలంభించ దలచాను. గాంధీ మాటల మీద గౌరవం కూడా లేక పోలేదు. నాన్న ఇంట్లోకి వచ్చి ముఖం కడుక్కుని, నేను భోంచేశానా? లేదా? అని అమ్మను అడిగేవారు ఆమె లేదంటే నన్ను తిట్టేవారని ఆయన కంఠధ్వని గంభీరంగా వినిపించడంబట్టి అనుకున్నాను. భయగ్రస్తుడనై, ఆకలితో అలమటిస్తూ సన్మార్గంలో నడుస్తున్న మూర్ఖ మైన గాడిదనని అనుకున్నాను. నా అదృష్టం ఏమవుతుందో తెలియక నాగుండె వేగంగా కొట్టుకోసాగింది. చెమటలు పట్టాయి. విపరీతమైన జ్వరంవస్తే బాగుండునను కున్నాను.

ఆ మరునాడు ఉదయం వంటగదిలో పని చేసుకోవడానికి ముందు, అమ్మనాకు దుప్పటి పూర్తిగా కప్పివెళ్ళింది. నేనింకా లేవలేదు. నేననుకు న్నట్లుగా జ్వరము రాలేదు. రొజాయి వేడి నాచెంపలకు తగులుతోంది. చెమటతో నాకాళ్ళు వణికాయి. కడుపులో ఎలుకలు పరుగెడుతున్నాయి. చేతిలో వార్తా పత్రిక శబ్దం చేస్తుంటే నాన్న యింట్లోకి వచ్చాడు. అమ్మ పక్కమీద నుంచి శివలేచి గొణిగాడు.

నేను నిద్రలో మునిగి పోయాను. నాన్న శివను లాక్కెళ్ళి వరండాలో ముఖం కడగటంతో ఆప్రమాదం తప్పి యింట్లో మరో చప్పుడు వినిపించలేదు. నేను వంటరివాడినైనట్లు, అందరికీ దూరమై నట్లు బాధపడ్డాను. నాచెంప మీది దెబ్బలకన్నా ఇది ఎక్కువబాధ కలిగించింది.

విశాల ప్రపంచంలో ప్రకాశించడం సూర్యుని వంతు అయినట్లు కిటికీలో నుండి వస్తున్న కిరణాలను తేరిపార చూశాను. నేను మాత్రం దుఃఖంతో నిండిన గాఢాంధకారంలో మునిగిపోయాను. ఏమీ మారలేదని

ఆశ్చర్యం వేసింది. నా పేగులు ఆకలితో నకనకలాడి పోతున్నాయి. నోరు తడి అరి పోయింది. అయినా నానుదుటిమీద మృత్యుభయంతో కూడిన నాదం వినిపించినట్లు అనిపించింది. చివరకు గణేశ్, శివ వాళ్ళ సంచులు తీసుకొని బడికి వెళ్ళడం వినిపించింది. నేను పడు కున్న గదిలో వంటరి తనంతో కూడిన మౌనం రాజ్యం చేసింది. నేను మిగతా పిల్లలతో బాటు కలిసి వెళ్ళే అవకాశం లేకుండా బడిలోనుంచి తొలగించినందుకు అవమానం వేసింది. ఆయన నన్ను అభిమానించి వ్పటికీ, నేను ప్రధానోపాధ్యాయుణ్ణి ఇక చూడలేను. నాస్నేహితుల సంగతి ఏమిటి? ప్రపంచమంతా సంతోషంతో గంతులు వేస్తుంటే, నావలె వాళ్ళుకూడా బాధలు అనుభవిస్తున్నారా? హరిచంద్ర మాష్టారు మాతరపున ప్రధానోపాధ్యాయుణ్ణి అభ్యర్థిస్తారా? లేక ఆయన్నుకూడా తొలగించారా? మేము అమర్‌నాధ్ మాష్టారు తమ్ముడు కేదారనాధ్‌తో కలిసి వున్నామని రాజాఫజల్ మహమ్మద్‌ఖానుకు తెలిసిందా? నెలల తరబడి గాంధీని గురించీ ఇతర జాతీయ నాయకుల గురించీ అందరూ మాట్లాడు కోవడం ఆయనకు తెలియదా? జీవితం యధావిధిగా సాగిపో తోంది. సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. కంటోన్‌మెంటు నిండా సిపాయిలు తిరుగుతున్నారు. తెల్లదొరలు హాకీ ఆడుతూ తాగుతూ, సిగరెట్లు పీల్చు తున్నారు. పంజాబులోని ప్రధాన పట్టణాలలో నగరవాసులు డయ్యరు దురంతాలను గురించి గుసగుస లాడుతున్నారు.

చునీలాల్ బర్తరఫ్ అవతాడని మానాన్నకు తెలుసు. నాకు అమృత సర్‌లో ఏం జరిగిందో కూడా తెలుసు. స్వాతంత్ర్యమంటే మానాన్నకు శ్రద్ధ వుంది. డబ్బుకోసం ఆయన ప్రభుత్వపక్షం వహించి, తటస్థంగా వుండటం, ఆయన స్వతస్సిద్ధమైన భావాలను అణచివేసింది. బహుశా గాంధీ, ఆయన అనుచరులు త్యాగాలుచేసి, ఆంగ్ల ప్రభుత్వం మీద జయం సాధించితే, ఆయన పాలన వస్తుందని మానాన్న ఉద్దేశం.... హత్యకు, కొరడా ఝళిపింపులకు, బాకా అస్పృశ్యతకు వ్యతిరేకంగా పోరా డుతాను..... పోలీసు స్టేషనులో నన్ను చూసి మా అమ్మ జుట్టు విరబోసుకోవడం, పిచ్చిపట్టినట్లు పోలీసు ఇనస్పెక్టరు చెంపమీద కొట్టడం, —నాలో ప్రతిఘటనా స్థైర్యాన్ని సమకూర్చాయి. అయితే యిప్పుడామె

మితభాషిగా వుండి, తన దృక్పథంలో తప్పించుకొనే ధోరణి ఎందుకు అవ లంబిస్తోంది? కేవలం ముఖప్రీతికోసం మాట్లాడటానికి కారణం ఏమిటి? ఆమె సహనశీలత, సత్యసంధత ఏమైనాయి?

'ఒరేయ్ గణేశ్! ముందు హెడ్‌మాష్టారుగారి దగ్గరకు వెళ్ళి ఈచీటీ ఇవ్వు.... నిన్న సాయంత్రం వాళ్ళింటికి వెళ్ళాను. ఆయన, ముగీన్ నాన్న-ఫకీరు మొహినుద్దీన్‌తో కలిసి కారులో బయటికి వెళ్ళారు. ఆ కుర్రవాణ్ణికూడా, బళ్ళోనుంచి తీసివేశారు. ఈ మహమ్మదీయులు త్వరగా స్నేహితులౌతారు తెలుసా. ముగీసును మళ్ళీ బళ్ళో చేర్చుకుంటారు. ఇంద్రనాద్ వాళ్ళనాన్న పెద్ద ఇంజనీరు కాబట్టి అతన్ని కూడా చేర్చు కుంటారు. కానీ ఈ మూర్ఖుడు కృష్ణకు తెలియదు— మనది అంత పెద్ద కుటుంబం కాదు అని. నన్నుకూడా వైస్‌రాయ్ కమీషన్‌లో చేర్చు కుంటే మన హోదా పెరుగుతుంది. హోదా పెరిగే సంగతి అలా వుంచి ఈవెధవ అక్కడికి వెళ్ళి అంతా నాశనం చేశాడు. కల్నల్ సాహెబ్‌కు ఈవిషయం తెలిస్తే —'

'ఇంక మీరు పించను తీసుకుంటే మనం అమృతసర్ వెళ్ళిపో వచ్చు.' అమ్మ వ్యాఖ్యానించింది.

'అనవసరంగా వాగి, ఈ కుక్కను రెచ్చగొట్టకు. నా బిడ్డలు శ్రద్ధా భక్తులు కలిగి కష్టపడి పనిచేసే విధేయులు కావాలని కోరిక. ఎవరి ఉప్పపులుసు తిని వారికి నేను విధేయంగా వుంటున్నానో అలానే ఆ ఆంగ్లప్రభుత్వానికి వీళ్ళుకూడా విధేయులు కావాలి. కల్నల్‌గారు నావ్యతి రేకుల్ని ఏవిధంగా కాలరాచారో తెలుసుగా. ఈ పిల్లలు నేను ఎప్పుడూ చెప్పే విషయాన్ని గ్రహించు కోవాలి. మన కుటుంబానికి వున్న పేరు వీళ్ళు చెడగొట్ట కూడదు. వీళ్ళకొక తండ్రి వున్నాడని ఆయనకు తగిన బిడ్డలంగా పేరు తెచ్చుకోవాలనీ వీళ్ళు గ్రహించాలి' అంటూ నాన్న కేకలు వేశాడు

'వాళ్ళిద్దరినీ వెళ్ళనీయండి. లేకపోతే బడికి ఆలస్యమౌతుంది' అంది అమ్మ మధ్యలో అడ్డుపడుతూ.

'నీవు వెళ్ళి ఆకుక్కను లేపు. హెడ్‌మాష్టరు వీణ్ణి మళ్ళీ చేర్చు

కునేంత వరకూ యింట్లో కూర్చుని శ్రద్ధగా చదవమను.'

అమ్మ నన్ను లేపే ప్రయత్నం చేయనీయకుండా నేను దుప్పటి ముఖంపై కప్పుకున్నాను. నన్ను 'కుక్క' అని తిట్టడం అసహ్యమేసింది. నోట్లో చొంగ కారుస్తూ ప్రపంచమంటే పళ్ళుకొరుకుతూ ఆకలిగా నాకు దగ్గరగా వచ్చిన ప్రతి ఒక్కరిపై మొరగటానికి సిద్ధపడే నేను కుక్కతో సమానమని అనిపించింది.

అమ్మ ఆగది వ్యూడ్యటానికి వచ్చి—'లే! కృష్ణా!' అంది. క్షణ కాలం పాటు ఆమె కళ్ళకేసి తేరిపార చూశాను.

ఆమె నా పరిస్థితి అర్థంచేసుకొని మృదువుగా నవ్వింది. నాయ నమ్మ షక్షం వహించి మానాన్న ఆమెను కొట్టినపుడు అనేకమార్లు ఆమె ఈ మంచంమీద ఇలానే పడుకొని ఈ బాధ అనుభవించింది. కాబట్టి ఈ మంచం స్థితి ఆమెకు తెలుసు. ఆవిడ సానుభూతి స్పర్శకు తృప్తి చెంది ఆమె బయటికి వెళ్ళేంత వరకూ ముసుగుపెట్టాను. నాన్న బయటకు వెళ్ళే అడుగుల శబ్దం, అమ్మ నాగదికేసి రావడం వినిపించింది. నేను కళ్ళు విప్పి ఆమె నాముఖం కడగ నిచ్చాను.

నా నిరశనవ్రతం ముగించి మాయింటి ముంగిట కూచుని మాక్సిం గోర్కీ నవల 'అమ్మ' చదువుతున్నాను. సూర్యకిరణాల తళతళలు చూసినపుడు ఆ కాంతివాదర భవిష్యత్తును గూర్చి నేను మళ్ళీ ఆలో చించాను. నా ఆలోచనల వెంబడి వారు నడిచి వచ్చినట్లుగా వారిద్దరు మావాకిట ముందు నిలబడి 'ఇంట్లోకి వద్దామా? వద్దా?' అని గుసగు సలు పోతున్నారు.

'ఎవరక్కడ?' అంది అమ్మ వంటగదిలోంచి.

ఆమె బయటకు వచ్చి నా స్నేహితుల్ని పలకరించింది

'మీ దుంపలు తెగ! మీరిద్దరూ సంచులతో వచ్చారు....... మీరు బడికి వెళ్ళ లేదన్న మాట.'

'నమస్కారమమ్మా!' అన్నాడు ఇస్మత్తు.

భగవాన్‌సింగు నమ్రతతో చేతులు జోడించాడు.

'వాళ్ళయింట్లో వాళ్ళకు తెలియదు. వాళ్ళయింట్లో గణేశ్‌వలె చాడీలు చెప్పేవాళ్లు లేరు.' అన్నాను కటువుగా.

'ఫరవాలేదు.' అమ్మ ఓదార్చింది 'దొరలు ఆఫీసునుండి వెళ్ళి పోయిన తర్వాత సైకిలుమీద మీనాన్న ఊళ్ళోకి వెళ్ళి వస్తారు. నిన్ను మళ్ళీ బళ్ళో చేర్చుకుంటారు. బాబూ! మీరు ఏం తాగుతారు. తేట మజ్జిగ మరీ చల్లగా వుంటుంది. మీకు అందరికీ తినడానికి ఏదో ఒకటి యిస్తాను.'

అవమానంతోనూ, భయంతోనూ పాలిపోయిన ముఖాలతో వణు కుతూ ఆ యిద్దరు పిల్లలూ నా దగ్గరకు వచ్చి కూర్చున్నారు. నేను తలవూపి అమ్మకేసి తల పంకించాను. అమ్మ తినడానికి ఏదో ఒకటి తెచ్చేంతవరకూ వేచివుందామని సూచించాను. వాళ్ళు తలలు వంచుకొని కూచున్నారు.

నేను ముడుచుకొని పడుకున్నాను.

'మనం ఒక పరుపు చుట్ట బెట్టి కూచుని చదువుకుందాం' అన్నాను. ఒక మంచం వాల్చుకుని మీరు ముగ్గురూ కూర్చుని ఇవి తినండి.' అంటూ అమ్మ తన వొళ్ళోంచి ఖర్జూరాలు గుప్పెళ్ళతో మాముందు వుంచింది.'ఇంక వెళ్ళి కలిసి చదువుకోండి.'

'ఎవరైనా మమ్మల్ని చూసి మామీద చాడీలు చెప్తారేమో' అన్నాడు భగవాన్‌సింగు.

'మనం డేరాలో కూర్చుని తెరలు దించేద్దాం' అన్నాను. అందుకు వాళ్ళు అంగీకరించారు.

మేము నానాయాతనాపడి మంచాన్ని యింట్లోంచి బయటికి లాగాము.

మేము కూచొని ఖర్జూరాలు నములుతున్నప్పటికీ, మా గుండె లోతుల్లో మెదలుతున్న భావాలు మా చెవుల్లో గింగురుమన్నాయి.

'నన్ను చావబాదారు' అన్నాను నామీద నేనే జాలిపడుతూ.

'నేను బడికి బయలుదేరి వస్తుంటే. ఈ ఉదయం మా పెదనాన్న వాకేసి అనుమానంగా చూసినా, నేను గుట్టు బయట పెట్టలేదు.' అన్నాడు భగవాన్‌సింగు.

'నేను బడి మానేసి, కమ్మరి పని నేర్చుకోవాలని మానాన్న పట్టు బడుతున్నారు! మా అన్న కర్మతుల్లాకు మాత్రం కోపం..... అయినా ఓ భగవంతుడా! హెడ్మాష్టరు మమ్మల్ని ఎందుకు చూడాలి?' అన్నాడు ఇస్మత్· 'వూరేగింపు అయిన తర్వాత మనం బడికి వెళ్లి వుందుము. దానికి బదులు ఆయన బెత్తం దెబ్బలుతిని, బడిలోంచి గెంటివేశారు.'

తుఫానులో కొట్టుకొచ్చిన అనాథల్లా అందరం మౌనంగా వుండి పోయాం.

'ఏది ఏమైనా మనం తీసుకొన్న ప్రతిజ్ఞకు కట్టుబడి వుందామని ప్రతిజ్ఞ చేద్దాం.' నా గుండెలో బలహీనమైన కేక వినిపించి అన్నాను. వాళ్లు నన్ను వొంటరివాణ్ణి చేసి వెళతారేమోనని భయంవేసింది: 'మనం బాధితులం. 'వాళ్ళు' రంపపుకోత కోసేవాళ్ళు' అన్నాను.

భగవాన్‌సింగు, ఇస్మత్ ఒకరి చేతిమీద మరొకరి చేయి వేశారు. నేనూ నా చేయి వాటిమీద పెట్టాను. ఒక నిముషంసేపు అలానే వుండి పోయాం.

ఇస్మతుల్లా చేయి వెనక్కి తీసుకొంటూ నవ్వి అన్నాడు

'ఇప్పుడు భగవాన్‌సింగ్ ఒకపాట వినిపిస్తాడు.'

'తర్వాత మనం అందరం కలిసి 'హీర్' పుస్తకం చదువుదాం. మా నాన్న అలమరాలో నుండి తీసుకొస్తాను.' అన్నాను.

భగవాన్‌సింగు యిబ్బంది పడ్డాడు. మేము అతణ్ణి వున్నట్లుండి పాడమంటామని వూహించలేదు. మొదట్లో తల అడ్డం తిప్పాడు.

'కానీ' అని అరిచాను.

తటపటాయించి, గొంతు సవరించుకొని ఉర్దూలో ఒక మధుర

గీతం పాడసాగాడు·

'ప్రేమికులు మంచి వారయితే
లోలోపల బాధ మొదలవుతుంది!
నా కన్నీటి ధారలకు స్రవంచి
ఆమె తనంతతానే వస్తుంది.'

ముంతాజ్ సుమధుర సంగీతంవలె భగవాన్ కంఠం మంత్ర ముగ్ధుల్ని చేసింది. ప్రేమికుల సానుభూతి పొంది, ఆమె కొంత బాధ పొందినప్పటికీ ఫలితం కలగడం అన్న భావంగల ఆపద్యం మా ముగ్గుర్నీ బాగా కదిలించి వేసింది.

ఈ పద్యంలోని పదాలు, సంగీతం ద్వారా గత కొద్ది నెలలుగా నా అంతరాత్మలోని కఠిన భావాలు వ్యక్తమయినట్లు తోచింది. నా స్వభావంలో అంతర్గతంగా వున్న హింసాప్రవృత్తి, మంటల్లో దూకడానికి సిద్ధంగా వుండే బాహిరప్రవృత్తి, ఈ గీతంలోని భావాల్లా నాలో పలాయనవాదం నెలకొని వుంది. నా వెనక వున్న విశాల వైరుధ్య ప్రపంచంలోని భయానక శక్తికి నేను వణకి పోయాను. నా జీవితంలోని జాగ్రత్ శక్తులు విద్యుచ్ఛక్తిలా అక్కడక్కడా అస్తవ్యస్తంగా ప్రసరించి నాలో ఉద్రేకాన్ని రెచ్చగొట్టాయి.

నా శత్రువుల్ని చంపడం నాకిష్టం లేదు. న్యాయం కావాలి — అందువల్ల నేను నిజానికి రాజకీయవాదిని కాదు. చనిపోయిన భారతీయుల్లో కొందరు తెలిసో తెలియకో బలి అయివుంటారు. 'నేను నీకోసం త్యాగం చేస్తాను.' అన్న సామెతను ఉత్సాహంగా ఇస్మత్ పునశ్చరణ చేశాడు· 'ఇంకో పాట విందాం.'

'కవిత్వం అంటే పడి చస్తాను.' అన్నాను ఆనందంగా. ఏదో శక్తి నన్ను ఆవహించినట్లుగా కదలిపోతూ, ఆ పదాల మాధుర్యానికి వివశుడనై పోయాను.

ఆరోజంతా మేము ముగ్గురం కలిసి వుండి పోయాం. మా పార్శ్య సంకలనంలోని షెల్లీ మహాకవి పద్యాలు చదువుతూ గడిపాము. బడినుంచి యింటికి తిరిగి వచ్చే సమయానికి గణేశ్, శివలకోసం ఎదురు చూశాము.

సిపాయిలు నాలుగోగంట కొట్టేసరికి సరిగ్గా వాళ్లు వచ్చేశారు. నాన్నవాళ్లను సైకిలు మీద తీసుకొచ్చారు. ఒకళ్లు నాన్న ముందు, మరొకరు వెనక కూచొని వచ్చారు.

భగవాన్‌సింగు, ఇస్మతుల్లా నాతో కలిసి వుండటం చూసి, వాళ్లు కూడా నావలె బడిలోంచి వెళ్లగొట్ట బడ్డారని తెలుసుకొని నాన్న గుడారంలోకి వచ్చి మంచం మీద కూచొన్నారు. మొహంలో శ్రమ, బాధ కనిపిస్తున్నా నా స్నేహితుల్ని చూసి చిరునవ్వు చిందించారు. హెడ్మాష్టరు వద్దకు ఆయన వెళ్లి వచ్చిన పని విఫలమైందని తోచింది.

'మీరు ముగ్గురూ మెట్రిక్ పరీక్షకు వెళ్లే అదృష్టం వున్నట్లు లేదు.' అన్నారు కాకీ చొక్కా విప్పి గణేశ్‌కిస్తూ గంభీరంగా నాన్న.

మంచం మీది నక్కి కూచొన్న మేము తలలువంచి కాళ్లకేసి చూస్తూ వుండిపోయాము.

పేడపురుగు ధ్వని తప్ప, క్షణకాలం నిశ్శబ్దం ఆవరించింది. నాన్న తెచ్చిన ఆఫీసు సైకిలు శివ పాడుచేయడం చూశాడు నాన్న: 'అరే! ఆగు. ఆసైకిలు ముట్టుకోకు..... వెళ్లి పాలుతాగు.' అని అరిచారు.

మాయింటి బయటిగోడకు సైకిలు ఆనించి, వాడు నాన్న ఆదేశాన్ని విధేయంగా పాటించి, ప్రమాదం నుండి తప్పుకొన్నాడు.

నాన్న తన ఉద్రేకాన్ని ముఖ కవళికల ద్వారా చూపుతూ ప్రసంగించాడు: 'మిమ్మల్ని తిరిగి బడిలో చేర్చుకొనే విషయంలో మీ హెడ్మాష్టరు మొండి పట్టు పట్టాడు. అందువల్ల నేను కెప్టెను అబితాన్‌గారితో మాట్లాడాను. ఆయన ఐర్లండు, బ్రిటీషు రక్తాలు పంచుకొని పుట్టినవాడు, అందువల్ల భారతీయులంటే సానుభూతి. ఆయన ఐరిష్ నాయకుడు డి వెలారా అనుచరుడు..... గాంధీని ప్రశంసిస్తూ ఒకసారి నాతో మాట్లాడాడు..... నన్ను బుట్టలో పడవేయడానికి అలా మాట్లాడుతున్నారనుకొన్నాను. కాని, అలాకాదు. ఆయన నిజంగా సానుభూతి గలవాడు. ఆయన హెడ్మాష్టరుతో మాట్లాడుతారు..... నా మాట వినని రాజా ఫజిల్ మహమ్మద్ ఖాన్ కనీసం తెల్లదొర మాట వింటాడని ఆశిద్దాం.... మీరు వెళ్లండి.... నేనోగంట విశ్రాంతి తీసుకొంటాను.'

యముని తుదితీర్పు కోసం వేచివున్న పాపులవలె మేము భయంతో వణికిపోతూ నెమ్మదిగా అడుగులు వేసి చీలిపోవడానికి సిద్ధపడ్డాము.

'మళ్లీ రేపు ఉదయం ఈ గుడారంలో కలుద్దాం.' అన్నాను రహస్యంగా.

వాళ్లు తలలువూపి వాళ్ల యిళ్లకేసి బయలుదేరారు. నేను మా యింటి లోపలికి వెళ్తూ చికాకు పడ్డ మనస్సుతో ఆత్మక్షోభకు గురి యయ్యాను. నాలో ఎంత సత్యం ఉంది? ఎంత ధైర్యము? ఎంత భయము ఉన్నాయి? అనేది సమస్య.

మాయింటి పరిస్థితుల్లో తేడాలేదు. మంచివాడైన గణేశ్, ఎప్పుడూ ప్రశ్నలతో విసిగించే శివ, భావోద్రేకంతో మసలే అమ్మ-నిత్యమూ కన్పిస్తారు. హరిచంద్ర మాష్టారు యింటివైపు దారి సహజంగా తొక్కాను. గాంధీ ఉద్యమంతో సానుభూతి చూపే స్వభావంగల ఆయనను బడిలో వుద్యోగంలోంచి తీసేశారో లేక ఉదాసీనభావం వహించారో నిర్ధరించుకోవాలను కొన్నాను. పొలాలకేసి వెళ్లాను.

ఆ మధ్యాహ్నవేళ పచ్చని ఆ పొలాలమీద సూర్యరశ్మి తళతళలు కన్పించాయి. చెట్లమీద చిలుకలు సవ్వడి చేశాయి. ఫర్లాంగు దూరంలో యిటుకరాతి బారకాసులు కన్పిస్తున్నాయి. ఇంట్లో నన్ను పట్టి పీడిస్తున్న భయాందోళనలనుండి వూరట కలగలేదు. నా ధోరణికి సరిపోయేటట్లు ధూళితో కూడిన తుఫాను వస్తే బాగుండును. ప్రశాంతతవల్ల అన్ని వస్తువులు నామీద కుట్ర వన్నినట్లు తోచింది.

పొలాలమధ్యలో పాకి చరచరా వెళ్తున్న జీలంనది కాంతి మహాసర్పపు నాలుకవలె కన్పించింది. దాని సైగకు యిక్కడకు వచ్చి ఆరాధించి, భయకంపితుడ నయ్యాను. మాష్టరు హరిచంద్ర యింటివైపు నాకాళ్లు లాగుతున్నాయి. భగవాన్‌సింగు ఉర్దూ గజల్‌లోని భావాలు, నేను ఆరాధించిన స్త్రీల శరీర సౌందర్యం మిళితమై పోయాయి.

గజల్‌లో పదాలను కూనిరాగాలు తీశాను. నా నరనరాల్లో సంగీత ధ్వనులు ప్రసరించి, ఆడభూతం దగ్గరకు తీసుకెళ్లాయి. అది భయంకరమైన భూతం కాదు. నాలోంచి బయటికి వచ్చిన ఒక అస్పష్టమైన

ఆకారం మాత్రమే. నామీదికి వంగి చూస్తున్న ముంతాజ్ ఆకారం అస్పష్టంగా గుర్తుకు వస్తోంది.

శకుంతల నా నుదుటిపై ముద్దుపెట్టు కొన్నట్లుంది. కాని, వాళ్లిద్దరి కంటె భిన్నంగా నల్లగావున్న ఆకారం ఆశ్చర్యంగా కనిపించింది. గాయకుని కంఠంలోని మధుర జ్ఞాపకాలు అస్పష్టమైనాయి. నా గోదురు కప్ప కంఠంలో ఆ బాధను సహించలేను. ప్రేమికుని తప్పుడు ఊహల వలె, నాకు గుర్తున్న కొద్ది పదాలుకూడా దోషంగా కనిపించాయి. ఆ శబ్దాలకు తోడు, ప్రతిక్షణం నాకోసం ఒక గ్రామీణ యువతి ఉద్భవిస్తే బాగుండుననిపించింది. నామీది సానుభూతితో దయచూపగల యువతి ఎవరైనా కనిపిస్తే బాగుండును. ఆమె నాకేసి స్వయంగా వస్తే, నేనామె హృదయాన్ని అధిష్టించి, ఆవిడమీది ప్రేమతో ఆకర్షితుడ నౌతాను.

ఆ గ్రామానికి సమీపంలో ఏతాముబావి దగ్గర కొద్దిమంది మహ మ్మదీయ రైతులు తిరుగుతున్నారు. కొందరు చెరువులో కూరగాయలు కడుగుతున్నారు. ఇద్దరు అక్కడ కాళ్లు చేతులు కడుగుకుని సాయంకా లపు ప్రార్థనలకు కాబోలు సిద్ధపడుతున్నారు.

నిజానికి నేను పిచ్చి వాణ్ణా లేక ప్రపంచమే పిచ్చిదా? అని ఆశ్చర్యం వేసింది. నాలోని దుఃఖమూ, ఒంటరితనమూ చూసి తప్పు చేసినట్లుగా అనిపించింది. భగవాన్‌సింగు పాట ఇంకా ఎందుకు జ్ఞాపకం వుందో అర్థం కాలేదు. ఉన్నట్లుండి శూన్యంలోంచి ప్రణయం పుట్టు కొస్తుందని వూహించటం పట్ల సిగ్గువేసింది. నేను కవినై 'గజళ్ళు' వ్రాయ గలిగితే నన్ను పిచ్చివాడి కింద లెక్క గట్టే యింట్లో బళ్ళో, సిపాయిలమధ్య చిత్రహింసలకు గురి కాకుండా తప్పించు కోవచ్చు. కవి యైన వాడు-అందరివలె సాధారణ మానవుడుగా వ్యవహరించక అన్నిటినీ త్యజించి ఖండించటానికి సిద్ధపడతాడు. అయితే కవిత్వం వ్రాసేశక్తి, సామర్థ్యాలు నాలో వున్నాయా? తప్పకుండా ఉన్నాయి. లూధియా నాలో ముంతాజ్ గానపారవశ్యానికి ముగ్ధుడనై గీతం అల్లడానికి ప్రయ త్నించాను. డాక్టరు కుమారుడు 'హీరా' గానం చేసినపుడు అలాంటి ప్రభావమే కలిగింది. గత సంవత్సరం కనోవాలో దేవకిపిన్ని సౌంద ర్యాన్ని గూర్చి ఒక నవల వ్రాయడానికి ప్రయత్నించాను. ఇప్పుడు కవిగా

భావన కలిగింది..... హెడ్మాష్టరుతో తన సంభాషణను గురించి నాన్న చెప్పిన తర్వాత బడిలో నాభవిష్యత్ జీవితాన్ని గురించి నిరాశ కలిగింది. ప్రపంచమే తృణీకరించినట్లుగా దయనీయ స్థితిలో వుండటం వల్ల అలా అనిపించివుంటుంది.

ఆలోచనలను తొలగ దోసుకోని నావేగం హెచ్చించాను.

ఆశ్చర్యం! హరిచంద్ర మాష్టారు వికార రూపం నాకేసి వస్తోంది. 45°కోణంలో ఆయన పాదాలు కదిలి వస్తున్నాయి.

'ఒరేయ్! ఎక్కడనుండి వస్తున్నావు? నేను స్నానానికి బావి దగ్గరకు వెళుతున్నాను. నాతోగూడ రా' అన్నారు బిగ్గరగా.

అలా హఠాత్తుగా ఎదురుపడి మాట్లాడుతాడనే వూహ లేనందువల్ల ఆలస్యంగా చేతులు జోడించి నమస్కరించాను.

బావికేసి నడుస్తూ ఆయన ఇలా అన్నాడు: 'నిజానికి రాజకీయ వూరేగింపులలో పాల్గొనడానికి కుర్రవాళ్లను, గోడలు దూకేలా రెచ్చగొట్టిన వారిని శిక్షించాలి-కుర్రవాళ్లను కాదు. లేదా, కొన్ని పనులు చేయకూడదని తెలిసిన బడి పంతుళ్ళను శిక్షించాలి. ఆయనలో కలిగిన ఈ మార్పుకు ఆశ్చర్యంవేసి ఆయన చిత్తశుద్ధితో అంటున్నారా? అని ఆలోచించాను. పరిశీలనా దృష్టితో చూస్తున్న నాదృష్టిని ఆయన తప్పించు కున్నారు. హరిచంద్ర మాష్టారు పిరికివాడని నాబుద్ధికి తోచింది.'

'లాలాకేదారనాథ్ నన్ను ఉసికొల్ప లేదు. మా అంతట మేమే ముగ్గురమూ ప్రతిజ్ఞ చేశాము' అన్నాను. బడికి వెళ్ళేదారిలో ఆయన మాకు చెప్పిన మాటలు, కేదారనాద్ మాటల కంటె ఉసిగొల్పాయని అందామనుకున్నాను. మళ్ళీ నిగ్రహించు కున్నాను.

'నేను అతణ్ణే వుద్దేశించే అన్నాను.' మేష్టారు తన గంభీర స్వరంతో అన్నారు: అతడు అమరనాధ మాష్టారు తమ్ముడు కాబట్టి అతనికేమీ నష్టంలేదు. నేను స్నానం అయిన తర్వాత అసలు మాయింటికి వచ్చి మీనాన్నను చూద్దామనుకున్నాను.

మీ నాన్న గాని, నీ స్నేహితులు గాని నాగురించి పల్లెత్తు మాట బయటికి పొక్కనీ కూడదు!

ఆయన పట్ల నాకు ఉన్నట్టుండి అసహ్యం వేసింది. ప్రభుత్వం గురించి ఆయన చెప్పిన సాహస వాక్యాలు వట్టివి.

'మీరు క్షమించమని హెడ్‌మాష్టరును అర్థించండి.' అంటూ ఆయన సలహా మొదలు పెట్టారు.

నా కోపంలో నాలుక దాకా వచ్చిన తిట్టును అవుకొని పక్క కాలువగట్టుమీద పరుగు తీశాను.

'అరె! కృష్ణా! ఆగు!' అని ఆయన పిలిచారు.

మంచితనం గురించి బాధపడటం మానివేశాను. ఆయన మాటలు వినదలచు కోలేదు. మోసమంటే గిట్టదు. గాలిలో కలిసిపోయాను.

అలా కాలువగట్టుమీద పరుగెత్తుకుంటూ వస్తే, రెజిమెంటల్ బజారు సమీపంలోని మాయింటి పక్క పొలాలు కనిపించాయి. జరిగిన దంతా భగవాన్ సింగుకు వెళ్ళి చెబుదామనే ఆలోచన వచ్చింది. బాబూ కుషీరామ్ తప్పకుండా ఎదురు పడతాడు. ఈరోజు నా జీవితంలోని అన్ని రోజులవలె మొహమాట పడలేదు. భగవాన్‌సింగు పాటను కూనిరాగాలు తీస్తూ, బజారుకేసి నడిచాను. నాలో కవిత్వాన్ని అది ఉద్రేకపరుస్తుందేమో ననిపించింది. నాకంటిముందు కనిపించిన ప్రకృతి దృశ్యాలను పరిశీలిస్తే, మంచు బిడకుచ్చులు ఎదురుగా తోరణ మాలికల్లా కనిపించాయి. ఊపిరి సలపలేనట్లుగా వున్న తీవ్రమైన కోరికలు నాగందరగోళానికి తోడ్పడ్డాయి.

ఉన్నట్లుండి జిమ్మీ కూతురు హెలెన్ నాముందు ప్రత్యక్షమైంది. నాకళ్ళను నేను నమ్మలేక పరిశీలించి చూశాను. ఆమె అక్కడ వుంది.

నేను నెమ్మదిగా నడిచాను. కొంచెం వేగంగా నడిచి ఆమె నందుకుందా మనుకున్నాను. కానీ నేను తొందర పడితే ఆమె నాచెంప వాయిస్తుందేమోనని ముందు జాగ్రత్త పడ్డాను. చీకట్లో ఎవరో సిపాయి వచ్చి తనమీద పడ్డాడని ఆమె భయపడవచ్చు. ఒకటి రెండు సార్లు ఆమె

నన్ను తనతో ఆడుకోవటానికి ఇంతకుముందు తీసుకెళ్ళింది. వాళ్ళ అమ్మ జిమ్మీ సర్కసులోని ఆడ సింహంలా బుట్ట కుర్చీమీద కూర్చుని 'గుర్రు గుర్రు' మంటూ నాకు టీ యిచ్చింది. బజారులో అనుకోకుండా తటస్థపడినట్లు నేను పన్నాగం పన్ని కిరసనాయిలు ఆమెకు ఇవ్వగల శక్తి వుంది. కానీ, నన్నావహించిన స్వతంత్ర భావాన్ని నిగ్రహించుకునే దెలా?

రాళ్ళదారి వెంబడి చిందర వందరగా పరుగెత్తాను. ఆడపిల్లి కోసం వెంపర్లాడే మగపిల్లిలా నెమ్మదిగా అడుగులు వేస్తూ ఆగాను. ఆ సాయంకాలపు సవ్వడిలో నాగుండె కొట్టుకోవడం వినిపించింది. హెలెన్ మీద కోరికతో భయంవేసి ఆ ప్రయత్నాన్ని విరమించు కున్నాను. మళ్ళీ పుంజుకొని సరియైన దారిలో నడిచాను. పండిత బదరీనారాయణ దేవాలయం వీధిలో తొంగి చూశాను. నేను చేస్తున్న ఈ అపవిత్రమైన వాంఛ దేవుడు మేల్కొని చూస్తున్నాడేమో ననిపించింది. భగవంతుణ్ణి ఎదురించగలననే నమ్మకంతో గుడివైపు తిరిగి వుమ్మివేసి, మిఠాయిలు అమ్మే ధన్నా అంగడి కేసి త్వరత్వరగా నడిచాను. నాజేబులో నాణెం స్పర్శతగులుతోంది.

మిఠాయి లంగడిలో ధన్నా సహాయకుడు ఓ పిసినారి కూచుని వున్నాడు.

'పదిపైసలకు మిఠాయి' అన్నాను.

'ఓ నా బంగారు రత్నమా! నాబిడ్డా! కృష్ణా!' అంటూ ధన్నా పలకరించాడు· ఇన్ని రోజులుగా ఎక్కడి కెళ్ళావోయ్. పాలకోవాకు రాలేదేం? చదువు మీద శ్రద్ధ ఎక్కువైందా?'

అతనికేసి చూడకుండా వుండటానికి ప్రయత్నించాను. కానీ, చేతులు కలపక తప్పకలేదు. మశూచికం గుర్తులతో వున్న అతని మొద్దుముఖం కొట్టవచ్చినట్లు కనపడుతోంది.

'ఒరే కంషీ! ఈ కుర్రవాడికి పాలకోవా, కొన్ని లడ్డూలు యివ్వు.....' రామచంద్రగారి అబ్బాయి కాబట్టి డబ్బు మాత్రం తీసుకోకు.' అన్నాడు ధన్నా తన సహాయకుడితో.

'అలా వీలు లేదు' అన్నాను పొగరుగా: 'నా దగ్గర పైసలు వున్నాయి. పాలకోవా ఉచితంగా తీసుకుంటాను గానీ, లడ్డూలు కొంటాను.'

'ఆగు! ఆగు! నీకిచ్చిన కానుకలు తీసుకుని అందులో గణేశ్‌కూ, శివకూ పంచియివ్వు. నా లైసెన్సు పునరుద్ధరించడానికి పెట్టుకున్న దరఖాస్తు గురించి ప్రస్తావించడానికి మీ నాన్నగారిని కలవాలి' అన్నాడు ధన్నా.

నాచేతుల్లో ఆకు దొన్నెలు రెండు పట్టుకొని కనుమరు గయ్యాను. అక్కడ అంగళ్ళలోని చమురు దీపపు వాసనలు నన్ను అలరించాయి. నా గుండెలో హెలెన్‌కోసం వేటాడుతూ నిరాసక్తంగా వెళ్ళాను. రామానంద్ అంగడి మెట్లవద్ద ఆమె కోసం చూశాను. చెమటలు పట్టిన నా శరీరంలో ఆమెపై కోరిక తపనగా మారింది. ఆ కోరిక మీది ధ్యాసతో వణికి పోయాను.

నే ననుకున్నట్లుగా ఆవిడ అక్కడవుంది. అవిడ ముఖకవళికలను ఆ రాత్రి పూట నీలికాంతులలో దీపపు ప్రమిద వెలుతురులో ఆమె నల్లని శరీరచ్ఛాయ మెరిసి పోతోంది.

'హే... లెన్....' అన్నాను తన కూతుర్ని జిమ్మీ పిలిచేయాసతో.

'బుల్లీ' అని ఆమె మృదువుగా నవ్వుతూ సమాధానమిచ్చింది. వాళ్ళ అమ్మ నన్ను ఈ పేరుతో పిలిచేది.

ఆవిధంగా నన్ను మరెవరైనా, పిలిచి వుంటే తిరస్కరించి వుండేవాణ్ణి, కానీ, ఈ సాయంసమయంలో ఆ ధ్వనిలోని సాన్నిహిత్యం నా అహంభావానికి స్తోత్రప్రాయమై వూరట కలిగించింది.

విలాస వనితకు వలె ఆమె పక్క పాపిడితీసి కొప్పులో బంతిపూవు తురిమింది. వదులైనగౌను ఆమెకు నప్పలేదు.

దుమ్ముకొట్టుకొన్న ఆమె కాళ్లకు చెప్పులులేవు. భగవాన్‌సింగు కవిత్వంలోని భావాలు నా హృదయంలో ప్రసరించి నాకళ్లముందు ఆమె నల్లని రాజహంసలా భాసిస్తోంది.

'ఈ దొన్నెలలో లడ్డూలున్నాయి. దారిలో మన మిద్దరం తిందాం' అన్నాను.

'సరే! బెల్లం తిరిపెం పెట్టండి శెట్టిగారూ!' అంది ఆమె. రామానంద శెట్టితో, చిల్లర లెక్క పెట్టుకొంటూ.

'ముష్టిదానా! వెళ్లు' అని రామానంద తిట్టాడు. ఆయన చెవిరింగుల తళతళలు కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయి.

'ఇవ్వండి. రామానందగారూ!' అన్నాను ఆవిడ తరపున వాదిస్తూ.

'ఎవరూ! కృష్ణనా!' అంటూ చీకట్లోకి చీల్చుకొని చూస్తూ— 'నీకైతే తప్పకుండా!' అని నా చేతిలో బెల్లం ముద్ద పెద్దదిపెట్టి, చిన్న వుండ హెలెన్ కిచ్చాడు.

ఆసందులో మేము నెమ్మదిగా నడుస్తున్నాము. హెలెన్ మీద వ్యామోహంతో నా గుండె దడ పెరిగింది.

'ధనవంతు లంటే వాళ్లకిష్టం.' చీకట్లో వెళుతుంటే అంది హెలెన్.

'మా నాన్న వీళ్లకి తన ఆఫీసులో ఏవో సహాయం చేస్తుంటారు.' అన్నాను: 'ఇది తీసుకో!' అంటూ లడ్డు యిచ్చాను. నా గుండెతీసి శరీరంలో ఏదో కాంతి ప్రసరింప జేసింది.

'వద్దు. వద్దు' అంది ఆమె నెమ్మదిగా నిరాకరిస్తూ.

'హెలెన్' అని బ్రతిమాలాను.

ఆమె ఆగి, నాకేసి తప్పు చేసిన దానిలాచూసి, ఒక ముక్క తీసుకొని— 'నేను క్రైస్తవ మతానికి చెందిన దానిని. నీ దొన్నెముట్టుకొని వాటినన్నిటినీ అపవిత్రం చేశాను.' అంది.

'ఫర్వాలేదు.' అన్నాను మృదువుగా. నా కళ్లలో నీళ్లు తిరిగి నట్లైంది. 'వూడ్చే కుర్రవాడు బాకా ఎంగిలి సిగరెట్లు తాగుతాను. ఇస్మత్‌తో కలిసి భోంచేస్తాను, అతను మహమ్మదీయులు. మీ యింట్లో నేను టీ తాగలేదా?' ఈ మాటలు పలికి, ఆవిడమీద సానుభూతి నాప్రణయంలో భాగమై నేను విజయోత్సాహం పొందాను.

బజారులో కుక్క మొరుగుతోంది. అది విని మిగతా కుక్కలు వీధినిండా మొరిగి ప్రతిధ్వని కల్పించాయి.

'చీకట్లో నాకు భయం' అంది హెలెన్. ఆమె కనుపాపలు మిలా మిలా మెరుస్తున్నాయి.

'ఆ బండ మీద కూచొని తిందాం' అన్నాను భయంగా. ఆమె నాకోరికను మన్నించదని తెలుసు. అంగట్లో సామన్లు కొన్న తర్వాత అటూయిటూ వెళ్లకుండా నేరుగా యింటికి రమ్మని వాళ్ల అమ్మ గట్టిగా మందలించి పంపిందని తెలుసు.

'ఒక్క నిముషం!' అంది.

నేను మరో లడ్డు యిచ్చాను.

'నువ్వు కూడా తిను.'

నేనామె మాట శిరసావహించాను.

నా మనసులో కలవరం ఆరంభమైంది. నాలోని కోరికలతో నాకేమీ తోచడం లేదు. నేను ఆవిడను ముట్టుకొని, కావులించుకొందామని వుంది. సిగలో బంతిపువ్వు ఆమె త్వరగా వశంవద అయ్యేబజారు వనితలా గోచరింప జేస్తోంది. అమాయకపు చూపులతో కూడిన ప్రశాంత వదనంపై ఆమె ముసుగువేసుకొంది.

నా లోలోపల అణచివేయబడ్డ కామవాంఛతో సాహసించి రాపెక్కిన గొంతుతో మెల్లగా అన్నాను·

'ఓనా ముద్దబంతి పూవా! హెలెన్!'

'కృష్ణా! నీవు నా దైవానివి' అంది నా పేరుమీద చమత్కరిస్తూ.

ఆమె అంగీకార ముద్రవల్ల కలిగిన ఆనంద పారవశ్యంతో దూసుకెళుతున్న పక్షుల్లా నా ఆలోచనా తరంగాలు ఆకాశాని కెగిరాయి.

నేను నెమ్మదిగా ఆమె చుబుకం ముట్టుకొని నావైపుకు తిప్పాను. ఆమె నామీదికి వంగి నా చెంపకు ఆమె ఎడమ చెంప ఆనించింది.

కృష్ణుని మాయా మురళీనాదంలా నా పంచేంద్రియాలూ పరవశించి పోయి, నా ఆత్మ దూర తీరాలకు పయనించింది. నిజానికి నా పేరుకు అర్థం వుందా? నన్ను నేనే ప్రశ్నించుకున్నాను. నేను కవినైతే అది ఒక శుభశకునం. ఇప్పుడు హెలెన్ నన్ను విడిచి వెళ్ళిపోతుంది. ఆమెకోసం ఎదురుచూస్తూ నేను ఒంటరివాణ్ణవుతాను.... కాలం స్తంభించిపోతే బావుండును. ఆవిడను కౌగలించుకో గలిగితే...

నాజోస్యం నిజమైంది.

'ఆలస్యమైంది. వెళతాను. అమ్మ తిడుతుంది.' అంది.

'నేనూ నీతో వస్తాను.'

* * *

ఆ మరునాడు ఉదయం నాన్న కనిపించకుండా ముఖం దాచుకుని తిరగ సాగాను. ఈ రోజు ఆయన నన్ను తప్పకుండా తిడతారు. నిన్న మధ్యాహ్నం గుడారంలో ఇస్మతుల్లా, భగవాన్‌సింగుల ముందు ఆయన అలా చేయలేక పోయారు. అమ్మ కెదురుగా వంటగదిలో కూచుని బీజగణిత సూత్రాలను ముందు వల్లించ సాగాను. వంట గదికి పక్కగా చిన్న చదరపు గుడారంలో రాతి చప్టాపై నాన్న స్నానం చేయటానికి వస్తున్న శబ్దంవిని వరండాలోకి జారుకున్నాను. ఇక్కడ గణేశ్ ఆడం బరంగా పాఠాలు చదువుకుంటున్నాడు. నేను యింట్లోంచి గుడారంలోకి జారుకొని సూర్యునికెదురుగా వున్న తెరపైకెత్తి తప్పు చేసిన వాడిలా కూచుని, రేఖా గణితం పునశ్చరణ చేస్తున్నాను. నాకళ్ళు పరిశీలనగా తిరగ సాగాయి. స్మశానంనుంచి భయంకరమైన భూతాలూ, పిశాచాలూ కన్పిస్తున్నట్లుగా వూహించుకున్నాను. జీలం నదీ ప్రవాహం వద్ద వూరి బావిలో హరిచంద్ర మాష్టారు ఉదయస్నానం చేస్తున్నట్లు బజారులోనుండి భగవాన్‌సింగు, వీధి చివరినుండి ఇస్మతుల్లా వస్తున్నట్లు అనిపించింది.

నిన్నటి మధుర సంగీత స్మృతుల రాగాలు నా చెవిసోకి హెలెన్ ప్రతిరూపం గోచరమైంది. గడ్డకట్టిన మంచుముద్దలా వణికి పోతున్నందు వల్ల ఆమె స్పష్టంగా కనిపించడం లేదు.

'నా ముద్దబంతి పువ్వా!' అన్న మధుర శబ్దం వినిపించింది.

'కృష్ణా! నీవు నా దైవానివి' అన్న సమాధానం వచ్చింది.

నాలోని సిగ్గరి గుండె ఆ పదాలను కప్పి వేసింది. సూర్యకాంతిలో అంతా మాయమయింది. భావోద్రేకంతో కూడిన స్థితిలో ప్రతి ఒక్కరూ నావలె తమ చుట్టూ వున్న వస్తువులను చూస్తారేమో ననిపించింది.

మరికొంచెం సేపట్లో తెల్లని నేత లాల్చీ, పైజామా ఎట్టటోపీపై తెల్లతలపాగా ధరించిన సిపాయి మా గుడారంకేసి రావడం గమనించాను.

ఖరీదైన కొత్త సైకిలు ఎక్కి అతను వచ్చాడు. సైకిలు కమ్మీలు తళతళా మెరిసి పోతున్నాయి. అతడు కాకీ దుస్తుల్లో లేడు కాబట్టి తపాలా బంట్రోతు కాదు. ఖరీదైన సైకిలుపై ఎక్కి సాదా దుస్తుల్లో వచ్చాడు. కాబట్టి బహూశా దొరగారి సొంత సేవకుడై వుంటాడు. అజితిన్ దొర కెప్టెన్ టెరెన్సు ఓసుల్లీవాన్ వద్దనుండి వచ్చివుంటాడని వూహించాను నేను సైగచేసి.

'అజితాన్ గారి వద్దనుండి వచ్చావా?'— అని అడిగాను.

'పెద్దదొరగారు వున్నారా?' అని అతడు పైజేబులోంచి కాగితం తీశాడు. నేనతని దగ్గర వుత్తరం అందుకొని దానిమీద నాన్న పేరు ఉత్సాహంగా చదివాను.

ఇంగ్లీషు జిలుగు వ్రాతను చదవ గలిగిన నా తెలివితేటలకు ఆ సిపాయి కళ్లు విచ్చుకున్నాయి.

నన్ను బళ్ళో చేర్చుకునే విషయంలో హెడ్‌మాష్టరుతో తాను చేసిన ప్రయత్నం విఫలమైందనే వార్త తెచ్చివుంటాడని భయపడ్డాను. ఆ ఉత్తరం లోపలికి తీసుకు వెళ్ళాలి.

నాన్న స్నానానంతరం వరండాలో తడి ఆర్పుకొని ఎండలో నిల బడ్డారు. నేను ఆయనకేసి చూడకుండా ఉత్తరం ఇచ్చాను:

'అజితాబ్ దొర సేవకుడు తెచ్చియిచ్చాడు' అన్నాను.

'ఇందులో నీ అదృష్టం ఇమిడివుంది' అంటూ నాన్న.

ఆదుర్దాగా ఆకవరు చించి, ఉత్తరం మడతవిప్పి చదివారు.

'భలే! హెడ్మాష్టరు నీ మొదటి తప్పు క్షమించారు. మీ అమ్మ ఏదీ! ఈ వెధవను గూర్చి ఓ శుభవార్త, వీడు పనికి మాలిన భ్రష్టుడు' అన్నారు నాన్న.

'భగవాన్‌సింగు, ఇస్మతుల్లాలను కూడానా?' అన్నాను సిగ్గువిడిచి అప్రయత్నంగా.

'అంతే ననుకుంటాను. వాళ్ళు గోడకూడా దాటలేదు. ఊరేగింపులో చేరకముందే వాళ్ళు పట్టుబడ్డారు.'

'అమ్మా! స్నానానికి వేణ్ణీళ్ళుయిచ్చి అన్నంపెట్టు. నేను బడికి వెళుతూ నా స్నేహితులను పలకరించాలి. గాంధీమహాత్ముని మీద మాకున్న నమ్మకాన్ని వదులుకోమని హెడ్మాష్టరు పట్టుబట్ట డనుకుంటాను.'

ప్రపంచమంతా తెలివి హీనంగా కనిపించింది. ఈ విప్లవకారుని పేరు అర్థయుక్తంగా కనిపించింది. నా చదువు త్యాగం చేసి ఆయన కోసం చనిపోవడానికైనా సిద్ధపడే ధైర్యం తెచ్చు కుందామనుకున్నాను.

'నాకు చెప్పకు. చేయితీరలేదు. కూరయింకా వుడకలేదు.... నీకు సహాయం చేసినందుకు గుడికి వెళ్ళి ముందు భగవంతునికి నమస్కరించు.' అంది అమ్మ.

'ఆయన అదృష్టం మళ్ళీ పండింది.' నాన్న వ్యాఖ్యానం: 'నిన్న హెడ్మాష్టరు చెప్పిన మీదట వీడి భవిష్యత్తు నాశన మయ్యిందనుకున్నాను.... బడినుంచి వచ్చేటప్పుడు కెప్టెన్ సులీవాన్ గారికి ధన్యవాదాలు చెప్పాలి తెలిసిందా!'

'దొరగారిని చూడటానికి కృష్ణతో కూడా నేనూ వెళ్ళవచ్చా?' అన్నాను శివ.

'అరే! నోర్మూయ్యరా!' అని అరిచాను.

విశాలమైన పదవ తరగతి గదిలో పిల్లలంతా మౌనంగా తదేకంగా కూర్చునివున్నారు. రాజా ఫజిల్ మహమ్మద్‌ఖాన్ ఆంగ్లపాఠం మొదట

చెప్పారు. మా అందరిముందూ 'గ్రీసుదేశ అద్భుత గాథల' పుస్తకం వుంది. అందులో 'జాసన్, అతని బంగారు గొంగళి'కథ వుంది. బడి మొదటి 'పీరియడ్' గంట వినిపించడానికి ముందు నానాగొడవగా వుంది. మొహమ్మదు అఫజల్ మా ముగీసును నాస్తిక మహమ్మదీయ మత ద్రోహిగా పిలిచాడు. నేనూ అతనితో కలిసి ముష్టియుద్ధానికి దిగాము. వాళ్ళిద్దరికీ మధ్య శుభాసాదిక్ నిలబడ్డాడు. ఇంద్రనాథ్ నన్ను పక్కకు ఈడ్చాడు. మొత్తం మీద మేమందరం కొత్తగా సైన్యంలో చేరిన సిపాయిలవలె క్రమశిక్షణతో వున్నాము. విద్యార్థుల్లా లేము.

ఉన్నట్లుండి నా వెనుక గుసగుసలు వినిపించాయి. హెడ్మాష్టరు గదిలో ప్రవేశించాడని తెలిసింది. నాలో భయం ఆవహించింది. ఆంగ్లశైలి పాదరక్షలతో నడిచివస్తున్న రాజాఫజల్ మొహమ్మద్ కిఱ్ఱు శబ్దం నా శరీరంలో కంపరం పుట్టించింది. నాకళ్ళు చెవులు మంటలెక్కాయి. ఈ ఉదయం హెడ్మాష్టరు మొట్టమొదట నీతిపాఠం చెబుతాడని వూహించాము. ఊరేగింపులో చేరడానికి ప్రయత్నించి, చేరి బహిష్కృతులమైన మేము అందుకు సిద్ధపడాలి.

ఆయన మా బల్లల వరుసల మధ్యలోంచి నడిచి వెళ్ళినపుడు గౌరవ సూచకంగా అందరం లేచి నుంచున్నాము.

'కూర్చోండి' అని అరిచాడు హెడ్మాష్టరు.

వేదికపై బల్లమీద బెత్తంవుంచి ప్యాంటుజేబుల్లో చేతులువుంచి— 'బళ్ళోంచి బహిష్కరించబడి తిరిగి చేర్చుకో బడ్డవాళ్ళు బల్లల మీద నిలబడండి' అన్నాడు.

మేము ఏడుగురం వణికే కాళ్ళతో బల్లలమీద నిలబడ్డాం.

'ఈ కుట్రదారులు ఏడుగురూ అసాధ్యులు. నన్ను చూసి భయపడే వీళ్ళు తేనెబూసిన కత్తులు. చదువుల్లో మేధావులమని వాళ్ళు అనుకుంటే నా ఉద్దేశంలో అది తలపొగరు! ప్రత్యేకమైన హక్కులు గల వాళ్ళు కాబట్టి వాళ్ళిష్టం వచ్చినట్లు చేయవచ్చు ననుకున్నారు. ఈ ప్రభుత్వ ఉన్నత పాఠశాల పేరు ప్రతిష్టలను బురదలో కీడ్చారు..... ఈ విధమైన క్రమశిక్షణా రాహిత్యాన్ని పెంపొందించినందుకు నన్ను పదవి

లోంచి తీసివేయించి వుందురు. మీ మీద మీకే అసహ్యం వేయటం లేదా?'

'రాజాగారూ! మా గురించి మీరు ఏదో ఒక రోజు గర్వపడతారు' అన్నాడు మూర్ఖత్వం కరడుకట్టిన ధైర్యంతో ముగీస్.

'అసందర్భ ప్రలాపీ! నిన్ను నీవు సమర్థించుకోకు' అన్నాడు ఆశ్చర్య పోయిన హెడ్మాష్టరు.

'రాజాగారూ! హిందువుల వూరేగింపులో చేరి ముగీసు తాను నాస్తికుడనని నిరూపించు కున్నాడు' అన్నాడు అఫజల్ లేచి నుంచుని.

'కూర్చో. ముగీసుకంటె నీవు మూర్ఖుడివి' అన్నాడు దద్దరిల్లేలా హెడ్మాష్టరు అతడు నాస్తికుడనే ప్రశ్న వుదయించదు. హిందూ ముస్లిమ్ సమస్య ఉత్పన్నం కాదు. ఆంగ్లేయ పరిపాలనలో అన్ని మతాలూ ఒక్కటే. ఘనత వహించిన విక్టోరియా మహారాణి ఆత్మ శాంతించు గాక! 1857 సిపాయిల తిరుగుబాటు తరువాత ప్రజల మత విశ్వాసా లను ఆంగ్ల ప్రభుత్వం ఆదరిస్తుందని ఆమె ప్రకటించింది. అందువల్ల దొరలదృష్టిలో హిందూ ముస్లిమ్ వ్యక్తులపట్ల అభిప్రాయభేదమనే ప్రసక్తి రాదు...... కానీ మన ప్రజలు బలహీనులు యుద్ధ సమయంలో అనే కరకాల వదంతులు వ్యాప్తిజేశారు: 'ఆంగ్ల ప్రభుత్వం ఓడిపోతోంది! జర్మను కైజరు జయిస్తాడు! టర్కీసుల్తాన్ జర్మనులతో కలిశాడు.'

'-ఓ రైతు సోదరా! నీ తలపాగా ధరించి సిద్ధంకా!' అనే పాట ద్వారా అజిత్‌సింగు రైతులను రెచ్చగొట్టడానికి ప్రయత్నిం చాడు. అలీసోదరులు టర్కీపాలకులైన ఖలీఫాల అపవిత్రపాలన గురించి మాట్లాడారు. గాంధీ, కిచులూ, సత్యపాల్, లజపతిరాయ్ దేశ ద్రోహం గురించి ప్రవచిస్తున్నారు..... తుపాకి గుండ్లను ఎదిరించలేని ఆ బక్క పీనుగులు అహింస గురించి వాగుతున్న పిరికి వాళ్ళు. అమృతసర్‌లో వాళ్ళు షేర్‌వుడ్ అనే క్రైస్తవ స్త్రీని క్రూరంగా చంపారు తెలుసా!

'జనరల్ డయ్యరు దౌర్జన్యం!' విజ్ఞత ప్రకాశించే ధోరణిలో ఆయన చేస్తున్న నీతిబోధకు వ్యతిరేకంగా నాలోని సత్యసంధత వెలికి తెచ్చిన ధైర్యంతో అన్నాను. విప్లవకారుల కంటె ప్రభుత్వ స్తోత్రపాఠకులైన పిరి

కిపందలే గంభీరంగా మాట్లాడతారు.

'ఉష్!' అని గణేశ్ హెచ్చరించాడు.

'అరే డయ్యరు' అంటూ ఇంద్రనాథ్ అరిచాడు బిగ్గరగా. గదిలో అంతా భయకంపితులయ్యారు.

'స్వేచ్ఛగా మాట్లాడి ప్రతిఘటించి నందుకు పిల్లలూ! మీ ధైర్యాన్ని అభినందిస్తున్నాను' అని దయాస్వభావంతో అన్నాడు హెడ్మాష్టరు: 'ఊరేగింపులో చేరడానికి ముందు మీరు నాదగ్గరకు వచ్చి మీ సందేహాలు వెలిబుచ్చి వుంటే మీకు నేను విశదంగా చెప్పివుందును. హంటరు ప్రభువు ఎదుట సాక్ష్యం చెబుతూ జనరల్ డయ్యరు చెప్పిన మాటలు మీకు తెలియదు.

'ప్రజలను భయపెట్టడానికి పేల్చామని అతను చెప్పాడు. మీకు బుద్ధి రావడానికి అప్పుడప్పుడూ బెత్తంతో కొడుతుంటాను. అమాయక ప్రజాసమూహాన్ని సక్రమ మార్గంలో పెట్టడానికి దండన ఒకటే మార్గం. వారిలో చాలమంది గూండాలు కలిసి అంగళ్ళను దోచుకొని కాల్చివేశారు. ప్రభుత్వం పరిపాలన కొనసాగించాలి గదా! విద్యా, వైద్యసేవలను మనకు వరాలుగా యివ్వాలిగదా! కాబట్టి చట్టవ్యతిరేకతను అది సహించలేదు. .....మనం సుఖసంతోషాలతో వుండాలంటే విప్లవకారుల ప్రతిపట్ల విలపించకూడదు.'

'అమృతసర్‌లో పోలీసుల చేతుల్లో కృష్ణ ఏడు దెబ్బలు తిన్నాడు.' — 'స్వాతంత్ర్యంకావాలన్న ఎంతోమందిని చంపివేశారు.... గాంధీ—' అన్నాడు. ఇంద్ర అడ్డుపడుతూ.

'నేరస్తులతోబాటు ఒక్కొక్కసారి అమాయకులు కూడా దెబ్బలు తింటారు.' సమాధానమిచ్చాడు హెడ్మాష్టరు: 'నా పదునెనిమిది యేళ్ళ బడిపంతులు వుద్యోగానుభవంతో గుంపు యేవిధంగా ప్రవర్తిస్తుందో స్పష్టంగా చెప్పగలను. స్వాతంత్ర్యం గురించి కేకలు వేసి నిర్దయతో చంపుతారు. వీరి జీవితంలో దుఃఖానికి ప్రతీకారం ఆవిధంగా తీర్చుకుంటారు. ప్రజా సమూహాన్ని క్షమించ వచ్చుగానీ వారిని రెచ్చగొట్టే నాయకులను గాదు. వాళ్ళు కుక్కలవలె తోకలు ముడుచుకొని పరుగెత్తి

పోతారు. ఆహా!'

'పంజాబ్ సింహంగా లజపతిరాయ్‌కి పేరు. ఆయన ప్రజలను ప్రేమి స్తారు. మనకు స్వాతంత్ర్యం రావడం ఆయన ధ్యేయం.' అన్నాడు సవాలు విసురుతున్న ధోరణిలో ఇంద్ర.

హెడ్‌మాష్టరు ఇరకాటంలో పడ్డాడు. 'నినాదాల వల్ల ప్రయోజనం లేదు ఇంద్రనాథ్! మొత్తం పరిస్థితి పిల్లలకు మీకు తెలియదు. అందు వల్ల పెద్దవాళ్ళయేంత వరకూ మీరు ఏపక్షమూ వహించరాదు. మీ దేశాభిమానాన్ని నేను గౌరవిస్తాను. అందుకే మిమ్మల్ని తిరిగి చేర్చు కున్నాను. మీ స్వాతంత్ర్య పిపాస పక్షాన తెల్లదొరలలో ఒక ముఖ్యుడు వాదించాడు. చక్రవర్తి ప్రభువు మనము అడిగినపుడు స్వాతంత్ర్యం ఇస్తా నని వాగ్దానం చేశారు. విద్యార్థులలో క్రమశిక్షణా రాహిత్యాన్ని నేను సహించాను. నిజానిజాలు తెలియని వాళ్ళను పావులుగా వాడుకుంటు న్నారు. కుట్రవనికిరాదు. గుర్తుంచుకోండి. ఇంకొకసారి నేనెవరినీ తిరిగీ చేర్చుకోను. పరీక్షలకు శ్రద్ధగా చదువుకొని నెగ్గవలసిన తరుణ మిది. ఊరేగింపులలో చేరడానికి, సమయం కాదు. 'గ్రీకు పురాణ గాథల' పుస్తకం తెరవండి. కృష్ణా! 'జాసన్ బంగారు గొంగళి కథ' మొదలు పెట్టి చదువు. అందరూ బల్లలమీద కూర్చోండి.'

సాధికారికంగా మాట్లాడుతున్న హెడ్మాష్టరు విశాలవదనం చూడ డంలో నేను లీనమైపోయాను. జీవితంలోని అపారత్వంవల్ల పొంగిన అనేకమంది వదనాలు వూరేగింపులో చేరిన గుంపుగా మాముందు నిల్చున్నారు. మా నాన్నవలె ప్రభుత్వోద్యోగానికి అమ్ముడుపోయిన రాజా గారు స్వాతంత్ర్యం గురించి లెక్క పెట్టరని నాకు తెలును. గాంధీజీ త్యాగం, నిరశన దీక్షలూ, చిత్తశుద్ధి సంభాషణలు, స్వాతంత్ర్యంకోసం చనిపోవడానికి నాలో ధైర్యం యిస్తాయని తెలుసు....... ఇంతలో గ్రీకు పురాణ గాథల పుటలు తడబడుతూ చదివాను.

* * *

కుట్రలు పన్నవద్దని మమ్మల్ని హెచ్చరించినప్పటికీ, విరామ సమ యంలో మేము ఒకరికొకరము ఆకర్షితులము అయ్యేవాళ్లం. బడి ఆవర

ణలో బయట వేరుశెనగకాయలు అమ్మే అంగడి వాడి దగ్గరకు ఒకరి వెంబడి ఒకళ్లం నడిచాము. ముగీన్, ఇంద్ర సైగచేసి ముందు నడిచారు. దురదృష్టవశాత్తు, మా ప్రణాళికను పసిగట్టిన అఫ్జల్, గణేశ్, శుభా సాదిక్‌లతో కలిసి మమ్మల్ని అనుసరించి వచ్చి చెరకుగడలు అమ్మే వాడి పక్క వచ్చి నిలబడ్డారు. ముగాన్ ఒక రూపాయ వేరుసెనగకాయలుకొని, వొడిలో పోసుకొని మమ్మల్ని అందర్నీ ఎగబడి తీసుకోమన్నాడు. మేము తింటూ ఒకళ్ల మొఖాలు ఒకళ్లు చూశాం. మా లోలోపలి భయం యథాప్రకారం మాలో నిండింది. మా సమాన బాధల ద్వారా పెద్ద మనుషులంగా పెరిగి, ముఖ్యమైన వ్యక్తులుగా ఎదిగాము. ప్రాణంలేని రాళ్లలా అక్కడ నిలబడ్డాము. ఈ వార్తాహరుల బాధ తప్పి, మా మనసులు విప్పి మాట్లాడుకొనే అవకాశం ఎప్పుడు వస్తుందా? అని ఎదురు చూశాం. అవసరం వచ్చినప్పుడు స్వేచ్ఛకోసం మా ప్రాణాలనైనా యివ్వడానికి మాలో ప్రతి ఒక్కరూ సిద్ధంగా ఉన్నారు. మా సమైక్యతా తీర్మానాన్ని, మాటలు లేకుండా వ్యక్తం చేయడానికి , మా సోదరుల్ని మావైపు తిప్పడానికి సాక్షులంగా నిలబడ్డాము.

మేము వేరుసెనగ కాయలు తిని, ఎవరి వరుసల్లో వాళ్లం మళ్లీ నిలబడి లోపలి కెళ్లాము. అక్కడ కలిసివున్న కొద్ది క్షణాల్లో దయానురాగపూరిత సానుభూతి మాలో వున్నట్లు గమనించాను. అడవిలో దట్టంగా వున్న చెట్ల మధ్య గులాబీ వాసనలా అది మాలో వ్యాపించింది.

అజితాన్‌గారు అధికార్ల వంటశాల వెనక వుంటున్నారు. నాతో భగవాన్‌సింగును, ఇస్మత్‌ను రమ్మని పిలుచుకెళ్లాను. అఫ్జల్, శుభా సాదిక్‌లతో చేతులు కలిపిన గణేశ్‌ను ఉద్దేశ పూర్వకంగా పిలవలేదు. శివ, గణేశ్‌తో వేరుపడి మాతో వస్తానన్నాడు. సరేనని నావేలు పట్టుకోనిచ్చాను.

మాయింటికి వచ్చిన సేవకుడు దయారాం దొరగారి వరండాలో కూచొని వున్నాడు. 'హాకీ ఆట ఆడటానికి వెళ్లేముందు స్నానానికి దొరగాడు వెళ్లా'రని అతను చెప్పాడు. కిటికీలోంచి ఆయన ఆంగ్లంలో పాడుకుంటూ స్నానంచేస్తున్న సవ్వడి వినిపించింది. వాలుకుర్చీలోంచి

జాతి కుక్క మొరిగింది.

'పిల్లల్లారా! నెమ్మదిగా వచ్చి పట్టుమీద కూచోండి. దొరగారు ఇప్పుడే వచ్చేస్తారు. నేను కుక్కను పట్టుకొంటాను. భయపడకండి!' అన్నాడు దయారాం.

ఆగది అలమరా నుండి పుస్తకాలు అమర్చివున్నాయి. మరో గాజు అలమరలో చనిపోయిన సీతాకోక చిలుకల్ని వరసల్లో అందంగా అమర్చి వున్నారు. మేము అవి చూస్తూ వుండిపోయాము. ఆ సీతాకోక చిలుకల్ని ముట్టుకొంటే బాగుండు ననిపించింది. కాని మంచివాళ్లుగా ప్రవర్తించాలని ఆప్రయత్నం విరమించుకొన్నాం. శివ వెళ్లి వాలు కుర్చీలో కుక్కను నిమిరాడు. కుక్క వాడి మూతి నాకింది. వాడు ఆ కుర్చీలో మోకాటిపై మానాన్న మామూలుగా కూచొనే ధోరణిలో కూచొన్నాడు. నేను వాడిని కిందికి దిగిరమ్మని చెబుదామనుకొన్నాను. ఇంతలో అజితాన్‌దొర వచ్చేశారు. వొంకులు తిరిగిన ఎర్రజుత్తు, చిన్న మొహంలో నీలిరంగు కళ్లు, తెల్లని పలువరుస, చిరునవ్వు ఆయన ప్రత్యేకత. మొల చూట్టూ తువాలు తప్ప ఆయన నగ్నంగా వున్నారు.

'నమస్కారం సార్!' మేము ముక్త కంఠంతో అన్నాము. ఆ బంగళా లోపల ప్రవేశించేముందు. ఆమాటను మేమంతా కలిసి ఎలా అనాలో అనుకొన్నాము.

శివగొంతు చిన్నపిల్లవాడి గొంతులా రాగాలు పలికింది.

'నువు బుల్లి రామచంద్ర' అంటూ శివ చుబుకం పైకెత్తి — 'మరి రామచంద్ర నెం.3 ఎవరూ?' అన్నారు దొరగారు.

'నేను. కృష్ణ చంద్రను.' అన్నాను మోకాళ్లపై కూచొంటూ. ఇతడు భగవాన్ సింగు — బాబూకుషీరామ్ తమ్ముని కొడుకు, ఇతడు షమ్షుద్దీన్ కొడుకు - ఇస్మతుల్లా' అని పరిచయం చేశాను.

'దయారామ్! పిల్లలకు అధికారుల వంటశాలలో నుంచి బిస్కెట్లు, చాక్లెట్లు, టీ తెచ్చిపెట్టు ' అన్నాడు దొర.

'పాలు లేవా సార్!' అన్నాడు శివ.

'సరే! తొందరగా పాలు తీసుకురా దయారామ్.'

శివ అప్రయత్నంగా అన్న మాటలకు నేను మొహమాట పడ్డాను. 'నీవు కుర్చీలోంచి కిందికి రా. దొరగారు గుడ్డలు వేసుకుంటారు' అని పంజాబీలో గదమాయించాను.

నేను ఈమాట అనగానే దొర శివను నెత్తిమీదికి ఎత్తుకొని రెండు కాళ్ళు మెడకు యిరువైపులా వేసుకొని కుర్చీలో మేజోళ్ళు, బూట్లు తొడుక్కోవడానికి కూచున్నారు.

నల్లకుక్క అసూయతో యజమానిని చూసి మొరిగింది. అదిచూసి శివ ఉత్సాహంతో గుర్రం తోలుతున్న శబ్దం చేశాడు. కుక్క బిగ్గరగా మొరిగింది. వెంటనే దొర చురుకుగా శివను దించి పట్టెమీద కూర్చోబెట్టి మొరుగుతున్నట్లుగా కుక్కవైపు మూతి పెట్టాడు. 'మిమ్మల్ని అందరినీ మళ్ళీ బళ్ళో చేర్చుకున్నారని విన్నాను' అని మా ముగ్గురు నుద్దేశించి అన్నారు.

'మీకు ధన్యవాదాలు చెప్దామని వచ్చామండీ.'

'మీనాన్న చెప్పారో లేదో తెలియదు. నేను సగం ఆంగ్లేయుణ్ణి. సగం ఐర్లండు దేశస్తుణ్ణి. భారతీయులవలె ఐర్లండు దేశీయులమైన మేము కూడా బ్రిటీష్ సామ్రాజ్యానికి బలియైన వారమే.'

'అందుకనే మీరు మా తరపున సాక్ష్యమిచ్చారా?' అని అడిగాను.

'నేను సరిగా సాక్ష్యమిచ్చానా అని నాకే అనుమానం. నేను చాల వరకు రాజీపడ్డాను.' అన్నారు అజితాబ్ దొర. కొంచెం సేపు ఆగి మళ్ళీ మొదలెట్టారు:

'నాలోని ఐర్లండు దేశ వ్యక్తిత్వం ఆంగ్లపక్షంతో పోరాటం సాగిస్తుంది' అని ఆయన కొంచెంసేపు ఆగి చౌక్కా దగ్గరకు వెళ్ళాడు. 'తెల్లవాళ్ళు వున్నారు చూశావా! యిక్కడ భారతదేశంలో చేసినట్లే అక్కడ ఐర్లండులో కూడా ప్రజలను కాల్చివేస్తున్నారు. కారణం మా ప్రజలు స్వాతంత్ర్యం కోరుతున్నారు....... సరే' అని ఆయన కృత్రిమంగా నవ్వి మానాయకుడు డీ వెలరా గాంధీవలె చెరసాలలో

వున్నారు. ఆంగ్లేయులు ఇప్పుడు నాగరికతా సీమలకు చేరుకున్నారు. స్వాతంత్ర్యాన్ని ప్రేమించేవారిని కాల్చివేయడం ఎలానో వారికి తెలుసు!'

ఆయన మాటలను మేమంతా శ్రద్ధా భక్తులతో వింటున్నాము. ఆయన కూనిరాగాలు తీస్తూ మాట్లాడటంవల్ల వాటి అవగాహన కాలేదు. నాకు తెలిసిన తెల్లదొరల యాసతో ఆయన మాట్లాడలేదు. 'మీరు మరీ అంత ముడుచుకొని కూచోవద్దు' అని నా గడ్డం పైకెత్తాడు.

'అయితే మీరు ఆంగ్లసైన్యంలో ఎందుకు చేరారు?'

'జర్మనులతో యుద్ధం చేయటం ముఖ్యం.' ఆయన సమాధానం. 'క్రూరులకు, అతిక్రూరులకు మధ్య తేడ గమనించాలని పెద్దవాళ్ళయిన తర్వాత మీకే తెలుస్తుంది. ఈ ప్రపంచం చాల చెడ్డ ప్రదేశం. పెద్ద అబద్ధాన్ని కనీసం చిన్న అబద్ధంతోనైనా ఎదుర్కోవాలి. లేకపోతే ఆ అబద్ధమే చెలామణి అవుతుంది. సరే! అదుగో టీ వచ్చింది.'

'పెద్ద అబద్ధాన్ని చిన్న అబద్ధంతోనైనా ఎదుర్కోవాలి' అన్న వాక్యాన్ని పునశ్చరణ చేశాను. అబద్ధాలకోసం పోరాటమెందుకు? అని అడగాలనిపించింది.'

'సత్యంకోసం మాత్రమే ఎందుకు ప్రయత్నించకూడదు?' సాహసించి అడిగాను.

'సత్యం?' అనే మాటను పునశ్చరణ చేసి గొంతు తగ్గించారు. బహుశా ఆయన లోలోపల బాధపడ్డట్టున్నారు. ముఖం ఎఱ్ఱబడింది. దయారామ్ వెండి పళ్ళెంతో లోపలికి వచ్చాడు.

'సత్యంకోసం కవులు పూర్తిగా శ్రద్ధ వహిస్తారు. సామాన్య మానవులు కాదు. పిరికిపందలు రాజీ పడతారు.' తనను సమర్థించుకోవాలని ఆయన ఆలోచించి అన్నారు.

సేవకుడు అన్నీ అమరుస్తుంటే దొర కేకును పెద్దపెద్ద ముక్కలుగా భాగించి మాకు తలా ఇచ్చారు. ముందు శివకు పంచిపెట్టాడు. తర్వాత ఆయన తనకు స్వయంగా టీ పోసుకునే హడావుడిలో ఏదో గొణిగారు· 'నాకో సందేహం. స్వేచ్ఛకు, కట్టుబాటు..... బహుశ ఇవి

మానవ సహజమనుకుంటాను.'

'ఈ పుస్తకాలన్నీ మీరు చదివారా అండీ.' ఆయన మాటకు అడ్డుపడుతూ కపటంలేని మనస్సుతో అడిగాను.

ఆయన నవ్వి అన్నారు: 'లేదు. అన్నీ చదవలేదు' క్షణకాలం ఆగి నన్ను తదేకంగా చూస్తూ అన్నారు. 'నీవు రహస్యంగా నవలలు చదువుతావని కవితలు రాస్తావనీ విన్నాను.'

నాముఖం వికసించింది. బహుశా అజితాన్‌గారితో మానాన్న నన్ను గురించి డంబాలు పలికి వుంటారు. ఆయన ఇదే అనుమానంతో నన్ను తరచూ తిడుతుంటారు.

'అవునా!' అందుకనే మీనాన్న నీవు పిచ్చివాడివని అంటారు.' అని ఆయన నిలదీసి అడిగారు.

నేను తలవూపి — 'పంజాబీ, ఉరుదూలలో వ్రాస్తాను' అన్నాను.

'అయితే నీకవితలు కొన్ని నాకు వినిపిస్తే నావి కొన్ని నీకు చూపుతాను. ఇదీ మనమధ్య ఒప్పందం' అంటూ ఆయన నా దగ్గరకు వచ్చి కప్పు ఎడంచేతిలో తీసుకొని కుడిచేయి నాకు అందించారు.

'దయారామ్! పిల్లలకు మరిన్ని బిస్కెట్లు, పాలు యివ్వు' సేవకునికి చెప్పి మాకేసి చూసి నవ్వుతూ — 'నేను తప్పనిసరిగా హాకీ ఆటకు వెళ్ళాలి. మీరు మరో ఆదివారం వుదయం రండి. మీకు కొన్ని పుస్తకాలు అరువు యిస్తాను. నీకు నవలలు, 'ఏట్స్' భారతీయ కవితలు యిస్తాను.'

మేము కృతజ్ఞతా పూర్వకంగా సిగ్గుతో చేతులు వూపాము. నోటినిండా కేకు ముక్కలు కుక్కుకుంటూ, ఈ తెల్లదొర చూపిన ఆప్యాయతతోకూడిన ఆదరణకు మాముఖాలు వికసించాయి.

నేను ఇంటికి వచ్చేసరికి నా బడాయికి, డాంబికానికి అంతు లేదు. కారణం నేషిరాలోని కల్నల్ లాంగ్‌డన్ పిల్లలతో మేము మొట్టమొదట సారిగా ఆడుకున్నాము. దొరలు కలిసి తిరిగే ఆలయం

లోపలికి మమ్మల్ని ప్రవేశించ నిచ్చారనే సంతోషమే అందుకు కారణం. రోడ్డుమీద మాకంటె ముందు సైకిలుమీద వెళుతున్నపుడు మేము గౌర వంగా నమస్కరించే కెప్టెన్ టెరెన్స్ తన సహజ నిషేధ ధోరణిలోగాక భిన్నంగా కనిపించారు. ఆయన తన గదిలో ఆప్యాయతగా పలకరించి మాలో బెరుకు లేకుండా చేసిన మేధావిలా కనిపించాడు. ఆయనది చక్కని భాష. కవిత్వం రాస్తాడు. నాజిజ్ఞాసకు అంతులేదు. చిలిపి గర్వంతో పొంగిపోయాను. ఒంటరి తనం పారిపోయింది.

'అమ్మా! ఈ దొరలు చెబుతున్నారు — భారతదేశంలో వలె ఐర్లండులోకూడా ఆంగ్లజాతి యిలానే చేస్తోందట.' వంటగదిలో కూచుని పాలుతాగుతూ అన్నాను. నాన్న ముఖంకడుక్కుంటున్నాడు. గణేశ్ శ్రద్ధగా సంచి వెదుకుతున్నాడు. నేను ఈ సమాచారాన్ని ప్రత్యేకించి నాన్న గణేశ్ వినాలని అన్నాను.

'అక్కడమరీ అన్యాయం' అన్నాడు నోటినిండా నీళ్ళు పుక్కి లించి వుమ్మివేస్తూ. 'ఆంగ్ల ప్రభుత్వం ఇక్కడకంటె అక్కడ ఘోరాలు చేస్తోంది. మొత్తం ఐర్లండులో వున్న నల్లవారిని గోధుమ వర్ణంవారిని పిలిచి సైన్యాలు సమకూర్చారు. ఆంగ్లేయులపై ఐర్లండు దేశీయులు బాంబులు విసిరినమాట నిజమే! ఇక్కడ పిరికి భారతీయులు అహింసా, సహాయ నిరాకరణలను ప్రదర్శిస్తున్నారు. హాకీ ఆట అయిన తర్వాత అజితాబ్ దొర నాతో అన్నారు — 'కృష్ణ పిల్ల చేష్టలు లెక్కచేయవ'ద్దని.

'హింసా ప్రవృత్తి విడనాడటం మన ధర్మం. అక్కడ తమ రంగు సోదరులతోనే వాళ్ళు ఎందుకు యుద్ధం చేస్తున్నారో నాకు అర్థం కావటం లేదు. మీకు తెలిసిన అజితాన్, తెల్లదొర కాదా!' అంది అమ్మ.

'అమ్మా! సులేవాన్ సగం ఆంగ్లేయుడు, సగం ఐర్లండు దేశీయుడు!' అన్నాను నాన్న మాటతో ధైర్యం తెచ్చుకొని 'ఆయన ఆంగ్ల ప్రభుత్వాన్ని ద్వేషిస్తారు. జర్మను దేశీయులు ఆంగ్లేయులతో పోరాడుతున్నట్లు తెల్లవారుకూడా డబ్బు, ఆస్తులకోసం తమలోతాము పోట్లాడుకొంటారు.'

'మీరు వచ్చేసిన తర్వాత అమృతసర్ ప్రజలపట్ల వారు చూపిన క్రూరత్వం' అన్నాడు గణేశ్.

'నువ్వు నోర్ముయ్‌రా పిరికిపందా!' అరిచాను. నాలోని విప్లవ భావాలు నా శరీరాన్ని వణికించాయి.

'వాడిని తిట్టవద్దు' నాన్న నన్ను మందలిస్తూ అన్నాడు. 'వాడికి పెళ్లి అయింది. ప్రభుత్వోద్యోగం కావాలి. వాడు మెట్రిక్ పూర్తి చేస్తే ఆగ్రాలోని వైద్య పాఠశాలలో చేరుద్దామనుకొంటున్నాను. ఇంకో నాలుగు సంవత్సరాలలో వాడి భార్య కాపురానికి వస్తుంది. అప్పటికి వీడి వైద్య పట్టా చేతి కందుతుంది. ఎక్కడ ఉద్యోగం దొరికితే అక్కడికి భార్యను తీసుకెళ్ళవచ్చు.'

'కృష్ణను ఏం చేద్దామను కొంటున్నారు.' అడిగింది అమ్మ.

నాన్న సమాధానం చెప్పేలోగా నేను విజయోత్సాహంతో 'నేను కవి నవుతాను.' అన్నాను.

'వాళ్ల నాన్న జమిందారు గదా!' అన్నాడు నాన్న వెటకారంగా: 'తన వ్యూహాల్లో తాను కవి, గూండా, రాజకీయవాది కావచ్చు. వయసు తెచ్చిపెట్టిన పొగరు! పదాల వెంబడి నత్త నడక.' — ఆయన తువాలుతో తుడుచుకోవడంవల్ల కోపంతో ముఖం కందగడ్డలా జేవురించింది.

నేను నావాదనకు బలంగా మాట్లాడాను.

'కవిత్వం వ్రాయడానికి సులేవాన్ సిగ్గు పడకపోతే, నేనూ సిగ్గు పడాల్సిన అవసరంలేదు.' నేను మందస్వరంలో ఖండితంగా అన్నాను. నేను అనలేని మాటలు నోట్లో గొణిగాను 'నేను విప్లవవాదిని, క్రాంత దర్శిని, పిచ్చివాణ్ణికూడా అవుతాను.... రాజా రాసలు కన్న స్వప్నాల కలితంగా నా సాహసాల గాఢానురాగం, కష్ట సహిష్ణుత, సంశోధన ద్వారా కావాలని పిచ్చివాడి నవుతాను.'

'వీడు బి.ఏ.యల్.యల్.బి. పూర్తి చేస్తే అదనపు సహాయ కమీషను వంటి ఉద్యోగం ఏదో ఒకటి ప్రయత్నిద్దాం.' అన్నాడు నాన్న

'పీడి వాక్చాతుర్యంతో న్యాయవాదిగానో, న్యాయాధికారిగానో బాగా రాణి స్తాడు. ఇప్పుడు వాటి గురించి ప్రస్తావన అక్కరలేదు — పదో తరగతిలో వీళ్లిద్దరూ మంచి మార్కులతో నెగ్గితే, వాళ్లవాళ్ల కళాశాలల్లో ప్రవేశం దొరుకుతుంది.... ఈ చుంచెలుక దాదాపు పరీక్షకు కూచోకుండా వుండే పరిస్థితి వచ్చేంది..... మన కుటుంబానికి తలవంపులతో బాటు, నా ఉద్యోగంకూడా వూడి వుండేది. సులేవాన్‌గారు జోక్యం చేసుకోబట్టి సరిపోయింది.'

ఆయన ఆ అభిప్రాయాన్ని వెలిబుచ్చిన తర్వాత యింకేమీ మాట్లాడటానికి పాలుపోలేదు.

'సులేవాన్ గారికి చూపించే ముందు నీ కవితలు నాకు చూపించు' అని మాట కలిపాడు నాన్న.

నాలోని అస్తవ్యస్త స్థితిలో ఏర్పడ్డ పదాల గందరగోళం, ఆవేశపు విహంగాలు మానాన్న పట్టుకు దొరకకుండా ఎగిరిపోయాయి.

ఈ సమయంలో వీధి బయట ఆగకుండా ఎవరో సైకిలు గంట ...తున్నారు.

ఇంతలో - 'నమస్తే!' అని శివ అనడం వినిపించింది. సాధారణంగా ఈ పలకరింపు ఆర్యసమాజ వాదులు వాడుతారు కాబట్టి కేదారనాథ్ వచ్చివుంటారని వూహించాను. ఆరోజంతా నేను ఆయనను చూడకుండా నిగ్రహించుకొన్నాను. ఆయనను చూడటంవల్ల యింకా ఎలాంటి పరిణామాలు కలుగుతాయోనని భయపడ్డాను. ఆయనే స్వయంగా నన్ను చూడటానికి వచ్చివుంటారు.

'లాలా కేదార్‌నాథ్!' అంటూ నాన్న ఆయనను ఆదరంగా పలకరించారు. ముంగిట్లో మంచంమీద తాను కూచొని, అతిథికి బుట్టకుర్చీ చూపించారు.

నాన్న హార్దిక స్వాగతానికి నేను ఆశ్చర్యపోలేదు. ఆయన ఆజితాన్ గారితో మా దేశద్రోహ భావాలను గమనించినది మొదలు ఎంతో సానుభూతితో వున్నారు. ఆయన దేవతల పక్షంలోను, రాక్షసుల పక్షంలోను

వుండగలరని నాకు తెలుసు. అది ఆయనకు సరిపోతే సరి.

లాలా కేదారనాథ్ నిరుత్సాహంగా నాకేసి తల ఆడించి, నాన్నతో క్షమాపణ ధోరణిలో అన్నారు

'ఈ సమయంలో వచ్చినందుకు క్షమించండి. నేను లాహోరుకు వెళ్తున్నాను....'

'నిన్న లాలా అమర్‌నాథ్ ఒక నిముషం మాట్లాడారు. ఆయన పోలీసులు మీగురించి అడిగారని అన్నాడు.' నాన్న చెప్పాడు.

'కృష్ణ వుండటం మీకెలా వుందో అలానే. నా వునికి వల్ల యింట్లో మా తమ్ముడు మొహమాట పడుతున్నాడు '

'లేదు.' అన్నాడు నాన్న వక్ర భాష్యం చెబుతూ 'ప్రభుత్వానికీ, మనకు మధ్య జరుగుతున్న యుద్ధం త్వరలో ఏదో ఒక పరిష్కారానికి వచ్చేస్తుంది... . మీ తమ్ముడు, నావంటి వారు అటూ యిటూ కారు మాకు రెండువైపులా దెబ్బలు తగులుతాయి..... ఏమేవ్ లాలాకేదారనాథ్ గారికి టీ తీసుకురా.'

ఆయన వద్దన్నట్లుగా చేయివూపారు.

'ఐతే ఖర్జూరాలు తీసుకోండి.' నాన్న పట్టుబట్టాడు. 'రామచంద్రగారూ! పిల్లలు తటస్తంగా వుండలేరు' అంటూ నా మార్గదర్శి అన్నారు 'వేదాంతంలో ఎమ్.ఏ పరీక్షకు కట్టాను. మనప్రజా బాహుళ్యం దుర్భరదైన్యంతో నా ముఖంకేసి చూస్తుంటే నేను పరిశోధన ఎలా కొనసాగించ గలను. యుద్ధంలో మన వాళ్ళు వేలాదిమంది చనిపోయారు. ప్రభుత్వం వారు మన స్వాతంత్ర్యాన్ని తిరస్కరించి, ప్రత్యామ్నాయంగా అమాయక ప్రజలపై కాల్పులు జరిపారు నేను నా చదువు స్వతంత్రంగా కొనసాగించ గలను. కానీ పూర్తికాలం రాజకీయాలలో పని చేసేందుకు తిరిగి లాహోరు వెళుతున్నాను . అందువల్ల యాధృచ్ఛికంగా నా బరువు బాధ్యతలు నా సోదరునిపై లేకుండా పోతాయి ఈ క్లిష్ట పరిస్థితుల్లో మన పెద్దలు దోషులుగా భావింప బడటానికి కారణం వారు ఉభయత్రా బాధలకు గురికావటం. యువకులమైన మనము ఏదో

ఒక పక్షాన్ని వహించి తీవ్ర త్యాగాలకు సిద్ధపడాలి.'

నాహృదయం వుప్పొంగిపోయింది. నేను కూడా పెద్దవాడినై యుండి నిర్ణయం తీసుకోగలిగి కేదారనాథ్‌తో పాటు లాహోరు వెళ్ళ గలిగితే బాగుండు ననిపించింది.

"నేను సుల్లివాన్ గారితో మాట్లాడాను" నాన్న ప్రధానమైన విషయం చెప్పారు: ఆయన అంటారు· 'వాళ్ళు' ఐర్లండులో కూడా యిలానే చేస్తున్నారట. భారతదేశానికి ఆంగ్లప్రభుత్వం కొత్తగా స్వయం పరిపాలనా చట్టం (Home rule Act) పెడుతోందని 'ట్రిబ్యూన్'లో చదివాను.'

'గౌరవప్రదమైన ట్రిబ్యూన్ పత్రికా సంపాదకుడు కాళీనాథరాయ్ గారి సంపాదకీయంలో వక్రభాష్యం చూపి రెండు సంవత్సరాలు కఠిన శిక్ష విధించారు. 'మాంటేగు స్వయంపరిపాలనా చట్టం' - అన్న ప్రధాన విషయాలలోనూ, భారత ప్రభుత్వానికి స్వేచ్ఛను ప్రసాదిస్తుంది.'

ఈ మాటలు అంటున్నపుడు కేదారనాథ్ నోట్లోంచి కోపంతో తుంపరలొస్తున్నాయి. ఆ మాటల అవగాహన నాకు బోధపడక నన్ను మంత్రముగ్ధుణ్ణి చేశాయి.

'ఫాదర్ సి.ఎఫ్. ఆండ్రూసును వ్యాస రచనలు చేయడానికి పంజాబులో ప్రవేశించ నీయలేదు. హంటరు న్యాయ విచారణ ముందు, డయ్యరు తన పాశవిక తను అంగీకరించి నప్పటికీ జాతీయ కాంగ్రెసు వాదులైన పండిత మదనమోహన మాలవ్య అభ్యర్థనలను వారు ఖాతరు చేయలేదు. ప్రభుత్వము వారిచ్చిన 'సర్' బిరుదాన్ని ప్రముఖ కవియైన రవీంద్రనాథ్ ఠాగూరు త్యజించారు. రామచంద్రగారూ! మీకు తెలుసు వారి దోపిడీ విధానం కొనసాగుతూనే వుంది. మనకు వీలైన రీతిలో హింసాయుతంగా కానీ, అహింసాయుతంగా కానీ వారితో పోరాడటానికి మేము కూడా సిద్ధంగా వున్నాము. నా స్నేహితులు కొందరు హింసకు పాల్పడటానికి సిద్ధంగా వున్నారని మీకు హెచ్చరిక చేస్తున్నాను. విప్లవ యుగంలోకి అడుగుబెట్టి బోతున్నాము. పరిష్కారము లభించేంత వరకు రోజురోజుకూ ఉద్యమం తీవ్రమౌతుంది.'

ఆయన తీవ్రంగా అన్న ఈ మాటలు బిగ్గరగా వినిపించాయి. నాన్న అడ్డుపడి చేతులు జోడించి ఆయనను అభ్యర్థించాడు. 'కేదార నాథ్! అంత పెద్దగా మాట్లాడకండి దళంలో వాళ్ళందరూ నాకు శత్రువులే. మిమ్మల్ని గూఢచారులు వెంటాడుతూ వుండవచ్చు.'

'మాటలు కాదు.' నాన్న భయపడుతున్న ధోరణిని గమనించి అసంతృప్తితో నా హితుడు అన్నాడు· కంటోన్‌మెంటులో ప్రవేశించ డానికి ముందు గూఢచారిని తప్పించుకుని వచ్చాను..... కృష్ణను చూద్దామని వచ్చాను. వెళ్ళిపోతున్నాను. మీ కుటుంబానికి ఎలాంటి ఆపదా రాదని హామీ యిస్తున్నాను. స్వేచ్ఛావాయువులను పీల్చడానికి తగిన శక్తి కృష్ణ అప్రయత్నంగా సంతరించుకున్నాడు. అతడు యువకుడు కాబట్టి మీకంటికి రాక్షసుడిలా కనుపించవచ్చు. అతడు నా అగ్నిజ్వాల.'

కేదారనాథ్‌తో నాన్న అన్న మాటలు నన్ను మొహమాట పెట్టాయి. ముందు జాగ్రత్తా ధోరణిలో వెళుతున్న మా కుటుంబ పరిస్థితుల్లో ఏంచేయాలో నాకు తోచలేదు. ఆయన చెప్పిన రవీంద్రనాథ్ ఠాగూరు కవి గుర్తుకు వచ్చాడు. ఆయన కూడా ఆంగ్లప్రభుత్వాన్ని తిరస్కరిం చాడు. కవి కిశోరంగా ఆయన అడుగుజాడల ననుసరించి నేను కూడా అలానే చేస్తాను. కేదారనాథ్ ప్రశంసావాక్యాలు నా అహాన్ని రెచ్చ గొట్టాయి. ఆయన ప్రశంశకు నేను తగిన వాడినిగా నిరూపించుకోవాలని ప్రార్థించాను. దేశవాతావరణంలోని విషాలను జీర్ణించుకొని, శత్రువులను నిగ్రహించి ప్రజల బాధలను గురించి వారికి తెలియ జెప్పి వారిలోని స్థైర్యాన్ని పొగడాలని వుంది.

'నీవు మెట్రిక్యులో నెగ్గిన తర్వాత లాహోరుకు వచ్చి నన్ను చూడు' నా తలపై చేయపెట్టి ఆశీర్వదిస్తూ లాలాకేదారనాథ్ అన్నాడు. శ్రద్ధగా నాన్నకు చేతులు జోడించి మౌనంగా ఆయన సైకిలుకేసి నడిచారు.

అమరనాథ్ మాష్టారి ఈ సోదరుడు కపటంలేనివాడు. కానీ తన ఉన్మాదం వల్ల తప్పకుండా చెరసాలకు వెళతాడు. సైకిలుగంట దూరం కాగానే నేను యింట్లోంచి జారుకొని నా ప్రణయిని హెలెన్ దర్శన మౌతుందేమోనని చూశాను.

* * *

జిమ్మీ యింటి ముందుగా వెళ్ళాను. లోపలికి వెళ్ళటానికి సాహసించ లేదు. మళ్ళీ రెజిమెంటలు బజారు వైపు అడుగులు వేశాను. కిరసనాయిలు కోసం వెళ్ళి హెలెను తిరిగి వస్తుంటుందని ఎదురు చూశాను.

మా బారకాసులవైపు ఎండిన పొలాల మీద సూర్యాస్తమయ కాంతులు దిగజారుతున్నాయి. మంచుపొరల మధ్య పచ్చనిపొలాలు నా చూపుకు అందటం లేదు.

జీలం కంటోన్ మెంటు నుండి నా మార్గదర్శులలో చివరివాడు వెళ్ళి పోవడంతో నాతల దిమ్మెక్కింది. సుల్లీవాన్ ప్రోత్సాహం వున్నప్పటికీ నేను గాలిలోకి ఎగిరిపోదామనుకున్నాను. నాభావిష్యత్తును గూర్చి మానాన్న కంటున్న కలలకు మా కుటుంబానికీ సుదూరంగా వెళ్ళాలని వుంది. నేను తాత్కాలికంగా బయట పడ్డ గూడులోని శారీరక బాంధవ్యం నాగుండె గూడులోని ప్రతి కదలికలోనూ కనిపిస్తున్నాయి. 'నేను మోయలేనంత తల బరువుగా కనిపించే నిందలూ ఉద్బోధలూ అభిప్రాయాలూ అధిగమించి వెళ్ళడానికి మార్గం వుందా? లేక ఈ బాధ్యతల క్రిందపడి నలిగిపోయి ఆఖరకు చనిపోతానా?' అనే నా పాతకోరికలు నా ఆత్మలో తిరిగి మిదిలాయి.

నాలో హఠాత్తుగా కలిగిన మన భావాల శక్తితో శారీరకంగా గానీ, మానసికంగా గానీ ఎగురగల సామర్థ్యం రాలేదు.

ఒకసారి హెలెన్ కిరొసిన్ సీసా ఒక తుంటరి కుర్రవాని రాయి తగిలి పగిలిపోయింది. కిరొసిన్ నేలపాలైంది. ఏరుకోవడానికి ఆమెకు పగిలిన గాజు పెంకులు మాత్రం మిగిలాయి. నాకోరికలు నన్ను అలానే ముక్కలుముక్కలు చేసాయి. నేను నా కలలు ఛిన్నాభిన్నమయ్యాయి. స్వేచ్ఛా సౌమనస్యాలు నన్ను చిందరవందర చేశాయి. పగిలిన అద్దం ముక్కల్లా నిలిచి పోయాను. కవితాభావుకత్వంతో హెలెన్ను నేను సుకుమారంగా ఆరాధించాను.

నాలోని కొత్త కవిత్వ ప్రభావంవల్ల పిచ్చివాడినైనట్లు నాకనిపించింది. నాలోలోపలి దురవగాహమైన అగ్ని పర్వతజ్వాలలు, అస్పష్టత తొలగించడానికి నా గుండె గొంతుకలోంచి పాడాలనిపించింది. నా

స్వప్నాల పరిపూర్ణత నుండి బయటపడి విలాపగీతం ఆలపించాలని వుంది. నాన్న దృష్టిలో ప్రతిఒక్కడూ బి.ఎ.ఎల్.ఎల్.బి. కావాలి. కవి కావాలనుకున్న కోరిక మంచిది కాదు. తాశిల్దారుగానో, సహాయ కమీష నరుగానో పని చేయగలిగితే చాలు. అతిమానుష శక్తితో నాతో బాటు అందరినీ, అనంత విశ్వాసాన్నీ, స్వేచ్ఛా స్వాతంత్ర్యాల వైపు జాగృతం చేసి స్వయం కృషితో కూడిన పోరాటంతో ఉత్తేజపూరితమైన సంభా షణలు చేసి నేను దైవాన్ని కావాలను కున్నాను.

ఆంతరంగికంగా నేను కకావికలయ్యాను. నిబ్బరం కోలుపోయాను. మాట్లాడటానికి ఎవరూ లేరు. సాంప్రదాయిక పదజాలమూ, విసిగించే గీతాలూ, నామరూపాలు లేని అస్పష్టభావావేశాలతో కూడిన రాటు దేలిన మార్గాలమీదుగా మాత్రమే నేను నడవ గలను.

కళా విహీనమైన ఆ సాయంసమయపు క్లేశచ్ఛాయల మధ్య నేను నాలోని ఉన్మాదస్థితిని విదిలించుకోవడానికి పరుగెత్తి చిందులు తొక్కాను.

చిందర వందర భావాలు ఆడిపాడటానికి నన్ను పురి గొల్పు తున్నాయి. ఏదైనా గీతం వ్రాయాలని వుంది. సుల్లివాన్‌కు గీతం చూపించాలి. అస్పష్టమైన భయంకర ప్రతిరూపాలు నన్ను కలవర పెడుతున్నాయి. జ్ఞానోదయం గానీ, ఆద్యంతాలు గానీ కన్పించటం లేదు. నరకంలో దూతలు నావైపు గుడ్లప్పగించి చూడటం తప్ప మరేమీ కన్పించడం లేదు. అంతులేని ప్రశ్నలు చుట్టుముట్టాయి. ముందుకెళ్ళ లేకుండా వున్నాను.

ఇంతకు ముందువలె వున్నట్లుండి నాకు ఇప్పుడు తోచింది. ఉర్దూ పద్యాలలో ఛందోబద్ధమైన పాదం తర్వాత పాదం కలిగి వుండటం దోష భూయిష్టమని కవిత్వమంటే ఒక పదమో, రెండు పాదాలో కావచ్చు. ఇలా శ్రద్ధగా వ్రాస్తే నేనూ కవిని కావచ్చు. అప్పుడు నా స్వంత రచనలను సుల్లివాన్‌కు చూపించ వచ్చు.

నా అంతరాత్మపై అధిక భారాన్ని ఈ ఎరుక తొలగించింది. అలా జరుగుతుందని నేను అనుమానించ లేదు కూడా. నేను నూత్న కవిత్వాన్ని సృష్టించ గలను. నా ప్రణయ సౌరభ్యంతో కూడిన ఉచ్చారణ శక్తిని నేను సృష్టించిన విషయం గుర్తుకు వచ్చింది.

'హెలెన్! నా ముద్దబంతి పువ్వా!' అని చీకట్లో గుసగుసలాడాను.

ఆ పదాన్ని మాటిమాటికీ ఉచ్చరించటంవల్ల నాలో ఆనందమూ, వింతశక్తీ ఆవహించాయి.

'కృష్ణా! నీవు నాదైవానివైతే'..... అని హెలెన్ ఉచ్చరించిన పదాన్ని పునశ్చరణ చేశాను.

అప్పుడు రెండుపాదాల పద్యం ఆవిర్భవించింది.

'ఓ హెలెన్! నా ముద్దబంతి పువ్వా!

ఓ కృష్ణా! నా దైవమా!'

నాలోని కవిని క్షణకాలం దర్శించినట్లైంది. నా విశృంఖలమానస వీధిలో అస్పష్టమేఘాల పైకెగసి సృజనాత్మశక్తి అనే చోరుడు కనిపించాడు. క్షణకాలం నేను చదివిన గ్రీకు అద్భుత గాధలలోని 'నర్సిసస్'వలె నాకు నేను కనిపించాను. నాకు సిగ్గేసింది. కానీ నాప్రథమగీత రచన, నాకుద్దీపన కలిగించన ప్రతిరూపాలూ, భావాలూ, కాంతులను కలచి వేసింది. బీటలువారి దప్పిక గొన్న భూమి, సంకీర్ణమైన ప్రకృతి దృశ్యాలు, జలియన్ వాలాబాగ్‌లో మరణించిన వీరపుత్రులూ, మా వీధిలోని నా సహచరులూ, నాకు తెలియని వ్యక్తులూ, క్షితిజరేఖవద్ద ఎదురు చూస్తున్న మానవులందరూ ఏవో కొత్త పదాలు పోహాళించమని నన్ను అడుగుతున్నట్లుగా నా లోలోపల అనిపించింది.

అప్రయత్నంగా గొణిగాను

'ఓ చదువుల సరస్వతీ! విజ్ఞానమయీ! బ్రాహ్మణుల మంత్రోచ్ఛారణ ద్వారా వేదమంత్రాలూ పాతబడ్డాయి. సువాసనభరితమైన పవిత్ర అమృత సముద్ర జలాలతో నా ఆత్మ నిండిపోనీ!

'నా అంతస్సాక్షి కొలిమిలో కాలుతున్న నా అంతరాత్మను ఒక ఆకృతికి మలచడానికి దహించుకపోతాను.

'నీలి జలాల మీదుగా సూక్ష్మ ప్రపంచాలను దాటి విహంగంవలె ఎగిరి మాయింటి చెరసాల నుండి బయట పడనీ!

'నేను నాశనమయినప్పటికీ, ఆటంకాలు ఎదురయినా, వెఱ్ఱితనం

కలిగినా, నన్ను ప్రేమించనీ! శక్తి ప్రదాతలైన యువదేవతల విశాల నేత్రాల కనుగుడ్లను ముట్టుకోగలను. మాటలు చేతలరూపంలో ఆకారం దాల్చగలిగినట్లు, నేను అతి విప్లవకారుడను, అణచివేయబడ్డ వారిలో రగుల్కొంటున్న అగ్నులకు ప్రతిధ్వనినీ, మొరటుదారుల్లో నడిచేవాణ్ణి, నూత్న మార్గాన్వేషినైన దూతను, అగమ్య స్వాతంత్ర్యం కోసం పోరాడే వ్యక్తిగా, కేవలం వదరుబోతుతనంగాక లక్షోపలక్షల కార్యరూపాలు దాల్చాలని వుంది....

'ఓ దయామయీ! రుచికరముగాని గీతాలకు అతీతంగా భావాలను అర్థంచేసుకొన్న గాయకుడిలా, నాలోని చిందరవందర నూత్న కవితలకు నన్ను అంకితంగానీ! కేవలం వ్యాసంగానికి గాక, బాధా సర్ప దష్టుల గాథలు చెప్పడానికీ, ఆనందమయ ప్రపంచాన్ని తెలియ జెప్పడానికీ యత్నిస్తాను. నదీ ప్రవాహంలా పదగుంభనతో కేవల మాత్రాచ్ఛందస్సులోనే గాక అనితర సాధ్యంగా కవితలల్లుతాను....

'ఓ దయామయీ! స్వర్గంలోని దేవతల్లో నేను నమ్మే కొద్దివారిలో నీవొక దానివి....'

* * * * *